*Lectures on the Study of History* గ్రంథంలో *Goldwin Smith.* పరాయివారు ఎంతటి బుద్ధిశాలురైనా, ఎంత హితైషులైనా తమది కాని దేశపు చరిత్రకు పరిపూర్ణ న్యాయం ఎప్పటికీ చెయ్యలేరు. ఆ పరాయివారు పగవాళ్లు కూడా అయితే...? దౌర్జన్యంగా, దుర్మార్గంగా తాము ఆక్రమించిన దేశాన్ని చీకట్లోపల ఉంచి, నైతికంగా దిగజార్చి, మానసికంగా తమకు బానిసలను చేసుకునే దుర్బుద్ధితోనే... తమ దురాక్రమణ దురంతాన్ని సమర్థించుకుని, జాతీయ ప్రతిఘటనలకు తారుపూసి తిమ్మనిబమ్మిచేసే కుత్సితంతోనే సదరు చరిత్ర రచనను సాగించి ఉంటే...? అలాంటి చరిత్ర గ్రంథాలు ఎంత అష్టావక్రంగా తయారవుతాయో వేరే చెప్పాలా?

ఎన్ని యుగాల వెనక్కో వెళ్లక్కర్లేదు. ఆధునిక కాలంలోనే మొన్న మొన్న అమెరికా ఖండాన్ని ఆక్రమించిన యూరోపియన్లు అక్కడి రెడ్ ఇండియన్ ఆదివాసులను ఎంత క్రూరంగా వేటాడి ఒక జాతికి జాతినే ఊచకోతకోసి, దాని సంస్కృతిని నామరూపాలు లేకుండా ఎలా నిర్మూలించారో లోకానికి తెలిసిందే. కనీసం పాతికేళ్ల కిందటి వరకూ అమెరికన్ పిల్లలకు బోధించిన అమెరికా చరిత్ర ఏమిటి? మంచి మనసు క్రిస్టియన్లు యూరపు నుంచి సముద్రాలు దాటివచ్చి, ఆ గడ్డమీద ప్రశాంతంగా స్థిరపడి, దానిని బాగుచేసి నాగరిక దేశంగా అభివృద్ధి చేస్తూ తమ మానాన తాము బతుకుతూంటే... ఆటవికులు, అనాగరికులు అయిన రెడ్ ఇండియన్లు పరమ కిరాతకంగా వారిపై దాడికి దిగారనే కదా?

ఆఫ్రికా ఖండం గురించి తెల్లదొరలు రాసి పెట్టిన చరిత్రా ఈ బాపతుదే. ఐరోపా పుణ్యాత్ములు అనేక కష్టాలుపడి అడుగుపెట్టి, దయతలిచి నాగరికత నేర్పేంతవరకూ నల్లజాతివారు నీతీజాతిలేక జంతువుల్లా బతికారనే దొరలు చెబుతారు. బహు పురాతనమైన సంస్కృతి ఒకటి అంతకుముందు అక్కడ వర్ధిల్లిందనీ, నికృష్ట రాజ్యకాంక్షతో జాతి హత్యాకాండకు ఒడిగట్టి ఆ సంపన్న సంస్కృతినీ అమానుషంగా తామే కాలరాచివేశామనీ వారు ససేమిరా ఒప్పుకోరు. ఆసియాలోనూ అదే కథ. అదే దురాక్రమణ. ఇంచుమించు అంతే కిరాతకంగా జాతీయ సంస్కృతి, పురాతన వ్యవస్థల నిర్మూలన! అదే దుర్బుద్ధితో జాతీయ చరిత్రల వక్రీకరణ!

అనేక ఆసియా, ఆఫ్రికా దేశాల్లో జరిగినట్టే ఈ దురాగతాలన్నీ కొంచెం హెచ్చుతగ్గులతో భారతదేశంలోనూ జరిగాయి. పాశ్చాత్య దేశాల్లోని లిబరల్, లెఫ్టిస్టు మేధావులు అమెరికా, ఆఫ్రికా ఖండాల నేటివ్ జాతులకు, సంస్కృతులకు జరిగిన దారుణ అన్యాయాన్ని చక్కగా గుర్తించారు. ఆయా చారిత్రిక తప్పిదాలను సరిచేయటానికి ఆయా జాతులు పడుతున్న తపనకు సంఘీభావం తెలిపారు. చిత్రమేమిటంటే మనదేశంలో మాత్రం లిబరల్, లెఫ్టిస్ట్, సెక్యులర్ ఎట్సెట్రా భుజకీర్తులు తగిలించుకున్న మహామేధావులు మాత్రం ఇప్పటికీ వలసపాలకుల కళ్లతోనే దేశచరిత్రను చూస్తున్నారు. విస్సన్న చెప్పింది వేదం అన్నట్టు దొరలు రాసిందే చరిత్ర; దొరలు నేర్పిందే నాగరికత అని వారిలో చాలా మంది నేటికీ మూర్ఖంగా నమ్ముతున్నారు. దాస్యశృంఖలాలు తెంచుకున్న ఆఫ్రో ఆసియన్ దేశాలు వలసపాలకులు వక్రీకరించిన చరిత్రను జాతీయ దృక్పథంతో తిరగరాసుకున్నాయి. ఇండియాలో మాత్రం అటువంటి అవసరమేలేనట్టు, తెల్లవాడు తెచ్చి రుద్దిందే తిరుగులేని సత్యప్రమాణమైనట్టు మెకాలే మానసపుత్రులు నేటికీ



నమ్ముతున్నారు.

చైనాలో క్రీస్తుపూర్వం 3వ శతాబ్దినాటి చక్రవర్తి సమాధి బయటపడితే కమ్యూనిస్టులు సహా చైనీయులందరూ దానిగురించి గర్వంగా చెప్పుకున్నారు. ఇండియాలో ప్రాచీన సరస్వతి నది ఆనవాళ్లు, ఆ నదీ తీరాన విలసిల్లిన మహా సంస్కృతి అవశేషాలు ఎన్ని బయటపడ్డా మన దేశవాళీ మేధావులు ఆముదం తాగినట్టే మొహం పెడతారు. మాక్స్‌ముల్లర్‌లాంటి మాయావులు సృష్టించిన 'ఆర్యుల దండయాత్ర' అబద్ధవాదం ఏనాడో తుత్తునియలు అయింది. బయటి నుంచెక్కడో ఆర్యులు వచ్చారని చెప్పే కాలానికి అనేక వేల సంవత్సరాల పూర్వమే ఈ దేశంలో వేదనాగరికత దివ్యంగా వర్ధిల్లిందనడానికి ద్వారకలాంటి చోట్ల ప్రబల దృష్టాంతాలు సముద్రగర్భంలో బయల్పడ్డాక కూడా అర్థంపర్థంలేని ఆర్యదండయాత్ర సిద్ధాంతాన్ని వదిలిపెట్టి, జాతి ప్రాచీన చరిత్రను నిండుగర్వంతో తిరగరాసే పనికి శాస్త్రీయ దృష్టి గలవారమని చెప్పుకునే కుహనా మేధావులకు నేటికీ చేతులు రావటంలేదు. వేదాలు అపౌరుషేయమని నమ్మే సనాతనవాదుల ఛాందసత్వం కంటే – వారిని ఈసడించే మేధావుల్లో శతాబ్దాల కింద తెల్లవాళ్లు బనాయించిన కల్ల చరిత్రను అక్షరమ్ముక్క మార్చనవసరంలేదనే చాదస్తం చాలా రెట్లు ఎక్కువ.

తప్పుడు చరిత్రను భారతదేశం మీద తెల్లవాళ్లు రుద్దటానికి బలమైన కారణాలే ఉన్నాయి. మీది ప్రపంచానికి నాగరికత నేర్పిన అతి ప్రాచీన జాతి; మీ చరిత్ర, మీ సంస్కృతి, మీ వ్యవస్థ చాలా గొప్పవి – అని దురాక్రమణదారులే ఒప్పుకుంటే ఆక్రమిత దేశవాసులు 'చిత్తం ప్రభూ' అని కాళ్లదగ్గర పడిఉంటారా? అంతటి గొప్ప దేశాన్ని కాళ్లకింద తొక్కేసిన వారిపై ఆగ్రహించి, కోల్పోయిన స్వాతంత్ర్యాన్ని తిరిగి పొందేందుకు తెగువచూపి తిరగబడరా? మీది దిక్కూమొక్కూలేని సంకరజాతి; బయటి నుంచి వచ్చిన బలవంతులకు దాసోహమనటమే తప్ప మీకు మొదటి నుంచీ పౌరుషంలేదు; దాడి చేయవచ్చిన జాతుల కలగూరగంపే తప్ప మీది ఒక జాతే కాదు; మేము వచ్చి జ్ఞానభిక్ష పెట్టేదాకా మీరు అజ్ఞానాంధకారంలో, బ్రాహ్మణీకపు పీడనలో, పరస్పరం కలహించుకుంటూ అనాగరికంగా మిడుకుతున్నారు అని నూరిపోస్తూ పోతేనో...? ఆక్రమిత జాతి కొన్నాళ్లకు అదే నిజమని నమ్మి, ఆత్మగౌరవం, ఆత్మవిశ్వాసం పూర్తిగా కోల్పోయి బానిస మనస్తత్వాన్ని సంతరించుకుని కట్టుబానిసలా దొరల కాళ్ల దగ్గర పడిఉంటుంది కదా? ఇక్కడ ఎప్పుడూ బలవంతుడిదే రాజ్యమనీ, ఆది నుంచీ జరిగినవన్నీ దురాక్రమణలేననీ జనాన్ని నమ్మిస్తే తాజాగా తాము చేసిన దురాక్రమణ కూడా అదే చారిత్రక క్రమంలో అనివార్యంగా జరిగింది లెమ్మని ఎంచక్కా సమర్థించుకోవచ్చు గదా? మధ్యయుగంలో ఈ దేశాన్ని ఆక్రమించిన ముస్లింల నుంచి ఆధునికకాలంలో తాము రాజదండాన్ని అందుకున్నామని చెబితే అధికారపు మార్పిడి సవ్యంగా జరిగినట్టు అభిప్రాయం కలిగించి తమ అడ్డగోలు కబ్జాకు కృత్రిమ క్రమబద్ధతను సంతరించుకొనవచ్చు గదా?

ఇదిగో – ఇలాంటి అవసరాలు అనేకం ఉన్నాయి కాబట్టే ఇస్లామిక్ దండయాత్రలకు ఈ దేశంలో ఎన్నడూ లేని ప్రజాసమ్మతిని ఆదినుంచీ ఉన్నట్టుగా చూపించి, ముస్లిం పాలకులను మహాసామ్రాజ్య నిర్మాతలుగా కీర్తించి, జాతి జీవనంపై ఇస్లామిక్ సంస్కృతి

ప్రభావాన్ని అతిగా ఉత్ప్రేక్షించి తెల్లవారు శాయశక్తులా జాతిని బ్రెయిన్‌వాష్ చేశారు. అఖిల భారతదేశానికి మొగల్ పాదుషాయే సర్వం సహాధికారంగల ఏకైక హక్కుదారు అయినట్టూ, అతడి నుంచే సార్వభౌమాధికారం తమకు చట్టబద్ధంగా సంక్రమించినట్టూ భ్రమగొలపటానికి బ్రిటిష్‌వారు చాలా ప్రయాసపడ్డారు. ఆ పాదుషా (షా ఆలం) అధికార పరిధి అతడు నివసించే భవనానికి మాత్రమే పరిమితమైంది. డబ్బెక్కడ దాచిందీ చెప్పనందుకు ఆగ్రహించి తన నౌకరొకడు తనను నేలమీదపడేసి గుండెలమీద కూచుని రెండుకళ్లూ పీకేస్తున్నా అడ్డుకునే దిక్కులేక వలవల ఏడ్చిన నిర్భాగ్యుడతడు. అంతకు ముందు ఇంగ్లీషువారు తనను ఇంచుమించుగా బందీనిచేస్తే ఎలాగో తప్పించుకుని మరాఠాలను శరణువేడి వారి అండపై ఆధారపడి వారిచ్చే పోషణ ఖర్చులతో బతుకు వెళ్లదీస్తున్న నిస్సహాయుడతడు. అతడి పేరిట వాస్తవాధికారం చలాయిస్తున్నది మరాఠాలు.

శతాబ్దానికి పైగా దేశ రాజకీయగతిని శాసిస్తున్న మరాఠా సామ్రాజ్యానికి అసలు అస్తిత్వమే లేనట్టూ, అంతఃకలహాలతో, అసమర్థ పాలనతో నానాగత్తరగా ఉన్న అనేకానేక దేశీయ రాజ్యాల్లో మహారాష్ట్రులది కూడా ఒకటైనట్టూ... అద్భుత పరాక్రమంతోనే, అద్వితీయ ప్రజ్ఞాపాటవాలతోనే ఆ రాజ్యాలన్నిటినీ - అదీ వాటి కోరికమీదే - దయార్ద్ర దృష్టితో తాము వశం చేసుకున్నట్టూ తెల్లవారు కల్లబొల్లి ప్రచారం చేసుకున్నారు. కన్నపు దొంగలకు, బందిపోట్లకు ఏమాత్రం తీసిపోని తమ నేరాలు, దురాగతాలు లోకానికి తెలియకుండా కప్పిపుచ్చుకోవటానికి ఈ అభూతకల్పనలు వారికి అవసరమై ఉండొచ్చు. ఎటువంటి మోసాలు, ఎలాంటి నమ్మక ద్రోహాలు, ఎంతటి ఘోరాలు చేసి భారతదేశాన్ని దురాక్రమణ చేసిందీ బయటపడితే స్వదేశంలో తమ ప్రజలే తమ మొగాన పేడనీళ్లు కొడతారన్న భయంతోటే 'కంపెనీ' మాయావులు ఈ అసత్య ప్రచారాలకు ఒడిగట్టి ఉండొచ్చు. వాస్తవాలన్నీ పూర్తిగా తేట పడకనో... అందరినీ తెలివిగా వంచించి తెల్లవారు చేసింది ఎంత దారుణమో అర్థమయ్యేసరికే దేశం పరాధీనమై విదేశీయుల ఉక్కుపాదం కింద నలిగి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు హరించుకు పోయినందువల్లో... విదేశీ పాలకులల్లిన అబద్ధాల చరిత్రను చెత్తకుండీలో పారవేసేందుకు సావకాశం లేకనో... పరాయి పాలనకింద ఉన్నంతకాలమూ భారతీయులు నిస్సహాయంగా ఉండిపోయారంటే అర్థం చేసుకోవచ్చు. కాని దాస్యపు సంకెళ్లు తెగి సర్వసత్తాక సార్వభౌమాధికారం తిరిగి తమ చేతికి వచ్చిన తరవాత కూడా విదేశీ పాలకులు బనాయించిన జాతి వ్యతిరేక చరిత్రే నేటికీ పరమ ప్రమాణికంగా చలామణీ అవుతున్నదంటే మన విజ్ఞతను, మన వివేకాన్ని ఏమనాలి?

తన గతమే తనకు సరిగా తెలియని జాతికి వర్తమానమూ అర్థంకాదు. ఆగతమూ అయోమయపు తంతే. బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా జాతీయ పోరాటం నడిచినంతకాలమూ జాతికి జరిగిన అన్యాయాలకు, అపచారాలకు దేశభక్తుల గుండెలు మండాయి. తమ దృక్కోణం నుంచి విదేశీ పాలకులు రాసిపెట్టిన చరిత్రను జాతీయ దృక్కోణం నుంచి తిరగరాయవలసిన ఆవసరాన్ని జాతీయ నాయకులు పదేపదే నొక్కి చెప్పేవారు. అదే ప్రకారం పరదాస్యపు పీడ తొలిగీ తొలగగానే స్వతంత్రజాతి జాగుసేయక చరిత్ర దిద్దుబాటుకు ఉపక్రమించవలసింది.



కాని - ఆశ్చర్యం! అధికారం చేతికందగానే జాతీయ నాయకత్వాన్ని నమ్మశక్యంకాని అలసత్వం ఆవహించింది. పాలకస్థానాల్లో కూచోగానే మన నేతలకు పాలకుల మనస్తత్వం ఒంటబట్టింది. గుమాస్తాలను తయారుచేసేందుకు తెల్లవారు తెచ్చిపెట్టిన విద్యావిధానాన్ని మౌలికంగా సంస్కరించి తీరుతామన్న వాగ్దానం గాలికి పోయినట్టే... దేశాన్ని అణచేందుకు విదేశీయులు చేసిన చట్టాలను సత్వరం మార్చి స్వతంత్ర జాతి అవసరాలకు తగ్గట్టు శాసనాలను ఆధునీకరిస్తామన్న హామీ గంగలో కలిసి 19వ శతాబ్దపు పీనల్‌కోడ్లూ, ప్రొసిజర్ కోడ్లూ, సాక్ష్యపు చట్టాలూ 21వ శతాబ్దంలో కూడా దర్జాగా అమలవుతున్నట్టే... జాతీయ చరిత్ర తిరగరాత ఆశయమూ స్వాతంత్ర్యం వచ్చి అర్ధశతాబ్దం దాటాక కూడా ఆకాశకుసుమంగానే మిగిలింది.

జాతీయ వీరులను దారిదొంగలుగా, చిల్లర తిరుగుబాటుదారులుగా చిత్రించి, జాతి శత్రువులనేమో మహనీయ మహాపురుషులుగా కీర్తించి... గర్వించదగ్గ జాతీయ వారసత్వాన్ని సిగ్గుపడవలసిన చీకటికూపంగా చిత్రించి... విదేశీ రాబందుల పాపాలను జాతికి పుణ్యఫలాలుగా చూపెట్టి... జాతీయతను కుళ్లబొడిచే తప్పుడు రాతలే, తప్పుడు భావాలే మన గతం గురించి మనకున్న అభిప్రాయాలను నేటికీ నిరాఘాటంగా ప్రభావితం చేస్తున్నాయి. బూటకపు ప్రచారాల నుంచి బయటపడి యథార్థమేమిటో తేటపడాలన్న తహతహ శతాబ్దాలు గడిచిపోయిన తరవాత కూడా తీరని కోరికగానే మిగిలింది.

యుద్ధాలు, రాజ్యవిస్తరణలు తగదని బ్రిటిష్ పార్లమెంటే చేసిన చట్టాలను తుంగలో తొక్కి, బ్రిటిషు ప్రజల కళ్లుగప్పి బ్రిటిషు పాలకవర్గం ఈస్టిండియా కంపెనీ ద్వారా ఏఏ పాపాలు చేయించి, దేశీయ రాజులను నిలువునా వంచించి భారతదేశాన్ని దశలవారీగా ఎలా ఆక్రమించగలిగిందన్న వాస్తవాలు ప్రామాణిక చరిత్ర గ్రంథాల కెక్కకుండా నేటికీ మరుగున పడే ఉన్నాయి. అర్ధసత్యాలు, అసత్యాలే తిరుగులేని చారిత్రక సత్యాలుగా బోరవిరుచుకుని తిరుగుతున్నాయి. ఎందుకని? సరిదిద్దడానికి సరైన ఆధారాలు దొరకకనా? డాక్యుమెంటరీ రుజువులు, సాక్ష్యాలు మిగలకనా? కాదు. నిర్దిష్టమైన చారిత్రిక నిదర్శనాలు లేకేమి? కావలసినన్ని. ఆ కాలంలో ఈస్టిండియా కంపెనీ అధికారులు రాసిపెట్టిన రికార్డులలో, వారి పరస్పర ఉత్తర ప్రత్యుత్తరాలలో, అప్పటి దేశీయ రాజుల ఆస్థానాలలో అవసరమైన దానికంటే వెయ్యింతలు ఎక్కువ ఆధారాలే దొరుకుతాయి. ఎటొచ్చీ వాటిని కీగంటచూసి, అవసరానికి ఉపయోగించుకునే ఓపిక, తీరిక, కోరికలే కర్మసన్యాసులమైన మనకు కొరవడ్డాయి.

దేశానికి స్వాతంత్ర్యం రావడానికి చాలా ఏళ్ల పూర్వం విఖ్యాత మరాఠా చరిత్రకారుడు జి.ఎస్.సర్దేశాయ్ ఇలా అన్నాడు:

*There are heaps of Persian papers allover northern India scattered through many important towns, institutions, and individual families, and many more could be found if a search were made from place to place by a band of workers like those of Maharashtra. If these Persian papers are arranged and published, they will supply a fresh life-story of the northern*

*races and their doings, and supplement or correct what the sources in Marathi, English and other languages have already yielded... Careful investigation will tell us many new things which have been unknown before... we meet with very many personalities in northern India, whom our accepted history condemns.. How is it that all wisdom seems suddenly to have departed from this country to the West? May we not suspect that thier careers have not been examined from our own records and from the Indian point of view? Shall we judge and condemn them without going into all the evidence?*

*[The Main Currents of Maratha History,* **G.S.Sardesai,** *p.54, 226-27]*

*(ఉత్తరభారతదేశమంతటా అనేక ముఖ్య పట్టణాల్లో, సంస్థల్లోనూ, కొన్ని కుటుంబాల దగ్గరా కుప్పల కొద్దీ పర్షియన్ పత్రాలు చెల్లాచెదురుగా పడిఉన్నాయి. మహారాష్ట్రలో వలె కార్యకర్తలు కలిసికట్టుగా వెదికితే ఇంకా ఎన్నో బయటపడతాయి. ఈ పత్రాలను క్రమపద్ధతిన వింగడించి ప్రచురిస్తే ఉత్తరాది జాతులు, వాటి కార్యకలాపాల గురించి వినూత్న జీవితకథను ఆవిష్కరించగలవు. ఇంగ్లీషు, మరాఠీ తదితర భాషల్లో చరిత్రవేత్తల ద్వారా ఇప్పటికే తెలియవచ్చిన దానిని సవరించటమో, అదనంగా జోడించటమో వీటివల్ల వీలవుతుంది... జాగ్రత్తగా పరిశోధిస్తే మనకు ఇంతకుముందు తెలియని అనేక కొత్త విషయాలు ఎరుకపడతాయి... మనం అంగీకరిస్తున్న చరిత్ర ఖండితంగా తెగనాడిన ఎందరో ప్రముఖులు ఈ పత్రాల్లో మనకు కానవస్తారు. దేశస్వాతంత్ర్యాన్ని కాపాడటంలో వీరంతా హఠాత్తుగా శక్తిహీనులు ఎలా అయ్యారు? విజ్ఞత, వివేకం యావత్తూ ఆకస్మికంగా ఈ దేశం నుంచి నిష్క్రమించి పాశ్చాత్యుల మొగానే తిష్ఠవేశాయా? మన సొంత రికార్డుల నుంచి, భారతీయ దృక్కోణం నుంచి ఆయా వ్యక్తుల చరిత్రలను పరీక్ష చేయడం జరగలేదని శంకించవద్దా? మొత్తం సాక్ష్యాధారాలన్నీ పరిశీలించకుండానే వారిపై తీర్పు చెప్పి దోషులుగా ముద్ర వేయటం భావ్యమా?)*

జీవితకాలమంతా మరాఠా చరిత్ర పరిశోధనకు వెచ్చించి, వక్రీకరణల సవరణకు ఇంకా ఎంతో జరగవలసి ఉన్నదని పరితపించిన సర్దేశాయి ఈ మాటలని 72 ఏళ్లు గడిచాయి. దేశానికి స్వతంత్రం వచ్చాక ఈ బృహత్ కార్యనిర్వహణ ఇంకా త్వరితమై జాతీయచరిత్ర జాతిచేతుల్లో యథార్థరూపం సంతరించుకొనగలదని ఆయన తరం పెట్టుకున్న ఆశలు ఈడేరాయో, వమ్మయ్యాయో మన అంతరాత్మలకు తెలుసు. అబద్ధపు రాతల, కల్లబొల్లి బొంకుల ఆధారంగా శ్వేతజాతి అహంకారానికి తెలియని తనాన్ని జోడించి పక్షపాతాన్ని రంగరించి తెల్లదొరలు కిందటి శతాబ్దం మొదట్లో రాసిపెట్టిన ఆక్స్‌ఫర్డ్ హిస్టరీ, కేంబ్రిడ్జి హిస్టరీ ఆఫ్ ఇండియాలనే సుమారుగా అటూ ఇటూ మార్చి అరకొర సవరింపులుచేసి, తిరగమోతలు వేసి, అదే మూసలో పుంఖానుపుంఖంగా ఉత్పత్తి చేసినవే ఆధునిక భారతీయ చరిత్ర గ్రంథాల కింద చలామణీ అవుతున్నాయి. భారతచరిత్ర పరిశోధనకు డాబుసరి కౌన్సిళ్లు, పేరుగొప్ప సంస్థలు ఎన్ని - ఎన్ని





దశాబ్దాలుగా పనిచేస్తున్నా, దేశంలో వందల సంఖ్యలో పుట్టుకొచ్చిన యూనివర్శిటీలు ఇప్పటికి కొన్ని వందల కోట్లు హిస్టరీ డిపార్టుమెంట్ల మీద ఖర్చుపెట్టి... పనికి మాలిన రిసెర్చిలెన్నో చేయించి కొన్ని వేలమందికి పిహెచ్‌డిలిచ్చి లోకం మీదికి వదిలినా... ఈ మధ్యకాలంలో ఎన్ని ప్రభుత్వాలు మారినా, చరిత్ర తిరగరాతలపేర, పాఠ్యగ్రంథాల సవరణలమీద ఎన్ని వ్యర్థ వివాదాలు రేకెత్తినా, ఎన్ని విఫలయత్నాలు జరిగినా అసలు పని మాత్రం మిగిలే ఉంది.

ఇస్లామిక్ ప్రభువుల, బ్రిటిష్ పాలకుల పాపాలను మన మహాత్ములు పెద్ద మనసుతో క్షమించి... పాత సంగతులు మరచిపోయి అంతా కలిసి అన్నదమ్ముల్లా ఈ కాలపు అవసరాలను ఆలోచించటమే కర్తవ్యమని ఉదాత్తంగా చేసిన ఉద్బోధను బతకనేర్చిన మనం మరొకలా అర్థం చేసుకున్నాం. పాతచరిత్రలను జయప్రదంగా పాతిపెట్టి అదే మన ఆధునికతకు, అభ్యుదయ శీలానికి గురుతుగా భుజాలు ఎగరేస్తున్నాం. విదేశీయుల కళ్లతో దేశచరిత్రను చూస్తూ... గర్వపడవలసిన దానికి సిగ్గుపడుతూ... సిగ్గుపడవలసిన దానికి గర్వపడుతూ... రాజకీయ బానిసత్వం వదిలినా మానసిక బానిసత్వాన్ని నిష్ఠగా నిలుపుకుంటూ... మన జాతీయ మూలాలను మనచేతులతోనే నరుక్కుంటూ... అభినవగిరీశాల్లా అసమర్థ జీవయాత్ర సాగిస్తున్నాం.

తలచుకుంటే ప్రపంచాన్నే జయించగల భారత జాతికి శతాబ్దాల పర్యంతం బానిసత్వ దుర్గతి ఎందుకు పట్టింది? పరాక్రమం ఉండీ విదేశీ దురాక్రమణదారుల చేతుల్లో ఎందువల్ల ఘోర పరాజయాల, పరాభవాల పాలయింది? దేశభక్తి, జాతీయ భావం కలవనుకునే ప్రతి భారతీయుడూ సావధానంగా ఆలోచించి, సమాధానం కనుగొన వలసిన ప్రశ్నలివి. విదేశీయులు మనల్ని వంచించి, నమ్మక ద్రోహాలు చేసి, అనేక నేరాలకు, ఘోరాలకు పాల్పడి దేశాన్ని ఆక్రమించిన సంగతి యథార్థమే. కాని వారు తెగబడి అన్ని దుర్మార్గాలను సాగిస్తున్న సమయంలో మన తెలివితేటలు ఏమయ్యాయి? ముంచుకొస్తున్న ప్రమాదాన్ని గుర్తించి సకాలంలో ఎందుకు అడ్డుకోలేకపోయాము? దేశ భద్రత, ప్రాదేశిక సమగ్రతల విషయంలో అలసత్వం ఎంత అనర్థకరమో వందల సంవత్సరాల చరిత్రలో పదే పదే రుజువైనా, గతానుభవాల నుంచి గుణపాఠాలు ఎందుకు నేర్వలేకపోతున్నాం?

మొగల్ సామ్రాజ్యం ఔరంగజేబు మరణానంతరం కుప్పకూలి నామమాత్రావశిష్టమైనది లగాయతు బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీవారు దశల వారీగా దేశాన్ని హస్తగతం చేసుకునే లోపు నూరేళ్లకు పైగా గడిచాయి కదా? ఇస్లామిక్ పెత్తనంలో తరతరాలుగా యమయాతనలకు గురి అయిన జాతీయ శక్తులు విజృంభించి, పరస్పర సహకారంతో స్థిరమైన జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పరచి, ఇంకెన్నడూ దేశం విదేశీయుల బారిన పడకుండా గట్టి కట్టుదిట్టాలు చేయడానికి అదే అదనుకదా? అందివచ్చిన అవకాశాన్ని మనం ఏ బలహీనతలవల్ల జారవిడుచుకున్నాం? అఖిల భారత స్థాయిలో మహాసామ్రాజ్యాన్ని ఏర్పరచిన మరాఠాలు శౌర్య పరాక్రమాలు ఉండీ... శివాజీ స్వరాజ్యాన్ని దేశమంతటికీ విస్తరించి సమాఖ్య తరహాలో దేశాన్ని స్వతంత్రంగా ఏలగల సామర్థ్యం కలిగీ - మొగలాయిల తాబేదారుల స్థాయికే తమను తాము ఎందుకు పరిమితం చేసుకున్నారు? విశాల రాజ్యాలనైతే అవలీలగా జయించినా, తమ

సామ్రాజ్యానికి క్రమబద్ధత, సుస్థిరత ఏర్పరచలేక, గెలుచుకున్న ప్రాంతాల ప్రజల సుహృద్భావాన్నీ చూరగొనలేక మరాఠాలు చివరికి అభాసుపాలయ్యారెందుకుని? గజనీ మహమ్మదు వలె ఇంగ్లీషువారు రాత్రికి రాత్రి మిడతల దండులా దేశం మీద విరుచుకుపడలేదు గదా? వారి స్వభావాన్ని, వ్యవహార శైలిని, వారి బలాలను, బలహీనతలను నింపాదిగా గమనించడానికి కొన్ని వందల సంవత్సరాల వ్యవధి ఉన్నప్పటికీ వారి బెడదను సరిగా అంచనా వేయలేక... నమ్మిన వారిని ముంచుతారని తెలిసీ మళ్లీ మళ్లీ వారినే నమ్మి... నికృష్ట స్వార్థంకోసం, ప్రత్యర్థులను సాధించటం కోసం వారితోనే చేతులు కలిపి... జాతీయశక్తులను చేతులారా దెబ్బతీసి... చివరికి నెత్తికి చేతులు తెచ్చుకున్న మన మారాజుల స్వయంకృతాపరాధాలకు ఒకరిని నిందించి ప్రయోజనమేమిటి? శక్తి సామర్థ్యాలు ఉండి కూడా దీక్ష, దక్షత లేక... దేశ ప్రయోజనాల విషయంలో రాజీపడకూడదన్న జాతీయ దృష్టి, జాతీయ సమైక్యత కొరవడి... మరాఠాలుగాని, మరొకరు గాని ఎన్నెన్ని స్వర్ణావకాశాలు జారవిడుచుకున్నారు?

మనకు పరాక్రమం ఉంది. దాని వెనకే పలాయన మనస్తత్వమూ ఉంది. ఆవలించకుండానే అవతలివాడి పేగులు లెక్కపెట్టగల కుశాగ్రబుద్ధి ఉంది. దాని వెంటే నమ్మదగని వారిని నమ్మి అమాయకంగా మోసపోయే అతిమంచితనమూ ఉంది. పట్టుబడితే లోకాలను పిండిచేయగలం. కాని పట్టుపట్టం. అంతా కలిస్తే అద్భుతాలను సాధించగలం. కాని కలవం. సాధించం. ఆదినుంచీ అనైక్యత మనకు శాపం. అతి తెలివి మన అవలక్షణం. ఈ దృష్టితో మన చరిత్రను అధ్యయనం చేస్తే మనకు మనమే కొత్త రీతిలో అర్థమవుతాం. ఈ కాలంలో మనం చూస్తున్న దౌర్బల్యాలు, ఇప్పుడు మనల్ని కుంగదీస్తున్న జాతీయ బలహీనతలు చరిత్ర పథంలో చిరకాలంగా ఉన్నవేననీ, చేసిన తప్పులే మళ్లీ చేస్తున్నామనీ, వేసిన తప్పటడుగులే మళ్లీ మళ్లీ వేస్తున్నామనీ అర్థం చేసుకుని ఆశ్చర్యపోతాం. అసలు లోపం బోధపడితే దాన్ని సరిచేసుకోవటం తేలిక. తనను తాను తెలుసుకుని భారత జాతి పిడికిలి బిగించగలిగితే చిరకాలంగా మన మెదళ్లను మొద్దుబరచిన భావదాస్యపు తుప్పు వదిలినట్టే. సిసలైన జాతీయత చిగురించి, అసలైన స్వాతంత్ర్యం సిద్ధించి, వలసపాలన నుంచి విముక్తమైన స్వతంత్ర జాతులకు తలమానికంగా ప్రపంచంలో మనజాతి నిండుగర్వంతో తల ఎత్తుకు తిరిగినట్టే. అటువంటి మంచిరోజు ఎప్పటికైనా వచ్చి తీరుతుందన్న నమ్మికే ఈ గ్రంథ రచనకు ప్రేరణ.

ఆదికాలం నుంచి మొదలుపెట్టి మొగల్ సామ్రాజ్య పతనం దాకా భారతచరిత్రలో చోటుచేసుకున్న దారుణ వక్రీకరణలను విహంగవీక్షణం చేసిన 'ఏది చరిత్ర'కు పాఠకలోకం నుంచి ఊహించని ఆదరణ లభించింది. అంతకుముందు 'కాశ్మీర్‌కథ'లాగే ఆ గ్రంథం కూడా అచ్చయిన కొద్దినెలలకే వేల కాపీలు అమ్ముడయి, తెలుగునాట చిన్నపాటి సంచలనం సృష్టించింది. అంతటితో ముగించకుండా ఈ రచనా వ్యాసంగాన్ని కొనసాగించి బ్రిటిష్ కాలపు చరిత్రను కూడా చర్చించమని పాఠకమిత్రులు, వ్యక్తిగత స్నేహితులు చాలా మంది కోరారు. చరిత్ర అధ్యయనానికి కావలసిన తీరుబడి, వనరులు, శిక్షణ లేకపోయినా... దినపత్రిక సంపాదకుడిగా రోజువారి బాధ్యతలను నిర్వర్తిస్తూనే ఈ పనిని కొనసాగించటం కొంచెం కష్టమైనా... మిత్రుల తోడ్పాటువల్ల, సహచరుల



సహకారంవల్ల, పెద్దల దీవెనవల్ల, అన్నిటికీ మించి దేవుడి దయవల్ల మొత్తానికి సాఫీగానే సాగింది. ఎప్పుడో చదువుకున్నది, ఎక్కడో నేర్చింది ఇప్పుడు కాగితం మీద పెట్టటం కాకుండా... ఏ గ్రంథాలు చదవాలో తెలుసుకునేందుకు ప్రయత్నిస్తూ, ఆ గ్రంథాలను సంపాదించటానికి బహుప్రయత్నాలు చేస్తూ, దొరికినవి దొరికినట్టు చదువుతూ, చదివిన దానిని అర్థం చేసుకుని ఆయా అంశాల ఆధారంగా ఒక దారం దొరికించుకుని, విరుద్ధాంశాలను సమన్వయం పరిచేందుకు ప్రయత్నిస్తూ... రాసింది రాసినట్టుగా ఏ వారానికావారం ఆంధ్రభూమి ఆదివారం అనుబంధంలో ప్రచురిస్తూ... ఒక భాగాన్ని ముగించాక తరువాయి భాగం విషయ సేకరణకు ఉపక్రమిస్తూ పోవడంవల్ల నా వరకు ఇది కంటిన్యుయస్ ఎడ్యుకేషన్. ఇంతకుముందు తెలియని అనేక విషయాలను ఈ పనివల్ల తెలుసుకోగలిగానని నాకు తృప్తి. పైన పేర్కొన్న పరిమితులన్నిటి ప్రభావమూ ఇందులోని అంశాల సమగ్రత, నిర్దుష్టతల మీద సహజంగానే ఉంటుంది. ఇది నాకున్న కొద్ది బుద్ధితో జాతిచరిత్రను అర్థం చేసుకుని, అర్థమైందనుకున్నది నావంటి సామాన్యులతో మామూలు జనం భాషలో పంచుకునే చిరుయత్నమే తప్ప ఇదొక చరిత్ర పరిశోధన గ్రంథమన్న భ్రమ నాకులేదు. చరిత్ర లోతు తెలిసిన పెద్దల పరిశీలనలో ఇది ఎంతవరకు నిలుస్తుందో తెలియదు. చరిత్ర అనేది విద్యార్థులకు, హిస్టరీ మాస్టర్లకు, హిస్టరీ డిపార్ట్‌మెంట్లకు, సబ్జెక్ట్ ఎక్స్‌పర్టులకు పరిమితమైన ఎకడమిక్ విషయంకాదు. సమకాలిక స్థితిగతులను అర్థంచేసుకుని, రకరకాల వైకల్యాలకు, వైఫల్యాలకు కారణాలను కనుగొని, ప్రస్తుత దౌర్బల్యాలను దాటి భావికి బాటవేయాలంటే పూర్వచరిత్ర కొంతయినా తెలియాలి. మూలాల అవగాహన లేకపోతే వర్తమాన సమస్య ఏదీ అంతుబట్టదు. జనసామాన్యానికి చారిత్రక స్పృహను కలిగించటంలో పండితప్రకాండుల ప్రామాణిక గ్రంథాలతోబాటు ఇటువంటి రచనల అవసరమూ ఎంతో కొంత ఉందనుకుంటాను.

ఔరంగజేబు మరణానంతరం మరాఠా రాజ్యప్రాభవంతో మొదలుపెట్టి మరాఠా సామ్రాజ్యపతనంతో దేశం బ్రిటిషు వారికి పూర్తిగా వశమయ్యేదాకా నూరేళ్ల పైచిలుకు దేశచరిత్రను ఇందులో సింహావలోకనం చేశాను. వెల్లస్లీ మొదలుపెట్టిన పనిని డల్‌హౌసీ పూర్తిచేసిన విధాన్ని... ఇండియాలో ఆంగ్ల సామ్రాజ్య స్థాపనలో ఆ దరిమిలా జరిగిన దగాలు, దౌర్జన్యాలు జాతి జనులకు ఒళ్లు మండించి 1857 ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామానికి దారితీసిన వైనాన్ని... 1857 నుంచి సుభాష్‌చంద్రబోసు వరకూ నడిచిన అసలైన స్వాతంత్ర్య సంగ్రామాలను... మనం జాతీయోద్యమమనుకునే దానిలోని దౌర్బల్యాలు, పెడధోరణులు, దుష్ప్రభావాలు కడకు దేశాన్నే ముక్కలు చేసిన తీరును కూడా మునుముందు చర్చించాలని ఉంది. అదీ ఎంతవరకు సాధ్యపడుతుందో తెలియదు.

మొదటినుంచీ నా రచనలను అభిమానించి, ఉత్సాహపరుస్తున్న పాఠక మహాశయులకు ధన్యవాదాలు. ఈ గ్రంథ రచనలో ముఖ్యంగా అరుదైన పుస్తకాలు సంపాదించడంలో పుస్తక ప్రచురణలో తోడ్పడ్డ మిత్రులందరికీ కృతజ్ఞుడిని.

హైదరాబాద్ ఎం.వి.ఆర్.శాస్త్రి

**20 ఏప్రిల్ 2005**

## రచయిత గురించి...

పుట్టింది: 22 ఏప్రిల్ 1952, కృష్ణాజిల్లా, జగ్గయ్యపేటలో.

1975లో 'ఆంధ్రజ్యోతి' మొఫిసిల్ విలేకరిగా జర్నలిస్టు జీవితం ప్రారంభించి స్వయంకృషితో అట్టడుగు స్థాయి నుంచి ఎదిగారు.

1978 నుంచి 1990 వరకూ 'ఈనాడు'లో అసిస్టెంట్ ఎడిటర్ స్థాయి వరకు వివిధ హోదాల్లో పనిచేసి 'ఆంధ్రప్రభ' దినపత్రికకు డిప్యూటీ ఎడిటరుగా వెళ్లారు.

అక్కడ నాలుగేళ్ళు ఉన్నాక 1994 డిసెంబరు నుంచి 'ఆంధ్రభూమి' దినపత్రిక సంపాదకులుగా పనిచేస్తున్నారు.

పదమూడేళ్ళుగా **'ఉన్నమాట'**, పదేళ్ళుగా **'వీక్‌పాయింట్'** శీర్షికలను నిర్వహిస్తున్నారు.

మూడు దశాబ్దాల పత్రికా వ్యాసంగంలో వందలాది సంపాదకీయాలు, ప్రత్యేక వ్యాసాలు రాశారు.

వెలువడిన పుస్తకాలు: **మన చదువులు, కాశ్మీర్ కథ, ఉన్నమాట, ఏది చరిత్ర?**

# ఇదీ వరస

# ఇదీ చరిత్ర

# జాతీయతకు తొలిపొద్దు

*ఆధునిక భారతీయతకు ఆద్యులెవరు?*

*మనజాతికి మూల పురుషులెవరు?*

*అఖిల భారత దృష్టితో ఆలోచించడం, జాతీయతాభావం మనకి ముందు నుంచీ ఉన్నాయా? లేక - ఇంగ్లీషువారు నేర్పారా?*

*ఆధునిక భారత జాతీయత అనేది యుగయుగాలుగా, అనేక శతాబ్దాలుగా మన పూర్వులు, మన వీరులు విదేశీ ఆక్రమణదారులపై సాగించిన మహత్తర పోరాటాల ఫలితమా? లేక - బ్రిటిష్ పాలకుల ప్రసాదమా? మనదంతా ఒక్కటే జాతి అన్న ఆత్మీయభావం కలిగించినందుకు మనం నమస్కరించవలసింది విజాతీయులకా? మన పూర్వీకులకా?*

ఇంకో దేశం వారు కనుక ఈ ప్రశ్నలను వింటే ఫక్కున నవ్వుతారు! ఈ విషయంలో అసలు డౌటెందుకుండాలి? మీ జాతిని మీరు కాక- వేరే జాతి వాడెవడో వేరే దేశం నుంచి వచ్చి నిర్మిస్తాడా - అని ఎకసెక్కమాడతారు. నిజమే! మూలాలకు సంబంధించిన ఇటువంటి ప్రాథమిక అంశాలపై అస్పష్టతకు అసలు ఆస్కారమే ఉండకూడదు. దౌర్భాగ్యమేమిటంటే - ఈ ప్రాథమిక విషయాలపైనే దేశంలో ఈనాటికీ ఏకాభిప్రాయం లేదు.

"India never existed as India at all until we went there. It was a conglomeration of fighting states, where Mahomedans were cutting the throats of Hindus; and everything that is worth having in India has been derived from English rule... All the happiness and greatness of India depends upon England... India would never have existed but for England. India was never a united country until she came under our rule. If left to herself

[**Lord Wolsley**, ***Quoted in Rise of Christian power in India, p. 9***]

(మనం అక్కడికి వెళ్ళేంతవరకు ఇండియా ఇండియాగాలేదు. అది పరస్పరం పోట్లాడుకునే రాజ్యాల సముదాయం. అక్కడ మహమ్మదీయులు హిందువుల గొంతులు కోస్తూండేవారు. ఇండియాలో ఉండదగినవన్నీ బ్రిటిష్ పాలన నుంచి సంతరించుకున్నవే... ఇండియా సంతోషం, గొప్పతనం యావత్తూ ఇంగ్లండు మీద ఆధారపడినవే... ఇంగ్లండు లేకపోతే ఇండియాకు ఉనికే ఉండేది కాదు. మన పరిపాలనలోకి వచ్చేంతవరకూ అది ఏనాడూ సమైక్య దేశం కాదు. దాని మానాన దాన్ని వదిలేస్తే ఇండియా తీవ్ర గందరగోళంలో చిందరవందర అవుతుంది.)

చరిత్రాత్మకమైన వెల్బీ కమిషన్ ముందు అప్పటి బ్రిటిష్ కమాండర్-ఇన్-చీఫ్ లార్డ్ వొల్స్‌లీ పలికిన పలుకులివి. కుట్రలు, కుహకాలతో చాపకింద నీరులా వ్యాపించి, ఇండియాను అప్పనంగా ఆక్రమించి, దాదాపు ఒకటిన్నర దశాబ్దాలు ఎదురులేకుండా ఏలిన ఆంగ్లేయుల దృష్టిలో ఇండియా అనేది ఒక అనాగరిక, మూర్ఖపు జాతి. అరాజకంలో, అంతఃకలహాల్లో చిన్నాభిన్నమైన దేశం. అదృష్టవశాత్తూ తాము అడుగుపెట్టాకే, తమ దయవల్లే అది విద్యాబుద్ధులు నేర్చి క్రమబద్ధ ప్రభుత్వానికి నోచుకున్నదని బ్రిటిష్ సామ్రాజ్యవాదులందరిలోనూ ఉన్న మిడిసిపాటుకు వొల్స్‌లీ దొరగారి 'సత్యవాక్కు' మచ్చుతునక!

ప్రపంచంలో తమ సామ్రాజ్య ప్రభ దుర్నిరీక్ష్యంగా వెలుగుతున్న కాలంలో తమకు బానిస దేశమనుకునే భారతదేశం గురించి తెల్లవారికి చులకన భావం ఉండటంలో ఆశ్చర్యంలేదు. చిత్రమేమిటంటే తెల్లవాడు మూటముల్లె సర్దుకుపోయి అర్ధశతాబ్దం గడచిన తరవాత కూడా మన చరిత్ర గ్రంథాల్లో ఇలాంటి తప్పుడు అభిప్రాయమే ఇంకా రాజ్యమేలుతున్నది.

మధ్యయుగంలో భారత రాజ్యాలు అంతఃకలహాల్లో మునిగి, చేవ చచ్చి ఇస్లామిక్ దండయాత్రల ధాటికి కుప్పకూలిపోయాయనీ...

ఏడు శతాబ్దాలకు పైగా సాగిన ఇస్లామిక్ ఏలుబడికి దేశంలో సరైన ప్రతిఘటన అనేది లేకపోయిందనీ... అడపాదడపా తలెత్తిన తిరుగుబాట్లన్నీ దోపిడీగాళ్ళు, దౌర్జన్యకారులు లేవదీసినవేననీ, వాటిని కూడా ముస్లిం ధర్మ ప్రభువులు సమర్థంగా అణచి ప్రజల మన్నన పొందారనీ...

బ్రహ్మణీకం పీడాకారానికీ, కుల వ్యవస్థ దుర్నయాలకూ, అగ్రవర్ణాల అఘాయిత్యాలకూ విసిగి వేసారిన బడుగుజనం ఇస్లాంను మనస్ఫూర్తిగా స్వాగతించి శరణు జొచ్చారనీ...

మధ్యయుగంలో విలసిల్లిన కళలు, శిల్పాలు, సాంస్కృతిక వైభవాలన్నీ ఇస్లామిక్ సంపర్క పుణ్యఫలాలేననీ...

చరిత్ర గ్రంథాల నిండా కొల్లలుగా కల్లలాడినట్టే - మెకాలే మానస పుత్రులైన మన మహా మేధావులు ఆధునిక భారత చరిత్రనూ హద్దూ పద్దూ లేని అబద్ధాల అల్లికతో, స్వామిని మించిన స్వామిభక్తితో అత్యద్భుతంగా భ్రష్టు పట్టించారు. వారి దృష్టిలో మొగలాయిలకూ ఆంగ్లేయులకూ నడుమ దేశంలో ఉన్నదంతా శూన్యం. లేదంటే అరాజకం. ఒలింపిక్ జ్యోతి చేతులు మారినట్టుగా భారతదేశపు అధికారం మహమ్మదీయ ప్రభువుల నుంచి ఇంగ్లీషు దొరలకు సంక్రమించిందంటారే తప్ప మధ్యలో వేరెవరి ఆధిక్యాన్నీ వారు గుర్తించరు. మొగల్ సామ్రాజ్యం బలహీనపడిన దరిమిలా ఎక్కడికక్కడ తల ఎగరేసిన స్వదేశీ ప్రభువులు పరస్పరం కాట్లాడుకోగా పిట్టలపోరు పిల్లి తీర్చిన చందంగా ఆంగ్లేయులు లాభపడ్డారనీ... మన రాజుల మధ్య విరోధాలను తెలివిగా వాడుకుని తలవని తలంపుగా క్రమేణా దేశాన్ని వశపరచుకున్నారనీ వారంటారు. క్లయివ్ పరాక్రమం వల్ల, వారన్ హేస్టింగ్స్ చాకచక్యం వల్ల, వెల్లస్లీ, డల్‌హౌసిల బుద్ధిబలం వల్ల తెల్లవారికి దశ తిరిగిందన్న అభిప్రాయాన్నే వారు కలిగిస్తారు తప్ప ఎన్ని నేరాలు చేసి, ఎన్ని ఘోరాలకు పాల్పడి, ఎన్నెన్ని మోసాలకు, నమ్మకద్రోహాలకు ఒడిగట్టి ఎంత అడ్డగోలుగా ఆంగ్లేయులు దేశాన్ని ఆక్రమించిందీ మన చరిత్రకారులు వివరంగా చెప్పరు. ఆంగ్లేయులు దగాలు చేసి, దొంగ దెబ్బలు తీసి దేశాన్ని లాగేసుకున్నారని ఆగ్రహించే వారిలో కూడా చాలా మంది ఆధునిక పద్ధతుల్లో పరిపాలన అనేది ఇండియాలో ఇంగ్లీషు వారి హయాంలోనే మొదలైందని, అంతకు ముందంతా కాలం చెల్లిన పురాతన ఫ్యూడల్ తరహాలోనే ప్రభుత్వ వ్యవహారాలు నడిచేవని గట్టిగా నమ్ముతారు. పెద్ద చదువులు చదివి, బోలెడు డిగ్రీలు తగిలించుకుని, చరిత్ర గురించి పరులకు పాఠాలు చెప్పే మహాజ్ఞానులు కొందరిని కదిలించండి. ఇంగ్లీషు వాళ్లు రావడానికి ముందు ఇండియాలో జాతీయ భావం ఎక్కడుంది, నాన్సెన్స్! అని కొట్టిపారేస్తారు.

దురదృష్టమేమిటంటే- వంక పెట్టలేని దేశభక్తితో జాతీయోద్యమంలో ముందుండి బ్రిటిష్ సామ్రాజ్యవాదంపై పోరాడిన కొంత మంది జాతీయ నాయకులకు కూడా - ఆంగ్లేయుల ఆక్రమణకు ముందు భారతదేశ స్థితిగతుల గురించి కొన్ని అపోహలున్నాయి.

ఉదాహరణకు - జవహర్లాల్ నెహ్రూ! సుప్రసిద్ధమైన తన **డిస్కవరీ ఆఫ్ ఇండియా** గ్రంథంలో ఆయన వెలిబుచ్చిన నిశ్చితాభిప్రాయాలను చూడండి:

> It seems clear that India became a prey to foreign conquest because of the inadequacy of her own people and because the British represented a higher and advancing social order... the Indians, for all their ability, functioned in a narrow, limited sphere of thought and action, unaware of what was happening elsewhere and therefore unable to adapt themselves to changing conditions.

[***The Discovery of India*** **- Jawaharlal Nehru, *p. 281***]

(తన సొంత ప్రజల చేతకానితనం వల్లనే... బ్రిటిషు వారు ఉన్నతమైన, ముందుకు పోతున్న సామాజిక వ్యవస్థకు ప్రాతినిధ్యం వహించేవారు కాబట్టే భారతదేశం విదేశీయులకు వశమైంది... భారతీయులకు ఎంత సమర్థత ఉన్నా వారి ఆలోచన, వారి ఆచరణ ఇరుకైన చట్రానికి పరిమితమయ్యాయి. బయట ఏమి జరుగుతోందో వారికి తెలియదు. మారుతున్న పరిస్థితులకు తగ్గట్టుగా వ్యవహరించడం వారికి చేతకాలేదు.)

అదే గ్రంథంలో నెహ్రూ ఇంకా ఇలా అన్నారు:

మొగల్ సామ్రాజ్య విచ్ఛిత్తి దరిమిలా ఇండియాలో పరిస్థితి అనిశ్చితంగా,

రంగంలోకి దిగారు. వీరందరిలో బ్రిటిష్ వారికి - బ్రిటిష్ వారికి మాత్రమే విజయానికి కావలసిన లక్షణాలు ఎన్నో ఉన్నాయి. విదేశీ వ్యతిరేకత నిస్సందేహంగా ఉండింది. కాని సాధారణంగా, విస్తృత స్థాయిలో జాతీయ భావం అనేది మృగ్యం - ఒక్క మరాఠాలకు మాత్రమే జాతీయ సెంటిమెంటు కొంత ఉండేది, కానీ అదికూడా సంకుచితమైంది. పరిమితమైనది. **(పేజి 277)** .

మొగల్ సామ్రాజ్య పతనానంతరం దేశం సాహసికుల పాలైందనీ... ఆధిపత్యానికి పోటీపడ్డ సాహసికుల్లోకెల్లా ఒక్క ఇంగ్లీషు వారికే యోగ్యతలన్నీ ఉన్నాయనీ... అప్పట్లో జాతీయ భావమనేది మృగ్యమనీ నవభారత నిర్మాత నెహ్రూ అంతటి వాడే తేల్చి చెప్పాక ఆధునిక మేధావులకూ అదే వేదవాక్యమైంది. బ్రిటిష్ పరిపాలన వల్ల దేశానికి మేలు జరగలేదని కాదు. బ్రిటిష్ వారికి పూర్వం భారతదేశం శాంతి, సుస్థిరతలతో భూలోక స్వర్గంలా విరాజిల్లిందనీ ఎవరూ అనలేరు. కానీ, సమస్యలు, లోటుపాట్లు సవాలక్ష ఉన్నప్పటికీ అప్పటి దేశం మరీ దిక్కూమొక్కూ లేని అరాజక స్థితిలో ఏమీ లేదు.

1707లో ఔరంగజేబు మరణానంతరం మొగల్ సామ్రాజ్యం విచ్ఛిన్నమైన మాట నిజమే. నూటపదేళ్ల తరవాత ఆంగ్లేయుల వశమైన మాటా యథార్థమే. కాని ఆ విచ్ఛిన్నానికి ఈ కైవసానికీ నడుమ దేశంలో రాజకీయ శూన్యమేదీ ఆవరించలేదు. ఔరంగజేబు జీవిత కాలంలోనే ముమ్మరమైన జాతీయ ప్రతిఘటన అనంతర కాలంలో ఇంకా ప్రచండ రూపం దాల్చింది. ఇస్లామిక్ సర్వం సహాధికారం సమసి ఎక్కడికక్కడ హిందూ రాజ్యాలు వెలిశాయి. బెంగాల్‌నూ, మద్రాసు తీరాన్నీ మినహాయిస్తే దేశమంతటా హిందూ రాజుల పతాకాలే రెపరెపలాడాయి.

ఈ దేశీయ రాజ్యాలకు తలమానికమైనది 'మరాఠా మండలి.' ఛత్రపతి శివాజీ నేతృత్వంలో ఔరంగజేబును ఎదిరించి మహారాష్ట్ర పశ్చిమ భాగంలో అజేయంగా నిలిచిన మరాఠా శక్తి కాలక్రమంలో సెంట్రల్ దక్కనును, కర్ణాటకను గెలుచుకుని దక్షిణాదిన కన్యాకుమారి నుంచి ఉత్తరాన హిమాలయాల దాకా... బంగాళాఖాతం నుంచి అరేబియన్ సముద్రం వరకూ గుజరాత్ మొదలు మధ్య భారతమంతా బహుముఖంగా విస్తరించింది. శివాజీ ఆకాంక్షించిన 'హిందూ పద పాదుషాహీ' (హిందూ సామ్రాజ్య స్థాపన)ను సాకారం చేయడానికి (నెహ్రూ గారన్నట్టు సంకుచితంగా, పరిమితంగా కాక) విశాల దృక్పథంతో విస్తృత స్థాయిన ఫెడరల్ సమాఖ్య పంథాలో ముందుకు సాగింది. హైదరాబాదు, మైసూరు వంటి కొన్ని సంస్థానాలు మిగిలినా అవి కూడా మరాఠా మండలి ప్రాబల్యానికి తల వంచాయి. పేరుకు మొగలాయీల రాజ్యమైనా దేశమంతటా మరాఠాలదే నిర్ణాయక శక్తి. నూరేళ్ళకు పైగా దేశ రాజకీయ గతిని శాసించి సుస్థిర పాలనను వారు అందించగలిగారు.

సాహసికులు, దోపిడీదొంగలు, నీతిమాలిన అవకాశవాదులు అని తెలిసీ తెలియని చరిత్రకారులు ఎంతగా ఈసడించినా మరాఠాల దిగ్విజయం వెనుక బలీయమైన సామాజిక పునాది, విశిష్ట ధార్మిక ప్రవృత్తి, నిరుపమాన సంఘటిత శక్తి ఉన్నాయి. ఆధునిక కాలంలో మనం అనుసరిస్తున్న పరిపాలనా విధానానికి బ్రిటిష్ వారు ఆద్యులని చాలామంది పొరబడతారు. నిజానికి శివాజీ మహారాజ్ నెలకొల్పిన 'అష్టప్రధాన్' విధానమే... ఆయన



రూపొందించి అమలు పరచిన రెవిన్యూ వ్యవస్థ అసలు మాతృక. దానిని కొద్ది మార్పులతో తెల్లదొరలు కాపీకొట్టేశారు. మన మేధావులు పలువురు ముద్ర వేసినట్టుగా మరాఠాలు కేవలం ధన సంపాదన కోసం సైనిక వృత్తి చేపట్టిన సాహసికులూ, దోపిడీగాళ్లే అయితే మొగల్ సామ్రాజ్యం ప్రపంచంలోకెల్లా బలిష్ఠశక్తిగా మధ్యందిన మార్తాండుని వలె దుర్నిరీక్ష్యంగా వెలిగిపోయిన కాలంలో ఔరంగజేబు అంతటి ప్రతిద్వందితో రెండు తరాల పాటు హోరాహోరీగా పోరాడి ముప్పతిప్పలు పెట్టగలిగే వారు కాదు. సంక్షోభాలెన్ని ఎదురైనా, సంఘర్షణల్లో ఎటు వంటి హేమాహేమీలు నేలకొరిగినా పోరాట పటిమ చెదర కుండా ప్రత్యామ్నాయ నాయకత్వానికి లోటులేకుండా వందేళ్లు దేశాన్ని నడిపించగలిగేవారూ కాదు.

బెంగాల్, హైదరాబాద్, కర్ణాటకల్లో మొగలు సుబేదారులు స్థాపించుకున్న రాజ్యాల్లా మరాఠా సామ్రాజ్యం ఏ ఒక వ్యక్తి మీదో, కొద్దిమంది అదృష్టం మీదో ఆధారపడినది కాదు. మహదేవ్ గోవింద రణడే మాటల్లో చెప్పాలంటే -

> "The Rise of Maratha power was due to the first beginnings of the process of nation making... This was the first experiment of the kind attempted in India after the disastrous period of foreign Musalman invasions... It is the history of the formation of a true Indian Nationality, raising its head high above the troubled waters of Mahomedan confusion."
>
> [***Rise of The Maratha Power*, M.G. Ranade**, *p. 3,4*]
>
> *(మరాఠా శక్తి ప్రాదుర్భావం జాతి నిర్మాణ ప్రక్రియకు ప్రారంభం... విదేశీ ముసల్మాన్ దండయాత్రల వినాశకాలం తరవాత ఇండియాలో ఈ దిశగా సాగిన మొట్టమొదటి ప్రయోగం ఇది. మహమ్మదీయ గందరగోళపు కల్లోలం నుంచి శిరసెత్తి నిజమైన భారతీయ జాతీయత రూపుదాల్చిన చారిత్రక ఘట్టమిది.)*

మొగలులకు, అంగ్లేయులకు మధ్య మరో అధికార కేంద్రాన్ని మన 'సెక్యులర్' చరిత్ర కారులు చూడనిచ్చగించకున్నా, తాము అధికారం ఎవరి నుంచి గుంజుకున్నదీ తెల్ల వారికి తెలుసు. కాబట్టే మరాఠా చరిత్రకు సంబంధించి ప్రామాణిక గ్రంథమైన తన "History of the Mahrattas" తొలి సంపుటి తొలి వాక్యంలోనే James Grant Duff మరాఠాలను "Our immediate predecessors in conquest" (మనకు ముందు విజేతలు) అని అభివర్ణించాడు.

రాళ్లు రప్పల దక్కన్‌లో అన్నివిధాలా వెనకబడిన మరాఠాలు నూరేళ్లు చల్లగా వర్ధిల్లిన మహాసామ్రాజ్యాన్ని ఎలా నిర్మించార్లు, ఏ పద్ధతిన నడిపారు, ఏ కారణాలవల్ల ఏ పరిస్థితుల్లో ఇంగ్లీషు వారి చేతిలో ఓడిపోయారు అన్నది రసవత్తర గాథ. ఆధునిక భారత జాతీయతకు 'మరాఠా సమాఖ్య' తొలి పొద్దు.

# సాహో! సాహు

పడగొట్టలేనప్పుడు చెడగొట్టమని సామెత. మొగలాయీలూ అదే చేద్దామను కున్నారు. పక్కలో బల్లెంలా తయారైన మరాఠా శక్తిని మట్టుపెట్టటానికి వారు దీర్ఘకాలం శతవిధాల ప్రయత్నించారు. చుంచెలుకల్లాంటి మరాఠాలను అలవోకగా అణచేసి వెంటనే తిరిగి వచ్చేద్దామనుకుని దక్షిణాపథానికి వెళ్ళిన ఔరంగజేబు చక్రవర్తి రెండు దశాబ్దాలకు పైగా అక్కడే కూరుకుపోయి ఎంత భీకరంగా పోరాడినా, చివరికి తానే అలసిసొలసి, అన్ని విధాల చితికి ఘోర పరాజయం పాలయ్యాడు. పరాభవ భారంతో అక్కడే కన్ను మూశాడు.

ఎన్ని కోటలు పట్టుకున్నా చిక్కినట్టే చిక్కి పాదరసంలా జారిపోయి అంతలోనే బలం పుంజుకుని మెరుపుదాడులు చేస్తూ తనను ముప్పతిప్పలు పెడుతున్న మరాఠాల ఆయువుపట్టు ఎక్కడుందో తెలియక కళవళపడి... అహ్మద్‌నగర్‌లో తన కోటలో తాను కూచున్నా ఏ వేళ ధనాజీయాదవ్ వచ్చి పడతాడో, ఎటునుంచి నేమాజీ సింధియా దాడి చేస్తాడో, ఏవైపుగా ఉదాజీ పవార్ తరుముకు వస్తాడో అని భీతిల్లి, అంతటి ఔరంగజేబే చేతులెత్తేసినప్పుడు మనమనగా ఎంతవారము అనుకున్నారు మొగల్ సర్దారులు. ఔరంగజేబు మరణానంతరం మరీ పేట్రేగి తమ భరతం పడుతున్న మరాఠాలను యుద్ధంలో జయించలేనప్పుడు లౌక్యంతో లొంగదీయడమే మేలని దక్కను సుబేదారు జుల్ఫికర్ అలీఖాన్ కొత్తగా గద్దెనెక్కిన ఔరంగజేబు కుమారుడు బహదూర్‌షాకు హితవు చెప్పాడు. అందుకోసం మన చెరలోని సాహుని వదిలిపెట్టమని సలహా ఇచ్చాడు.

సాహు ఎవరోకాదు. ఛత్రపతి శివాజీ మనవడు. శంభాజీ కుమారుడు. 1689లో దొంగదెబ్బతీసి శంభాజీని పట్టుకుని చిత్రవధ చేసిన సమయంలో అతడి కుమారుడినీ, భార్యనీ ఔరంగజేబు నిర్బంధించి ఢిల్లీ తీసుకుపోయాడు. 'శివాజీ' అనే అసలుపేరును 'సాహు'గా మార్చి చిన్నప్పటి నుంచే నల్లమందును అలవాటు చేసి, మొగలు సంప్రదాయ



పద్ధతుల్లో పెంచి ఆ కుర్రవాడిని సగం తురకను చేశాడు. ఆరేళ్ల లేత వయసు నుంచి తమ నీడలో అర్భకంగా పెరిగి ప్రస్తుతం యుక్తవయస్కుడైన సాహుని మరాఠాల మధ్యకు వదిలితే శివాజీ పెద్దకుమారుడికి పెద్దకుమారుడిగా వారసత్వపు సహజ హక్కుతో రాజ్యాధికారం సంపాదించి, తమకు అనుకూలంగా మెలగగలడని మొగలుల ఆలోచన.

రాజ్యాధికారానికి సాహుకున్న హక్కును మరాఠాలెవరూ కాదనలేరు. తన అన్న శంభాజీ అనంతరం సింహాసనం అతడి కుమారుడికే దక్కాలని శంభాజీ తమ్ముడు రాజారాంకూ తెలుసు. అందుకే మొగల్ చెరలో అన్నగారి హత్యానంతరం ఛత్రపతి అయిన రాజారాం, తాను అన్న కుమారుడికి ప్రతినిధిగానే, ఆ కుమారుడు తిరిగి వచ్చేంతవరకూ తాత్కాలిక ఏర్పాటుగానే రాజ్యం చేస్తానని ప్రకటించాడు. ఇటీవలే ఆయన కూడా గతించాడు. నాలుగేళ్ళ పసివాడైన కుమారుడికి పట్టంగట్టి రాజారాం భార్య తారాబాయి ఏడేళ్లుగా మొగలుల గుండెలవిసేలా సర్వసమర్థంగా చక్రం తిప్పుతున్నది. ప్రజల్లో ఆమెకు ఎంత ఆదరణ, సైన్యాధికారులపై ఎంత పట్టు ఉన్నప్పటికీ అసలు వారసుడొచ్చాక ఆమె గద్దె దిగిపోవలసిందే. పోకుంటే, సంప్రదాయ ప్రియులైన మరాఠా ప్రజలు సహించరు. అపరచండి లాంటి తారాబాయి రంగంలో నుంచి నిష్క్రమిస్తే మొగలు సామ్రాజ్యానికి సగం తలనెప్పులు తప్పుతాయి. ఆమె స్థానంలో నల్లమందు భాయి, మేదకుడు, అర్భకుడు, ఔరంగజేబు మానసపుత్రుడు అయిన సాహు కూచుంటే చక్రవర్తికి నిశ్చింత! ఒకవేళ అలా జరగక, కనీసం ఒక బలమైన వర్గాన్ని సాహు తిప్పుకుని అంతర్యుద్ధం తేగలిగినా మరాఠా పీడ విరగడ అవుతుంది. ఇదీ మొగలాయీల ఎత్తుగడ!.

పథకం వరకూ అద్భుతం. కానీ ఏం లాభం? ఆచరణలో అనూహ్యంగా బెడిసికొట్టింది. మొగలులు వేసి ఎత్తు చివరికి మొగలుల నెత్తికే చేతులు తెచ్చింది. వారు ఊహించినట్టే మరాఠాల్లో అంతర్యుద్ధం వచ్చింది. కానీ - దాని పర్యవసానంగా మరాఠా శక్తి అణగారి పోకపోగా మరింత ప్రచండంగా విజృంభించింది. అంతదాకా దక్కనుకు మాత్రం పరిమితమైన మరాఠా ప్రాబల్యం తమవాడని మొగలులనుకున్న సాహు హయాంలోనే అఖిల భారత స్థాయికి ఉవ్వెత్తున ఎగిసింది.

ఇది ఎలా జరిగిందన్నది పసందైన కథ.

సాహు తిరిగి వస్తున్నాడని తెలియగానే మహారాష్ట్రమంతటా బ్రహ్మాండమైన ఆనందోత్సాహాలేమీ వెల్లివిరియలేదు. ఊహించని ఈ పరిణామానికి ఎలా స్పందించాలో మరాఠా ప్రముఖులు చప్పున తేల్చుకోలేక పోయారు. కొత్త హక్కుదారు వచ్చీరాగానే రాజదండం అతడి చేతిలో పెట్టి తాను నెత్తిన చెంగు వేసుకుపోవడానికి వీరనారి తారాబాయి ఇచ్చగించలేదు. అసలు సాహూ ఎప్పుడో చచ్చిపోయాడని, ఇప్పుడు వస్తున్నవాడు నకిలీ అనీ, మరాఠాల మధ్య చిచ్చు పెట్టటానికి మొగలులే ఈ కపట నాటకం ఆడిస్తున్నారనీ ఆమె ప్రచారం చేయించింది. కాని - ఆ ఎత్తు పెద్దగా పనిచేయలేదు. ఈ మధ్య కాలంలో మొగలుల నిర్బంధంలో సాహుని చూసి వచ్చినవారు అతణ్ని చూడగానే గుర్తుపట్టారు. పర్సోజీ భోంస్లే అనే పెద్దాయన సాహును గౌరవించి విధేయత ప్రకటించగానే మిగతా ప్రముఖులూ ఒకరొకరుగా అతడివైపు మొగ్గారు. సాధారణ ప్రజలూ శివాజీ వంశాంకురాల్లో అగ్రజుడిగా అతడి హక్కును మనస్ఫూర్తిగా బలపరిచారు.

అతడికి అరువిచ్చి, రోహిల్లాలను నాశనం చేయటానికి వారన్ హేస్టింగ్స్ ఒప్పుకున్నాడు. 1773 సెప్టెంబర్‌లోనే వారణాసిలో ఈ సంధి కుదిరింది. కాని- ఇందులో రోహిల్లా జాతిని నిశ్శేషంగా నిర్మూలించడానికి సంబంధించిన షరతును మాత్రం హేస్టింగ్స్ చాలా రోజులు గోప్యంగా ఉంచాడు. ఈలోపు లేనిపోని నేరాలు మోపి, గిల్లి కజ్జాలు పెట్టుకుని 1774 ఏప్రిల్ 17న ఇంగ్లీషు సేనలు రోహిల్ ఖండ్‌లో అడుగుపెట్టాయి. రోహిల్లాలు పళ్ళ బిగువున పోరాడారు. ధైర్యసాహసాలు ఎంత ఉన్నా శత్రువుల సంఖ్యాధిక్యం ముందు తాళలేక ఓడిపోయి వారు శరణాగతులయ్యారు. ఎలాంటి షరతులకైనా ఒప్పుకుంటామని, తమను దయతలచి విడిచిపెడితే చాలునని వారు ఎంత దీనంగా వేడుకున్నా ప్రయోజనం లేకపోయింది. ఈ సమయంలో వారిని వదిలివేస్తే ఎప్పటికైనా కసి తీర్చుకోక మానరని వజీరుకు భయం పట్టింది. రోహిల్లాలను వారి దేశం నుంచి ఇళ్లూ వాకిళ్ల నుంచి పూర్తిగా తరిమేసి తీరాల్సిందేనని అతడు పట్టుబట్టాడు. అలా కొంపాగోడూ విడిచిపోయేకంటే అక్కడే పోరాడుతూ చచ్చిపోవటం మేలని రోహిల్లాలు నిశ్చయించుకున్నారు.

అప్పుడు జరిగింది మహాభయానకమైన జాతి హత్యాకాండ. బాబుల్‌నల్లా పర్వత పార్శ్వాల్లో చావుకు తెగించి బారులు తీరిన రోహిల్లా సేనలు కొన ప్రాణం దాకా పోరాడాయి. రెండు వేల సైనికులు నేలకొరిగిన మీదట నిస్సహాయులైన జనాన్ని చిన్నాపెద్దా ఆడామగా తేడా లేకుండా శత్రువులు నిలువునా నరికేశారు. పచ్చటి పొలాలు, జనావాస ప్రాంతాలు నెత్తుటితో తడిసి, వీధుల్లో పీనుగులు పోగుపడి, ఇళ్లు పాడుపడి, విందుల కోసం రాబందులు బారులు తీరాక పుణ్యకార్యం పూర్తయింది. శ్మశాన రాజ్యం వజీరుకు దక్కింది. కంపెనీ ఖజానాకు నిధుల ఆకలి తీరింది. హేస్టింగ్స్ దొర గల్లాపెట్టె గల గల లాడింది. 'అవసరమైతే రోహిల్లాలను సమూలంగా దుంపనాశనం' చేయాలన్న రహస్య ఒడంబడిక యథావిధిగా నెరవేరింది. దొరల మాట నిలిచింది. ఎవరికీ ఏ హానీ చేయకుండా స్వేచ్ఛగా పచ్చగా బతుకుతున్న జాతిని, నిష్కారణంగా నిశ్శేషంగా నిర్మూలించిన మహాపాపం కంపెనీ దొరల నీతుల సాక్షిగా మహా నాగరీకంగా జరిగిపోయింది.

విదేశీ చరిత్రకారులు, వారి అనుయాయులైన దేశవాళీ మేధావులు తిమ్మిని బమ్మి చేయాలని ఎంత తంటాలు పడ్డా రోహిల్లాల విషయంలో ఇంగ్లీషు వారు ఒడిగట్టింది నిష్కృతి లేని మహాపచారం. ఇంగ్లీషు సామ్రాజ్యవాదాన్ని కడు సమర్థంగా ఎండగట్టిన టోరెన్స్ వివరించినట్టు..

> We had not the slightest pretence of quarrel with the Rohillas... But Money was needed to meet exorbiant salaries and charges, and the Governor General made up his mind to pay the usury of blood. He accepted the money from dude and hired the company's troops to the Vizier, to sieze and expropriate Rohilcund. The liberties and lives of a friendly race were the price of the subsidy... Hastings pocketed £ 20,000 as a private present for signing the treaty, and the public treasury was replenished to the extent of £ 400,000.
>
> [*"Empire in Asia"*, **W.M. Torrens**, *p. 92*]



(రోహిలాలతో కలహించటానికి మనకు (ఆంగ్లేయులకు) ఈషణ్మాత్రమైనా కారణం లేదు. కాని కుంపిణీ వారి జీతబత్తేలకు, మితి లేని ఖర్చులకూ ఎంత డబ్బయినా చాలలేదు. దాంతో గవర్నర్ జనరల్ పొదుగుకోసి నెత్తురు తాగాలని నిశ్చయించుకున్నాడు. రోహిల్‌ఖండ్‌ను గుంజుకుని కబళించటానికి డబ్బు పుచ్చుకుని కంపెనీ సేనలను వజీరుకు అద్దెకిచ్చాడు. మనతో స్నేహంగా ఉన్న జాతి స్వాతంత్ర్యాన్ని, నిండు ప్రాణాలను ఇందుకోసం బలిపెట్టాడు... ఒప్పందం కుదుర్చుకున్నందుకు హేస్టింగ్స్ 20 వేల పౌండ్ల బహుమానాన్ని జేబులో వేసుకున్నాడు. కంపెనీ బొక్కసంలోకి నాలుగు లక్షల పౌండ్లు వచ్చిపడ్డాయి).

నెత్తుటి కూడు ఆరగించి జేబులు నింపుకోవటంతో వారన్ హేస్టింగ్స్ కథ సుఖాంతం కాలేదు. అతడి కష్టాలు అప్పుడే మొదలయ్యాయి.

# తెల్లోళ్ల న్యాయం

**వారన్ హేస్టింగ్స్‌కు నవ్వాలో ఏడవాలో అర్థంకాలేదు.**

**రోహిల్లా జాతిని దుంపనాశనం చేసి, 'కంపెనీ'కి నాలుగు లక్షల పౌండ్లు (తన జేబులోకి ఇరవైవేల పౌండ్లు) తెలివిగా రాబట్టిన చాకచక్యానికి బహుమానంగానా అన్నట్టు అతడికి గొప్ప ప్రమోషన్ అయితే వచ్చింది. అంతదాకా బెంగాల్‌కు మాత్రమే గవర్నర్‌గా ఉన్నవాడు కాస్తా 1773 రెగ్యులేటింగ్ చట్టం పుణ్యమా అని ఇండియాలో మిగతా రెండు ప్రెసిడెన్సీ (బొంబాయి, మద్రాసు)లకూ అధికారి అయ్యాడు. గవర్నర్ జనరల్ హోదా అయితే దాబుగానే ఉంది. కాని అందులోనే ఒక మెలిక ఉంది.**

కుర్చీ పెద్దదైనా అందులో అతడు నిరంకుశంగా పెత్తనం చెలాయించటానికి వీలులేదు. అతడి నెత్తిన ఒక కౌన్సిల్ ఉంటుంది. ఆ సుప్రీం కౌన్సిల్లో అతడుగాక నలుగురు సభ్యులు. వారిలో ఒకడు 'కంపెనీ' మనిషి కాగా ముగ్గురు బ్రిటిష్ ప్రభుత్వం చేత నియమితులైనవారు. వారు గవర్నర్ జనరల్‌కు తాబేదారులు కాదు. ఆ ముగ్గురిలో ఒకడు యథార్థవాది ఫిలిప్ ఫ్రాన్సిస్. అతడి పేరు చెబితేనే హేస్టింగ్స్‌కు హడలు!

మహావేత్తలైన మన చరిత్రకారుల దృష్టిలో వారన్ హేస్టింగ్స్ గొప్ప రాజనీతిజ్ఞుడు; దూరదృష్టి, కార్యదీక్షత కలిగిన పాలనా దురంధరుడు. అతనెంత యోగ్యుడో సీమ నుంచి దిగబడిన మెంబర్లు అంత అయోగ్యులు!?. మొదటినుంచీ హేస్టింగ్స్ మీద ద్వేషం కలిగి, చెప్పుడు మాటలువిని, తమ తాహతును అతిగా ఊహించుకుని అతడికి వారు (ముఖ్యంగా ఫ్రాన్సిస్) అడుగడుగునా అడ్డుతగలగా పాపం ఆ పెద్ద మనిషి ఓపికగా భరించి, ఒడుపుగా వ్యవహరించి, తన మంచితనంతో కౌన్సిల్‌పై పట్టు సంపాదించి, కార్యం సాధించాడని ఇంగ్లీష్ బళ్లో చదివిన మన మేధావుల నమ్మిక. బ్రిటిష్ హయాంలో భారత చరిత్ర గురించి మనవారు మనకు నూరిపోసిన అనేక ఇతర విషయాలలాగే ఇది కూడా శుద్ధ అబద్ధం. హేస్టింగ్స్‌తో ఫ్రాన్సిస్‌కు వ్యక్తిగత విరోధం ఏమీ లేదు. అతడు నీతికి, న్యాయానికి విలువ ఇచ్చే పెద్ద మనిషి. ఇండియాలో కంపెనీవారు చేస్తున్న ఆగడాలను, అరాచకాలను కర్బాకర్దిగా వివి, యథేచ్ఛగా సాగుతున్న ఘరానా దొంగల దోపిడీని అరికట్టి తీరాలన్న కృతనిశ్చయంతో వచ్చినవాడాయన. ఇండియాలో పుట్టకపోయినా, భారతీయులకు చుట్టం కాక పోయినా ఇక్కడ జరుగుతున్న దారుణ దుర్న్యాయాలకు మనిషిలా స్పందించి, కౌన్సిల్‌లో తోటి మెంబర్లయిన జనరల్ క్లావరింగ్, మాన్సన్‌లను కూడగట్టి అవినీతి భాగోతాలను ఎండగట్టి, హేస్టింగ్స్‌ను అభిశంసన బోనులోకి నెట్టి దేశాన్ని మరింత నాశనం కాకుండా కాపాడినవాడు ఫ్రాన్సిస్.

కొత్త కౌన్సిల్ కొలువు తీరేసరికే దొరల దోపిడీల గురించి కంపెనీ వర్గాల్లో గోలగా ఉంది. ఏమి జరుగుతోందో దేశస్థులకూ తెలిసినా, అందరికీ ఒళ్లు మండుతున్నా ఎవరికి మొరపెట్టుకోవాలో తెలియక లోలోన ఉడికిపోతున్నారు. కొత్తగా సుప్రీం కౌన్సిల్ వచ్చిందని, అందులో మెంబర్లు స్వతంత్రంగా వ్యవహరించి పెద్ద దొరనైనా భరతం పట్టగలరని తెలిసే సరికి ఎక్కడెక్కడివారూ తెగువ తెచ్చుకున్నారు. తెల్లవారూ, నల్లవారూ ధైర్యంగా కౌన్సిల్ ముందుకొచ్చి గవర్నర్ జనరల్ అవినీతి, అక్రమాలపై అనేక ఫిర్యాదులు చేశారు. హేస్టింగ్స్ ఉపకారాలు చేస్తానని జమీందార్లనుంచీ, ఇతర ప్రముఖులనించీ బహుమానాల రూపంలో ఎంతెంత గుంజాడో, ఉద్యోగంలో ప్రమోషన్లకూ, కోరినచోట పోస్టింగులకూ కంపెనీ ఉద్యోగుల నుంచి ఎన్నెన్ని లంచాలు పట్టాడో, ఇంకా ఏఏరకాల అధికార దుర్వినియోగాలకు పాల్పడ్డాడో అన్నీ బయటపడ్డాయి. ఈ అభియోగాలను ఒకటొకటిగా సుప్రీం కౌన్సిల్ విచారిస్తూంటే వాటిని ఆలకించటమే తనకు పరువుతక్కువ అయినట్టుగా భావించి, వాటికి జవాబు చెప్పటం తన స్థాయిని కించపర్చుకోవటమేనని ప్రకటించి హేస్టింగ్స్ గైర్హాజరు అయ్యాడు. అయినా మిగతా మెంబర్లు లక్ష్యపెట్టకుండా అతడు లేకుండానే విచారణ కొనసాగించారు. సాక్ష్యాలు, రుజువులు అన్నీ పరీక్షించి అభియోగాలన్నీ పరిశీలించాక ఏకగ్రీవంగా ఆమోదించిన తీర్మానంలో సుప్రీం కౌన్సిల్ చెప్పిందేమిటంటే –

> There is no species of peculation from which the Governor General has thought it reasonable to abstain
>
> [*Empire in Asia*, **W.M. Torrens**, *p. 93*]

(గవర్నరు జనరలు ఈ దుర్నయం చేశాడు, ఆ దుర్నయం చేయలేదు అని చెప్పటానికి వీలు లేదు. ఫలానా పని చేయదగనిదన్న ఆలోచనే ఆయనకు లేదు).

అభియోగాలు విచారించి, అక్రమాలను ధ్రువపరచ్చుకున్నాక అయోధ్య వజీరుతో హేస్టింగ్స్ కుదుర్చుకున్న బేరాన్ని సుప్రీం కౌన్సిల్ తోసిపుచ్చింది. రోహిల్ ఖండ్‌నుంచి అంగ్లసేనను వెనక్కి పిలిపించింది. వారణాసి ఒప్పందాన్ని ధ్రువీకరించేందుకు నిరాకరించింది. కానీ వారన్ హేస్టింగ్స్ బెంబేలు పడలేదు. కౌన్సిల్ సభ్యులు అతడి అవినీతి భాగోతాలను రచ్చకీడ్చాక సీమలో గగ్గోలు పుట్టింది. పార్లమెంటులో చర్చ జరిగింది. అతణ్ని అభిశంసించడానికి రంగం సిద్ధమైంది.

అయినా హేస్టింగ్స్ హడలిపోలేదు. తన యజమానుల సంగతి అతడికి బాగా తెలుసు. వారు పలికే నీతి సూత్రాలు, విధాన ప్రకటనల్లో ఉత్తర్వుల్లో చెప్పే సుద్దులను సీరియస్‌గా తీసుకుని ఫ్రాన్సిస్‌లాంటి వెర్రివాళ్లు ఎన్ని గంతులేసినా చివరికి పైదొరలు తన కొమ్మే కాస్తారని అతడు ఎరుగును. ఆ ధైర్యం తోటే అడ్డగోలు లావాదేవీల్లో తాను పిక్కిన సొమ్ములోంచి

రెండు లక్షల పౌండ్లను తన లంచాల పురాణం సవిస్తరంగా బయటపెట్టాక కలకత్తా ట్రెజరీకి చప్పుడుకాకుండా జమ కట్టాడు. అతడు లంచగొండి, కన్నపుదొంగ అనడానికి ఆ ఒక్క రుజువే చాలు. అయినా - అంత సొమ్ము నీకెక్కది; ఇన్నాళ్లూ జేబులో వేసుకుని పార్లమెంటరీ అభిశంసన తప్పదనగా ఇప్పుడు జమకట్టడంలో అర్థమేమిటని కంపెనీ డైరెక్టర్లు నిగ్గదీసిన పాపాన పోలేదు.

వారేదో సత్యసంధులు. అవకతవకలు సహించని వారు అన్న భ్రమలో ఇక్కడ ఫ్రాన్సిస్, అతడి అనుచరులు హేస్టింగ్స్ దుమ్ముదులిపే పనిని కొనసాగించారు. సుప్రీం గవర్నమెంటు కత్తి ఎత్తింది; హేస్టింగ్స్ పని అయిపోయింది అనుకుని ఎక్కడెక్కడివారూ సాక్ష్యం చెప్పడానికి ముందుకొచ్చారు.

వారిలో మొదట చెప్పవలసినవాడు నందకుమార్. మహమ్మద్ రజాఖాన్ కేసులో తనను కరివేపాకులా వాడుకుని అవతల పారేసి, నాయిబ్ పదవిని అన్న ప్రకారం ఇవ్వకుండా మొండిచెయ్యి చూపింది మొదలుకుని అతడు హేస్టింగ్స్‌పై భగభగలాడుతున్నాడు. నవాబు దర్బారులో చాలాకాలం నుంచి ఉండి గుట్టుమట్లన్నీ క్షుణ్ణంగా తెలుసుకున్నవాడు కాబట్టి హేస్టింగ్స్ తప్పులన్నీ ఏకరువు పెడుతూ కౌన్సిల్‌కు పిటిషన్‌ను పెట్టాడు. హేస్టింగ్స్‌కు స్వయంగా లంచాలిచ్చినవారు కూడా సాక్ష్యమిచ్చి అనేక ఆధారాలు చూపించారు. అన్నీ విన్నాక నందకుమార్ అభియోగం "sheds a clear light upon the Governor General's conduct and the means he had taken of making the large fortune he was said to posess- upwards of forty lacs of rupees - which he must have amassed in the course of three years" (గవర్నర్ జనరల్ నడతపైనా, మూడేళ్లలో నలభైలక్షల పై చిలుకు సంపద మూటగట్టడానికి అతడు అనుసరించిన పద్ధతులమీదా స్పష్టమైన వెలుగు ప్రసరించింది) అని 1775 ఏప్రిల్ 11న సుప్రీం కౌన్సిల్ మినిట్స్‌లో అధికారికంగా పేర్కొన్నారు.

దీంతో వారన్ హేస్టింగ్స్ పరువుపోయింది. కలకత్తాలో కౌన్సిల్‌వారు కదిలించిన కందిరీగల తుట్టె ప్రభావం సీమ దాకా పాకి, అక్కడ తనపై కత్తులు నూరుతున్న పార్లమెంటరీ పెద్దల చేతిలో నందకుమార్ పిటిషను పడితే పని ఖాళీ అని అతడు గ్రహించాడు. దీన్ని అడ్డుకునేందుకు ఏమి చేయాలా, పక్కలో బల్లెంలాంటి నందకుమార్ నోరు శాశ్వతంగా ఎలా నొక్కేయాలా అని ఆలోచిస్తే హేస్టింగ్స్ బుద్ధికి దివ్యమైన ఉపాయం తట్టింది.

ఇంగ్లీషు చట్టాలు ఇండియాలోని ఇంగ్లీషు జనాభాకూ, ఇంగ్లండు పరిపాలనలోని ప్రాంతాలకూ సక్రమంగా వర్తించేట్టు చూడటానికి 1773 రెగ్యులేటింగ్ చట్టం కింద సుప్రీం కోర్టు ఒకటి కలకత్తాలో వెలిసింది. దాని ప్రధాన న్యాయమూర్తి ఎవరో కాదు. వారన్ హేస్టింగ్స్‌కు చిరకాల మిత్రుడు, సహాధ్యాయి అయిన సర్ ఎలిజీ ఇంపే! ఇంకేం? నందకుమార్ ఆరేళ్లకింద ఏదో పత్రాన్ని ఫోర్జరీ చేశాడని ఎవరో అనామకుడి చేత ఆ కోర్టులో కేసు పెట్టించటం, నిమిషాలమీద కోర్టు వారంటు పుట్టించి నందకుమార్‌ని ఖైదులో వేయించడం ఆఘమేఘాల మీద జరిగిపోయింది.

ఇది దారుణం. సడి చేయకుండా కాన్సర్‌లా వ్యాపిస్తూ మెల్లిగా భారతదేశంలో ఒక ప్రాంతం తరువాత ఒకదాన్ని స్వాహా చేస్తున్న విదేశీ వర్తకుల మూకకు ఇండియా మీద రాజ్యాంగపరమైన అధికారం ఏమీ లేదు. ఈ దేశంలోని తెల్లతోలువారికి తెల్లచట్టాలను వర్తింపజేయదలచుకుంటే అది వారి అంతరంగిక వ్యవహారం. కానీ- ఈ దేశంలోని పౌరుడిని తన దేశపు చట్టంకింద విచారించి, శిక్షించే అధికారం విదేశీయులకు ఎంత మాత్రం లేదు. పైగా నేరం జరిగిందటున్నది ఆరేళ్లకింద. అప్పటికి కోర్టు పుట్టలేదు. అది ఉటంకిస్తున్న చట్టమూ పుట్టలేదు. ఆ చట్టమూ, ఆ కోర్టూ పుట్టటానికి పూర్వం ఎప్పుడో జరిగిన అపరాధానికి వేరే దేశంలో వేరే దేశపు పౌరుడిపై కేసు పెట్టి ఖైదులో వేయటం అన్యాయం, అక్రమం అని బాధితుడి బంధువులు సుప్రీం కౌన్సిల్‌కు మొరపెట్టుకున్నారు. కౌన్సిల్‌లోని ముగ్గురు సభ్యులూ వారు చెప్పేది న్యాయమని అంగీకరించి, ఖైదీని వెంటనే విడిచి పెట్టాలని సుప్రీం కోర్టుకు ఉత్తర్వు చేశారు.

ఏం లాభం? ఆ ఆదేశాలను మన్నించే వారే లేకపోయారు. సుప్రీం కౌన్సిల్ ఆజ్ఞాపించినా సరే ఖైదీని వదలవద్దని వారన్ హేస్టింగ్స్ సిపాయిలను ఆదేశించాడు. తెల్లవాడు పెట్టిన సుప్రీం కౌన్సిల్ అధికారాన్ని కౌన్సిల్ సభ్యుడైన గవర్నర్ జనరలే తూష్ణీకరించినా తెల్లప్రభువులు కిమ్మనలేదు. ఈ ధిక్కారాన్ని ఫిలిప్ ఫ్రాన్సిస్ బృందం బ్రిటిష్ ప్రభుత్వానికి విన్నవించి, గవర్నర్ జనరల్‌పై అభియోగంలో కీలక సాక్షిని హతమార్చేందుకు జరుగుతున్న దురాగతాన్ని అడ్డుకోమని మొత్తుకుంది.

అది అరణ్యరోదనే అయింది. సుప్రీం కౌన్సిల్ సభ్యులు వద్దువద్దన్నా లెక్కచేయ్యకుండా నందకుమార్‌ను వేల జనం నిశ్చేష్టులై చూస్తుండగా ఉరితీశారు. ఇండియాలో బ్రిటిష్ రాజ్యస్థాపనకు ఫోర్జరీతో పునాది వేసిన క్లయివ్‌నేమో నెత్తి నెక్కించుకుని ఘన సన్మానాలు చేశారు. తమదారికి అడ్డొచ్చిన నల్లవాడినేమో ఫోర్జరీ నేరం బనాయించి చంపారు. అదీ దొరల న్యాయం.

నందకుమార్‌నైతే అడ్డగోలుగా చంపించాడు గానీ, స్వదేశంలో తన దుర్నీతిపై వ్యతిరేకత వెల్లువెత్తకుండా హేస్టింగ్స్ ఆపలేకపోయాడు. అతడు వరుసగా చేసిన తప్పుడు పనులపై సుప్రీం కౌన్సిల్ సభ్యుల ఫిర్యాదులు చూసి బ్రిటిష్ ప్రధాని లార్డ్ నార్త్ మండిపడ్డాడు. వెంటనే వారన్ హేస్టింగ్స్‌ను వెనక్కి పిలిపించాలనుకున్నాడు. అయితే చట్టప్రకారం ఈస్టిండియా కంపెనీ అడగకుండా గవర్నర్ జనరల్‌ను ప్రభుత్వం రికాల్ చేయడానికి వీలులేదు. ఆ కంపెనీ యజమాన్యమేమో ప్రధానమంత్రే పట్టుబట్టినా హేస్టింగ్స్ రీకాల్‌కు సిఫార్సు చేయలేదు. దానిపై ప్రధాని భగ్గుమని ఏకంగా కంపెనీ భరతమే పట్టడానికి పార్లమెంట్‌ను ప్రత్యేకంగా సమావేశపరచాలనుకున్నాడు. దాంతో కంపెనీ దొరలకు దిమ్మతిరిగి అంతకుముందే తెప్పించి ఉంచిన హేస్టింగ్స్ రాజీనామా పత్రాన్ని ప్రభుత్వానికి పంపారు. గవర్నమెంటు వెంటనే దాన్ని ఆమోదించి కొత్త గవర్నర్ జనరల్‌గా వేలర్‌ను నియమించింది. ఆయనవచ్చి చార్జీతీసుకునేంత వరకూ ఆ బాధ్యత నిర్వహించమని కౌన్సిల్ మెంబరైన జనరల్ క్లావరింగ్‌ను కోరారు.

అక్కడితో వారన్ హేస్టింగ్స్ పని అయిపోయిందని అనుకుంటున్నారా? పొరపాటు. రాజుకన్నా మొండివాడు బలవంతుడు. సీమలో తన తోక కోసి సున్నం పెడుతున్న సమయంలోనే ఇక్కడ ఇండియాలో సుప్రీం కౌన్సిల్ మెంబరు మాన్సన్ మరణించాడు. దాంతో బలాబలాలు మారిపోయి కాస్టింగ్ ఓటుతో హేస్టింగ్స్ పట్టుచిక్కించుకున్నాడు. చడామడా పాత కౌన్సిల్ నిర్ణయాలన్నీ కొట్టి పారేసి నిరంకుశంగా చెలరేగసాగాడు.

హేస్టింగ్స్ రాజీనామా చేశాడని కదా బ్రిటిష్ ప్రభుత్వం వేరొకరిని నియమించింది?

వారన్ హేస్టింగ్స్ తాను అసలు రాజీనామాయే చేయలేదు. ఆ కాగితం లండన్‌కు తాను పంపలేదు; ఎలా వెళ్లిందో తెలియదు అని బుకాయించాడు. రాజీనామాయే లేదు; కనుక ఖాళీయే ఏర్పడలేదు; దానిని పూరించే ప్రశ్నే ఉత్పన్నం కాదు అని వితండవాదానికి దిగాడు. ఆ వ్యవహారం సుప్రీం కోర్టుకు వెళ్లింది. సదరు కోర్టులో ఉన్నవాళ్లంతా హేస్టింగ్స్ నేస్తులే. కాబట్టి అతడు చెప్పిందే రైటని తల ఊపారు. ఇక చేసేది లేక సీమనుంచి కొత్తగా దిగబడ్డ వేలర్ గవర్నర్ జనరల్ అయ్యే యోగం లేక కౌన్సిల్‌లో మామూలు సభ్యుడిగా సెటిలైపోయాడు. హేస్టింగ్స్ దురాగతాలపై అవిశ్రాంత పోరాటం చేసి భారతీయులకు న్యాయం చేయాలని శాయశక్తులా ప్రయత్నించిన ఫిలిఫ్ ఫ్రాన్సిస్ ఏకాకి అయిపోయి, బద్ధ విరోధితో విధి లేక రాజీపడ్డాడు.

వ్యతిరేకుల నోళ్లు నొక్కి సుప్రీం కౌన్సిల్‌ను తన చెప్పుచేతల్లోకి తెచ్చుకోవటంతో హేస్టింగ్స్ మళ్లీ పులి అయ్యాడు. గడ్డుకాలంలో తనను కాదని తన విరోధులవైపు మొగ్గిన వారినల్లా పగపట్టి వేటాడాడు. ఆ క్రమంలో అతడి బారినపడ్డ వారిలో వారణాసి జమీందారు చైత్‌సింగ్ ఒకడు.

వారణాసి మొదట అయోధ్య వజీరుకింద ఉండేది. 1776 ఒప్పందం ప్రకారం వజీరు దాన్ని కంపెనీకి కట్టబెట్టాడు. రాజా బలవంత్‌సింగ్ హయాంలో వారణాసి సిరిసంపదలతో పచ్చని పంటలతో కళకళలాడుతూ వైభవంగా ఉండేది. ఎక్కడెక్కడినుంచో తరలి వచ్చే భక్తులు కాశీ విశ్వనాథుడికి సమర్పించే కానుకల రాసులతో సుసంపన్నంగా ఉన్న ఆ రాజ్యాన్ని చూసి చాలా మందికి కళ్లుకుట్టేది. బలవంత్‌సింగ్ మరణానంతరం అతడి కుమారుడు చైత్‌సింగ్ రాజయ్యాడు. అతడూ ఇంగ్లీషువారితో స్నేహంగా ఉంటూ, కట్టాల్సిన కప్పాన్ని సక్రమంగా కడుతూ, ప్రజల బాగోగులు కనిపెడుతూ మంచిపేరు తెచ్చుకున్నాడు. ఖర్మం చాలక అతడు కాస్తా హేస్టింగ్స్‌కు కంటగింపు అయ్యాడు.

ఆ సమయంలో ఫ్రాన్సుకూ ఇంగ్లండుకూ యుద్ధం జరిగింది. సాలుకు ఐదు లక్షల రూపాయల ఖర్చుతో మూడు బెటాలియన్లను తమకు సమకూర్చాలని హేస్టింగ్స్ అడిగాడు. చైత్‌సింగ్ సరేనన్నాడు. రెండేళ్లయిందో లేదో ఇంకో ఐదు లక్షలు పెట్టి అశ్విక దళాన్ని తయారు చేసి ఇవ్వాలని కంపెనీ వారు ఆర్డరు వేశారు. జమీందారు అది తనవల్ల కాదన్నాడు. హేస్టింగ్స్‌కు సందు దొరికింది. మామాటే కాదంటావా అని నిప్పులు చెరుగుతూ వారణాసి మీదికి దండు వెడలాడు. అది తెలిసి చైత్‌సింగ్ బెంబేలెత్తి ఎదురువెళ్లి బక్సార్‌లో గవర్నర్ జనరల్‌ను దర్శించి, తన తలపాగా తీసి అతడి పాదాలవద్ద ఉంచి, శాంతించమని వేడుకున్నాడు.

కాని- అవతలివాడు వారన్ హేస్టింగ్స్. అతడిది పాము పగ. శాంతివాక్కులు విన్నట్టేవిన్నాడు. వారణాసి చేరాక మళ్లీ బుసకొట్టి జమీందారును బంధించి తెమ్మని రాజభవనానికి సిపాయిలను పంపాడు. ఈ అఘాయిత్యం చూసి ఊరుకోలేక జనం తిరగబడి వచ్చిన వారిని నరికేశారు. హేస్టింగ్స్ అగ్గిమీద గుగ్గిలంలా భగ్గుమని ఈసారి పెద్ద సైన్యాన్ని పంపాడు. చైత్‌సింగ్ చేసేదిలేక కట్టుబట్టలతో రాత్రికి రాత్రి కోటవదిలి పారిపోయాడు. దారుణ దురవస్థలపాలై దేశాంతరంలో దయనీయంగా మరణించాడు. అతడి స్థానంలో ఓ కుర్రవాడిని గద్దెనెక్కించి, కట్టాల్సిన కప్పాన్ని విపరీతంగా పెంచేసి అన్ని వర్గాల ప్రజలను పిశాచంలా పీడించి పచ్చటి వారణాసిని హేస్టింగ్స్ నిప్పచ్చరం చేశాడు. ఐదు లక్షల జనంతో




కళకళలాడిన కాశీ జనాభా 1822 కల్లా రెండులక్షలకు పడిపోయింది. పంటలూ పరిశ్రమలూ పాడై దాని ఆర్థిక వ్యవస్థ వెన్నువిరిగింది.

మునుముందు మొత్తం భారతదేశానికి పట్టనున్న దుర్గతికి అది సాంపిల్ మాత్రమే.

చైత్‌సింగ్‌ను వెంటాడినట్టే అయోధ్యలో ముసలి బూబులనూ వారన్ హేస్టింగ్స్ అమానుషంగా వేధించాడు. వజీరు అసఫుద్దౌలా ఉప్పదించటంతో స్వయానా అతడి అమ్మనూ, అమ్మమ్మనూ చెరలో వేసి నగానట్రా ఎక్కడ దాచింది చెప్పేదాకా అన్నం పెట్టకుండా మాడ్చి కోట్లరూపాయల సొత్తు నిలువునా దోచుకున్నాడు.

ఇలాంటి దుర్మార్గాలను ఎన్ని చేస్తేనేమి? వారన్ హేస్టింగ్స్‌ను దొరల దర్బారు కడుపులో పెట్టుకుని కాపాడింది. ఎడ్మండ్ బర్క్, షెరిడన్ లాంటి చాదస్తపు ప్రజాస్వామ్యవాదులు పట్టువదలకుండా అనేక సంవత్సరాలు గట్టిగా పోరాడి కామన్స్ సభ చేతైతే హేస్టింగ్స్ దోషి అని అభిశంసింపజేయగలిగారు. ఏం లాభం? కామన్లు ఒకటి తలిస్తే దొరలు వేరొకటి తలిచారు. నీతి, న్యాయం కంటే సామ్రాజ్యవాద స్వార్థ ప్రయోజనాలది పై చేయి అయ్యింది. 'దొరల సభ' (హౌస్ ఆఫ్ లార్డ్స్)లో అభిశంసన జయప్రదంగా ఎగిరిపోయింది. శుభం!

# హైదరాలీ

హిందూదేశాన్ని ఆక్రమించిన విదేశీయుల వరసలో ముస్లింల తరవాతి వారు ఆంగ్లేయులు. దీన్నిబట్టి ముస్లింలతో పోరాడి తెల్లవాళ్లు దేశాన్ని గెలుచుకున్నారని అనుకుంటే పొరపాటు. ఆరు శతాబ్దాల ఇస్లామిక్ ఆధిపత్యం అనంతరం మోసాలు, దగాలు చేసి దుర్మార్గంగా, దౌర్జన్యంగా దేశాన్ని దశలవారీగా కబళించే క్రమంలో మహమ్మదీయులతో పోరాడాల్సిన అవసరం ఇంగ్లీషు వారికి పెద్దగా పట్టలేదు. వారి యుద్ధాలన్నీ ముఖ్యంగా మహారాష్ట్రులు, జాట్లు, సిక్కులు, గూర్ఖాలు వగైరా హిందువులతోనే జరిగాయి. మొత్తం మీద చూస్తే ఆ కాలంలో నవాబులు, సుల్తాన్లు విదేశీ దురాక్రమణపై చెయ్యి ఎత్తడం కంటే దురాక్రమణదారులతో చేతులు కలపడమే ఎక్కువగా కనిపిస్తుంది. అయితే ఈ సాధారణ రీతికి మినహాయింపుగా చెప్పదగిన మహమ్మదీయ పాలకులూ కొందరున్నారు. వారిలో ముఖ్యంగా పేర్కొనవలసిన వారిలో హైదరాలీ ఒకడు.

హైదర్‌కూ ఇంగ్లీషు వారికీ మధ్య అనేక యుద్ధాలు జరిగాయి. వాటిలో ఏ ఒక్కదానిలోనూ తెల్లవాళ్లు గెలవలేదు. మహమ్మదీయులు ఆరు శతాబ్దాలు దేశంలో పెత్తనం చలాయించినా హిందూ రాజ్యమైన మైసూరును మాత్రం వారిలో ఏ ఒక్కరూ వశపరచుకోలేకపోయారు. మహామహా అక్బర్లు, ఔరంగజేబులవల్లే కాని పనిని హైదర్ అవలీలగా సాధించాడు. శక్తి సామర్థ్యాలకంటే ఎక్కువగా అదృష్టం అతడికి కలిసి వచ్చింది.

హైదరాలీకి రాజ్యం జన్మతః సంక్రమించింది కాదు. అతడు రాచబిడ్డ కాడు. చదువుకున్నవాడు కాదు. మామూలు కుటుంబంలో పుట్టి సామాన్య సిపాయిగా జీవితం మొదలెట్టి క్రమేణా సేనాపతి అయి కడకు రాజ్యాధిపత్యమే గుంజుకోగలిగాడు. తూర్పు, పశ్చిమ కనుమల కూడలిలోని, మైసూరు రాజ్యం వొడియార్ వంశ పాలనలో మూడు శతాబ్దాలు దివ్యంగా వెలిగి 18వ శతాబ్ది ప్రథమ పాదానికి క్షీణదశకు చేరింది. పాలెగాళ్లు, 'నాయకు'లు చెలరేగి అందిన కాడికి ఫొల్లుకుని స్వతంత్ర సంస్థానాలు స్థాపించారు. మహారాజు చిక్క కృష్ణరాజు అసమర్థుడై మంత్రుల చేతిలో కీలుబొమ్మ అయ్యాడు. దేవరాజు, నంజరాజులనే సోదరులు సైన్యాన్ని, పరిపాలనను గుప్పిట్లో పెట్టుకుని చక్రం తిప్పుతున్నారు. వారి సేనలో హైదర్ మామూలు సిపాయి. తిరుచినాపల్లి యుద్ధంలో అతడి పరాక్రమానికి సంతోషించి నంజరాజు అతడిని 1755లో దిండిగల్లు ఫౌజ్‌దారుగా నియమించాడు.

హైదర్ నిరక్షరకుక్షి. రాతకోతల వ్యవహారాలు చేసేందుకు అతడికి మనిషి కావలసి వచ్చాడు. ఖండేరావు అనే మరాఠా బ్రాహ్మణుడిని దివానుగా పెట్టుకున్నాడు. అతడు అసాధ్యుడు. పెద్ద పెద్ద వాళ్లతో మంచి పరిచయాలున్న వాడు. అతడికి మైసూరు రాజమాత తెలుసు. పేరుకు రాజయినా పెత్తనానికి నోచుకోని తన కుమారుడిని నంజరాజు చెరనుంచి తప్పించడానికి సమర్థుడి కోసం అప్పుడు ఆమె వెతుకుతున్నది. హైదరాలీ అందుకు తగిన మనిషని ఆమెకు తోచింది. ఖండేరావు ద్వారా కథ నడిపింది. 1759 మార్చిలో కుట్ర ఫలించింది.

హైదర్ మెరపులా కదిలి శ్రీరంగపట్నం కోటను ఆక్రమించి నంజరాజును గెంటేశాడు. రాజు చాలా ఆనందించి ఇక తన మాటకు ఎదురుండదని ఆశపడ్డాడు. కాని కథ అడ్డం తిరిగింది. నంజరాజు పోయినా రాజుకు పరాధీనపు బతుకు తప్పలేదు. పాత పెత్తందారును తరిమివేసి అతడి స్థానంలో కొత్త పెత్తందారు వచ్చి కూచున్నాడు.

పని పూర్తికాగానే తన దారిన తిరిగి పోకుండా హైదరాలీ సర్వాధికారిగా తిష్ఠవేయటం రాజుకూ, రాజమాతకూ నచ్చలేదు. మిగతా గొడవలు ఎలా ఉన్నా మనుపటి కంటకులు కనీసం హిందువులు. వారిని వదిలించుకోబోయి హిందువులను కాఫిర్లుగా చూసే మహమ్మదీయుడి చేతిలో రాజ్యాన్ని పెట్టామేమిటా అని రాచవారు తల పట్టుకున్నారు. మళ్లీ ఖండేరావును తమవైపు తిప్పుకుని కొత్త తంత్రం పన్నారు.

అవి పీష్వా బాలాజీరావు దక్షిణాన కన్నడ దేశానికి ప్రాబల్యం విస్తరించాలని బహుధా ప్రయత్నిస్తున్న రోజులు. బలవంతంగా అధికారం లాక్కున్న ముసల్మాను బారి నుంచి మైసూరు రాజ కుటుంబాన్ని రక్షించటానికి ఖండేరావు మరాఠాలను ఒప్పించాడు. మరాఠా సేనలు మైసూరుకు వెళ్లాయి. వాటి మెరపు దాడికి తట్టుకోలేక హైదరాలీ కుటుంబాన్ని కూడా విడిచి కట్టుబట్టలతో పారిపోయాడు. పెత్తనం ఖండేరావు చేతికి వచ్చింది. హైదరాలీ పని అయిపోయిందనే అందరూ అనుకున్నారు.

సరిగా ఆ సమయంలోనే మూడవ పానిపట్టు యుద్ధంలో అహ్మద్‌షా అబ్దాలీ చేతిలో మరాఠాలకు ఘోర పరాజయం సంభవించింది. మహాయోధులు దాదాపు అందరూ నేలకొరిగి, ఒక తరానికి తరమే తుడిచిపెట్టుకుపోయింది. దాంతో ఎక్కడెక్కడి సేనలనూ ఉన్న పళాన రాజధానికి తిరిగి రమ్మన్నారు. మరాఠాలు అర్ధంతరంగా వెనుదిరగడంతో హైదర్‌కి దశ తిరిగింది. బంధుమిత్రుల సాయంతో అతడు తెప్పరిల్లాడు. ముఖ్యులైన దండ నాయకులంతా తనతో చేతులు కలిపినట్టుగా దొంగ ఉత్తరాలు బనాయించి వాటిని ఖండేరావు చేతిలో పడేలా చేశాడు. అది నిజమే అనుకుని బెంబేలెత్తి ఖండేరావు యుద్ధరంగం వీడి శ్రీరంగ పట్నానికి పరారయ్యాడు. ఆ గందరగోళంలో అతడి సేనలను జయించి హైదర్ రాజధానిపై దండెత్తాడు. చేసేది లేక రాజు చేతులెత్తాడు. అలా 1761లో హైదర్ మళ్లీ మైసూరును వశపరచుకున్నాడు.

మరి ఖండేరావు ఏమయ్యాడు? హైదర్ మళ్లీ అతణ్ని తనకు ఒప్పగించమన్నాడు.

రాచవారు ఒప్పుకోలేదు. అప్పజెపితే అతడు ఖండేరావును ఖండాలుగా నరికేస్తాడని వారు భయపడ్డారు. అతడికి హాని చెయ్యను; నా పెంపుడు చిలుకలా చూసుకుంటాను అని హైదర్ వారికి మాట ఇచ్చాడు. స్వాధీన పరిచాక అచ్చం చిలుకలాగే అతడిని చూసుకున్నాడు! ఇనుప పంజరంలో బంధించి, చిలకకి పెట్టే తిండే పెట్టి, జీవితాంతం సతాయించాడు!

రాజ్యాన్ని జయించినా హైదర్ తనను రాజుగా ప్రకటించుకోలేదు. కీలుబొమ్మ రాజరికాన్ని మునుపటిలాగే కొనసాగించి, మనోవర్తి మాత్రం ఇచ్చి రాజును మూల కూచోబెట్టి సర్వాధికారాలు తాను చలాయించాడు. హైదర్‌ది కుశాగ్ర బుద్ధి. చదువు సంధ్యలు లేకపోయినా తెలివితేటలు అమోఘం. పిట్టల పోరును పిల్లి తీర్చినట్టుగా తన కాలంలో ఇంగ్లీషువారు బెంగాలులోనూ, ఇతరత్రా సంస్థానాల గొడవల్లోనూ తలదూర్చి, తెలివిగా పావులు కదిపి అందరినెత్తినా చెయిపెట్టి ఎలా బాగుపడుతున్నదీ హైదర్ జాగ్రత్తగా గమనించాడు. సమయం చిక్కినప్పుడు అవే ఎత్తులు తానూ వేశాడు. ప్రాబల్యం విస్తరించుకోవాలని ప్రయత్నిస్తున్న కాలంలో బంగారం లాంటి బేదనూరు సంస్థానం నడిచి వచ్చి అతడి నోట్లో పడింది.

బేదనూరు సంస్థానాన్నేలిన బసవప్ప నాయకుడు మరణించాక అతడి రాణి వీరమ్మాజి బాలుడైన దత్తపుత్రుడిని ప్రియుడి సాయంతో చంపించి రాజ్యం చేజిక్కించుకున్నదని జనం చెప్పుకుంటారు. తానే ఆ బాలుడినని, హత్యాయత్నం తప్పించుకుని పరారై ఇన్నాళ్లూ రహస్యంగా తల దాచుకున్నానంటూ ఎనిమిదేళ్ల తరవాత ఒక కుర్రాడు హైదరాలీని ఆశ్రయించాడు. తనకు సాయపడి తన రాజ్యం తనకు ఇప్పించాలని ప్రార్థించాడు. హైదర్ సరే అన్నాడు. అసలైన వారసుడి రాజ్యాధికారాన్ని నిలబెట్టటానికంటూ బేదనూరు మీదికి దండెత్తాడు.

వీరనారి వీరమ్మాజి పురుష వేషంలో స్వయంగా సేనలను నడిపించి సంవత్సరం పాటు భీకర యుద్ధం చేసింది. చివరికి ఓడిపోయి హైదర్ చేతిలో బందీ అయింది. హైదర్ విజయగర్వంతో నగరంలో అడుగుపెట్టి కోటలోని సంపదనంతా దోచుకున్నాడు. పన్నెండు కోట్ల రూపాయలకు పైగా సొత్తు చేతికి చిక్కటంతో హైదర్‌కు డబ్బు కరవు తీరింది. అనుకున్న ప్రకారం తనకు పట్టం కట్టి అతడు తన దారిన పోతాడని రాజకుమారుడు ఆశగా ఎదురు చూశాడు. హైదరాలీ అతడికి మొండి చేయి చూపాడు. వాడు అసలు వారసుడు కాదు - నకిలీ రాజకుమారుడు అని చల్లగా ప్రకటించి ఖైదులో వేసి సంపన్న సంస్థానాన్ని తన రాజ్యంలో కలిపేసుకున్నాడు. తన గుర్తుగా బేదనూరు పేరును హైదర్ నగర్‌గా మార్చాడు!

ఇలా మూడేళ్లపాటు సక్రమంగానో, అక్రమంగానో... యుద్ధాలు చేసో, వ్యూహాలు పన్నో హైదరాలీ చిన్నచితకా సంస్థానాలను వశపరచుకుని తన ఆధిపత్యాన్ని ఉత్తరాన తుంగభద్ర దాకా, పశ్చిమాన ఆరేబియా సముద్రం దాకా, తూర్పున నైజాం రాజ్యందాకా విస్తరించగలిగాడు. అంతవరకూ వింధ్యకు దక్షిణాన రాజకీయం మహారాష్ట్రులు, యూరోపియన్లు, నైజాంలనే మూడు స్కంధావారాల చుట్టూ తిరిగింది. 18వ శతాబ్ది ద్వితీయార్థంలో హైదరాలీ చొచ్చుకురావటంతో రసవత్తరమైన నాలుగు స్తంభాలాట మొదలైంది.

ఇందులోనూ అతి ప్రధానశక్తి మరాఠాలది. వారి ప్రాబల్యాన్ని నిలువరించేందుకు మిగతా పక్షాల నడుమ రకరకాల సమీకరణలు జరిగాయి. అనంతర కాలంలో ఇంగ్లీషు వారిపై కత్తి కట్టి కడదాకా భీషణ సంగ్రామం సాగించినప్పటికీ తొలి దశలో హైదరాలీకి తెల్లవారి



మీద చాలా భ్రమలుండేవి. వారితో రాజీలు పడి, నైజాంనూ కలుపుకొని మరాఠాలపై అతడు చాలా యుద్ధాలు చేశాడు. ఎలాగైనా మహారాష్ట్రులను పరాభవించాలని హైదరాలీకి మహా కోరికగా ఉండేది.

మహారాష్ట్రులకూ ఆదినుంచీ అతడంటే మంట. దానికి చాలా కారణాలున్నాయి. తమకు సామంతరాజ్యంగా ఉండి, 'ఛౌథ్' కప్పం కడుతూ తమ రక్షణలో ఉన్న మైసూరులో మహమ్మదీయుడొకడు అధికారాన్ని దౌర్జన్యంగా లాగేసుకోవటం మరాఠాలకు సహజంగానే కంటగింపయింది. ఖండేరావుకు మద్దతుగా వెళ్లి పానిపట్టు యుద్ధం మూలంగా హుటాహుటిన వెనక్కి రావలసి వచ్చిన సందర్భంలో హైదర్ నుంచి తాము రాబట్టిన బారామహల్ పరగణాను తాము వెనుదిరగగానే అతడు తిరిగి లాగేసుకున్నాడు. పైగా పానిపట్టు ఘోరకలితో నవనాడులూ కుంగిన అస్తవ్యస్త స్థితిలో మరాఠాల బలహీనతను అలుసుగా తీసుకుని హైదర్ చెలరేగి అనేక మరాఠా ప్రాంతాలను కబ్జా చేశాడు.

ఇక ఉపేక్షించి లాభం లేదని పీష్వా మాధవరావు అతడిపై దండయాత్రకు దిగాడు. 1764 మొదలుకుని 1779 దాకా హైదర్‌కూ మరాఠాలకూ మధ్య అనేక యుద్ధాలు జరిగాయి. 1764లో రాతిహళ్లి యుద్ధం నుంచి 1771లో శ్రీరంగపట్నం సమీపాన సంగ్రామం దాకా మాధవరావు పీష్వా చేతిలో హైదర్ ప్రతిసారీ చావుదెబ్బలే తిన్నాడు. చావు తప్పి కన్ను లొట్టపోయిన స్థితిలో రఘునాథరావును బుట్టలో వేసుకుని తేలికపాటి షరతులతో సంధి కుదుర్చుకుని బయటపడటం, మళ్లీ సందు చిక్కినప్పుడల్లా మరాఠా ప్రాంతాలను దురాక్రమణ చేయటం, మళ్లీ యుద్ధంలో మట్టి కరవటం అతడికి పరిపాటి అయింది. హైదర్ అదృష్టం బాగుండి పీష్వా మాధవరావు అకాల మృత్యువు పాలయ్యాడు. అనంతరం పుణె దర్బారులో అంతఃకలహాలు, పీష్వా నారాయణ రావు హత్య, తరువాత కొంతకాలం దాకా రఘునాథరావు ప్రభ వెలగటం హైదర్‌కు బాగా లాభించాయి. దర్బారు గొడవలు, అంతర్గత సమస్యలలో మరాఠాలు తలమునకలు కావడాన్ని ఆసరా చేసుకుని, విజృంభించి, గతంలో మాధవరావు వశపరచుకున్న ప్రాంతాలన్నిటినీ తిరిగి స్వాధీనం చేసుకోవటమేగాక అదనంగా బళ్లారి, కడప, గుత్తి, కర్నూలులను కూడా అతడు ఆక్రమించాడు.

పుణెలో పరిస్థితులు నెమ్మదిగా కుదుటపడ్డాక నానా ఫడ్నవిస్ తలచుకుంటే హైదర్ దురాక్రమణను తిప్పికొట్టి ఆ ప్రాంతాలను తిరిగి జయించగలిగేవాడే. అయితే రఘునాథరావును శిఖండిలా అడ్డుపెట్టుకుని ఇంగ్లీషువారు భారీఎత్తున సాగిస్తున్న కుటిల పన్నాగాలను సమర్థంగా ఎదుర్కోవాలంటే దేశీయ శక్తులను కూడగట్టడం అవసరమన్న దూరదృష్టితో దురాక్రమణలను ఉపేక్షించి, నానా అతడికి స్నేహ హస్తం చాచాడు. సామంతరాజ్యంగా మైసూరు తనకు కట్టాల్సిన కప్పాన్ని బాగా తగ్గించి... హైదర్ ఆక్రమించిన ప్రాంతాలను అతడికే వదిలేసే షరతుమీద చిరకాల వైరం తరవాత హైదర్‌కూ నానాకూ 1780లో సంధి కుదిరింది. విదేశీ దురాక్రమణదారులపై చరిత్రాత్మకమైన ఆ జాతీయ పోరాటం ఎలా సాగిందీ, హైదర్ చిచ్చర పిడుగులా తెల్లవారిని ఎలా ముప్పుతిప్పలు పెట్టిందీ ఇంతకు ముందు అధ్యాయంలో చూశాం.

హైదరాలీ ఇంగ్లీషువారి భరతం పట్టటం అదే మొదలు కాదు. మరాఠా జవనాశ్వాల ధాటికైతే నిలవలేకపోయినా, 'కంపెనీ' ఫిరంగులకు ఎదురొడ్డి అతడు వీరోచిత దిగ్విజయాలు చాలానే సాధించాడు. నానా ఫడ్నవిస్ వలె హైదర్ రాజనీతిజ్ఞుడు కాదు. మరాఠాలకున్నంతగా

దేశభక్తి, జాతీయభావం అతడికి ఉన్న దాఖలాలు కనపడవు. మరాఠాలనే తన ముఖ్య విరోధులుగా తలిచి, వారిని జయించటానికి ఇంగ్లీషువారి సహాయం పొంది, వారితో మంచిగా ఉండాలని అతడు చాలాకాలం ప్రయత్నించాడు. 1767లో వారు తనపై అకారణంగా కత్తిఎత్తి, బారామహల్ పరగణాపై దుర్మార్గంగా దాడిచేసినా, మిత్రభేద కుతంత్రాలతో నిజాంనూ, ఆర్కాట్ నవాబునూ తననుంచి వేరుపరచి, తనను ఏకాకిని చేసినా... తాను సంధికి సిద్ధమైనప్పటికీ ఒప్పుకోక తనను పగబట్టినట్టు వెంటాడినా హైదర్ రెచ్చిపోలేదు. మద్రాసు పొలిమేరదాకా దూసుకువెళ్లి తలచుకుంటే చెన్నపట్నాన్ని జయించి, ఇంగ్లీషువారిని కాలరాచివేయగలిగిన స్థితిలో కూడా ఆంగ్లేయుల పట్ల ఔదార్యం చూపి 1769 ఏప్రిల్‌లో కంపెనీ వారితో తనకు పెద్దగా ఫాయిదాలేని సంధి కుదుర్చుకున్నాడు. ఏం లాభం? తెల్లవారు అక్కర తీరగానే తమ సహజశైలిలో మైసూరు వీరుడిని మోసం చేశారు. మూడేళ్ల తరువాత మరాఠాలతోయుద్ధం వచ్చినప్పుడు ఇంగ్లీషువారి సైనిక సహాయం మీద హైదర్ పెద్ద ఆశలు పెట్టుకోగా డబ్బు లేదన్న సాకుతో దొరలు నిలువునా ముంచారు.

కుక్కతోక కంటే కంపెనీవారి బుద్ధి ఎక్కువ వంకర. ఆ సంగతి అనుభవపూర్వకంగా అర్థమయ్యాక హైదరాలీ అగ్గిపిడుగే అయ్యాడు. ఇక అతడు తెల్లవారిపై ఎత్తిన కత్తి దించలేదు. ఎక్కడా రాజీపడలేదు. 1780లో నానా చేసిన ప్రతిపాదనలకు అతడు మనస్ఫూర్తిగా అంగీకరించాడు. తనవంతు కర్తవ్యాన్ని అద్భుతంగా నిర్వర్తించి మద్రాసు ప్రెసిడెన్సీని ముట్టడించి, ఊరూవాడా తగులబెట్టి ప్రచండ ప్రతాపంతో శత్రుసంహారం చేసి ఇంగ్లీషువారికి ముచ్చెమటలు పోయించాడు. అతడు నమ్ముకున్న ఫ్రెంచివారు సమయానికి కదిలి అన్నప్రకారం నౌకాదళాన్ని మద్రాసు తీరానికి పంపివుంటే హైదరాలీ ఆంగ్లేయులను తరిమికొట్టి మద్రాసు కోటపై జండా ఎగురవేసేవాడే.

కానీ – పరాసులు మాటతప్పారు. విధి కూడా వక్రించింది. ఆంగ్లేయులపై హోరాహోరీగా పోరాడుతున్న సమయంలో యుద్ధం అత్యంత కీలకఘట్టంలో ఉండగా, హైదరాలీ జబ్బుపడి 1782 డిసెంబరు 7న 70 ఏళ్ల వయసులో ఆకస్మికంగా కన్నుమూశాడు.

హైదరాలీ చావు జాతీయ ఐక్యపోరాటానికి కూడా చావుదెబ్బ అయింది. 'కంపెనీ' ప్రలోభాలకు లొంగి నిజాం మధ్యలో జారుకున్నా... బేరార్ పాలకుడు, మాధవరావు సింధియాలు నమ్మక ద్రోహానికి పాల్పడ్డా... ఇంకా ఎన్ని ఎదురుదెబ్బలు తగిలినా నానా ఫడ్నవిస్ బేజారవలేదు. హైదరాలీ ఒక్కడు బాసటగా ఉంటేచాలు, తాము విదేశీయుల పీచమణచగలమని అతడు ధీమాగా ఉన్నాడు. హైదర్ అకాల మరణంతో ఆ ఆశా పోయింది. హైదర్ కుమారుడు టిప్పు తండ్రి పోరాటాన్ని కొనసాగిస్తాడన్న నమ్మకం లేక, ఇంకోదారి తోచక అప్పటికి ఏణ్నెల్లుగా పెండింగ్‌లో ఉంచిన సాల్బే సంధిని నానా ధ్రువీకరించాడు.

ఆ విధంగా ఉమ్మడి జాతీయ పోరాటం అభాసుగా ముగిసింది. తెల్లవారికి గండం గడిచింది.





# టిప్పుసుల్తాన్ మతోన్మాదా?

టిప్పుసుల్తాన్.

ఆ పేరు చెబితే అందరికీ హడలు.

ఇంగ్లీషువారికి మరీనూ. ఆ కాలంలో సీమ దొరసానులు ఏడ్చే పిల్లలను సముదాయించటానికి 'టిప్పు వచ్చి పట్టుకుపోతాడు' అని భయపెట్టేవారట.

పసి పిల్లలకే కాదు. కొమ్ములు తిరిగిన విదేశవాళీ చరిత్ర పండితుల దృష్టిలో కూడా టిప్పు అనేవాడు బూచాడే! మతోన్మాదం పొరలు కమ్మిన నీచ, నికృష్ట, నరరూప రాక్షసుడే.

So many instances have been given of the atrocities which Tipu committed in the name of religion... In this respect he rivalled Mahmud of Ghazni, Nadir Shah and Alauddin- all of whom were famous for the number of infidels slaughtered by their orders.

[***Haidar Ali and Tipu Sultan*** - **Lewin Bowring.** *p.226*]

మతం పేరిట టిప్పుసుల్తాన్ చేసిన అత్యాచారాలకు ఎన్నయినా ఉదాహరణలివ్వవచ్చు... ఈ విషయంలో అతడు కాఫిర్లను ఊచకోత కోయించి ఘనతకెక్కిన గజనీ మహ్మద్, నాదిర్‌షా, అల్లా ఉద్దీన్‌లకు సమఉజ్జీ.

– అంటాడు ప్రసిద్ధ ఆంగ్ల చరిత్రకారుడు **లెవిన్ బౌరింగ్.** గజనీ మహ్మద్, నాదిర్షాలు ఎలాంటివారో... దేవాలయాలను కూల్చి హిందువులను వేల సంఖ్యలో నిష్కారణంగా హతమార్చి, మతోన్మాదంతో ఎన్నెన్ని అఘాయిత్యాలను సాగించారో మనకు తెలుసు. హిందూ మతాన్ని ద్వేషించి, వెంటపడి, వేటాడి మెడపై కత్తి పెట్టి లక్షల మందిని బలవంతంగా మతం మార్పించి, ఒప్పుకోని వారిని నరికి పోగులు పెట్టించిన ఆలయ విధ్వంసకుడు అల్లాఉద్దీన్ ఘనతనూ చరిత్రలో చదివాం. మరి టిప్పుసుల్తాన్ కూడా ఈ కోవలోని వాడేనా?

నిజమే. గజనీ మహ్మద్ లాగే, అల్లాఉద్దీన్ ఖిల్జీలాగే టిప్పు కూడా వేల మందిని చంపించాడు. వేల మందిని అమానుషంగా వేధించి, దారుణ అత్యాచారాలకు గురి చేసి, బలవంతంగా మతం మార్పించాడు. కెనరా ప్రాంతంలో ఏకంగా యాభైవేల మంది క్రైస్తవులను, అలాగే మలబార్‌లో వేల సంఖ్యలో నాయర్లను, కూర్గులను అతడు ఎన్నెన్ని యాతనలు పెట్టిందీ చరిత్ర గ్రంథాలు తిరుగులేని రుజువులతో ఘోషిస్తాయి. "కూర్గ్ ప్రజల మీద దాడిచేసి అందిన వారినల్లా కత్తికి ఎరచేయండి. మొత్తం అందరినీ బందీలుగా పట్టుకోండి. స్త్రీలు, పిల్లలు సహా అందరినీ ముసల్మాన్లుగా మార్చండి" అని కూర్గ్‌లో సేనానికి పంపిన ఆదేశాన్ని బట్టే అతడి హయాంలో మతాంతరీకరణల స్థాయి విస్పష్టమవుతుంది. దేవుడి దయతో దైవ సహాయంతో అవిశ్వాసులందరినీ ఈ నేలమీద నుంచి నిర్మూలించేందుకు తాను కృతనిశ్చయమైనట్టు మొగల్ పాదుషాకు పంపిన సందేశమైనా... కాఫిర్ల భూమిని వదిలేసి... ముసల్మాన్ల కోసం తాను స్థాపించిన పవిత్ర రాజ్యంలోకి వచ్చి పవిత్రంగా జీవించమని దేశం ఇతర ప్రాంతాల మహమ్మదీయులకు పలికిన స్వాగతమైనా టిప్పులోని మతావేశాన్నే సూచిస్తాయి.

అయితే... ఇలాంటి అనేక దృష్టాంతాలను బట్టి టిప్పు పరమ కిరాతకుడైన పరమత ద్వేషి అని నిర్ధారణ చేయగలమా? స్వతహాగా అతడు మతోన్మాది అయితే దూరాన కెనరా జిల్లాలో, మలబార్‌లో, కూర్గ్‌లో తన ఆధిపత్యాన్ని అంగీకరించకుండా తిరుగబడ్డ జనంపై సాగించిన దారుణ దురాగతాలను సొంత రాజ్యంలో హిందువుల మీదా అదే స్థాయిలో జరిపించి ఉండాలి కదా? గజనీ మహ్మద్, అల్లా ఉద్దీన్, ఔరంగజేబువలె హైందవ దేవాలయాలను ధ్వంసంచేసి, విగ్రహారాధకులను తక్కువ రకం పౌరుల్లా చూసి, రకరకాలుగా వేధించి ఉండాలి కదా? ప్రాణభయంతోటో ప్రలోభాలవల్లో మైసూరు హిందువులు పెద్ద సంఖ్యలో మతం మారి ఉండాలి కదా? మత కంటకుడు పెట్టే తిప్పలకు తాళలేక మిన్నులదిరేలా జనం హాహాకారాలు చేసి ఉండాలి కదా?

ఇంగ్లీషు చరిత్రకారులు అడిగితే – ఔను అవన్నీ జరిగాయనే అంటారు. ***The Cambridge History of India*** ను రాసిన హట్టన్ దొర అభిప్రాయం ప్రకారం టిప్పు కిరాతకుడు. తన తండ్రి బలవంతంగా అధికారం గుంజుకున్న రాజ్యంలోని హిందువులను క్రూరంగా పీడించిన మహమ్మదీయ మతోన్మాది. ***Historical Sketches of Southern India*** గ్రంథాన్ని రచించిన కర్నల్ విల్క్స్ దృష్టిలో టిప్పు మధ్యయుగంనాటి మత మౌఢ్యాన్ని భయానకంగా అనుసరించి... హిందువుల్లో ఎంతటి గొప్పనూ గుర్తించకుండా, ముస్లింల్లో ఎంతటి తప్పునూ శిక్షించకుండా దారుణ పక్షపాతం చూపి తన రాజ్యంలో ప్రతి హిందువుకూ తానంటే జుగుప్స కలిగించిన పాపాత్ముడు.

అవునా? నిజంగానే అపర ఔరంగజేబులా టిప్పు మైసూరు హిందువులను కాల్చుకు తిన్నాడా?

టిప్పు సుల్తాన్ అవలక్షణాలు ఎంచాలంటే కావలసినన్ని. అతడు అహంకారి. తనను తాను సర్వజ్ఞుడినని భ్రమించి ప్రపంచంలో ప్రతి విషయం మీదా అంతిమ తీర్పు ప్రకటించగలననుకునే అవివేకి. ఖర్చు దగ్గర పరమ లోభి. స్త్రీలను మనుషుల్లా చూడని కుసంస్కారి. తరతరాలుగా అనుసరిస్తున్న మాతృస్వామ్య వ్యవస్థను, వైవాహిక సంబంధాలను తనకు నచ్చని కారణంగా మార్చుకుని తీరాలని మలబార్ నాయర్ల జాతిని నానాక్షోభపెట్టి



వేల ప్రాణాలు తీసిన క్రూరుడు.

ఇలాంటి దోషాలు ఎన్ని ఉన్నా, టిప్పుసుల్తానుకు అనేక శాస్త్రాల మీద, సంక్లిష్ట ప్రపంచ వ్యవహారాల మీద గల పరిజ్ఞానాన్ని చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. పాలనా రీతుల్లో అతడు అనుసరించిన ఆధునిక పద్ధతులు సమకాలిక ప్రభుత్వాలకంటే చాలా మెరుగు. ఆ కాలపు పోకడకు తగ్గట్టు శత్రు వర్గాలనుకున్న వాటి మీద ఎంత క్రౌర్యం చూపినా మతం విషయంలో, ముఖ్యంగా హిందువుల విషయంలో టిప్పు క్రూరుడు కాదు. కెనరాలో క్రైస్తవుల మీదా, మలబార్‌లో నాయర్లమీదా అతడు రాక్షసంగా విరుచుకుపడింది తనకు ఎదురు తిరిగారన్న రాజకీయ కక్ష కారణంతోనే తప్ప మతద్వేషంతో కాదు. నాయర్లపై అతడి దురాగ్రహంలోనూ వారి బహుభర్తృత్వ ఆచారంపైనా, మహిళలు అనాచ్ఛాదితంగా తిరగడంపైనా వ్యతిరేకతే ఎక్కువగా కనిపిస్తుంది. మొత్తంగా హిందూమతంమీద విద్వేషంతో కత్తి ఎత్తి, పరిపాలనలో, ముస్లింల పట్ల పక్షపాతం చూపి, హిందువులను దుర్విచక్షణకు గురిచేసి, అన్ని విధాలుగా అణగదొక్కి, బలవంతపు మత మార్పిడులను సాగించాడన్న నేరాలను అతడికి ఆపాదించటం అన్యాయం.

ఔరంగజేబు, అల్లావుద్దీన్ల పాలనలోవలె టిప్పు రాజ్యంలో మహమ్మదీయేతరులపై జిజియా పన్ను ఏదీ లేదు. భూమి శిస్తు, వృత్తి వ్యాపారాలపై పన్నులు, శాసనాలు పౌరులందరికీ సమానమే. పరిపాలనలో ముస్లింల ఎక్కువా లేదు; హిందువుల తక్కువా లేదు. పెళ్లిళ్లు, ఆస్తి హక్కులు వగైరా సివిల్ వ్యవహారాల్లో ముస్లింలు షరియత్ ప్రకారమూ, హిందువులు తమ ధర్మ శాస్త్ర, సంప్రదాయాల ప్రకారమూ నడుచుకోవలసి ఉండేది. ఇందుకు సంబంధించి నిర్ణయాలు చేయటానికి ప్రతి పరగణాకూ ఒక కాజీ, ఒక పండితుడు ఉండేవారు. శ్రీరంగపట్నంలోని హైకోర్టులో అపీళ్లు చూసేందుకు ఇద్దరు జడ్జిలు ఉండేవారు. ఒకరు హిందువు, రెండో వ్యక్తి మహమ్మదీయుడు. హిందువుల్లో మతపరమైన, ఆచారాలకు, సంబంధించిన వివాదాలను హిందూ న్యాయమూర్తే విచారించేవాడు.

విదేశీ చరిత్రకారులు ఆరోపించినట్టు టిప్పు సుల్తాన్‌కు బంధుప్రీతి, మత పక్షపాతం ఉన్నట్టయితే అతడి దర్బారు నిండా అతడి బంధుమిత్రులైన మహమ్మదీయులే ఉండేవారు. కీలక స్థానాల్లోకి హిందువులను రానిచ్చేవారు కాదు. వాస్తవానికి టిప్పు హయాంలో ముఖ్య పదవుల్లో గణనీయసంఖ్యలో హిందువులు ఉండేవారు. సుల్తాను పనుపున కీలకమైన రాయబారాలు, దౌత్యాలు చక్కబెట్టింది అప్పాజీరావు, శ్రీనివాసరావులు. మొగల్ దర్బారులో టిప్పు వకీళ్లు మూల్‌చంద్, సుజన్ రాయ్‌లు, సైనిక కమాండర్లలో ప్రముఖులైన హరిసింగ్, రామారావు, బికాజీ సిందియా, శివాజీలు హిందువులే. ఫైనాన్సు, రెవిన్యూ, ట్రెజరీ విభాగాల్లో ముఖ్య స్థానాలూ హిందువులవే. వీరందరికీ మించి టిప్పుకు కుడిభుజం అనదగ్గ పూర్ణయ్య పదహారణాల హిందువు. ఆర్థిక వ్యవహారాలు చక్కబెట్టిన కృష్ణారావు కూడా హిందువే. పరిపాలన ప్రధానంగా వీరిద్దరి చేతుల మీదే నడిచేది. పొరుగున ఉన్న నైజాంలో ముఖ్యవజీరు ఎప్పుడూ హిందువే. కాగా మహమ్మదీయుడైన టిప్పు రాజ్యంలో పాలన చక్రాన్ని పూర్ణయ్య తిప్పటం చిన్న విషయం కాదు.

నిజానికి ఈ పూర్ణయ్య, కృష్ణారావులే కీలక ఘట్టాల్లో రాజ్యాన్ని కాపాడారు. ముఖ్యంగా హైదరాలీ మరణించిన సమయంలో. అనేక తరాలనుంచీ ఒకే వంశం ఏలుబడిలో ఉన్న రాజ్యాల్లోనే అధికార వారసత్వం విషయంలో గొడవలు రావటం కద్దు. అందునా ముస్లిం

రాజ్యాల్లో సుల్తాను మరణించాడంటే చాలు తదుపరి అధికారం ఎవరన్నదానిపై అనిశ్చితి, గందరగోళం తలెత్తి కుటుంబ కలహాలకు, రక్తపాతాలకు దారితీయటం పరిపాటి. సుస్థిరమనుకున్న మహా మొగలు దర్బారులోనే, నైజాం అన్నదమ్ముల మధ్యే అంతర్యుద్ధాలు, తిరుగుబాట్లు తప్పనప్పుడు కేవలం కొద్ది సంవత్సరాల కింద సింహాసనాన్ని బలవంతంగా ఆక్రమించిన హైదరాలీ మరణిస్తే పరిస్థితి ఎలా ఉంటుందో ఊహించవచ్చు. మరణించిన వాడికే గద్దెమీద హక్కులేనప్పుడు, అతడు పోయాక అతడి కుమారుడి వారసత్వ హక్కును మాత్రం ఎవరైనా ఎందుకు గుర్తించాలి? అదీగాక - పరిపాలించినది హైదరాలీయే అయినా అధికారికంగా అతడు పాలకుడు కాదు. నామకఃప్రభువు అయిన మైసూరు రాజు వేరే ఉన్నాడు. అతణ్ని కీలుబొమ్మను చేసి గుప్పిట్లో పెట్టుకుని ఇరవై ఏళ్లకు పైగా హైదరాలీ చక్రం తిప్పాడు. మహారాష్ట్రలో సతారా రాజు పేరిట పీష్వాలు రాజ్యం చేసినట్టు మైసూరులో రాజు ప్రతినిధిగా హైదర్ పెత్తనం చేశాడు. మైసూరు దసరా ఉత్సవాల్లో అతడు పక్కన ఒదిగి నిలబడి రాజుకు ఇవ్వాల్సిన గౌరవం ఇచ్చేవాడు. తమనుంచి అధికారం లాక్కున్నవాడు మరణించాక రాచవారు అతడి వారసుడికి కూడా లోబడి ఉండాల్సి పని లేదు. జనాభాలో నూటికి 90 మంది హిందువులే కాబట్టి తమ చిరకాల ప్రభువులు అధికారపు పగ్గాలను తిరిగి చేతుల్లోకి తీసుకుంటామంటే ప్రజలు వద్దనరు.

అందునా–హైదర్ మరణించింది మామూలు సమయంలో కాదు. భీకర యుద్ధం నడి మధ్యలో. అతడు తలపడిందేమో ఉచ్చనీచాలెరుగని ఇంగ్లీషు మాయావులతో. యుద్ధంలో రాజు మరణవార్త తెలియగానే సేనలు కకావికలమై పారిపోవటం రివాజు. తమకు సింహస్వప్నమైన హైదర్ కన్నుమూశాడని తెలిస్తే అంతదాకా అతడి చేతిలో చావు దెబ్బలు తింటున్న తెల్లవారికి పట్టపగ్గాలుండవు. తాము ఆరితేరిన టక్కుటమార విద్యలన్నీ ప్రయోగించి అంతకుముందు అనేక సంస్థానాలవలె మైసూరునూ ఎగరేసుకుపోవాలని వారు ప్రయత్నించక మానరు. ఇవన్నీ ఒక ఎత్తు అయితే ఉత్తరాధికారి అయిన హైదర్ కుమారుడు సమయానికి అందుబాటులో లేకపోవటం ఇంకో ఎత్తు. కెనరా, మలబార్‌లను ఆకస్మికంగా ఆక్రమించిన ఇంగ్లీషువారిని తరిమివేయటానికి తండ్రి ఆజ్ఞపై టిప్పు కేరళ వెళ్లాడు. అతడు తిరిగి వచ్చేలోగా ఏమైనా కావచ్చు.

ఇదీ అప్పటి పరిస్థితి. అప్పుడూ పూర్ణయ్యే ప్రధానమంత్రి. ఆయన, కృష్ణారావు తలచుకుంటే రాజ కుటుంబంతో మాట్లాడుకునో, తిరుగుబాటు చేసో హైదర్ వంశాధికారాన్ని తుదముట్టించగలిగేవారే. కాని జరిగిందేమిటి ?

హైదరాలీ జబ్బుపడి 1782 డిసెంబర్ 7 రాత్రి చిత్తూరు దగ్గర నరసింగరాయునిపేట శిబిరంలో నిద్రలో మరణించగానే అతడి పక్కనే ఉన్న మంత్రులు మెరుపులా కదిలారు. వెంటనే తిరిగి రమ్మని మలబార్‌లోని టిప్పుకు కబురుపెట్టారు. అతడు తిరిగి వచ్చేదాకా సుల్తాను మరణవార్తను అతి రహస్యంగా దాచిపెట్టారు. శవాన్ని చెడిపోకుండా రసాయనాలు పూసి పెద్ద పెట్టెలో భద్రపరచి, చూసేవారికి ఏదో ఖజానాను మోసుకుపోతున్నారన్న భ్రమ కలిగించి, శ్రీరంగపట్నానికి తరలించారు. హైదర్ బతికి ఉన్నట్టే తెరలు వేసిన ఖాళీ పల్లకిని యుద్ధరంగంలో సైన్యం వెంట తిప్పి, మామూలు పరిపాలనను యథాప్రకారం కొనసాగించారు. హైదర్ మరణించిన నాలుగురోజులకు టిప్పుకు కబురు అందింది. అక్కడ ప్రత్యామ్నాయ ఏర్పాట్లన్నీ చేసి అతడు తిరిగి రావటానికి ఇంకో మూడు వారాలు పట్టింది.



అంత కాలమూ బయటికి వార్త పొక్కకుండా, కుట్రలు తలెత్తకుండా కాపాడి టిప్పుచేతికి అధికారం అప్పగించినవారు హిందువులు.

దానికి తగ్గట్టు టిప్పుకూడా వారి పట్ల కృతఘ్నత చూపలేదు. తండ్రికంటే ముస్లిం మతాభిమానం ఎక్కువ ఉన్నవాడైనా దానిని హిందువుల పట్ల ద్వేషంగా వికటించనివ్వకుండా తన హద్దుల్లో తానున్నాడు. విగ్రహారాధన ఇస్లాం విశ్వాసానికి విరుద్ధమైనా హిందూ దేవాలయాలను వర్ధిల్లనిచ్చాడే తప్ప గజనీ మహమ్మదులా, ఔరంగజేబులా దారుణ విధ్వంసాలకు పాల్పడలేదు.

ఇందుకు నిదర్శనాలకోసం ఎక్కడిదాకో వెళ్లనక్కర్లేదు. శ్రీరంగపట్నం కోట లోపలే సుప్రసిద్ధ రంగనాథస్వామి కోవెల ఉంది. ఆ సమీపంలోనే శ్రీనరసింహ, శ్రీగంగాధీశ్వర ఆలయాలుండేవి. రోజూ వేల మంది ఆ గుళ్లకు వెళ్ళి పూజాదికాలు చేస్తుండేవారు. తన రాజమహలుకు కొన్ని వందల గజాల దూరంలోనే నిత్యం గుడిగంటలు మోగుతూ, విగ్రహమూర్తులకు అర్చన మంత్రాలతో పరిసరాలు మారుమోగుతున్నా అభ్యంతరం చెప్పని సుల్తానును పరమత ద్వేషి అని ఎలా అనగలం?

విగ్రహారాధనను కేవలం సహించడమే కాదు, టిప్పుసుల్తాన్ హిందూ దేవళాలకు స్వయంగా కానుకలు కూడా సమర్పించుకున్నాడు. పూర్వం మైసూరు రాజులు పెట్టిన ఒరవడిని అతడు నిరభ్యంతరంగా కొనసాగించాడు. నారాయణస్వామి గుడికి పన్నెండు ఏనుగులను, ఆభరణాలను, బంగారు, వెండి పాత్రలను అతడు బహూకరించాడు. నంజన్‌గూడులోని శ్రీ కంఠేశ్వరాలయానికి, శ్రీరంగపట్నం రంగనాథస్వామికి "టిప్పుసుల్తాన్ పాదస" బహూకరించిన నగలు, పాత్రలు ఇప్పటికీ ఉన్నాయట. నంజన్‌గూడులో "పాదుషా లింగం" అతడి ఆదేశాలపైనే ప్రతిష్ఠించారంటారు. గుళ్లను పడగొట్టకపోవటమేకాక - నమ్ముతారో లేదో- టిప్పుసుల్తాన్ స్వయంగా ఒక గుడిని కట్టించాడు. 1790లో కర్నాటకపై దండెత్తినప్పుడు కాంజీవరంలో ఒక దేవాలయ నిర్మాణానికి అతడు పదివేల నాణేలు విరాళం ఇచ్చాడు. అక్కడ రథోత్సవంలో స్వయంగా పాల్గొని, బాణాసంచాకైన ఖర్చును తానే భరించాడు.

ఔరంగజేబు హయాంలో ఆలయాలు పడగొట్టటానికి ప్రత్యేకంగా ఒక డిపార్టుమెంటు ఉండగా టిప్పుసుల్తాన్ హయాంలో ఆలయాల అజమాయిషీకి ప్రత్యేకంగా ఒక శాఖ ఉండేది. గుళ్లకు, మఠాలకు చెందిన ఆస్తుల మంచి చెడ్డలు అది చూసేది.

'ది టైగర్స్ ఆఫ్ మైసూర్' గ్రంథంలో ప్రాక్సీ ఫెర్నాండెజ్ రాసిన ఈ మాటలే చాలు టిప్పుసుల్తాన్ పరమత ద్వేషి ఔనో కాదో చెప్పటానికి :

...Tipu himself sanctioned land grants to temples and Brahmins. The Swami of Pushpagiri Math was given the inam of Thongapalli and Gollapalli Village... When Thomas Munro was appointed the Collector of Bara Mahal... the pujaris of Rayakottai temple produced before him a sanad issued by Tipu Sultan granting them a regular cash allowance. An interesting sanad was the order passed by Tipu restoring the discontinued puja of the Anjaneyaswar temple at Pullivendula in Cuddapah

district... In a most fascinating Sanad found in the Parakalla Math, Tipu Sultan arbitrated in a temple dispute...

[*The Tigers of Mysore*, **Praxy Fernandes**, *p. 213*]

(ఆలయాలకు ప్రత్యేకంగా ఒక డిపార్టుమెంటును పెట్టి ఉన్న ఆస్తులు కాపాడటంతో బాటు టిప్పు స్వయంగా ఆలయాలకు, బ్రాహ్మణులకు మాన్యాలు ఇచ్చేవాడు. పుష్పగిరి మఠం స్వామికి తొంగపల్లి, గొల్లపల్లి గ్రామాల ఇనాం అతడిచ్చిందే... థామస్‌మన్రో బారామహల్ కలెక్టరుగా ఉన్నప్పుడు రాయకోట ఆలయం పూజారులు తమకు రెగ్యులర్‌గా నగదు భృతిని మంజూరు చేస్తూ గతంలో టిప్పుసుల్తాన్ జారీచేసిన సనదును చూపించారు... కడప జిల్లా పులివెందులలోని ఆంజనేయస్వామి కోవెలలో ఆపేసిన పూజను కొనసాగించవలసిందన్నది టిప్పు ఇచ్చిన ఇంకో ఆసక్తికరమైన సనదు... అన్నింటికంటే విశేషమైనది పరకాల మఠంలో వడగళై, తంగళై తెగల మధ్య వివాదాన్ని పరిష్కరిస్తూ అతడు జారీచేసిన ఉత్తర్వు.)



# మరాఠాల పులిస్వారీ

***"You are the Jagadguru,' wrote Tipu in 1793. "You are always performing penance in order that the whole world may prosper, and the people may be happy. Please pray God for the increase of our prosperity. In whatever country holy personages like yourself may reside that country will flourish with good showers and crops". Strange world for an allegedly "fanatic" Muslim to address to a Hindu religious dignitary!***

[*The Tigers of Mysore*, **Proxy Fernandes**, *p. 212*]

'మీరు జగద్గురువులు. అఖిల ప్రపంచం వర్ధిల్లాలనీ ప్రజలంతా సంతోషంగా ఉండాలనే మీరెప్పుడూ జపతపాలు చేస్తుంటారు. మేము ఇంకా బాగా వృద్ధిలోకి రావాలని దయచేసి దేవుడిని ప్రార్థించండి. తమవంటి మహానుభావులు ఎక్కడ నివసిస్తారో ఆ దేశం సుభిక్షంగా సస్యశ్యామలంగా విలసిల్లుతుంది' అని 1793లో శృంగేరి జగద్గురువుకు టిప్పు రాశాడు. ముస్లిం మతోన్మాది అని ముద్రపడినవాడు ఒక హిందూ మతాచార్యుడిని ఇలా సంబోధించటం వింతకాదూ?' – అన్నాడు 'ది టైగర్స్ ఆఫ్ మైసూర్' గ్రంథంలో ప్రాక్సీ ఫెర్నాండెజ్.

శృంగేరిలో ఉన్నది ఆదిశంకరులు స్థాపించిన దక్షిణామ్నాయ పీఠం. దక్షిణ భారతదేశంలోని హైందవ పీఠాల్లో అగ్రగణ్యమైనది. అది సరిగ్గా టిప్పుసుల్తాన్ రాజ్యంలో ఉన్నది. అతడికే కనుక గజనీ, ఔరంగజేబుల అంశ ఉన్నట్టయితే సోమనాథుడికీ, కాశీ విశ్వనాథుడికీ పట్టినగతే శృంగేరి శారదమ్మవారికీ ప్రాప్తించి ఉండాల్సింది. ధర్మ ప్రచారంలో, మత సంబంధ వ్యవహారాల్లో తురక ప్రభువు నుంచి శంకర పీఠానికి వేధింపులు, ఆరళ్లు అడుగడుగునా ఎదురై ఉండాల్సింది.

కాని– ఆశ్చర్యం! అన్ని మతాలను సమానంగా గౌరవిస్తామని చెప్పుకునే ఈ కాలపు

కాని - తారాబాయిది అంత తేలికగా ఓటమిని అంగీకరించే తత్వం కాదు. వచ్చినవాడు నకిలీ వారసుడన్న పన్నాగం పారకపోవడంతో ఆమె కొత్త వాదం లేవదీసింది. తనకు వారసుడయ్యే యోగ్యత శంభాజీకి లేదని చెప్పి అవసాన దశలో శివాజీయే అతడిని ఖైదు చేశాడనీ... ఆయన ఇష్టానికి వ్యతిరేకంగా తన భర్త రాజారాం, తాను కలిసి కష్టపడి ప్రస్తుత మరాఠా సామ్రాజ్యాన్ని పునర్నిర్మించామనీ... కాబట్టి ఆ శంభాజీ కొడుకుకు తమ సింహాసనం మీద ఏ మాత్రం హక్కులేదని ఆమె ఖండితంగా చెప్పింది. తనకు, తన కుమారుడికి విధేయులుగా ఉంటామని మరాఠా ముఖ్యుల చేత పాలు, అన్నం మీద ప్రమాణాలు చేయించింది. సతారాకు వస్తున్న సాహును మధ్యలోనే అడ్డగించటానికి సేనాధిపతి ధనాజీ యాదవ్‌ను పెద్ద సైన్యంతో తరలించింది కూడా.

బలాలను బేరీజు వేస్తే తారాబాయి భారీ సేన ముందు సాహు బలగం ఎందుకూ చాలదు. యుద్ధం చేస్తే ఓటమి ఖాయం. కాని - అనుకోనిది జరిగింది. భీమా నదీ తీరాన ఖేడ్‌లో భారీఎత్తున మోహరించి ఉన్న ధనాజీ సమీపానికి ఎవరినీ వెంట తీసుకోకుండా సాహు ఒక్కడే ఏనుగు మీద వెళ్లి 'న్యాయ ప్రకారం మీ రాజును నేను; నాకు విధేయులుగా ఉండటం మీ విధి' అన్నాడు. అతడి రాజసాన్ని చూడగానే వారూ వీరూ అనుకుంటున్నట్టు ఆగంతకుడు నకిలీ కాదని సేనాపతికి అర్థమైంది. సాహుయే అసలు రాజు అని తన అంతరాత్మ చెబుతున్నా... వస్తున్నది నకిలీ వేషగాడని రాజమాత తారాబాయి గట్టిగా అంటున్నందున అవునేమోనన్న సందేహం ధనాజీలో ఉండేది. నేరుగా సాహుయే ఎదుటపడటంతో అనుమానం తొలగి రాజభక్తి ఉప్పొంగింది. తనతో తలపడటానికి వచ్చిన సేనాపతే తనకు విధేయత తెలపడంతో సాహుకు తారాబాయి సేన దాదాపు మొత్తం వశమైంది.

సేనాపతి ధనాజీ ద్రోహానికి భగ్గున మండిన తారాబాయి సతారా కోటను రక్షించే బాధ్యతను 'ప్రతినిధి' పరశురామ్ పంత్‌కు అప్పగించి కుమారుడిని తీసుకుని పన్హాలాకు పరారైంది. దారిలో చిన్న పెద్ద కోటలను స్వాధీనపరచుకుని సాహు ససైన్యంగా సతారానైతే ముట్టడించాడు. తలుపులు తెరిచి కోటను అతడికి ఒప్పగించడానికి పరశురామ్ పంత్ నిరాకరించాడు. దౌర్జన్యంగా కోటను ఆక్రమించడానికి సాహుకు మనసొప్పలేదు. తారాబాయి ఎంతైనా పినతండ్రి భార్య కదా! అప్పటికే 'పిట్టలు' ఎగిరిపోయిన సంగతి అతడికి తెలియదు. పినతల్లి లోపలే ఉన్నదని అనుకున్నాడు. బలప్రయోగం ఇష్టంలేక కోట బయటే దండు విడిసి ఏమి చేయాలో పాలుపోక కాలహరణం చేస్తున్న దశలో ఒక మరాఠా పెద్ద ముత్తయిదువ అనుకోకుండా అతడికి కర్తవ్యబోధ చేసింది. ఓ రోజు సాహు వేటకు వెళ్ళి దారితప్పి రాత్రివేళ ఓ పల్లెకు చేరగా...

The Patil's wife, an aged lady, offered him for supper some boiled rice. Shahu, with a hunter's appetite hastily took a mouthful and burnt himself. His hostess, ignorant of her guest's identity observed, "you are behaving like King Shahu. Instead of reducing the countryside he wastes his time, trying to take the capital. In the same way, you instead of taking the rice at the edge of your plate, where it is cool, take it from the middle where it is still too hot to eat."

[***Comprehensive Histroy of the Maratha Empire,* Kincaid &Parasnis** - *Vol.II p. 126*]

ఆ ఊరి పాటిల్ భార్య అతడికి వేడివేడిగా అన్నం వడ్డించింది. రోజంతా వేటాడి మంచి ఆకలి మీద ఉన్న సాహు ఆత్రంగా తినబోయి నోరు కాల్చుకున్నాడు. అతడెవరో తెలియని పెద్దావిడ 'నువ్వూ సాహు రాజులాగే చేస్తున్నావు. అతడు చుట్టూ ఉన్న రాజ్యాన్ని స్వాధీనం చేసుకోకుండా రాజధానిని పట్టుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. అలాగే నువ్వూ కొంచెం చల్లగా ఉండే అంచు నుంచీ మొదలెట్టి తినకుండా మధ్యన మహావేడిగా ఉన్న అన్నాన్ని తినాలనుకుని నాలుక కాల్చుకుంటున్నావు' అంది.

సాహుకు తన తప్పేమిటో తెలిసింది. మర్నాడే రంగంలోని దూకి, కొద్ది బలగాన్ని కోట ముట్టడికి ఉంచి మిగతా సేనతో చుట్టు పట్ల ఊళ్లను ఆక్రమించి, అన్ని వైపుల నుంచీ దిగ్బంధం చేసి సతారా కోటను చుట్టుముట్టాడు. లోనివారు లొంగిపోలేదు. ఇక ఊరుకుంటే లాభం లేదనుకుని కోట లోపల దళవాయి షేక్ మీరా భార్యబిడ్డలను వారి ఊరి నుంచి లాక్కొచ్చి ఫిరంగులకు వేలాడదీయించాడు. లొంగిపోక పోయారో మీ వాళ్లను ముక్కలు చేస్తానని బెదిరించాడు. షేక్ మీరా వణికిపోయి దారికొచ్చాడు. కోట తలుపులు తెరుచుకున్నాయి. సాహు విజయోత్సాహంతో లోనికి అడుగుపెట్టి 1708 జనవరిలో రాజలాంఛనాలతో సింహాసనమెక్కాడు. అధికార వర్గంలో పెద్దగా మార్పులు చేయకుండా తనకు విధేయత ప్రకటించిన ముఖ్యులను దాదాపుగా అవే పదవులలో కొనసాగనిచ్చి అందరి మన్నన పొందాడు. అధికారం మార్పిడి సాఫీగా జరిగిందని, శివాజీ సంప్రదాయం అవిచ్ఛిన్నంగా కొనసాగిందని సామాన్య జనం కూడా సంతోషించి సాహో! సాహు అన్నారు. తారాబాయి డీలాపడి కొద్ది మంది ముఖ్య అనుచరులతో పన్హాలా కోటలో తలదాచుకుంది. ఆమె పని అయిపోయిందని అందరిలాగే సాహు కూడా అనుకున్నాడు. అదే అతడి కొంప ముంచింది.

తారాబాయి పట్టుదల, పరాక్రమం తెలిసిన వారెవరూ ఆమె ప్రతికూల పరిస్థితులకు బేజారై సన్యాసం పుచ్చేసుకుంటుందని నమ్మరు. శత్రుశేషాన్ని విడిచి పెట్టకూడదన్న వివేకంతో జాగుచేయక తొలి ఊపులోనే సాహు ఆమెను వెంటాడి, కోరలు పూర్తిగా పీకేసి ఉండాల్సింది. కాని - మొగలు సంస్కృతిని జీర్ణించుకొని ఆది నుంచీ భోగలాలసతకు అలవాటు పడ్డ సాహు విలువైన కాలాన్ని వృధా చేశాడు. ఈలోపు తారాబాయి కాలుచెయ్యి కూడదీసుకుని మరాఠా ప్రముఖుల్లో అనైక్యత తెచ్చి వీలయినంత మందిని తనవైపు తిప్పుకోవడానికి పథకాలు పన్నింది. ముఖ్యంగా పశ్చిమ కనుమల ప్రాంతంలోని చాలా మంది సేనానులపై వ్యక్తిగతంగా తారాబాయికి గట్టి పట్టు ఉన్నది. రామచంద్ర అమాత్యుడి సాయంతో ఆమె వారిని కూడగట్టసాగింది. సాహు ఎట్టకేలకు పన్హాలా పైకి దండెత్తినా అతడు కోటను పట్టుకునేలోపే తారాబాయి రంగ్నాకు పలాయనమైంది. సకాలంలో ముట్టడించి ఉంటే ఆ కోటను కూడా సాహు స్వాధీనపరచుకోగలిగేవాడే. అనవసరపు కాలయాపన వల్ల దీర్ఘకాలం ముట్టడించినా,

సోకాల్డ్ సెక్యులర్ ప్రభుత్వాల కంటే టిప్పుసుల్తాన్ హయాంలోనే శృంగేరి పీఠం ఎక్కువ గౌరవానికి నోచుకుంది! ఎక్కువ ప్రోత్సాహానికి పాత్రమైంది.

ఉదాహరణకు- ధర్మభ్రష్టులైన హిందువులపై విచారణ చేయటానికి శృంగేరి జగద్గురువులకు కావలసిన సహాయం అందించమని టిప్పుసుల్తాన్ 1794లో సయ్యద్ మహమ్మద్ అనే సర్దారుకు ఉత్తర్వు చేశాడు. (ఈ సందర్భంలోనే ఇంకో సంగతి. ముస్లిం మత పక్షపాతానికి పేరుపడ్డ నైజాం నవాబులు కూడా- ఈ విషయంలో మన కాలపు సెక్యులర్ ప్రభువులకంటే నయమే. అన్ని వర్ణాల హిందువులు తమ మతాచారాలను, ఇతర విధులను సక్రమంగా నిర్వర్తిస్తున్నదీ లేనిది నిర్ణయించే అధికారం శృంగేరి మఠాధిపతికి ఉన్నదని, ధర్మ సంబంధ విషయాల్లో శృంగేరి శంకరాచార్యుల ఆజ్ఞను తన రాజ్యంలో ఎవరూ ధిక్కరించరాదని 1843లో నైజాం నవాబు ఉత్తర్వు చేశాడు. వారసులు లేకుండా మరణించిన శిష్యుల ఆస్తిపాస్తులు శృంగేరి పీఠానికి చెందాలని అంతకు పూర్వపు నవాబు ఫర్మానా).

ఇంకా చిత్రమేమిటంటే- హిందువులకు పరమ పవిత్రమైన శంకరపీఠం మీద హిందువులయిన మరాఠాలు దాడి చేసి ఔరంగజేబు తరహాలో విధ్వంసం సాగిస్తే, మహమ్మదీయుడైన టిప్పుసుల్తాన్ నష్టపరిహారం చెల్లించి, ఆలయాన్నీ మఠాన్నీ తన ఖర్చుతో మరమ్మత్తులు చేయించి పునరుద్ధరించాడు. 1791లో జరిగింది ఈ నమ్మలేని విచిత్రం. మూడవ మైసూరు యుద్ధ సందర్భంలో మహారాష్ట్ర సర్దారు రఘునాథరావు పట్వర్ధన్ మైసూరు రాజ్యభాగమైన షిమోగా మీదికి దండెత్తి, పనిలోపనిగా ఆ సమీపంలో ఉన్న శృంగేరి మఠంపైనా దాడిచేశాడు. మఠాన్ని కొల్లగొట్టి, పలువురు బ్రాహ్మణులను చంపి, శారదాలయంలో నగానట్రా దోచుకుని, అమ్మవారి పవిత్ర మూర్తిని సైతం పెకలించి మరాఠా దండు నానా ఆగం చేసింది. వారి పీడకు తాళలేక జగద్గురువు సచ్చిదానంద భారతి మహాస్వామి మఠం విడిచిపోయి వేరే ఊళ్లో తలదాచుకుని టిప్పుసుల్తాన్‌కు సందేశం పంపారు. విషయం తెలిసి టిప్పు చాలా బాధపడ్డాడు. అంతటి పవిత్ర స్థలం మీద అలాంటి అకృత్యానికి ఒడిగట్టిన వాళ్లు పాప ఫలితం అనుభవించి తీరతారని స్వామి జాబుకు జవాబులో అతడన్నాడు. వెంటనే మఠానికి కావలసిన డబ్బు ఇచ్చి, పునర్నిర్మాణానికి అవసరపడే వస్తువులందించి, ఆలయ పునరుద్ధరణ, సంప్రోక్షణాదులకు సాయపడవలసిందిగా బేదనూరులోని తన అధికారిని సుల్తాన్ ఆదేశించాడు. విగ్రహ పునఃప్రతిష్ఠ జరిగాక మఠంవారు కృతజ్ఞతాపూర్వకంగా పంపిన శాలువను, ప్రసాదాన్ని అందుకున్నాడు. తిరిగి అమ్మవారికి వస్త్రాలు, కానుకలు పంపాడు. మైసూరు స్టేటు ఆర్కియాలజీ డైరెక్టరుగా ఉన్న దివాన్ బహదూర్ నరసింహాచార్‌కి 1913లో శృంగేరి మఠంలో లభ్యమైన చరిత్రాత్మక లేఖల్లో 1791-93 మధ్య సుల్తాన్‌కు, మఠానికి నడిచిన ఉత్తర ప్రత్యుత్తరాలు బయటపడి, ఈ సంగతులు లోకానికి వెల్లడయ్యాయి. ఆ సందర్భంలో శృంగేరి మహాస్వామికి రాసిందే ఈ వ్యాసం మొదట్లో ఉటంకించిన లేఖ.

ఇదంతా వింటే ఎవరికైనా ఒక సందేహం వస్తుంది. హిందూ మత పీఠాల పట్ల, హిందువుల విశ్వాసాలు, మతాచారాల పట్ల ముస్లిం ప్రభువుల్లో చాలా చాలా అరుదైన ఇంతటి సౌమ్యతను కనపరచిన టిప్పుసుల్తాన్ మీద మరాఠాలు ఎందుకు కత్తిగట్టారు? ముస్లిం నిజాంతోనూ, క్రైస్తవ 'కంపెనీ'తోనూ చేతులు కలిపి, పగబట్టి వేటాడి, టిప్పును





వారు ఎందుకు సర్వనాశనం చేశారు?

వీరసావర్కర్‌ను అడిగితే ఇలా చెబుతారు:

టిప్పుసుల్తాన్ పరమత ద్వేషానికి పూనుకుని, కాఫిర్లందరినీ ముస్లింలుగా మార్చి తీరతానని నిండుకొలువులో ప్రకటించాడు. హిందువులందరికీ ఇస్లాం దీక్ష ఇవ్వాలని, అందుకు ఇష్టపడని హిందువులను చంపి, వారి స్త్రీలను ముస్లింలకు ఉంపుడు గత్తెలుగా, దాసీలుగా పంచిపెట్టమని తన అధికారులను ఆదేశించాడు. మత భ్రష్టీకరణ అత్యాచారాలకు అతడి రాజ్యంలో ఉన్న మొత్తం హిందువుల్లో హాహాకారాలు చెలరేగాయి. టిప్పు స్వయంగా మలబారు మీద దండెత్తి లక్ష మంది హిందువులను ఇస్లాం మతంలోకి మార్చాడు. కర్ణాటక మీద, మహారాష్ట్ర మీద కూడా అతడు దండెత్తాడు. ధార్వాడుకు దిగువన తిరువాన్కూరు వరకు గల ప్రాంతంలో లక్షలాది హిందూ స్త్రీ పురుషులను టిప్పు సైనికులు, గూండాలు, మౌల్వీలు అత్యంత క్రూరంగా మత భ్రష్టుల్ని చేశారు. అప్పుడు హిందువులు చేసిన ఆర్తనాదాలు విని హిందూ ధర్మరక్షణకు కంకణం కట్టుకున్న మహారాష్ట్రుల రాజధాని పూనాలో క్రోధాగ్ని జ్వాలలు లేచి మైసూరు మహిషాసుర సంహారానికి పూనుకోవాలని నిర్ణయం జరిగింది.

భారత ఇతిహాసంలోని ఆరు స్వర్ణపత్రాలను ఉల్లేఖిస్తూ సావర్కర్ రాసిన గ్రంథంలోని ఐదో స్వర్ణపత్రంలో పేర్కొన్న వివరాలివి. ఇది చదివితే భ్రష్టాచారాల బారినుంచి హిందూ మతాన్ని రక్షించాలన్న ధర్మదీక్షతోనే మరాఠాలు టిప్పుపై ధర్మయుద్ధం సాగించారన్న అభిప్రాయం కలుగుతుంది. సావర్కర్ గొప్పవాడే. ఆయన దేశభక్తి, ధర్మనిరతి, మేధాశక్తి కూడా గొప్పవే. ఆయన ఇతర గ్రంథాలలాగే 'స్వర్ణ పత్రాల' గ్రంథం కూడా దేశభక్తులకు, ధర్మవీరులకు అవశ్యపఠనీయమే. అందులో తెలుసుకోవలసిన చారిత్రక సత్యాలు ఎన్నో ఉన్నమాటా నిజమే. కానీ- టిప్పుసుల్తాన్‌పై మరాఠాలు చేసిన దుర్మార్గపు దాడిని పవిత్ర మతయుద్ధంగా చిత్రించటం మాత్రం ముమ్మాటికీ తప్పు.

అదే నిజమైతే- ముస్లిం మతోన్మాదుల బారినుంచి ఆపన్న హిందూ ప్రజానీకాన్ని రక్షించటానికి టిప్పుపై మరాఠాలు తలపెట్టిన యుద్ధానికి నైజాంకు చెందిన మరో ముస్లిం సేనను సాయంగా వెంటేసుకు పోయేవారు కాదు. భ్రష్టాచారాల నుంచి హిందూ మతాన్ని కాపాడలన్నదే నిజంగా మరాఠాల ధ్యేయమైతే అదే హిందూ మతానికి చెందిన శృంగేరి శంకర మఠంలో ఏ హిందువూ కలనైనా ఊహించకూడని దారుణ భ్రష్టాచారాలకు తామే పాల్పడే వారు కాదు. వాస్తవానికి మైసూరు రాజ్యంలో హిందువులకూ, వారి ఆలయాలకూ మత సంస్థలకు టిప్పు వల్ల పెను ముప్పు ఏమీ లేదని, మరాఠాలు చేతులు కలిపిన నిజాం రాజ్యంలో కంటే మైసూరు హిందువుల పరిస్థితి చాలా మెరుగని- ఇంతకు ముందు ఇచ్చిన వివరాలను బట్టే ఎవరికైనా అర్థమవుతుంది. టిప్పు ముఖ్యంగా హింసించింది, దారుణ దురాగతాలు సాగించింది అతడు శత్రు ప్రాంతాలుగా పరిగణించిన కెనరా, మలబార్, కూర్గ్ ప్రాంతాల ప్రజలపైన. వారిపై కూడా అతడికి ఉన్నది కేవలం మత ద్వేషమని చెప్పలేము. అదే నిజమైతే- తమ మత సంబంధ విధులను నిర్లక్ష్యం చేస్తున్న మైసూరు క్రిస్టియన్లను దారిలో పెట్టటానికి కేథలిక్ ప్రీస్టులను పంపించమని గోవాలోని ఆర్చిబిషప్‌కు టిప్పు లేఖ రాసేవాడు కాదు. కెనరా క్రిస్టియన్లను వేటాడి, బలవంతంగా సున్తీలు చేయించి, స్వస్థలాలనుంచి పెకలించి ప్రవాసంలో చిత్రహింసలకు గురిచేసి అర లక్ష మందికి పైగా

మరణానికి టిప్పు కారకుడవటం క్షమించరాని మహాపరాధమే. అయితే ఎక్కడో క్రైస్తవులపై జరిగిన అత్యాచారాలకు పుణెలోని మరాఠా హిందువులు కత్తులు దూసి ధర్మయుద్ధం ప్రకటించారనడం హాస్యాస్పదం.

ఇక మలబార్ నాయర్లు హిందువులే. వారు బహుభర్తృత్వం ఆచారాన్ని మానాలని, ఒళ్లు కనబడేలా స్త్రీలు తిరగకూడదని క్రూరంగా నిర్బంధించి, మాట విననందుకు అమానుషంగా హింసించి, బలవంతంగా మతం మార్పించి, అందుకు ఒప్పుకోని వారిని ప్రాణాలు తీసి టిప్పు చేసింది ఘోరమే. కానీ అలాంటి ఘోరాలకు అతడొక్కడే కాదు. ఆ కాలంలో మహమ్మదీయ ప్రభువులెందరో తమ రాజ్యాల్లో పాల్పడ్డారు. వారిలో ఎవరి మీదా మరాఠాలు మతయుద్ధం ప్రకటించలేదు. అన్నట్టు- టిప్పు తండ్రి హైదరాలీ కూడా అదే మలబార్‌లో అదే నాయర్ల తిరుగుబాటును అణచే సందర్భంలో (1766లో) ఊళ్లపై పడి, ఇళ్లు, ఆస్తులు తగలబెట్టి, పంటలు ధ్వంసం చేసి వేలకు వేల మందిని మహాక్రూరంగా చెట్లకు ఉరితీశాడని- ***Karnama-i-Haideri*** లో అతడి ఆస్థాన చరిత్రకారుడే వర్ణించాడు. దానిని హిందూ మతంపై దాడిగా మరాఠాలు పరిగణించలేదు. పైగా అంత క్రూరంగా వేల హిందువుల ప్రాణాలు తీసిన హైదర్‌తోనే జాతీయ ప్రయోజనాల దృష్ట్యా ఇంగ్లీషువారి భరతం పట్టటం కోసం నానాఫడ్నవిస్ సంధి చేసుకుని, గతాన్ని విస్మరించి చేయి కలిపాడు. దానివల్ల దేశానికి చాలా మేలు జరిగింది.

ప్రశ్నేమిటంటే- విశాల జాతిహితం కోసం హైదర్ తప్పులు క్షమించి, అతడు ఆక్రమించిన తమ ప్రాంతాలపై హక్కును కూడా వదిలేసుకుని, అతడితో కలిసి విదేశీ శత్రువుపై ఐక్య కూటమి కట్టిన మరాఠాలు అతడి కుమారుడిని మాత్రం బద్ధవైరిగా ప్రకటించి ఎందుకు కక్షకట్టారు? 1780లో తెల్లవారిపై ప్రారంభించిన జాతీయ ఐక్యపోరాటం అప్పటికి అయిపోలేదు. హైదర్ మరణించినా, మరాఠాలు విధిలేక ఆంగ్లేయులతో సాల్బే సంధిపై కుదుర్చుకున్నా విదేశీ రాహువు బెడద దేశానికి తొలగలేదు. కుంపిణీ కుతంత్రాలు, కుటిలత్వాలు ఆగలేదు. దక్షిణాదిన ఇంగ్లీషు వారికి సింహస్వప్నంగా ఉన్న మైసూరుతో సఖ్యత జాతీయ శక్తుల ఐక్యతకు చాలా అవసరం. అది తెలిసి కూడా- హైదర్‌తో కుదుర్చుకున్న అవగాహనను అతడి కుమారుడితో మరాఠాలు ఎందుకు కొనసాగించలేదు? అతడిని కలుపుకొని వెళ్లాలని ఎందుకు ప్రయత్నించలేదు? దేశం ఏమైపోయినా సరే, విదేశీయులు బాగుపడి జాతిని కబళించినా సరే- టిప్పును వధించి, అతడి రాజ్యాన్ని నాశనం చేయటం అతి ముఖ్యమని మరాఠాలు ఎందుకు తలిచారు? 1780కూ 1782కూ మధ్య రెండేళ్లలో వారి వైఖరి అంతగా కరకుబారటానికి భౌతిక పరిస్థితుల్లో వచ్చిన మార్పేమిటి?

ఇంకో సంగతి. టిప్పు సుల్తాన్‌లోకి ఒక వేళ ఔరంగజేబు ఆత్మ ఆవేశించి కాఫిర్లపై ఘోరఘాతుకాలను సాగించమని పురికొల్పినా వాటన్నిటినీ సాగించటానికి టిప్పుసుల్తానుకు వ్యవధి లేదు. 1783 జనవరిలో యుద్ధం మధ్యలో తండ్రి ఆకస్మిక మృతితో గద్దెనెక్కింది మొదలుకుని 1799 మేలో శ్రీరంగపట్నం ముట్టడిలో మరణించేదాకా అతడి సమయమంతా ఇంగ్లీషువారి దెబ్బలను కాచుకోవటంతోటే, ఎదురు దెబ్బలు తీయటం తోటే, కోల్పోయిన భూభాగాలను తిరిగి వశపరచుకుని సరిహద్దులను పటిష్ఠ పరచుకునే యత్నాలతోటే, సైనిక వ్యూహాత్మకంగా కీలకమైన కొత్త ప్రాంతాలకు తన ప్రాబల్యాన్ని విస్తరించటానికి భీకర యుద్ధాలు చేయటంతోటే సరిపోయింది. దేశంలోని ప్రతి ప్రాంతీయ, రాజకీయశక్తీ అస్తిత్వం కోసం పెనుగులాడుతూ శత్రువుల సవాళ్లతో నిరంతరం సతమతమవుతున్న అనిశ్చిత, సంక్షుభిత పరిస్థితుల్లో తీరికూర్చుని మతాంతరీకరణలను ఉద్యమంగా సాగించే తీరిక ఎంతటి మతోన్మాదికీ ఉండదు.



అయితే- దీని అర్థం టిప్పు సుల్తాన్ తప్పులు అసలే చేయలేదని కాదు. మరాఠాలు అకారణంగానే అతడిపై శత్రుత్వం బూనారనీ కాదు. టిప్పువల్ల తప్పులు చాలానే జరిగాయి. ఉదాహరణకు- హైదరాలీ ఆక్రమించిన కృష్ణ - తుంగభద్ర నదుల మధ్య ప్రాంతాలను అతడే అట్టేపెట్టుకోవటానికి 1789 సంధిలో మరాఠాలు అంగీకరించారు. ఆ రకంగా నర్గుండ్ సంస్థానం మైసూరుకు వశమైంది. అది చెల్లించాల్సిన కప్పాన్ని టిప్పు గద్దెనెక్కగానే విపరీతంగా పెంచేశాడు. నర్గుండ్ దేశాయి (జాగిర్దారు)గా ఉన్న భావే అది తనకు శక్తికి మించినదని మొరపెట్టుకున్నా, నానా ఫడ్నవిస్ కలగజేసుకుని వారించినా వినకుండా 1785 మార్చిలో టిప్పు నర్గుండ్‌ను ముట్టడించాడు. దేశాయికి అండగా నానా సేనను పంపాడు. మరాఠాల ధాటికి తాళలేక టిప్పు చేతులెత్తి నయవంచనకు పాల్పడ్డాడు. సంధి చేసుకున్నట్టే చేసుకుని, పరిహారం షరతులకు సమ్మతించినట్టే నటించి మరాఠా సేనలు కృష్ణదాటి వెళ్లగానే మళ్లీ నర్గుండ్ మీద పడ్డాడు. మర్యాదగా లొంగిపోతే ఏమీ చేయనని దేశాయికి మాట ఇచ్చి తీరా అతడు సకుటుంబంగా కోట బయటికి వచ్చాక అతడి కూతురిని చెరబట్టి మిగతా వారిని దారుణ అవమానాల పాలు చేసి ఖైదులో వేశాడు. నర్గుండును నాశనం చేశాక అక్కడికి సమీపంలో ఉన్న కిత్తూరు మీద పడి అక్కడా ఇలాగే దారుణ దురంతాలు సాగించాడు. స్త్రీలను చెరచి, పురుషులకు బలవంతంగా సున్తీలు చేయించి అతడు పెట్టిన బాధలకు తట్టుకోలేక, బలవంతపు మతం మార్పిడి ఇష్టంలేక కృష్ణ, తుంగభద్రల నడుమ రెండు వేల మంది హిందువులు ఆత్మహత్య చేసుకున్నారు.

ఇది తెలిసి మరాఠాలకు ఒళ్లు మండటం సహజమే. తమకు చేసిన మోసానికి, హిందువులపై చేసిన ఘోరాలకు టిప్పుపై ప్రతీకారం తీర్చుకోవాలనుకోవటం సమంజసమే. వారు ప్రతీకారం బాగానే చేశారు కూడా. టిప్పుపై కోపగించిన నిజాం అలీని కూడగట్టి ఉమ్మడిగా దండెత్తి, భీషణ యుద్ధంలో తెగించి, 1787 ఏప్రిల్‌లో టిప్పు సుల్తాన్‌ను తమ కాళ్ల దగ్గరికి తెప్పించుకున్నారు. నర్గుండు, కిత్తూరు, బాదమిలను మరాఠాలకు స్వాధీన పరచి, ముప్పై లక్షల నగదును టిప్పు అక్కడికక్కడే పరిహారంగా చెల్లించాడు. ఇంకో 15 లక్షలు తరువాత చెల్లిస్తానంటే మరాఠాలు సరేనన్నారు.

ఆ తరువాత టిప్పు మళ్లీ మరాఠాల జోలికి పోలేదు. అనంతర కాలంలో అతడి దూకుడు చాలా తగ్గింది. ఇతర మతాల పట్ల మునుపటికంటే సౌమ్యత చూపి, ఒకేసారి అందరినీ విరోధులు చేసుకోవటం తనకే అనర్థమని గ్రహించి, దృష్టినంతా ప్రధాన శత్రువైన ఇంగ్లీషు కంపెనీ మీదే కేంద్రీకరించాడు. ఇండియాను మెల్లిమెల్లిగా మింగబూనిన ఆంగ్లేయుల గొంతులో వెలక్కాయలా అడ్డుపడి, తెల్లవారి పీడను విశ్వేషంగా నిర్మూలించటానికి విశ్వప్రయత్నం చేశాడు. శత్రువుకు శత్రువు మిత్రుడన్న రాజనీతిలో ఆంగ్లేయులకు విరోధి అయిన ఫ్రాన్సు చక్రవర్తికి, టర్కీ సుల్తానుకు రాయబారం పంపి సైనిక సహాయం కోరాడు. తెల్లవారితో అంతిమ యుద్ధానికి వ్యూహాత్మకంగా కీలకం కాబట్టే తిరువాన్కూరుపై దాడి చేశాడు. కంపెనీ కుటిలాత్ములకు వ్యతిరేకంగా తనతో చేయి కలపమని మరాఠాలనూ పలుమార్లు అడిగాడు.

కారుమబ్బులా కమ్ముకొస్తున్న ఇంగ్లీషు దురాక్రమణ బెడదను ఎదుర్కోవటానికి టిప్పుసుల్తాన్ దృఢదీక్షతో ముందుకురుకుతూంటే మరాఠా వీరులు ఏమి చేశారు? కార్న్వాల్లిస్ కింద తాము చొరవ తీసుకుని, హైదర్‌నూ నిజాంనూ ఇతరులనూ కలుపుకొని ఆంగ్లేయులపై మొదలెట్టిన ఐక్యపోరాటాన్ని తాము అర్ధాంతరంగా ఆపేసి తెల్లవారితో సిగ్గుచేటు సంధి కుదుర్చుకున్నప్పటికీ, హైదర్ కుమారుడు మాత్రం రాజీలేకుండా పోరాటం కొనసాగిస్తున్నందుకు సంతోషించారా? అనేక సంవత్సరాలుగా తమను నానా చికాకులు పెట్టి, తమ రాజ్యంలో కుట్రలు కూహకాలు చేసి, విద్రోహులను చేరదీసి, అన్ని విధాల తమను కుంగదీసి మింగజూస్తున్న తెల్లవారి పీడ వదిలించుకునేందుకు ఇదే అదనని గుర్తించి, కనీసం తమ దీర్ఘకాలిక స్వప్రయోజనాల దృష్టితోనైనా టిప్పుకు బాసటగా నిలిచారా? ఆ పని చేయకపోతే మానె... మైసూరు, 'కంపెనీ' పోరులో ఎవరు ఏమేరకు బలహీనపడినా తమకే లాభమన్న సంగతైనా గుర్తించి, ఎటూ మొగ్గకుండా కనీసం తటస్థంగానైనా ఉన్నారా?

లేదు! టిప్పుకు వ్యతిరేకంగా పోయిపోయి ఇంగ్లీషు వారితోనే మరాఠాలు కుమ్మక్కు అయ్యారు. దొంగలు దొంగలు ఊళ్లు పంచుకున్న రీతిలో మరాఠాలు, నిజాం, ఇంగ్లీషు వారు కలిసి, టిప్పును ఓడించి అతడి రాజ్యాన్ని తమలో తాము పంచుకోవటం కోసం 1799 జూన్ 1న పూనాలో కంపెనీ ప్రతినిధి చార్లెస్ మాలెట్‌తో సిగ్గు చేటు ఒప్పందం చేసుకున్నారు. తద్వారా చాలా తెలివిగా టిప్పు బెడదను నిర్మూలిస్తున్నామని మరాఠాలు భ్రమపడ్డారు. మూర్ఖంగా పులి స్వారీచేసి, చివరికి ఇంగ్లీషు పులి నోట్లో పడ్డారు.



# రుచిమరిగిన పులి

మనిషి నెత్తురు రుచి తెలియనంతవరకూ పులి మనిషి జోలికి పోదు. ఏ కారణంవల్లో ఒకసారి రుచి చూశాక మనిషే పులికి ప్రియమైన భోజనం.

మహాఘనత వహించిన ఇంగ్లీషు పులికి మొదట్లో ఇండియా రుచి తెలియదు. దేశ దిమ్మరులు కొంతమంది కలిసి ఓ కంపెనీ పెట్టి, తూర్పుకు పోయి వ్యాపారం చేసుకుంటాము ప్రభూ అంటే సరే అని బ్రిటిష్ ప్రభువులు అనుమతించారు. ఆ దూరాభారం వ్యాపారం వల్ల తమ ఖజానాకు కాస్తోకూస్తో గిట్టుబాటు కావటమే గొప్ప అని మొదట్లో అనుకున్నారు. వ్యాపారానికని పోయినవారు అక్కడి ప్రభువులతో తిన్నగా ఉండక రాజకీయాల్లో తలదూర్చి, తాహతుకు మించిన కూహకాలు నడుపుతున్నట్టు చూచాయగా తెలిశాక కోపపడ్డారు. కంపెనీ వ్యవహారాలు చక్కబెట్టే గవర్నర్లు ఎవరికి వారే సర్వాధికారులై తప్పుడు పనులు చేస్తున్నారని ఫిర్యాదులొస్తే వారి మీద గవర్నరు జనరలును పెట్టి, అతడూ తల ఎగరేయకుండా అతడి నెత్తిన ఓ సుప్రీం కౌన్సిలును పెట్టారు.

ఆ ప్రకారం తొలి గవర్నరు జనరల్ అయిన వారన్ హేస్టింగ్స్ అనే బతకనేర్చినవాడు దశాబ్ది కాలంలో ఏఏ రాజ్యాలను ఎలా కొల్లగొట్టిందీ, ఎంత మూటకట్టిందీ అతడి తోటివారే బయట వేశాక బ్రిటిష్ మారాజుల్లకు తల తిరిగింది. బ్రిటిష్ పార్లమెంటులో దీర్ఘకాలం నడిచిన వారన్ హేస్టింగ్స్ అభిశంసన సందర్భంగా ఇండియా సంపద ఎటువంటిదో, దానిని ఎన్నెన్ని విధాలా కంపెనీ ఉద్యోగులు దోచుకుంటున్నారో అర్థమయ్యాక బ్రిటిష్ ప్రభువర్గానికి నోరూరింది. ఇంగ్లీషు పులి ఇండియా రుచి మరిగింది. దాంతో భారతదేశ చరిత్రలో చీకటి అధ్యాయం మొదలైంది.

అదీ- ఇంగ్లీషు దొరల శైలిలో నాజూకుగా! బహు నాగరీకంగా!! నీతికి సెలవిచ్చి అత్యంత క్రూరంగా!!

హేస్టింగ్స్ అండ్ కంపెనీ చిల్లర చిలక్కొట్లను ఆలకించి ఆలకించి సదరు లాభసాటి

బిజినెసును హోల్‌సేల్‌గా తామే చేపట్టి ఏకంగా ఇండియానే కొట్టెయ్యాలన్న ఆలోచన వచ్చాక ప్రభువులు జాగ్రత్తగా పావులు కదిపారు. పిట్టు ప్రభుత్వం 1784 ఆగస్టులో ఇండియాకోసం ప్రత్యేకంగా ఒక చట్టం తెచ్చింది. దాని ప్రకారం గవర్నర్ జనరల్‌గా ఎవరిని నియమించేది ఇకపై ఈస్టిండియా కంపెనీ కాక నేరుగా ప్రభుత్వమే నిర్ణయిస్తుందన్నారు. పేరుకు బోర్డ్ ఆఫ్ కంట్రోల్ ఒక దాన్ని పెట్టినా 'కాగల కార్యం' సాధించటానికి సర్వాధికారాలూ తాము ఏరికోరి ఎంపికచేసే గవర్నరు జనరలుకు ఉండేలా జాగ్రత్తపడ్డారు. 'సత్యమునే పలకవలెను. ధర్మమార్గంలోనే నడవవలెను. భారతీయ రాజకీయ వ్యవహారాలలో కలగజేసుకొనరాదు. మనకు దక్కిన రాజ్యం చాలు' అని పార్లమెంటు చేత సుద్దులైతే గొప్పగా పలికించారు. తాము చేయదలచుకున్నదేమో గుట్టుచప్పుడు కాకుండా కానిచ్చారు.

పీటల మీద కూచుని కథ నడిపించటానికి సమర్థుడు కావాలి కదా? పెళ్లికొడుకు ఎదురుగానే ఉన్నాడు. అవి అమెరికా వలస రాజ్యం బ్రిటిష్ సార్వభౌమత్వంపై భీకరంగా పోరాడి స్వాతంత్ర్యం ప్రకటించుకున్న తొలినాళ్లు. ఇంగ్లండు పనుపున లార్డ్ కారన్‌వాలిస్ హోరాహోరీగా యుద్ధం సాగించినా పరాజయం తప్పక, విలువైన రాజ్యం చేజారిపోయిందని ఇంగ్లీషు వారందరూ కుమిలిపోతున్న రోజులు. అంతకంటే విలువైన రాజ్యాన్ని కొత్తగా జయించి, ఆ దిగ్విజయంతో ఇటీవలి పరాభవాన్ని మరచిపోయేట్టు చేయటానికి కారన్‌వాలిస్ కంటే యోగ్యుడెవరు - అనుకున్నారు సీమదొరలు.

కారన్‌వాలిస్‌కూ అంతకంటే కావలసింది ఏముంది? ఆమెరికా యుద్ధంలో శృంగభంగంతో స్వదేశంలో అతడి ప్రతిష్ఠ దెబ్బతిన్నది. బంగారం లాంటి వలసను రక్షించలేక వాషింగ్టన్ చేతిలో పెట్టి తిరిగొచ్చాడన్న ఘోర వైఫల్యపు నగుబాటు నుంచి తేరుకోవటానికి కొత్త వలసలను జయించుకొచ్చే సావకాశం చిక్కటం అతడికీ మంచిదే అయింది. స్వామి కార్యమూ, స్వకార్యమూ ఒక్కటే అయిన ఉత్సాహంతో లార్డ్ కారన్ వాలిస్ కొత్త చట్టం కింద తొట్టతొలి గవర్నర్ జనరల్‌గా, నేరుగా బ్రిటిష్ సమ్రాట్టు ప్రతినిధిగా 1786 సెప్టెంబరులో కలకత్తాలో అడుగుపెట్టాడు.

మన చరిత్రకారులు చాలా మంది దృష్టిలో ఇండియాను ఏలిన గవర్నర్ జనరళ్లలో ఉత్తములు, సత్పురుషులు అనదగ్గ వారిలో కారన్‌వాలిస్ అగ్రగణ్యుడు. తప్పనిసరయి యుద్ధాలు చేశాడే గానీ స్వతహాగా ఆయన గొప్ప శాంతి కాముకుడని వారి నమ్మకం. అలాంటి భ్రమల్లో పడకుండా కారన్ వాలిస్ నిర్వాకాన్ని నిశితంగా గమనిస్తే కలిగే అభిప్రాయం వేరు. ఇంకేమైనా కావచ్చు కాని ఆయన పెద్దమనిషి మాత్రం కాదు.

అధికార ప్రాబల్యం ఎవరిదైనా న్యాయప్రకారం చెప్పాలంటే ఆ కాలానికి మొగల్ పాదుషాయే భారతదేశానికి సార్వభౌముడు. అతడికి వొంగి సలాములు చేసే... కట్టాల్సిన మొత్తాల్ని పువ్వుల్లోపెట్టి క్రమ ప్రకారం సమర్పించుకుంటామని సత్య ప్రమాణాలు చేసే... బెంగాల్, బీహార్, ఒరిస్సాల దివాన్గిరీని తెల్లదొరలు దొరకబుచ్చుకున్నారు... మొదట్లో కప్పం సరిగానే కట్టేవారు. వారన్ హేస్టింగ్స్ వచ్చాక మొగల్ పాదుషా మరాఠాల శరణుజొచ్చాడన్న మిష మీద కప్పాన్ని ఎగవేశాడు. పాదుషా ఢిల్లీలో తన రక్షణలో ఉన్నాడు. కనుక అతడికి కట్టాల్సిన కప్పాన్ని తనకు చెల్లించాలని సింధియా అడిగితే కారన్‌వాలిస్ దొర మొత్తానికే సున్నచుట్టి మొగల్ పాదుషాకు తాము దమ్మిడీ ఇచ్చేది లేదన్నాడు. అలాగే- తనను రక్షించే నెపం మీద వారన్ హేస్టింగ్స్ తనపై రుద్ది పోయిన ఇంగ్లీషు సేన తనకు అక్కర్లేదని, దాని





మేత ఖర్చును తాను భరించలేనని అయోధ్య నవాబు ఎంత మొత్తుకున్నా కారన్‌వాలిస్ కనికరించలేదు. నీకు అక్కర్లేకపోయినా మా సైన్యాన్ని మేపుతూ దాని పడగనీడలో బతకాల్సిందేనని తెగేసి చెప్పాడు. అదే విధంగా నిజాం నవాబు మెడమీద కత్తిపెట్టి, గుంటూరు సర్కారును దౌర్జన్యంగా లాగేసుకున్నాడు. ఇక తాను తలపెట్టిన దేశాక్రమణ మహత్కార్యానికి అవరోధం ఎవరా అని తేరిపార చూస్తే అతడికి టిప్పు సుల్తాన్ కనిపించాడు.

అప్పటికి టిప్పు పేరు చెబితే ఇంగ్లీషు వారికి వొణుకు. తెల్లవారిపై తండ్రి ప్రకటించిన యుద్ధాన్ని తండ్రి మరణానంతరం టిప్పు కొనసాగించి, సైనిక పరాక్రమంతో వారిని మన్ను కరిపించి, 1784లో మంగళూరు కదనరంగాన తనతో కాళ్లబేరానికి వచ్చేట్టు చేశాడు. అంతటి వీరుడిని తాను మెడలు వంచగలిగితే అమెరికాలో చుట్టుకున్న అప్రతిష్ఠ తొలిగి తన ప్రతాపం ప్రపంచమంతా మారు మోగుతుందని కారన్‌వాలిస్ భావించాడు. శత్రువునైతే సరిగానే ఎంచుకున్నాడు. కాని అతడిని జయించటానికి అనుసరించిన మార్గం ఏ రకంగా చూసినా నీతి బాహ్యమైనది.

అంతదాకా నయవంచనలు, ఫోర్జరీలు, మోసాలవల్లే తెల్లవారు భారతదేశాన్ని కొద్దికొద్దిగా నొల్లుకుంటూ వచ్చారు. బాహాటంగా ఎదుటపడి వీరోచితంగా పోరాడి వారు యుద్ధంలో రాజ్యాన్ని గెలిచిన సందర్భం ఒక్కటీ లేదు. క్లయివ్, హేస్టింగ్స్ స్వశక్తితో అంగుళం నేలను కూడా గెలవలేదు. ప్రసిద్ధికెక్కిన ప్లాసీ యుద్ధంలో మీర్జాఫర్ నమ్మకద్రోహం పుణ్యమా అని అనూహ్యంగా విజయం సిద్ధించిన సమయానికి "మహావీరుడు" క్లయివ్ గుడారంలో నిద్రపోతున్నాడు! ఈ రీతికి భిన్నంగా యుద్ధంలో ప్రత్యక్షంగా గెలిచి, సైనిక ప్రతాపంతో ఒక రాజ్యాన్ని తెల్లవారు జయించడం మొట్టమొదటిగా కారన్‌వాలిస్ హయాంలోనే జరిగింది. ఇందుకు ఆయన అభినందనీయుడే. ఎటొచ్చీ అతడు పోరాడిన తీరే చాలా దుర్మార్గమైనది.

కారన్‌వాలిస్ రంగప్రవేశానికి రెండు సంవత్సరాల ముందు దేవుడి మీద ప్రమాణం చేసి మంగళూరులో కుదుర్చుకున్న సంధి ప్రకారం ఇంగ్లీషు వారు టిప్పును తమ మిత్రుడిగా గుర్తించారు. ఇకపై అతడితో వైషమ్యాన్ని మానతామనీ, ఇకపై దాడులకు దిగమనీ, అతడికి వ్యతిరేకంగా ఎటువంటి పనీ చేయమనీ, అతడికి అవసరమైనప్పుడు సైనిక సాయం చేస్తామనీ మాట ఇచ్చారు. ఒకసారి సంధి చేసుకున్నాక దాని షరతులకు కట్టుబడటం భారతీయుల పద్ధతి. మాటకు కట్టుబడ్డంత వరకూ, అనవసరంగా రెచ్చగొట్టనంత వరకూ మనవారు సాధారణంగా ఎవరి మీదా కత్తిఎత్తరు. దొరల నైజం ఇందుకు పూర్తిగా విరుద్ధం. నీతులు చెబుతూ గోతులు తీయటమే వారికి తెలిసిన రాజకీయం. టిప్పుతో మిత్రత్వానికి తాము కట్టుబడ్డ మంగళూరు సంధి అమల్లో ఉండగానే... దానిని టిప్పు ఉల్లంఘించాడనటానికి ఏ రుజువూ లేకుండానే... పైకి అతడితో స్నేహవచనాలు సాగిస్తూనే... కారన్‌వాలిస్ అతడితో అకారణ వైరం బూనాడు. టిప్పుతో మిత్రత్వ ఒప్పందం అమల్లో ఉండగానే, "We went to form an alliance with the Marathas against Tipu, our common enemy" (మన ఉమ్మడి శత్రువైన టిప్పుకు వ్యతిరేకంగా మరాఠాలతో కూటమి కట్టాలనుకుంటున్నాము) అని నాగపూరులోని తన ఏజంటు ఫోస్టరుకు గవర్నర్ జనరల్ జాబు రాశాడు. టిప్పు మహాక్రూరుడని, ప్రజలను అమానుషంగా హింసించి, ఊచకోతలు కోసే పాపాత్ముడని, మొత్తం మానవ సమాజానికే శత్రువనీ కారన్‌వాలిస్ పథకం ప్రకారం దుష్ప్రచారానికి దిగాడు. తన ఆక్రమణలోని ప్రాంతాలపై టిప్పుకున్న సార్వభౌమాధికారాన్ని గుర్తించిన

1784 సంధిని తుంగలో తొక్కి అతడి ఆధిపత్యాన్ని కత్తిరించే కుత్సితానికి పాల్పడ్డాడు.

భారతీయ ప్రభువుల గొడవల్లో తల దూర్చవద్దని, ఒకరికి అనుకూలంగానో, ఒకరికి వ్యతిరేకంగానో సైనిక కూటములు కట్టొద్దని బ్రిటిష్ పార్లమెంటు, చట్టపరంగా చేసిన కట్టడిని యథేచ్ఛగా అతిక్రమించి టిప్పూకు వ్యతిరేకంగా కారన్‌వాలిస్ మరాఠాలను దువ్వాడు. నిజాంను బుట్టలో వేసుకున్నాడు. టిప్పూ ఆక్రమించిన తన ప్రాంతాలను తిరిగి వశం చేసుకోవడానికి– కంపెనీ తనకు అరువిచ్చిన సేనలను ఉపయోగించుకోవాలని నిజాం ఉవ్విళ్ళూరగా... సంధి రీత్యా టిప్పూ తమకు మిత్రుడన్న సంగతినీ... మిత్రుడిపై ఇంకొకరి యుద్ధానికి సహకరించడం నిషిద్ధమన్న నీతినీ విస్మరించి నిజాంతో లోపాయికారీగా 'వల్లె' అన్నాడు. టిప్పూకు అది సహజంగానే ఒళ్ళుమండించింది. తన మాటలవల్ల, చేష్టలవల్ల అతడిలో అంతకంతకూ ప్రబలిన అనుమానాలను కారన్‌వాలిస్ బుద్ధి పూర్వకంగా వృద్ధి చేశాడు. మరాఠాలను, నిజాంను కూడగట్టిన తరువాత టిప్పూ సుల్తానుపై వట్టి పుణ్యానికి భీకర యుద్ధం ప్రకటించాడు.

దీనికి సాకు తిరువాన్కూరుపై టిప్పూ దాడి. దాడి జరిగింది తిరువాన్కూరు రాజు మీదే తప్ప ఇంగ్లీషువారిపై కాదు. ఆ రాజు తమకు నేస్తుడు కనక అతడిపై కత్తి ఎత్తడమంటే తమపై ఎత్తడమేనని కారన్‌వాలిస్ వాదన. నేస్తుల విషయంలో అంతటి ఆరాటం తెల్లవారికి ఎన్నడూ లేదు. తమ కొత్త నేస్తులైన మరాఠాల మీద, నిజాం మీద అదే టిప్పూ దండెత్తినప్పుడు మిత్రులకు సాయంగా సైన్యాన్ని పంపాలన్న మంచి బుద్ధి దొరగారికి పుట్టలేదు. తమకు లాభం ఉండదనుకుంటే టిప్పూ బారిన పడ్డ తిరువాన్కూరును కూడా దాని ఖర్మానికి దాన్ని వదిలేసేవారే. మరాఠాలు, నిజాం కుడి ఎడమల బాసటగా ఉంటామనటంతో టిప్పూను అణచటానికి అదే సమయమనిపించి, తిరువాన్కూరును ఒక మిషగా వాడుకున్నారు.

టిప్పూకు చెందిన భూభాగాన్ని అక్రమంగా డచ్చివారి నుంచి సంపాదించి తీరం పొడవునా కందకం తవ్వి "రక్షణ శ్రేణులు" నెలకొల్పటంవల్ల, తనపై తిరగబడిన వారికి ఆశ్రయం ఇవ్వడం వల్ల తిరువాన్కూరుపై టిప్పూ ఆగ్రహించడం సమంజసమే. ఆ సంగతి 'కంపెనీ' అధికారులే ఒప్పుకున్నారు. తిరువాన్కూరు రాజే తొలి దురాక్రమణ చేశాడని, అతడిని శిక్షించబూనినప్పటికీ ఇంగ్లీషు వారితో శత్రుత్వం టిప్పూ ఉద్దేశం కానేకాదని, సామరస్యంగా అన్నీ సర్దుబాటు చేసుకోవటానికి అతడు సిద్ధమేనని సాక్షాత్తూ మద్రాసు ప్రెసిడెన్సీ గవర్నరే కారన్‌వాలిస్‌కు చెప్పాడు. గవర్నరు వద్దని వారించినా కారన్ వాలిస్ వినలేదు. టిప్పూకు కనీసం సమాధానం చెప్పకునే అవకాశమైనా ఇవ్వలేదు... అతడు యుద్ధానికి సిద్ధంగా లేని సమయం చూసి కారన్‌వాలిస్ పిడుగులా పడ్డాడు. టిప్పూ బెంబేలు పడకుండా పౌరుషంతో ప్రతాపం చూపి, జనరల్ మెడోస్‌ను ఓడించటంతో మద్రాసు ప్రభుత్వాన్ని పక్కకునెట్టి నేరుగా కారన్‌వాలిసే సేనా నాయకత్వం స్వీకరించాడు. టిప్పూ ఎన్ని రాయబారాలు పంపినా లక్ష్యపెట్టకుండా దూతలను అవమానించి, పంపిన కానుకలను తిప్పి కొట్టి, సామరస్య సాధనకు అన్ని దారూలూ దుర్మార్గంగా మూసి మరాఠాల అండ చూసుకుని కయ్యానికి కాలుదువ్వాడు. ***The History of British India*** గ్రంథంలో జేమ్స్‌మిల్ చెప్పినట్టు.

"The English in India at that time had been worked up into a mixture of fury and rage against Tipu, more resembling the passion of savages against their enemy... than the feelings



with which a civilised nation regards the worst of its foes".

[***The History of British India,*** *Vol.V., p.278*]

*(ఆ సమయంలో ఇండియాలోని ఇంగ్లీషు వారు టిప్పూపై ప్రదర్శించిన మహాక్రోధం ఆటవిక కిరాతకులు శత్రువుపై చూపే క్రూరత్వాన్ని పోలిందే తప్ప ఒక నాగరిక జాతి తన విరోధుల పట్ల వ్యవహరించాల్సినతీరుకు తగ్గట్టుగా లేదు).*

1790 నుంచి 1792 వరకు సాగిన మూడవ మైసూరు యుద్ధంలో చివరికి గెలిచిన ఇంగ్లీషు సేనలకు నాయకత్వం వహించింది కారన్‌వాలిస్ అయినా గెలుపుకు ముఖ్యకారకులు మాత్రం మరాఠాలు. సయోధ్యకు అన్ని యత్నాలూ విఫలమయ్యాక మొండికి పడిన టిప్పూ చూపిన ప్రతాపానికి ఒక దశలో తెల్ల సేనలు గజగజ వణికాయి. శ్రీరంగపట్నం కోటపై మొదటి ముట్టడి విఫలమై. పశువుల మరణంతో ఫిరంగులను లాగే దిక్కులేక... కుంభవృష్టిలో, ఆకలి బాధతో సైనికుల ప్రాణాలు కడబట్టగా చేసేదిలేక తోకముడిచి బెంగళూరుకు మరలిపోతున్న కారన్‌వాలిస్‌ను సమయానికి మరాఠా దండు అండగా వచ్చి ఉండకపోతే కథ మరోలా ఉండేది. ఆ తరువాతైనా ముప్పేట దాడితో శ్రీరంగం కోటను ముట్టడించి కారన్‌వాలిస్ దిగ్విజయం సాధించింది ప్రతాపంతో కంటే నీచత్వంవల్లే అనటం సబబు. హైదరాలీ, టిప్పూ సుల్తాన్‌లు కోట రక్షణకు యూరోపియన్ల మీద ఆధారపడటమే చివరికి వినాశ హేతువైంది. కిరాయి సైనికులను నమ్మి శ్రీరంగపట్నం కోటలో కీలక రక్షణ బాధ్యతలను టిప్పూ అప్పగిస్తే వారిలో చాలామంది– ముఖ్యంగా ఫ్రెంచివారు– ఆంగ్లేయుల ప్రలోభాలకు లోబడి, సరైన అదనులో స్వామి ద్రోహానికి పాల్పడి శత్రువులతో చేతులు కలిపారు.

మూడు వైపులనుంచి చుట్టుముట్టిన 1792 సెప్టెంబర్లో విరోధుల ధాటికి తట్టుకోలేక టిప్పూసుల్తాన్ చేతులెత్తాడు. కారన్ వాలిస్‌దే అంతిమ నిర్ణయమైతే అప్పుడే అతడిని చంపేసి, అతడి రాజ్యాన్ని కంపెనీ కమతంలో కలిపేసుకునేవాడే. అదృష్టవశాత్తూ నానాఫడ్నవిస్ అందుకు అడ్డుపడ్డాడు. టిప్పూ మీద ఎంత కోపం ఉన్నా, అతడిని ఏకంగా రంగం నుంచే నిర్మూలించి ఆ రాజ్యాన్ని తెల్లవారి పరం చేయటానికి నానాకు మనస్కరించలేదు. అతడు పట్టుబట్టటం వల్ల టిప్పూ ప్రాణాలైతే దక్కాయి. కాని అవమానకరమైన సంధికి ప్రతిఫలంగా అతడు చెల్లించింది చాలా పెద్ద మూల్యం. తన రాజ్యంలో సగభాగాన్ని అతడు విజేతలకు అప్పగించవలసి వచ్చింది. ఆపైన మూడు కోట్ల రూపాయల పరిహారం చెల్లింపు! దానికి పూచీగా అతడి కుమారులిద్దరిని బందీలుగా తెల్లవారి వెంట పంపాలి. కడుపు భగ్గున మండినా పౌరుషాన్ని తనలోనే అణచుకుని టిప్పూసుల్తాన్ అన్ని షరతులకూ సమ్మతించాడు. అతడి నుంచి లాక్కున్న రాజ్యాన్ని ఇంగ్లీషువారు, మరాఠాలు, నిజాం నవాబు సమానంగా పంచేసుకున్నారు.

చిత్రమేమిటంటే – యుద్ధాన్ని మొదలెట్టింది తిరువాన్కూరు రాజును ఆదుకునే నెపంతో, యుద్ధం గెలిచాక సంధి షరతుల్లో మాత్రం తిరువాన్కూరు ఊసేలేదు. ఊళ్లు, డబ్బులు పంచుకునే తొందరలో ఆ వెర్రిరాజు సంగతే మూడు మిత్ర పక్షాలకూ గుర్తురాలేదు.

# కుట్ర కూల్చిన కోట

*LIBERTY! EQUALITY!*
*To : The Most Maginificient Sultan,*
*Out greatest Friend, Tipu Sultan*

***You have already been informed of my arrival on the borders of the Red Sea with an innumerable and invincible army full of the desire of relieving you from the iron yoke of England... ...I would even wish you could send some intelligent person to Suez or Cairo possessing your confidence, with whom I might confer.***

**BONAPARTE**

మహా ఘనత వహించిన మిత్ర శ్రేష్ఠులు టిప్పుసుల్తాను గారికి–

ఇంగ్లండు ఉక్కు పట్టునుంచి మీకు ఊరట కలిగించే ఉద్దేశంతో మేము ఎర్ర సముద్ర తీరానికి అజేయమైన అసంఖ్యాక సైన్యంతో చేరుకున్న సంగతి మీకు ఈ వరకే తెలియపరిచాము... మీకు నమ్మకస్తుడైన బుద్ధిశాలినెవరినైనా సూయజ్‌కో, కైరోకో పంపిస్తే నేను అన్ని విషయాలు చర్చించగలను.

బోనపార్టి

ఫ్రెంచి మహావీరుడు నెపోలియన్ బోనపార్టి 1798 పూర్వార్థంలో టిప్పుసుల్తానుకు రాసిన లేఖ ఇది. ఆ సంవత్సరం జనవరిలో మారిషస్‌లోని ఫ్రెంచి గవర్నరు జనరల్ మాలార్టిక్ ద్వారా అందిన టిప్పు సైనిక సంధి ప్రతిపాదనలకు ఇది నెపోలియన్ ఇచ్చిన జవాబు. అప్పటికి ఆరేళ్ల కింద మూడో మైసూరు యుద్ధంలో మరాఠాల పుణ్యమా అని కారన్‌వాలిస్ గెలిచి అవమానకరమైన ఒప్పందాన్ని టిప్పుసుల్తాన్ నెత్తిన రుద్ది నవనాడులు కుంగదీసినా టిప్పు గుండె చెదిరి బేజారవలేదు. యుద్ధం వల్ల అతడికి డెభై కోటలు పోయాయి. యాభైవేల సైనికులు మరణించారు. లేదా తీవ్ర గాయాలతో మూలనపడ్డారు. మూడున్నర కోట్ల నగదు పరిహారం కట్టాల్సి వచ్చింది. సగం రాజ్యం వదులు కోవలసి వచ్చింది. ఆ రకంగా అతడి కోరలు పీకి కోలుకోలేని దెబ్బ కొట్టామనే తొల్లదొరలు అనుకున్నారు.

కాని టిప్పుసుల్తాన్ పరాభవాన్ని అంత తేలిగ్గా మరచి పరిస్థితులతో రాజీపడే రకం కాదు. పళ్లబిగువున మెల్లిగా కాలూ చెయ్యీ కూడదీసుకుని ఆగర్భ శత్రువులైన ఇంగ్లీషువారికి వ్యతిరేకంగా జాతీయ, అంతర్జాతీయ కూటములు కట్టటానికి టిప్పు శాయశక్తులా ప్రయత్నించాడు. అటు మరాఠా దర్బారుతోనూ, ఇటు నిజాంతోనూ దౌత్యం నెరిపి, 'కంపెనీ' ధృతరాష్ట్ర కౌగిలి నుంచి తప్పించి వారిని తనకు అనుకూలంగా తిప్పుకోవటానికి తెలివిగా ఎత్తులు వేశాడు. బ్రిటిష్ వారిని కూలదోసి భారతదేశం నుంచి గెంటివేయటానికి సైనిక సహాయం కోరుతూ మస్కట్ ఇమాం దగ్గరికీ, పర్షియా షా చెంతకూ దౌత్య బృందాలను పంపాడు. ఆంగ్లేయులను తరిమి మొగల్ పాదుషాను పునఃప్రతిష్ఠించడానికి హిందుస్తాన్‌పైకి దండెత్తి రావలసిందిగా ఆఫ్ఘనిస్తాన్ రాజు జమాన్‌షాకు టిప్పు రాయబారం పంపాడు.

ఇవన్నీ ఒక ఎత్తయితే ఫ్రాన్సుతో సైనిక కూటమికి టిప్పు సుల్తాన్ ప్రయత్నాలు ఇంకో ఎత్తు. టిప్పుకు ఫ్రెంచివారు నికరంగా చేసిన ఉపకారం ఏమీ లేకపోయినా అతడి దౌత్య ప్రతిపాదనలను స్వాగతించి నైతిక మద్దతు బాగా ఇచ్చారు. సరిగా అదే కాలంలో ఫ్రాన్సులో విప్లవం వచ్చింది. రాజరికం కూలి 16వ లూయీ, అతడి రాణీ మేరీ గిలిటిన్‌కు బలి అయ్యారు. రక్తపుటేరుల నడుమ ప్రజాస్వామ్య శిశువు జన్మించింది. అంత వరకూ ఎక్కడా కనీవినీ ఎరుగని ఆ అరాజక వ్యవస్థను ఎలా అర్థం చేసుకోవాలో అంతుబట్టక ప్రపంచ దేశాల్లో చాలా మంది ప్రభువులు నిర్ఘాంతపోయిన స్థితిలో టిప్పుసుల్తాన్ నూతన మార్పుల పట్ల అరుదైన అవగాహనను కనపరిచాడు. ఫ్రాన్సుతో సంధికి అతడు పావులు కదుపుతున్న కాలంలోనే ఫ్రెంచి విప్లవ కల్లోలం నుంచి మహావీరుడు నెపోలియన్ ప్రపంచ రణరంగ స్థలిపైకి దూసుకువచ్చాడు. ఫ్రెంచి రిపబ్లికన్ సైన్యంతో ఇటలీలో దిగ్విజయం సాధించి, హాప్స్‌బర్గ్ సామ్రాజ్యాన్ని కుప్పకూల్చి, తూర్పు జైత్రయాత్ర చేసి, వీలైతే ఇండియానూ జయించే ఉద్దేశంతో అతడు ఈజిప్టులో అడుగుపెట్టాడు. కైరో-I హెడ్ క్వార్టర్సులో ఉండగా అందుకున్న టిప్పు ప్రతిపాదనలకు నెపోలియన్ ఇచ్చిన పై జవాబును బట్టి ఇంగ్లండు, ఫ్రాన్సుల నడుమ ఆధిపత్య సంగ్రామానికి భారతదేశం ప్రధాన కదనరంగం కానుండినదని స్పష్టం.

అంతా సవ్యంగా జరిగితే చరిత్ర గతి ఎలా ఉండేదో, కానీ 1798 అక్టోబరు పోరులో నైలు నదిలో నెపోలియన్ నౌకాదళం నాశనమవటంతో ప్రాచ్య జైత్రయాత్ర ఆశలుడిగాయి. ఇంగ్లండుపై యుద్ధాన్ని ప్రకటించిన ఫ్రాన్సు సైనిక సహాయంతో తన దేశానికి బ్రిటిష్ పీడ విరగడ చేయాలనుకున్న టిప్పు వ్యూహం భగ్నమైంది. కాని– అతడు ఫ్రెంచి సహాయాన్ని అపేక్షించడమే – అతడిని నాశనం చేయటానికి చక్కని సాకుగా కొత్త గవర్నర్ జనరల్ లార్డ్ మార్నింగ్‌టన్ (వెల్లస్లీ)కి పనికి వచ్చింది.

రిచార్డ్ వెల్లస్లీ బ్రిటిష్ రాజ ప్రతినిధిగా ఇండియాలో అడుగుపెట్టేసరికే టిప్పుసుల్తాన్‌ను ఎలాగైనా అణచివేయాలని కృతనిశ్చయంతో ఉన్నాడు. భారతదేశాన్ని కబళించి తమ సామ్రాజ్యంలో కలిపేసుకోవాలని బ్రిటిష్ ప్రభువులు ఆ సమయంలో ఉవ్విళ్లూరుతున్నారు. అప్పటికే చాపకింద నీరులా వ్యాపించి, బెంగాల్ ఉత్తర సర్కార్లు, మద్రాసు, మలబారు, బొంబాయిలను కుట్రలూ కుహకాల కూటనీతితో తెల్లవారు ఆక్రమించగలిగారు. అయోధ్య, ఆర్కాట్ నవాబులు, తిరువాన్కూరు, కూర్గురాజాలు వారి గుప్పిట్లో ఉన్నారు. ఉత్తరాదిన ఢిల్లీలో కళ్లు పీకేయబడ్డ మొగల్ చక్రవర్తి సింధియా అధీనంలో నామమాత్రావశిష్టంగా ఉన్నాడు. రాజపుత్రుల రాజకీయ ప్రాభవం అంతరించింది. పంజాబులో సిక్కులు బలం

పుంజుకుంటున్నా అసంఘటితమై ఉన్నారు.

ఆ కాలానికి దేశంలో సర్వ సత్తాక స్వతంత్ర ప్రభువులని చెప్పగలిగిన వారు ముగ్గురు మాత్రమే. పీష్వా, నిజాం, టిప్పుసుల్తాన్. మరాఠాల్లో చిట్టచివరి కార్యదక్షుడు, రాజనీతిజ్ఞుడు అయిన నానా ఫడ్నవిస్ అధ్యాయం ముగిసి, సిందియా-హోల్కర్ వంశాల చిరకాల వైరం ముదిరి, అంతఃకలహాలు హెచ్చి మరాఠా రాజ్యం కళాకాంతులు పోయి నిస్తేజంగా ఉంది. మరాఠా శని రఘునాథరావు సుపుత్రుడు, అన్ని విధాల అయోగ్యుడు, అధముడు అయిన రెండో బాజీరావు పూనా గద్దెమీద కూర్చుని ఉన్నాడు. ఇక నిజాం రాజ్యం నానా కంగాళీగా ఉంది. 1795లో మరాఠాలు కొట్టిన చావుదెబ్బతో నిజాంకు నవ నాడులు కుంగాయి. ఏతావతా భారతదేశం మొత్తం మీద బ్రిటిష్ రాజ్య తంత్రానికి సవాలు వస్తేగిస్తే టిప్పుసుల్తాను నుంచే రావాలి. కిందటి యుద్ధంలోనే అతడిని కారన్ వాలిస్ గుటుక్కుమనిపిద్దామన్నాడు. కాని మరాఠాలు పడనివ్వలేదు. కుంగదీసే సంధి షరతులకు తట్టుకుని, తీవ్ర ప్రతికూల పరిస్థితులకు ఎదురొడ్డి కాలూ చెయ్యీ కూడదీసుకొవటానికి టిప్పు తంటాలు పడుతున్నాడు. ఆ నిస్సహాయ పరిస్థితిలో అతడి నుంచి ఇంగ్లీషు వారికి ఎటువంటి ప్రమాదం లేదు. నెల్సన్ చేతిలో నెపోలియన్ పరాభవం తరవాత ఫ్రాన్సు నుంచి సైనిక సాయం అందే ఆశ అతడికి పోయింది. ఇరుగు పొరుగు రాజ్యాలను కూడగట్టుకునే అవకాశమూ లేదు. అయినాసరే ఉపేక్షించడానికి వీలులేదని, బలహీనంగా ఉండగానే అతడిని కాలరాచి వేయటం మంచిదని వెల్లస్లీ అనుకున్నాడు.

దానికీ ఒక మిషకావాలి కదా? ఫ్రెంచి వారి సాయం కోసం టిప్పు చేసిన విఫల యత్నం అందుకు వాటంగా పనికొచ్చింది. న్యాయప్రకారం టిప్పుసుల్తాన్ సార్వభౌమాధికారం గల స్వతంత్ర పాలకుడు. అంతర్జాతీయంగా ఏ దేశంతోనైనా ఎటువంటి సంబంధాలనైనా పెట్టుకునే అధికారం అతడికి ఉంది. ఫ్రాన్సు నుంచి సహాయం కోరడానికి అతడికి ఇంగ్లీషు వర్తకుల కంపెనీ ఆజ్ఞ, అనుమతి అక్కర్లేదు. ఇంగ్లీషు వారికి వ్యతిరేకంగా అతడు వేరే దేశం సహాయం పొందాలని విఫలయత్నం చేసినంత మాత్రానే అతడిని శత్రువుగా పరిగణించి తెల్లవారు ఏకపక్షంగా యుద్ధానికి దిగటం అక్రమం. తమతో కుదుర్చుకున్న సంధి షరతులకు టిప్పు కట్టుబడి ఉన్నంతవరకూ, అతడివల్ల తమ భద్రతకు ముప్పు వాటిల్లిందనడానికి సహేతుక దృష్టాంతమేదీ లేనంతవరకూ, కేవలం అతడి ఉద్దేశాన్నే అపరాధంగా భావించి, సంధి ఒప్పందాన్ని తుంగలో తొక్కి కయ్యానికి కాలుదువ్వటం అనుచితం.

టిప్పు పక్షాన ఇంగ్లీషువారితో పోరాడేందుకు ఇష్టం ఉన్నవారు ముందుకు రావచ్చంటూ మారిషస్ పౌరులకు ఫ్రెంచి గవర్నరు మాలార్టిక్ 1798 జనవరిలో వెలువరించిన ప్రకటనను తన అధర్మ యుద్ధానికి సాకుగా వెల్లస్లీ చూపెట్టాడు. సదరు ప్రకటనకు స్పందించి శ్రీరంగపట్నానికి చేరుకున్న కిరాయి ఫ్రెంచి సైనికుల సంఖ్య రెండువందల లోపేనన్న వాస్తవాన్ని మాత్రం మరుగుపరచాడు. టిప్పు సుల్తాన్‌వల్ల మనకు ఏ విధమైన సమస్యా లేదు; మనం కావాలని కవ్విస్తే తప్ప అతడినుంచి ఎటువంటి ప్రతిఘటనకూ ఆస్కారం లేదు. అని మద్రాసు ప్రెసిడెన్సీలోని తన అధికారులే చెప్పిన సంగతినీ వెల్లస్లీ పెడచెవిన పెట్టాడు. టిప్పుతో మంచిగా ఉన్నట్టే నటిస్తూ అతడి స్నేహ ప్రతిపాదనలకు స్నేహ పూర్వకంగానే జవాబులిస్తూ అతడి వెనుక గోతులు తవ్వాడు. మరాఠాలను, నిజాంను తనకు అనువుగా సెట్ చేసే పని అయి, సైనిక సన్నాహాలన్నీ పూర్తయ్యాక ముసుగుతీసి



అవతల పారేసి ఫ్రెంచి వ్యవహారం సాకుతో టిప్పుపై రాక్షసంగా విరుచుకుపడ్డాడు.

ఆ సమయాన టిప్పు ముందున్న ప్రత్యామ్నాయాలు రెండే; నిజాం లాగా మిగతా దేశీయ ప్రభువులు పలువురిలాగా ఇంగ్లీషువారి సాలెగూట్లో ఇచ్ఛికంగా ఇరుక్కుని, తన ఖర్చుతో వారు సమకూర్చే సైనిక రక్షణ మీద ఆధారపడి నామమాత్ర అధికారంతో వాస్తవానికి ఘరానా బందీ స్థాయికి తనను తాను దిగజార్చుకోవటం; లేదా అన్నిటికీ తెగించి యుద్ధానికి సిద్ధపడటం. టిప్పుసుల్తాన్ వీటిలో గౌరవప్రదమైన రెండో దారిని ఎంచుకున్నాడు. శక్తి చాలదని, పరిస్థితులు అనుకూలంగా లేవని, గెలిచే ఆశలేదని తెలిసినా ఇంగ్లీషువారు దౌర్జన్యంగా రుద్దిన యుద్ధానికి వెరవక వీరుడిలా పోరాడి, యుద్ధంలోనే వీర మరణం పొందాడు.

1799 మేలో శ్రీరంగపట్నాన్ని రెండువైపులాల నుంచి ముట్టడించిన 31 వేల ఇంగ్లీషు సైన్యం సంఖ్యాపరంగా చాలా పెద్దదే, అయినా కేవలం మూడు రోజుల్లో వారు సునాయాసంగా కోటను పట్టుకుని టిప్పును చంపగలిగింది సైనిక పరాక్రమంతోనా? కాదు. ద్రోహుల అండతో. శ్రీరంగపట్నంలో ఉన్నది ఆషామాషీ కోటకాదు. అది శత్రుదుర్భేద్యమని అందరూ అనుకునేవారు. బాహాబాహీ తలపడి ఇంగ్లీషు వారిని తరిమికొట్టటం టిప్పుకు శక్తికి మించిన పనే. కాని-వారి దాడి నుంచి ఆత్మరక్షణ చేసుకోవటానికి కావలసిన సైనిక బలం అతడికి ఉంది. సుమారు 22వేల సైనికులు సర్వసన్నద్ధంగా నిరంతరం సంరక్షించే కోట- తిండికి మొగం వాచి తంతే కూలిపోయే స్థితికి చేరిన బ్రిటిష్ బలగాలకు రెండు గంటల్లో అవలీలగా వశమైందంటే విద్రోహతంత్రమే దానికి ప్రధాన కారణం. టిప్పు సుల్తానుకు ముఖ్య సర్దారులయిన మీర్‌సాదిక్, నాదిమ్, కమరుద్దీన్‌ఖాన్‌లు బ్రిటిష్ వారికి అమ్ముడుపోయి స్వామి ద్రోహానికి పాల్పడ్డారు. కోట గోడ బద్దలు కొట్టి ఇంగ్లీషు సైనికులు లోపలికి చొరబడిన సంగతి దుర్గరక్షకులు సుల్తానుకు తెలియపరచనే లేదు. విషయం అతడికి తెలిసేసరికే పరిస్థితి చేయిదాటిపోయింది. ***History of Tippu Sultan***లో **Mohibul Hassan Khan** అన్నట్టు *the fall of Seringapatnam was facilitated by a conspiracy organised by some of the chief officers of the Mysore Government in concert with the English.* (శ్రీరంగపట్నం పతనం మైసూరు ప్రభుత్వంలోని ముఖ్యాధికారులు కొందరు ఇంగ్లీషువారితో చేరి కుట్ర చేయడంవల్లే సుకరమైంది).

ఎంతగా పోరాడినా ప్రయోజనం లేదని అర్థమయ్యాక సొరంగ మార్గం గుండా తప్పించుకోవాలని టిప్పు ప్రయత్నించగా అందుకు వీల్లేకుండా సొరంగ ద్వారాన్ని మీర్‌సాదిక్ మూసి వేయించాడు. సుల్తాను స్వయంగా ఆజ్ఞాపించినా దుర్గ పాలకుడు మీర్ నాదిమ్ లక్ష్యపెట్టలేదు. కోటను కాపాడవలసిన వారే అసలైన అదనులో శత్రువుతో కుమ్మక్కవటంతో సుల్తానే మామూలు సిపాయిలా శత్రువులతో హోరాహోరీగా పోరాడాడు. తుపాకీ దాడిలో, అతడి గుర్రం చచ్చింది. ఛాతీలో తుపాకి గుండు తగిలి తీవ్రంగా గాయపడ్డ సుల్తానును సేవకులు పల్లకిలో వేసుకొని శవాల గుట్టల మధ్యనుంచి దారిచేసుకుని పోతూంటే ఇంగ్లీషు సిపాయి ఒకడు అడ్డుకుని వజ్రాలు పొదిగిన అతడి కత్తి ఒరను లాక్కోబోయాడు. అవమానాన్ని సహించని టిప్పు అతడిపై కత్తి దూయగా తెల్లవాడు కణతలకు గురిపెట్టి టిప్పును కాల్చేశాడు. అతడే సుల్తాను అన్న సంగతి ఆ సమయంలో ఎవరికీ తెలియదు.

టిప్పును చంపాక చాలారోజులపాటు శ్రీరంగపట్నంలో ఇంగ్లీషు సేనలు తెగబడి

సాగించిన దోపిడీలు, ఇళ్లమీద పడి విలువైన వస్తువులనల్లా కొల్లగొట్టిన వైనాలు, నిస్సహాయ స్త్రీలపై జరిపిన అత్యాచారాలు- తెల్లవారు టిప్పుకు ఆపాదించిన క్రూరత్వంకంటే పదింతలు క్రూరమైనవి. ఖజానాను దోచి, అమూల్యాభరణాలను, వజ్ర సింహాసనాలను ముక్కలు చేసి దొరికినకాడికి దండుకోవటంలో పెద్దదొరలే పోటీలుపడ్డారు. లూటీల పుణ్యకార్యాన్ని జయప్రదంగా పూర్తి చేశాక టిప్పు రాజ్యాన్ని ఇంగ్లీషువారు ముక్కలు చేశారు. తమకు యుద్ధంలో తోడ్పడ్డ నిజాం కళ్లనీళ్లు తుడవటానికి అతడి మొగాన ఒక చెక్క వేశారు. పెద్ద చెక్కలు తాము కాజేసి కార్వాను నుంచి మంగుళూరు దాకా కెనరా పరగణాలను, దక్షిణాన కోయంబత్తూరు, ధర్మపురం ప్రాంతాలను రాజధాని శ్రీరంగపట్నాన్ని సంగ్రహించారు. యుద్ధానికి ముందు టిప్పును మభ్యపెట్టటానికి బహు ఉదారంగా అతడికి తిరిగి అప్పగించిన వైనాడ్ ప్రాంతాన్ని నిస్సిగ్గుగా మళ్లీ కొట్టేసి తమ పెద్ద మనిషి తరహా ఎటువంటిదో చాటుకున్నారు. విశాల ప్రాంతాలను తమ రాజ్యంలో కలిపేసుకోవడమేగాక తూర్పు, పశ్చిమ తీరాలు రెండూ తెల్లవారి గుప్పిట్లో చిక్కాయి. దక్షిణ భారతంలో శ్రీరంగపట్నం సహా అతి ముఖ్యమైన దుర్గాలన్నీ వారి కైవసమయ్యాయి. అయితే టిప్పు రాజ్యాన్ని మొత్తంగా తామే కాజేశారన్న వ్యతిరేక భావన దేశంలో ప్రబలకుండా ఉండటం కోసం తాము సారం పీల్చింది పోగా మిగిలిన పిప్పిని మైసూరు గ్రామం కేంద్ర స్థానంగా ప్రత్యేక సంస్థానం కింద ఏర్పరచారు. అది కూడా స్వతంత్రంగా బతికే రాత లేకుండా తమ 'రక్షణ'లోనే ఉండాలన్నారు.

దొంగలు దొంగలు ఊళ్లు పంచుకోగా మిగిలిన నామమాత్ర రాజ్యపు గద్దె మీద ఎవరిని కూచోబెట్టాలి? పూర్ణయ్యలాంటి పెద్దలు టిప్పు కుమారుడే అందుకు అర్హుడని వాదించారు. వెల్లస్లీ మాత్రం చాలాకాలంగా తమకు సహాయకారిగా ఉన్న పూర్వపు హిందూ రాజకుటుంబానికి చెందిన మూడవ కృష్ణరాజ వొడియార్ అనే పదేళ్ల బాలుడికి ఏరికోరి పట్టం గట్టాడు. ఇందులోనూ ఇంగ్లీషువారి తెలివి కొట్టొచ్చినట్టు కనపడుతుంది. హైదరాలీ కూలదోసిన హిందూ రాజ కుటుంబానికి తిరిగి రాజ్యాధికారం అప్పగించటం ద్వారా చారిత్రక అన్యాయాన్ని సరిదిద్ది తెల్లవారు హిందువులకు మహోపకారమేదో చేసినట్టు పలువురు ఇంగ్లీషు పండితులైతే తెగ పొగిడారు. నిజానికి- హైదరాలీ రంగంలోకి రావటానికి నలభయ్యేళ్ల పూర్వమే మైసూరు మహారాజును హిందువులైన అతడి మంత్రులు దేవరాజు, నంజరాజులే కీలుబొమ్మను చేసి మూల కూచోబెట్టారు. టిప్పును చంపాక తెల్లదొరలకు ఆ రాజ కుటుంబం గుర్తు కొచ్చింది న్యాయం మీద గౌరవంతో కాదు.

ఇందులోని మర్మమేమిటో ఆ కాలపు వెల్లస్లీ ఉత్తర ప్రత్యుత్తరాలను చూస్తే అర్థమవుతుంది. టిప్పు కొడుకును కనుక గద్దెనెక్కిస్తే తనకు రాజ్యమిచ్చారన్న కృతజ్ఞత కంటే - తన తండ్రిని చంపి, తమ రాజ్యంలో సింహభాగం కాజేశారన్న క్రోధమే తెల్లవారిపై కనపరచగలడు. పూర్వ వైభవాన్ని తిరిగి పొందడానికి మిగతా దేశీయ ప్రభువులను అతడు కూడగట్టే ప్రమాదమూ ఉంది. అదే హిందూ రాజకుమారుడైతే? 70 ఏళ్లుగా అధికారం పోయి దిక్కు మొక్కు లేకుండా పడి ఉన్న తమ కుటుంబాన్ని తిరిగి ఉద్ధరించారని ఇంగ్లీషువారికి ఆజన్మాంతం కృతజ్ఞుడై ఉంటాడు. అదీ కిటుకు.

సాలుకు 21 లక్షలు ఇంగ్లీషువారికి మైసూరు రాజు కప్పంకట్టేలా, అందుకు ప్రతిగా బ్రిటిష్ సేనలు అతడి రాజ్యరక్షణ బాధ్యత వహించేలా, కీలక వ్యవహారాలన్నింటిలో సార్వభౌమాధికారం వాస్తవానికి ఇంగ్లీషువారి పరమయ్యేలా చేయవలసిన బిగింపులన్నీ



చేసి 1799 జులై 8న రాజుకూ కంపెనీకి మధ్య ఒడంబడిక కుదిరింది. దాంతో తెల్లవారు ఆక్రమించగా మిగిలిన చెక్క కూడా వారి పంటికింద పోకచెక్కలా పడి వుండే కట్టుదిట్టం పూర్తయింది. దక్షిణ భారతం నుంచి తెల్లవారిని తరిమికొట్టాలన్న తండ్రీ, కొడుకుల వీర పోరాటం అలా విషాదాంతమైంది. పక్కలో బల్లెంలా ఉన్న మైసూరు కంచుకోట కుప్పకూలిపోవడంతో ఇండియాలో ఇంగ్లీషువారి దురాక్రమణకు ఏకైక ప్రతిబంధకం కూడా తొలగిపోయింది. ఇక మిగిలినవన్నీ గుజ్జనగూళ్లే.

# భలే సాలెగూడు

వెల్లస్లీ గొప్పమనిషి! ఇది సక్రమం; అది అక్రమం అన్న చింత ఆయనకు ఉండదు. ముందు అక్రమాన్ని చేసి ఆనక దాన్ని సక్రమంగా చూపెట్టుకోవటం ఎలాగో ఆయనకు తెలుసు. దొరగారు చిన్నతనంలోనే ఒక ఫ్రెంచి పడుచును ఉంచుకున్నారు. ఆమెకి పిల్లలు పుట్టారు. అక్రమ సంతానాన్ని కన్న తరువాత ఆమెనే లేటుగా పెళ్లి చేసుకుని అక్రమ సంబంధాన్ని సక్రమ దాంపత్యంగా మార్చేసుకున్నాడు. ఆ తెలివితేటలనే రాజనీతిలోనూ చూపించి గవర్నర్ జనరల్‌గా యుక్తాయుక్తాల, ఉచ్చనీచాల జంజాటం పెట్టుకోకుండా భారతదేశ పటంలో విశాల ప్రాంతాలను బ్రిటిష్ బావుటా కిందికి లాగేశాడు.

ఇంతకీ వెల్లస్లీ ఇంగ్లీషువాడు కాదు. అతడు పుట్టింది ఐర్లండులో. అప్పట్లో ఐర్లండుకు వేరే పార్లమెంటు ఉండేది. అందులో కొంతకాలం వెల్లస్లీ మెంబరు. తరువాత ఇంగ్లండుకు వలస పోయాడు. ఐర్లండు వారికి కష్టకాలంలో ఎన్నోసార్లు సహాయం చేసింది ఫ్రెంచి వారు. వెల్లస్లీకే గనుక స్వదేశాభిమానం ఉంటే ఉపకారులైన ఫ్రెంచివారి పట్ల కృతజ్ఞతా భావం చూపాలి... కానీ ఆయన ఇంగ్లీషు నీళ్లు ఒంటబట్టగానే ఫ్రెంచి వారిపై తగని కక్ష పెంచుకున్నాడు.

దానికీ ఒక కారణం లేకపోలేదు. అతడి ఫ్రెంచి ఉంపుడుగత్తె పెళ్లాంగా ప్రమోషన్ ఇచ్చినా అతడిని లెక్కచేసేదికాదు. ఇండియాకు పోదాం రమ్మని ఎంత బతిమిలాడినా ఆమె ఒప్పుకోలేదు. ఆ గొడవ దగ్గరే ఇద్దరికీ తెగతెంపులయ్యాయి. అప్పటినుంచీ మొత్తం ఫ్రెంచి జాతిమీదే మహాద్వేషం పెంచుకున్నాడు. ఎక్కడెక్కడి ఫ్రెంచి వారినీ ఏరివేసి శాయశక్తులా వేటాడటం ఒక ప్రధాన లక్ష్యంగా ఇండియా ఆక్రమణకు వెల్లస్లీ బృహత్ వ్యూహాన్ని పన్నాడు.

తన 37వ ఏట గవర్నర్ జనరల్‌గా నియమితుడయ్యే నాటికి భారతదేశం ఆనుపానులు వెల్లస్లీకి బాగా తెలుసు. పైగా ఇండియాకి పంపించేముందు ప్రధానమంత్రి పిట్టు వారంరోజుల పాటు వెల్లస్లీని తన దగ్గర ఉంచుకుని భారతదేశంలో బ్రిటిష్ సామ్రాజ్యాన్ని ఏమి చేసయినా విస్తరించాలని నూరిపోశాడు. అన్నీ ఆకళింపు చేసుకున్నాక వెల్లస్లీ జాగ్రత్తగా పథకం వేశాడు. అతడు దేనికీ తొందరపడే రకం కాదు. 1797 నవంబరులో ఇంగ్లండులో బయలుదేరి అతడు సరాసరి ఇండియాకు రాలేదు. మధ్యలో దక్షిణాఫ్రికా కేప్ ఆఫ్ గుడ్ హోప్ అగ్రంలో రెండునెలలు మకాం చేసి, భారత ప్రజల స్వాతంత్ర్యాన్ని అపహరించే ఎత్తులన్నిటికీ తీరుబడిగా సానపెట్టాడు. అక్కడ స్థానిక బ్రిటిష్ గవర్నరుకు అతిథిగా "హాయిగా" ఉన్న రెణ్నెల్లలోనే ఆ గవర్నరు భార్య లేడీ అన్నే బెర్నార్డుతో ప్రశస్తమైన ప్రేమకలాపం నడిపాడు. రెండేళ్ల తరువాత టిప్పును వధించిన ఘనకార్యానికి మెచ్చి బ్రిటిష్ ప్రభుత్వం తనకు 'మార్క్విస్' బిరుదాన్నిచ్చిన సందర్భంలో... తాను చేసిన సేవకు ఆ గౌరవం చాలా తక్కువ అని మటమటలాడుతూ - ఈ ప్రియురాలికే 1800 అక్టోబరులో వెల్లస్లీ ఇలా జాబురాశాడు.

"On what honours you compliment me I know not... I have received none- I expect none... But do not suppose me to be so weak as to meditate hasty resignations, or passionate returns to Europe... No. I will shame their injustice... I will heap kingdoms upon kingdoms, victory upon victory, revenue upon revenue; I will accumulate glory and wealth and power... and then I will show my masters what dust in the balance their tardy gratitude is..."

[***Rise of the Christian Power in India* - B.D. Basu,** *p. 306*]

(నాకు ఏమి గొప్ప గౌరవం వచ్చిందని నన్ను అభినందిస్తున్నావు?... నాకేమీ రాలేదు. వస్తాయని అనుకోను... అంతమాత్రాన తొందరపడి రాజీనామా చేస్తాననో, యూరపునకు తిరిగి పోతాననో నువ్వు అనుకోకు. నాకు చేసిన అన్యాయానికి వారికే సిగ్గొచ్చేట్టు చేస్తా... రాజ్యం తరవాత రాజ్యాన్ని సాధించిపెడతా. విజయం తరవాత విజయాన్ని, రెవిన్యూ మీద రెవిన్యూను తీసుకొచ్చి వారిమీద కుప్పపోస్తా. కీర్తిని, సంపదను, అధికారాన్ని పోగుపడేసి వాటిముందు నా పట్ల చూపిన కృతజ్ఞత ధూళి రవ్వంత చెయ్యదన్న సంగతి నా యజమానులకే చూపిస్తా).

వెల్లస్లీ మనఃస్థితిని దీన్నిబట్టి అర్థం చేసుకోవచ్చు. అతడు ఎడమకాలు మోపే నాటికి భారతదేశం ప్రశాంతంగా ఉంది. ఇంగ్లీషు వారికి ఎవరితోనూ యుద్ధాలు లేవు. ఎవరికీ వారితో తీవ్ర శత్రుత్వం లేదు. ఇండియాలో కొత్తగా ప్రాంతాలను జయించి, ప్రాబల్యాన్ని ఇంకా విస్తరించుకోవాలన్న ఉద్దేశం తమకు ఎంతమాత్రమూ లేదని 1784 ఇండియా యాక్టులో చెప్పుకున్నదానిమీద బ్రిటిష్ ప్రభువులకే కనుక చిత్తశుద్ధి ఉంటే నూతన విజయాల గురించి ఆలోచించవలసిన అగత్యమే ఆనాడు లేదు. ఒకరి జోలికి పోయే ఉద్దేశమే లేకుంటే దేశీయ రాజుల బలాబలాలను కనిపెట్టి ఉండాల్సిన అవసరం తెల్లవారికి లేదు. కాని- వారి బలాబలాల్ని కనిపెట్టి, ఎలాగైనా బలహీన పరచాలన్నదే ఇండియా పంపేముందు పిట్టు ప్రధాని వెల్లస్లీ చెవిలో ఊదిన మొదటి మాట. ఈ అప్రకటిత లక్ష్యాన్ని సాధించి, విజయం తరవాత విజయాన్ని సాధించి పారేయటానికి దక్షిణాఫ్రికా విడిదిలో వెల్లస్లీ ప్రణాళిక వేశాడు. ఆ సమయంలో అక్కడ ఇద్దరి పరిచయం అతడికి బాగా లభించింది. ఇద్దరూ ఇదివరలో చాలా కాలం ఇండియాలో పనిచేసినవారే. అక్కడి సంగతి సందర్భాలు, దర్బార్ల

గుట్టుమట్లు బాగా తెలిసినవారే.

కొత్త మిత్రుల్లో ఒకడు డేవిడ్ బెయిర్డు. టిప్పుసుల్తానుకు ఖైదీగా చిక్కి అతడి చేతిలో అవమానాలపాలయినందున, ప్రతీకారంకోసం అతడు దహించుకుపోతున్నాడు. రెండో వాడు మేజర్ కర్క్ పాట్రిక్. గతంలో మాధవరావు సింధియా దర్బారులో రెసిడెంటుగా పనిచేసి నానాఫడ్నవిస్‌కూ సిందియాకూ పడకుండా చేసి మహారాష్ట్ర రాజ్యనాశనానికి బీజాలు నాటిన పెద్దమనిషి. తరువాత హైదరాబాద్‌కు రెసిడెంటుగా వెళ్లి, నైజాం రాజ్య ఆంతరంగిక వ్యవహారాల్లో కలగజేసుకుని తంపులుపెట్టి నానా అల్లర్లు లేవదీసిన ఘనుడు. వారన్‌హేస్టింగ్స్, కారన్ వాలిస్‌ల 'బడి'లో చదువుకున్న గుంటనక్క అతడు. అన్నట్టు–దేశీయ రాజ్యాలన్నిటినీ బ్రిటిష్ బుట్టలో వేసుకోవటానికి వెల్లస్లీ అమలు జరిపిన సబ్సిడియరీ అలయెన్సు స్కీము (సైనిక సహకార పథకం) కర్క్‌పాట్రిక్ బుర్రలో పుట్టిందే. ఆ కాలాన దేశీయ రాజ్యాల్లో ముఖ్యమైన మైసూరు, పుణె, హైదరాబాద్‌లలో ఇంగ్లీషువారిపై కత్తిగట్టి యుద్ధం చేయ సాహసించింది మొదటి రెండే. కారన్‌వాలిస్ చేతిలో టిప్పుసుల్తాను అర్ధరాజ్యం కోల్పోయి ఆర్థికంగా చితికినా అతడివల్ల ఎప్పటికైనా తమకు ప్రమాదమేనని వెల్లస్లీకి తెలుసు. మహారాష్ట్రులు వెనుక వారన్ హేస్టింగ్స్ కాలంలో ఉన్నంత దుర్నిరీక్ష్యంగా ఏమీలేరు. పూనాలో మాస్టిను, సిందియా కొలువులో కర్క్‌పాట్రిక్కు దివ్యంగా పనిచేసి, మహారాష్ట్రలో అంతఃకలహాల్ని విపరీతంగా పెంచివేశారు. అయినా మరాఠాల శక్తి ఉడిగిందనటానికి వీలులేదు. ఈమధ్యే కుర్డ్లా యుద్ధంలో నిజాంను వారు చిత్తుగా ఓడించారు. కాబట్టి మహారాష్ట్ర పుట్టలో ఎలాంటి పాములున్నాయోనన్న భయం ఇంగ్లీషువారికి ఇంకా ఉంది. టిప్పును వేటు వేసేంతవరకూ మహారాష్ట్రుల జోలికి పోవటం వెల్లస్లీకి ఇష్టంలేదు.

ఇక మిగిలింది నైజాం. ఆ రాజ్యమంటే తెల్లవారికి మొదటి నుంచీ లోకువే. వంగి వంగి సలాములే తప్ప వారితో పోరాడే ధైర్యాన్ని నైజాం ఎన్నడూ చూపిన పాపాన పోలేదు. యుద్ధరంగంలో గాని, రాజనీతి కౌశలంలో గాని నైజాం రాజ్యానికి దాని జన్మలో ఎప్పుడూ పేరు ప్రఖ్యాతులు లేవు. పైగా తెల్లవారు ఇండియాలో క్రమంగా పైకి ఎక్కటానికి నైజాం ప్రభువులు నిచ్చెనమెట్లుగా పనికొచ్చారు. మొగల్ పాదుషా ప్రతినిధిగా దక్కను సుబేదారుగా వచ్చి, సమయం చూసి స్వామి ద్రోహానికి పాల్పడి స్వాతంత్ర్యం ప్రకటించుకుని హైదరాబాద్ రాజధానిగా సొంత దుకాణం పెట్టిన నిజాం ఉల్ ముల్క్ ఈ రాజ్యానికి స్థాపకుడు. అతడు చనిపోయాక చెలరేగిన వారసత్వ తగాదాలు భారత రాజకీయ వ్యవహారాల్లో ఇంగ్లీషు వారు, ఫ్రెంచివారు తల దూర్చటానికి తొలి అవకాశమిచ్చాయి. నానాఫడ్నవిస్, హైదరాలీల ప్రోద్బలంతో నైజాం ఒక దశలో ఆంగ్లేయుల వ్యతిరేక కూటమిలో చేరినా, గుంటూరు సర్కారును తిరిగి తన మొగాన పడవేయగానే అతడు మళ్లీ తెల్లవారికి తోకాడించాడు. మూడో మైసూరు యుద్ధ సందర్భాన కారన్‌వాలిస్ కోరినంత మాత్రానే నిజాం మారుమాట్లాడక ఉత్తర సర్కారులన్నీ ఇంగ్లీషువారి చేతికి పళ్లెంలో పెట్టి అప్పగించాడు. యుద్ధంలో కోరిన సహాయమల్లా చేశాడు.

సరే! తమకు ఎక్కువ మేలు నైజాం చేశాడు కనుక మొదటి కీడు అతడికే చేయాలని వెల్లస్లీ దొర సంకల్పించాడు! ఉన్న రాజులందరిలోకీ అతడే దుర్బలుడు కాబట్టి దురాక్రమణను అతడితోనే మొదలుపెట్టాలని, మహారాష్ట్రుల చేతిలో దెబ్బతిని ఉన్న స్థితిలోనే నైజాంను పూర్తిగా తమ గుప్పిట్లో ఇరికించుకోవాలని అతడు కుటిల వ్యూహం పన్నాడు. దానికి



ముద్దుపేరే "సైనిక సహకార పథకం".

ఈ పథకం ఒక పయోముఖ విషకుంభం. దేశీయ రాజుల స్వాతంత్ర్యాన్ని కుంగదీసి వారిని, వారి రాజ్యాలను క్రమంగా ఇంగ్లీషువారి కాలి కిందికి పడలాక్కోవటమే దీని ముఖ్యోద్దేశం. పైకి చూడటానికి తీపిగా ఏపుగా ఉంటుంది. చూపులకు భ్రమసి ఎవరైనా అక్కున చేర్చుకున్నారో విషకన్యలా కాటేస్తుంది. గతంలో వారన్ హేస్టింగ్సు అయోధ్య నవాబు మీద ప్రయోగాత్మకంగా అమలు జరిపిన సేనల అద్దె పథకానికే వెల్లస్లీ నగిషీలు దిద్ది ఇండియాను కబళించేందుకు ప్రధాన సాధనంగా మలిచాడు. దీనికీ ఒక చారిత్రక అవసరం తగులడింది!

ఏమిటంటే– ఇకపై దేశీయ రాజ్యాలను జయించరాదని కదా ఇండియా యాక్టులో పార్లమెంటు కట్టడి చేసింది? జయించకుండానేమో సీమప్రభువుల సామ్రాజ్య కాంక్ష ఊరుకోనివ్వదాయె. దౌర్జన్యంగా రాజ్యాలను లాగేసుకుంటేనేమో పార్లమెంటులో మాట వస్తుందాయె. మరి చట్టాన్ని చాపచుట్టి స్వదేశంలో జనం కళ్లలో ఎలా మన్నుకొట్టాలా అని ఆలోచిస్తే వెల్లస్లీకి ఇదిగో ఈ ఉపాయం తోచింది. దీని ప్రకారం పర రాజ్యాలపై దండయాత్ర లేవీ పైకి కనిపించవు. రాజు రాజు పళంగానే గద్దెమీద ఉంటాడు. రాజలాంఛనాలన్నీ మామూలుగానే నడుస్తాయి. కాని నిజమైన అధికారమంతా రాజు చేతిలో నుంచి పోయి పక్కన కూర్చున్న రెసిడెంటు చేతిలో పడుతుంది. తన రక్షణ కోసమని చెప్పి కొన్ని వేల ఇంగ్లీషు సైన్యాన్ని జీతబత్తేలిచ్చి రాజు తన దగ్గర పెట్టుకుంటాడు. రాజ్యరక్షణ భారం యావత్తూ తెల్లవారే మోస్తారు కనుక అప్పటిదాకా రాజు కొలువులో ఉన్న సొంత సేనలు, విదేశీరక్షణ దళాలు రద్దవుతాయి. బ్రిటిష్ సేనల నిరంతర పహరాలో వాస్తవానికి రాజు బ్రిటిష్ వారికి బందీ అవుతాడు. పరిపాలనలో అతడి మాట చెల్లదు. సమస్త నిర్ణయాలు, సకల అధికారాలు కంపెనీ రెసిడెంటే చెలాయిస్తాడు. పేరుకు 'రక్షణ'! జరిపేది 'భక్షణ'! అదో చిత్రమైన సాలెగూడు. ఒకసారి అందులో చిక్కాక మళ్లీ బయటికి రావటం కల్ల! తరవాత మెల్లిగా వీలు చూసుకుని రాజ్యాన్ని కంపెనీ తనలో కలిపేసుకుంటుంది. రాజ్యం దానికదే స్వచ్ఛందంగా ఆత్మహత్య చేసుకుని బ్రిటిష్ సామ్రాజ్య సాయుజ్యం పొందింది కనుక అది దురాక్రమణ కిందికి రాదని సీమవాసులను ఒడుపుగా బురిడీ కొట్టిస్తారు.

అదీ పద్ధతి. విదేశీ సేనను జీతబత్తేలిచ్చి తనచుట్టూ పెట్టుకుని వాటి చేత రాజు తననే ఖైదు చేయించుకునే భలే స్కీముకు వెల్లస్లీ మొదటగా నిజాంను బలిచేయదలిచాడు. ఆ కాలంలో దేశంలో అన్ని రాజ్యాలలాగే నైజాం కొలువులోనూ విదేశీ సేనలు ముఖ్యంగా ఫ్రెంచి దళాలు విరివిగా ఉండేవి. సాంప్రదాయక రీతిలో కత్తి డాలు పట్టి తాము ఎంత శౌర్యం చూపినా యూరోపియన్ సైనిక తంత్రం ముందు నిలవలేకపోవటాన్ని గమనించి మహారాష్ట్రలో సదాశివరావు భావు కాలంనుంచీ విదేశీ కిరాయి సేనలను నియమించుకుని, యూరోపియన్ తరహాలో యుద్ధాలు చేయటం మన దేశంలో హెచ్చయింది. మైసూరులో హైదరాలీని చూసి నైజాం కూడా ఫ్రెంచి కిరాయి సైన్యాన్ని భారీగా ఏర్పాటు చేసుకున్నాడు. దానివల్ల నిజానికి ఇంగ్లీషు వారికి ముంచుకొచ్చిన ముప్పేమీ లేదు. టిప్పుపై మూడో మైసూరు యుద్ధంలో నిజాంకు చెందిన ఫ్రెంచి సేనలు కూటమి నాయకులైన ఇంగ్లీషు వారికి కోరినట్టల్లా సహాయ పడ్డాయి. కూటమి ఇంకా అమల్లోనే ఉంది కనుక అదే టిప్పు సుల్తాను మీద మళ్లీ యుద్ధానికి పోదలిస్తే ఇవే ఫ్రెంచి సేనలు వెనుకటిలా తమకు

ప్రయోజనం లేక... ఈ లోపు వర్షాలు ముంచుకు రావడంతో వట్టి చేతులతో తిరిగి వచ్చాడు. ఆ వైఫల్యాన్ని మరచిపోవడానికి కొత్తగా ఇద్దరు కన్యలను పెళ్లి చేసుకుని సాహూ వానాకాలాన్ని సుఖంగా వెళ్ళదీస్తుంటే తారాబాయి మెరపులా కదిలి, తెలివిగా పావులు కదిపి కొల్హాపూర్ సమీపంలోని పన్హాలా కోటను తిరిగి చేజిక్కించుకుని అక్కడి నుంచే పోటీ రాజ్యాన్ని నడిపింది.

'సాహు సవ్యంగా ఉండి అప్రమత్తతతో వ్యవహరిస్తే ఎలా ఉండేదో. రాజులోనే అలసత్వం పొడసూపటంతో కిందివారిలో కొత్త ఊహలు పుట్టి క్రమేణా తల ఎగురవేయసాగారు. మరాఠా అస్తిత్వం నిలుపుకొనడానికి మొగలు చక్రవర్తితో పోరాడిన కాలంనాటి దృఢదీక్ష మొగలు సామ్రాజ్యమే విచ్ఛిన్నమైన తరువాత వారిలో క్రమేణా సడలింది. తమకు రాజుగా ఉన్న సాహుయే మొగలు చక్రవర్తికి అప్పుడైనప్పుడు అదే పక్షంలో తాము మాత్రం ఎకాఎకి చేరిపోతే తప్పేమిటన్న అభిప్రాయం కొందరికి కలిగింది. కేవలం దక్కనుకు పరిమితమైన సాహు కంటే విశాల సామ్రాజ్యాన్ని ఏలే చక్రవర్తి వల్ల తమకు ఎక్కువ మేలు కలుగుతుందని వారికి ఆశ పుట్టింది. శివాజీ నెలకొల్పిన వ్యవస్థలో ఎంతటి అధికారులయినా నగదుగానో, వస్తు రూపంలోనో జీతం తీసుకోవలసిందే తప్ప ఎవరికీ ఎలాంటి జాగీర్లు ఉండవు. అదే మొగలు సామ్రాజ్యంలోనైతే చిన్న సర్దార్లకు కూడా జాగీర్లు ఇస్తారు. ఇదిగో - ఇలాంటి ఆశలన్నీ కలగలిసి మరాఠా ముఖ్యులు పలువురి మీద తారాబాయి తంత్రం అమోఘంగా పనిచేసింది. నేమాజీ సింధియా వంటి వీరులు మొగలుల కొలువులో కుదిరిపోగా, కన్హోజీ ఆంగ్రే బోటివారు స్వాతంత్ర్యం ప్రకటించుకుని సాహుపై కత్తి ఎత్తారు.

మిగతా ఇబ్బందులు ఎలా ఉన్నా మొగలు చక్రవర్తి దగ్గర తన పలుకుబడి వరకూ తిరుగులేదని మొదట్లో సాహుకు గొప్ప నమ్మకం ఉండేది. గద్దెనెక్కాక రెండో ఏడే ఆ భ్రమ కూడా తొలగింది. 1709లో తమ్ముడు కాంబక్ష్ తిరుగుబాటును అణచడానికి దక్షిణాదికి తరలి వచ్చిన చక్రవర్తి బహదూర్‌షా తనకు తోడ్పడవలసిందిగా ఆ ప్రాంతంలోని మిగతా సర్దార్లతో బాటు సాహుకూ ఆదేశం పంపాడు. అప్పటిదాకా - దక్కనులో అన్ని వసూళ్ల మీద చౌథ్‌ను, సర్దేశ్‌ముఖిని వసూలు చేసుకోనిస్తామని, మీ 'స్వరాజ్'ను గుర్తిస్తామని నోటిమాటగా చెప్పటమే తప్ప దానిని ధ్రువీకరిస్తూ సాహుకు పాదుషా నుంచి ఎలాంటి ఫర్మానా అందలేదు. దక్కనులో విడిది చేసిన సమయంలో చక్రవర్తికి ఆ సంగతి గుర్తుచేసి సునాయాసంగా ఫర్మానా పొందగలనని సాహు అనుకున్నాడు. కానీ అతడు వెళ్ళేసరికి కొల్హాపూర్ నుంచి తారాబాయి పనుపున వచ్చిన దూతలు పాదుషా వాకిలిలో ఉన్నారు. మరాఠా గద్దెకు అసలు హక్కుదారు తమ ప్రభువేనని, సాహు అడుగుతున్న దానికంటే చాలా తక్కువ ప్రతి ఫలానికే తమ సేనలు చక్రవర్తికి లభించగలవనీ వారు బేరాలు పెట్టారు. మరాఠాల మధ్య తంపులు పెట్టి తమాషా చూడాలన్న తమ పన్నాగం దివ్యంగా ఫలించినట్టు బహదూర్‌షాకు అర్థమైంది. ఇంకేం? 'కొల్హాపూర్ పార్టీ'ని ఆశల పల్లకీలోనే ఉంచి... మీ తగవును మీలో మీరు తేల్చుకున్నాకే ఫర్మానా సంగతి ఆలోచిస్తామని 'సతారా పార్టీ'కి చెప్పి ఎటూ తేల్చకుండా పాదుషా చక్కాపోయాడు. అధికారమనేది సొంత బలంతో కష్టపడి స్థాపించుకోవలసిందే తప్ప ఒకరి దయాదాక్షిణ్యాలతో సంపాదించుకోగలిగేది కాదన్న కఠోర సత్యం సాహుకు తెలిసి వచ్చింది.



పాదుషా దగ్గర కూడా సాహుకు గొప్ప పలుకుబడి లేదని తేలిపోవడంతో మరాఠా ముఖ్యుల్లో కొంతమంది తోకజాడించి బాహటంగా తిరుగుబాట్లకు ఉపక్రమించారు. ఇంచుమించుగా ఇదే సమయంలో సాహు అధికారానికి మూలస్తంభమైన పర్సోజీ భోంస్లే కన్నుమూశాడు. సేనాపతి ధనజీ యాదవ్ మరణంతో అప్పటికే కుడిభుజం విరిగినట్టు అయిన సాహుకు సమస్యలు, సవాళ్లు కూడబలుక్కున్నట్టు నలువైపులా చుట్టుముట్టాయి. సొంత సేనాపతే అతడిపై కుట్రకు పాల్పడ్డాడు. తిరుగుబాట్లు, వెన్నుపోట్లు, కుట్రలూ కుహకాల వదంతులతో మరాఠా రాజ్యం అట్టుడికిపోయింది. సింహాసనమెక్కి రెండేళ్ళు తిరక్కుండా సాహు అధికారం ఊగిసలాడసాగింది.

అదృష్టవశాన అధికారం అందుకోవడం వేరు. శక్తి సామర్థ్యాలతో దానిని నిలబెట్టుకోవడం వేరు. అదృష్టం కలిసి వచ్చి, ప్రజాభిప్రాయం సహకరించిన సాహు 'ఛత్రపతి' కాగలిగినా ఆ బృహత్ బాధ్యతను భుజస్కంధాలపై మోయడానికి కావలసిన ప్రతిభా పాటవాలు అతడికి లోపించాయి. మనిషి మంచివాడే, సత్పురుషుడే. కాని - పరాక్రమానికి మారుపేరైన మరాఠా రాజ్యంలో దిగ్గజాల్లాంటి యోధులను అదుపులో పెట్టి ముందుకు నడిపించటానికి మంచితనం ఒక్కటే చాలదు. బుద్ధిబలం, భుజబలం, కఠోర క్రమశిక్షణ, లోకజ్ఞానం, చాకచక్యం పదుగురి విశ్వాసం చూరగొని పదుగురిని కలుపుకుపోయే లక్షణం, దూరదృష్టి, వ్యవహార దక్షత లాంటి సుగుణాలు ఎన్నో కావాలి. అవి సాహులో లోపించాయి. కాబట్టి తొలుత వచ్చిన స్వర్ణావకాశాలు చేజారి, లుకలుకలు హెచ్చి మరాఠా సీమ నాథుడు లేని రాజ్యమైంది.

సంక్షోభం నుంచి గట్టెక్కాలంటే గట్టి నాయకత్వం అవసరమని అర్థమైనా అది ఎవరి వల్ల ఎలా లభిస్తుందో తెలియని అనిశ్చిత స్థితిలో -వినాశపుటంచు నుంచి రాజ్యాన్ని కాపాడే రక్షకుడు దొరికాడు. దిక్కుతోచక ఉక్కిరిబిక్కిరి అయిన సాహును ఒడ్డున పడేసి - మరాఠా చరిత్రలో ఉజ్వలమైన కొత్త అధ్యాయానికి శ్రీకారం చుట్టాడు.

ఉపయోగపడవన్న అనుమానం ఆంగ్లేయులకు కలగటానికి లేశమైనా ఆస్కారం లేదు.

అయితే వెల్లస్లీకి కావలసింది కారణం కాదు, మిష. టిప్పుసుల్తాను మనపై యుద్ధానికి ఆయత్తమవుతున్నాడని అకారణంగా ఆరోపించి, ఆ యుద్ధంలో ఫ్రెంచి వారు మనకు హాని చేస్తారని నిర్హేతుకంగా ఊహించి... కాబట్టి, నైజాం కొలువులోని ఫ్రెంచి సైనికులందరినీ పీకేయించి వారికి బదులుగా రక్షణ బాధ్యతను మనకు గుత్తకు ఇచ్చేలా చూడమని హైదరాబాదు రెసిడెంటుకు వెల్లస్లీ దొర రహస్యంగా ఆనతిచ్చాడు.

ఆ సమయంలో రెసిడెంటుగా ఉన్నది ఎవరో కాదు. దక్షిణాఫ్రికాగ్రంలో వెల్లస్లీకి తారసపడ్డ మేజర్ విలియమ్స్ కర్క్ పాట్రిక్‌కు స్వయానా తమ్ముడు. పేరు కెప్టెన్ జేమ్స్ అకిలెస్ కర్క్ పాట్రిక్. అప్పటికే అతడు నైజాం దర్బారులో కలుపుగోలుగా తిరిగేస్తూ కిటుకులు, లోగుట్లు రాబడుతూ, దర్బారు ప్రముఖులతో కుటిల రాజకీయాలు నడపటంలో అపారమైన తెలివితేటలు కనపరుస్తున్నాడు. మహమ్మదీయ సర్దార్లు ఇతడికి 'హష్మత్‌జంగ్' అని ముద్దుపేరు పెట్టారు. మహమ్మదీయ ఆచార వ్యవహారాలను ఒంట బట్టించుకోవటమే గాక ఒక ఘరానా కుటుంబానికి చెందిన ఖైరున్నీసా అనే కన్యతో ప్రేమలో పడి, ఆమెకోసం మతం మారి, ముస్లిం సంప్రదాయబద్ధంగా నిఖా కూడా చేసుకున్నాడు. ఖైరున్నీసాతో ప్రణయంలో కిర్క్ పాట్రిక్ ధీరుడూ, రసికుడే అయి ఉండవచ్చు కాని రాజ్య వ్యవహారాల్లో మాత్రం అతడు పెద్దమనిషి కాడు. అతడు లంచగొండి అనీ, అనేక నీతి మాలిన పనులు చేశాడనీ నైజాం కొలువులోని బ్రిటిష్ తాబేదారులే అనేక ఫిర్యాదులు చేశారు. అప్పటి నైజాం దర్బారు మొత్తం అసమర్థులతో, అవినీతి పరులతో నిండి నానాగత్తరగా ఉండేది. వారిలో పట్టాల్సిన వారిని పట్టాల్సిన రీతిలో పట్టి కంపెనీకి కాగల కార్యాలను రెసిడెంటు తన దుర్బుద్ధి కుశలతతో నెరవేర్చేవాడు.

వెల్లస్లీ దౌత్య పరిభాషలో పొంకంగా చెప్పినట్టు నిజాంకు సాయపడి అతడి రాజ్యదక్షతను బ్రహ్మాండంగా పెంచి, అతడి అధికారాన్ని నిలబెట్టడమే తెల్లవారి ఆశయమైతే ఆ సంగతి మొట్టమొదట చెప్పాల్సింది నిజాంకు కదా? కాని వెల్లస్లీ చివరి నిమిషం దాకా తన పన్నాగాన్ని నిజాంకు తెలియనివ్వకుండా దాచిపుచ్చాడు. నిజాం మంత్రి అజీముల్ ఒమ్రాను లోబరచుకుని కొత్త ఏర్పాటుకు రహస్యంగా ఒప్పించాలనీ, అతడు సై అన్నదే తడవుగా మద్రాసు ప్రెసిడెన్సీ నుంచి సైన్యాన్ని హుటాహుటిన హైదరాబాదుకు పిలిపించాలనీ రెసిడెంటు కర్క్ పాట్రిక్‌కు 1798 జూలై 8న రాసిన 'రహస్య' లేఖలో వెల్లస్లీ పురమాయించాడు. ("Should Azim-ul-Omra consent, in the name of the Nizam, to the proposed conditions, you will then require the march of the troops from St.George"). నిజాంకే కాక మద్రాసు ప్రెసిడెన్సీకి గవర్నరు, మద్రాసు సైన్యానికి కమాండర్ ఇన్ ఛీఫ్ అయిన జనరల్ హారిస్‌కు కూడా తాను చేయదలచిందేమిటో వెల్లస్లీ చెప్పలేదు. ఇండియాలో బ్రిటిష్ ప్రయోజనాలను కాపాడటానికి అత్యవసరమైన పని నిమిత్తం మద్రాసు సైన్యాన్ని గుంటూరు వద్దకు తరలించి రడీగా ఉంచమని, తన మీద భరోసా ఉంచి ఆ సంగతి రహస్యంగా ఉంచమనీ హారిస్‌ను అతడు కోరాడు.

సీక్రెట్ ఆపరేషను అంతా అనుకున్నట్టు జరిగింది. నిజాం మంత్రి రెసిడెంటు బుట్టలో పడ్డాడు. ఫ్రెంచి కిరాయి దళాలను దఫాల వారీగా తొలగించాడు. సంకేతం అందగానే గుంటూరు నుంచి ఇంగ్లీషు సేనలు శరవేగంగా కదిలాయి. అవి హైదరాబాద్ దరిదాపులకు



చేరే సమయానికి నిజాంను బలవంతపెట్టి మరో దారిలేకుండా చక్రబంధంలో ఇరికించి, 1798 సెప్టెంబరు 1న దుర్మార్గపు ఒప్పందం మీద సంతకం చేయించారు. నిర్బంధ ఒడంబడిక మొదట్లోనే ఇలా చెప్పుకున్నారు :

"Whereas His Highness Nizam-ul-Mulk Asoph Jah Bahadur has from the greatness of existing friendship, expressed a desire for an increase of the detachment of the Honourable Company's troops at present serving His Highness..." (ఘనత వహించిన నిజాం ఉల్ ముల్క్ ఆసఫ్ జా బహద్దూరు వారు తమకును, మాననీయ కంపెనీ వారికిని గల స్నేహాధిక్యంతో ఇప్పుడు తమ కొలువులో ఉన్న కంపెనీ వారి సేనలకు అదనంగా మరొ కొన్ని సేనలు కావాలని తమ కోరికను తెలియపరచారు కాబట్టి...)

ఇదే పెద్ద అబద్ధం. కంపెనీ సేనలు కావాలని నిజాం ఎన్నడూ దేబిరించలేదు. వెల్లస్లీయే బలవంతంగా సేనల్ని తీసుకొచ్చి అతడి గొంతు మీదకూచుని మోసంతో దౌర్జన్యంతో సంతకం చేయించాడు.

ఆ సంతకమే నిజాం పాలనాధికారానికి డెత్ వారంటు అయింది.

# మిత్రుడికి బెబ్బే!

ఆర్కాట్ నవాబు మహా ఆనందపడ్డాడు. పక్కలో బల్లెంలాంటి టిప్పుసుల్తాను పీడ విరగడయింది. అతడిని చంపి ఇంగ్లీషు మిత్రులు మొత్తం మైసూరు రాజ్యాన్ని జయించారు. ఇంతకంటే తనకు కావలసింది ఏముంది? మైసూరు పోరుగుపోరు తప్పటంతో ఇక కర్నాటక రాజ్యాన్ని తాను నిశ్చింతంగా ఏలుకోవచ్చు. ఇంగ్లీషు వాళ్లు చిరకాల ఆప్తమిత్రులు కనక వారితో తనకు గొడవే లేదు; రాదు. గతంలో టిప్పు తండ్రి హైదరాలీ దగ్గరినుంచి అక్రమంగా లాగేసుకున్న కరూరు, సేలం వగైరా ప్రాంతాల్ని కూడా ఇప్పుడు బ్రిటిష్ వారితో మాట్లాడుకుని తిరిగి రాబట్టుకోవచ్చు. తాను నోరు తెరిచి అడిగితే వారు కాదనరు. ఔను మరి! ఇన్నేళ్లలో తన తండ్రి, తాను వారికి ఎన్నివిధాల సహాయపడ్డారు? ఆఖరికి మొన్నటి యుద్ధంలో టిప్పుమీద వారు గెలవటానికి కూడా తాను సాలుకు తొమ్మిది లక్షల వరహాలిచ్చి పోషిస్తున్న ఇంగ్లీషు సేన ఒక ప్రధాన కారణమే కదా? ఆ ఉపకారం వారెలా మరచిపోతారు?

ఆర్కాట్ నవాబు ఉమ్ దత్ ఉల్ ఉమ్రా భరోసాకు ఇంకో కారణం కూడా ఉంది. అతడి లెవెలు చాలా పెద్దది. సాధారణంగా దేశీయ ప్రభువులు ఎవరైనా కంపెనీ రెసిడెంట్లతోనో, దౌత్య అధికారులతోనో, గవర్నరుతోనో, మహా అయితే గవర్నర్ జనరలుతోనో మాట్లాడగలరు. కర్నాటక నవాబు అలా కాదు. అతడికి బ్రిటిష్ పాలక వర్గంలో పెద్దవాళ్లు చాలా మందే తెలుసు. రాజకుటుంబం అతడికి బాగా పరిచయం. వేల్సు యువ రాజయితే అతడికి తరచు ఉత్తరాలు రాస్తుంటాడు. అసలైన సీమ మారాజులే తనకు నేస్తులు కాబట్టి, ఆఫ్టరాల్ 'కంపెనీ అధికారులయిన గవర్నర్ జనరలు లాంటివారు తనతో ఒళ్లు దగ్గరపెట్టుకుని బుద్ధిగా ఉంటారని నవాబుకు గొప్ప నమ్మకం!

కాని- ఎదుటివాడు వెల్లస్లీ! గుడిని, గుడిలో లింగాన్ని అవలీలగా మింగెయ్యగలడు. పాప భీతి అతడికి లేదు. ఏదో ఒక దారిలో బ్రిటిష్ సామ్రాజ్య విస్తరణే అతడికి కావలసింది. టిప్పు అడ్డు తొలగగానే మిత్రధర్మాన్ని పాటించి కర్నాటక నవాబుకు ఇవ్వాల్సిన వాటా ఇచ్చి సఖ్యంగా ప్రశాంతంగా మెలగాలని అతడు అనుకోలేదు. ఎలాగూ మైసూరు హస్తగతమైంది కనుక, దాని పొరుగు నవాబును కూడా కాలికింద నలిపివేస్తే మొత్తం కర్నాటక సీమను కైవసం చేసుకోవచ్చు కదా అని వెల్లస్లీ తలిచాడు. ఆ దశలో జాగుసేయక పావులు కదిపాడు.

కంపెనీ నౌకరు అయిన గవర్నరు జనరలు ఒకవేళ తనకు అపకారం తలపెట్టినా కంపెనీ యజమానులైన బ్రిటిష్ ప్రభువులు తనను తప్పక ఆదుకుంటారని వెర్రి నవాబు ధీమా! మహా నాగరికులైన సీమ దొరల అసలు రంగు అతడికి తెలియదు.

నిజానికి టిప్పు నేలకొరగటానికి కొన్ని వారాల ముందే ఆర్కాటు నవాబుకూ పుటంపెట్టే పని మొదలైంది. 'కర్నాటకలో ద్వంద్వ ప్రభుత్వం ఏమీ బాగాలేదు. దీన్ని తీసేసి కీలకాధికారాలు మనమే తీసుకుంటే బావుంటుంది. ఆర్కాటు నవాబుతో కుదుర్చుకున్న ఒప్పందాలవల్ల ఇప్పుడు మనం ఏమీ చేయలేము. అయినా మీరో కన్నువేసి ఉంచండి. ఏ మాత్రం అవకాశం దొరికినా కార్యం సాధించడానికి పొంచి ఉండండి' అని బ్రిటిష్ మంత్రివర్యులు రైటానరబుల్ డండాస్ గారు 1799 ఆగస్టు 5న వెల్లస్లీకి జాబు పంపాడు. దానికి వెల్లస్లీ "ఔనౌను. పరిస్థితి ఏమీ బాగాలేదు. తనకు తండ్రి లాంటి బ్రిటిష్ చక్రవర్తినే తప్ప కంపెనీ అధికారులను తాను లక్ష్యపెట్టేది లేదని నవాబు మిడిసిపడుతున్నాడు. మన మహారాజుగారు, యువరాజుగారు తరచూ ఉత్తరాలు రాస్తుండటం ఇతడికి మరీ అలుసు అయింది. ఈ సంగతి ప్రభువులకు తెలియపరిచి ఇతడిని దూరం పెట్టించండి. తరవాత సంగతి నేను చూసుకుంటాను" అని ప్రశస్తమైన ప్రత్యుత్తరమిచ్చాడు. ఈ నవాబు బతికుండగా వ్యవహారాలేవీ చక్కబడవు. ఇతడు చచ్చాక మనమే కావలసినట్టు ఏర్పాట్లు చేసుకోవచ్చు అంటూ- ఆ ఏర్పాట్లు ఏమిటో వెల్లస్లీ అదే జవాబులో ఇలా సెలవిచ్చాడు.

"No effectual remedy can ever be applied... without obtaining from the Nabob powers atleast as extensive as those vested in the Company by the late treaty of Tanjore. At the death of the present Nabob, such a treaty might easily be obtained from his successsor... Numerous legitimate descendants of Wallajah are in existence. The whole question of the succession will therefore be completely open to the decision of the Company... the most advisable settlement would be, to place Omdut-ul-Omra's suposed son on the Musnad... ..."

[***Rise of the Christian Power in India* - B.D. Basu,** *p. 346*]

(ఈ మధ్య తంజావూరు ఒప్పందంలో చేసినట్టు విస్తృతమైన అధికారాలన్నీ మనం నవాబు నుంచి లాగేసుకుంటే తప్ప వ్యవహారం చక్కబడదు. ఇప్పుడున్న నవాబు మరణించాక అతడి వారసుడి నుంచి ఇటువంటి ఒప్పందాన్ని మనం రాబట్టుకోవచ్చు. నవాబుకు వారసులమనేవారు చాలా మంది ఉన్నారు కనుక నవాబు చావగానే వారసత్వపు తగాదాలు వస్తాయి. అప్పుడు మన పనివాటంగా ఉంటుంది. వారసుడెవరో తేల్చడం కంపెనీ నిర్ణయం మీదే ఆధారపడుతుంది. ఉమ్ దత్ ఉల్ ఉమ్రాకు కొడుకని చెప్పుకుంటున్న కుర్రవాడిని గద్దెమీద కూచోబెట్టి,

మనకు కావలసిన కాగితం అతడిచేత రాయించి పుచ్చుకుంటే బాగుంటుందని నా సలహా).

'ఇదయినా- నవాబు అనేవాడు ఒకణ్ని మనం పేరుకు కొనసాగించాలని అనుకుంటేనే! నవాబే అక్కర్లేదు. అంతా మనమే కాజేద్దామని అనుకుంటే మరీ మంచిది. సర్వాధికారాలు మనమే స్వీకరించి, నవాబు వంశం వారికి ఇంత మనోవర్తి పారవేస్తే చాలదా? ఇది కూడా మీరు కొంచెం ఆలోచించి చూడండి' అని వెల్లస్లీ ఇదే లేఖలో ఉచిత సలహా ఇచ్చాడు. కాని- అలా నవాబుగిరీని మొత్తం కూల్చి అంతా తామే కాజేస్తే జనం తమ మొగాన ఉమ్మేతారని బ్రిటిష్ ప్రభువులు భయపడ్డారు. కీలుబొమ్మని కూచోబెట్టి తాము కథ నడిపించటమే అప్పుడున్న పరిస్థితుల్లో మేలని నిర్ణయమైంది. టిప్పుసుల్తాన్ తరవాత వంతుగా నవాబును వేటువేయాలని అనుకున్నది మొదలు అందుకు రంగం జాగ్రత్తగా సిద్ధమైంది.

ప్రవాహం దిగువన నీళ్లు తాగుతున్న మేక ఎగువనున్న నీటిని మురికి చేసిందని నెపంవేసి నోట కరచిన తోడేలు లాగే ఆర్కాట్ నవాబునూ తిప్పలు పెట్టడానికి వెల్లస్లీ తీరికూర్చుని సాకులు వెదికాడు. తమకు కట్టాల్సిన కప్పాలను నవాబు సక్రమంగా కడుతున్నప్పటికీ నాగాలు పెడుతున్నారని, బకాయిలు పెరిగాయని నింద వేశాడు. కర్నాటక రాజ్యం ప్రశాంతంగా ఉండి పరిపాలన సాఫీగా సాగుతున్నా, అంతా అల్లకల్లోలంగా ఉందనీ, అవినీతి, అక్రమాలు పెరిగి జనం బతుకు దుర్భరమైందనీ అభాండం వేశాడు. బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా టిప్పుసుల్తానుతో కుమ్మక్కయి నవాబు ద్వారా అతడి తండ్రి కుట్ర చేశాడని అబద్ధాల అల్లికకు ముక్తాయింపుగా - వెల్లస్లీ తప్పుడు అభియోగం బనాయించాడు. దీనికి సాక్ష్యాలు శ్రీరంగపట్నం కోట రికార్డుల్లో తమకు పట్టుబడ్డాయని బుకాయించాడు.

మేజర్ ఇవాన్స్ బెల్ *The Empire of India* గ్రంథంలో నిరూపించినట్టు ఇది తలా తోక లేని వెర్రిమొర్రి ఆరోపణ. ప్రస్తుత నవాబుకు తండ్రి అయిన మహమ్మదాలీ అర్ధ శతాబ్దంపాటు ఇంగ్లీషు వారితో కలిసిమెలిసి ఉన్నాడు. ముప్ఫై ఏళ్లపాటు హైదరాలీ, టిప్పులతో బద్ధవైరం పెట్టుకుని, వారి చేతిలో చాలా అవమానాలు, బాధలు పడ్డాడు. అలాంటివాడు తన చిరకాల మిత్రులైన ఇంగ్లీషు వారి అదృష్టం పండి, మైసూరు ప్రభ ఆరిపోయిన స్థితిలో... యుద్ధంలో ఓడి, ఇంగ్లీషు వారికి అర్ధ రాజ్యాన్ని సమర్పించుకుని, ఇద్దరు కొడుకులను తాకట్టుపెట్టి, అన్ని విధాల చితికిన టిప్పుసుల్తానుతో కుమ్మక్కయి తెల్లవారిపై కుట్రకు పాల్పడ్డాడన్న అభియోగం వింటే ఎవరైనా నవ్వుతారు.

పోనీ- మరణించిన నవాబు ఇప్పటి నవాబు ద్వారా నిజంగానే అటువంటి భయానక మిత్ర ద్రోహానికి పాల్పడ్డాడని మాటవరసకు అనుకున్నా, ఇంగ్లీషు వారికి ఆ సంగతి తెలియగానే సాక్ష్యాలను చూపించి నవాబును నిలదీసి ఉండాల్సింది కదా? కాని- నవాబు బతికి ఉన్నంతకాలమూ కంపెనీ వారు ఆ ప్రస్తావనే తేలేదు. అలాంటి అభియోగమే చేయలేదు. తాము సృష్టించింది తప్పుడు సాక్ష్యమని వారికి తెలుసు. అందుకే - గోతికాడ నక్కల్లా కాచుకు కూర్చుని, నవాబు మరణించే దాకా రెండేళ్ల పాటు ఆగి ఆ వెంటనే అతడి వారసుడి మీద తోడేళ్లలా పడ్డారు. మదరాసులోని చీపాక్‌లో నవాబు రాజప్రాసాదాన్ని చుట్టుముట్టి, అవసాన దశలోని నవాబుతోనూ, అతడి మరణానంతరం అతడి వారసుడితోనూ వ్యవహరించిన వైనాన్ని... ఏడేళ్ల తరువాత బ్రిటిష్ పార్లమెంటులో అభిశంసన తీర్మానం



ప్రవేశపెడుతూ సర్ థామస్ టర్టన్ (1808 మే 17న) ఇలా వివరించాడు :

"1801 జూలై నవాబు ఉమ్ దత్ ఉల్ ఉమ్రా చనిపోనున్న సమయంలో అల్లర్లు జరక్కుండా చూసే మిషతో కర్నల్ నీల్ నవాబు కాపురమున్న చీపాక్ మందిరం వైపు సైన్యంతో పోయాడు. అతణ్ని చూడగానే మరణశయ్య మీది నవాబు త్రుళ్లిపడి... అంతఃపురంలోకి సేనలను పంపి ప్రజల ముందు తనను నగుబాటు చేయవద్దని ప్రార్థించాడు. కర్నల్ నీల్ పోనీ లెమ్మని దయతలచి రాజమందిరాన్ని మాత్రం వదలి చుట్టూ సేనల్ని కాపలా పెట్టాడు! పది రోజుల తరువాత నవాబు మరణించాడు.

"On the same day on which the old Monarch died, the Prince, his heir, was dragged from his apartment, and called upon to answer to certain interrogatories, on a charge of treachery preferred against his father. He was told that his father and grandfather had carried on a treacherous correspondence with Hyder Ali and Tipoo Sultan, and that he, though innocent, was to be deprived of his dominions... unless he complied with certain requisitions..."

[***Rise of the Christian Power in India*, B.D.Basu,** *p.348*]

ముసలి ప్రభువు చనిపోయిన రోజునే, రాజమందిరంలో వేరే గదిలో ఉన్న రాజకుమారుడు అలీ హుస్సేన్‌ను ఇంగ్లీషు వారు బయటికి ఈడ్చుకుని వచ్చి "ఇదిగో చూడు. నీ తండ్రి, తాత మాకు వ్యతిరేకంగా హైదర్, టిప్పుసుల్తాన్‌తో చేరి ద్రోహపూరితమైన కుట్ర పన్నారు. ఈ సంగతి నీకేమీ తెలియక పోయినా దాని ఫలితాన్ని నువ్వు అనుభవించక తప్పదు. నీవిప్పుడు మా మాట ప్రకారం నడుచుకున్నావా నీకీ రాజ్యం దక్కుతుంది. లేకపోతే నిన్ను తీసి పారవేసి ఇంకొకణ్ని తక్తు మీద కూర్చుండబెడతాము. నిన్ను మా శత్రువుగా భావించుతాము. ఏమంటావు?" అని దబాయించిరి... ఆఖరుకు అతనిని తీసిపారవేసి రాజ్యమును ఇంకొకనికిచ్చినట్టు గవర్నరు జనరలు నుండి వచ్చిన హుకుమును అతనికి చూపించిరి... ఇతనిని తీసివేసినను ఇతని తరువాత వారసునకు రాజ్యమివ్వలేదు. ఎవరు తమకు అనుకూలమైన కాగితము వ్రాసి ఇస్తారా అని వెదకి చిట్టచివరికి రెండుమూడు తరముల దూరముండున్న అజీమ్ ఉల్ దౌలా అను వానితో కంపెనీ వారు బేరము కుదుర్చుకొనిరి. ఇతడా సమయమున ఎక్కడనో చెరసాలలో ఖైదీగ నుండెను. ఇతనిని బయటికి తీసుకువచ్చినప్పుడు - "ఎందుకు చెప్పుమా నన్ను పిలుచుచున్నారు - కొంపదీసి నన్ను చంపడానికి కాదుగదా" అని హడలిపోయెను. కంపెనీ వారు కోరుకున్న షరతులన్నిటికి యితడు ఒప్పుకొనెను. అందుచేత వారతనిని *1801 జులై 28న తక్తుపై నెక్కించిరి".*

(బ్రిటిష్ మహాయుగము - అను. మానికొండ సత్యనారాయణశాస్త్రి - ప్రథమ సంపుటం పే. 475).

అదీ తెల్లవారి రాజనీతి! "నువ్వు కాకపోతే నీ తండ్రో తాతో అపరాధం చేశారు లెమ్మని

నిందమోపారు. భయపెట్టారు. చెప్పినట్టు వినకపోతే నీ వారసత్వం గల్లంతవుతుందని బెదిరించారు". నా తండ్రి గద్దెపై జన్మతః నాకు సంక్రమించిన అధికారాన్ని కాదనటానికి మీరెవరు?" అని ఎదురు తిరిగిన రాకుమారుడి నెత్తిన గుద్దవేసి, ఇతర వారసులనూ వదిలి, వేరెవడితోనో బేరం కుదుర్చుకుని అడ్డగోలుగా సింహాసనం అప్పగించారు. కనీసం ఆ తరవాతయినా అసలైన వారసుడిని క్షేమంగా బతకనిచ్చారా?

లేదు. పూర్వపు నవాబు కొడుకు అలీ హుస్సేనును, అతని తల్లిని వారి పూర్వార్జిత ఆస్తి అయిన చీపాకు మందిరంలోనే ఖైదుచేసి ఉంచారు. అదే మందిరంలో కొత్త నవాబు అజింగారూ కాపురమున్నారు. "ఇది చాలా అన్యాయం. మా ప్రాణాలకు ప్రమాదం. ఇతగాడు మమ్మల్ని చంపిస్తాడేమో. ఇక్కణ్నించి వేరేచోటికి మార్చండి" అని తల్లీ కొడుకులు ఎంత మొత్తుకున్నా కంపెనీ దొరలు వినలేదు. చివరికి అనుకున్నట్టే అయింది. అలీ హుస్సేను రాకుమారుడు కొద్దిరోజులకే మరణించాడు. విషప్రయోగమే దానికి కారణమన్నది బహిరంగ రహస్యం.

బ్రిటిష్ ప్రభువులకు చిరకాలంగా మిత్రుడు, విశ్వాసపాత్రుడు అయిన ఆర్కాట్ నవాబు అంతటివాడిని అక్కర తీరగానే తీసి అవతల పారేసి, ఆంతరంగిక వారసత్వ వ్యవహారాల్లో అక్రమంగా కలగజేసుకుని, గద్దెపై కీలుబొమ్మను కూచోబెట్టి మొత్తం రాజ్యాన్ని కాజేసిన తీరుపై ఇంగ్లండులోనే తీవ్ర నిరసన వ్యక్తమైంది. అసలు వారసుడి అధికారాన్ని మీరెలా తోసి పుచ్చగలిగారన్న విమర్శలకు వెల్లస్లీ వర్గం చిత్రమైన ప్రతివాదం వినిపించింది. అదేమిటంటే – పూర్వపు ప్రభువు ఇచ్చిన హామీలకు లాగే అతడు చేసిన తప్పులకు కూడా వారసుడు బాధ్యత వహించాలట! నవాబు ద్రోహానికి పాల్పడ్డాడు కనుక అతడి కుమారుడు రాజ్యాధికారానికి హక్కు కోల్పోయాడట!

ఇది అర్థంలేని కుతర్కం. నవాబు బతికి ఉన్నంతకాలమూ అతడిపై కనీసం నేరారోపణే చేయకుండా,... అతడు మరణించాక అతడి కుమారుడిని ఆ నేరానికి బాధ్యుడిని చేయటం అమానుషమని షెరిడాన్ లాంటి మహా మేధావులు దుయ్యబట్టారు. శామ్యూల్ రోమిల్లీ, విండ్ హామ్‌లాంటివారు ఇండియాలో ఈస్టిండియా కంపెనీ వ్యవహారం దొంగల దోపిడిగా తయారైందని పార్లమెంటులో ఆక్షేపించి, సర్ థామస్ టర్టన్ తెచ్చిన అభిశంసన తీర్మానాన్ని గట్టిగా బలపరిచారు.

కాని ఏం లాభం? బ్రిటిష్ పార్లమెంటులో ఆసీనులైన మాన్యులు తమ జాతి గౌరవానికి కళంకం తెస్తున్న దుర్మార్గాలను ఆపటానికి కించిత్తయినా ప్రయత్నించలేదు. తమకు రాజ్యం వస్తుందనే సంబరపడ్డారు గానీ దానికి అనుసరించిన తప్పుడు పనులు ఎంత నికృష్టమైనవన్నది వారు పట్టించుకోలేదు. కంపెనీ అధికారులు కట్టుతప్పకుండా, చట్టాన్ని న్యాయాన్ని అతిక్రమించకుండా చూడవలసిన ప్రభువులే పక్షపాతంతో వ్యవహరించి... రాజ్యం వచ్చి పడేప్పుడు నీతుల గోల ఏల అని తలపోశారు.

భారతదేశంలో పడ్డ దొంగలకు, దొంగల నాయకులకు అంతకంటే ఏమికావాలి?



# అయోధ్యకాండ

**'బయట చలి విపరీతంగా ఉంది. మీ గుడారంలో కొంచెం తల దాచుకోనిస్తారా, ప్లీజ్' అని ప్రాధేయపడింది ఒంటె. 'తల మాత్రమే కదా? సరే, దాచుకో' అన్నాడు జాలిగుండె మనిషి. ముందు తల. తరవాత మెడ. అనక కొంచెం ఒళ్లు. మెల్లిగా కాళ్లు. కాసేపటికి మొత్తం జొరబడి గుడారాన్ని ఒంటె ఆక్రమించింది. నాకే ఇరుకుగా ఉంది; నువ్వెందుకూ ఇక్కడ – అని మనిషిని తరిమేసింది.**

ఇది పాత కథే. ప్రపంచ ప్రజలకు అనేక శతాబ్దాలుగా తెలిసిందే. అయితే, మిగతా జాతుల వాళ్లు వినేసి ఊరుకున్నారు. ఇంగ్లీషువారు మాత్రం ఒంటె కథను వొంటబట్టించుకుని ఒక మహా సామ్రాజ్యాన్ని నిర్మించారు. పిట్టంత ఇంగ్లండు చెట్టంత ఇండియాను ఇట్టే దురాక్రమణ చేసింది ఒంటె చూపిన దారిలోనే.

మేము పరదేశులం. ప్రభువులు దయతలిచి అనుమతిస్తే కాస్త వర్తకం చేసుకుని బతుకుతాం అని మొదట అతి వినయంగా దీనంగా ప్రార్థించారు. మన వెర్రి మారాజులు జాలి తలిచి 'వర్తకమేకదా? సరే చూసుకోండి' అన్నారు. తొలుత భారత ప్రభువుల దయాదాక్షిణ్యాల మీద, వారిచ్చే రక్షణమీద ఆధారపడి తెల్లవారు వ్యాపారం మొదలెట్టారు. క్రమేణా ప్రభువుల మధ్య తంపులు పెట్టి... వారి బలహీనతలను, భయాలను తెలివిగా ఉపయోగించుకుని, మోసాలు చేసి కొంచెం బలపడి, ప్రభువులకే సైనిక సహాయం చేసే స్థితికి చేరారు. మీ పట్ల భయభక్తులతో సర్వదా మీ సేవ కోసం సిద్ధంగా ఉన్న మా సైన్యం ఉండగా సొంత సైన్యం బాదరబందీ మీకేల? మీ రక్షణ బాధ్యత మాకు ఒప్పగించండి. ఎంత కావాలంటే అంత సైన్యాన్ని మానుంచి తీసుకోండి. ఖర్చుల నిమిత్తం ఏదో కాస్త మా మొగాన పడవేస్తే మా పాట్లు మేము పడి మిమ్మల్ని కంటికి రెప్పలా కాపాడతాం. ఈ గొడవలు మాకు వదిలేసి మీరు హాయిగా ఉండండి– అని సవినయంగా ప్రార్థించి ఎక్కడికక్కడ ప్రభువులతో సంధి చేసుకున్నారు. తరవాత తెలివిమీరి – మీ రక్షణకు ఎంత సైన్యం అవసరమో మేమే నిర్ణయిస్తాం; అదనపు బలగాలకు ఖర్చు ఎంతఅవుతుందో మేమే చెబుతాం.

తమరు దయచేసి ఆయా మొత్తాలను చచ్చినట్టు కట్టండి; అంతంత మొత్తాలను కట్టలేమంటారా? రాజ్యాన్ని మాకు వదిలేసి మీరు నెత్తిన చెంగువేసుకుని బయటికి దయచేయండి. లేదా మేము చెప్పినట్టు విని మా కాళ్లదగ్గర పడి ఉండండి... అని ముందు నుయ్యి- వెనుక గొయ్యిలా పసందైన ప్రత్యామ్నాయాలను సూచించారు. అలా ఒక్కొక్క రాజ్యాన్నీ లాగేసుకుని దేశీయ రాజులను వెళ్లగొట్టి మొత్తం దేశానికి తామే రాజులయ్యారు!

ఏకులా వచ్చి మేకులా మారిన ఇంగ్లీషువారి చేతిలో దగా పడి రాజ్యధికారానికి మేకులు గొట్టించుకున్న పిచ్చి మారాజుల్లో అయోధ్య నవాబు ఒకడు.

ఎదురు నిలిచిన టిప్పుసుల్తాన్ రాజ్యాన్ని కబళించిన తరవాత వెల్లస్లీ ప్రభువు "దయార్ద్ర దృష్టి" తెల్లవారికి మొదటినుంచీ అండ నిలిచిన పరమ మిత్ర రాజ్యాల మీద పడింది. ఆయనకు ముందు ఉన్న గవర్నర్ జనరలులు దగాచేసి దేశీయ సంస్థానాలను తమ గుప్పిట్లోకి తెచ్చుకుని కీలుబొమ్మ పాలకుల ద్వారా కథ నడిపించారు. ఈ ఉత్సవ విగ్రహాలు మాత్రం ఎందుకు; మెల్లిగా వీటిని అవతల పారేసి మనమే ప్రభువులం అయితే పోదా అనుకున్నాడు వెల్లస్లీ. క్లయివ్ తీసిన పునాదుల మీద, వారన్ హేస్టింగ్స్ లేపిన స్తంభాలపైన ప్రాచ్య సామ్రాజ్య మహాసౌధాన్ని నిర్మించి చరిత్రలో తన పేరు సువర్ణాక్షరాలతో రాయించుకోవాలన్న ఆబలో వెల్లస్లీ యుక్తాయుక్తాల జంజాటాన్ని లుంగచుట్టి బరితెగించాడు. రాజ్యాల పేర్లు వేరైనా అతడు అనుసరించిన పద్ధతి ఒక్కటే. స్థానిక రాజకీయ చిక్కులను, వారసత్వం తగాదాలను తెలివిగా వాడుకోవటం; బ్రిటిష్‌వారి మాట వినేవాడితో బేరం కుదుర్చుకోవటం; ఉపకారం చేసినట్టే చేసి, వీలైన కాడికి రాజ్యాన్నీ, పాలనాధికారాలను పూర్తిగా నొక్కేసి, పాలకుడిని పెన్షనరు స్థాయికి దిగజార్చి మూల కూచోబెట్టటం! భారతదేశంలో తమకు మొట్టమొదటి గిడ్డంగిని ఏర్పరచుకోనిచ్చిన సూరత్‌నూ, ఆది నుంచీ తమతో ప్రగాఢ మైత్రి నెరపిన తంజావూరునూ ఇదే రీతిలో నోట కరిచిన మీదట వెల్లస్లీ ప్రభువు తీక్షణ దృష్టి అయోధ్యపై ప్రసరించింది.

మళ్లీ వన్స్‌మోర్! పూర్వపు గవర్నర్ జనరల్ సర్ జాన్‌షోర్ గారు అయోధ్యలో వజీరాలీ అనే నవాబును గద్దెదించి సాదత్ అలీ అనే వాణ్ని సింహాసనం ఎక్కించాడు. తీసేసిన నవాబును కాశీలో ఉంచారు. చెరసాలలో ఉండే అతడు బయటి వారితో కుట్ర చేస్తున్నట్టు అనుమానం రావటంతో అక్కణ్నుంచి కలకత్తాకు అతణ్ని మార్చదలిచారు. ఆ సంగతి ముందే పసిగట్టి వజీరాలీ తిరుగుబాటు చేసి, జైలు అధికారిని చంపి పారిపోయి, కొంత బలగాన్ని సమకూర్చుకుని అల్లర్లకు దిగాడు. ఈ గందరగోళాన్ని అణచటానికి కొంచెం సైనిక సాయం చేయమని నవాబు తెల్లవారిని అడిగాడు. అప్పుడు గవర్నర్ జనరల్ వెల్లస్లీ సరిగ్గా అలాంటి అవకాశం కోసమే అతడూ కాచుకుని ఉన్నాడు. చాన్సురాగానే చకచకా కదిలాడు.

నవాబు అడిగిందేమో - కాస్త మీ సేనల్ని పంపి తిరుగుబాటును అణచమని. ఆ పని చేయటానికి అప్పటికే నవాబు మేపుతున్న ఇంగ్లీషు సైన్యమే చాలు. కాని వెల్లస్లీ ఈ సాకుతో భారీగా బలగాన్ని దించి రాజ్యాన్ని కాజేయాలనుకున్నాడు. పరిపాలనను చక్కదిద్దే నెపంతో అతడు మొత్తం పవర్లన్నీ నవాబు నుంచి లాగేయబూనాడు. "సంస్కరణ" పేరుతో రాజ్య అపహరణ ఎంత దుర్మార్గంగా జరిగిందో కర్నల్ బెయిర్డ్ అనే బ్రిటిష్ ఆఫీసరు **Dacoitee in Excelsis** అనే గ్రంథంలో పూసగుచ్చినట్టు వివరించాడు. సారాంశం ఇది :

మాకు కట్టాల్సిన కప్పం మీరు సరిగా చెల్లించటంలేదు. బకాయిలు పెరిగాయి. పరిపాలన కూడా ఏమీ బాగాలేదు. ఈ పరిస్థితిని సరిచేయటానికి నేను మంచి ఏర్పాటొకటి ఆలోచించాను అని వెల్లస్లీ దొర అందమైన భాషలో నాజూకైన శైలిలో నవాబుపై శుభలేఖలు సంధించాడు. ఆ ఏర్పాటు ఏమిటట? నవాబు సైన్యాన్ని దాదాపుగా తీసి పారేయటం; నవాబుగిరి దర్జాకు, రెవిన్యూ వసూలుకు కావలసినంత బలగం మాత్రం ఉంచి, మిగతా సైన్యం తీసేసి, దాని స్థానంలో కంపెనీకి చెందిన అదనపు సైన్యాన్ని చేర్చటం; ఆ ఖర్చంతా నవాబే భరించటం!

ఆ అడ్డగోలు ఏర్పాటు వినగానే నవాబు గాభరా పడి, "ఇంతకంటే నేను రాజ్యం వదిలేసుకుపోవటం మేలు" అని నిష్ఠూరమాడాడు. అతడి నోటివెంట వచ్చిన ఆ మాటనే వెల్లస్లీ గట్టిగా పట్టుకున్నాడు. నవాబు రాజ్యం వదిలిపోయి; సివిల్, మిలిటరీ అధికారాలు యావత్తూ కంపెనీవారే చలాయించేలా ఒక విద్దూరపు కరారునామా తయారుచేశాడు. దాన్ని చూసి నవాబు నిర్ఘాంతపోయి ససేమిరా సంతకం పెట్టనన్నాడు. దానిపై రాయబారాలు నడుస్తూనే ఉన్నాయి. నవాబు చెప్పేదానికి కంపెనీ అధికారులు ఊకొడుతూనే ఉన్నారు. ఇంకో పక్క నుంచి ఇంగ్లీషు సేనలు రాజ్యంలోకి చొచ్చుకువస్తూనే ఉన్నాయి.

ఇదేమి జబర్దస్తీ అని నవాబు మొత్తుకున్నాడు. దానికి కంపెనీవారు ఏమని బదులిచ్చారంటే- వెనుకటి 1798 ఒడంబడిక ప్రకారం అయోధ్య రాజ్యాన్ని రక్షించాల్సిన భారం కంపెనీ వారి నెత్తిమీద ఉన్నదట! కాబట్టి నవాబుకు ఇష్టం ఉన్నా లేకున్నా సరే ఎన్ని బ్రిటిష్ సేనలనయినా తీసుకొచ్చి రాజ్యంలో దింపే అధికారం కంపెనీకి ఉన్నదని అనుకోవాలట. ఈ ప్రకారం తమ చిత్తానుసారం తీసుకొచ్చి దింపే సైన్యం జీతబత్తేలకయ్యే ఖర్చంతా నవాబే ఇచ్చుకోవాలట. అంటే అవసరాన్ని నిర్ణయించేది కంపెనీ; డబ్బు ఇచ్చుకోవలసిందేమో నవాబు! ఇలా తంబకు తంబగా బ్రిటిష్ సైనిక దళాలు వచ్చిపడుతూంటే బెంబేలెత్తి నవాబు సాదత్ అలీ లక్నో రెసిడెంటు ద్వారా 1800 జనవరి 11న గవర్నర్ జనరల్‌కు పెద్దమహజరు ఇలా పంపుకున్నాడు.

"ఘనత వహించిన కంపెనీ వారికి నేను సంపూర్ణముగ శరణాగతుడను... తమరీ ప్రకారముగ చేయుటవల్ల తమ కీర్తికి కళంకము కలుగును. కంపెనీవారికి నాయందు నమ్మకము లేక నన్నీరీతిగ పదభ్రష్టుని జేసి తమ సైన్యము తీసికొని వచ్చి దేశములో పెట్టినారని ప్రజలనుకుందురు. ఈ ప్రకారము జరిగినట్లయితే ఇక దేశంలో నా అధికారమే అంతరించి పోతుంది. నా యాజ్ఞలను కడజాతివాడు కూడా లెక్కచేయడు. మీకు కప్పము చెల్లించటానికి నేనెంత తంటాలుపడినా వృథయవుతుంది... పట్టాభిషేక కాలమందు నేను కంపెనీ వారితో చేసుకున్న ఒడంబడికను ఒక వెంట్రుకవాసి కూడా తప్పి నడచుకొనను... ఎట్టి అవసరము లేకున్నను మీరు సేనలను హెచ్చుచేసి ఆ ఖర్చును నన్ను పెట్టకొనుమనుట చాలా అన్యాయము. ఇది మన ఒడంబడికకు విరుద్ధము... కాబట్టి తామీ సంగతుల నన్నింటిని దయచేసి పూర్తిగ విచారించి, నా రాజ్యముపైన నాకు సంపూర్ణాధికారము పూర్వపు వలెనే నిలిచి యుండునట్టు చేయగోరెదను... నేనును అన్ని విషయములలో

మీతో సంప్రదించుచునే మీ యాజ్ఞలకు యెల్లప్పుడు బద్ధుడనగుచునే నడుచుకొనుచుందును".

(బ్రిటిష్ మహాయుగము అను. మానికొండ సత్యనారాయణశాస్త్రి ప్రథమ సంపుటం. పే. 455-57).

ఇంత వినయంగా ప్రాధేయపడుతూ నవాబు రాసుకున్న జాబుకు తల బిరుసు వెల్లస్లీ ఎంత పొగరుబోతు జవాబు ఇచ్చాడో చూడండి. జవాబును సరాసరి నవాబుకు పంపకుండా స్థానిక రెసిడెంటుకు తన సెక్రటరీ చేత అతడు ఇలా రాయించాడు:

"నబాబు మీ ద్వారా పంపించిన ఉత్తరము సరియైన మతలబులో లేదు. దానిని తామందుకొనుట తగదని ఘనత వహించిన వెల్లస్లీ ప్రభువుగారు తలంచుచున్నారు. కాబట్టి సదరు ఉత్తరమును మీరు తిరిగి నబాబుకు పంపించి వేయండి... ఈ మతలబుగ జవాబిచ్చుట... అతని లేకితనము తెలియబరుచుటేగాక ఇండియాలో బ్రిటిష్ అధికారులలో అగ్రేసరుడగు గవర్నరు జనరలు యెడ నబాబు విధిగ చూపవలసిన మర్యాదకు చాలా లోపము... ఇప్పుడు వాపసు చేయుచున్న యీ ఉత్తరములో ప్రకారమే నవాబు తిరిగి జవాబివ్వదలచిన యెడల... నిరాధారమగు యీ నిందకు యెట్లు జవాబు చెప్పవలెనో ఘనత వహించిన గవర్నర్ జనరల్ ప్రభువుగారికి తెలియుననీ మీరు నవాబుకు గట్టిగ చెప్పండి".

(అదే గ్రంథం పే. 475-58).

ఈ ఉత్తర ప్రత్యుత్తరాల గురించి ఆంగ్ల చరిత్రకారుడు **జేమ్స్ మిల్** వ్యాఖ్యానం ఇది:

ఒడంబడిక చేసుకున్న రెండు పార్టీలలో ఒక పార్టీ షరతులన్నిటినీ తు.చ. తప్పక పాటించాడు. రెండో పార్టీవారు ఒడంబడికను అడ్డగోలుగా భగ్నం చేశారు. అప్పుడు మొదటి పార్టీ ఏమిచేశాడు? "అయ్యా, మన ఒడంబడికకు, మీ ప్రవర్తనకు తేడా కనపడుతోంది" అని ఎంతో వినయ విధేయతలతో విన్నవించుకున్నాడు. అతడు మనవి చేసుకున్న ధోరణి అతడి బానిస బుద్ధిని తెలుపుతుందే తప్ప ఎదుటి వారి యెడ అమర్యాద ఎంతమాత్రం లేదు. అయినా అవతలి పక్షం వారేమంటున్నారు? అతడి ధోరణి తమ గౌరవాన్ని కించపరచిందని నింద వేశారు. ఎదుటివాణ్ని వేటువేయటానికి లోగడ ఎలాంటి తప్పు కనిపించపోయినా, ఇప్పుడీ అవినయ ధోరణే మహాపరాధంగా కల్పించి కత్తి ఎత్తుతారు. నష్టపోయిన పార్టీ అదేమనకుండా నోరు మూసుకుంటే "ఎదుటి పార్టీయే ఒప్పుకున్నాడు. ఇందులో తప్పేముంది" అంటారు. అతడు పల్లెత్తుమాట అంటే "ఇదిగో నువ్వు మా న్యాయబుద్ధిని నిందించి అల్లరి పెడుతున్నావు. నీబోటి అధముడితో మాటలేమిటి? పోపో" అని కసిరి తడాఖా చూపిస్తారు.

ఇంగ్లీషువారి కత్తికి రెండువైపులా పదును! మొట్టమొదట నవాబు వద్దన్న కొద్దీ సేనలమీద సేనలు తీసుకొచ్చి అతడి నెత్తిన రుద్దారు. ఖర్చుపై ఖర్చును అతడిమీద మోపారు. ఆ సొమ్ము ఇచ్చుకోలేను మొర్రో అని గోల పెడితే, ఆ గోలనే ఒక సాకుగా తీసుకుని "సొమ్ము లేకపోతే రాజ్యం ఇచ్చి వెయ్యి" అని బలాత్కరించారు. ఉన్నంత వరకూ డబ్బు గుంజి, అది అయిపోయాక రాజ్యం లాక్కున్నారు. మనోవర్తి పుచ్చుకుని రాజ్యం వదులుకొని పోనైనా పో; లేదా ఇప్పుడు నీ రాజ్యంలోకి వచ్చిన రెండు దళాల ఖర్చుకింద నీ రాజ్యంలో సగ



భాగం కంపెనీకి ధారాదత్తమైనా చెయ్యి" అని వెల్లస్లీ నవాబు మెడమీద కత్తి పెట్టాడు. "కోరిన పరగణాలను అప్పగించటానికి నవాబు ఒప్పుకోకపోతే ఆ ప్రాంతాలను బలవంతంగా ఆక్రమించండి. దీనిపై మళ్లీ నా ఉత్తర్వులకు ఎదురు చూడకుండా పని జరిపించండి" అని స్థానిక రెసిడెంటుకు బందిపోటు పని పురమాయించాడు. అలా నానా ఏడుపు ఏడిపించి, 1801 నవంబరు 4న నవాబు చేత అర్ధరాజ్యాన్ని తమకు రాయించుకున్నారు. మిగతా రాజ్యం మీద నీకే అధికారం ఉంటుంది. లెమ్మని ఉదారంగా వరమైతే ఇచ్చారు. ఆచరణలో దానికీ నామం పెట్టి మిగతా సగంపై వచ్చే రెవిన్యూనూ దిగమింగి, ఆ భాగాన్ని క్రమంగా కబ్జాచేసి నవాబును తమ దయపై ఆధారపడ్డ పెన్షనరు స్థాయికి దిగజార్చారు.

పట్టపగలు దారిదోపిడీలాంటి అయోధ్య రాజ్యాపహరణ దురంతం మెల్లిగా బ్రిటిష్ ప్రజల చెవిన పడింది. ఇండియా పట్ల ఆదినుంచీ అపార అభిమానం చూపి, లోగడ వారన్ హేస్టింగ్స్‌ను పార్లమెంటు బోనులో తూర్పారపట్టిన సర్ ఫిలిప్ ఫ్రాన్సిస్ అప్పటికి బతికే ఉన్నాడు. అయోధ్యలో ఉండి వెల్లస్లీ దుండగాలను కళ్లారా చూసిన పాల్ అనే పెద్దమనిషి, ఫ్రాన్సిస్ కలిసి వెల్లస్లీ ఇంగ్లండుకు తిరిగి వచ్చాక అతడి భరతం పట్టటానికి పార్లమెంటులో శాయశక్తులా కృషిచేశారు. తనకు వెల్లస్లీపై వ్యక్తిగత కక్ష ఏమీలేదని, భారత ప్రజల సౌఖ్యానికి శ్రేయస్సుకేగాక జన్మభూమి ఇంగ్లండు కీర్తికి కూడా వెల్లస్లీ శత్రువు అని రుజువు పరచటానికే న్యాయబుద్ధితో తానీ అభియోగం మోపుతున్నానని పాల్ 1806 జనవరిలో బ్రిటిష్ పార్లమెంటులో తేటతెల్లం చేశాడు. 'వారన్ హేస్టింగ్సు లాగే వెల్లస్లీ కూడా మహా అపరాధి, రాజ్యద్రోహి. అయితే హేస్టింగ్సుకూ ఇతడికీ ఒక్క తేడా ఉంది. ఏ దోషమైతే హేస్టింగ్సులో అస్పష్టంగా వుందో వెల్లస్లీ విషయంలో స్పష్టంగా కనిపిస్తున్నది. వెనుక వారన్ హేస్టింగ్సుపై చార్జిలు పెట్టబడ్డ సమయంలో వెల్లస్లీ పార్లమెంటు మెంబరుగా ఉన్నాడు. కనుక ఇలాంటి చార్జీల లోతుపాతులు, దేశంలోని శాసనాలు తనకు తెలియవని గాని, పొరబడ్డానని గాని సాకు చెప్పే వీలే లేదు' అని విశదీకరించి పాల్ నిర్దిష్ట నేరారోపణకు ఉపక్రమించాడు.

*"In defiance and contempt of the laws... (Wellesley) did conceive and execute an intention to encroach upon the power and rights of the said Nabob Vizier, to interfere in the internal affairs of his government, to undermine and destroy his authority over his household affairs, his troops, and his subjects, and under pretence the most false, to exert from him, the Nabob Vizier, his hereditary dominions, so solemnly guaranteed to him by the company in the treaty of 1798..."* (చట్టాలను తృణీకార భావంతో ఉల్లంఘించి నవాబు అధికారాన్ని, హక్కులను అతిక్రమించి, అతడి ప్రభుత్వ ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం చేసుకుని, గృహకృత్యాల్లోనూ, సేనల పైనా, ప్రజలలోనూ అతడి అధికారాన్ని నాశనపరచి, అబద్ధపు మిషలతో సదరు నవాబు నుంచి అతడి ఆనువంశిక రాజ్యాన్ని ఊడబెరికి... 1798 ఒడంబడికలో కంపెనీవారు ప్రమాణ పూర్వకంగా అతడికి ఇచ్చిన హామీని వెల్లస్లీ ఘోరంగా భంగపరిచాడు) అని పార్లమెంటులో ఎలుగెత్తాడు.

అయోధ్య వజీరు విషయంలో వెల్లస్లీ చర్య అక్రమమైన క్రిమినల్ నేరం అన్న అభియోగాన్ని పార్లమెంటు పరిగణనలోకి తీసుకుంది. దానిపై చర్చ ఒక కొలిక్కి వచ్చి ఓటింగు జరిగే లోపే పార్లమెంటు ఆయువు తీరింది. కొత్త పార్లమెంటులో ఫ్రాన్సిసూ లేదు; పాలూ లేదు.

వెల్లస్లీ పక్షపాతులు, స్వయానా అతడి సోదరులిద్దరు కొత్త సభలో ప్రవేశించి, అభియోగాన్ని నీరుగార్చటానికి శక్తివంచన లేకుండా పాటుపడ్డారు. రెండేళ్ల విలంబనం తరవాత మొక్కుబడిగా పునఃప్రారంభమైన విచారణలో సర్ థామస్ టర్టన్ లాంటి వారు ఎంత పట్టుదలగా పోరాడినా ప్రయోజనం లేకపోయింది. ఏ గడ్డికరుస్తేనేం? ఎన్ని తప్పులు చేస్తేనేం? కొత్త రాజ్యాలను జయించి పెట్టినవాడే మొనగాడు అన్న బ్రిటిష్ పాలకవర్గ అవకాశవాదమే చివరికి నెగ్గింది. వెల్లస్లీ చేసిన దురంతాలను ఖండించటానికి బదులు అతడి ఘనకార్యాలను ఆమోదించి అభినందిస్తూ ప్రజాస్వామ్యానికి పుట్టినిల్లు, పార్లమెంటుల కన్నతల్లి అయిన బ్రిటిషు పార్లమెంటు అత్యద్భుతమైన తీర్మానం చేసింది.

వెల్లస్లీ అభిశంసన తతంగం కాస్తా అతడి అభినందన తీర్మానంగా రూపుదాల్చి తెల్లవారి ద్వంద్వ నీతికి నిలువెత్తు నిదర్శనంగా చరిత్రలో నిలిచిపోయింది.



# మరాఠాలకు చేటు

"టిప్పు సుల్తాన్ ఖతమయ్యాడు. బ్రిటిష్ పవరు పెరిగింది. తూర్పు భారతదేశం ఇప్పటికే వారిదయింది. తరువాత వేటు పూనా మీద పడుతుంది. చెడ్డరోజులు దాపురించాయి."

మరణించడానికి కొన్ని నెలల ముందు నానా ఫడ్నవిస్ - పీష్వా బాజీరావుకు దూరదృష్టితో చేసిన హెచ్చరిక ఇది. పీష్వాకు నమ్మబుద్ధికాలేదు. నానా మరీ అనుమానపు మనిషి; తనది కుట్ర మనస్తత్వం కాబట్టి ప్రతిచోటా కుట్రనే చూస్తుంటాడు - అనుకుని తేలికగా తీసిపారేశాడు. కాని నానా అన్నదే అక్షరాలా నిజమైంది.

ఒక్క బాజీరావు పీష్వాయే కాదు.. ఇంగ్లీషు వారి నుంచి తమకు పెనుముప్పు రానున్నదంటే ఆ కాలంలో మరాఠా మహారథులు చాలామంది నమ్మలేకపోయారు. బ్రిటిష్ వారు మనకు మిత్రులే తప్ప శత్రువులు కారుకదా? ఒకరిపై ఒకరు దండెత్తరాదని ఒకరి శత్రువులను రెండో వారికి కూడా శత్రువులుగా పరిగణిస్తూ ఒకరికొకరు సహాయం చేసుకుంటూ సఖ్యంగా ఉండాలని - వారికీ మనకూ దేవుడి మీద ప్రమాణం చేసుకుని కుదుర్చుకున్న ఒప్పందాలు ఉన్నాయి కదా? వెనకటి మైసూరు యుద్ధంలోనూ వారికి సహాయంగా వెళ్లి టిప్పును ఓడించటానికి మనమే కారకులయ్యాము కదా? ఈ మధ్య యుద్ధానికి మన సైనిక సహాయాన్ని వద్దనా - టిప్పును చంపి వశపరచుకున్న రాజ్యంలో మైత్రీ ఒప్పందం ప్రకారం మనకూ వాటా ఇస్తామంటున్నారు కదా? అటువంటి బ్రిటిష్ మిత్రులు మన మీద ఎందుకు కత్తి ఎత్తుతారు? ఒకవేళ వారలాంటి పిచ్చిపని చేసినా మనము తగిన శాస్తి చెయ్యలేమా? మహా ఘనత వహించిన నిజాంనే ఖార్దా యుద్ధంలో నేలకరిపించి మన సత్తా ఏమిటో లోకానికి చాటాము కదా? నిజాంకూ తమకూ సైనిక సహకార ఒప్పందం ఉండి కూడా మనము నిజాంపై దాడి చేస్తుంటే అడ్డుకోవటానికి ఇంగ్లీషు వారికి దమ్ములేకపోయాయి కదా? అలాంటివారు మనమీదే కయ్యానికి ఎలా సాహసిస్తారు? మహామహా టిప్పూ, నిజాంలనే గడగడలాడించిన మనకు ఈ విదేశీయులు

ఓ లెక్కా?... అని మీసాలు మెలివేశారు మహారాష్ట్ర పెద్దలు.

కాని, నానా అన్నట్టే జరిగింది. కుట్ర చేసి విద్రోహ తంత్రంతో టిప్పును వేటు వేసి మూడేళ్లు తిరక్కుండా ఇంగ్లీషు మాయావులు మరాఠా సామ్రాజ్యాన్ని, మహారాష్ట్రుల స్వాతంత్ర్యాన్ని అక్రమంగా బలిగొన్నారు. ఇండియాలో ఆంగ్ల రాజ్యస్థాపన క్రమంలో తెల్లవారు మూటకట్టుకున్న కళంకాలన్నిటిలోకీ మహారాష్ట్రుల విషయంలో వారు అనుసరించిన దుర్మార్గం చెడ్డది. బొంబాయి సివిల్ సర్వీసులోని బ్రిటిష్ పెద్దమనిషి ఒకరు అనంతరకాలంలో వ్యాఖ్యానించినట్టు "However fairly told, there is much for the English to be ashamed of in this period." *(ఎంత నిష్పక్షపాతంగా చెప్పినా ఇందులో ఇంగ్లీషువారు సిగ్గుపడవలసింది చాలా ఉంది.)*

ఈ సిగ్గుచేటు నిర్వాకాన్ని సమర్థించడానికి బ్రిటిష్ మేధావులు నానా తంటాలు పడ్డారు. తప్పంతా మహారాష్ట్రులదే అయినట్టు అపవాదాలు సృష్టించిన చరిత్రకారులందరూ అసలు విలన్ అయిన వెల్లస్లీ, అతడి తమ్ములు తెగబడి చెప్పిన అబద్ధాలను అక్షర సత్యాలుగా జెదల దాల్చారే తప్ప మహారాష్ట్రులను బ్రిటిష్‌వారు ఎలా మోసగించిందీ పరికించిన పాపాన పోలేదు. నిజానికి ఆ మోసం మూడో మనిషికి తెలియని అతి రహస్యమేమీ కాదు. గవర్నర్ జనరల్ వెల్లస్లీ, అనంతర కాలంలో డ్యూక్ ఆఫ్ వెల్లింగ్టన్ అయిన అతడి తమ్ముడు ఆర్థర్ వెల్లస్లీలు ఆ కాలంలో జరిపిన ఉత్తరప్రత్యుత్తరాలను జాగ్రత్తగా గమనిస్తే అసలు రంగు బయటపడుతుంది. ఇంగ్లీషువారితో మైత్రిని, శాంతిని ఏ విధంగానూ భగ్నపరచకుండా మహారాష్ట్రులు ఎంత సంయమనం చూపినా తెల్లవారే తీరికూర్చుని, వలలు పన్ని, గోతులు తీసి, దగాలు చేసి మరాఠా రాజ్యాన్ని నోట కరిచారన్న కఠోర వాస్తవం కళ్లకు కడుతుంది.

***Oxford History of India*** మూడో భాగంలో విఖ్యాత చరిత్రకారుడు **విన్సెంట్ స్మిత్** చెప్పిన ప్రకారం ఆంగ్లేయులకూ మహారాష్ట్రులకూ వ్యవహారం చెడటానికి కారణాలివి:

నిజాం పూర్తిగా ఇంగ్లీషు వారిపై ఆధారపడి, 1798, 1800 ఒప్పందాల మేరకు నైజాం రాజ్యం ఆంగ్లేయులకు స్వాధీనమయ్యాక... టిప్పు వినాశనంతో మైసూరు రాజ్యం కూడా దొరల పరమయ్యాక మరాఠాలతో రాజకీయ సంబంధాల స్వరూపం పూర్తిగా మారిపోయింది. నేరుగా బ్రిటిష్ పరిపాలనలోని ప్రాంతాలను వలెనే నైజాం, మైసూరు రాజ్యాలనూ సంరక్షించవలసిన బాధ్యత ఆంగ్లేయులపై పడింది. ఆయా రాజ్యాలకూ మరాఠాలకూ మధ్య ఉన్న రాజకీయ సంబంధాలకు 'కంపెనీ' ఉత్తరాధికారి అయింది. మైసూరు, హైదరాబాద్‌లు తమకు చెల్లించాల్సిన 'చౌథ్' కప్పం బకాయిలు చెల్లించాలని మరాఠాలు చాలాకాలంగా గద్దిస్తున్నారు. ఆ రాజ్యాలు తమ చేతుల్లోకి రావటంతో ఆ డిమాండ్లకు ఇంగ్లీషు వారు సమాధానం చెప్పవలసి వచ్చింది. మహారాష్ట్రులవి అడ్డగోలు కోర్కెలు. వారికి చౌథూ గీథూ కట్టాల్సిన అవసరం ఇంగ్లీషు వారికి లేదు. ఆ సంగతి మరాఠాలకు ఎంత చెప్పినా అర్థం కాలేదు. వారిదంతా బందిపోట్ల పోకడ. ఎక్కడో ఒకచోట దోపిడీ చేస్తే తప్ప వారు సైన్యాన్ని మేపలేరు. చెల్లింపుల కోసం వారు పేట్రేగటంతో మరాఠా వ్యవహారాల్లో జోక్యం చేసుకోకుండా ఉండటం ఆంగ్లేయులకు ఆచరణ సాధ్యం కాకపోయింది. ఆ సమయంలో గవర్నర్ జనరల్ ముందున్నవి రెండే దారులు. మరాఠాలతో పాత ఒప్పందాన్ని పట్టుకు వేలాడి, వారి దాష్టీకానికి తల వంచి, ఏమి చేసినా సహించి పడి ఉండటం. లేదా - మరాఠాలను దారికి తెచ్చి, శాంతి సుస్థిరతలను నెలకొల్పటానికి అవసరమైన చర్యలు



తీసుకోవటం. ఈస్టిండియా కంపెనీ డైరెక్టర్లయితే ఇందులో మొదటి ప్రత్యామ్నాయం మంచిదనుకున్నారు. దాన్ని అనుసరిస్తే విశాల ప్రాంతాలను అరాచకానికి, దైన్యానికి గురిచేయటమే అవుతుంది. వెల్లస్లీ ప్రభువు అటువంటి పరువు తక్కువ పనిచేసే పిరికివాడు కాదు. కాబట్టి మరాఠాలను ప్రశాంతంగా బతికే పొరుగు వారిలా మార్చటానికి అవసరమైన చర్యలను ఆయన తలపెట్టవలసి వచ్చింది... అని విన్సెంట్ స్మిత్ ఉవాచ.

సుప్రసిద్ధ చరిత్రకారులు, అందులోనూ పాశ్చాత్యులు అయిన వారు రాసిన ఇటువంటి రాతలను చదివితే వెల్లస్లీ ప్రభువు ధీరోదాత్తుడుగానూ మరాఠాలేమో నీతీరీతీ లేకుండా డబ్బులు గుంజే బందిపోట్లుగానూ విషయం తెలియని వారికి పొడగట్టటం సహజమే. విదేశీయులే గాక దేశవాళీ మేధావులు, చరిత్రకారులు కూడా మహారాష్ట్రులకు మొత్తం మీద అన్యాయం చేశారు. బాజీరావు పీష్వా అసమర్థత, అప్రయోజకత్వాల వల్ల, దౌలత్‌రావు సింధియా ధూర్తత్వంవల్ల, నానా ఫడ్నవిస్ కుట్ర మనస్తత్వంవల్ల, సింధియా, హోల్కర్ల వైషమ్యాలవల్ల, మరాఠా రాజ్యం అస్తవ్యస్తమైందనీ... బాజీరావు, దౌలత్‌రావుల దుర్మార్గాల మూలంగా మరాఠా సర్దార్లకు, జాగీర్దార్లకు మనసు విరిగి వారికంటే ఇంగ్లీషువారే నయమనుకునే పరిస్థితి వచ్చిందనీ... పాలక ముఠా అవినీతి, అత్యాచారాల కారణంగా న్యాయానికి నిలవ నీడలేక, ఫిర్యాదులు వినే నాథుడు లేక ప్రజలు అష్టకష్టాలు పడి, కడకు విదేశీయులను స్వాగతించారనీ మన చరిత్ర పండితులు చాలామంది ఏకరువు పెట్టారు. ఆఖరికి మహారాష్ట్ర చరిత్రకారుల్లో అగ్రగణ్యుడు, మాన్యుడు అయిన జి.ఎస్.సర్దేశాయి కూడా మరాఠా రాజ్య పతనానికి బాజీరావు, సింధియాల పాపాలు మొదలుకుని సైన్సు, టెక్నాలజీల పట్ల అశ్రద్ధ, ఆర్గనైజేషన్ లోపాల వరకూ ఎన్నో కారణాలనయితే చక్కగా వివరించారు. కాని ఇంగ్లీషువారు దగా, దౌర్జన్యాలతో మరాఠా రాజ్యాన్ని కబళించిన వైనాన్ని మాత్రం చూసీ చూడనట్టు వదిలేశారు.

18వ శతాబ్దం ముగిసే నాటికి మహారాష్ట్ర రాజకీయాలు నానా గత్తరగా ఉన్నమాట నిజం. రాజ్యానికి అరిష్టం అయిన రఘునాథరావు మరణించిన తరువాత కూడా తన సుపుత్రుడి ద్వారా మహారాష్ట్రులకు శాంతి లేకుండా చేశాడు. నాసిక్ సమీపాన రఘునాథరావు మరణించాక అతడి భార్య ఆనందిబాయి కుమారులను తీసుకుని ఆనందవల్లికి మకాం మార్చింది. కొంతకాలానికి ఆమె కూడా చనిపోయింది. అప్పటికి బాజీరావు నూనూగు మీసాల ప్రాయంలో ఉన్నాడు. తండ్రి కోల్పోయిన అధికారాన్ని ఎలాగైనా రాబట్టాలని అదనుకోసం వేచి ఉన్నాడు. మరాఠా సర్దార్లు, సైనికులు యావన్మందీ నిజాం మీదికి యుద్ధానికి పోనున్న తరుణంలో అలాంటి వాడిని స్వేచ్ఛగా వదిలి వెళితే తిరిగొచ్చేసరికి ఏమి కొంప ముంచుతాడన్న భయంతో నానా ఫడ్నవిస్ బాజీరావును, అతడి తమ్ముడు చిమ్మాజీ అప్పానూ, దత్తు సోదరుడు అమృతరావునూ 1795లో చెరలో వేశాడు. ఖార్దా యుద్ధంలో నిజామును గెలిచి వచ్చాక కూడా ఎందుకైనా మంచిదని వారిని శివనేరు ఖైదులోనే ఉంచాడు.

అప్పటికి పీష్వా మాధవరావుకు 21 ఏళ్లు. బాజీరావుకు 19 ఏళ్లు. పసితనంలోనే గద్దె నెక్కినా మాధవరావు బాల్యం, కౌమారం అంతా నానాఫడ్నవిస్ ఒద్దికలో ఒదిగి ఉండటంతోనే సరిపోయింది. ఈడు వచ్చాకయినా స్వతంత్రించి నీ అధికారాన్ని నీవు చలాయించకూడదా అని భార్యలు, సేవకులు అతడిని ప్రేరేపించారు. అతనూ అందుకు ప్రయత్నించాడు. ఒకటి రెండు సందర్భాల్లో నానాను లెక్క చేయక నిర్ణయాలు చేశాడు కూడా. కాని

అవలించకుండానే పేగులు లెక్కబెట్టగలిగి, ఎక్కడ ఏమి జరుగుతోందీ వెయ్యి కళ్లతో కనిపెట్టే నానా అతడి ఎత్తులను సాగనివ్వలేదు. చిరకాలంగా తనకూ, రాజ్యానికీ రక్షకుడైన నానాను ఎదిరించేందుకు పీష్వాకూ ధైర్యం చాలలేదు.

అదే సమయంలో శివనేరు ఖైదు నుంచి బాజీరావు పావులు కదిపాడు. చెరసాల అధికారులను లోబరుచుకుని మాధవరావుకు సందేశాలు పంపించసాగాడు. 'చెరలో ఉండి నేనూ.. రాజమందిరంలో ఉండి నీవూ ఒకలాగే ఉన్నాము. వాస్తవానికి ఇద్దరమూ ఖైదీలమే' అంటూ సానుభూతి ఒలికించి పీష్వాను రెచ్చగొట్టాడు. క్రమేణా ఇద్దరి మధ్య అనుబంధం పెరిగింది. ఉత్తర ప్రత్యుత్తరాలు జోరయ్యాయి. నీ అధికారం ఉపయోగించి నాకు బంధవిముక్తి చేయించకూడదా అని వరసకు పినతండ్రి అయిన బాజీరావు మోహమాట పెట్టాడు. ఔను. ఎందుకు వదిలెయ్యకూడదు- అని నానాను పీష్వా అడిగాడు. బాజీరావు తండ్రి ఎటువంటివాడో, రాజ్యానికి ఎంత అపకారం చేశాడో నానా గుర్తుచేశాడు. 'అయితే ఏమిటి? తండ్రి చేసిన తప్పుకు కొడుకును ఎందుకు శిక్షించాలి? బాజీరావును వదిలిపెట్టండి' అన్నాడు పీష్వా. నానా వినలేదు. వయసు వచ్చినా మాధవరావును పసివాడిలాగే చూసి, పీష్వాకూ తనకూ ఉన్న అంతస్థుల తారతమ్యాన్ని మరిచి, కొంచెం కటువుగానే మాధవరావు నోరు నొక్కాడు. విడిచిపెట్టకపోగా బాజీరావుపై నిర్బంధాన్ని మరింత కఠినం చేశాడు. ఇది పీష్వాకు సహజంగానే తీవ్ర మనస్తాపం కలిగించింది. కాని ఏమి చేయాలో తోచలేదు.

మహారాష్ట్ర రాజకీయాల్లో నానా ఫడ్నవిస్‌కు కొన్ని విషయాల్లోనైనా సమఉజ్జీ అనదగ్గవాడు ఒకే ఒకడు; మాధవరావు (మహాద్‌జీ) సింధియా. మరాఠా స్వరాజ్యాన్ని శివాజీ స్థాపించింది 1653 ప్రాంతాల్లో అనుకుంటే 1713 వరకూ 60 ఏళ్లు ఛత్రపతులైన శివాజీ, అతడి వారసుల ఏలుబడి సాగింది. తరువాత ఛత్రపతి ఛాయాగ్రహంలా మారి 1713లో పీష్వాల శకం మొదలై 60 ఏళ్లు ఉజ్వలంగా వెలిగింది. మొదటి నలుగురు పీష్వాల దీక్షాదక్షతల వల్ల మరాఠా ప్రభ మహారాష్ట్ర ఎల్లలు దాటి దేశంలో విశాల ప్రాంతాలకు విస్తరించింది.

ప్రతిపచ్చంద్ర రేఖేవ వర్ధిష్ణుర్విశ్వవందితా
శాహసూనోః శివ స్యైషా ముద్రా భద్రాయ రాజతే

'శాహాజీ కుమారుడైన ఈ శివాజీ యొక్క రాజముద్రిక శుక్లపక్ష చంద్రునిలా దిన దిన ప్రవర్ధమానమవుతూ విశ్వమంతటా వందనలాందుకుంటూ విరాజిల్లును గాక' అని ఛత్రపతి శివాజీ రాజముద్రలో ఆకాంక్షించినట్లుగా మరాఠా మహాసామ్రాజ్యం క్రమేణా బలోపేతమై మధ్యందిన మార్తాండునిలా దుర్నిరీక్ష్యంగా వెలిగి 1773లో మాధవరావు పీష్వా అకాల మరణంతో చరమ దశకు చేరింది. రఘునాథరావు కుట్రలూ, కుహకాలు చేసి, పీష్వా నారాయణరావును దారుణ హత్య కావించి, ఇంగ్లీషు వారితోనూ బయటి విరోధులతోనూ చేతులు కలిపి జాతికి ద్రోహం చేసి లెక్కలేనన్ని సమస్యలు తెచ్చి పెట్టినప్పటికీ మరాఠా జ్యోతి ఆరిపోకుండా ఆ తరవాత కూడా 30 ఏళ్లు ప్రకాశించగలిగిందంటే ఆ ఘనత ముఖ్యంగా ఇద్దరికి చెందుతుంది. ఒకరు అపర చాణక్యుడిలా చక్రం తిప్పి తెలివి తేటలతో, రాజకీయ ప్రజ్ఞతో రాజ్య వ్యవహారాలు నడిపించిన నానా ఫడ్నవిస్. రెండవవాడు భుజబలంతో, సైనిక పరాక్రమంతో రాజ్యాలను జయించి ఉత్తరాదిన జైత్రయాత్ర సాగించిన మాధవరావు (మహాద్‌జీ) సింధియా.

చిత్‌పవన శాఖ బ్రాహ్మణుడైన నానాకు, బ్రాహ్మణేతరుడైన మరాఠా సింధియాకూ



మధ్య ఆదినుంచీ అనేక స్పర్థలు ఉండేవి. ఒకరినొకరు నమ్మకుండా, ఒకరిని దెబ్బతీయటానికి ఒకరు విశ్వప్రయత్నాలు చేసినా, ఎవరి పరిధిలో వారు రాజ్యక్షేమానికి తాము ఉచితమనుకున్న రీతిలో నిజాయితీగా పాటుపడటం విశేషం. వారు ఉచితమని తలచినవి తరువాత తరాల వారికి అనుచితంగా కనపడటం వేరే విషయం.

ఉదాహరణకు మొదటి మరాఠా యుద్ధకాలంలో మాధవరావు సింధియా నిర్వహించిన భూమిక బహుధా అనుమానాస్పదమైంది. పీష్వా ఆదేశాలను అతిక్రమించి, తెల్లవారితో లాలూచీ అయి, అతడు రఘునాథరావు కొమ్ము కాశాడనటానికి అనేక ఆధారాలున్నాయి. వారన్ హేస్టింగ్స్‌కు ముచ్చెమటలు పోయించి దురాక్రమణను తిప్పికొట్టి యుద్ధరంగంలో మరాఠాలు దిగ్విజయం సాధించినా అనంతరం ఆంగ్లేయులకే వాటమైన రీతిలో సాల్బే సంధి కుదిరింది. విదేశీయులపై పోరాటం అర్థాంతరంగా ఆగిపోయి, దీర్ఘకాలంలో దేశానికి తీరని హాని చేసింది. ఆ దిక్కుమాలిన సంధి ముఖ్యంగా సింధియా పూనిక వల్లే పొసగింది. ఈ తప్పిదానికి సింధియాను చరిత్ర బోనులో దోషిగా నిలబెట్టవలసిందే.

అయితే అదే సంధివల్ల మరాఠాలకు కొంత ప్రయోజనం కూడా జరిగింది. 1782 మే 17న సంతకాలయిన సాల్బే ఒడంబడిక వల్ల ఈస్టిండియా కంపెనీకీ మరాఠాలకూ మధ్య ఇరవయ్యేళ్లపాటు శాంతి నెలకొంది. తన స్వతంత్ర ప్రతిపత్తిని ఆ ఒప్పందం దాదాపుగా ధ్రువీకరించడంతో సింధియా రెట్టించిన ఉత్సాహంతో దశాబ్దంపాటు పరాక్రమించి ఉత్తర భారతాన మరాఠా కత్తికి ఎదురులేకుండా చేశాడు. పాత గెరిల్లా పద్ధతులను వదిలి, డిబోయిన్ అనే ఫ్రెంచి సేనాని ఆధ్వర్యాన యూరోపియన్ తరహా సైన్యాన్ని సమకూర్చుకుని ఢిల్లీని పట్టుకున్నాడు. షా అలం పాదుషాను గుప్పిట్లో పెట్టుకుని మొగల్ సామ్రాజ్య రక్షకుడిగా లాంఛనప్రాయ అధికారం పొందాడు. జైపూర్, జోధ్‌పూర్, మేవాడ్ రాజ్యాలను జయించి రాజస్థానాన్ని పాదాక్రాంతం చేసుకుని ఉజ్జయిని రాజధానిగా రాజ్యమేలాడు. ఉత్తరాదిన బ్రిటిష్ ప్రాబల్యం విస్తరించకుండా శాయశక్తులా నిరోధించాడు.

ఇలా కొన్నేళ్లు గడిచాక సింధియాకూ నానాఫడ్నవిస్‌కూ మధ్య కలతలు పెరిగాయి. తనను కూల్చడానికి నానా కుతంత్రాలు పన్నుతున్నాడన్న అనుమానం బలపడటంతో - పాదుషావారంపిన అధికార నియామక పత్రాలను పీష్వాకు సమర్పించే నెపంతో 1792 జూన్‌లో సింధియా పూనాకు తిరిగి వచ్చాడు. మాధవరావు పీష్వాను ఆకట్టుకుని, నానా ఎత్తులకు పైఎత్తులు వేసి, ప్రత్యర్థులకి దేవిడీమన్నా చేయటానికి ప్రయత్నాలు బాగానే మొదలెట్టాడు. కాని అవి కొలిక్కిరాకముందే 1794లో తన 61వ ఏట మాధవరావు సింధియా ఆకస్మికంగా జబ్బుపడి మరణించాడు.

ప్రధాన ప్రత్యర్థి అయిన సింధియా రంగంనుంచి నిష్క్రమించడంతో మరాఠా రాజకీయాల్లో తిరుగులేకుండా పోయిన నానాను ఎదిరించటం యువ పీష్వాకు కొండను ఢీకొనటంలాగే తోచింది. నానా పెత్తనాన్ని నిరోధించలేని నిస్సహాయ స్థితివల్ల చిత్త క్షోభతోనో... కొందరు ఆరోపించినట్టు బాజీరావు చేయించిన చేతబడివల్లో... ముదిరిన క్షయ రోగంవల్లో తెలియదు గాని సవాయి మాధవరావు పీష్వా తీవ్రంగా జబ్బుపడ్డాడు. జ్వర తీవ్రతలో తరచు మైకం కమ్ముతున్న స్థితిలోనే దసరా ఉత్సవాల్లో పాల్గొన్నాడు. తరువాత రెండురోజులకే ప్రమాదవశాత్తు (గ్రాంట్ డఫ్ అది ఆత్మహత్య అన్నాడు. కాని కాదు.) బాల్కనీ నుంచి జారిపడి, మూడురోజులు నరకయాతన పడి 1795 అక్టోబరు 25న మాధవరావు 21 ఏళ్ల

పిన్న వయసులో కన్నుమూశాడు. అతడికి పుత్ర సంతానం లేకపోవటంతో తదుపరి పీష్వా ఎవరన్న ప్రశ్న తలెత్తింది. తన తరవాత పీష్వాగా బాజీరావు కావాలని మరణించే ముందు మాధవరావు చెప్పాడు. అయినా రఘునాథరావు, ఆనందిబాయిల వంశాంకురాన్ని నెత్తినెక్కించుకుంటే ప్రమాదమన్న భయంతో నానా అందుకు అంగీకరించలేదు. కాని అదే చివరికి తప్పలేదు.



# మాయల మరాఠీలు

ఎత్తులూ పై ఎత్తులూ - రాజీలూ లాలూచీల రాజకీయ టక్కుటమారాలకు అలవాటుపడిపోయిన ఈ కాలం వారికి కూడా అచ్చెరువు కలిగించే పవర్ పాలిటిక్స్ ఇవి! రాజ్యమేలే పీష్వాకు *21* ఏళ్లకే నూరేళ్లూ నిండాయి. ఆయనకి పుత్ర సంతానం లేదు. ఉత్తరాధికారి ఎవరన్నది ప్రశ్న. వంశపారంపర్య అధికారం కాబట్టి తదుపరి పీష్వా ఆ వంశం వాడే అయి ఉండాలి. దగ్గరి దాయాదులు లేకపోలేదు. కాని మరాఠా శనిగారయిన రఘునాథరావుగారి పెద్దబ్బాయి బాజీరావుకు చూస్తూ చూస్తూ అధికారం ఒప్పగించటం నానాఫడ్నవిస్‌కి ఇష్టంలేదు. బయటి వాడెవడికో కిరీటం కట్టబెడితే జనం మెచ్చరు. మరాఠీ పెద్ద సర్దార్ల మధ్యే పుట్టెడు తగవులు, గొడవలు ఉన్న స్థితిలో అందరినీ జాగ్రత్తగా కలుపుకొనిపోతే తప్ప ఏ పనీ సాఫీగా కాదు.

మరి ఏమీ చేయాలా అని బుద్ధి కుశలతనంతా ఉపయోగించి ఆలోచిస్తే నానాఫడ్నవిస్‌కి మెరుపులాంటి ఆలోచన వచ్చింది. మరణించిన పీష్వాకు ఇంకా ఈడేరని ఇల్లాలు యశోదాబాయి ఉంది. ఆమెచేత ఎవరైనా కుర్రాడిని దత్త స్వీకారం చేయించి పీష్వాగా ప్రకటిస్తే పోదా? ఇదీ ఐడియా. వెంటనే నానా పావులు కదిపాడు. దౌలత్‌రావు సింధియా (మరణించిన మాధవరావు సింధియాకి కుమారుడు లేనందువల్ల దగ్గరి బంధువైన ఇతడు సింధియా రాజ్యానికి వారసుడయ్యాడు), రఘూజీ భోంస్లే వగైరాలను పిలిపించి ఇందుకు ఒప్పించాడు.

దత్త స్వీకారానికి అంగీకార పత్రం మీద అందరి సంతకాలు కూడా అయ్యాక ఖైదులోని బాజీరావుకు ఉప్పందింది. అటునుంచి అతడూ కథ నడిపాడు. తనమీద మొదటినుంచీ పక్షపాతం ఉన్న సింధియా మంత్రి బాలోబా తాత్యా పాగ్నిస్‌ను పట్టుకున్నాడు. అతడిని ప్రయోగించి, దౌలత్‌రావు సింధియాను ప్రలోభపెట్టి తనవైపు తిప్పుకున్నాడు. దత్తతకు సరేనన్న ఒప్పందం మీద సంతకం తడి అరకుండానే బాజీరావును పీష్వా చేయాలన్న

# బాలాజీ అడుగుజాడ

కష్టాలెప్పుడూ కలిసే వస్తాయి. సేనాపతి తిరుగుబాటుతో, విశ్వాసపాత్రుల నమ్మకద్రోహాలతో, తెరపిలేని తారాబాయి సతాయింపులతో అసలే తల పగిలిపోతున్న సాహు రాజుకు గోరుచుట్టుపై రోకటి పోటులా ఇంకో పెద్ద బెడద.

నౌకాదళాధిపతి కన్హోజీ ఆంగ్రే తిరగబడ్డాడు. తిరగబడటమే కాదు. తనను తాను కొంకణ్‌కు స్వతంత్ర ప్రభువుగా ప్రకటించుకున్నాడు. అంతేకాదు. సాహు రాజు పనుపున తనకు బుద్ధి చెప్పేందుకు సేనతో వచ్చిన 'పీష్వా' (ప్రధానమంత్రి)ను చిత్తుగా ఓడించి ఖైదులో పెట్టాడు. పెట్టటమేకాదు. సాహూ మీదే కత్తులు నూరి ఏకంగా రాజధానిపైకే దండెత్తనున్నాడు.

కన్హోజీ సామాన్యుడు కాదు. అసాధ్యుడు! శివాజీ హయాంలో సుప్రసిద్ధుడైన నావికుడు తుకోజీ ఆంగ్రే కుమారుడతడు. శివాజీ కుమారుడు శంభాజీ ఏలుబడిలో నౌకా దళాధికారి అయ్యాడు. అనంతరం తారాబాయి అతడికి 'సర్ఖేల్' పదవినిచ్చి నౌకాదళానికి అధిపతిని చేసింది. గోవా నుంచి ముంబాయి వరకూ మొత్తం సముద్ర తీరానికి కన్హోజీ ఎదురు లేని పెత్తందారు. పశ్చిమ తీరంలో కొద్దికొద్దిగా కాలుమోపుతున్న పోర్చుగీసు వారికీ, ఇంగ్లీషు వారికీ అతడి సాయుధ నౌకల పేరు చెబితే వణుకు. అతడి అనుమతి లేకుండా, అతడికి సుంకం కట్టకుండా ఏ నౌకా అంగుళం ముందుకు కదలలేదు. సముద్ర జలాలపై ఆధిపత్యమే గాక తీరం వెంబడి బలమైన కోటలు కట్టుకుని కన్హోజీ శత్రువులకు సింహస్వప్నంగా ఉన్నాడు. అంతవరకూ తారాబాయికి విధేయుడుగా ఉన్నవాడు కాస్తా రాజ కుటుంబంలో వారసత్వ యుద్ధాన్ని ఆసరా చేసుకుని స్వాతంత్ర్యం ప్రకటించుకున్నాడు. ఇప్పుడు సాహునే కబళించడానికి రాహువులా ఉరికి వస్తానంటున్నాడు.

వేగుల వారు తెచ్చిన ఈ కబురు వినగానే సాహు రాజుకు చెమటలు పట్టాయి. సేనాపతి చంద్రసేన్ యాదవ్ తిరుగుబాటు చేసి తారాబాయి పక్షంలో చేరిపోయిన దరిమిలా



సాహు సైనిక పాటవం సన్నగిల్లింది. బాలాజీ విశ్వనాథ్‌ను పురమాయించి తగు మాత్రం సేనను సమీకరింపజేసినా ప్రస్తుతం అందుబాటులో లేదు. ఖాందేశ్‌కో మరో చోటికో తరలించిన సేనలను ఉన్నపళాన వెనక్కి పిలిపించడం కుదరదు. రాజుగారి సొంత అంగ రక్షక దళం మినహా రాజధాని సతారాలో సైన్యమే లేదు. ఇదే సమయంలో కన్హోజీ దండెత్తి వస్తే ఎలా కాచుకోవాలి? గండం నుంచి ఎలా బయటపడాలి?

దిక్కుతోచని సాహు తన 'అష్టప్రధానుల'ను కొలువుదీర్చి ఇప్పుడేం చేద్దాం? అని అడిగాడు. అందరూ మొగాలు చూసుకొని మిన్నకుండిపోయారు. 'ప్రతినిధి' గిరీ వెలిగిస్తున్న పెద్ద మనిషిని 'ఏమయ్యా' అంటే 'సైన్యం నా మాట వినదు. నేను చేయగలిగింది లేదు' అన్నాడు. ఎవరికి వారు తెల్లమొగం వేసి నీళ్లు నములుతున్న దశలో బాలాజీ విశ్వనాథ్ లేచి 'ప్రభువుల వారు ఆజ్ఞాపిస్తే ఏమి చేయడానికైనా నేను సిద్ధం' అన్నాడు. రాజుకు మహా సంతోషం వేసి అక్కడికక్కడే (1713 నవంబర్ 16న) బాలాజీని పీష్వా పదవిలో యథావిధిగా నియమించి, పరిపాలన మొత్తాన్నీ అతడి చేతిలో పెట్టాడు. 'నాకు తెలుసు. నువ్వు సర్వసమర్థుడివి. వెంటనే బలగాలతో వెళ్ళి కన్హోజీ భరతం పట్టు' అన్నాడు. గొప్ప పదవి వచ్చింది కదా అని బాలాజీ విశ్వనాథ్ ఉబ్బితబ్బిబ్బు కాలేదు. రాజుగారు దండెత్తమన్నాడు కదా అని మెహర్బానీ కోసం సేనలను పోగేసి దండయాత్ర హడావుడి చేయ్యలేదు. 'అయ్యా, ముందు తమరితోనే కాస్త మాట్లాడవలసి వున్నదండి' అని ప్రభువుకు మనవి చేశాడు. ఏకాంతంలో కలిసి విలక్షణమైన ప్రతిపాదన ఒకటి చేశాడు.

అదేమిటో చెప్పే ముందు పూర్వరంగాన్ని కొంచెం వివరించాలి.

మొగల్ సామ్రాజ్యంలో సర్దార్లకు, సేనానులకు, ఇతర ప్రముఖులకు జీతాలుండవు. స్థాయినిబట్టి దర్బారులో స్థానాన్ని బట్టి తలకో జాగీరు ఉంటుంది. ఎవరి జాగీరులో వారు మకుటం లేని మారాజుల్లా వెలిగిపోతూ శిస్తులు, సుంకాలు వసూలు చేసుకుంటూ అలా వచ్చే ఆదాయంలో కొంత వెచ్చించి తమకు నిర్దేశించిన సంఖ్యలో సేనను సమీకరించి పోషిస్తారు. చక్రవర్తికి ఎప్పుడు అవసరమైతే అప్పుడు ఆ సైన్యాన్ని రాజసేవకు వినియోగించాలి. మొగలుల కాలంలో అనర్థాలకు ఈ ఏర్పాటే సగం కారణం. చక్రవర్తి సర్వసమర్థుడైనంత వరకూ, జాగీర్దార్లు భయభక్తులతో మెలిగినంత వరకూ అంతా బాగానే నడుస్తుంది. సార్వభౌముడు అసమర్థుడైనప్పుడు,తొలి తరంలో ఉన్న రాజభక్తి అణకువ క్రమేణా అడుగంటి, తరువాయి వారసులు తల ఎగరేసినప్పుడు అసలు సమస్య మొదలవుతుంది. గట్టి కోటల రక్షణను, చేతిలోని సైనిక బలాన్ని చూసుకొని జాగీర్దార్లు తిరగబడి స్వాతంత్ర్యం ప్రకటించుకున్నా, స్థానిక ప్రజలను పిశాచాల్లా పీడించినా పైవాడు చేయగలిగింది ఏమీ ఉండదు. ఈ రకమైన విశృంఖలత్వం చివరికి సామ్రాజ్య విచ్ఛిత్తికే దారి తీస్తుంది. ఈ సంగతి చక్కగా గ్రహించే శివాజీ తన రాజ్యమంతటా సైన్యాధికారులకు, సివిల్ అధికారులకు జాగీర్లిచ్చే పద్ధతిని రద్దు చేసి పీష్వా నుంచి సాధారణ సిపాయి వరకూ ప్రతి ఒక్కరికీ కేంద్ర ఖజానా నుంచే క్రమ ప్రకారం జీతం చెల్లించే ఏర్పాటు చేశాడు. పీష్వా ప్రధానమంత్రిగా ఎనిమిది మంది మంత్రుల సాయంతో, వారిలో వారికి స్పష్టమైన బాధ్యతల విభజనతో పరిపాలన యావత్తూ రాజు అధీనంలో క్రమబద్ధంగా నడిచేలా 'అష్టప్రధాన్' విధానాన్ని ప్రవేశ పెట్టాడు... మరాఠా యోధులందరూ ఐకమత్యంతో దేశభక్తితో శంభాజీ, రాజారాంల

రహస్య ఒప్పందాన్ని నానాకి తెలియకుండా సింధియా కుదుర్చుకున్నాడు. దాని ప్రకారం సింధియా సైన్యంతో వెళ్లి శివనేరు చెరనుంచి బాజీరావును విడిపించాలి.

ఆ సంగతి చారచక్షువైన నానాకు వెంటనే తెలిసిపోయింది. సింధియా సైనిక శక్తి ముందు తాను నిలవలేనని అతడికి తెలుసు. సింధియావెళ్లి బాజీరావును విడిపించి కిరీటం పెడితే తాను ఏమీ చేయలేడు. కాబట్టి ఆ పనేదో తానే చేస్తే మంచిదనుకున్నాడు. వెంటనే పరశురామ్ పట్వర్ధన్‌ను సేనలతో శరవేగాన సింధియాకంటే ముందే శివనేరుకు ఉరికించాడు. మావైపు తిరిగితే నిన్నే పీష్వా చేస్తామని బేరం పెట్టించాడు. బాజీరావును బుట్టలో వేశాడు.

ఇది ధర్మంకాదు; సింధియాకిచ్చిన మాట తప్పవద్దు అని – తమ్ముడు అమృతరావు వారించాడు. బాజీరావు వినలేదు. సింధియాతో ఒప్పందాన్ని నిస్సంకోచంగా తుంగలో తొక్కాడు. ఇందులో మోసం ఏమీ లేదుకదా, మాట తప్పరుకదా అని పలుమార్లు అడిగి.. పవిత్ర గోదావరి తీరాన పార్వతమ్మవారి గుడిలో పట్వర్ధన్ చేత గోవు తోక పట్టుకుని ప్రమాణం చేయించాక సంతృప్తి చెంది నానావైపు ఫిరాయించాడు. అన్నేళ్లపాటు తనను చెరలో పెట్టిన నానాతోటే చేతులు కలిపాడు. బాజీరావును పీష్వా చేసేట్టు, ప్రధానమంత్రిగా అతడు నానాను కొనసాగించేట్టు, జరిగిందంతా మరచి ఇద్దరూ కలిసి పనిచేసేట్టు అంగీకారం కుదిరింది.

ఇది తెలిసి సింధియా మంత్రి బాలోబా మండిపడ్డాడు. సింధియా దయవల్ల బాజీరావు పీష్వా అయితే సింధియాతో చెప్పించి తాను నానా స్థానంలో మంత్రి కావచ్చునని అతడు ఆశపడ్డాడు. అది కాస్తా భగ్నమైంది. దాంతో అతడు సింధియాకి కబురు పంపాడు. సింధియా వెంటనే పెద్ద సేనతో పుణె పైకి దండెత్తి వచ్చాడు. అతడిని తాను ఎదుర్కొనగలనని పట్వర్ధన్ భరోసా అయితే ఇచ్చాడు.కాని ఫ్రెంచి వీరుడు డిబోయిన్ తర్ఫీదు ఇచ్చిన సింధియా బెటాలియన్ల సత్తా నానా ఎరుగును. నేరుగా ఘర్షణ పడితే మొదటికి మోసం వచ్చి, సింధియా మరాఠా సర్వాధికారి కాగలడని భయపడి నానా పుణె వదిలి పురందర్ పోయి తలదాచుకున్నాడు. బాజీరావును మాట్లాడదాం రమ్మని పిలిచి రాగానే సింధియా నిర్బంధించాడు. బాజీరావు బదులు అతడి తమ్ముడు చిమ్నాజీని గద్దెనెక్కించాలని సింధియా వర్గం నిశ్చయించింది. విధి లేక నానా కూడా ఇందుకు సమ్మతించాడు.

మరి రఘునాథరావు పెద్దకొడుకు ఉండగా అతడిని వదిలేసి చిన్న కొడుకుకు ఎందుకు అధికారం కట్టబెట్టారని లోకులు ఆక్షేపిస్తారు కదా? పాదరసంలాంటి సింధియా మంత్రి బుర్ర దీనికీ ఒక ఉపాయం కనిపెట్టింది. బయటి వాడిని తెచ్చి దత్త స్వీకారం చేయిద్దామని మునుపు నానా అన్నాడు కదా? ఆ దత్తత ఏదో ఈ చిమ్నాజీనే చేయిస్తే సరిపోతుంది కదా – అన్నాడతడు.

దత్తు చేసుకోబడే చిమ్నాజీకి దత్తు చేసుకునే యశోదాబాయి కోడలి వరస. పైగా ఆమె కంటే అతడు వయసులో పెద్ద. అయితేనేమి? వరసకన్నా వయసుకన్నా రాజకీయ స్వార్థాలు మిన్న అనుకుని అంతా కలిసి దత్త స్వీకారం చేయించి చిమ్నాజీని పీష్వాగా ప్రకటించారు. సతారాలోని నామమాత్ర ఛత్రపతి రెండవ సాహునుంచి దుస్తులు వగైరా అధికార లాంఛనాలను నానాయే తెప్పించి పుణెకి పంపించాడు. ఇంత గ్రంథం నడవటానికి ఏకంగా ఏడు నెలలు పట్టింది 1795 అక్టోబరు 25న మాధవరావు పీష్వా మరణించగా 1796 మే 26న గానీ చిమ్నాజీ ఉత్తరాధికారి కాలేదు. పోనీ ఆ తరవాతయినా వ్యవహారం



సాఫీగా నడిచిందా?

పేరుకు చిమ్నాజీ పీష్వా అయినా పెత్తనం చేసింది బాలోబా పాగ్నిస్. అతడికి నానా అంటే సరిపడదు. ఎలాగైనా నానాను పట్టుకుని ఖైదుచేయాలని చాలా ప్రయత్నాలు చేశాడు. కాని నానా అతడిని మించినవాడు. దొరక్కుండా తప్పించుకుని రాయ్‌గఢ్ కోటలో గట్టి సైనిక రక్షణ మధ్య కూర్చున్నాడు. అతడి భూములు, ఇళ్లు, ఆస్తులు జప్తు చేశారు. ఎంత గాలించినా అపార సంపదను అతడు ఎక్కడ దాచిందీ సర్కారువారు కనిపెట్టలేకపోయారు.

సింధియా బాధితులైన నానాకూ బాజీరావుకూ ఒకే రకం కష్టాలవల్ల మళ్లీ సఖ్యత కుదిరింది. తుకోజీ హోల్కర్ అప్పటికే నానా కొమ్ముగాస్తున్నాడు. బాలోబాకు తెలియకుండా తంత్రం నడిపి మెల్లిగా సింధియానూ నానా తనకు అనుకూలంగా తిప్పుకున్నాడు. ఈ విషయంలో సఖారాం ఘట్గే అనేవాడు బాగా ఉపయోగపడ్డాడు. అతడిది ఘరానా వంశం. అతడికో కూతురుంది. ఆమె చక్కని చుక్క. ఆ పిల్లనిచ్చి పెళ్లిచేస్తానని దౌలత్‌రావు సింధియాకు సఖారాం ఆశచూపాడు. అప్పటికి దౌలత్‌రావు 20 ఏళ్లవాడే. పెళ్లి ఎరకు తక్కున చిక్కాడు. ఈలోపు రఘుజీభోస్లేనూ, జంజీరాసిద్దీనీ, కొల్హాపూర్ ప్రభువునూ, మిగతా ముఖ్యులనూ నానా కలుపుకున్నాడు. పీష్వాకూ, మంత్రికీ తెలియకుండా చకచకా రాజకీయం నడిచింది. తమ తరఫున చక్రం తిప్పుతున్న మంత్రి బాలోబాను సింధియాయే చెంతకు పిలిపించి బంధించాడు. వరస కుదరనందున చిమ్నాజీ దత్తత చెల్లదని పెద్దలు సమయానుకూలంగా ప్రకటించారు. బాజీరావును చెరనుంచి విడిపించారు. మళ్లీ సతారా నుంచి దుస్తులు, లాంఛనాలు యథావిధిగా వచ్చాయి. ఆర్నెల్లకే పాలకుడు మారి 1796 డిసెంబరు 4న బాజీరావు పీష్వా అయ్యాడు. నానా ఫడ్నవిస్ అతడి ప్రధానమంత్రిగా మళ్లీ పగ్గాలు అందుకున్నాడు.

బాజీరావుకు దశ తిరగడంతో మరాఠా మహాసామ్రాజ్య పతనంలో చివరి అంకానికి తెర లేచింది. బాజీరావు తెలివిగలవాడే. రాజకీయ చతురుడే. కాని అతడి తెలివితేటలు రాజ్యానికీ, ప్రజలకూ పనికొచ్చేవికావు. శత్రువులు పొంచి ఉండి, అన్నివైపులా సవాళ్లు చుట్టుముట్టిన సంక్షుభిత స్థితిలో సంక్లిష్ట సమస్యలను అర్థం చేసుకుని సుడిగుండాలను ఒడుపుగా తప్పించుకుని అధికార నావను తీరం చేర్చగలిగిన శక్తియుక్తులు అతడికి లేవు. సరిగా ఉపయోగించుకుని ఉంటే నానా అతడికి చేదోడు వాదోడుగా నిలిచి కష్టకాలంలో అక్కరకు వచ్చేవాడే. కాని – అధికారం కోసం అపద్ధర్మంగా నానాకు దగ్గర అయినా, అదికాస్తా అందగానే బాజీరావు నానాకు బెబ్బే అన్నాడు. చుట్టూ పనికిమాలిన సలహాదారులను పెట్టుకుని, చెప్పుడు మాటలు విని, నానామీద కత్తిగట్టాడు. తక్షణ సమస్యలను సమర్థంగా ఎదుర్కోవడం కంటే గతంలో తనకు నానాచేసిన అపకారానికి ప్రతీకారం తీర్చుకోవటం మీదే ఎక్కువ శ్రద్ధచూపాడు. నానా అధికారం ఊడగొట్టి, అతడి రహస్య సంపదను కొల్లగొట్టాలని విశ్వప్రయత్నాలు చేశాడు. ఈ విషయంలో సింధియా అతడికి తందానతాన అన్నాడు. బాజీరావు గద్దెనెక్కిన కొద్దినెలల్లోనే పరిస్థితి ఎంత విషమించిందంటే పీష్వా మంత్రి బహిరంగంగా ఒకరినొకరు కలిసేందుకే భయపడేవారు. ఎదుటివారు ఎక్కడ దాడిచేస్తారోనని ఎవరికివారు అనుక్షణం సాయుధ బలగాల భారీ కాపలాలో కాలం గడిపేవారు. పెద్ద తలకాయల్లోనే పరస్పర విశ్వాసం కొరవడటంతో పరిపాలన సహజంగానే అధ్వాన్నమైంది. జి.ఎస్.సర్దేశాయ్ అన్నట్టు –

"Baji Rao didnot feel the least concern for the cares of the state and occupied himself with prayers, worships, religious rites in public and gross sensual enjoyments in private. Nana remained sulking and a pathetic onlooker unable to exercise any effective control over the administration, which had come to a stop."

*(బాజీరావు రాజ్య వ్యవహారాల్లో కనీస జాగ్రత్తలు కూడా తీసుకోలేదు. పబ్లిగ్గానేమో వ్రతాలూ, పూజలు, పునస్కారాలు తెరిపిలేకుండా సాగించేవాడు. చాటుగానేమో రాసక్రీడల తుచ్ఛ భోగాల్లో మునిగి తేలేవాడు. ఒళ్లుమండినా ఏమీచేయలేక ప్రభుత్వాన్ని సమర్థంగా అదుపుచేయలేక నానా నిస్సహాయంగా చూస్తుండిపోయాడు. పరిపాలన మొత్తం స్తంభించిపోయింది)*

తాను సింహాసనం ఎక్కడానికి పూర్వం మరాఠా రాజ్యంలో పొడసూపిన పెడ పోకడలను, బలహీనతలను సరిచేసే సమర్థత బాజీరావుకు బొత్తిగా లేదు. పైగా కుట్ర మనస్తత్వంతో పగ, ప్రతీకారాల అల్ప బుద్ధితో, విశృంఖల స్వైర విహారాలతో రాజ్యపతనాన్ని మరింత త్వరితం చేశాడు. పిన్నవయసులోనే పెద్ద అధికారం చిక్కటంతో వొళ్లు తెలియకుండా మిడిసిపడిన దౌలత్‌రావు సింధియా ఇతడికి తోడయ్యాడు. సింధియాలకూ నానాఫడ్నవీస్‌కూ అదినుంచీ మాత్సర్యం ఉన్నది కనుక నానాను దెబ్బతీయటంలో దౌలత్‌రావు శాయశక్తులా బాజీరావుకు సహకరించాడు. వీరి దెబ్బను కాచుకోవటానికి నానా తుకోజీ హోల్కర్ మీద ఆధారపడగా కర్మం చాలక అతడు కాస్తా కన్నుమూశాడు.

తుకోజీకి నలుగురు కొడుకులు. వారిలో ఇద్దరు అక్రమ సంతానం. తండ్రి పోయాక అధికార వారసత్వంకోసం కొడుకులు తగవులాడుకుంటూంటే అదే అదనుగా దౌలత్‌రావు సింధియా ఆ గొడవలో తలదూర్చాడు. పెద్ద కొడుకు కాశీరావు కొమ్ముగాసి, రెండో కొడుకు మల్హార్‌రావును చంపి... మిగతా ఇద్దరు దాసీపుత్రులు యశ్వంతరావు, విఠోజీలను వెంటాడి రాజ్యం నుంచి వెళ్లగొట్టాడు. వారిలో విఠోజీ అన్నవాడిని తరవాత పట్టుకుని ఏనుగు కాళ్లకు కట్టి తొక్కించి చంపేశాడు. కుడి భుజం లాంటి తుకోజీ హోల్కర్ చనిపోయి, అతడి రాజ్యం సింధియా పెత్తనంలోకి పోవటంతో రెక్కలు విరిగినట్టయిన నానా మీద ఆ తరువాత సింధియా తన ప్రతాపం చూపాడు. బాజీరావు, అతడు కూడబలుక్కుని నానాను మాయమాటలతో ఎక్కడికో పిలిపించి ఆధాటున బంధించారు.

దాంతో - ప్రతీకారం తీరింది; తల నెప్పిపోయింది అనుకున్నాడు బాజీరావు. కాని - అసలు తలనెప్పులు అప్పుడే మొదలయ్యాయి. నానా భయం పోవటంతో సింధియాకూ, అతడి మామ సఖారాంకూ, పట్టపగ్గాలు లేకుండా పోయాయి. నానాను నిర్బంధిస్తే రెండు కోట్ల రూపాయలిస్తానని సింధియాకు పీష్వా ఆశ చూపాడు. ఆ పని చేశాను కదా ఇస్తానన్న సొమ్ము ఇమ్మంటూ సింధియా అతడి గొంతుమీద కూచున్నాడు. ఖజానా అసలే ఖాళీ అయిన స్థితిలో అంత డబ్బు తనవల్ల కాదని పీష్వా చేతులెత్తాడు. చాలా నెలలుగా జీతాలందక గోలపెడుతున్న సైనికులను శాంతపరచడానికి వేరే దారి తోచక సింధియా దుర్మార్గానికి దిగాడు. పీష్వా తనకు బాకీపడ్డ మొత్తాన్ని పుణె ప్రజల గోళ్లూడకొట్టి వసూలు చేయమని తన మామకు చెప్పాడు. అతడు అక్షరాలా అంత పనీచేసి, పిశాచంలా ప్రజల వెంటపడి,



దాచిన సొమ్ము బయటకి తీయించడానికి నాదిర్షా తరహా అఘాయిత్యా లకు పాల్పడ్డాడు.

పుణెలో జనం హాహాకారాలు చేస్తున్న సమయంలోనే ఇంకో వంక నలుగురు విధవలు అంతర్యుద్ధం లేవదీసి మరాఠా ప్రభుత్వాన్ని ఏళ్ల పర్యంతం ముప్పుతిప్పలు పెట్టారు. వారు మరణించిన మాధవరావు సింధియా భార్యలు. వారికి భరణం ఇచ్చి, బాగా చూసుకుంటానని వారసత్వం అందుకున్న సమయంలో దౌలత్‌రావు హామీ ఇచ్చాడు. సొంత సేనలకే జీతాలివ్వలేక జనాన్ని పీడించుకు తింటున్న స్థితిలో చేతగాకో, ఇష్టంలేకో వారి భరణాన్ని ఎగవేశాడు. అది చాలదన్నట్టు దౌలత్‌రావు మామ్మశ్రీ ఈ వితంతువుల నివాసాల మీద పడి కొరడాతో కొట్టి బయటికీడ్చి ఖైదు చేయబోయాడు. అతడి బారినుంచి ఎలాగో తప్పించుకుని వితంతువులు పీష్వా తమ్ముడు అమృతరావు శరణుజొచ్చారు. అయినా సింధియా మామ వెనక్కి తగ్గకుండా ఏకంగా అమృతరావు శిబిరంమీదే నానా ఆగంచేశాడు. తన తమ్ముడని కూడా చూడకుండా సింధియా వర్గం ఇలా బరితెగించటం సహించరాని ధిక్కారమని పీష్వా అనుకున్నాడు. పీష్వాను ఎదుర్కొనే రాజకీయ తంత్రంలో భాగంగా సింధియా - నానాఫడ్నవిస్‌కు బంధవిముక్తి చేశాడు. కొన్నాళ్లకు పీష్వాకూ వారికీ సంధి కుదిరింది. పది నెలలకు పైగా నిర్బంధం తరవాత 1798 అక్టోబరు 15న నానాకు మళ్లీ పెత్తనం చేతికొచ్చింది. మేరలేని దుర్మార్గాలతో తనకు చెడ్డపేరు తెచ్చిన మామగారిని సింధియా ఆలస్యంగానైనా వదిలించుకుని ఖైదులో పడేశాడు.

ఈ గొడవ ఇలా సమసిపోయి పుణెలో పరిస్థితిలు కొంచెం కుదుటపడ్డాయని సంతోషించడానికి వీల్లేకుండా అదే సమయంలో ఇంకో సంక్షోభం సెగలు కక్కుతూ మరాఠా సర్దార్లకు చెమటలు పట్టిస్తున్నది. అదేమిటంటే - సతారాలో సాహూరాజు తిరగబడ్డాడు. నానాను వేటువేయటంలో తనకు సహకరిస్తే పూర్వపు సాహూరాజు కుండినట్టి అధికారాలను నీకు దాఖలు పరుస్తానని బాజీరావు అతడికి బాసచేసి ఉన్నాడు. ఆ సంగతి ఏమయిందని తరవాత గుర్తుచేస్తే పీష్వా పట్టించుకోలేదు. దాంతో ఛత్రపతి సాహు మండిపడ్డాడు. అప్పటికే అతడి సోదరుడు ఛత్రసింగ్ పీష్వా మీద రవరవలాడుతున్నాడు. శివాజీ వారసులం, ఈ పీష్వాల దయాధర్మంపై ఆధారపడి సతారాలో పరాధీనపు బతుకు బతకాల్సిన ఖర్మ మనకేమిటి; తెగించి పోరాడి మన అధికారాన్ని మళ్లీ పొందుదాం - అని చాలాకాలంగా అతడు అన్నగారికి నూరిపోశాడు. సాహూ సరేనన్నాడు. సోదరులు కలిసి సైన్యాన్ని కూడగట్టి తమపై నిఘాకు పీష్వా నిలిపిన బలగాలను తరిమిగొట్టారు. కొల్లాపూర్‌లోని తిరుగుబాటును అణచడానికి పూనానుంచి పెద్ద సైన్యాన్ని పంపినా లాభం లేకపోయింది. వారి దాయాది, పోటీ ఛత్రపతి అయిన మూడవ శివాజీ వారితో చేతులు కలిపాడు. ఇక గత్యంతరం లేక పరశురామ్ భావుపట్వర్ధన్‌ను (బాజీరావును పీష్వాచేసే కుట్రలో భాగంగా అతడిని చెరలో పెట్టారు) నిర్బంధం నుంచి విడిపించి ఛత్రపతుల పైకి బాజీరావు ప్రయోగించాడు. అతడు గొప్ప పరాక్రమంతో సతారా రాజును ఓడించాడు. కాని కొల్హాపూర్ సైన్యంతో జరిగిన యుద్ధంలో మరణించాడు. మరాఠా రాజ్యానికి అది పెద్ద దెబ్బ. తరవాత పీష్వా, సింధియాలు నానాఅవస్థలు పడి ఎక్కడెక్కడి సేనలనూ సమీకరించి యుద్ధం సాగించాక గానీ కొల్హాపూర్ ఛత్రపతి 1799 డిసెంబరులో చేతులెత్తెయ్యలేదు.

ఇదీ - 18వ శతాబ్దం చివరలో వెల్లస్లీ ప్రభువు వక్రదృష్టి పడేనాటికి మరాఠా రాజ్య రాజకీయ పరిస్థితి. మాధవరావు పీష్వా అకాల మరణం తరవాత ఆ శతాబ్దం చివరి

నాలుగైదేళ్లలో నడచిన ఘటనల తీరుతెన్నులు పరిశీలిస్తే ఒక సంగతి స్పష్టం. అంతః కలహాలు, అంతర్యుద్ధాలు ఎన్ని తలెత్తినా మరాఠా సామ్రాజ్యం వాటన్నిటినీ తట్టుకుని పదిలంగానే ఉంది. వ్యక్తుల స్వార్థాలు, ద్వేషాలు, నీచ మనస్తత్వాలు ఎన్ని వెర్రితలలు వేసినప్పటికీ అవసరమైనప్పుడు విభేదాలను మరిచి, విరోధాలను పక్కనపెట్టి కలసిపోగల సంస్కారం మరాఠా ముఖ్యుల్లో మిగిలే ఉంది. చెరలో పెట్టిన వారినే వదిలిపెట్టటం, తమను ఖైదు చేశారన్న కక్ష లేకుండా వారు సైతం విశాల హృదయంతో తక్షణ సమస్యల పరిష్కారానికి మనస్ఫూర్తిగా సహకరించటం గమనిస్తే మరాఠా రాజ్యం కలహాల మయమై కుక్కలు చింపిన విస్తరిలా చిందర వందర అవుతున్నదన్న అభిప్రాయం ఏకోశానా కలగదు. ఈ నాలుగైదేళ్లలో మరాఠా పెద్దతలకాయలెన్నో వరసగా మృత్యువాత పడ్డా విజ్ఞత, కార్యదక్షత ఉన్న సమర్థులు కొందరు ఇంకా మిగిలే ఉన్నారు ***The Main Curents of Maratha History***లో జి.ఎస్.సర్దేశాయ్ అన్నట్టు - బాజీరావు, దౌలత్‌రావులు ఎన్ని తప్పుడు పనులు చేసినా... అదనుకోసం ఇంగ్లీషు గోమాయువులు కాచుకు కూర్చుని కుతంత్రాలు, కుత్సితాలు పన్ని ఉండకపోతే మరాఠా రాజ్యం మునుపు అనేక ఘట్టాల్లోవలె ఒడిదుడుకుల నుంచి మెల్లిగా గట్టెక్కేది.



# పీష్వాకు పొగ

***"You may be assured that it was a matter of real satisfaction to me that the affairs of this Government at the Court of Poona should be in the hands of a person of your talents and experience in a moment the most critical to our interests... I have the fullest confidence in your zeal for promoting the success of a plan which is founded on principles of justice and of all parties to be effected by its execution..."***

[*Rise of the Christian Power in India* - **B.D. Basu,** *p. 364*]

మన ప్రయోజనాలకు అత్యంత కీలకమైన ఈ తరుణంలో మన పూనా వ్యవహారాలు మీవంటి ప్రజ్ఞావంతుల చేతుల్లో ఉన్నందుకు నాకు పరమానందంగా ఉంది... అన్ని పార్టీలకీ న్యాయం జరిగే రీతిన ధర్మబద్ధంగా రూపొందించిన పథకాన్ని జయప్రదంగా అమలు చేయటానికి మీ తహతహ గురించి నాకు సంపూర్ణ విశ్వాసం ఉంది.

ఇండియాకి కొత్త గవర్నర్ జనరల్‌గా వచ్చిన లార్డ్ మార్నింగ్‌టన్ అనే వెల్లస్లీ దొర పుణెలోని తమ రెసిడెంటు కర్నల్ పామర్‌కు 1798 జులై 8న రాసిన తొలి రహస్య లేఖలోని తొలి పలుకులివి. విన్నవారెవరైనా - అన్ని పక్షాలకీ సమాన న్యాయం జరిగేలా న్యాయసూత్రాలకు లోబడి పథక రచన చేసిన ఆ దొరగారు ఎంతటి ధర్మప్రభువో!; అంతటివాడి పూర్తి విశ్వాసం చూరగొన్న రెసిడెంటుదొర ఇంకెంత గొప్పవాడో; ఇద్దరూ కలిసి కలహాల కాపురంగా ఉన్న మహారాష్ట్రకు పవిత్ర పథకంతో ఎంత గొప్ప న్యాయం చేస్తారోనని ఊహిస్తారు. దొరవారల మధ్య నడిచిన ఇలాంటి ఉత్తరప్రత్యుత్తరాలకు మోసపోయే... తెల్లవారు చాలా పెద్ద మనుషులు; న్యాయం తప్పనివారు; న్యాయం చేయడం కోసమే దిక్కుమాలిన దేశాన్ని వశపరచుకున్నవారు అని మన మేధావులు చరిత్ర పుస్తకాల నిండా రాసిపడేశారు.

నిజానికి దొరల భాష వేరు. వారి మాటల అంతరార్థం వేరు. వారిదంతా వక్రనీతి.

ఔనంటే కాదని. కాదంటే ఔనని, అందరికీ న్యాయం చేద్దాం అంటే అందరికీ పక్కా అన్యాయమే చేసి మనం మాత్రమే బాగుపడదాం అని కవి హృదయం!

వెల్లస్లీ అడుగుపెట్టే నాటికి భారత రాజకీయ పటంలో అత్యధిక భాగం ఇంకా మరాఠాల ప్రాబల్యంలోనే ఉంది. దక్షిణాన తుంగభద్ర నుంచి ఉత్తరాన సట్లెజ్ వరకూ పంజాబ్, సింధ్‌లదాకా వారి సామ్రాజ్యం విస్తరించింది. వారికి ఢిల్లీ పాదుషా గులాం. బుందేల్‌ఖండ్, రాజస్థానం, గంగ, యమున తీర ప్రాంతాలపై వారిదే పట్టు. గంగకు దిగువన ఇంగ్లీషు వారి ప్రాంతాలకు, కలకత్తా, ముంబాయి, మద్రాసు ప్రెసిడెన్సీలకు చుట్టూతా ఉన్నది మరాఠా రాజ్యమే. దక్షిణాదిన వారిదైన మద్రాసు ప్రెసిడెన్సీకీ, వారు నోటకరిచిన నైజాంకూ, కొత్తగా కబళించిన మైసూరుకూ మధ్య నిరాఘాట విహారానికి వీల్లేకుండా కంట్లో నలుసులా ఎక్కడికక్కడ మరాఠాలు అడ్డు!

తొలుదొలుత బెంగాలులో ఎడమకాలు మోపిన నాటినుంచీ మరాఠాలన్నా, త్వరితగతిన విస్తరించిన వారి సామ్రాజ్యమన్నా తెల్లవారికి మహా ఈర్ష్య. వారి బలాన్ని పలుకుబడిని ఎలాగైనా తగ్గించాలన్న ఆబ ఆదినుంచీ ఉన్నా అందుకు కావలసిన సైనికవనరులు, రాజకీయ అనుకూలతలు వారన్ హేస్టింగ్స్ నాటికిగానీ ఆంగ్లేయులకు సమకూడలేదు. సర్వశక్తులూ ఒడ్డినా హేస్టింగ్స్ దుస్సాహసం ఫలించక మొదటి మహారాష్ట్ర యుద్ధంలో ఘోరపరాభవం జరిగి మహారాష్ట్రులతో సంధి చేసుకోవలసి వచ్చింది. బరోడా గేక్వాడ్‌ను తమవైపు లాక్కున్నా, భోంస్లేలను ఎరలువేసి ఆకట్టుకోగలిగినా బ్రిటిష్ రాజ్య విస్తరణ తంత్రం ఆ తరువాత పెద్దగా ఫలించింది లేదు. ఈలోపు పీష్వా ప్రభుత్వం మరింత బలపడింది. మాధవరావు సింధియా ఉత్తరాదిన విజృంభించి విశాల ప్రాంతాలను జయించాడు. తేరిపార చూడలేనంత తీక్షణంగా మరాఠా ప్రభ వెలిగిపోయినందువల్లే చేసేది లేక జాన్‌షోర్, కారన్‌వాలిస్‌లు మహారాష్ట్రుల జోలికి పోకుండా జాగ్రత్తపడ్డారు. టిప్పుసుల్తాను మీద యుద్ధానికి పోయేప్పుడు కూడా కారన్‌వాలిస్ మరాఠాల సహాయం దేబిరించి, వారి అండతోనే గెలిచాడు. ఆ తరువాత దక్షిణాదిన ఇంకో బలీయశక్తి అయిన నైజాంనూ మరాఠాలు ఒంటిచేత్తో నేలకరిపించారు.

దీంతో ఇంగ్లీషు వారికి మరీ కన్ను కుట్టింది. ఇండియాలో తమకు ప్రధాన శత్రువు మహారాష్ట్ర కూటమేనని, తమకు ప్రమాదం ఎప్పటికైనా వారినుంచే రాగలదని వారికి అసలే భయం. అందుకే కారన్‌వాలిస్ టిప్పూపైకి దండెత్తినందుకు బ్రిటిష్ రాజకీయ ప్రముఖులు పలువురు తీవ్ర ఆక్షేపణ తెలిపారు. ఇండియాలో మన ప్రయోజనాలకు మరాఠాల నుంచి కదా అసలు ప్రమాదం? వారిని ఎదుర్కోవడానికి సమతూకంలా ఉపయోగపడే మైసూరు ప్రభువు మీద మనమే కత్తి ఎత్తడమేమిటి? అని కామన్స్ సభలో కొంత మంది సభ్యులు కోప్పడ్డారు. సమయం చిక్కితే మరాఠాలను దెబ్బతీసి మొత్తం దేశాన్ని స్వాహా చేయాలని సీమ దొరలు కాచుకు కూచున్నారు.

తెల్లవారికి ఎంత కుత్సితం ఉన్నా మరాఠాలకు వారిపట్ల శత్రుభావం లేదు. వారితో తమకున్న స్నేహాన్ని, శాంతియుత సంబంధాలను భగ్నపరచాలన్న ఆలోచనే వారికి లేదు. ఆంగ్లేయులకు ఆగ్రహం కలిగించే పని వారు ఏదీ చేయలేదు. తాము బతుకుతూ ఇతరులను బతకనివ్వాలనే వారు కోరుకున్నా వారిని ప్రశాంతంగా బతకనిచ్చే ఉద్దేశం ఆంగ్ల ప్రభువులకు ఎంతమాత్రం లేదు.

వెల్లస్లీ అడుగిడే నాటికి పీష్వా గద్దెపై బాజీరావు కూచుని ఉన్నాడు. దౌలత్‌రావు సింధియా



అతడికి వెన్నుదన్నుగా ఉన్నాడు. నానా ఫడ్నవీసు నిర్బంధంలో ఉన్నాడు. యూరోపియన్లు చెదపురుగుల్లా మహారాష్ట్రలో చేరి సర్దార్లను, జాగీర్దార్లను ఎగదోసి ఎక్కడికక్కడ అల్లర్లు, సంక్షోభాలు కల్పిస్తూ ఉన్నారు. లోగడ మాధవరావు సింధియా దర్బారులో రెసిడెంటుగా ఉన్న పామర్ ఈ మధ్య పూనా బదిలీ అయ్యాడు. గతంలో తమ పంచనచేరిన తండ్రి రఘునాధరావు తమకు ఎన్నో ఆశలు పెట్టాడు కాబట్టి ఇప్పుడు పీష్వా అయిన కుమారుడు బాజీరావు తమకే తవ్వి తలకెత్తుతాడని ఆంగ్లేయులు ఆశపడ్డారు. కాని బాజీరావు ఇంతవరకూ వారికేమీ చేపలేదు.

ఈ పరిస్థితుల్లో వెల్లస్లీ వచ్చీరాగానే మరాఠాలమీద ప్రత్యేక దృష్టి పెట్టాడు. తమకు శత్రువులనుకున్న వారితో యుద్ధంచేయటం, పరాక్రమంతో గెలవటం యూరోపియన్ల పద్ధతికాదు. చుట్టూ సాలెగూడు పన్ని అదనుకోసం వేచి ఉండి మధ్యపెట్టో మోసగించో గుటుక్కుమనిపించటమే వారిశైలి. సాలెగూడుకు ఇంగ్లీషు వారు పెట్టిన ముద్దుపేరు 'సైనిక సహకారం'! ఏదో ఒక విధంగా వారి సేనలను అవతలివారికి అంటగడితేగానీ తరువాయి స్వాహాకార్యం ముందుకుసాగదు.

కాని మరాఠాలకు ఇంగ్లీషు సేనలను అంటగట్టటం చాలా కష్టం. ఎందుకంటే మరాఠాలే సైనికశక్తిపై ఆధారపడి బతికే వారు. వారే ఇతర రాజ్యాలను జయించగలరు. కాబట్టి తమ రక్షణకోసం వేరేవారి సైన్యాన్ని అపేక్షించాల్సిన అగత్యం వారికి లేదు. కావాలంటే వారే ఇతరులకు సైనిక సహాయం చేస్తారు. పైగావారికీ 'కంపెనీ'కీ కారన్‌వాలిస్ హయాంలో కుదిరిన మైత్రీ ఒప్పందం ఇంకా అమల్లో ఉంది. దాని ప్రకారం లోగడ కారన్‌వాలిస్‌కు చేసినట్టే ఇప్పుడు టిప్పూపై తాజా యుద్ధంలోనూ కంపెనీకి కావాలంటే సైనిక సహాయం చేయడానికి పుణె ప్రభుత్వం సిద్ధంగా ఉంది.

ఎటొచ్చీ - ఆ సహాయాన్ని తీసుకునేందుకు వెల్లస్లీయే సిద్ధంగా లేడు. స్వయంగా యుద్ధంచేసి టిప్పూను గెలవగల సత్తా కంపెనీకి లేదన్న సంగతి అతడికి తెలుసు. బయటి నుంచి సహాయం చాలా అవసరమే. అలాగని మరాఠాల సహాయాన్ని కనుక తీసుకుంటే - యుద్ధంలో గెలుచుకునే రాజ్యంలో వారికీ వాటా ఇవ్వవలసి వస్తుంది. దానివల్ల మరాఠా ప్రాబల్యం ఇంకా విస్తరించి 'కంపెనీ'కి మరింత ప్రమాదకారి అవుతుంది. ఆ భయంతోటే వెల్లస్లీ మరాఠాల మద్దతు అవసరం ఉన్నా స్వీకరించలేదు.

మరి - తాము ఎలాగూ వద్దన్నారు కనుక తమ విరోధి అడిగితే మరాఠాలు మద్దతు ఇవ్వవచ్చుకదా? అగ్నికి ఆజ్యం తోడైనట్టు టిప్పూ, పీష్వా ఏకమైతే కంపెనీకి కొంప కొల్లేరే కదా? ఈ పాటికే టిప్పుసుల్తాన్ పూనా దర్బారుకు వకీళ్లను పంపి సైనిక సాయం అర్థిస్తున్నట్టు వార్తలొస్తున్నాయి. వారిని చేరదీయటం 'కంపెనీ' మిత్రులకు ఇష్టం లేదని తెలిశాక పూనా నుంచి ఆ వకీళ్లను వెళ్లగొట్టిన మాట నిజమే. కాని - లోపాయకారీగా ఏమి జరుగుతుందో ఎవరు చెప్పగలరు? ఇంగ్లీషు వారిలాగే మరాఠాలూ వక్రంగా నడిస్తే ఇంగ్లీషు వారికి ప్రమాదం కదా?

ఇలా ఆలోచించిన వెల్లస్లీ దీనికి ఒక ప్లాను వేశాడు. మరాఠాలను మాయలో పడెయ్యటం కోసం ఓ మాయ కబురు పంపాడు. మీరు సైన్యాన్ని పంపుతామన్నారు; చాలా సంతోషం; కాని మిమ్మల్ని శ్రమ పెట్టటం మాకు ఇష్టం లేదు. ప్రస్తుతానికి మీ సహాయం అవసరం లేదు. కాని మీరు మాకు మిత్రులు. కాబట్టి సైన్యాన్ని పంపకున్నాసరే యుద్ధం గెలిచాక

శత్రురాజ్యంలో మీ వాటాను మీకు పువ్వుల్లోపెట్టి అప్పగిస్తాము - అని దాని సారాంశం.

ఈ రీతిన మరాఠాల ముందరి కాళ్లకు బంధం వేశాక ఒక చెంప టిప్పుతో యుద్ధానికి సర్వసన్నాహాలు చేస్తూనే ఇంకోవంక పీష్వాను నయవంచనతో ఉచ్చులో ఇరికించటానికి వెల్లస్లీ పథకం పన్నాడు. 'సైనిక సహకారం' పేరిట నిజాంను వంటింటి కుందేలుగా నిర్వీర్యం చేసినట్టు పీష్వానూ బుట్టలో వేయటానికి దారులు వెదికాడు. ఇందులో భాగంగానే నానాఫడ్నవిస్‌ను నిర్బంధం నుంచి తప్పిస్తామంటే మనవైపు తిరుగుతాడేమో కనుక్కోమని ఈ వ్యాసం మొదట్లో ప్రస్తావించిన 'న్యాయాలమారి' రహస్య లేఖలో రెసిడెంటు పామర్‌ను వెల్లస్లీ పురమాయించాడు.

అయితే - పామర్‌కు ఆ లేఖ అందేలోపే పూనాలో పరిస్థితులు మారి, సింధియాతో సఖ్యత కుదిరి నానా బంధవిముక్తుడయ్యాడు. అందరికీ న్యాయం జరగాలన్న ధర్మబుద్ధి తెల్లవారికి నిజంగా ఉంటే తమ ప్రమేయం లేకున్నా నానా అంతటి యోగ్యుడికి చెర వదిలినందుకు సంతోషించవలసింది. కాని తమ షరతులకు లోబడే అగత్యం లేకుండా తనంతట తానే బయట పడినందుకు దొరలు నొసలు ముడిచి నానానూ అనుమాన దృక్కులతో చూడసాగారు.

ఎవరికి చెప్పాల్సిన మాట వారికి చెప్పి, ఎవరికి తీయాల్సిన గొయ్యి వారి వెనక తీసి, పుణెలో రెసిడెంటు మహాశయుడు పథకం ప్రకారం ఇటు రంగం సిద్ధం చేస్తూండగా అటు మైసూరులో అధర్మ యుద్ధంచేసి తెల్లవారు టిప్పూను వధించారు. ఏమాటకామాటే చెప్పుకోవాలి. యుద్ధం జయించాక వెల్లస్లీ దొరగారు వెనకటి మాట ప్రకారం మరాఠాల వాటాను వారి కోసం అట్టేపెట్టకపోలేదు. అయితే ఒక మెలిక! గతంలో బేషరతుగా ఇస్తామని చెప్పిన వాటాకు ఇప్పుడు వాటమైన షరతులు జోడించారు. అవి ఏమిటంటే - మరాఠాలు బ్రిటిష్‌వారి సైనిక సహకారం పెద్దమ్మను అక్కర్లేకున్నా నెత్తినెత్తుకోవాలట. మొత్తం మైసూరు రాజ్యంపై ఆదినుంచీ తమకుగల చౌథ్ వసూలు హక్కును వదిలేసుకోవాలట. ఇకపై నిజాంతోగాని, మరెవరితోగాని తమకు ఎటువంటి పేచీ వచ్చినా కంపెనీవారే మధ్యవర్తిత్వం చేయాలని అంగీకరించాలట. వారు ఎలా చెబితే అలా నడుచుకోవాలట.

ఒక్కమాటలో చెప్పాలంటే మైసూరు రాజ్యంలో అప్పనంగా వచ్చేవాటా కోసం మరాఠాలు తమ స్వాతంత్ర్యాన్ని, సార్వభౌమాధికారాన్ని వదిలేసుకుని ఆంగ్లేయులకు తొత్తులు కావాలి. ఆత్మగౌరవం గల ఏ ప్రభుత్వమూ అంగీకరించజాలని తెంపరి బేరమిది. కాబట్టి బాజీరావు నానా సలహా మేరకు సహజంగానే దీన్ని తిరస్కరించి మీరూ వద్దు; మీ వాటా వద్దు పొమ్మన్నాడు.

దాంతో వెల్లస్లీకి ఒక సంగతి అర్థమైంది. పీష్వా తనకు తానుగా మెడకు ఉరితాడు తగిలించుకోడు: గత్యంతరం లేని పరిస్థితి కల్పించి అతణ్ణి అన్నివైపుల నుంచీ నొక్కేస్తే తప్ప 'కంపెనీ' కార్యం నెరవేరదు. పుణె రెసిడెంటుకు పంపిన లేఖలో గవర్నరు జనరల్ ఈ మాటే స్పష్టంగా అన్నాడు.

"The inference to be deduced from these considerations was, that until irresistibly compelled by the exigency of his affairs to have recourse to the assistance of the Company, Baji Rao would never be induced to enter into any engagements





which in his apprehension, would afford to the British Government the means of acquiring an ascendency, which it was our interest to establish in the Mahratta empire."

[*Empire in Asia*, **W.M. Torrens**, *p-185*]

(వీటన్నిటిని బట్టి ఏమనుకోవాలంటే తన వ్యవహారాలు విషమించి, కంపెనీ సహాయాన్ని అపేక్షించక తప్పని సంకటస్థితిలో ఇరుక్కుంటేగానీ బాజీరావు మన ప్రయోజనాలకు కావలసినట్టు మరాఠా సామ్రాజ్యంలో మన ప్రాబల్యం పెంచుకోవటానికి ఒప్పుకోడు)

బేరంవల్ల పొందలేనిదాన్ని మోసం ద్వారా సాధించడానికి తెల్లదొరలు మరింత ఆయుత్తమయ్యారు. వెల్లస్లీ దర్శకత్వంలో కపట నాటకానికి తెరలేచింది. మరాఠా రాష్ట్ర కూటమిలో ఆదినుంచీ సింధియాకూ హోల్కర్‌కూ పడదు. తుకోజీ హోల్కర్ మరణించి, అతడి వారసులు సింధియా రక్షణలోకి చేరాక ఆ చిరకాల వైరం కాస్తా సద్దుమణిగింది. అలాగే నానా ఫడ్నవిస్‌కూ, సింధియాలకూ లోలోన ఉన్న విరోధం కూడా దౌలత్‌రావు సింధియా పెత్తనానికి వచ్చాక ఇటీవలి కాస్త నెమ్మదించింది. అటు సింధియా సైనికశక్తి ఇటు నానా మంత్రాంగం అండగా ఉన్నంతకాలమూ బాజీరావును పట్టుకోవటం కష్టం. వారిలో వారికి తంపులుపెట్టి మహారాష్ట్ర కూటమిలో ముసలం పుట్టించి, బలహీనుడైన పీష్వాను విడిగా లాగేస్తేగాని కుంపిణీయుల పంట పండదు. కాబట్టి చల్లగా ఉన్న రాజ్యంలో చిచ్చు పెట్టే పనికి వెల్లస్లీ పూనా రెసిడెంటు పామర్‌ను తగిలించాడు. అతడేమో పీష్వా చెవిని ఇల్లు కట్టుకుని దౌలత్‌రావు సింధియాపై కొండేలు చెప్పసాగాడు. నువ్వు సింధియా వలలో పడిపోయావు. అతడు నిన్ను పిండి బొమ్మనుచేసి ఆడిస్తున్నాడు. నీవతనికి ఖైదీవయ్యావు. బానిసవయ్యావు. నీకిదేమి ఖర్మం అని నిత్యం నూరిపోసి అసలే అనుమానపు మనిషి అయిన బాజీరావుకు కంటికి కునుకు లేకుండా చేశాడు. అదే సమయంలో వెల్లస్లీ దొరగారు బాజీరావు పీష్వా సింధియా చేతిలో బందీలా ఉన్నాడని నాలుక భుజాన వేసుకుని గగ్గోలు పెట్టాడు.

ఈ మాట పచ్చి అబద్ధం. సింధియా మీద బాజీరావు ఎక్కువగా ఆధారపడుతున్న సంగతి యథార్థమే. అయితే అది బలాత్కారంవల్ల కాదు. తనను పీష్వా గద్దె నెక్కించడానికి సింధియా ఎంతో సాయపడ్డాడన్న కృతజ్ఞతా భావంతో. ఇంటా బయటా ముసిరిన శత్రువుల బారినుంచి రాజ్యాన్ని అతడే రక్షించగలడన్న నమ్మకంతో. అంతే తప్ప పీష్వాను సింధియా నిర్బంధించిందీ లేదు; అవమానించిందీ లేదు. తనను సింధియా చెరపట్టినట్టు పీష్వా ఎప్పుడూ ఎవరితో చెప్పుకోలేదు. అతడి బారినుంచి తనను కాపాడమని కంపెనీ వారిని ఎన్నడూ కోరలేదు. పీష్వాకు అటువంటి గతి పట్టినట్టు పూనాలోని బ్రిటిష్ రెసిడెంటు కూడా వెల్లస్లీ కనుగీటడానికి పూర్వం పైవారికి ఎప్పుడూ రిపోర్టు చేయలేదు. పోనీ - అకస్మాత్తుగా ఇప్పుడే ఈ దారుణ దుర్వార్త దొరలకు తెలిసిందనుకున్నా... తెలిశాక దానికి తగిన ప్రతిక్రియ చేయటానికి వారు ఆయాసపడిందీ లేదు. అమల్లో ఉన్న సంధి ప్రకారం పీష్వా కంపెనీ వారికి మిత్రుడే. అతడికి ఆపదవస్తే వారు ఆదుకొనవలసినవారే. గతంలో తమకు మిత్రుడైన తిరువాన్కూరు రాజాకేసి కీగంట చూశాడన్న నెపంతోనే మిత్రధర్మం పేరిట టిప్పు సుల్తాన్ మీదికి కత్తి ఎత్తి కంపెనీవారు నానా ఆగం చేశారు కదా? మిత్రుడైన

పీష్వానూ అలాగే సింధియా బారినుంచి ఉద్ధరించి ఉండవచ్చు కదా?

వచ్చు. కాని దొరలు ఆ పనిచేయలేదు. ఎందుకంటే తాము వేసినది వట్టి అభాండమని వారికి తెలుసు. అందుకే పీష్వా చెవులు మాత్రం కొరికి, తగవులు పెట్టి తమాషా చూశారు. వారి చెప్పుడు మాటలు వినివిని - తనకు చుట్టూ ఉన్న వారంతా తన కీడు కోరేవారేనని, వారి బారినుంచి ఇంగ్లీషువారు మాత్రమే తనను కాపాడగలిగినవారనీ, వారు పెద్ద మనసుతో ఆఫర్ చేసిన ప్రకారం వారి సైన్యాన్ని తనకు రక్షణ కవచంగా పెట్టుకుంటే తప్ప తనకు భద్రత ఉండదనీ ఒక బలహీనక్షణంలో బాజీరావు కూడా తలపోశాడు.

దాంతో సీమ శకునుల పని తేలికైంది.



# పడగనీడలో పీష్వా

అక్కడికీ వెల్లస్లీ దొరగారు సింధియాకి వారితో వీరితో చిలక్కి చెప్పినట్టు చెప్పించారు. నువ్వు పూనాలో తిష్ఠవేసినంతకాలమూ మా పనులేవీ అయేట్టు లేవు. పీష్వా పిలక మా చేతికి దొరక్కుండా అతణ్ని గట్టిగా పట్టుకొని కూచున్నావు. పైగా సైన్యాన్ని తీసుకుని ఎప్పుడు నైజాం మీద పడతావో, ఎక్కడ మా వెంట పడతావో అని భయంగా ఉంది. నువ్వు కొంచెం పూనా వదిలిపోతే పీష్వా సంగతి మేము చూసుకుంటాం. ఒకరి తరువాత ఒకరుగా మీ అందరి నోటా మన్నుకొట్టి మీ సామ్రాజ్యాన్ని నెమ్మదిగా కాజేస్తాం... అన్న అసలు అంతర్యాన్ని అందమైన భాషలో నగిషీలు చెక్కి వినిపించారు.

సింధియా ఆలకించాడా? లేదు. దాంతో ఇలా లాభం లేదని తలచి, సింధియాను ఎలాగైనా పూనా నుంచి లేపేందుకు వెల్లస్లీ ప్రభువులవారు ఎత్తుమీద ఎత్తువేశారు.

మొదటి ఎత్తు 'పుకారు'! అఫ్ఘాన్ రాజు అహ్మద్‌షా అబ్దాలీ పూర్వం పానిపట్టు యుద్ధంలో మహారాష్ట్రులను ఘోరంగా ఓడించాడు కదా? ఆ పేరు చెబితే మరాఠాలు హడలిపోతారని దొరవార్లు అనుకున్నారు. అబ్దాలీ మనవడు జుమాన్‌ఖాన్ ఇండియాపైకి దండెత్తి రానున్నాడని తమ ఏజెంట్ల చేత పుకార్లు పుట్టించారు. (ఇది వట్టి పుకారేనని గ్రాంట్ డఫ్, జేమ్స్ మిల్ వంటి ప్రఖ్యాత చరిత్రకారులు ధ్రువీకరించారు.) ఈ వదంతులకు బెదిరి ఉత్తరాదిన తన రాజ్యాన్ని రక్షించుకోవటానికి సింధియా పూనా విడిచి గ్వాలియరుకు పరుగెడతాడని దొరలు ఆశించారు. కాని సింధియా జంకలేదు. ఇప్పట్లో జుమాన్‌షా నుంచి అలాంటి ప్రమాదం లేదని అతడికి తెలుసు.

పుకారు పాచిక పారకపోవటంతో వెల్లస్లీ అటునుంచి పొగబెట్టే రెండో ఎత్తుకు ఉపక్రమించాడు. సింధియా రాజ్యంలో అంతఃకలహాలు తెచ్చి కల్లోలం రెచ్చగొట్టడానికి స్పెషల్ డ్యూటీ మీద కాలిన్స్ అనే వాణ్ని గ్వాలియరుకు రెసిడెంటుగా పంపించారు. పైకి చెప్పిందేమిటంటే - జుమాన్‌షా చేయబోయే దండయాత్రను ఉమ్మడిగా ఎదుర్కోవడానికి

సింధియాతో సంప్రదించి, స్నేహపూర్వకంగా తగిన ఏర్పాట్లు చేయడానికని! అదే అసలు ఉద్దేశమైతే దౌలత్‌రావు పూనాలో ఉంటే కాలిన్సు అతడి దగ్గరికి కదా పోవలసింది? అతడు లేని సమయంలో గ్వాలియరులో ఎందుకు చొరబడాలి? గ్వాలియరుకు పంపేముందు అక్కడ చేయాల్సిన పనులను కాలిన్సుకు వెల్లస్లీ నూరిపోశాడు. అంతకుముందు అనేక దేశీయ దర్బార్లలో జరిగినట్టే... విభేద తంత్రాన్ని ప్రయోగించి, సింధియా కొలువులోని వారికి లంచాలు పెట్టి, సింధియాపై చాడీలు చెప్పి ద్వేషం కలిగించి, రాజ్యంలో ఎక్కడికక్కడ తిరుగుబాట్లు ప్రేరేపించడానికి కాలిన్సు శక్తివంచన లేకుండా కృషిచేశాడు.

అయినా సింధియా బెంబేలెత్తలేదు. పుణె నుంచి కదలలేదు. అప్పుడు వెల్లస్లీ ఇంకో ఎత్తువేశాడు. కోల్‌బ్రూక్ అనే అధికారిని (అనంతర కాలంలో ప్రఖ్యాతుడైన సంస్కృత విద్వాంసుడు ఈయనే) నాగపూర్ దర్బారుకు పంపించి బేరార్ రాజాతో మంతనాలాడించాడు. సింధియాతో యుద్ధం వస్తే ఆంగ్లేయులకు సహాయం చేసేట్టు రహస్య ఒప్పందం కుదుర్చుకున్నాడు. అక్కడితో ఆగక సింధియా దెబ్బకు పారిపోయివచ్చి నాగపూర్‌లో తల దాచుకుంటున్న దాసీపుత్రుడు యశ్వంతరావు హోల్కర్‌ను దువ్వి, మందీమార్బలాన్ని డబ్బూ దస్కాన్ని సమకూర్చి సింధియా రాజ్యం మీదికి ఉసిగొలిపాడు. చచ్చిన పాములా పడివున్న హోల్కర్‌కు దాంతో వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్టయింది. చిచ్చర పిడుగులా సింధియా రాజ్యం మీద పడి, కొన్ని ప్రాంతాలను ఆక్రమించి, జనాన్ని దోచుకుని అతడు చెలరేగసాగాడు. ఇక ఉపేక్షిస్తే లాభం లేదని దౌలత్‌రావు సింధియా దిగ్గున కదిలి తగు మాత్రం సేనను పుణెలో నిలిపి 1800 నవంబరులో తన రాజధానికి మరలిపోయాడు.

అలా వెల్లస్లీ తంత్రం ఫలించింది. పుణె నుంచి సింధియాను జయప్రదంగా బయటకి పంపాక అటు సింధియానూ, ఇటు పీష్వానూ చిక్కుల్లో పెట్టి ఉచ్చులోకి నెట్టటానికి కుతంత్రాలు సాగాయి. సింధియా పూనానుంచి కదిలేంతవరకూనేమో – అతడు ఉత్తరాదికి తిరిగిపోవటం దేశ రక్షణకు చాలా అవసరమని, అతడితోకలిసి జుమాన్‌షా దాడి బెడదను ఉమ్మడిగా ఎదుర్కోవాలని తాము ఆరాటపడుతున్నామనీ వెల్లస్లీ చెబుతూ వచ్చాడు. అతడు వెనక్కిపోయాకేమో నానా దురుద్దేశాలు ఆపాదించి, తమకు వ్యతిరేకంగా కుట్ర చేస్తున్నాడని అభాండాలు వేసి సింధియా మీద కత్తికట్టాడు. సింధియా గ్వాలియర్ వెళ్లటానికి పూర్వమే వెల్లస్లీ కలకత్తాలోని కమాండర్ ఇన్ చీఫ్ సర్ అలూరెడ్ క్లార్క్‌ను పెద్ద సేనతో తరలించి సింధియా సరిహద్దుల్లో నిలిపాడు.

ఎందుకు? నేరుగా యుద్ధాన్ని ప్రకటించి సింధియాతో అమీతుమీ తేల్చుకోవటానికా? కాదు. అది పరాక్రమం మీద ఆధారపడేవారు అనుసరించే పద్ధతి. యూరోపియన్ వర్తక శ్రేష్ఠులు ఆ కోవకు చెందరు. వారిదంతా వంకర తరహా. సింధియా మీద ఒత్తిడి పెంచటానికి, భయాన్ని రేకెత్తించటానికి సైన్యాన్నయితే ఎదుట నిలిపారు. ఎందుకొచ్చారని సింధియా నిలదీస్తే మాత్రం అబద్ధాలు చెప్పి తప్పించుకోమన్నారు. సాక్షాత్తూ గవర్నర్ జనరలే ఈ వింత ఆదేశాన్ని తన సైన్యాధిపతికి ఇలా ఉపదేశించాడు.

"The reassembling of the army may possibly alarm scindhiah and an explanation may be demanded of the motives of such a step. You will ascribe it to the escape of Vizier Ali from Benares, to the probability of his attempting to join



Zemaun Shah, and to the consequences which that event might produce."

("మనమీ సేనలను ఇలా మోహరించటం చూసి సింధియా అనుమానపడవచ్చు. ఇలా ఎందుకు చేశారని మనల్ని అడుగుతాడేమో. అడిగితే - బెనారసు నుంచి వజీరాలీ తప్పించుకుపోయాడనీ, జుమాన్‌షాతో అతడు చేరితే ప్రమాదం కాబట్టి దాన్ని నివారించటానికే సేనల్ని సమీకరించుకున్నామనీ - జవాబు చెప్పు.")

ఇలా దొంగబద్ధాలు చెప్పడం ఒకటే కాదు. ఆంగ్ల సైన్యాధిపతికి ఘనత వహించిన గవర్నర్ జనరలుగారు ఇంకో డ్యూటీ కూడా చేశారు. అదీ వారి మాటల్లోనే చదవండి.

"...You will use every endeavour to excite the Rajpoots and other tributaries against Scindhiah, and to induce the Rajahs of Jynagur and Jodhpur to enter zealously into the war; you will at the same time take proper steps for supporting and encouraging the exertions of the partizans of the Byes and Lukwaji Dada, together with all persons in the family or service of scindhiah, who may be disaffected to his Government."

[*Rise of the Christian Power in India*, **B.D. Basu**, *p.379*]

(రాజపుత్రులను, ఇతర సామంతరాజులను సింధియాపైకి ఉసిగొపటానికి నీ శాయశక్తులా ప్రయత్నించాలి. జునాగఢ్, జోధ్‌పూర్ రాజులను కూడా ఈ యుద్ధంలోకి లాగేట్టు చూడు. సింధియాతో పోరాడుతున్న మహాద్‌జీ సింధియా వితంతువులను, అతడిపై తిరగబడిన సర్దారు లక్వాజీదాదాను, సింధియాకు వ్యతిరేకులుగా ఉన్న అతని కుటుంబంలోని వారిని, కొలువులోని వారిని అందరిని బలపరిచి ప్రోత్సహించటానికి ఇదే సమయంలో తగిన ప్రయత్నాలన్నీ చేయాలి.)

ఇదన్నమాట సంగతి! 'కంపెనీ' దొరలు కాలపెట్టిన చోటల్లా, వారి కన్నుపడిన చోటల్లా అకస్మాత్తుగా తిరుగుబాట్లు లేచి, కక్షలు ముదిరి, అంతఃకలహాలు రెచ్చి, రాజ్యాలకు రాజ్యాలు క్రమపద్ధతిన అల్లకల్లోలాల పాలై చివరికి అన్నీ 'కంపెనీ' నోట్లో పడటం వెనక ఇంత పకడ్బందీ పథకం ఉన్నదన్నమాట. దేశీయ ప్రభువుల అవివేకంవల్ల, అసమర్థతవల్ల, ఆత్మహత్యా సదృశమైన రాజకీయ దుర్విధానాలవల్ల, సంకుచిత స్వార్థంకోసం విశాల జాతి హితాన్ని బలిపెట్టే మూర్ఖత్వంవల్ల దేశం తెల్లవారికి ఆయాచితంగా దైవికంగా వశమైందని భ్రమించే భారతీయ మేధావులకు వెల్లస్లీ విడమర్చి వెల్లడించిన మాయ మర్మం అవలోకించాకయినా అసలు గుట్టు అర్థం కావాలి. ఈ కుతంత్రాలు, కుత్సితాలు క్లయివ్, వారన్‌హేస్టింగ్స్‌ల కాలంనుంచీ 'కంపెనీ' దొరవార్లందరూ రివాజుగా అనుసరించినవే. అంత దాకా వాచ్యంగా, కడు గోప్యంగా జరిగిన పాడు పనులను కాగితం మీద అక్షర బద్ధం చేసినందుకు వెల్లస్లీకి చరిత్ర రుణపడి ఉండాలి.

పథకం ప్రకారం ఇలా తెల్లవారు సాగించిన కుట్రలూ కూహకాల మూలంగా సర్వత్రా భగ్గుమన్న తిరుగుబాట్లను, వెన్నుపోట్లను, విరోధుల స్వైర విహారాలను తట్టుకోవటంలో సింధియా మధ్యభారతంలో తలమునకలవుతూ హోల్కర్ సవాలును అతికష్టంమీద

అదుపులోనికి తెస్తున్న సమయంలో ఇటు పూనాలో పీష్వాకు పుటంపెట్టే పుణ్యకార్యం ముమ్మరమైంది. బాజీరావు కంపెనీవారి మాయలోపడి, వారి దుర్బోధలకు చెవి ఒగ్గి, వారే తనకు రక్షకులని వెర్రిగొర్రెలా విశ్వసించినా దొరలు మాత్రం అతడికి చెప్పాల్సిన ఇచ్చకాలు అతడికి చెబుతూనే చాటున అతడిపై కత్తులు నూరి, చక్రబంధంలో నొక్కేసే కుటిల వ్యూహాన్ని చాలాకాలంగా అమలు జరుపుతూ వచ్చారు.

కుశాగ్రబుద్ధి అయిన నానా ఫడ్నవీసుకు వారి దుర్మార్గాలు తెలియకపోలేదు. కాని - పూర్వపు అధికార ప్రాభవం తనకు లోపించడంవల్లనేమి, ఇరవై ఏళ్ల కింద తాను ఆంగ్లేయులపై ఐక్య సంఘటన కట్టిన నాటి అనుకూల పరిస్థితులు ఇప్పుడు మృగ్యమవడం వల్లనేమి, తనను నమ్మక, నిర్ణయాధికారాలనివ్వక పీష్వా బాజీరావు తన చేతులు కట్టేసిన కారణంగానేమి అపరచాణక్యుడయిన నానా కూడా అవసాన దశలో నిర్వీర్యుడయ్యాడు. బాహాటంగా పీష్వాపై వల్లమాలిన ప్రేమ కురిపిస్తూనే... పీష్వాకు దురుద్దేశాలేవో ఉన్నాయనీ, తమపై దాడికి ప్రయత్నిస్తూ, ద్రోహానికి పాల్పడుతున్నాడనీ వెల్లస్లీ అతడికి తెలియకుండా దుష్ప్రచారం మొదలెట్టాడు. టిప్పు రాజ్యంలో ఇంగ్లీషువారు అడుగిడినదే తడవుగా దానిని అనుకుని ఉన్న మరాఠా ప్రాంతాలలో స్థానిక జాగీర్దార్లను ఎగదోసి పీష్వాపై తిరుగుబాట్లు చేయించారు.

దొరల పుణ్యమా అని హఠాత్తుగా పుట్టుకొచ్చిన ఈ సవాళ్లను ఎదుర్కొని అతికష్టం మీద తిరుగుబాట్లను కాస్త అణచగలిగాడో లేదో 1800 ఫిబ్రవరి 13న నానాఫడ్నవిస్ కన్నుమూశాడు. ఆయన మరణంతో మరాఠాలు తమ పూర్వ వైభవాన్ని పొందే ఆశ అడుగంటింది. రెసిడెంటు పామర్ అన్నట్టు నానాతోటే మరాఠా ప్రభుత్వం నుంచి వివేకం, సంయమం వెళ్ళిపోయాయి. ("With him departed all the wisdom and moderation of the Maratha Government.") నానా నిష్క్రమణతో ఇంగ్లీషువారు ఆడింది ఆట అయింది. మరాఠా రాజ్యాపహరణ కుటిల నాటకంలో చివరి అంకానికి తెర లేచింది.

బాజీరావు గద్దెనెక్కిందే దౌలత్‌రావు సింధియా ప్రాపకం వల్ల. కాబట్టి ప్రతి ముఖ్య విషయంలోనూ అతడు తనను సంప్రదించాలని సింధియా కోరుకున్నాడు. ప్రతిదీ అతడికి చెప్పి చేయటం తనకు పరువుతక్కువని బాజీరావు భావించాడు. తాను సర్వస్వతంత్రుడినని, ఎవరినీ లక్ష్యపెట్టనవసరం లేదని నిరూపించుకుంటున్నానని ఊహించుకుని అతడు నేరుగా పోయి ఇంగ్లీషువారి ఊబిలో పడ్డాడు. టిప్పు మరణానంతరం మైసూరు రాజ్యాన్ని విదేశీయుల బారి నుంచి కాపాడటానికి దూండియా వాగ్ అనే దేశభక్తుడు కొంత బలగాన్ని గెరిల్లా తరహాలో పోరాటం సాగిస్తున్న కాలమది. గవర్నరు జనరల్ వెల్లస్లీకి స్వంత తమ్ముడైన సర్ ఆర్థర్ వెల్లస్లీ నాయకత్వాన పెద్ద ఇంగ్లీషు సేన అతడి వెంటపడింది. దాని నుంచి తప్పించుకోవటానికి వాగ్ మరాఠా ప్రాంతాల్లోకి పారిపోయాడు. ఈ సంగతి పీష్వాకు విన్నవించి, తమరు కనుక దయతో అనుమతిస్తే మేము కొంచెం సేనను పంపించి ఆ దుండగుడిని పట్టుకుంటాం అని దొరలు మహా వినియంగా ప్రార్థించారు. ఓస్! దానికేముంది? అలాగే చేసుకుపోండి అని బాజీరావు దూరం ఆలోచించకుండా, సింధియాకు చెప్పాపెట్టకుండా అనుమతిని దయచేశాడు. అదే అతడి నెత్తికి చేతులు తెచ్చింది.

తాము బందిపోటుగా ముద్ర వేసిన దేశభక్తుడిని పట్టుకునే నెపంతో ఇంగ్లీషు సేనలు మరాఠా రాజ్యంలోకి ప్రవేశించాయి. తమకు కావలసినవాణ్ని పట్టుకున్నాయి. అంతటితో



వెనుదిరగక అక్కడే తిష్ఠవేశాయి. అంతకుమునుపు ఇంగ్లీషు సైన్యాన్ని నైజాంకు చప్పుడు కాకుండా తరలించి, నిజాం మెడమీద కత్తిపెట్టి సైనిక సాలెగూటిలోకి లాగేసిన తంత్రాన్నే పీష్వా మీదా ప్రయోగించటానికి వెల్లస్లీ ఆయత్తమయ్యాడు. "మనం వెంటనే కలగజేసుకోవలసినటువంటి సంక్షోభం మహారాష్ట్రలో రాబోతున్నదని మన రెసిడెంటు పామర్ చెబుతున్నాడు. బహుశా పీష్వాయే మన సైనిక సహాయాన్ని అర్థించవచ్చు. లేదా అతడు పూనా వదిలి పారిపోవచ్చు. లేక సింధియా తెగబడి పీష్వాను నిర్బంధించనూ వచ్చు. ఇందులో ఏది జరిగినా పీష్వా న్యాయబద్ధ అధికారాన్ని నిలబెట్టే పేరిట, ఆయన తరఫున మనం సైనిక జోక్యం చేసుకోవలసి ఉంటుంది. అందుకని సేనలతో వెనక్కి రాకుండా ఉన్నచోటే ఉండి, రంగంలోకి దూకడానికి సిద్ధంగా ఉండమని ఆర్థర్ వెల్లస్లీకి చెప్పండి అని 1800 ఆగస్టు 23న మద్రాసు గవర్నర్ లార్డ్ క్లయివ్‌కు వెల్లస్లీ జాబు రాశాడు.

అతడు ఊహించినట్టే పీష్వాకూ సింధియాకూ వ్యవహారం చెడింది. తనకు తెలియకుండా విదేశీ సేనలను రాజ్యంలోకి అనుమతించి చేజేతులా వినాశాన్ని కొనితెచ్చినందుకు పీష్వా మీద సింధియా మండిపడ్డాడు. ఇలాగే వదిలేస్తే ఇంకేమి పిచ్చిపనులు చేస్తాడోనని తలిచి పీష్వా చుట్టూ తన సిపాయిలతో గట్టి కాపలా పెట్టించాడు. పరిస్థితి త్వరితగతిన చెయి దాటిపోతున్న విషమ స్థితిలో సింధియా అంతకంటే తీవ్ర చర్యలే చేపట్టవలసింది. బాజీరావును ఖైదు చేయడానికీ, ఆఖరికి చంపడానికీ అయినా వెనకాకుండా ఉండవలసింది. కాని మూడు దశాబ్దాల కింద రఘోభా విషయంలో నానాఫడ్నవిస్ చూపిన కనికరాన్నే రఘోబా కుమారుడి విషయంలో దౌలత్‌రావూ కనపరిచి అరకొర ఆంక్షలతో ఊరుకున్నాడు. సింధియా తన చుట్టూ కాపలాపెట్టి తన స్వేచ్ఛను కుదించడంతో బాజీరావు ఇక తనను రక్షించగలిగింది ఇంగ్లీషు వారేనని దృఢ నిశ్చయానికి వచ్చాడు. రెసిడెంటు పామర్‌ను పిలిచి మంతనాలు మొదలెట్టాడు. ఇంతకుముందు నుంచీ మీరు అంటున్నట్టే ఆరు బెటాలియన్ల సైన్యాన్ని నాకు సహాయంగా తీసుకుంటాను; సాలుకు పాతిక లక్షల రాబడి వచ్చే ఉత్తరాది పరగణాలను రాసిస్తాను. అయితే ఒక షరతు. మీ సైన్యం ఇక్కడ శాశ్వతంగా తిష్ఠవేయటానికి వీల్లేదు. మీ దగ్గరే అట్టేపెట్టుకుని నేను కోరినప్పుడల్లా పంపిస్తూ ఉండాలి - అని పీష్వా బేరం పెట్టాడు.

కాని - ఆవలివారు ఆంగ్లేయులు. వారికి రాజ్యలాభం లేకుండా కేవలం కిరాయి తీసుకుని సైన్యంతో షటిల్ సర్వీసు చేయించమంటే వారెందుకు ఒప్పుకుంటారు? సర్వనాశనం ముంచుకొస్తున్నదంటే తప్ప పీష్వా శషభిషలు మాని ఇంగ్లీషు భల్లూకాన్ని కౌగిలించుకోవటానికి బేషరతుగా ఇష్టపడేట్టు లేదని రెసిడెంటు పామర్ గ్రహించాడు. పూనా నుంచి గవర్నర్ జనరల్‌కు పంపిన చివరి లేఖలో ఆ మాటే అతడు స్పష్టంగా అన్నాడు. ("I apprehend that nothing short of imminent and certain destruction will induce the Peishwa to make concessions...")

సరే! అట్లే అగుగాక అన్నాడు వెల్లస్లీ. అతడు సైగ చేయగానే యశ్వంతరావు హోల్కర్ సింధియాతో పోరును ఆపి, తన సోదరుడి దారుణ హత్యకు ప్రతీకారం తీర్చుకునే మిషపై పీష్వా రాజ్యంమీద పడ్డాడు. పీష్వా న్యాయబద్ధ అధికారాన్ని నిలబెట్టటమే తమ పవిత్ర కర్తవ్యమని చెబుతూ వచ్చిన దొరలు ఏకంగా మరాఠా రాజధానిపైనే దాడి జరుగుతున్నా చిటికెన వేలును కదిలించలేదు. పైగా దురాక్రమణకు వచ్చిన హోల్కర్ సేనలతో తలపడాల్సిన

అవసరం రాకుండా జాగ్రత్త పడమని పూనా రెసిడెంటుకు ఆదేశాలిచ్చారు. తమకు మిత్రుడైన తిరువాన్కూరు రాజును కన్నెత్తి చూడటమే మహాపరాధంగా ఎంచి గతంలో టిప్పుసుల్తానుపై విరుచుకుపడిన దొరలు, తమకు అలాంటి మిత్రుడే అయిన పీష్వా రాజధానిపైనే దండయాత్ర జరుగుతున్నా మెదలకపోగా దురాక్రమణదారులతోనే చేతులు కలిపారు.

ఆ సమయాన పుణె మరీ దిక్కూమొక్కూ లేకుండా ఏమీ లేదు. రాజధాని రక్షణకు సింధియా నిలిపివెళ్లిన 10 వేల అశ్వదళం, 5 బెటాలియన్లు సర్వసన్నద్ధంగా ఉన్నాయి. ఇవిగాక పీష్వా చేతిలోనూ కొంతసైన్యం ఉంది. ఈ మొత్తం బలగాలతో పోల్చితే హోల్కర్ బలం తక్కువ. గట్టిగా పోరాడితే పీష్వా పక్షానికే విజయం దక్కేది. కాని యథాప్రకారం ఇంగ్లీషు కుతంత్రం పనిచేసింది. శత్రు దుర్భేద్యమైన శ్రీరంగపట్నం కోటను దుర్గరక్షకులను లోబరుచుకోవటం ద్వారా పట్టుకుని టిప్పుసుల్తానుపై ఆంగ్లేయులు అధర్మ విజయం సాధించినట్టే... సింధియా సేనలోని కెప్టెన్ ఫిలోస్ అనే యూరోపియన్ ఆఫీసరు విద్రోహం వల్ల 1802 అక్టోబరు 25న పూనా యుద్ధంలో అనూహ్యంగా హోల్కర్ గెలిచాడు.

ఓడిపోయిన పీష్వా రాజధాని విడిచి పారిపోయి బేసెన్‌లో ఇంగ్లీషువారి శరణుజొచ్చాడు. సంవత్సరం కిందట తాను వీల్లేదన్న షరతులకు నోరుమూసుకుని అంగీకారం తెలిపి, తన అధికారాన్ని, మరాఠాల స్వాతంత్ర్యాన్ని విదేశీయులకు కుదువపెడుతూ 1802 డిసెంబర్ 31న దిక్కుమాలిన ఒప్పందం కుదుర్చుకుని, తనను తాను బ్రిటిష్ తాబేదారు స్థితికి దిగజార్చుకున్నాడు. పీష్వా నామమాత్రపు అధికారం 1818 దాకా కొనసాగకపోలేదు. కాని 1802లో బేసెన్ ఒప్పందంతోటే మరాఠా ప్రాభవం కొడిగట్టింది. భారతదేశ పరాధీనతకు అదే నాంది.



# సూర్యచంద్రులు సాక్షిగా...

మీ మిత్రులు మాకూ మిత్రులే; మీ శత్రువులు మాకూ శత్రువులే; మీ హక్కుల మీద, మీ ప్రాంతాల మీద దాడి జరిగితే అది మా హక్కుల మీద, మా రాజ్యం మీద జరిగిన దాడిగానే భావిస్తాం. మీ జోలికొచ్చిన వారి భరతం పడతాం. మిమ్మల్ని కంటికి రెప్పలా కాపాడతాం. సూర్యుడూ చంద్రుడూ ఆకాశంలో ఉన్నంతవరకూ మన స్నేహం నిలిచి ఉండును గాక... అని భీషణ ప్రతిజ్ఞ చేసి పీష్వా బాజీరావుతో బేసెన్ ఒప్పందం కుదుర్చుకున్నారు ఇంగ్లీషువారు. పీష్వాకు సింధియా మిత్రుడు; హోల్కర్ శత్రువు. సింధియా తనకు అండగా ఉన్నప్పటికీ హోల్కర్ దురాక్రమణను ఎదుర్కొనలేకపోయినందువల్లే బాజీరావు రాజధాని విడిచి, రాజ్యం వదిలి పరారై తెల్లవారి శరణు జొచ్చాడు. సూర్యచంద్రుల మీద ఒట్టుపెట్టి చేసుకున్న ఒప్పందం ప్రకారం ఇంగ్లీషు మిత్రులు హోల్కర్ వెంటపడాలి. సింధియానేమో అక్కున చేర్చుకోవాలి.

కాని - జరిగింది దీనికి రివర్సు. తమ నేస్తుడిని రాజ్యం నుంచి వెళ్లగొట్టిన హోల్కర్‌నేమో కంపెనీ ధర్మాత్ములు ఉపేక్షించారు. ఆఖరులో తమ మిత్రుడికి బాసటగా ఉన్న సింధియా పైనేమో నిప్పులు కక్కి కత్తులు దూశారు. అదీ ఇంగ్లీషు రాజనీతి.

మాకుచెప్పకుండా మరే ప్రభువుతోనూ మీరు చర్చలు జరపకూడదు. మా అనుమతి లేకుండా ఎవరి జోలికీ వెళ్లకూడదు. మిగతా మరాఠా రాజ్యాలతోగాని, వేరే వారితో గాని గొడవలొస్తే మేమే మధ్యవర్తిత్వం చేస్తాం. మేము ఎలా చెబితే అలా మీరు నడుచుకోవాలి - అని మరాఠా మహాసామ్రాజ్య అధినేత పీష్వాను కట్టడి చేసి, చేతులూ కాళ్లూ కట్టేసిన మాయదారి ఒప్పందం కుదుర్చుకోవటంతో తెల్లవారి కళ్లు చల్లబడలేదు. పీష్వా స్వేచ్ఛను హరించి, తమకు తొత్తును చేసుకుని, పుణె గద్దెపై తిరిగి కూచోబెట్టటంతో... రక్షణ నెపంతో పీష్వా చుట్టూ తమ సేనలని కాపలా పెట్టటంతో తమ పని అయిపోయిందని కంపెనీ అధికారులు అనుకోలేదు. మరాఠాల స్వాతంత్ర్యాన్ని జయప్రదంగా అంతమొందించిన

తరవాత కూడా మరాఠాలను వారి బతుకు వారిని వెల్లస్లీ బతకనివ్వదలచలేదు. అద్దె సేనల వలలోకి ఒకరిని లాగితే మిగతా వారూ చచ్చినట్టు చేతికి చిక్కుతారని గవర్నర్ జనరల్ కొంతకాలంగా ఆంతరంగికులకు చెబుతూ వచ్చాడు. పెద్దతలకాయ అయిన పీష్వా తమ గాలానికి చిక్కాక మరాఠా కూటమిలోని మిగతా ప్రభువులనూ ఒకరి తరవాత ఒకరిని ఏరివేసి, భారత దేశంలో బ్రిటిష్ సామ్రాజ్యాన్ని సుస్థిరం కావించటానికి వెల్లస్లీ కంకణం కట్టుకున్నాడు. మరాఠా ముఖ్యులను కవ్వించి, యుద్ధానికి రెచ్చగొట్టటానికి చాలా ఎత్తులు వేశాడు. ఎన్ని విధాల గిల్లినా వారు రెచ్చిపోకపోయేసరికి తీరి కూర్చుని, తానే యుద్ధాన్ని ప్రకటించి, దారుణ దురాక్రమణకు ఒడిగట్టాడు.

వేల సంవత్సరాల హిందూ దేశచరిత్రలో కొన్ని వందల యుద్ధాలు జరిగాయి. సబబులు, మంచిచెడ్డలు ఎలా ఉన్నప్పటికీ ఒక వైరి పక్షానికి రెండో పక్షం మీద యుద్ధం చేయాల్సినంతటి తీవ్ర ఆగ్రహం కలగటానికి సాధారణంగా బలమైన కారణాలు ఉంటాయి. ఏ కారణమూ లేకుండా, అవతలి వారి నుంచి ఎటువంటి తప్పుగానీ ముప్పుగానీ లేకుండానే అడ్డగోలుగా జరిగిన ఆధునిక యుద్ధాల్లో మొదట చెప్పుకోవలసింది వెల్లస్లీ పుణ్యమైన రెండో మరాఠా సంగ్రామాన్ని.

భారీ సైన్యాన్ని తోడిచ్చి పంపి 1803 మే 13న పుణె తక్తుపై బాజీరావును తిరిగి కూర్చోబెట్టాక ఇంగ్లీషు 'రక్షకులు' యుద్ధమంటూ చేస్తే మొదటగా యశ్వంతరావు హోల్కర్‌తోనే అని అందరూ ఊహించారు. కంపెనీకి కొత్త నేస్తమైన పీష్వాను కష్టాల పాలు చేయటమే గాక కంపెనీ రక్షణలోని పాత మిత్రుడు నిజాంను కూడా హోల్కర్ చాలా తిప్పలు పెట్టాడు. నైజాం రాజ్యం మీదపడి ఔరంగాబాద్ నగరాన్ని దోచుకుని చాలా ఆగం చేశాడు. అయినా - మిత్రుల రక్షణకు ఆచంద్రతారార్కం పాటు పడతామని ప్రతిన బూనిన కంపెనీ దొరలు చిటికెన వేలును కదిలించలేదు. ఎందుకంటే - అతడికీ వారికీ మధ్య అప్పటికే లోపాయికారీ లాలూచీ ఉంది. "I am anxious to cultivate the good understanding which has subsisted between the Honourable Company's Government and You" (మాననీయ కంపెనీ సర్కారుకూ మీకూ ఉన్న సదవగాహనను పెంపొందించాలని నేను ఆరాటపడుతున్నాను) అని 1803 జులై 16న అంటే - పీష్వా తిరిగి వచ్చిన రెణ్నెల్లకే హోల్కర్‌కు జనరల్ ఆర్థర్ వెల్లస్లీ (పెద్ద వెల్లస్లీకి తమ్ముడు) రాసిన లేఖనుబట్టే అసలు మర్మం అర్థమవుతుంది.

హోల్కర్‌తో 'సదవగాహన' అంతకుముందే పొసగినందున అతడు ఎలాగూ 'కంపెనీ'కి వంటింటి కుందేలే. అతడి సంగతి తీరిగ్గా చూసుకోవచ్చు. ముందు తేల్చాల్సింది మిగతా మరాఠా ముఖ్యుల కథ అనుకున్నాడు వెల్లస్లీ. తలచిందే తడవుగా చకచకా ఎత్తులు వేశాడు. మొట్టమొదటగా 'మీ పీష్వా మాతో సంధి కుదుర్చుకున్నాడు. మీరూ అదే దారికి వస్తారా? మాతో శత్రుత్వం కొని తెచ్చుకుంటారా?' అని సింధియా, బేరార్ రాజా, తదితరులకు శ్రీముఖం పంపించాడు.

అప్పటికే మరాఠా సర్దార్లు లోలోన రగిలిపోతున్నారు. ఛత్రపతి శివాజీ స్థాపించిన స్వరాజ్యం విదేశీయులకు పాదాక్రాంతమైంది. ఒకప్పుడు యావద్భారతంలో తిరుగులేని పెత్తనం చలాయించి మొగల్ పాదుషానూ, రాజపుత్ర మహారాణాలను సైతం శాసించగలిగిన మరాఠా సామ్రాజ్యానికి అధిపతి అయిన పీష్వా తన స్వాతంత్ర్యాన్నే కోల్పోయి, అధికార



స్వార్థంకోసం స్వేచ్ఛను, నిర్ణయాధికారాన్ని వదులుకుని తెల్లవారి ఉచ్చులో ఇరుక్కున్నాడు. వారి అనుమతి లేకుండా కనీసం తన సామంతులతో కూడా వ్యవహారం నెరపలేని నిస్సహాయ స్థితిలో చిక్కుకున్నాడు. అది మరాఠా యోధులకు హృదయ శల్యమైంది. తమకు చెప్పాపెట్టకుండా సిగ్గుచేటు సంకటంలోకి పీష్వా తామందరినీ నెట్టటం వారిని అమితంగా బాధించింది. పీష్వా తరువాత స్వాతంత్ర్యాపహరణలో ఎవరి వంతు వస్తుందన్న ప్రశ్న అందరి మనసులనూ తొలిచెయ్యసాగింది. అంతా కలిసి ఏదో ఒకటి చెయ్యకపోతే, ముంచుకొస్తున్న ముప్పును తట్టుకోవటం కష్టమన్న అభిప్రాయం అందరికీ కలిగింది. ముందుగా దౌలత్‌రావు సింధియా, నాగపూర్ ప్రభువు రఘోజీ భోంస్లే కలిసి మాట్లాడుకుని ఆ తరవాత పీష్వాతోనూ అన్ని విషయాలు చర్చించి భవిష్యత్ ప్రణాళికను నిర్ణయించు కోవాలనుకున్నారు.

వారికి అంత సావకాశం ఇవ్వటం వెల్లస్లీకి ఇష్టంలేకపోయింది. బేసెన్ సంధికి వల్లె అంటారో లేదో ఉన్నపళాన తేల్చాలని రెసిడెంటు కాలిన్స్ చేత అతడు సింధియాను ఒత్తిడి చేయించాడు. ఇష్టమో కాదో చెప్పాలంటే ముందు ఆ సంధిలో ఏముందో, దాని షరతులు ఏమిటో సింధియాకు తెలియాలికదా? కాని అప్పటిదాకా ఆ వివరాలేవీ సింధియాకు అధికారికంగా ఎవరూ తెలియపరచనే లేదు.

మరాఠా కూటమిలో సింధియా అతి ముఖ్యుడు. పీష్వా కూడా ఇంత దాకా అతడి సైనిక అండపైనే ఆధారపడి ఉన్నాడు. సంధి ఏది పొసగాలన్నా అతడి ఐచ్ఛిక సహకారం తప్పనిసరి. ఆ ఒక్క కారణంతోనైనా పీష్వాతో ఒప్పందం చేసుకునేముందు కంపెనీ దొరలు సింధియాను సంప్రదించి ఉండవలసింది. అదీగాక - బాజీరావు పీష్వా కాగలిగింది ప్రధానంగా సింధియా చలవ వల్లే. ఆ కృతజ్ఞతతోనైనా కీలక సంధిని చేసుకునే ముందు పీష్వా తనకు మాట మాత్రంచెప్పి ఉండాల్సిందని సింధియా భావించటం సబబే. పైగా ఇంగ్లీషు వారికీ సింధియా చాలా కావలసినవాడే. రెండు దశాబ్దాల కింద వారన్ హేస్టింగ్స్ హయాంలో మరాఠాల చేతిలో చావుదెబ్బతిన్న ఇంగ్లీషు వారు నెత్తిన గుడ్డ వేసుకుని లబోదిబో మనవలసిన స్థితిలో మాధవరావు సింధియా, ముధోజీ భోంస్లేలు ఆదుకొని ఇంచుమించు బ్రిటిష్ ఏజెంట్లుగా పనిచేసి వాటమైన సాల్బే సంధిని కుదిర్చిపెట్టారు. నాటినుంచీ మరాఠా బ్రిటిష్ సంబంధాలను నియంత్రించిన ఆ ఒప్పందం స్థానంలో కొత్తదాన్ని ఖరారు చేసుకునే ముందు కంపెనీ వారికి ఇంగితజ్ఞానం ఏ కాస్త ఉన్నా తమకు ఉపకారులైన సింధియా, భోంస్లేలను సంప్రదించి ఉండాల్సింది. వెల్లస్లీ ఆ పని చేయకపోగా దురుసుతనం చూపి సంధికి సై అంటావా లేదా అని సింధియా గొంతు మీద కూచున్నాడు. పైగా మరాఠాల నుంచి ఏ రకమైన కవ్వింపూ లేకుండానే అన్ని మరాఠా రాజ్యాల పొలిమేరల్లో బ్రిటిష్ సేనలను నిలబెట్టి కయ్యానికి కాలుదువ్వాడు.

ఇది సహించరాని దురహంకారమే. అయినా సింధియా తొందరపడలేదు. పీష్వా మీద, కంపెనీ వారి మీద కోపగించటానికి తనకు బలమైన హేతువే ఉన్నా అతడు నిగ్రహం కోల్పోలేదు. అప్పటికే తన రాజ్యంలో అంతఃకలహాలను రేకెత్తించి, తిరుగుబాట్లు ప్రోత్సహించి దొరలు సృష్టించిన చీకాకులతో వేగలేక సతమతమవుతున్న స్థితిలో కొత్తరకం ఒత్తిళ్ల ఉచ్చులో పడకుండా ఆచి తూచి అడుగు వేయాలని అతడు అనుకున్నాడు.

ఈలోపు బాజీరావుకూ తాను కౌగిలించుకున్నది ఇంగ్లీషు విషకన్యనన్న సంగతి నెమ్మదిగా

సారథ్యంలో మొగలులతో శాయశక్తులా పోరాడినంత వరకూ ఈ వ్యవస్థ సవ్యంగా పనిచేసింది. తారాబాయికి, సాహుకు మధ్య వారసత్వ యుద్ధం మొదలయ్యాక... ఉమ్మడి శత్రువైన మొగల్ సామ్రాజ్యం ఛిన్నాభిన్నమై నామమాత్రావశిష్టమయ్యాక మరాఠా స్కంధావారంలో కట్టు సడలింది. ఎవరికి వారికే సొంత ప్రాబల్యాన్ని వీలయిన మేరకు పెంచుకోవాలన్న కాంక్ష పెరిగింది. రాజకీయ అనిశ్చితిని, రాజకుటుంబంలో అనైక్యతను ఆసరా చేసుకుని ఎక్కడికక్కడ పెత్తందారులు మోరసాచి రాజకీయ చదరంగంలో తెలివిగా పావులు కదుపుతూ బలిసిపోయారు. పేరుకు సాహు రాజు అయినా సతారా పొలిమేరలు దాటితే అతడి అధికారం చెల్లుతుందని నమ్మకంగా చెప్పలేని స్థితి.

శివాజీ వంటి మహా ప్రభువు, పరాక్రమశాలి గద్దెమీద ఉన్నప్పుడు ఇలాంటి సవాళ్లేవీ ఒక లెక్కలోనివి కావు. గట్టి పట్టు పడితే అతికష్టం మీదయినా అదుపులోనికి తేవచ్చు. సాహు శివాజీకి మనవడే; గుణవంతుడే. కాని - తాత క్షాత్రం, తాత పరాక్రమం అతడికి లేవు. అతడిని తప్పిస్తే రాజ్యాన్ని ఏకచ్ఛత్రంగా ఏలగలిగిన సమర్థ వారసుడు సిద్ధంగా ఉన్నాడన్న ఆశాలేదు. ఈ స్థితిలో పాత పద్ధతినే పట్టుకు వేలాడకుండా పరిస్థితితో రాజీపడి ఒడుపుగా అందరినీ కలుపుకొని పోయి విశాల ధ్యేయాన్ని సాధించడమే మేలు. బలంగా పాతుకుపోయిన స్థానిక పెత్తందార్లను లొంగదీయడం చేతకానప్పుడు ఎవరి పరిధిలో వారి పెత్తనాన్ని అంగీకరించి జాతీయత ప్రాతిపదికన అందరినీ సమీకరించి రాజు సర్వంసహాధిపత్యానికి స్థూలంగా లోబడేట్టు చేయడమే దారి. బాలాజీ విశ్వనాథ్ సాహుకు అదే చెప్పాడు. నచ్చచెప్పి ఒప్పించాడు. నూతన విధానానికి రాజు చేత సరే అనిపించుకోగానే కొత్త పీష్వా క్షణం జాగుచేయకుండా రంగంలోకి దిగాడు.

తక్షణ సమస్య కన్హోజీ ఆంగ్రే. సైనిక శక్తితో అతడిని గెలవడం కల్ల. అందుకని శౌర్యంతో సాధించలేని పనిని బాలాజీ దౌత్యంతో సాధించదలిచాడు. కన్హోజీ ఆంగ్రే అతడికి కొత్తకాదు. బాల్యమిత్రుడే. అతడిదీ కొంకణే. ఆ చనువుతోనే కొద్ది బలగంతో కన్హోజీ దగ్గరికి వెళ్ళి ముఖాముఖి మాట్లాడాడు. "ఏమయ్యా ఏమిటి నువ్వు చేస్తున్న పని? మీ తండ్రి తుకోజీ ఎంతటి దేశభక్తుడు! ఆయన మీద శివాజీకి ఎంత అభిమానం ఉండేది? అదంతా మరచిపోయి శివాజీ వంశాంకురం మీదే కత్తి ఎత్తి కూలదోయబూనడం స్వామి ద్రోహం కాదా? నీ వంటి మహాయోధులే ఇలా ఎవరికి వారేగా తల ఎగరేయడం వల్ల మరాఠా విశాల ప్రయోజనాలకు, శివాజీ కాంక్షించిన హిందూ పదపాదుషాహి లక్ష్య సాధనకు ఎంత నష్టం జరుగుతున్నదో గమనించావా? నీ చుట్టూతా శత్రువులున్నారు. సముద్ర జలాల మీద చూపిన ప్రతాపాన్ని నేల మీద ఇందరు విరోధులపై ప్రదర్శించి నెగ్గుకు రాగలవా? సమయం మించి పోక ముందే తెలివి తెచ్చుకో. నువ్వు చెరబట్టిన పీష్వాను విడిచిపెట్టి మహారాజు క్షమాభిక్ష వేడి ఆయన అనుగ్రహం పొంది నీ వంశం తరించేలా పులిలా బతుకు. ఆలస్యం చేస్తే ఆ అవకాశం మళ్ళీ రాదు" అని నానా విధాల బోధించి దారికి తెచ్చాడు. కన్హోజీకి కూడా తన పరిమితులు బాగా తెలుసు. దీర్ఘంగా ఆలోచించి మిత్రుడు బాలాజీ ప్రతిపాదనకు అంగీకరించాడు. నౌకాదళంపై తన ఆధిపత్యాన్ని, 'సర్‌ఖేల్' పదవినీ, కొంకణ్‌పై అధికారాన్ని గుర్తించి, కొనసాగించే షరతుపై సాహు మహారాజుకు సంపూర్ణ విధేయత ప్రకటించాడు.

రక్తం బొట్టు చిందకుండా తారాబాయి పక్షంలోని అతి ముఖ్యుడిని తమవైపు తిప్పుకోగల




గడంతో సాహు శిబిరంలో ఆనందోత్సాహాలు ఉప్పొంగాయి. ఆంగ్రేను బుజ్జగించే సందర్భంలో పీష్వా బాలాజీ ఆవిష్కరించిన కొత్త ఏర్పాటుకు మిగతా మరాఠా సర్దార్లూ సంతోషించారు. సాహుకు విధేయులైతే స్వస్థలంపై పెత్తనాన్ని వదులుకుని జీతం రాళ్ల మీద బతకాల్సి వస్తుందన్న భయం పోవడంతో మిగతా వారూ ఆంగ్రే మాదిరిగా రాజుకు విధేయత తెలిపి సమాఖ్య సరళిలో ఏకోన్ముఖమయ్యేందుకు ఒకరిని చూసి ఒకరు ముందుకొచ్చారు.

అలా పుట్టింది చరిత్ర ప్రసిద్ధి కెక్కిన మరాఠా మహామండల్. (Confederacy). మరాఠాల్లో హేమాహేమీల్లాంటి వీరులున్నా వారిలో వారికి ఈర్ష్యాసూయల వల్ల, అపోహల వల్ల జాతి జీవితంలో తమదంటూ బలమైన ముద్ర వేయలేకపోయారు. మొగలుల పన్నాగం ఫలించి, మరాఠా శక్తి అంతఃకలహాలతో చితికి ఛిద్రమవుతోందన్న తరుణంలో బాలాజీ విశ్వనాథ్ జాతీయ ప్రయోజనాల దూరదృష్టితో వ్యవహరించి, శివాజీ స్ఫూర్తితో ఉమ్మడి శత్రువుకు వ్యతిరేకంగా సహకార ప్రాతిపదికన కూడగట్టిన ఈ సమాఖ్య జాతీయ శక్తులకు కొత్త ఊపిరి పోసింది. లోపాలు, బలహీనతలు ఎన్ని ఉన్నప్పటికీ బలమైన జాతీయ శక్తిగా మరాఠా ప్రాభవాన్ని యావద్దేశం గుర్తించేట్టు చేసి వందేళ్లకు పైగా దేశ రాజకీయ గతిని అది శాసించింది. మహాదేవ్ గోవింద రణడే అన్నట్టు -

Maratha Confederacy, for the next hundred years, was the great controller of events throughout India... it enabled the Marathas to conquer Gujarat, Malwa, Bundelkhand, Orissa, Gondawan, Nemad and Karnatik down to the Tungabhadra. It helped them to control all the states in Rajputana and the Court at Delhi, and seat and unseat emperors there according as it suited the interests of the nation. It even carried them to the banks of the Indus on one side... and Orissa on the East... It even helped them to drive the Portuguese from Bassein and to wage two wars on equal terms with the English. It enabled the Marathas to stand the crushing defeat at Panipat and again to set up their rule at Delhi and over Northern Inida.

[*Rise of the Maratha Power,* **M.G. Ranade,** *p.93*]

(తరువాత నూరేళ్లపాటు దేశం మొత్తంలో ఘటనలను మరాఠా సమాఖ్యే నియంత్రించింది - గుజరాత్, మాళవ, బుందేల్‌ఖండ్, ఒరిస్సా, గోండ్వానా, నేమాద్‌లను.... తుంగభద్ర దాకా కర్ణాటకను ఈ సమాఖ్య మూలంగా మరాఠాలు జయించారు. దానివల్లే రాజస్థాన్‌లోని అన్ని రాజ్యాలను, ఢిల్లీ దర్బారును కూడా వారే కంట్రోలు చేసి, జాతీయ ప్రయోజనాలకు తగినట్టు చక్రవర్తులను గద్దెనెక్కించగలిగారు. దింపనూ గలిగారు. ఒకవైపున సింధునదీ తీరం వరకూ, తూర్పున ఒరిస్సా దాకా వారు వెళ్లగలిగారు. బాస్సేన్ నుంచి పోర్చుగీసు వారిని తరిమేయగలిగారు. ఇంగ్లీషు వారితో సమాన ఫాయాలో రెండు యుద్ధాలు చేశారు. పానిపట్‌లో ఘోర పరాజయాన్ని కూడా తట్టుకుని ఢిల్లీలోనూ, ఉత్తర భారతంలోనూ తమ ఏలుబడిని స్థాపించగలిగారు).

అర్థమైంది. హోల్కర్ పట్టునుంచి తప్పించుకోబోయి తెల్లవారి బారిన పడటంతో తన పరిస్థితి దుంగను తీసి దూలాన్ని తలకెత్తుకున్నట్టు, పెనం మీది నుంచి పొయ్యిలో పడినట్టు అయిందని పీష్వా అనుభవ పూర్వకంగా గ్రహించాడు. దొరలు తెలివిగా తన మెడకు తగిలించిన బంధం నుంచి బయట పడాలంటే తన మిత్రుడు సింధియా సహాయం అత్యావశ్యకమని అతడికి అర్థమైంది. అందుకే ఒకసారి వచ్చి తనను కలవాలని బేసిన్ నుంచి పుణెకు బయలుదేరడానికి ముందే సింధియాకు పీష్వా కబురు పంపాడు. అలాగే నాగపూర్‌లోని బేరార్ రాజానూ పిలిచాడు. ఆ ఆహ్వానాన్ని పురస్కరించుకునే సింధియా, భోంస్లేలు పూనాకు బయలుదేరారు. మధ్యలో బుర్హాన్‌పూర్ దగ్గర మజిలీ చేసి ఉభయులూ మాట్లాడుకుని అటునుంచి పుణెకు వెళ్లదలిచారు.

ఇదిగో – ఈ పని మీద దక్కనుకు మరలి, మార్గమధ్యాన బుర్హాన్‌పూర్ వద్ద భోంస్లే కోసం వేచి ఉన్న సమయంలో వెల్లస్లీ రెసిడెంటు కాలిన్స్‌ను ప్రయోగించి సింధియా మెడ మీద కత్తి పెట్టాడు. అతడిని పుణె రావద్దని పీష్వా చేత చెప్పించాలని మొదట దొరలు చాలా ప్రయత్నాలు చేశారు. ఆ ఎత్తులేవీ పారకపోవటంతో అడ్డం తిరిగి సింధియా తమ మీదికి దండెత్తి వస్తున్న రీతిలో గగ్గోలు పెట్టి వెనక్కి పోతావా లేదా అని వెంట పడ్డారు. మాకు మీ మీద ఎటువంటి శత్రుభావమూ లేదు; మీతో విరోధం తెచ్చుకునే ఉద్దేశం ఏ కోశానా లేదు; మా గొడవలు మేము మాట్లాడుకుంటాం; మా పీష్వా దగ్గరికిపోయి ఆలోచించుకుంటాం – మాలో మాకు మునుపటినుంచీ ఉన్న ఒడంబడికలను మీరు మన్నించినంత వరకూ పీష్వాతో మీ కొత్త ఒప్పందానికి మేము అడ్డురాము అని సింధియా ఎంత మొత్తుకున్నా వినలేదు.

ఇక యుద్ధ భేరీ మోగించడమే తరువాయి అనుకున్న సమయంలో గవర్నర్ జనరల్ వెల్లస్లీకి ఒకచిక్కు వచ్చి పడింది. రణోత్సాహంతో ఇక్కడ అతడు ఉరకలు వేస్తుండగా అటు సీమ నుంచి ప్రతికూల సందేశాలు రాసాగాయి. అంతకు ముందునుంచే ఇండియాలో వెల్లస్లీ వ్యవహారం ఈస్టిండియా కంపెనీ యజమానులకు పెద్ద తలనెప్పి అయింది. మెల్లిగా ప్రాబల్యం సంపాదించి ఇండియా వ్యాపారం మీద కోట్ల లాభాలకు పడగలెత్తాలన్నదే ఆది నుంచి కంపెనీ వారి ఆలోచన. బ్రిటిష్ ప్రభుత్వాన్ని నడిపే కొంతమంది పెద్దలవలె సామ్రాజ్య కాంక్ష వీరికి లేదు. చాపకింద నీరులా రాజ్యాలను సంగ్రహించటంవల్ల వ్యాపారం వృద్ధి చెంది లాభాలు పెరుగుతాయని వారు ఆశించగా... వెల్లస్లీ హయాంలో ఇండియాలో వారికి పెరిగినవల్లా ఖర్చులే. 1799లో టిప్పు సుల్తాన్‌ను గెలిచి సంపన్న మైసూరు రాజ్యాన్ని వశపరచుకోవటం గొప్ప అన్న ఆనందం మూణ్నాళ్లు నిలవలేదు. ఆ యుద్ధానికి పెట్టిన ఖర్చులపై వెల్లస్లీ పంపిన బిల్లులను చూస్తే కంపెనీ వారికి తల తిరిగింది. ఇదేమి గొంపిరా బాబూ అని వారు లబలబలాడుతూండగానే వెల్లస్లీ దొర పీష్వాను బేసెన్ బుట్టలో వేసి గండర గండలైన మరాఠా యోధులతో తగవును కొని తెచ్చుకున్నాడు. ఇది ఎక్కడికి దారితీస్తుందో, ఇంకేమి కొంప ముంచుతుందో, మరాఠాలంతా ఏకమైతే తమ గతి ఏమవుతుందోనని కంపెనీవారు హడలిపోయారు. "మరాఠాలతో కయ్యం వద్దంటే వినకుండా ఇప్పుడీ ఒప్పందాన్ని మీరు నెత్తికి తగిలించుకున్నారు. దీనిపై మరాఠా రాజ్యాల్లో చాలా గోలగా ఉన్నట్టు వింటున్నాం. ముఖ్యంగా మన సేనలు పీష్వా దగ్గరే తిష్ఠ వేయాలన్న షరతు; మన ఆజ్ఞ లేనిదే మరాఠాలు ఏ సంధీ చేసుకోరాదన్న క్లాజు వారికి దుస్సహంగా



ఉన్నట్టుంది. మనకు గొడవలొద్దు. అవసరమైతే ఆ రెండు క్లాజులను ఎత్తివేసి అయినా మరాఠాలను ప్రసన్నం చేసుకోండి" అని 1803 మార్చి 6న కంపెనీ సీక్రెట్ కమిటీవారు లండన్ నుంచి వెల్లస్లీకి వర్తమానం పంపారు.

గవర్నర్ జనరలు అనేవాడు ఈస్టిండియా కంపెనీ నౌకరు. పైవారే అలా ఆదేశించినప్పుడు నోరు మూసుకుని అమలుచేసి తీరవలసిందే. కాని వెల్లస్లీ చాలా ముదురు. కంపెనీ యజమానులు ఏమన్నా బ్రిటిష్ ప్రభువులు తన కొమ్ముగాస్తారని అతడికి తెలుసు. ఆ ధైర్యంతోనే నాటకాలాడి తన యజమానులనే బురిడీ కొట్టించాడు. "It is not my intention to attempt to compel the Peishwa to adhere to the faith of his engagements, at the hazard of involving the Company in a war with the combined Mahratta States" (పీష్వాను సంధి షరతులకు కట్టుబడాలని నిర్బంధించి, మరాఠా రాజ్యాలు మనపైకి సమైక్యంగా యుద్ధానికి వచ్చే ప్రమాదాన్ని కొని తెచ్చుకోవటం నా ఉద్దేశం ఎంత మాత్రం కాదు) అని డైరెక్టర్లను మభ్యపెడుతూనే తన దుర్మార్గాన్ని తాను సాగిస్తూ పోయాడు. సింధియాకు మనపై దండెత్తే ఉద్దేశం ఎంతమాత్రం లేదు. అతడు యుద్ధ సన్నాహాలేవీ చేయడంలేదు. అందునా వచ్చేది వానాకాలం. నదులన్నీ పొంగి దారులు మూసుకుపోయే సమయంలో ఏ మరాఠా రాజ్యమూ యుద్ధానికి సాహసించదు. యుద్ధం ఆలోచనే సింధియాకు ఉంటే సరిహద్దుల్లో మన సైన్యం మోహరించిన స్థితిలో తన రాజ్యాన్ని విడిచిపెట్టి దక్కనుకు బయలుదేరేవాడు కాదు అని ఇంగ్లీషు సైన్యాధికారులే చెబుతున్నా ఆ వాస్తవాలను కప్పిపుచ్చి, కవ్వింపులన్నీ తానే చేసి, నిష్కారణంగా సింధియాకు దురుద్దేశాలను, పోగరుబోతు తనాన్ని ఆపాదించి వెల్లస్లీ అడ్డం తిరిగాడు. రక్తపుటేరులు పారించటానికి సైనిక సన్నాహాలు ముమ్మరం చేశాడు.

ఇక యుద్ధ ప్రకటనే మిగిలింది. అనుకుంటుండగా వెల్లస్లీకి పెద్ద సమస్య వచ్చింది. ఈసారీ కంపెనీ డైరెక్టర్లే వారించి ఉంటే నిస్సంకోచంగా పెడచెవిన పెట్టేవాడే. కాని – ఈమారు ఆదేశం వచ్చింది సాక్షాత్తూ – ఇండియా వ్యవహారాలను చూసే బ్రిటిష్ మంత్రి లార్డ్ కాసల్‌రే నుంచి! 1803 జులై 6న వెల్లస్లీ చేతికందిన మంత్రి జాబు సారాంశం ఏమిటంటే – ఇండియాలో మన రాజ్యం బాగా పాతుకుని బలిష్ఠంగా ఉన్నది కాబట్టి, ఎటునుంచీ దాడి ప్రమాదం లేదు కాబట్టి మీరు ఇకపై యుద్ధాలు మాని, శాంతి మార్గంలో సాగి, కంపెనీకి అప్పుల భారం తగ్గించవలసింది – అని.

వెల్లస్లీకి కంగారుపుట్టింది. మహారాష్ట్రులతో పెద్ద యుద్ధం తలపెట్టుకుని డబ్బును మంచినీళ్లలా ఖర్చుపెట్టడానికి సంచీ మూతులు విప్పదీసుకుని కూర్చుంటే – ఇదేమి కర్మం? సొమ్ము ఖర్చుపెట్టవద్దని పైవారు హుకుం పంపారే? ఇప్పుడేమి చెయ్యాలి? లగ్నం పెట్టుకుని కూర్చున్న యుద్ధాన్ని చేయాలా? మానాలా? ఈ విషయమై ఆలోచన చెప్పటానికి తనకు తోడుబోయిన ఆంతరంగిక సహచరుల్ని గవర్నర్ జనరల్ పోగుచేశాడు. వారిలో ముఖ్యుడు సర్‌జార్జి బార్లో. వెల్లస్లీగారు కుర్చీ ఎప్పుడు ఖాళీ చేస్తే అప్పుడు ఈయన అందులో కూచోవాలని ముందే నిశ్చయమైంది. ఆయన వెల్లస్లీకంటే ఏడాకులు ఎక్కువ చదివినవాడు. ఆయన ఏమన్నాడంటే – ఇంత హడావుడి చేసి, ఇన్ని ప్రగల్భాలు పలికి ఇప్పుడు మనం యుద్ధం మానుకుంటే పిరికిపందలమని అందరూ నవ్వరా? దేశంలో మరొకడు మనల్ని ఖాతరు చేస్తాడా? మరాఠాలు మన వెంటపడి తరమకుండా ఉంటారా! పీష్వాను కీలుబొమ్మను చేసి

ఎప్పుడైతే పీష్వా గద్దెపై కూచోపెట్టామో ఆ క్షణంలోనే మిగతా దేశీయ రాజ్యాలన్నీ మన కాలికిందికి వచ్చేశాయి. మన మద్దతులేనట్టి, మన సంపూర్ణాధికారాన్ని లోబడనట్టి ఏ రాజ్యాన్నీ మనం ఇండియాలో ఉండనివ్వకూడదు. మన సైన్యాలు పోతరించి, అవతలి బలగాలు చిందర వందరగా ఉన్న ఈ సమయంలోనే మనం వేటువేయాలి. ఈ అవకాశం మళ్లీ రాదు - అని! మిగతా దొరలు ఇందుకు భళీ అన్నారు.

దాంతో వెల్లస్లీకి హుషారు వచ్చింది. రణోన్మాదులంతా కూడబలుక్కుని కనుసైగ చేయగానే కాలిన్స్ రెచ్చిపోయాడు. తాము పంతం పట్టిన ప్రకారం బేసెన్ సంధిని కళ్ళు మూసుకుని ధ్రువీకరించలేదు కనుక; తాము పొమ్మనగానే తుండూ తుపాకీ తీసుకుని వెనక్కి మరలలేదు కనక నీ సంగతి తేలుస్తామని బెదిరించి సింధియా దర్బారు నుంచి రెసిడెంటు లేచి వచ్చాడు. 1809 ఆగస్టు 6న గవర్నర్ జనరల్ యుద్ధం ప్రకటించాడు.

మారణహోమం మొదలైంది.



# కుట్ర మీద కుట్ర

**1781** నాటి మొదటి మరాఠా యుద్ధంలో ఇంగ్లీషువారు మహారాష్ట్రుల చేతిలో చిత్తుగా ఓడిపోయారు. ఇరవై రెండేళ్ల తరవాత జరిగిన రెండో మరాఠా యుద్ధంలో అదే ఇంగ్లీషువారి చేతిలో మహారాష్ట్రులు చిత్తుచిత్తుగా ఓడిపోయారు. కారణమేమిటి? రెండు దశాబ్దాలలో ఆంగ్లేయుల సైనిక పాటవం అద్భుతంగా పెరిగి మరాఠాల సైనికశక్తి సన్నగిల్లిందా? తొలి యుద్ధంలో పరాజితుడైన జనరల్ గొడ్దార్డ్ కంటే మలి యుద్ధం గెలిచిన జనరల్ ఆర్థర్ వెల్లస్లీ, సేనాపతి లార్డ్ లేక్‌ల పరాక్రమం గొప్పదా? నెహ్రూలాంటి జాతీయ నాయకులూ, వారికి పరమప్రమాణమైన విదేశీ చరిత్రకారులూ నమ్మినట్టు - తెల్లవారి అధునాతన శాస్త్ర, సాంకేతిక ఆధిక్యానికి, అత్యాధునిక రణ నైపుణ్యానికి బావిలో కప్పల్లాంటి భారతీయుల పురాతన పద్ధతులు సమ ఉజ్జీకాలేకపోయినందువల్లే భారతదేశం విదేశీయుల వశమైందా?

కాదు. రెండు దశాబ్దాల కిందటి వరకూ శత్రువులు తేరిపారచూడలేనంత దుర్నిరీక్ష్యంగా ప్రకాశించి, విదేశీయులను అవలీలగా జయించిన మరాఠాలు 1803లో అదే విదేశీయులను గెలవలేక కూలబడటానికి పాశ్చాత్య మేధావులు, వారి భారతీయ మద్దతుదారులు చెప్పే వేవీ అసలు కారణాలు కావు. సంఖ్యాపరంగా గాని, ఆయుధ పాటవంలోగాని, సైనిక పరాక్రమంలో గాని మరాఠా బలగాల ముందు ఇంగ్లీషు సేనలు ఎందుకూ కొరగావు. జనరల్ వెల్లస్లీ అనంతర కాలంలో నెపోలియన్‌తో తలపడి విశ్వవిఖ్యాతుడైనా రెండో మరాఠా యుద్ధంలో అతడు పన్నిన వ్యూహం, సేనలను నడిపిన తీరు సాదా సీదావే తప్ప గొప్పగా చెప్పుకోదగ్గవి కావని విదేశీ యుద్ధ నిపుణులే అంగీకరించారు. ఇంగ్లీషువారి దగ్గర ఉన్నవాటికంటే దిట్టంగా... ఫ్రెంచివారు తర్ఫీదు ఇచ్చి తీర్చిదిద్దిన విదేశీ తరహా బెటాలియన్లు మరాఠాల దగ్గరా ఉన్నాయి. వాటి పేరు చెబితేనే బ్రిటిషు వారికి హడలు. ఇలాంటి హంగులెన్నో ఉండి కూడా తమకున్న దానిలో పదోవంతు బలం లేని ఆంగ్లేయుల ముందు

మరాఠాలు బలాదూరు అయ్యారంటే ముఖ్య హేతువు ఒక్కటే:

నానా ఫడ్నవిస్ లేడు!

ఘన విజయం సాధించిన 1781 యుద్ధకాలంలో మరాఠా మంత్రాంగాన్ని నానా నడిపిస్తున్నాడు. ఘోర పరాజయం ప్రాప్తించిన రెండో యుద్ధం నాటికి అతడు అస్తమించాడు. నానాయే బతికి ఉంటే కత్తి దూసో, తుపాకీ పట్టో రణరంగాన వీరవిహారం చేసి దిగ్విజయం సాధించి పెట్టేవాడని కాదు. నానా శూరుడు కాదు. జన్మలో అతడు ఏ యుద్ధం చాయలకూ పోయి ఎరుగడు.

మరి అలాంటివాడు లేకపోయినందువల్ల మరాఠాలు నష్టపోయిందేమిటంటారా? నానా ఫడ్నవిస్ వీరుడైతే కాదుగాని మంత్రాంగంలో అపరచాణక్యుడు. అతడికి వెయ్యికళ్ళు. అతడి గూఢచారి వ్యవస్థ ఎంత గొప్పదంటే – పుణెలో కూచునే దేశమంతటా ఏ రాజ్యంలో ఏమి జరుగుతున్నదీ, ఎవరు ఏమి చేస్తున్నదీ, ఏమి చేయబోతున్నదీ అందరికంటే ముందే ఎప్పటికప్పుడు అతడు తెలుసుకోగలిగేవాడు. విరోధుల కదలికలను, కుట్రలను ముందే పసిగట్టి, గట్టి ప్రతి చర్యలతో రాజ్యాన్ని రక్షించుకునేవాడు.

అతడు లేకపోతే మాత్రమేమి? రాజ్యాన్ని రక్షించేందుకు భారీ సైనిక బలగాలు, దుర్భేద్యమైన దుర్గాలు, కొల్లలుగా ఆయుధాలు ఉన్నాయి కదా? ఉన్నాయి. కాని ప్రయోజనమేమిటి? దేశంలో మరెవరికీ లేనంత భారీగా సైనిక బలగాలు ఉన్నా, ఆ బలగాలను నడిపించేవారినే తెల్లవారు తెలివిగా లోబరుచుకున్నారు. కంచుకోటలు ఎన్నో ఉన్నా వాటిని కాపాడవలసిన వారినే శత్రువులు ప్రలోభాలతో తమవైపు తిప్పుకున్నారు. మెరికల్లాంటి సర్దార్లు ఎందరో ఉన్నా వారిలో వారికే విరోధులు తంపులు పెట్టి, ఒకరితో ఒకరిని కలవకుండా విడదీసి, ఆఖరికి అందరి నెత్తినా చెయ్యి పెట్టారు. ఇంగ్లీషు వారు తమకు మిత్రులనీ... మైత్రీ ఒప్పందం కుదుర్చుకున్నారు కనుక వారు తమకు హాని చేయరనీ అమాయకంగా నమ్మి మరాఠా ప్రముఖులు ఆదమరచి ఉండగా, వారితో శుష్కప్రియాలు పలుకుతూనే 'కంపెనీ' రాయుళ్లు వారిని నిర్వీర్యం చేసేందుకు చడీచప్పుడు కాకుండా పాతాళ హోమం సాగించారు. ఫోర్జరీలు చేసి బనాయింపు పత్రాలతో ముఖ్యుల మధ్య పేచీలు తెచ్చి... లంచాలు పెట్టి సేనా నాయకులను, దుర్గ సంరక్షకులను బుట్టలో వేసి... లేనిపోని ఆశలు చూపి బయటి రాజ్యాల వారిని తటస్థం చేసి, మరాఠాలకు ఎటునుంచీ సాయం అందకుండా బిగదీసి... ఎవరికి చెప్పాల్సిన మాయమాటలు వారికి చెప్పి అందరినీ మభ్యపెట్టి.... బహు జాగ్రత్తగా రంగం సిద్ధపరిచాక అదను చూసి పంజా విసిరారు. నలువైపుల నుంచి భీషణ సంగ్రామం మొదలెట్టి మరాఠాలను ఉక్కిరిబిక్కిరి చేశారు. నానాయే బతికి ఉంటే ఈ ఆటలు సాగేవి కావు. ఇంగ్లీషు వారి కుట్రలూ కూహకాలు ఏవీ చారచక్షువైన నానా కంటిని కప్పగలిగేవి కావు. మరాఠా సామ్రాజ్యాన్ని వెల్లస్లీ నాశనం చేయడానికి ముందే వెల్లస్లీ ఎత్తులను, అతడి ఆస్థానంలోని తన వేగుల ద్వారా పసిగట్టి నానా పైఎత్తులు వేసి ఉండేవాడు. అతడి అనంతరం అంతటి రాజనీతిజ్ఞుడు ఎవరూ మరాఠాల్లో లేకపోవటంతో తెల్లవారి పంట పండింది.

అర్ధశతాబ్దం కింది ప్లాసీ యుద్ధంలో మీర్జాఫరును లోబరుచుకుని సిరాజుద్దౌలా సైన్యాలను తమవైపు తిప్పుకుని, ఒళ్లు అలవకుండా గెలిచినట్టే... నాలుగేళ్ల కింద శ్రీరంగపట్నం దుర్గ రక్షకులచేత స్వామిద్రోహం చేయించి టిప్పుసుల్తానును వేటు వేసినట్టే... మరాఠా మలి



యుద్ధంలోనూ ఇంగ్లీషువారు నీచపు పన్నాగాలతో, వెన్నుపోట్ల విద్రోహాలతో, సిగ్గుచేటు విజయం సంపాదించారు. దీనికి రుజువులకోసం ఎక్కడి దాకానో పోనక్కరలేదు. ఆకాలంలో 'కంపెనీ' దొరల మధ్య నడిచిన ఉత్తర ప్రత్యుత్తరాలే చాలు.

మరాఠా రాష్ట్ర కూటమికి పీష్వా అధిపతి. సింధియా, హోల్కర్, గైక్వాడ్, బేరార్‌లు దానికి నాలుగు స్తంభాలు. మరాఠా శక్తిని మట్టుపెట్టే వ్యూహంలో భాగంగా పీష్వాను దొరలు అప్పటికే కుక్కను చేసి ఆడిస్తున్నారు. బరోడాలో గైక్వాడ్ రాజ్యాన్ని అంతకుమునుపే తమకు తొత్తును చేసుకున్నారు. పీష్వా కాళ్లకింద మంట పెట్టటం కోసం హోల్కర్‌తో లోపాయకారీగా లాలూచీ అయి పుణె మీదికి దండెత్తించారు. పీష్వా బాజీరావు తమతో కాళ్లబేరానికి వచ్చాక కీలుబొమ్మను చేసి అతడిని పుణె గద్దెపై కూర్చుండబెట్టాక హోల్కర్ మళ్లీ పోయి సింధియా, బేరార్ రాజాలతో ఎక్కడ చేతులు కలుపుతాడో... ముగ్గురు కలిసి తమ కొంప ఎక్కడ ముంచుతారోనని తెల్లవారికి భయం పట్టుకుంది. అలాంటి ప్రమాదం రాకుండా హోల్కర్‌ను విడతీయటంకోసం ఆర్థర్ వెల్లస్లీ 1803 జులై 16న యశ్వంతరావుకు ఇలా తేనె లొలికే జాబు రాశాడు.

"మీ వద్ద నుండి జాబును బడయు భాగ్యము నాకు కలిగి చాలా కాలమైనది. కంపెనీ వారికి, మీకు మధ్యగల సఖ్యమును పెంపొందించుకొనవలెనని నేను ఆరాట పడుతున్నాను. మా కంపెనీ వారికి, పీష్వా బాజీరావు గారికి ఇటీవల జరిగిన బేసెన్ సంధి పత్రపు నకలు దీని వెంట పంపుచున్నాను. దీనివల్ల ఇండియా యొక్క శాంతి భద్రతలకు స్థిరత్వమేర్పడినదని మీకే తెలియగలదు...కాబట్టి ఇతరులేమి చేసినను చేయుదురు గాక. మీరు మట్టుకు మీ శ్రేయమునకు అనుకూలముగనే ప్రవర్తించుచు, కంపెనీ వారితోడి సఖ్యమును కొనసాగించుచునే యుందురని నాకు గట్టి నమ్మకము గలదు. ఈ ఉత్తరమును మీకు అందజేస్తున్న వ్యక్తి నాకు అంతరంగికుడు. నా మనసులో ఉన్న దానిని అతడు మీకు సమస్తము విప్పిజెప్పగలడు."

(బ్రిటిష్ మహాయుగము అను. మానికొండ సత్యనారాయణశాస్త్రి ప్రథమ సంపుటం పే 375)

ఇలా సమ్మోహనాస్త్రం వేసి, దూత ద్వారా ఇచ్చకాలు పలికించి, సింధియాను ఒగ్గేస్తే నీకెంతో లాభం చేస్తామని రకరకాల ఆశలు పెట్టి హోల్కర్ చేతులు కట్టేశారు. తియ్యని వాగ్దానాలతో తామెంత లాలించినా మరాఠా సంఘీభావం ప్రకోపించి హోల్కర్ ఎక్కడ తోక జాడిస్తాడోననీ ఇంగ్లీషు మాయావులు శంకించారు. ఒకవేళ అతడలాంటి "అఘాయిత్యం" చేసినా తమకు ఇబ్బందీ లేకుండా ఉండాలంటే ఏమి చేయాలి? బనాయింపుల్లో రామప్పంతులు ముత్తాతలైన కంపెనీవారు ఈ బెడద నివారించటంకోసం అర్జంటుగా ఫోర్జరీకి ఒడిగట్టారు. హోల్కర్‌ను కలుపుకొని ఇంగ్లీషు వారిపై దండెత్తుదామనీ, వారి పీడ వదిలాక హోల్కర్ భరతం పడదామనీ పీష్వా బాజీరావుకు దౌలత్‌రావు సింధియా రాసినట్టుగా ఒక ఉత్తరం పుట్టించి దాన్ని హోల్కర్‌కు చేరవేశారు. అది చూసి హోల్కర్ అగ్గిరాముడయ్యాడు. అయినా ఆంగ్లేయుల అనుమానపు కళ్లు చల్లబడలేదు. హోల్కర్ ఎన్నటికీ తమకు ప్రమాదకారి కాకుండా హోల్కర్‌కు కుడిభుజమైన వాడినే లాగి పడేస్తే పోతుంది కదా – అనుకున్నారు. ఈ "ముందు చూపు"తో హోల్కర్‌కు సేనా నాయకుడైన అమీర్‌ఖాన్‌తో కంపెనీ వారు రహస్య బేరాలు చేశారు. స్వామి ద్రోహంచేసి అతడు తన చేతిలోని 25 వేల సేనతో చీలి

వచ్చేట్టు; అతడిని కంపెనీ తొత్తు అయిన నైజాం తన కొలువులో చేర్చుకునేట్టు; ఆ సేనకయ్యే ఖర్చులో సగం కంపెనీవారు భరించేట్టు అంగీకారం కుదిరింది. దీనివల్ల హోల్కర్ బలం క్షీణించే మాట ఎలా ఉన్నా అమీర్‌ఖాన్ మీద అతడికి నమ్మకమైనా పోయి డీలాపడతాడు కదా అని దొరలు ఆశించినట్టు 1803 మే 3న హైదరాబాద్ రెసిడెంటుకు జనరల్ వెల్లస్లీ రాసిన లేఖ చెబుతుంది.

"I have received several letters from Colonel Stevenson upon the subject of the negotiation between the officers of the Government of His Highness the Nizam and Meer Khan, to take that Chief into His Highness' Service... Whatever may be Meer Khan's numbers, His Highness should take them into pay... the very circumstance of the purchase of the service of a Chief... of such repute and much in the confidence of Jeswunt Rao Holkar, will certainly shake the general confidence of his army..."

**[*Rise of the Christian Power in India,* B.D.Basu, *P.441*]**

*(అమీర్‌ఖాన్‌ను నైజాం నవాబు కొలువులోకి తీసుకునే విషయమై నిజాంగారి అధికారులకూ అతడికీ మధ్య నడుస్తున్న మంతనాల గురించి కర్నల్ స్టీవెన్సన్ నాకు అనేక లేఖలు రాశాడు. అమీర్‌ఖాన్ వెంట వచ్చే సేనల సంఖ్య ఎంతైనా, అందరినీ నైజాం ప్రభువు తీసుకోవటం మంచిది... యశ్వంతరావు హోల్కర్‌కు చాలా విశ్వాసపాత్రుడైన అంత పెద్ద సేనా నాయకుడి సేనలను కొనుగోలు చేశామంటేనే హోల్కర్ సైన్యానికి స్థైర్యం చెదిరిపోతుంది.)*

ఒక చెంప హోల్కర్ కాళ్లు లాగటానికి ఇలా ఎత్తులు వేస్తూనే పైకి మెరమెచ్చులతో హోల్కర్‌కు భ్రమలు కొలిపి, తటస్థుడిని చేసి మరాఠా శక్తికి మూలస్తంభమైన సింధియా మీద, అతడికి బాసటగా ఉన్న బేరార్ భోంస్లే మీద కంపెనీవారు వాటం చూసి యుద్ధం ప్రకటించారు.

సింధియా పీచమణచే క్రమంలో మొదటి దాడి అహ్మద్‌నగర్‌పై జరిగింది. అది మరాఠాలకు కంచుకోట. దానిని జయించటం బ్రహ్మతరం కాదని అందరూ అనుకునేవారు. బురుజులు, ప్రాకారాలు ఎంత దుర్భేద్యమైనా వాటిని రక్షించేది మనిషే కదా? దుర్గరక్షణకు సింధియా నియమించింది యూరోపియన్ అధికారిని. అతడిని 'కంపెనీ' వారు ముందే కొనేశారు. ఇంగ్లీషు సేనలు రాగానే అతడు చేతులెత్తేశాడు. దుర్భేద్యమనుకున్న కోట పెద్దగా కష్టపడవలసిన అవసరం లేకుండా విదేశీయులకు కైవసమైంది. జనం తమపై ఎక్కడ తిరగబడతారోనని, బాజీరావు పీష్వాగారి పురమాయింపుపైనే, ఆయన ప్రతినిధులుగానే తాము కోటను స్వాధీనపరచుకుంటున్నట్టు మొదట చాటింపు వేశారు. గెలుచుకున్న దానిలో వాటా ఇవ్వటం దగ్గరికి వచ్చేసరికి పీష్వా నోట దుమ్ము కొట్టి అంతా మాదే పొమ్మన్నారు.

తొలి మరాఠా యుద్ధానంతరం మధ్యవర్తిత్వం వెలిగించి 'కంపెనీ' వారితో మాధవరావు సింధియా సరాగాలాడిన సమయంలో వారన్‌హేస్టింగ్స్ దుర్బోధ చేసి సింధియా సైన్యంలో యూరోపియన్ ఆఫీసర్లను చొప్పించాడు. వారు కనుక నీ దగ్గర ఉంటే నీ సేన పాశ్చాత్య



ఛాయాలో దివ్యంగా వెలిగిపోతుందని నమ్మించాడు. విదేశీ యుద్ధ పద్ధతుల మీద సింధియాకు మోజు ఉంటే సైనిక పాఠశాల పెట్టి విదేశీయుల చేత తన సైనికులకు తర్ఫీదు ఇప్పించి, అన్ని కీలక స్థానాల్లో తన వారినే నియమించి ఉండాల్సింది. మాధవరావు ఆ పని చేయకుండా కిరాయికి వచ్చిన విదేశీయులకే పెత్తనం అప్పగించాడు. అదే ఇప్పుడు దౌలత్‌రావు కొంప ముంచింది. సింధియా సైన్యంలోని యూరోపియన్లు తమలో చేరితే అక్కడ వారికి ఇస్తున్న జీతం, హోదా తామూ ఇస్తామని యుద్ధపు అదనులో కంపెనీ వారు ప్రకటించారు. దాంతో చాలామంది ఇంగ్లీషువారు 'దేశభక్తి'తో సింధియాను వదిలిపోయారు. పోక మిగిలిన యూరోపియన్లు కంపెనీ వారితో కుమ్మక్కయి యుద్ధ రంగంలో ద్రోహం చేసి యజమానిని నట్టేటముంచారు.

రెండో మరాఠా యుద్ధంలో చరిత్రాత్మకమైన అస్సాయి కదనరంగాన జనరల్ వెల్లస్లీ చెప్పిన లెక్కల ప్రకారమే ఆయన వైపున 8000 సైనికులు, 17 ఫిరంగులు ఉండగా సింధియా పక్షాన 50 వేల సేన, 128 ఫిరంగుల ఉన్నాయట. అయినా గెలిచింది ఇంగ్లీషువారే! చేతిలో ఫిరంగులు ఉన్నా వాటిని ప్రయోగించి శత్రువులను వేటాడాలన్న ధ్యాస కిరాయి యూరోపియన్లకు లేకపోయింది. ప్రాణ నష్టం భారీగా జరిగినా సింధియా వైపున ఒక్క యూరోపియను కూడా చావలేదు. దీన్నిబట్టే విద్రోహం ఏ స్థాయిలో జరిగిందో ఊహించవచ్చు.

విశ్వాస ఘాతకానికి కేవలం తెల్లవారినే నిందించి ప్రయోజనం లేదు. ద్రోహం చేయటంలో నల్లతోలు వారూ తక్కువ తినలేదు. ఉదాహరణకు బేగం సమ్రూ అనే జాగీర్దారిణి సింధియా పక్షాన ఉన్నట్టు నటించి 'కంపెనీ'తో కుమ్మక్కు అయింది. అస్సాయి యుద్ధంలో ఆమెకు చెందిన నాలుగు బెటాలియన్లు పాల్గొన్నాయి. చోద్యం చూశాయే తప్ప ఒక్క తూటా కూడా అవి పేల్చలేదు.

"Begum Sumroo has long evinced a desire to be taken under the protection of the English... Four of her batallions are now with Sindhia... but if a rupture actually takes place, means might be contrived to enable those batallions to join General Wellesley" (బేగం సమ్రూ మన రక్షణ పొందాలని చాలాకాలంగా కోరుకుంటున్నది. ఆమె బెటాలియన్లు నాలుగు సింధియా దగ్గరి ఉన్నాయి. యుద్ధం వస్తే వాటిని జనరల్ వెల్లస్లీ పక్షాన చేరేట్టు చేయవచ్చు) అని 1803 జూలై 13న లార్డ్‌లేక్ గవర్నర్ జనరల్ చెవిని వేసిన దానిబట్టి ఇందులో మతలబు అర్థమవుతుంది.

దక్కనులో జరిగిన ద్రోహమే కీలకమైన ఉత్తరాదినా జరిగి సింధియా సామ్రాజ్యం పేకమేడలా కూలిపోయింది. గంగ, యమున నదుల మధ్య సింధియా ఏరికోరి నిలిపిన సేనాపతి ఫ్రెంచివాడు. పేరు పెర్రాన్. అతగాడూ ఇంగ్లీషు వారితో ముందే మాట్లాడుకున్నాడు. తన ఆస్తులు, ఇంగ్లీషు వారిచ్చిన లంచాలు ఇంగ్లీషు బ్యాంకుల్లో నెమ్మదిగా జమచేసుకున్నాడు. మన ప్రతాపానికి ఎదురులేదు; ఇంగ్లీషు వారిని ఇట్టే కాలరాచేస్తాం అని సింధియాకి చివరి నిమిషం దాకా భరోసా ఇచ్చి, తన చేతిలోని రెండు బెటాలియన్లను సమయానికి అందుబాటులో ఉండకుండా ఆగ్రా పంపేశాడు. లార్డ్‌లేక్ సేన అలీగఢ్ కోటను చుట్టుముట్టగానే ముందు ఒప్పందం ప్రకారం పళ్లెంలో పెట్టి కోటను అప్పగించి, పరారై ఇంగ్లీషు వారి శరణుజొచ్చాడు. (వృత్తి ధర్మానికి ద్రోహం చేసిన కారణంగా అతడి ముఖం

చూడటానికి నెపోలియన్ నిరాకరించాడు.)

*India under Wellesley* గ్రంథంలో **P.E. Roberts** అన్నట్టు "The conduct of this traitor assured the English the supremacy of Hindustan" (ఈ ద్రోహి చేసిన పనివల్లే ఇంగ్లీషువారికి హిందుస్తాన్‌పై ఆధిపత్యం దక్కింది). ఢిల్లీలో కమాండరుగా ఉన్న ఇంకో పరాసువాడు బౌర్ క్విన్ కూడా పెర్రాన్ చూపిన మార్గంలో నడిచి ఇంగ్లీషు సేనల అలికిడి వినగానే పరుగునపోయి లొంగిపోయాడు. అటు అలీగఢ్‌లోనూ ఇటు ఢిల్లీలోనూ, ఆనక ఆగ్రాలోనూ సింధియా పక్షాన భారతీయ సైనికులు వీరోచితంగా పోరాడారు. వారి అద్భుత శౌర్యాన్ని బ్రిటిష్ సేనానులే తెగ మెచ్చుకున్నారు. కాని ఏమి లాభం? కిరాయి విదేశీయుల ద్రోహంవల్ల అప్పటికే పరిస్థితి చేయిదాటిపోయింది. భారతీయుల పరాక్రమమంతా వ్యర్థమైంది.

పెర్రాన్ చేసిన మోసం తెలియగానే సింధియా దక్కను నుంచి 14 బెటాలియన్లను హుటాహుటిన ఉత్తరాదికి తరలించాడు. కాని వాటి లోనూ పెద్ద తలకాయలు యూరోపియన్లే. షరా మామూలుగా వారూ పెర్రాన్ దారే పట్టారు. ఢిల్లీ, ఆగ్రాల పతనం తరువాత సింధియాకు మిగిలిన కొద్దిపాటి బలం కూడా లాశ్వారీ పోరులో తుడిచి పెట్టుకుపోయింది. గుజరాత్, బుందేల్‌ఖండ్, ఒరిస్సాలలోనూ ఇంచుమించుగా అలాగే జరగటంతో శక్తులుడిగిన దౌలత్‌రావు సింధియా 1803 డిసెంబరు 30న యుద్ధం మాని ఇంగ్లీషు వారితో సంధి కుదుర్చుకున్నాడు. గంగ, యమునల మధ్య ఉన్న తన రాజ్యం మొత్తాన్నీ రాజస్థాన్‌లపై పెత్తనాన్నీ, నిజాం మీద మొగల్ చక్రవర్తి మీద హక్కులనూ అతడు 'కంపెనీ'కి వదిలేసుకున్నాడు. 1804 ఫిబ్రవరి 27న బుర్హాన్‌పూర్ సంధిలో పీష్వాలాగే, నిజాంలాగే తానూ తెల్లవారికి తాబేదారు అయిపోయాడు. ఊహించని పరాజయాలతో రఘూజీ భోంస్లే కూడా సింధియా కంటే కొన్ని వారాల ముందే తలకాయ జేబులో పెట్టుకుని ఇంగ్లీషు వారికి లొంగిపోయాడు.

నూరేళ్లు వెలిగిన మరాఠా దీపం అలా కొడిగట్టింది.



# విభజించి ఓడించు

విభజించి పాలించటమే కాదు. విభజించి ఓడించటమూ తెల్లవారికి వెన్నతో పెట్టిన విద్య. ప్లాసీ అధర్మయుద్ధంలో గెలిచి అర్ధశతాబ్దం గడిచాక... కుతంత్రాలతో కుత్సితాలతో విశాల ప్రాంతాలను, అనేక రాష్ట్రాలను క్రమేణా వశపరచుకున్న తరవాత కూడా ఇంగ్లీషువారి సైనిక శక్తి భారతీయుల వెరశి సైనిక వనరుల ముందు ఎందుకూ కొరగాదు. ముఖ్యంగా మరాఠా సమాఖ్య భాగస్వాములందరూ కనీసం 19వ శతాబ్ది మొదట్లో ప్రాప్తకాలజ్ఞతతో ఏకమైవున్నా ఉమ్మడి విదేశీ బెడదను అవలీలగా ఎదుర్కోగలిగేవారే. దురదృష్టవశాత్తూ వారందరూ తెల్లవాడి మాయలో పడ్డారు. హోల్కర్‌ను ప్రయోగించి, పీష్వాను కీలుబొమ్మగా మార్చాక ఆ ఇద్దరినీ వేరుపరిచి ఇంగ్లీషువారు సింధియా, భోంస్లేలను మాయాయుద్ధంలో ఓడించారు. వారి అడ్డు తొలిగాక కపట మైత్రి చాలించి హోల్కర్ పని పట్టారు. చివరికి పీష్వాను ఎడమ కాలితో తన్నేసి మొత్తం సామ్రాజ్యానికి తామే సార్వభౌములం పొమ్మన్నారు.

ఇంగ్లీషు వారితో విడివిడి యుద్ధాల్లో మరాఠా యోధులు గొప్ప పరాక్రమమే చూపారు. కాని ఒకరు పోరాడుతున్నప్పుడు మిగతావారు చెయి కలపకుండా మిన్నకుండటంతో ఆ ఒక్కరినీ విదేశీయులు విధంచెడ్డా గెలవగలిగారు. మంట తమ కాళ్లకిందికి వచ్చాక మిగతా వారు ఒకరొకరే నిర్లిప్తత వీడి పోరాడినా, ఎటునుంచీ సహాయం అందకపోవడంతో ఒంటరి పోరులో ఓటమి అనివార్యమైంది. అనైక్యత తెచ్చిన అనర్థం అవగతమయ్యేసరికే పరిస్థితి చెయిదాటిపోయింది.

తెల్లవాళ్లు, సింధియా సుందోపసుందుల్లా కలహించుకుంటూంటే తాను తమాషా చూసి, పరిస్థితినిబట్టి ఎటు మొగ్గాలో, ఏమి చేయాలో నిర్ణయించుకోవాలని యశ్వంతరావు హోల్కర్

తలిచాడు. కంపెనీ దొరలు అతడికి అంత సావకాశం ఇవ్వలేదు. దేశంలో తిరుగులేనిదనుకున్న సింధియా సైనిక శక్తిని ఎక్కడికక్కడ విద్రోహ తంత్రాలతో తూట్లు పొడిచి సింధియాను కాళ్లబేరానికి అతివేగంగా రప్పించుకున్న వెనువెంటనే హోల్కర్‌పై వక్ర దృష్టి సారించారు. అంతదాకా యశ్వంతరావును తమకు ఆప్తమిత్రుడని ప్రకటించి, ఇచ్చకాలు పలుకుతూ వచ్చిన గవర్నర్ జనరల్ వెల్లస్లీకి సదరు యశ్వంతరావు తన సోదరుడు కాశీరావును తోసివేసి గద్దెనాక్రమించిన వైనం హఠాత్తుగా గుర్తుకొచ్చింది. దగాపడ్డ కాశీరావు న్యాయబద్ధ అధికారాన్ని నిలబెట్టే మిషతో యశ్వంతరావును వేటాడటానికి వెల్లస్లీ కత్తులు నూరసాగాడు. యశ్వంతరావు ఫలానా ఫలానా తప్పుడు పనులుచేసి రెచ్చగొట్టటంవల్లే బ్రిటిష్‌వారు ఆగ్రహించారనీ, అతడు బుద్ధిగా ఉంటే ఏ గొడవా ఉండేది కాదనీ మన చరిత్రకారులు చాలామంది నమ్మకంగా చెబుతారు. నిజానికి వారన్న ధిక్కారాలకు అతడు పాల్పడటానికి చాలా నెలల ముందే దొరలు అతడిని హిట్‌లిస్టులో చేర్చారు. "unless we make war upon Holkar... we shall not succeed in driving the Marhattas entirely from these countries, although Scindhia should cede his rights" (సింధియా తన హక్కులను మనకు వదిలేసుకున్నప్పటికీ ఈ ప్రాంతాల నుంచి మరాఠాలను పూర్తిగా గెంటివేయటం హోల్కర్‌తో యుద్ధం చేస్తే గానీ సాధ్యపడదు) అని 1803 సెప్టెంబరు 12నే జనరల్ వెల్లస్లీ తన అన్నగారికి జాబురాశాడు.

సింధియా విషయంలో చేసినట్టే హోల్కర్‌నూ దొరలు మాయమాటలతో మభ్యపెట్టి, చుట్టూతా సేనలను మోహరించాక, మైత్రి ముసుగు లాగేసి షరామామూలు కుతంత్రాలతో పడగొట్టేవారే. మామూలుగా అయితే హోల్కర్ వారి బుట్టలో పడేవాడేమో. కాని, సింధియా అనుభవం చూశాక అతడు జాగ్రత్తపడ్డాడు. సింధియా వలె చివరి క్షణం దాకా ఏమరి వుండకుండా, రానున్న ప్రమాదం గ్రహించి, బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా పెద్దఎత్తున ఐక్య సంఘటన కట్టదలిచాడు. ధర్మానికి, జాతికి దాపురించిన ముప్పును ఎదుర్కోవడానికి కలిసి రావలసిందిగా జైపూర్, జోధ్‌పూర్, ఉదయపూర్ రాణాలకూ, రంజిత్‌సింగ్ లాంటి సిక్కు నాయకులకూ రాయబారాలు పంపాడు. సింధియా సేనలోని యూరోపియన్ దళవాయిల చేత కుట్ర చేయించి సింధియాను దెబ్బతీసిన కుత్సితాన్నే హోల్కర్ మీదా ప్రయోగించాలని కంపెనీ దొరలు తంటాలు పడ్డారు. ఆ ప్రమాదాన్ని యశ్వంతరావు ముందే గుర్తించి తన సైన్యంలో కంపెనీ పంచమాంగదళంగా పనిచేస్తున్న ముగ్గురు ఇంగ్లీషు అధికారులను (ఆ కాలంలో అందరూ అనుసరించిన సైనిక ధర్మ ప్రకారం) చంపేశాడు. ఇంగ్లీషువారు తనతో రాజీ కోరుతున్నా మని అన్నప్పుడు - వారితో సైనిక ఒప్పందానికి సంసిద్ధత తెలుపుతూనే - పూర్వం నుంచీ తన కుటుంబానికి కొన్ని రాజ్యాలపై ఉన్న 'చౌథ్' హక్కును గుర్తించాలనీ, తమనుంచి గుంజుకున్న ప్రాంతాలను తిరిగి తనకు అప్పగించాలని నిష్కర్షగా పట్టుబట్టాడు. అది కుదరదు పొమ్మని బ్రిటిష్ సేనాపతి లేక్ తూష్ణీకరిస్తే "నాతో పెట్టుకుంటే అనేక వందల క్రోసుల దూరంలో వున్న ప్రాంతాలను కూడా వదలకుండా వెంటపడి మీ రాజ్యాలు కొల్లగొడతా. మీ ఊళ్లు తగలబెడతా. సముద్రపు అలల్లా నా సేనలు విరుచుకుపడి లక్షల మందిని ముప్పుతిప్పలు పెడతాయి జాగ్రత్త" అని చరిత్రాత్మకమైన హెచ్చరిక చేశాడు.

వట్టి వీరాలాపాలే కాదు. నిజంగానే అంతపనీ చేశాడు కూడా.

యశ్వంతరావుహోల్కర్‌కు నికరమైన రాజ్యం, న్యాయబద్ధ అధికారం లేకపోయినా



అతడి చేతిలో మిడతల దండులాంటి సేనలు ఉన్నాయి. సింధియా, భోంస్లేలు కంపెనీవారికి లొంగిపోయి సైనిక బలగాలను కత్తిరించేసుకోవటంతో పనిలేకుండాపోయిన సైనికులు పెద్ద సంఖ్యలో హోల్కర్ శ్రేణుల్లో చేరారు. ఎనభైవేలకు పైగా అశ్వబలంతో, లెక్కలేనంత కాల్బలంతో, వందలాది ఫిరంగులతో యశ్వంతరావు చెలరేగి బ్రిటిష్ మహాసేనానులకు ముచ్చెమటలు పట్టించాడు. హోల్కర్ తమ ముందు, చిట్టెలుక అనీ, అతడితో పోరు పాలెగాళ్లతో యుద్ధం లాంటిదేననీ, ఒక పట్టుపడితే చాలు అతడిని ఇట్టే - మహా అయితే పక్షం రోజుల్లో - గుటుక్కుమనిపించేస్తామని మిడిసిపడ్డ దొరల అంచనాలు తల్లకిందులయ్యాయి. 1804 జూన్ 5న తీరికూర్చుని వారు ప్రకటించిన యుద్ధం అనేక పక్షాలు, అనేక మాసాలు గడిచి ఆఖరికి కాలండరే మారినా ఇంకా భీకరంగా సాగుతూనే ఉంది. "I never was so plagued as I am with this devil" (ఈ పిశాచం బారిన పడ్డట్టుగా నేను జన్మలో ఎన్నడూ అవస్థ పడలేదు) అని ఘనత వహించిన బ్రిటిష్ కమాండర్-ఇన్-చీఫ్ లార్డ్ లేక్ దొరే జైపూర్‌లో మొత్తుకున్నాడు.

చరిత్రకెక్కిన కర్నల్ మాన్సన్ పరాభవం సరేసరి. ముకుంద్రా కనుమ గుండా రాజస్థాన్‌లో చొరబడి హోల్కర్ పీచమణచడానికి ఐదు బ్రిగేడ్ల భారీ బలగంతో ఈ దొర ఆర్భాటంగా కదిలాడు. రెండు నెలలు యుద్ధంచేసినా హోల్కర్‌ను గెలవలేక, కాళ్లు ఒణికి తోక ముడిచి పలాయనమై మొత్తం ఐదు బ్రిగేడ్లనూ నష్టపోయి, భారీ ఫిరంగులను దారిలోనే వదిలేసి చావు తప్పి కన్ను లొట్టపోయిన స్థితిలో ఆగ్రాకు మరలి వచ్చాడు.

అది ఇండియాలో బ్రిటిష్ సైన్యానికి జరిగిన అతి పెద్ద శృంగభంగం. అజేయమనుకున్న బ్రిటిష్ సైనిక బలానికి పట్టిన ఆ దుర్గతికి పాశ్చాత్య ప్రపంచం యావత్తూ నివ్వెరపోయింది. "I tremble at the political consequences of that event" (ఆ దుర్ఘటన వల్ల రాగల రాజకీయ పర్యవసనాలను తలచుకుంటే నాకు వొణుకు పుడుతున్నది) అని జనరల్ వెల్లస్లీ అంతటివాడే లబలబలాడాడు. ఈ సిగ్గుచేటు పరాభవం తెచ్చిన నగుబాటు నుంచి బయటపడి హోల్కర్‌ను ఎలాగైనా పీచమణచడానికి కమాండర్ ఇన్ చీఫ్ లేక్‌ను సకల శక్తులూ ఒడ్డి స్వయంగా రంగంలోకి దిగమన్నారు.

లేక్ గొప్పవాడే. అద్భుత విజయాలను సాధించగలవాడే. కాని వాటిని సాధించాలంటే శత్రుపక్షంలో కమాండర్లు తన మాట వినే వారైతే భేషుగ్గా ఉంటుందని ఆయన ఊహ. ఆ దొర ఆరితేరిన సైనిక కుహకాలకు ఆస్కారం లేకుండా తన సేనలో ద్రోహం అనుమానం తోచిన యూరోపియన్ అధికారులను హోల్కర్ ముందే చంపాడు. దాంతో అతడిని ఎట్టకేలకు ఓడించటానికి లేక్ దొర చాలా కష్టపడవలసి వచ్చింది. ఢిల్లీ, డీగ్ సంగ్రామాల్లో లేక్‌దే పైచేయి అయింది. ఫరూఖాబాద్‌లో నేరుగా హోల్కర్‌నే అతడు ఓడించాడు. ఈ పరాజయాలతో డీలాపడ్డ హోల్కర్ భరత్‌పూర్ ప్రభువైన జాట్ రాజా రంజిత్‌సింగ్ సహాయం అర్థించాడు.

ఆ రాజా మొదట బాగానే తోడ్పడ్డాడు. ఇంగ్లీషు వారితో అంతకు ముందు తనకున్న అవగాహనను జాతీయ ప్రయోజనాల కోసం పక్కనపెట్టి హోల్కర్‌కి అండగా నిలబడ్డాడు. దుర్భేద్యమైన భరత్‌పూర్ కోటను లోపలి నుంచి రంజిత్‌సింగ్ కాపాడుతూండగా వెలుపల హోల్కర్ బ్రిటిష్ సేనలతో తలపడి వీరవిహారం చేశాడు. జి.ఎస్.సర్దేశాయ్ చెప్పినట్టు

"Here now began a furious and heroic struggle which has earned an imperishable epic fame in the annals of India... The place was invested on 7th

January 1805. The siege was given up on 10th April. During these three months a series of determined attacks to carry the place by storm proved of no avail and entailed enormous losses"

[*New History of Marathas*, **G.S.Sardesai**, *Vol.III, p.428*]

(భారతదేశ చరిత్రలో వీరగాథగా వినుతికెక్కిన భీకర యుద్ధం మొదలైంది. 1805 జనవరి 7న ఆరంభమైన ముట్టడి ఏప్రిల్ 10న ముగిసింది. ఈ మూడు నెలల్లో కోటపై విరుచుకుపడటానికి పట్టుదలతో జరిగిన ప్రయత్నాలన్నీ నిష్ఫలమై అపారమైన నష్టాలు వాటిల్లాయి.)

ఈ నష్టాలకు గుండె చెదిరే... వాటి పర్యవసానంగా తనకు రాగల చెడ్డపేరుకు భయపడే గవర్నర్ జనరల్ వెల్లస్లీ "I feel too strong a desire for the early termination of War, even on any terms" (ఎలాంటి షరతులకు అంగీకరించైనా సరే యుద్ధాన్ని త్వరగా ముగించాలని నేను తహతహ లాడుతున్నాను) అని 1805 మార్చి 9న లేక్‌కు లేఖ రాశాడు. గెలవలేని యుద్ధాన్ని ఎలాగైనా చాలించి గౌరవప్రదంగా బయటపడేందుకు దారి ఏమిటా అని ఆలోచిస్తే దొరల బుద్ధికి అద్భుతమైన ఉపాయం స్ఫురించింది. శౌర్యంవల్ల కాని పని దౌత్యంవల్ల నెరవేరింది. రాజా రంజిత్‌సింగ్ వారి వలలో పడ్డాడు. బ్రిటిష్‌వారి శత్రువులతో సంబంధాలు కోసేసుకోవడానికి సమ్మతించి, కంపెనీతో సంధి చేసుకున్నాడు. అతడి అండ పోయాక కూడా తొమ్మిది నెలలపాటు హోల్కర్ పట్టబిగువున పోరాటం కొనసాగించాడు. సాయపడమని సింధియానూ, సిక్కు సర్కారు రంజిత్‌సింగ్‌నూ, రాజస్థాన్ ప్రముఖులనూ, ఇంకో ఎంతో మందినీ అర్థించాడు. ఒక్కరూ ఆదుకోలేదు. గత్యంతరం లేక 1805 డిసెంబరు 24న (అంటే దొరలు యుద్ధం ప్రకటించి ఏణ్నర్థం గడిచాక) యశ్వంతరావు హోల్కర్ తెల్లవారితో సంధి చేసుకున్నాడు.

కంపెనీతో సైనిక సంధి అనే సాలెగూట్లో చిక్కాక హోల్కర్ గురించి మాట్లాడు కోవలసింది ఏమీలేదు. పరాభవాన్ని భరించలేక అనంతర కాలంలో అతడికి పిచ్చి పట్టింది. ఉన్మాదంలోనే 1811లో తన 35వ ఏట కన్నుమూశాడు. ఎంత భీకరంగా పోరాడినా ఇంగ్లీషువారినైతే గెలవలేకపోయాడు. కాని ఓడిపోయే ఒక రకంగా వారిని యశ్వంతరావు సాధించాడు. అతడిని జయించడానికి ఏణ్నర్థంపాటు వెల్లస్లీ సాగించిన యుద్ధానికి అయిన విపరీతపు ఖర్చునూ, భారీ ప్రాణనష్టాలనూ చూసి సీమ ప్రభువులకు తల తిరిగింది. ముఖ్యంగా భరత్‌పూర్ కోట ముట్టడి మూడువేలకు పైగా ప్రాణాలను బలిగొన్న తీరు, బ్రిటిష్ మహాసైన్యాన్ని ధైర్యంగా ఎదిరించి భారతీయులు కనపరిచిన అద్భుత శౌర్యం బ్రిటిష్‌వారి హృదయాలను కదిలించాయి. వద్దన్నా వినకుండా వెల్లస్లీ సాగిస్తున్న మారణ హోమానికి అందరికీ రోత పుట్టింది. ఎదురుచూసిన లాభాలు రాకపోగా యుద్ధాల పుణ్యమా అని కంపెనీ పీకల లోతున అప్పుల్లో కూరుకుపోవటంతో వాటాదారులు గగ్గోలు పెట్టారు. అమెరికా వలసను కోల్పోయిన నష్టాన్ని ఇండియా ఆక్రమణ ద్వారా భర్తీ చేసుకోవాలని ఉబలాటపడి మొదట్లో వెల్లస్లీకి వత్తాసు ఇచ్చిన ప్రధాని పిట్ కూడా వ్యవహారం చాలా దూరం పోయిందని గ్రహించి, బ్రిటిష్ ప్రజాభిప్రాయానికి తలవంచి వెల్లస్లీని వెనక్కి పిలిపించాడు.



యశ్వంతరావు హోల్కర్‌తో అవ లక్షణాలు ఎన్నో ఉన్నాయి. ఒక దశలో బ్రిటిష్ వారికి పావులా ఉపయోగపడి మరాఠాల మెడకు బ్రిటిష్ సైనిక సహాయం గుదిబండను తగిలించిన పాపంలో అతడికీ వాటా ఉంది. తప్పులు ఎన్నిచేసినా ఒకందుకు మాత్రం అతడికి దేశం రుణపడి ఉండాలి. అతడే కనక అగ్గిపిడుగులా విజృంభించి ఉండకపోతే సింధియా, బేరార్ రాజాలను కాల రాచివేసిన తరవాత వెల్లస్లీ దూకుడుకు పట్టపగ్గాలుండేవి కావు. భరత్‌పూర్ కోటను ఇంగ్లీషువారు ప్రతాపంతో పట్టుకొనగలిగి ఉంటే వెల్లస్లీ బహుకాలం ఇండియాలోనే ఉండి యావత్తు దేశీయ సంస్థానాలపైకి పోయి అన్నిటినీ ఒక్క పెట్టున మింగేసేవాడే. మేము ఇండియానంతా కత్తితోనే జయించామని చెప్పి సీమ ప్రభువులు పేట్రేగేవారే. అమెరికా లాంటి వలస దేశాల్లో చేసినట్టే ఇండియాలో ప్రజలను కూడా కేవలం మృగాలుగా ఎంచి తెల్లవారు బహుశా వేటాడి ఉండేవారే.

మరాఠా సమాఖ్యను వెల్లస్లీ బద్దలుకొట్టిన కాలానికి ఇండియాలో ఏమి జరుగుతోందో, భారతీయులు ఎలాంటి వారో ఇంగ్లీషు ప్రజలకు తెలియదు. వారి గురించి ఇక్కడి వారికీ తెలియదు. ఇరు దేశాల ప్రజల మధ్యా సంపర్కం, సంబంధం ఏమంత లేని స్థితిలో వెల్లస్లీ లాంటివారు విజయగర్వంతో ఎలాంటి అఘాయిత్యాలు చేసినా చెల్లేదే. అమెరికాలో రెడ్ ఇండియన్లకు పట్టిన గతే ఇండియాలో ఇండియన్లకు కూడా పట్టకుండా అడ్డుకుని, బ్రిటిష్ అబోతుల దూకుడును నిలువరించిన వాడు యశ్వంతరావు హోల్కర్. అర్ధశతాబ్దం గడిచాక భారతదేశం మీద ఇంగ్లండు సార్వభౌమాధికారం చేజిక్కించుకోకపోలేదు. కాని డల్‌హౌసీ నాటికి పరిస్థితులు వేరు. ఇంగ్లండు, ఇండియాల మధ్య సంబంధాలు వేరు. భారత ప్రముఖుల చైతన్య స్థాయి వేరు.

రాజ్యకాంక్షతో వెల్లస్లీ తెరపిలేకుండా సాగించిన అనర్థకపు యుద్ధాల సెగ సీమదాకా సోకి గగ్గోలు పుట్టాక బ్రిటిష్ ప్రభువులు రివర్సు గేరు వేశారు. దేశీయ ప్రభువులతో కయ్యాలుమాని, ఎవరి మానాన వారిని కనీసం కొంతకాలం బతకనివ్వాలని నిశ్చయించారు. ఊహించని ప్రతికూలస్థితిలో ఆపద్ధర్మంగా మార్చిన విధానాన్ని ఇండియాలో అమలు జరిపి తమకు మాట దక్కించగల సమర్థుడెవరా అని ఆలోచిస్తే వారికి మళ్లీ కారన్‌వాలిసే కనపడ్డాడు. దశాబ్దంకింద అతడు దేశాధినేతగా ఉన్నప్పటి పరిస్థితినే ఇండియాలో తిరిగి నెలకొల్పే బాధ్యతను అప్పగించి అర్జంటుగా ఓడెక్కించారు. అప్పటికే కారన్‌వాలిస్ ఆరోగ్యం మునగానాం తేలానాంగా ఉంది. అయినా పెద్దవాళ్ల మాట తీసెయ్యలేక సరేనన్నాడు. 1805 జులై 30న ఇండియాలో కాలుబెట్టిననాడే పదవీ బాధ్యత స్వీకరించి పని సీరియస్‌గానే మొదలెట్టాడుగాని రెణ్నెల్లు తిరిగాయో లేదో కారన్‌వాలిస్‌కు భూమిమీద నూకలు చెల్లాయి. అతడికి ఉత్తరాధికారి అయిన సర్‌జార్జి బార్లో, తదుపరి గవర్నర్ జనరల్ లార్డ్ మింటోలు కారన్‌వాలిస్ రూపకల్పన చేసిన రాజకీయ విధానాన్నే అనుసరించి, దేశీయ పాలకులతో గొడవలు పెట్టుకోకుండా గుర్రాన్ని కట్టేశారు.

కంపెనీ కర్రపెత్తనం, అత్తరికం కాస్త నెమ్మదించటం వల్ల ముఖ్యంగా లాభపడ్డవాడు పీష్వా బాజీరావు. అంత సుఖం అతడు జన్మలో ఎరుగడు. నానా ఫడ్నవిస్ ఏమి కొంపముంచుతాడోనన్న భయంగాని, సింధియా, హోల్కర్‌లు ఎప్పుడు పేట్రేగి ఏ సమస్య తెచ్చిపెడతారోనన్న బెంగగాని లేకుండా అతడు పూజలూ పునస్కారాలూ, విందులూ విలాసాల్లో ఖుషీగా గడిపాడు. రెండో మరాఠా యుద్ధం తరువాత కొన్నేళ్లు పరిస్థితి

ప్రశాంతంగానే ఉంది. అధికార పరిధి కుంచించుకు పోతేనేమి, మరాఠా సమాఖ్యలో భాగస్వాములైన రాజ్యాలమీద అదుపు పోతేనేమి... రావలసిన రాబడి సవ్యంగా ముట్టుతూ ఖజానా సమృద్ధిగా ఉన్నంతవరకూ ఫరవాలేదని, కాలం అలా వెళ్లిపోతే చాలునని బాజీరావు తృప్తిపడ్డాడు.

కాని ఆ తృప్తి చిరకాలం మిగలలేదు. మధ్యలో వచ్చిన మంచిబుద్ధి సీమ దొరలకు ఎంతోసేపు నిలవలేదు. మార్క్యూస్ హేస్టింగ్స్ గవర్నర్ జనరల్ అయ్యాక, శకునికి చదువు చెప్పగల ఎల్ఫిన్‌స్టోన్ రెసిడెంటుగా పూనాలో కాలుబెట్టాక పీష్వాకు కష్టాలు మొదలయ్యాయి. మరాఠా సామ్రాజ్య మహావృక్షాన్ని సమూలంగా పెకిలించివేసే ఆఖరి ఘట్టానికి తెరలేచింది.



# అస్తమయ దృశ్యం

**"మహారాజ ప్రాసాదంలో సుఖభోగాలనుభవించిన శ్రీమంత్ పీష్వా ఇప్పుడు అడవుల పాలయ్యాడు. మండుటెండలో ముళ్ల పొదలూ కోసురాళ్ల నడుమ దారి కానక వెదుకులాడుతున్నాడు. గుర్రానికి తిండీతిప్పలూ తానే చూసుకుంటున్నాడు. హంసతూలికా తల్పాల మీద శయనించిన వాడు కటిక నేలమీద తలగుడ్డ పరచుకుని పడుకుంటున్నాడు. చెక్క పాత్రలో అన్నం! ఓ రోజు సూర్యాస్తమయానికి తింటే ఇంకో రోజు అర్ధరాత్రి దాటాక! నమ్మిన సేవకులు ఒకరొకరే జారుకున్నారు. ఏనుగులు, గుర్రాలు, ఒంటెలు, సంపదలు అన్నీ పోయాయి. కనిపించిన వారితో 'ఇదే చివరి కలయిక. దయ ఉంచండి. బతికుంటే మళ్లీ కలుద్దాం' అంటూ కళ్లనీళ్లు తుడుచుకుంటూ సాగిపోతున్నాడు! అహా! బాజీరావుకు ఎంతటి దురవస్థ వచ్చింది! బాలాజీ విశ్వనాథ్ వంశానికి ఎలాంటి గతి పట్టింది!!"**

***New History of Marathas*** గ్రంథంలో జి.ఎస్.సర్దేశాయ్ ఉటంకించిన మరాఠీ జానపద గేయానికి తెలుగు తాత్పర్యమిది. అతిశయోక్తి ఏమీ లేదు. ఇందులో వర్ణించినవన్నీ రాజ్యంపోయి తెల్లవారికి ఎదురు తిరిగిన దశలో బాజీరావు పీష్వా అక్షరాలా అనుభవించిన అగచాట్లే.

బాజీరావును ఎవరూ జాలితలవాల్సిన పనిలేదు. ఈ కష్టాలన్నీ అతడు కోరి కొని తెచ్చుకున్నవే. మరాఠా స్వాతంత్ర్యాన్ని ఈస్టిండియా కంపెనీకి కుదువబెట్టి, దిక్కుమాలిన స్వార్థంకోసం విదేశీ వర్తకుల మూకను ఆశ్రయించి అతడు చేసిన పాపమే శాపమై అతడిని వెంటాడింది. నిజమే. కాని ఎంత అబద్ధపు బతుకు బతికినా, తన జాతి ప్రయోజనాల విషయంలో ఎంత అలసత్వం చూపినా ఇంగ్లీషువారి మీద మాత్రం బాజీరావు ఎనలేని విశ్వాసం చూపాడు. రోజూ కొలిచే దేవుడికంటే ఎక్కువగా బ్రిటిషు వారినే అతడు కడదాకా నమ్ముకున్నాడు. దేశంలో ఇంకెవరూ చేయనంతటి మేలును తెల్లవారికి అతడు చేశాడు. సైనికంగా ఎదురులేని మరాఠా శక్తిని అతడు పళ్లెంలో పెట్టి అప్పగించి ఉండకపోతే భారత

ఉపఖండం ఇంగ్లీషు వారికి అంత తేలిగ్గా వశమయ్యేది కాదు. అంతటి ఉపకారం అతడు చేసినప్పుడు... కోల్పోయిన గద్దెను తనకు తిరిగి సంపాదించిపెట్టారన్న కృతజ్ఞతను మనసారా అతడు చూసినప్పుడు కనీస మానవత్వమనేది ఉంటే అవతలివారు కూడా అతడిపట్ల అంతే అభిమానం కనపరచాలి. మరి ఇంగ్లీషువారు ఏమి చేశారు? కుక్కలా తమ పట్ల విశ్వాసం చూపిన పీష్వాను కుక్కలాగే చూశారు! తమకు సామ్రాజ్యం సంపాదించిపెట్టిన వాడినే అక్కర తీరాక కరివేపాకులా అవతల పారేసి రాజ్యం లాక్కుని వెళ్లగొట్టారు. అంతకుముందూ తరవాతా తమను నమ్ముకున్న వారెందరినో చేసినట్టే బాజీరావునూ నట్టేట ముంచారు.

బాజీరావును వదిలించుకోదలిచాక కంపెనీ వారికి అతడిలో అన్నీ తప్పులే కనిపించాయి. అతడు అసమర్థుడు, అయోగ్యుడు, వ్యసనలోలుడు, విశ్వాస ఘాతకుడు, ప్రజాకంటకుడు అంటూ దొరలు నానా నిందలు మోపారు. బాజీరావు ఒప్పులకుప్ప కాకపోయినా మరీ వారు చిత్రించినంత నీచుడేమీ కాదు. అందుకు దొరల రాతలే రుజువు. ఉదాహరణకు అప్పట్లో బొంబాయి ప్రధాన న్యాయమూర్తిగా ఉన్న సర్ జేమ్స్ మాకింటోష్ ప్రపంచంలో తాను ముగ్గురు గొప్ప ప్రభువులను చూశానంటూ మూడవ జార్జి, నెపోలియన్‌తో బాటు బాజీరావు పేరూ చెప్పాడు. పీష్వా దర్బారులో దీర్ఘకాలం రెసిడెంటుగా ఉండి బాజీరావు నడవడిని వెయ్యి కళ్లతో కనిపెట్టివున్న కర్నల్ బారీ క్లోజ్ సైతం బాజీరావు తమకు చిత్తశుద్ధితో కృతజ్ఞుడై, తమతో స్నేహాన్ని మనసారా కోరుకున్నాడని చెప్పాడు. శ్వేత జాతి దురహంకారం నరనరానా జీర్ణించుకుని బాజీరావుపై విషంగక్కి అడ్డమైన అభియోగాలు మోపిన నాటి దక్కన్ సేనాధిపతి ఆర్థర్ వెల్లస్లీ "I certainly had a bad opinion of the Peishwa... I have no positive proof that he has been treacherous, but I have a strong suspicion of it" (పీష్వా మీద నాకు కచ్చితంగా చెడ్డ అభిప్రాయమే ఉంది... అతడు ద్రోహం చేస్తున్నాడనడానికి నా దగ్గర నికార్సయిన రుజువు ఏదీ లేదు. కాని నాకు బలమైన అనుమానం) అని రాసిన రాతనుబట్టే బాజీరావుపై దొరల నిందా ప్రచారం ఎంత నిరాధారమైనదో అర్థమవుతుంది. వెల్లస్లీ బళ్లో చదువుకుని కుతంత్రాల్లో గ్రంథసాంగుడైన సర్ జాన్ మాల్కోమ్ అంత తేలిగ్గా మోసపోయే ఘటం కాదు. అలాంటివాడు కూడా బాజీరావు బ్రిటిష్ వారితో ఘర్షణ పెట్టుకోకుండా వారి నీడలో చల్లగా బతకాలనే కోరుకుంటున్నట్టు గొడవలు ముదిరి చాలాదూరం వెళ్లిన దశలోనే తనపై అధికారుల చెవిన వేశాడు. అయితే మాల్కోంలాంటి వారందరినీ బాజీరావు మహాతెలివిగా బురిడీ కొట్టించాడని ఏ రుజువు చూపకుండా దొరలు మోపిన నిందనే తిరుగులేని సత్యవాక్కుగా మన చరిత్రకారులు ఔదల దాల్చారు.

ఒక దశలో బాజీరావు బ్రిటిష్ వారికి ఎదురు తిరిగి, వారిపై పోరాటానికి సాటి ప్రభువులను కూడగట్టి, పెద్దఎత్తున సేనలు సమీకరించిన మాట యథార్థమే. పుణెలోని బ్రిటిష్ రెసిడెన్సీని తగలపెట్టి బాహాటంగా దాడికి దిగిన సంగతీ నిజమే. అది చిరకాలంగా పట్టిన ఓరిమి యావత్తూ నశించాక! తనను అదుకున్నారన్న కృతజ్ఞతతో తాను ఎంతగా ఒదిగి ఉన్నా కంపెనీవారు తన వెంట పడి తనను అణగదొక్కేందుకే కృతనిశ్చయులయ్యారని గ్రహించాక! తన దర్బారులోని ముఖ్యులను లంచాలతో లోబరుచుకుని, విద్రోహానికి పురికొల్పి, తన చుట్టూ నిఘా పెట్టి, తనకు విశ్వాస పాత్రులైన వారిపై కుట్రచేసి తరిమేసి, చివరికి తన రాజ్యమే గుంజుకోవటానికి నమ్మిన మిత్రులు ఆయత్తమయ్యారని అవగతమయ్యాక!



రకరకాల కవ్వింపుల, వేధింపుల చేదు అనుభవాలతో తల బొప్పి కట్టాక! సామరస్య పరిష్కారానికి దారులన్నీ మూసుకుపొయ్యాక.

1811లో పూనా రెసిడెంటుగా ఎల్ఫిన్‌స్టోన్ కాలిడినది మొదలుకొని శాయశక్తులా సమస్యలు సృష్టించి, అనవసరపు ఉద్రిక్తతను రెచ్చగొట్టటానికి ఏ అవకాశాన్నీ వదలకుండా ఏడేళ్లు కష్టపడి మొత్తానికి పీష్వాను శంకరగిరి మాన్యాలు పట్టించాడు. కదిలితే తప్పు మెదిలితే తప్పు అన్నట్టుగా ఈ క్రమంలో బాజీరావు మీద చిన్నాపెద్దా అభియోగాలు అనేకం మోపారు. అన్నిటిలోకీ ముఖ్యమైనదేమిటంటే - గైక్వాడ్ సంస్థానం ప్రతినిధిగా పీష్వాతో లావాదేవీ లెక్కలు తేల్చుకునేందుకు బరోడా నుంచి వచ్చిన గంగాధరశాస్త్రి అనే వాడిని పీష్వా కుడి భుజమైన త్రయంబక్‌జీ డెంగ్లే పండరిపూర్‌లో క్రూరంగా చంపించాడని! కంపెనీవారు అభయం ఇచ్చి పూనాకు పంపించిన రాయబారిని హత్య కావించడమే క్షమించరాని నేరం కాగా అంతటి మహాపరాధానికి పాల్పడిన డెంగ్లేను పట్టుకుని తమకు అప్పగించమని ఎన్ని విధాల అడిగినా పీష్వా ఖాతరు చెయ్యలేదన్నది ఇంకో అభియోగం.

గైక్వాడ్ సంస్థానంతో బాజీరావుకు గొడవలున్నమాట నిజం. బరోడా నుంచి ఏరికోరి దొరలు పంపించిన గంగాధరశాస్త్రి అంటే అతడికి పడని సంగతి వాస్తవం. అతడు వద్దని ఎంత మొత్తుకున్నా తన మాటకు విలువ ఇవ్వకుండా అతడినే తెచ్చి దొరలు తనపై రుద్దారన్న కడుపుమంట బాజీరావుకు ఉంది. పైగా సదరు శాస్త్రి కంపెనీ వారికి తొత్తు. బరోడాలో గైక్వాడ్ల ఉప్పుతింటూ వారిపైనే కంపెనీ తరఫున గూఢచర్యం నెరిపిన ఘనుడతడు. పూనాకు వచ్చాక తన పని ఏదో తాను చూసుకుపోకుండా ఏడాదికి పైగా తిష్ఠవేసి పీష్వా కాళ్ల కింద కుట్రల మంటలు పెట్టాలని చాలా ప్రయత్నాలు చేశాడు. ఆ పరిస్థితుల్లో పీష్వా నిజంగానే అతడి తల తీయించి ఉన్నా ఎవరూ తప్పుబట్టాల్సిన పనిలేదు. పీష్వా తలచుకుంటే పూనాలోనే అతడిని చంపించగలిగేవాడు. కాని అక్కడ అతడున్న పదహారు నెలలూ ఊరుకుని, మూటముల్లె సర్దుకుని వెనుదిరిగి పోనుండగా పండరిపురం పవిత్ర క్షేత్రానికి అతడిని మాయమాటలతో రప్పించి విఠోబా దర్శనం చేసుకుని తిరిగి వస్తుండగా ఆలయం ముందే నరికి వేయించే ఘాతుకానికి బాజీరావు పాల్పడ్డాడంటే నమ్మశక్యంకాదు. మిగతా లోపాలు ఎన్ని ఉన్నా బాజీరావుకు దైవభక్తి హెచ్చు. తన దాయాది నారాయణరావును తన తల్లిదండ్రులు చంపించిన పాపమే వెంటాడుతున్నదని నమ్మి, దానికి ప్రాయశ్చిత్తం చేసుకునేందుకు పండరిపురంలో అనేక శాంతులూ, క్రతువులూ చేయించిన బాజీరావు మరెక్కడా చోటు దొరకనట్టు మళ్లీ అదే పుణ్యక్షేత్రంలో మనిషిని చంపే మహాపాపానికి ఒడిగట్టాడంటే నమ్మడం కష్టం. బాజీరావుకూ, త్రయంబక్‌జీకి ఆ హత్యలో ప్రమేయం ఉందనడానికి ఎల్ఫిన్‌స్టోన్ వద్ద వీసమెత్తు రుజువులేదు. అయినా - త్రయంబక్‌జీని తక్షణం పట్టుకుని మాకు అప్పగిస్తావా లేదా అని పీష్వా గొంతు మీద కూచున్నాడు.

ఒకవేళ అభియోగం నిజమే అయినా చచ్చినవాడు, చంపినవాడు తన అధికారానికి లోబడవలసిన తన రాజ్య పౌరులే కనుక న్యాయప్రకారం ఆ నేరాన్ని పీష్వాయే విచారించి తగిన నిర్ణయం చేయాలి. ఈ న్యాయ సూక్ష్మాలేవీ తెల్లవారికి పట్టలేదు. తమకు పరిస్థితులు అనుకూలించేంతవరకూ పీష్వాతో మైత్రి నటించి, అతడి అధికారాలన్నిటికీ అంగీకరించినట్టే భ్రమగొలిపి వీలు చూసుకుని జూలు విదిల్చారు. వారి పోరు భరించలేక డెంగ్లేని బాజీరావు నిర్బంధిస్తే 'నీ మీద నమ్మకంలేదు. నీ దగ్గరుంటే తప్పించుకుపోతాడు. కాబట్టి అతణ్ని

తక్షణం మాకు అప్పగించు' అని హేస్టింగ్స్ దొర హుకుం వేశాడు. వల్లె అని డెంగ్లేని వారికి అప్పగిస్తే భారీ కాపలా మధ్య థానా కోటలో నిర్బంధించినా సంవత్సరం తరవాత దొరల కళ్లుగప్పి అతడు తప్పించుకుపోయాడు. తమ చేతగానితనానికి కూడా పీష్వానే నిందించి 'నువ్వే అతణ్ని తప్పించావు. ఎక్కడున్నాడో నువ్వే వెదికి పట్టి మాకు అప్పగించు' అని రెసిడెంటు ఎల్ఫిన్‌స్టోన్ బాజీరావును వేధించాడు. డెంగ్లేను పట్టి తెచ్చేంతవరకూ నీ నాలుగు కోటలనూ, వాటిలోని నీ పరివారాన్నీ తాకట్టుకింద మాకు స్వాధీనపరచమని పట్టుబట్టాడు. ఈ అడ్డగోలు డిమాండుకు పీష్వా సమ్మతించకపోయేసరికి బ్రిటిష్ సేనలతో పూనాను చుట్టుముట్టి, నాలుగు కోటలనూ బలవంతంగా లాక్కున్నాడు. నెల దాటిందో లేదో మళ్లీ వచ్చి 'నీ పద్ధతేమీ బాగోలేదు. మా గవర్నర్ జనరల్‌గారు నీతో పాత ఒప్పందం అవతల పారేసి కొత్తది రాయించుకు రమ్మన్నారు. ఇదిగో ముసాయిదా, సంతకం పెట్టు' అని సతాయించాడు. ఆ ఒప్పందం ఎందుకంటే పీష్వాకు మిగిలిన పవర్లను కూడా లాగేసి గుండుకొట్టి సున్నం బొట్లు పెట్టడానికి! మిగతా మరాఠా సంస్థానాలన్నిటిమీదా పీష్వా హక్కులు వదిలేసుకోవాలనీ, మహారాష్ట్ర వెలుపలి రాజ్యమంతటినీ బ్రిటిష్ వారికి దఖలు పరచాలనీ, బయటి రాజ్యం దేనితోనూ పీష్వా సంబంధాలు పెట్టుకోకూడదనీ, ఏ రాజ్యం రాయబారినీ తన దర్బారులో ఉంచుకోకూడదనీ నూతన పత్రరాజం సారాంశం. ఈ అవమానకరమైన షరతులకు లోబడటం బాజీరావుకు ఇష్టంలేదు. అయినా తల వంచక తప్పలేదు.

1817 జూన్ 13న 'పూనా ఒప్పందం' మీద విధిలేక సంతకం చేసినప్పటినుంచీ దొరల మీద భ్రమలు తొలిగి బాజీరావు వైఖరి మారింది. ఆ సమయంలోనే కంపెనీవారు పిండారీల మీద భీకర యుద్ధం ప్రకటించారు. పిండారీలు దోపిడిగాళ్లన్నది నిజమేకాని ఇంగ్లీషు వారు చిత్రించినట్టు సంఘ విద్రోహ శక్తులేమీ కాదు. శివాజీ, సంతాజీ ఘోర్పడేల కాలం నుంచీ వారు మరాఠా సైనిక వ్యవస్థలో జనాంతిక భాగం. రెగ్యులర్ సైన్యం వెనకే పిండారీల దండు ఉండేది. శత్రువును సైన్యం ఓడించాక ఈ దండు శత్రు శిబిరం మీద పడి అందిన కాడికి దోచుకుని శత్రువును కోలుకోలేని దెబ్బతీసేది. జీతం గీతం లేకుండా దోపిడీలు చేసుకుని బతికినప్పటికీ పిండారీలు కట్టుబాటును మన్నిస్తూ తమ హద్దుల్లో తాము ఉండేవారు. బ్రిటిష్ మాయావుల బారిన పడి సింధియా, హోల్కర్‌ల బలం ఉడిగిపోయాక, కంపెనీతో సైనిక సంధికి లోబడి మరాఠా సామంతులు ఎవరికి వారు సైన్యాలను రద్దు పరచుకున్నాక పనిలేకుండా పోయిన వేలాది సైనికులు పోయి పిండారీల్లో కలిశారు. పీష్వాలకు పెత్తనం పోయి, అడిగేవారు లేకపోవటంతో వెనుకటి కట్టుడులను ధిక్కరించి పిండారీలు యథేచ్ఛగా ఊళ్ల మీద పడి దోచుకోసాగారు. దానివల్ల శాంతి భద్రతల సమస్య ఉత్పన్నమైనమాట నిజమే. అయినా పిండారీల మీద దొరలు తుపాకులెత్తింది మాత్రం ప్రజాభద్రత మీద ఆరాటంతో కాదు.

The Pindari war was only a grand British plan for extinguishing all vestiges of the Maratha Power and establishing unquestioned British Supremacy throughout India.

[*New History of the Marathas*, **G.S. Sardesai**, *Vol.III. p.483*]



(మరాఠా శక్తికి సంబంధించి మిగిలిన లవలేశాలను కూడా రూపుమాపి, ఇండియా అంతటా తిరుగులేని బ్రిటిష్ సర్వంసహాధిపత్యాన్ని నెలకొల్పటానికి ఆంగ్లేయులు పన్నిన బృహత్పథకంలో భాగమే పిండారీ యుద్ధం)

నిగూఢ రాజకీయ లబ్ధిని ఆశించి సాగించిన పిండారీ యుద్ధంలో తమతో చేయి కలపమని ఇంగ్లీషువారు పీష్వాను ఒకందుకు కోరితే ఆ అవకాశాన్ని పీష్వా ఇంకొకందుకు ఉపయోగించుకున్నాడు. తాను ఊరకున్నా తెల్లవారు తనను వదిలిపెట్టేట్టు లేరు కనక తానే వారి పని పట్టటం మంచిదని తలిచి, పిండారీ యుద్ధానికి సన్నాహాల పేరిట భారీగా సేనలను సమీకరించుకున్నాడు. త్రయంబక్ డెంగ్లేను ఎగదోసి, హోల్కర్ సేనాని అమీర్‌ఖాన్‌ను, సతారా ఛత్రపతిని... పట్వర్ధన్, రాస్తె, పాన్సే తదితర మరాఠా జాగీర్దార్లనూ, లాహోర్ రంజిత్‌సింగ్‌నూ, నేపాల్ ప్రముఖులనూ కూడగట్టి, బర్మారాజు దగ్గరికి రాయబారాలంపి, బాజీరావు పెద్దఎత్తునే ప్రతిఘటనకు ప్రయత్నించాడు. దేశీయ శక్తులు, సరిగా కలిసిరాకపోవడం వల్లనేమి, పీష్వా దర్బారులో చెదపురుగుల్లా ప్రబలిన ద్రోహుల ద్వారా పీష్వా గుట్టుమట్లు బ్రిటిష్ వారికి ముందే తెలిసిపోవడంవల్లనేమి, బాజీరావుకు వ్యవహార దక్షత, సైనిక అనుభవం లేకపోవడంవల్లనేమి - ఆఖరి దశలో జరిగిన ఈ జాతీయ ప్రతిఘటన యత్నం కూడా నిష్ఫలమైంది. బాజీరావు తల ఎగరేసి పూనాలోని బ్రిటిష్ రెసిడెన్సీ మీదనైతే దాడిచేసి నిప్పంటించగలిగాడు. కాని ఆ తరువాత రెండు వైపుల నుంచీ కాలమేఘంలా కమ్ముకు వచ్చిన బ్రిటిష్ సేనలను ఎదుర్కొనలేక, పోరాటాన్ని మధ్యలోనే ఆపేసి, రాజధాని వదిలి పారిపోయాడు.

ఇక- తెల్లవారు ఆగుతారా? "పీష్వాగా పరిపాలనకు బాజీరావు పనికిరాడు. అతడి అధికారాలన్నీ మేము లాగేసుకుంటున్నాం! అతడికి మారుగా సతారాలోని ఛత్రపతికి సముచిత గౌరవ ప్రతిపత్తి కల్పిస్తాం. ఇంతవరకూ బాజీరావు సేనలో ఉన్నవారందరూ అతడిని తక్షణం వదిలిపెట్టి మాకు రిపోర్టు చేయకపోయారో - అంతు చూస్తాం. ఖబడ్దార్" అని చరిత్ర ప్రసిద్ధికెక్కిన చాటింపు వేసి పీష్వా కచేరిపై బ్రిటిష్ జండా ఎగరేశారు. ఆ దెబ్బతో బాజీరావు మద్దతుదారులు చాలామందికి కాళ్లు చల్లబడి అతణ్ని ఒగ్గేశారు. వెంటపడి పీష్వాను పట్టుకోవటానికి ఇంగ్లీషు అశ్వికదళం బయలుదేరింది. దానికి చిక్కకుండా పరుగుపెడుతూ, అడవుల్లో చెట్లు పుట్టల నడుమ బేలగా తిరుగుతున్నప్పుడు బాజీరావు పడిన కష్టాలనే ఈ వ్యాసం మొదట్లో పేర్కొన్న జానపద గేయంలో ప్రస్తావించింది.

పిండారీల పేరు పెట్టి మరాఠా శక్తిని నిర్మూలించటానికి ఇంగ్లీషు వారు సాగించిన మూడో మరాఠా యుద్ధంలో చిత్తుగా ఓడి, ఎటు పరుగెడితే అటు కంపెనీ దళాలు తరుముకు రాగా దిక్కుతోచక, తల దాచుకునే తెరువు దొరకక, అన్ని ప్రయత్నాలు విఫలమైన మీదట బాజీరావు ఇండోర్ సమీపంలో మాల్కోమ్‌కు లొంగిపోయాడు. 'నీ రాజ్యం నీకిచ్చే ప్రశ్న లేదు. నీ రాజ్యంలో నిన్ను ఉండనిచ్చేదీ లేదు. మాకు షరతులు పెట్టే స్థితిలో నువ్వు లేవు. అంతా మీ దయ అని చెప్పి కంపెనీ వారి శరణు వేడు. ఏడాదికి ఎనిమిది లక్షల రూపాయల భరణమైతే నీ మొగాన పడవేస్తాం. ఉన్నపళాన బయలుదేరి ఉత్తరాదిన కాశీకో, మరో చోటికో పోయి బతుకు. నువ్వు తిన్నగా అక్కడికి చేరాక నీ కుటుంబాన్ని అక్కడికి పోనిస్తాం. ఇరవై నాలుగు గంటల్లో ఈ షరతులకు ఒప్పుకోకపోతే నీ అంతు చూస్తాం' అన్నాడు

పరస్పరం పీకలు కోసుకునే అధోగతి నుంచి జాతి జీవనాన్ని శాసించే ఉచ్ఛస్థితికి మరాఠాలు చేరిన అద్భుత పరిణామానికి బాలాజీ నిరంతర వ్యూహాత్మక పరిశ్రమ, నిరుపమాన కార్యదక్షతలు పునాది. తన రాజు బలమేమిటో, బలహీనత ఏమిటో అతడికి బాగా తెలుసు. మారిన పరిస్థితుల్లో ప్రయోజనకారి కాని అష్ట ప్రధాన్ వ్యవస్థను పక్కన పెట్టి, తాను నిర్మించిన ప్రత్యామ్నాయ వ్యవస్థలో దేశభక్తి, రాజభక్తి, సంప్రదాయ అనురక్తి, ఉమ్మడి వారసత్వ స్ఫూర్తి లోపిస్తే ఇసుకతో పేనిన తాడు బాపతే అవుతుందని ఆయన ఎరుగును. అందుకే సమాఖ్యలో కలిసిన యోధులు ఎవరి ప్రాంతంలో వారు ఆధిపత్యం చలాయిస్తూనే ఉమ్మడిన సాహురాజు సార్వభౌమత్వాన్ని అంగీకరించేట్టూ... ఉత్తర్వులు, రాతకోతలు అన్నీ ఆ రాజు పేరు మీదే జరిగేటట్టూ... ప్రతి ఒప్పందానికీ, ప్రతి దండయాత్రకూ ఆయన అనుమతి తీసుకునేట్టూ, నాణేలను కూడా ఆయన పేరునే ముద్రించేటట్టూ పీష్వా బాలాజీ అంగీకరింపజేశాడు. గొప్ప సర్దార్లందరినీ సాహు పక్షాన కూడగట్టి, దమాజీ థోరాట్‌లాంటి బందిపోట్ల దాష్టీకాన్ని బల ప్రయోగంతో అణచివేసి, రాజ్యంలో శాంతి, స్థిరత్వాలను గణనీయంగా మెరుగుపరిచాక బాలాజీ జాతీయ స్థాయిలో ఆధిపత్యం దిశగా దృష్టి సారించాడు.

అప్పటికి సాహుది ఇంకా మొగలు సామ్రాజ్యంలో పాళెగాడి ప్రతిపత్తే. దానిని మార్చి, ఒకప్పుడు శివాజీ ఆధిపత్యం వహించిన 'స్వరాజ్య' మండల మంతటి మీదా అతడికి సర్వంసహాధిపత్యం సమకూర్చాలని బాలాజీ పీష్వా ఉవ్విళ్ళూరాడు. కాలం కూడా కలిసివచ్చింది. ఔరంగజేబు మరణానంతరం కీలుబొమ్మలాటలో భాగంగా ఆనాటికి ఢిల్లీ రంగం మీద ఫర్రుఖ్‌సియర్ చక్రవర్తిత్వం వెలిగిస్తున్నాడు. వాస్తవాధికారం యావత్తూ సయ్యద్ సోదరుల చేతుల్లో ఉండేది. ఆ సోదరుల ఉడుంపట్టు నుంచి బయటపడాలన్న ప్రయత్నంలో వారిలో చిన్నవాడు హుసేన్ అలీఖాన్‌ను దక్కనుకు సుబేదారుగా పంపాడు. తనకు ముందు ఆ పదవిలో ఉన్న నిజాం-ఉల్-ముల్క్ లాగే హుసేనలీఖాన్ కూడా మరాఠాల పట్ల కరకుతనం చూపి కాళ్ల కింద నలిపెయ్యాలని శాయశక్తులా పోరాడాడు. అది అతడివల్ల కాలేదు. మరాఠా వీరుడు ఖండేరావు దాభాడే అతణ్ణి ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్లు తాగించాడు. ఆ సంగతి తెలిసి చక్రవర్తి మహా సంతోషపడి, తనకు పక్కలో బల్లెం లాంటి సుబేదారును విడవకుండా పీడించమని సాహు రాజును పురికొల్పాడు. అటు ఖండేరావు సైనిక పోటుకూ, ఇటు చక్రవర్తి వెన్నుపోటుకూ మధ్య నలిగిన హుసేన్ అలీ వేరే దారి లేక సాహుతో రాజీకొచ్చాడు. ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకుని బాలాజీ పీష్వా మంతనాల మంత్రాంగాన్ని సమర్థంగా నడిపి సాహుకు అనుకూలంగా ఒడంబడిక కుదిర్చాడు. పూర్వం శివాజీ 'స్వరాజ్యం'లో భాగమైన ప్రాంతాలన్నిటినీ కోటలతో సహా సాహుకు తిరిగి స్వాధీనపరిచేట్టూ - అందుకు ప్రతిఫలంగా సాలుకు పది లక్షల రూపాయల కప్పం సాహు చెల్లించేట్టూ - దక్కనులోని ఆరు రాష్ట్రాల నుంచీ చౌథ్, సర్దేశ్‌ముఖి సుంకాలను సాహు వసూలు చేసుకునేట్టూ - 15 వేల అశ్వసేనను చక్రవర్తి సేవ నిమిత్తం సాహు సొంత ఖర్చుతో పోషించేట్టూ - సుంకాలు వసూలు చేసుకునే ప్రాంతాలన్నిటా అసాంఘిక శక్తులను అణచి శాంతిని కాపాడే బాధ్యతను మరాఠాలే స్వీకరించేట్టూ ఉభయపక్షాలకు అంగీకారం పొసగింది.



ఒప్పంద పత్రం మీద సుబేదారు సంతకం చేసి, దానిని ధ్రువీకరిస్తూ ఫర్మానా జారీ చేయవలసిందిగా చక్రవర్తిని కోరాడు. ఫర్రుఖ్‌సియర్ వీల్లేదన్నాడు. దక్కన్‌లోని ఔరంగాబాద్, బేరార్, ఖాందేశ్, బీదర్, గోల్కొండ, బీజాపూర్ రాజ్యాలు ఆరింటిలోనూ ప్రజల నుంచి రక్షణ సుంకంగా 'చౌథ్' వసూలు చేసుకునేందుకు మరాఠాలను అనుమతించడమంటే మొత్తం దక్కనుపై మొగలుల సార్వభౌమిక హక్కును వదులుకోవడమే అవుతుందనీ, తనను నానావిధాల వేధిస్తున్న సయ్యద్ సోదరులే దానివల్ల బాగుపడతారనీ భావించి - ఆరు నూరయినా ఫర్మానా ఇచ్చేది లేదన్నాడు. సయ్యద్ సోదరులను ఇంకా ఉపేక్షిస్తే లాభం లేదని తలచి వారిని అడ్డు తొలగించుకునేందుకు ఏకంగా యుద్ధానికే సిద్ధమయ్యాడు.

ఆ సంగతి తెలిసి వెంటనే ఢిల్లీకి రమ్మని అబ్దుల్లాఖాన్ దక్కన్‌లోని తమ్ముడిని పిలిచాడు. అదిగో -ఆ సందర్భంలో హుస్సేనలీఖాన్ కోరిన మీదట అతడికి సాయంగా 50 వేల సేనను వెంటపెట్టుకుని బాలాజీ పీష్వా ఢిల్లీకి తరలి వెళ్ళాడు. హోరాహోరీగా వీధి పోరాటాలు జరిగాయి. చివరికి పలాయనం చిత్తగించిన ఫర్రుఖ్ సియర్‌ను సయ్యద్ సోదరులు వెంటాడి పట్టుకుని, కళ్లు పొడిచి ఖైదు చేశారు. కొంతకాలానికి ప్రాణమూ తీశారు. పరిస్థితులు కుదుట పడేంతవరకూ బాలాజీ పీష్వా సైన్యంతో ఢిల్లీలోనే ఉన్నాడు. కొత్త చక్రవర్తిగా సయ్యద్ సోదరులు పట్టంగట్టిన మహమ్మద్‌షా నుంచి మొత్తం దక్కన్‌పై మరాఠాలకు 'చౌథ్' వసూలు హక్కు సహా ఒప్పందంలోని అన్ని అంశాలను ధ్రువీకరిస్తూ అధికార ఫర్మానా పొందాడు. అప్పటిదాకా మొగలుల నిర్బంధంలో ఉన్న సాహు తల్లిని, ఇతర బంధువులను వెంటబెట్టుకుని 1719 మేలో బాలాజీ విశ్వనాథ్ స్వరాజ్యానికి తిరిగి వచ్చాడు. సాహు కృతజ్ఞతా భావంతో అతడికి అఖండ స్వాగతమిచ్చి అక్కున చేర్చుకున్నాడు.

ఢిల్లీలో రాచకార్యాన్ని జయప్రదంగా పూర్తి చేసుకుని తిరిగివచ్చి సంవత్సరం తిరక్కుండా బాలాజీ విశ్వనాథ్ జబ్బుపడి 1720 ఏప్రిల్ 1న ప్రశాంతంగా కన్నుమూశాడు.

ఛత్రపతి శివాజీ తరవాత మరాఠా రాజ్యాన్ని పునః ప్రతిష్ఠించిన కీర్తి నిస్సందేహంగా బాలాజీ విశ్వనాథ్‌దే. ఛత్రపతుల ప్రాభవం సన్నగిల్లిన దరిమిలా శతాబ్దానికి పైగా జాతి రాజకీయ గతిని ప్రభావితం చేసిన పీష్వాల ఉజ్వల శకానికి ఆవిష్కర్తా ఆయనే. విశేషమేమిటంటే గొప్ప ఖ్యాతి గడించిన ఇంతటి మహానుభావుడు భావితరాలకు మాత్రం 'మరాఠా రాజ్య ద్వితీయ వ్యవస్థాపకుడి'గా కంటే బాజీరావు తండ్రిగానే ఎక్కువ పరిచితుడు.



మాల్కోం. తలకాయ తీసి జేబులో దాచుకుని బాజీరావు 'ఇక మీ దయ' అన్నాడు.

1818 జూన్ 3న పెట్టమన్నచోట సంతకం పెట్టిన వెంటనే బాజీరావు 600 మంది అశ్వికులు, 200 మంది సిపాయిలు వెంట రాగా నర్మద దాటిపోయి చివరికి కాన్పూర్ సమీపంలోని బిత్తూరు వద్ద స్థిరపడ్డాడు. రాజ్యం పోయినా మిత్రుడు మాల్కోం పుణ్యమా అని భరణం బాగానే ముట్టింది. రాజకీయాలు వదిలేసి, పూజలూ వ్రతాలూ చేసుకుంటూ అక్కడే మూడు దశాబ్దాలకు పైగా గడిపి, 1851 జనవరిలో బాజీరావు నిరర్థక జన్మను చాలించాడు. ఛత్రపతి, పీష్వాల వంశాల్లో ఉత్తములందరికీ చిన్న వయసులోనే మృత్యువు తరుముకు రాగా అధముడైన బాజీరావు మాత్రం అందరి ఆయుస్సూ పోసుకుని 76 ఏళ్లు జీవించటం విధి వైచిత్రి.

పీష్వాను గెంటేసి సతారాలో ఛత్రపతి జండాను కంపెనీ కుటిలాత్ములు ఎగుర వేయించినంత మాత్రాన మళ్లీ ఛత్రపతులకు దశ తిరిగిందేమీ లేదు. పీష్వాను గెంటినందుకు జనం కోపగించకుండా కంటి తుడుపుగా సతారాలో నామమాత్రపు గద్దెపై ఛత్రపతి ప్రతాప్‌సింగ్‌ను కొంతకాలం ఊరేగించారు. కంపెనీవారిపై కుట్ర చేస్తున్నాడని నిందవేసి అతడిని కాశీకి గెంటేసి, అతడి సోదరుడు షాజీకి పట్టంగట్టారు. అతడు నిస్సంతుగా మరణించడంతో 1848 ఏప్రిల్‌లో సతారా సంస్థానాన్ని కూడా ఇంగ్లీషు పులుసులో కలిపేసుకున్నారు.

అలా ముగిసింది మరాఠాల కథ.



# ఏమిటి గొప్ప?

ఎప్పుడో ఎక్కడో ఒక వీరుడు లేస్తాడు. పాలకుడిపై తిరగబడో, పోరాడో రాజ్యాన్ని జయిస్తాడు. లేదా సాహసుల మూకను కూడగట్టి బలహీన రాజ్యం పైబడి అందిన మేరకు ఆక్రమిస్తాడు. ఎలాగైతేనేమి ఉన్న ప్రభుత్వం పోయి కొత్తది మొదలవుతుంది. స్థాపకుడు, అతడి వారసులు బుద్ధినో, బుద్ధిహీనతనో యథాశక్తిగా ప్రదర్శించాక మూల పురుషుడి పుణ్యాన్నిబట్టి, లేక వారసుల పాప ఫలాన్నిబట్టి కొన్నేళ్లకో, కొన్ని తరాలకో రాజ్యం బలహీనపడి పరాధీనమవుతుంది. కత్తుల దారిన వచ్చిన వారు కత్తుల బారినే పడతారు. వ్యక్తిగత స్వార్థంకోసమో, రాజ్యకాంక్షతోనో అధికారం గుంజుకున్న వారికి కడకు ఏ గతి పట్టినా, ఏ రాజ్యం ఎలాపోయినా ప్రజలకు పెద్దగా పట్టదు.

వేల సంవత్సరాల చరిత్రలో భారతదేశాన ఎన్నో రాజ్యాల్లో లెక్కలేనన్ని ప్రభుత్వాలు పుట్టిగిట్టాయి. ఒకప్పుడు ఉజ్వలంగా వెలిగిన సామ్రాజ్యాలు సైతం కాలక్రమంలో తలిచే దిక్కులేకుండా మట్టికొట్టుకుపోయాయి. ఇంత దాకా మనం చర్చించిన మరాఠాల కథా ఈ కోవలోనిదేనా? లేక చరిత్రకెక్కిన మిగతా సామ్రాజ్యాలకంటే భిన్నంగా పరిగణించి, కలకాలం గుర్తుంచుకోదగిన విశేషాంశాలేవైనా మరాఠా అనుభవంలో ఉన్నాయా?

అప్పట్లో మరాఠాల పేరు చెబితే దేశంలో చాలామందికి అభిమానం కంటే కంపరమే ఎక్కువగా కలిగేది. మెరుపులా కదిలే గుర్రాల మీద వచ్చి, ఊళ్ల మీద పడి, జనాన్ని పీడించి అందిన కాడికి దోచుకునే దుండగుల దండే కళ్లముందు మెదిలేది, మరాఠాలు దోపిడీలు చేసిన మాట నిజమే. యుద్ధానికయ్యే ఖర్చును యుద్ధం నుంచే రాబట్టాలన్న విధానంతో, జయించిన శత్రు ప్రాంతాలను కొల్లగొట్టే పద్ధతిని శివాజీయే ప్రవేశపెట్టాడు. అయితే విచ్చలవిడి దుర్మార్గాలను అనుమతించక అందులోనూ ఒక కట్టుబాటును, క్రమపద్ధతిని పాటింపజేశాడు. శివాజీ కాలపు నియమ నిబద్ధత అనంతర కాలంలో సన్నగిల్లిన సంగతి యథార్థం. ముఖ్యంగా పీష్వాల హయాంలో అదేమి శాపమోగాని ఎన్ని రాజ్యాలు జయించినా,

ఎంత సంపద కొల్లగొట్టినా ఖజానా ఎప్పుడూ ఖాళీయే. అప్పుల బాధలు పెరిగి, సైన్యానికి అనేక నెలలు జీతాలు బకాయిపడి, అన్య ప్రాంతాలనుంచి చౌథ్‌లూ గ్రట్రా సక్రమంగా వసూలుకాక సతమతమై సింధియా, హోల్కర్ తదితరులు తమకు ప్రాబల్యంగల ప్రాంతాల్లో సంపన్నులను దోచుకుని, జనాన్ని పీడించిన సందర్భాలు అనేకం ఉన్నాయి. యుద్ధాల సమయంలో దారిలోని జనావాసాలపై (రెండో మైసూరు యుద్ధకాలంలో శృంగేరి మఠంపై జరిపిన విధంగా) ఆగడాలు సరేసరి. దాంతో మరాఠాల దండు వస్తున్నదంటేనే బయటి ప్రాంతాల వారు హడలిపోయేవారు. ఈ వైనాలు విని, ఇంగ్లీషు చరిత్రకారుల రాతలు చదివి మరాఠాలంటే దొంగలు, బందిపోట్లు అన్న అభిప్రాయం ఏర్పరచుకున్న వారు దేశంలో చాలామందే ఉన్నారు. మరాఠా దండ్లు అప్పుడప్పుడూ దోపిడీలు చేసిన మాటా, కొండొకచో అవి హద్దుమీరి అఘాయిత్యాలు జరిగిన సంగతీ నిజమే. కాని అలాగని మరాఠాలందరినీ బందిపోట్లుగా దుస్సాహసికులుగా ముద్ర వేయటానికి వీలులేదు. దోపిడి దొంగలు, దుస్సాహసికులు మహా సామ్రాజ్యాన్ని నిర్మించలేరు. ఒకవేళ నిర్మించినా మఖలో పుట్టి పుబ్బలో మాడుతాయే తప్ప కొండల్లాంటి శత్రువులను ఢీకొని, వరస దాడులకు తట్టుకుని అనేక తరాల పర్యంతం అవి నిశ్చలంగా నిలబడలేవు.

ఔరంగజేబు మరణానంతరం మొగల్ సామ్రాజ్యం బీటలు వారాక తల ఎగరేసి స్వాతంత్ర్యం ప్రకటించుకున్న బెంగాల్, కర్నాటక, అయోధ్య, దక్కన్ తదితర మొగల్ సుబేదార్ల లాంటి వారు కాదు మరాఠాలు, మధ్యాహ్నపు సూర్యుడిలా మొగలాయీ ప్రభ వెలిగిపోయిన సమయంలోనే ఔరంగజేబు అంతటి వాడితో తలపడి, రెండు తరాలపాటు భీకరంగా పోరాడి, విషమ పరీక్షలకు తట్టుకుని నిలబడిన ఘనకీర్తి వారిది. సైనిక సాహసాలు చేసి రాజ్యాలు స్థాపించిన వారు ఎందరో ఉన్నా మరాఠాల వలె జనశక్తి వెన్నుదన్నుగా నిలిచిన వారు దేశ చరిత్రలో అరుదు.

ఉత్తరాదిన జయపాల్ మొదలుకుని సంగరాణా వరకూ ఎందరో వీరులు ఎన్నో తరాల్లో ఎంత గట్టిగా పోరాడినా ముస్లిం దురాక్రమణల వెల్లువను నిరోధించలేకపోయారు. పౌరుషానికి పరాక్రమానికి ప్రతిరూపమనుకున్న రాజపుత్ర యోధులే ఒక దశలో అలసిపోయి, పరిస్థితితో రాజీపడి, ముస్లిం పాలకులకు కన్యాదానాలు చేసి, మొగల్ దర్బారులో తాబేదారులయ్యారు. హిందువుల పవిత్ర పుణ్యక్షేత్రాలు ధ్వంసమయ్యాయి. పురాతన దేవాలయాలు నేల మట్టమయ్యాయి. దేశీయ కళలు, విద్యలు నాశనమయ్యాయి. హిందువుల మనుగడకు, మతాచారాలకు తీవ్ర విఘాతం కలిగింది. ప్రతి జంధ్యపు పోగు మీద మూడున్నర రూపాయల జిజియా పన్ను పడింది. మెడ మీద కత్తి పెట్టి నోట్లో గోమాంసం కుక్కి, వేలూ లక్షల సంఖ్యలో హిందువులను బలవంతంగా ఇస్లాం మతంలోకి మార్చటం విచ్చలవిడిగా సాగింది. ఉత్తర భారతాన ముఖ్యమైన ఏ నగరానికి, ప్రసిద్ధమైన ఏ క్షేత్రానికి వెళ్లి చూసినా హిందూ దేవాలయాలకు, హిందూ శిల్పకళలకు, హిందూ ప్రాసాదాలకు, హిందూ తాళపత్ర గ్రంథాలకు, హైందవ శాస్త్రాలకు వాటిల్లిన భయానక విధ్వంసం తేటతెల్లమవుతుంది. విశేషమేమిటంటే ఉత్తరాదిన నిరాఘాటంగా సాగిన ఇస్లామిక్ దాడికి వింధ్యకు దక్షిణాన అడ్డుకట్ట పడింది. అల్లావుద్దీన్ ఖిల్జీ, మాలిక్ కాఫుర్‌ల దండయాత్రలు తాత్కాలిక ప్రభావం మాత్రమే చూపాయి. మహమ్మద్ బిన్ తుగ్లక్ ఎన్ని బుసలుకొట్టినా దక్షిణ దేశం వశం కాలేదు. విదేశీ దురాక్రమణదారుల మూలంగా భారతీయ ధర్మానికి, సంస్కృతికి, హిందూ మతానికి పట్టిన



దారుణ దుర్గతికి మిగతా దేశవాసుల వలెనే దాక్షిణాత్యులకు గుండెలు మండాయి. ధర్మానికి కలిగిన గ్లానిని పరిహరించి పూర్వవైభవం పునరుద్ధరించాలన్న తపన శివాజీ పుట్టుకకు కొన్ని వందల సంవత్సరాల ముందునుంచే జాతి జనుల్లో వ్యక్తావ్యక్తంగా రేకెత్తింది.

సహ్యాద్రి అడవుల్లో ఉన్నట్టుండి భగ్గుమనే కార్చిచ్చులా దేశంలో మరాఠా శక్తి యాదృచ్ఛిక పరిస్థితుల్లో శివాజీ రూపంలో ఆకస్మాత్తుగా ప్రజ్వరిల్లిందని గ్రాంట్ డఫ్ లాంటి ఆంగ్ల చరిత్రకారులు అభివర్ణించారు. అయితే ఆ అద్భుత ప్రజ్వలన వెనుక ఎందరో సాధుసంతులు, తత్వవేత్తలు, కవులు, ప్రవక్తలు, సంస్కరణలు అనేకానేక తరాలుగా సామాజిక అసమానతలపై, అగ్రవర్ణాల వారి దురహంకారాలపై తిరగబడి భక్తి మార్గంలో అన్ని వర్గాల వారినీ సమీకరించి అలవరచిన ఉత్తమ సంస్కారం ఉంది. సుప్రసిద్ధ మేధావి మహాదేవ్ గోవింద రణడే అన్నట్టు-

The foundation was laid broad and deep in the hearts of the whole people... It was the upheaval of the whole population, strongly bound together by the common affinities of language, race, religion and literature... It was a national movement in which all classes cooperated... It had deeper hold on the vast masses of the rural population. Cowherds and shepherds, brahmans and non-brahmans, even musalmans felt its influence and acknowledged its power.

[*Rise of the Maratha Power*, **M.G.Ranade,** *P.3*)

(ప్రజలందరి హృదయాల్లో గాఢంగా విస్తృతంగా దీనికి పునాది పడింది... భాష, మతం, సారస్వతపరంగా ఉమ్మడి వారసత్వపు అనుబంధం పెనవేసుకున్న మొత్తం జనాభాలో పుట్టిన ఆకస్మిక అలజడి అది. అన్ని తరగతుల వారూ సహకరించిన ఈ జాతీయోద్యమం గ్రామీణ ప్రజానీకంపై గట్టి పట్టు చూపింది. గొడ్లు కాసుకునేవారు, గొర్రెల కాపరులు, బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు, ఆఖరికి ముసల్మాన్లు కూడా దీని ప్రభావానికి లోనై దీని శక్తిని గుర్తించారు.)

మరాఠా స్వరాజ్యాన్ని స్థాపించింది, కాలక్రమంలో మహాసామ్రాజ్యంగా దాన్ని విస్తరించింది కులీన ప్రభు వర్గాల నాయకత్వంలోనే అయినా ఈ బృహత్ యత్నాల్లో అన్ని సామాజిక వర్గాల వారూ ఐచ్ఛికంగా సహకరించారు. మరాఠా సేనలు శత్రు రాజ్యాల గుండెల్లో గుర్రాలను పరుగెత్తించినా ఆ సైన్యంలో ఉన్నది ఎక్కువగా మామూలు జానపదులే. మట్టి పిసుక్కుని బతికే సామాన్య జీవులతోనే శివాజీ గొప్ప పోరాట శక్తిని నిర్మించాడు. ఏడాదిలో ఆరు నెలలు జాతీయ సైన్యంలో చేరి దండయాత్రలలో పాల్గొని, వానాకాలం వస్తున్నదనగా వెనక్కి వచ్చి స్వగ్రామాల్లో పొలాలు సాగుచేసుకోవటం మరాఠా ప్రజలకు రివాజు. దూర దేశాల్లో జాగీర్లు పొందిన దండ నాయకులు కూడా ఆ గౌరవం కంటే స్వస్థలాల్లో దేశ్‌ముఖ్‌లుగా, పాటిళ్లుగా తమకున్న హోదాకు ఎక్కువ విలువ ఇచ్చేవారు. ప్రజాబలం అండ దండిగా ఉన్నది కాబట్టే - ఏ ఒక వ్యక్తి ప్రయోజకత్వంవల్లో పైకి వచ్చి, అతడు కనుమరుగైన మూణ్నాళ్లకే అంతరించిన అనేక రాజ్యాలవలె కాకుండా ఏకంగా పది తరాలపాటు మరాఠా రాష్ట్ర కూటమి నాయకత్వలోపం రాకుండా అఖండంగా వెలుగొందింది. రాజ్యం కోసం తగవులు, జాతి వైరాలు, వారసత్వ పోరాటాలు అనేక

పర్యాయాలు తలెత్తాయి. అయినా సింహాసనం కోసం కన్నతండ్రిని ఖైదుచేసి, సొంత అన్నలను నరికివేసిన మొగలాయీ తరహా ఘాతుకాలు మరాఠాలు ఎరుగరు.

పశ్చిమ మహారాష్ట్రలో మొదలై, మధ్య దక్కను, కర్నాటకల దాకా విస్తరించి దక్షిణాన తంజావూరు నుంచి ఉత్తరాన ఢిల్లీ దాకా ఆధిపత్యం సంపాదించి, యాభై ఏళ్లపాటు ఢిల్లీ పాదుషాలనే కీలుబొమ్మలుగా ఆడించగలిగిన మరాఠాల ప్రాభవానికి ఎదురు నిలవ గలిగిన శక్తి అప్పట్లో దేశంలో ఏదీ లేదు. అంతటి మహా సామ్రాజ్యం వేరొకరి చేతుల్లో ఉంటే నిరంకుశంగా చెలరేగి కన్నుమిన్ను కానకుండా నియంతలుగా విర్రవీగేవారే. నియంతృత్వ స్థాపనకు అన్ని అవకాశాలూ ఉన్నా అటువైపు ఆలోచించకుండా ఆధునిక ఫెడరల్ వ్యవస్థ తరహాలో రాష్ట్ర కూటమిని నెలకొల్పి, అందులోని ప్రతి భాగస్వామికీ తన పరిధిలో సంపూర్ణ స్వయం ప్రతిపత్తినిచ్చి స్థూలమైన మార్గనిర్దేశనానికి, ముఖ్య వ్యవహారాల నియంత్రణకు మాత్రమే పీష్వాలు పరిమితమవటం ఆషామాషీ విషయం కాదు. ఉత్తరాదిన వారు సాగించిన కార్యకలాపాల్లో మిగతా జాతులనూ, ఇతర రాజ్యాలనూ అణగదొక్కి, తమ సామ్రాజ్యాన్ని స్థిరపరచుకోవాలన్న కాంక్షకంటే మహమ్మదీయుల కబ్జానుంచి కాశీ, ప్రయాగ, మధుర, హరిద్వార్, కురుక్షేత్ర వంటి పవిత్ర హిందూ క్షేత్రాలను విడిపించాలన్న ఆరాటమే ఎక్కువగా కనిపిస్తుంది. పుణ్య క్షేత్రాలను హిందువులకు తిరిగి అప్పగిస్తూ, గోవధను సర్వత్రా నిషేధిస్తూ ఢిల్లీ పాదుషా నుంచి ఫర్మానాలు పొందాలని మహాద్‌జీ సింధియాకు నానాఫడ్నవిస్ అనేక లేఖలు రాశాడు. తలచుకుంటే తామే ఢిల్లీ సింహాసనం మీద కూచుని కోరుకున్న ఫర్మానాలను స్వయంగా జారీచేయగలిగి కూడా కేవలం పాదుషా ప్రతినిధి హోదాలో తృప్తి పడి... అధికారమే చెల్లని చక్రవర్తి ఇచ్చిన నియామక పత్రాలను పుణెకి తీసుకొచ్చి ఊరేగించుకున్న మరాఠాలను చూస్తే ఈ కాలంలో మనకు నవ్వొస్తుంది. ఔరంగజేబు తరహా ప్రయోజకత్వంకంటే మరాఠాల అమాయకత్వమే ఒక రకంగా మంచిది.

మహారాష్ట్రకు వెలుపల తమకు ప్రాబల్యం చిక్కిన రాజ్యాల్లో స్థిరమైన పరిపాలన చేసి ప్రజల సమస్యలు పట్టించుకోవటంకన్నా 'చౌథ్' వసూళ్లకోసం స్థానిక ప్రభువులనూ, ప్రజలనూ పీడించటం మీదే మరాఠా సర్దార్లు ఎక్కువ శ్రద్ధ చూపారన్న ఆక్షేపణ లేకపోలేదు. అది పూర్తిగా సత్యదూరమనలేము. అయితే బాధ్యతారహితంగా వ్యవహరించి ప్రజల ఉసురుపోసుకున్న వారు కొందరున్నట్టే ధర్మనిరతితో రాజ్యమేలి ప్రజల్ని కన్నబిడ్డల్లా చూసుకున్న పాలకులూ మరాఠాల్లో ఉన్నారు.

ఉదాహరణకు జగమెరిగిన మహాసాధ్వి అహల్యాబాయి హోల్కర్.

ఇండోర్ రాజధానిగా రాజ్యమేలిన మరాఠా సర్దారు మల్‌హర్‌రావు హోల్కర్‌కు కుమారుడయిన ఖండేరావు భార్య అహల్య. ఆమె 29వ ఏట (1754) సూరజ్‌మల్ జాట్‌పై యుద్ధంలో భర్త మరణించాడు. ఆచారం ప్రకారం సహగమనానికి అన్ని ఏర్పాట్లు చేసుకున్నాక ముసలి మామగారు దీనంగా ప్రాధేయపడ్డ మీదట ఆ ప్రయత్నాన్ని విరమించుకుని, 9 ఏళ్ల మైనర్ కుమారుడికి పట్టంగట్టి అతడి పనుపున అహల్యాబాయి రాజ్యభారం మోసింది. ఆ కొడుకు వ్యసన లోలుడై కొద్దికాలానికి కన్ను మూశాడు. అదే సమయంలో అహల్య మామగారు పోయాడు. ఇక అహల్యకు మిగిలింది ఏకైక కుమార్తె. ఆమె కుమారుడిని రాజ్యానికి వారసుణ్ని చేద్దామనుకుంటే ఆ మనవడు చిన్న వయసులో చనిపోయాడు. ఆ దుఃఖం భరించలేక అల్లుడు గుండె పగిలి మరణించాడు. అతడితో కుమార్తె సహగమనం



చేసింది. ఇలా నా అనుకున్న వాళ్లందరూ తన కళ్లముందే దాటిపోగా ఏకాకి అయి కూడా గుండె రాయి చేసుకుని అహల్య రాజ్యాన్ని చక్కగా పాలించి చరితార్థురాలైంది. దైవభక్తి, ఆధ్యాత్మిక చింతన నిశ్చలంగా ఉన్నాయి కాబట్టి దుఃఖాలకు ఓర్చుకుని, రాజ్యాన్ని శివార్పణం చేసి దేవుడి ప్రతినిధిగా, ధర్మకర్తగా 1795లో 70వ ఏట కన్ను మూసేంతవరకూ మూడు దశాబ్దాలపైగా పరిపాలన సాగించింది. దేశమంతటా పవిత్ర హిందూ దేవాలయాలకు జీర్ణోద్ధరణ చేయించి, కేదారనాథ్, ద్వారక, పూరి, రామేశ్వరం తదితర పుణ్యక్షేత్రాల్లో ఎన్నో ధర్మశాలలు, అన్న సత్రాలు, స్నానఘట్టాలు కట్టించింది. దక్షిణాదిన ప్రసిద్ధ దేవాలయాలకు నిత్యాభిషేకం కోసం పవిత్ర గంగాజలాన్ని సరఫరా చేయించింది. ఎన్నో కొత్త దేవాలయాలని కళాత్మకంగా కట్టించి, సనాతన ధర్మాన్ని, ఆర్ష సంస్కృతిని పునరుజ్జీవింప జేయటంతోబాటు దైనందిన రాజకీయ వ్యవహారాల్లోనూ అహల్యాబాయి ఏమరుపాటు చూపేది కాదు. రోజూ కచ్చేరీలో కూచుని, ఫిర్యాదులను ఆలకించి, ఆపన్నులను ఆమె ఆదుకునేది. పశుపక్ష్యాదుల మీదా దయ చూపేది. రాజకీయ తిరుగుబాట్లు, భిల్లుల విద్రోహాల వంటివి సకాలంలో సమర్థంగా ఎదుర్కొని కొద్దిపాటి సైన్యంతోనే రాజ్యరక్షణ కావించేది. ఆమె ప్రతినిధిగా తుకోజీ హోల్కర్ (అహల్యతో అతడికి బంధుత్వం ఏమీ లేదు) సైనిక వ్యవహారాలు చూస్తూ, యుద్ధాలు చేస్తూ రాజ్యాన్ని కాపుకాయగా పౌర పరిపాలనను దేవుడి సేవలా అహల్యాబాయి నిభాయించేది. ఆమె సమర్థపాలనలో హోల్కర్ రాజ్యం మున్నెన్నడూ లేనంతటి అభివృద్ధి సాధించి సిరిసంపదలతో తులతూగింది.

*Empire in Asia* గ్రంథంలో ఆంగ్లేయ మేధావి టొరెన్స్ మాటల్లో చెప్పాలంటే-

Perhaps the most striking proof that is anywhere recorded of the triumph of a pure and noble nature over the corrupting influences of irresponsible power, is that of Ahalya, who for thirty peaceful years reigned,... respected by surrounding Princes, and an object of adoration among the people blessed by her rule... Her foreign policy was as successful as that of Catherine of Russia, but her pillow was not drenched with a husband's blood. In personal courage she was not inferior to Elizabeth of England, but she did not slay her capitve competitor in a prison. The circumstances of her elevation resembled those which raised Margaret of Denmark to the throne; but she neither trampled on the rich not oppressed the poor, nor caused the breath of suspicion to assail her virtue.

[***Empire in Asia*, W.M. Torrens**, *pp.79-80*]

(విచ్చలవిడి అధికారపు దుష్ప్రభావాలకు లోనవకుండా స్వచ్ఛమైన, ఉదాత్తమైన మానవ స్వభావం సాధించిన ఘన విజయానికి అద్భుత దృష్టాంతంగా అహల్యాబాయిని పేర్కొనాలి. ముప్పయేళ్ల ప్రశాంతంగా రాజ్యమేలి ఇరుగు పొరుగు ప్రభువుల మన్నన చూరగొని, తన చల్లని పాలనకు నోచుకున్న ప్రజలకు ఆరాధ్యురాలైన ఉత్తమురాలామె. విజయవంతమైన విదేశాంగ విధానంలో ఆమె

రష్యాలో కాథరిన్‌కు దీటు రాగలదు. కాని కాథరిన్‌లా ఆమె తలగడ భర్త నెత్తురుతో తడిసిపోలేదు. వ్యక్తిగత ధైర్యంలో అహల్య ఇంగ్లండ్ ఎలిజిబెత్‌కు తీసిపోదు. కాని ఆమెవలె ఈమె చెరలోని ప్రత్యర్థిని చంపలేదు. సింహాసనమెక్కిన పరిస్థితుల్లో డెన్మార్క్ మార్గరెట్‌కూ అహల్యకూ పోలిక ఉంది. కాని ఆమెలా ఈమె పేదలను అణచలేదు. ఆమెవలె శీలం మీద అనుమానాల నీడా ఈమెపై పడలేదు.)

శివాజీ మొదలుకుని రెండో బాజీరావు వరకూ మరాఠా పాలకులందరికీ ఇతర గుణావగుణాలు ఎలా ఉన్నా దైవభక్తి, ధర్మాసక్తి పుష్కలంగా ఉన్నాయి. స్వమతం పట్ల ఎంత అభిమానం చూపినా పరమతాల పట్ల వారికి ద్వేషం లేదు; నిరాదరణా లేదు. ఛత్రపతుల, పీష్వాల ప్రభుత్వాల్లో మహమ్మదీయులను ముఖ్య పదవుల్లోకి తీసుకోరాదన్న నిషేధం ఎప్పుడూ లేదు. మరాఠా సైన్యాధికారుల్లో ముస్లింలు చాలామందే ఉండే వారు. పరాయి మతస్థులు ఎలాంటి దుర్విచక్షణకూ, ఎటువంటి ఆంక్షలకూ లోనవలేదు. ఈద్-ఉల్ ఫితర్ పండుగను పీష్వా ప్రభుత్వం అధికారికంగా గుర్తించింది. ముస్లిం సంస్థలకు విరాళాలకోసం 'ఖైరత్‌ఖర్చ్' పేర బడ్జెటులో ప్రత్యేక కేటాయింపు ఉండేది. పూనాలోని దర్గాలను పీష్వాలు తరచుగా దర్శించినట్టే గ్వాలియర్‌లో మొహరం ఊరేగింపులో సింధియా తప్పక పాల్గొనేవాడు. బరోడా పాలకుడు గైక్వాడ్ ఈద్ ప్రార్థనకు తప్పకుండా హాజరయ్యేవాడు. యశ్వంతరావు హోల్కర్ ఉజ్జయినిలో ఫకీర్లకు సంతర్పణలు చేసేవాడు.

మరి ఇన్ని మంచి లక్షణాలు ఉండి, ఇంత ఘనకీర్తి కలిగి ఎన్నో అటుపోట్లను తట్టుకుని నూరేళ్లకు పైగా దుర్నిరీక్ష్యంగా వెలిగిన మరాఠాల సామ్రాజ్యం దేశం కాని దేశం నుంచి వచ్చిన వర్తకుల మూక ముందు బలాదూరై గుజ్జనగూడులా కుప్పకూలింది. ఎందుచేత? ఏ స్వయంకృతాపరాధాల వల్ల?



# ఎందుకు పతనం?

ఏకులా వచ్చారు. మేకులా మారారు. వేషాలు వేశారు. మోసాలు చేశారు. కుట్రలు పన్నారు. నిజమే. వర్తకం నెపంతో వచ్చిన ఇంగ్లీషు వారు తమకు ఆశ్రయమిచ్చిన వారికే ద్రోహం చేసి, నమ్మినవారిని నట్టేట ముంచి అడ్డదారిలోనే ఇండియాను అప్పనంగా ఆక్రమించారు. సందేహం లేదు. అయితే తమ కళ్లముందే అంతులేని కుటిల వ్యూహాలూ కుహకాలూ సాగుతూంటే... ఒక రాజ్యం తరవాత ఒక రాజ్యం స్వాతంత్ర్యం కోల్పోతూ చాపకింద నీరులా విదేశీయుల ప్రాబల్యం వ్యాపించి, తమ కాళ్లకింది నేలే క్రమేణా కదిలిపోతూంటే మనదేశపు మారాజులు ఏమి చేస్తున్నారు? ఎందుకు నిదరోయారు?

అపారమైన వనరులతో, అంతులేని సిరిసంపదలతో విలసిల్లి శౌర్య పరాక్రమాలకు పెట్టింది పేరయిన సువిశాల భరత ఖండాన్ని వేల మైళ్ల దూరంలోని బుల్లిదేశం అవలీలగా వశపరచుకోవటం ప్రపంచ చరిత్రలోనే ఒక అద్భుతం. గొప్ప చరిత్ర, గొప్ప సంస్కృతి కలిగి, ఒకప్పుడు విద్యలకు విజ్ఞానానికి నెలవై సుదూర దేశాలకు మహా సామ్రాజ్యాలను విస్తరించగలిగిన భరత జాతి, తనతో పోల్చితే మేరువు ముందు రేణువులాంటి ఒక చిన్న పాశ్చాత్య శక్తికి దాసోహమని, శతాబ్దానికి పైగా బానిస శృంఖలాల్లో ఎందుకు చిక్కుకుంది?

మెకాలే చదువుల 'చేతబడి'కి లోనై ఆత్మన్యూనతా భావం పెంచుకున్న భారతీయ గిరీశాల మాటలకు మనం విలువ ఇవ్వనక్కర్లేదు. నాగరికతలో, విజ్ఞానంలో, సైనిక శక్తిలో, ఆయుధ పాటవంలో, పరాక్రమంలో, బుద్ధిలో, బలంలో ఆంగ్లేయులు అన్ని విధాల అధికులు కాబట్టే... భారతదేశం మత మౌఢ్యానికి ఆటపట్టయి, దుర్మార్గపు బ్రాహ్మణాధిక్యానికి లోనై, విద్యాగంధం లేక, అజ్ఞానాంధకారంలో అలమటిస్తున్నది కాబట్టే ఇండియా అలవోకగా దొరల కైవసమైందనీ... అదృష్టం బాగుండి అలా జరగడంవల్లే ఆధునిక విద్యకు, శాస్త్రీయ విజ్ఞానానికి, నవ నాగరికతకు నోచుకుని భారతదేశం బాగుపడిందనీ మెకాలే మనవలు చిలకల్లా వల్లించేది బానిస భావజాలమనడంలో అనుమానం లేదు. ఈస్టిండియా కంపెనీ

దేశాన్ని కబళించిన కొత్తలో మద్రాసు ప్రెసిడెన్సీ గవర్నరుగా ఉన్న సర్‌థామస్ మన్రో దేశీయ విద్యల స్థితిగతులను తెలుసుకోవటానికి తన పాలనలోని దక్షిణాది గ్రామాలన్నిటా జరిపించిన విస్తృత సర్వేలో... ఆ కాలపు బ్రిటిష్ విద్యావిధానం కంటే నాటి భారతీయ విద్యావ్యవస్థ అన్ని విధాల మెరుగ్గా ఉన్నట్టు తేలిన వైనాన్ని గతంలో 'భారతీయ విద్య' వ్యాస పరంపరలో ('**మన చదువులు**'గా తరవాత గ్రంథస్థమైంది) వివరంగా పరిశీలించాం. కనుక విద్యాపరంగా తెల్లవారి ఎక్కువా లేదు. భారతీయులు తక్కువా కాదు. ఎంతసేపూ మోసాలు చేసి వాయిదాల పద్ధతిలో రాజ్యాలు కొట్టేయటమే తప్ప నేరుగా ఎదుటపడి భారతీయులతో 'కంపెనీ'వారు చేసిన యుద్ధాలే బహుకొద్ది. అందులోనూ అదృష్టం కలిసొచ్చి తాము గెలిచామే గానీ సంఖ్యాపరంగా వనరులపరంగా చూస్తే అవతలి వారే తమ కంటే అధికులని ఆయా యుద్ధాల్లో పాల్గొన్న ఆంగ్ల సేనానులే అంగీకరించిన సందర్భాలు అనేకం ఉన్నాయి. కాబట్టి ఇంగ్లీషు వారి సైనికశక్తి, పరాక్రమాల గురించి పెద్దగా చెప్పుకోవలసిన పనిలేదు.

మరి ఇన్ని ఆధిక్యతలు, ఇన్ని తెలివితేటలు, ఇంతటి శక్తి సామర్థ్యాలు ఉండి కూడా ముంచుకొస్తున్న ముప్పును గ్రహించలేక భారతీయ ప్రభువులు కళ్లు తెరచుకునే విదేశీయుల బొందలో ఎందుకు పడ్డారు? సకాలంలో మేల్కొని, ప్రాప్తకాలజ్ఞతతో తగిన ప్రతిచర్యలు తీసుకుని, సర్వానర్థాన్ని ఎందుకు నివారించలేకపోయారు?

కారణాలు అనేకం. ముఖ్యంగా బహు నాయకత్వం. పరాక్రమవంతులకు కొదవలేదు. ప్రతివాడూ మహావీరుడే. కాని ఏ వీరుడూ ఇంకొకడి నాయకత్వానికి కట్టుబడడు. గజనీ మహమ్మద్ దండెత్తివచ్చినప్పుడు పంజాబులో జయపాల్‌కు అండగానూ, మహమ్మద్ ఘోరీని ఎదుర్కోవడానికి పృథ్వీరాజ్‌కు బాసటగానూ, బాబరు దాడిని నిరోధించటానికి సంగరాణాకు మద్దతుగానూ అనేక రాజ్యాల రాజపుత్ర ప్రభువులు, ఇతర వీరులు పెద్ద సంఖ్యలో భారీ సేనలతో తరలి వెళ్లినా ప్రయోజనం ఎందుకు లేకపోయింది? ఎవరి సేనలతో వారు ఎవరి పద్ధతిలో వారు ప్రతాపం చూపించటమే తప్ప అంతా కలిసి ఒకరి నాయకత్వం కింద ఏకోన్ముఖ యుద్ధవ్యూహంతో క్రమశిక్షణాయుతంగా పోరాడనందువల్లే కదా? శతాబ్దాలు మారినా, ఎన్ని చేదు అనుభవాలు ఎదురైనా గత చరిత్ర నుంచి గుణపాఠం నేర్చుకునే అలవాటు మనకు లేదు. సింగిల్ కమాండ్ కింద బలగాలన్నిటినీ సమీకరించి, సమగ్ర వ్యూహంతో, సరైన సమన్వయంతో అంతా కలిసి పోరాడ లేకపోయినందువల్లే రెండవ, మూడవ మరాఠా యుద్ధాల్లోనూ మనవారు గెలవగలిగీ విదేశీయుల చేతిలో ఘోర పరాజయాల పాలయ్యారు. ఈసంగతి వారితో పోరాడి గెలిచిన బ్రిటిష్ ప్రముఖులే అంగీకరించారు. ఉదాహరణకు చివరి మరాఠా యుద్ధం మొదలుకాకముందు 1817 ఆగస్టు 12న గవర్నర్ జనరల్‌కి రాసిన లేఖలో భారతీయుల బలహీనతల గురించి సర్ థామస్ మన్రో ఏమన్నాడో చూడండి:

"When I consider the weakness of the native states and charecter of their chiefs, I see little chance of a protracted resistance from them... It is not that they want resources, that they have not men and horses, but that there is no one amongst them possessed of those superior talents which are necessary to direct them to advantage. There is so little system of subordination in native Government..."

(ఈ దేశపు రాజ్యాల బలహీనతలను, వాటి పాలకుల గుణాలను పరిశీలిస్తే వారి నుంచి దీర్ఘకాలం ప్రతిఘటన ఎదురవుతుందని నేను అనుకోను. వారికి వనరులు లేకకాదు. సైనికులూ, గుర్రాలూ లేకనూ కాదు. ఉన్న వనరులను ప్రయోజనకరంగా సమీకరించటానికి కావలసిన ఉత్తమ ప్రతిభ ఉన్నవారు వారి నడుమ ఒక్కరూ లేకపోవడమే దీనికి కారణం. దేశీయ ప్రభుత్వాల్లో నిర్దిష్ట వ్యవస్థ, క్రమశిక్షణ చాలా తక్కువ)

దీన్నే ఎల్ఫిన్‌స్టోన్ ఇంకా స్పష్టంగా చెప్పాడు:

"If there was any other more intrepid man occupying the peshwa's position at the time, it is not difficult to conceive how the British would have fared. The Marathas had at their command ample means of waging a successful war-armies, money, arms, ammunition. Every thing was ready. They only lacked a leader."

[***Life of Elphinstone,*** **Colebrooke**, *Vol. I, p.372*]

(ధైర్యసాహసాలు గల సమర్థుడెవరైనా ఆ సమయాన పీష్వాగా ఉండి ఉంటే బ్రిటిష్ వారి పని ఏమయ్యేదో ఊహించటం కష్టంకాదు. మరాఠాల చెంత జయప్రదమైన యుద్ధానికి అవసరమైన వనరులన్నీ - సేనలు, డబ్బు, ఆయుధాలు, మందుగుండు సామగ్రి సమృద్ధిగా ఉన్నాయి. కావలసిన ప్రతిదీ సిద్ధంగా ఉంది. లేనిదల్లా సరైన నాయకుడే.)

సింధియా వీరుడే. హోల్కర్ శూరుడే. ఇద్దరికీ ఆంగ్లేయులు శత్రువులే. అయినా శత్రువుతో సింధియా పోరాడేటప్పుడు హోల్కర్ సాయంగా వెళ్లడు. హోల్కర్ విరోధి బారిన పడ్డప్పుడు అరిచి మొత్తుకున్నా సింధియా చిటికెన వేలు కదిలించడు. ఈ ఇద్దరికీ పై ఎత్తున ఉన్న పీష్వాకు ఎవరితో కలవాచ్చో, ఎవరితో కలవకూడదో తెలియదు. తెలిసి వచ్చాక అతడు ఆర్తనాదాలు చేసినా మిగతా సర్దార్లు అలకించి ఆదుకోరు.

ఇది మరాఠా చెట్టు చెడి కుక్కమూతి పిందెలు వేసిన పిదపకాలపు సంగతి. అంతకు ముందు మరాఠాల ప్రభ ఉజ్వలంగా వెలిగిపోయిన కాలంలోనూ దేశానికి దివ్యమైన నాయకత్వం అమరిందని చెప్పలేము. ఇంగ్లీషువారు ఒక రాజ్యం తరవాత ఒక రాజ్యాన్నే లోపాయకారీగా లోబరుచుకుంటూ మెత్తని కత్తిలా దూసుకుపోతున్నా, ఆశ్రయమిచ్చిన పాదుషాకి ఎదురు తిరిగి పదే పదే తల ఎగురవేస్తున్నా జాతి హితానికి వారి వల్ల రాగల ముప్పును గ్రహించి విదేశీయుల పీడను దేశానికి విరగడ చేయడానికి జాతీయ దృష్టితోరాజీలేని పోరుకు నడుము కట్టినవాడంటూ దేశం మొత్తం మీద ఒక్కడూ లేడు. పైగా ప్రతివాడూ ఏదో ఒక సందర్భంలో ఇతరేతర లబ్ధిని ఆశించి అదే విదేశీయులతో చేతులు కలిపినవారే. పశ్చిమ తీరంలో తిరుగులేని నౌకాబలంతో ఇంగ్లీషువారికి సింహస్వప్నంగా ఉన్న ఆంగ్రియా తనకు ఎదురు తిరిగేసరికి బాలాజీరావు పీష్వా ఇంగ్లీషువారి సాయం తీసుకుని అతడిని అణచివేసిన సంగతి తెలిసిందే. తెల్లవారు తమ వికృత రూపాన్ని బాహాటంగా బయటపెట్టి

కోరలు సాచిన తరవాత, జాతికి పెనుప్రమాదాన్ని గుర్తించి తానే చొరవ తీసుకుని జాతీయ ఐక్య సంఘటన కట్టిన తరవాత కూడా మరాఠా కౌటిల్యుడు నానా ఫడ్నవిస్ ఇంగ్లీషు వారిపై ఎత్తిన కత్తిని దించి మొదటి మరాఠా యుద్ధం చాలించి నిరర్థక సంధికి సమ్మతించాడు. అనంతరకాలంలో మాధవరావు (మహద్‌జీ) సింధియాను, టిప్పు సుల్తాన్‌ను సాధించటానికి ఇదే నానా కంపెనీ దొరలతో సరాగాలాడాడు.

శివాజీ నెలకొల్పిన తొలి వ్యవస్థలో ప్రతిభకే తప్ప పుట్టుకకు ప్రాముఖ్యం లేదు. పీష్వా మొదలుకుని మామూలు సిపాయి వరకూ అందరూ ఖజానా నుంచి నెలనెలా వేతనాలు తీసుకోవలసిందే సేవకు ప్రతిఫలంగా జాగీరు కట్టబెట్టే పాత పద్ధతిని శివాజీ రద్దుచేయగా... ఛత్రపతుల పాలన పోయి పీష్వాల హయాం వచ్చాక - కారణాలు ఏమైతేనేమి అనర్థకపు పాత పద్ధతినే పునరుద్ధరించారు. తండ్రి ఎంత శూరుడు, ఎంతటి స్వామిభక్తి గలవాడు అయినా అతడి కుమారుడు, మనవలు కూడా అంతే శౌర్యాన్ని అంతే స్వామిభక్తితత్పరతను చూపుతారనుకోవటం అత్యాశ. వంశపారంపర్య జాగిర్దారీ పద్ధతి దుష్ఫలితం పీష్వాలు కడు సమర్థులైనంత కాలమూ పెద్దగా కనపడలేదు. మొదటి మాధవరావు మరణంతో పీష్వాల వైభవం అంతరించాక పెదధోరణులు ప్రబలి లుకలుకలు బాగా బయటపడ్డాయి. చివరిదశలో ఇంగ్లీషు వారితో తుదిపోరు దగ్గరికి వచ్చేసరికి దక్షిణాది జాగిర్దారులే పీష్వాకు పెద్ద సవాలుగా తయారయ్యారు.

రాష్ట్రకూట వ్యవస్థలో హోల్కర్లు, సింధియాలు తదితర మరాఠా సర్దార్లకు వారివారికి ప్రాబల్యం కలిగిన ప్రాంతాలలో 'చౌథ్', 'సర్దేశ్‌ముఖి'ల వసూళ్లకు మరాఠా ప్రభువు అధికారం ఇచ్చినప్పటికీ వారు ఆయా ప్రాంతాలకు పెత్తందారులే తప్ప ప్రభువులు కాదు. మామూలు పరిపాలన నడపటానికి మొగలాయీ సుబేదారులో, గవర్నర్లో, స్థానిక స్వతంత్ర ప్రభువులో ఉంటారు. వారు వారి పద్ధతిలోనే పరిపాలన సాగిస్తారు. మొగల్ రాష్ట్రాల్లో స్థానిక పరిపాలనను పాదుషా ప్రతినిధికి వదిలేసి, 'చౌథ్'ను మాత్రం తాము వసూలు చేసి, అందుకు ప్రతిగా బయటి దాడుల నుంచి తాము రక్షణ కల్పించడమే దృష్టిలో గొప్ప ఏర్పాటు! పర్యవసానంగా - వసూళ్ల హక్కును బట్టి మరాఠాలది పైచేయి అయినా ఆయా ప్రాంతాల ప్రజాజీవనంపై, పాలనా విధానాలపై మరాఠాల ముద్ర ఉండేది కాదు. పైగా ఆ 'చౌథ్' 'సర్దేశ్‌ముఖి'లు కూడా స్థానిక పాలకులు ఇష్టపూర్తిగా ఇచ్చేవి కాదు. మరాఠాలు దండెత్తి వచ్చి, మెడ మీద కత్తి పెట్టినప్పుడు 'సరే' అనటం, ఆ దండు కాస్తా వెనక్కి పోయాక చెల్లింపులను బిగదీయడం, లేక సక్రమంగా చెల్లించక మొరాయించటం పరిపాటి. మళ్ళీ మరాఠా దండు వచ్చి గోళ్లూడకొట్టి వసూలు చేసేంతవరకూ ఎగవేత అలాగే సాగేది. దీనివల్ల పైనుంచి వసూళ్లు చేసే వారికీ, లోపల నుంచి వీలైనంతగా ప్రతిఘటించే వారికి మధ్య ఉద్రిక్తత, ఘర్షణ నిరంతరం ఉండేవి. విశాల రాజ్యాలు మరాఠాల ప్రాబల్యం కిందికి వచ్చినా వాటిపై వారికి స్థిరమైన పట్టు లేకపోవడానికి ఇదే కారణం.

ఒక శివాజీ స్థాపించిన స్వరాజ్యాన్ని ఒక బాజీరావు దుంపనాశనం చేయటం దురదృష్టకరమే. ఇంగ్లీషు నక్కలు, తోడేళ్లు దెబ్బతీయటానికి పొంచి ఉన్న చివరి అంకంలో బాజీరావు, దౌలత్‌రావు సింధియా, యశ్వంతరావు హోల్కర్‌లు వరసగా చేసిన తప్పులు, దుర్మార్గాలు స్వరాజ్య సూర్యాస్తమయాన్ని త్వరితం చేశాయనటంలో సందేహంలేదు. కాని ఈ చారిత్రక విపరిణామానికి ఈ ముగ్గురు వ్యక్తులను మాత్రమే ముద్దాయిలను చేసి



లాభంలేదు. మరాఠాల ప్రతాపం మధ్యందిన మర్తాండునిలా మండిపోయిన కాలంలోనే పతనానికి బీజాలు పడ్డాయి. ఎప్పుడు చేయవలసిన పనిని అప్పుడు చేయకపోవటం వినాశానికి మూలం.

బ్రిటిష్‌శక్తికి నౌకాబలం వెన్నెముక. సముద్రంమీద ఆధిపత్యంతో దేశాధిపత్యం హస్తగతం చేసుకోదలిచిన విదేశీయులను సకాలంలో సమర్థంగా ఎదుర్కోవాలంటే జాతీయ శక్తులకూ నౌకాబలం తప్పనిసరి. ఈ అతి ముఖ్య విషయాన్ని మనవారు ఉపేక్షించారు. మొదటి బాజీరావు, అతని తమ్ముడు చిమ్మాజీ భీషణ సంగ్రామంలో పోర్చుగీసువారిని ఓడించి బాసెన్ రేవుపట్నాన్ని జయించటం మరాఠా వీరగాథలో ఒక ఉజ్వలఘట్టం. అప్పటికే దేశంలో డచ్చి, ఫ్రెంచి, బ్రిటిషువారి హడావుడి బాగా ఉంది. పీష్వాకు వశమైన బాసెన్‌లో నౌకానిర్మాణానికి కర్మాగారాలు, తుపాకుల తయారీకి సదుపాయాలు, రేవులు సమృద్ధంగా ఉన్నాయి. శాస్త్రీయ పద్ధతిలో ఆయుధాల నిర్మాణానికి నైపుణ్యంగల విదేశీ ప్రవీణులు అక్కడ అందుబాటులో ఉన్నారు. ఆ సైనిక హంగులు ఎప్పటికైనా తమకు అవసరమవుతాయన్న ముందు చూపుతో బాసెన్‌లో ఆయా కార్యకలాపాలను భారతీయుల అజమాయిషీ కింద విదేశీ నిపుణులచేత పూర్వంవలె కొనసాగించి ఉంటే చరిత్రగతి మరోవిధంగా ఉండేది.

శివాజీ కాలపు గెరిల్లా పోరాటాలను మరాఠాలు ఎప్పుడో మానేశారు. కొండకోనల్లో తూనీగల్లా దూసుకుపోయే గుర్రాలు సమకూర్చిన బలం మీదా ఆధారపడటం క్రమేణా తగ్గించారు. నిజాంతో తలపడ్డ సమయంలో అతడికి అండగా బుస్సీ నడిపిన సైనిక రెజిమెంట్ల పనితనాన్ని చూశాక యూరోపియన్ పద్ధతిమీద సదాశివరావు భావులాంటి వారికి మోజు పెరిగింది. ఫ్రెంచి, తదితర యూరోపియన్ జాతీయులను కిరాయికి తీసుకుని, విదేశీ తరహా రెజిమెంట్లను, శతఘ్నిదళాన్ని సమకూర్చుకుని మరాఠాలు ఘన విజయాలే సాధించారు. కాని, ఆయా సైనిక దళాల కోసమూ, తుపాకుల కోసమూ, వాటి మందుగుళ్ల నిమిత్తమూ విదేశీయులమీద ఆధారపడకుండా సొంత వనరులను అమర్చుకోవటం అత్యవసరమన్న అతి ముఖ్య అంశాన్ని వారు విస్మరించారు. తమకు అవసరమైన ఫిరంగులు, వాటిని పేల్చటానికి కావలసిన సాధన సామగ్రి నిమిత్తం పాశ్చాత్య దేశాలను అర్థించి సకాలంలో సరఫరాలందక యుద్ధరంగంలో దెబ్బతిన్న సందర్భాలు అనేకం ఉన్నాయి. అయినా వాటిని స్వదేశంలో సొంతంగా తామే నిర్మించుకోవటానికి తగినచర్యలు తీసుకోవాలన్న ఆలోచన మన ప్రభువులకు రాలేదు.

ఒక జాతి స్వాతంత్ర్యాన్ని రక్షించుకోవటానికి విదేశీ కిరాయి సేనమీద ఆధారపడటం ఆత్మాహత్యా సదృశం. మరాఠాలు చేసింది అదే. సింధియా నమ్ముకున్న ఫ్రెంచి దళవాయిలే సరైన అదనులో అతడికి ద్రోహం చేసి శత్రువులతో చేరిపోయారు. కిరాయి యూరోపియన్లను నమ్ముకుని రక్షణభారం యావత్తూ వారి మీద వదిలేయకుండా యూరోపియన్ల చేత తమ వారికి సైనికశిక్షణ, ఆయుధాల తర్ఫీదు ఇప్పించి ప్రతి సైనిక విభాగానికి తమకు నమ్మకస్తులైన స్వదేశీయులనే నియమించి ఉంటే చాలా యుద్ధాల పర్యవసానాలు మరొకలా ఉండేవి.

ఇలాంటి కారణాలు ఇంకా అనేకం ఉన్నాయి. అన్నీ ఇక్కడ ఏకరువు పెట్టనవసరంలేదు. అలగ్జాండరు మొదలుకుని ఘోరీ, బాబర్ల వరకూ ప్రాచీన మధ్యయుగాల్లో విదేశీయులు విరుచుకుపడ్డప్పుడు దేశ రక్షణ పట్ల, బయటి శత్రువును సమర్థంగా ఎదుర్కోవటం పట్ల ఎంత అలసత్వాన్ని చూపామో... ఆధునికకాలంలో విదేశీ వర్తక మాయావుల బారిన

పడకుండా దేశాన్ని రక్షించుకునే విషయంలోనూ మనం అంతే అశ్రద్ధను కనపరచామన్నదే గమనించాల్సిందల్లా. ప్రపంచాన్నే జయించగల శక్తి సామర్థ్యాలు, ప్లేటోలను, సోల్మన్‌లను మేకియవెల్లిలను సైతం బలాదూరు చేయగలిగిన తెలివితేటలు, విశ్వమానవాళికి దారిదీపం చూపించగల ఆర్షధర్మ ఘన వారసత్వం ఉండి కూడా ఐకమత్యం, ఏకాగ్రత, లక్ష్యాన్ని సాధించాలన్న నిశ్చల దీక్ష నిరంతర తపన లేని కారణంగా సుదీర్ఘ చారిత్రక ప్రస్థానంలో ఎన్ని విధాల ఎంత నష్టపోయామన్నదే ప్రతి భారతీయుడూ గుర్తించాల్సిందల్లా.

* * *

ఇంగ్లీషువారు అడుగుపెట్టి, దేశాన్ని ఉద్ధరించడానికి ముందు ఇక్కడ నెలకొని ఉన్నది అరాజకమనీ... మన గతమంతా సిగ్గుపడవలసిన మత మౌఢ్యపు చీకటి కూపమనీ, విదేశీయులు జ్ఞానభిక్షను ప్రసాదించకముందు జాతీయ భావం, జాతీయ నాయకత్వం మనకు లేనే లేవని మెకాలే వారసులు చరిత్ర గ్రంథాల్లో , పాఠ్యపుస్తకాల్లో నూరిపోసింది అబద్ధమని నిరూపించేందుకే ఈ వ్యాసపరంపర. అప్పట్లో ప్రధాన జాతీయ శక్తి అయిన మరాఠాలు నేలకూలటంతో విదేశీయుల ఆక్రమణకు ఆఖరి అడ్డంకి తొలగింది. అర్భకపు రాజ్యాలను, నామమాత్రపు పెత్తనాలను రకరకాల మిషలతో నోటకరిచి బ్రిటిష్ సామ్రాజ్యంలో కలిపేసుకోవటమే ఇక మిగిలింది.

అది వేరే కథ.



# బాజీరావు

**అనుకూల పరిస్థితిలో అవక్ర పరాక్రమంతో విజృంభించి చరిత్రలో చిరస్థాయిగా నిలిచే స్వర్ణావకాశాన్ని కాలం ఇద్దరికి ఇచ్చింది. ఒక బద్ధకపు మహారాజు దాన్ని వదిలేసుకున్నాడు. నెత్తురు మండే ఒక నవ యువకుడు దానిని సద్వినియోగం చేసుకుని అద్భుత శౌర్య ప్రతాపాలతో మహారాష్ట్రాన్నేకాక మొత్తం భారత జాతిని పులకింప చేశాడు.**

మరాఠా రాజ్యాన్ని ఉక్కిరిబిక్కిరి చేసిన బహుముఖ సమస్యలు పీష్వా బాలాజీ విశ్వనాథ్ పుణ్యమా అని చాలా వరకు కొలిక్కివచ్చాయి. తిరుగుబాట్లు అణగి ముఖ్య సర్దార్లు దాదాపు అందరూ సాహు రాజరికానికి తలవంచి ఉమ్మడి ప్రయోజనాల సంరక్షణకు హృదయపూర్వకంగా సమాయత్తమయ్యారు. మహారాష్ట్రపై సర్వ హక్కులు కల మహారాజుగా సాహు అధికారాన్ని మొగలు చక్రవర్తి ఆధికారికంగా గుర్తించాడు. సతారాకు, కొల్హాపూర్‌కు నడుమ వారసత్వ స్పర్థ మూలంగా అసలు హక్కుదారు ఎవరన్న విషయంలో నెలకొన్న సందిగ్ధత దీనితో తొలగింది. శివాజీ స్థాపించిన 'స్వరాజ్' ప్రాంతాలపై సాహుకు సర్వం సహాధికారం దఖలుతోపాటు దక్కనులోని ఆరు రాష్ట్రాల నుంచీ 'చౌథ్', 'సర్దేశ్‌ముఖి'ల రూపేణా కప్పం వసూలు చేసుకునే హక్కునూ మొగలు పాదుషా నుంచి ముక్కుపిండి రాబట్టడంతో వింధ్యకు దక్షిణాన మహారాష్ట్రుల ప్రాభవం గణనీయంగా పెరిగింది.

రాజు అన్నవాడికి ఇంతకంటే కావలసింది లేదు. చిక్కులు చక్కబడి అడ్డంకులు చాలా వరకు తొలిగాక పరిపాలకుడికి కలేజా వుండాలేగానీ ఏమైనా సాధించవచ్చు. అప్పటికి సాహురాజుకు ముదిమి మీదపడ్డదీ లేదు. అతడి వయసు కేవలం 38. ఛత్రపతి శివాజీ అంశ ఏకాస్త పనిచేసినా... వట్టిరాజు కాదు - గట్టి ప్రభువు అనిపించుకోవాలన్న ఆలోచన ఏ కోశాన కలిగినా ప్రభుత్వపు పగ్గాలను చేతుల్లోకి తీసుకుని, దిగ్విజయాలను సాధించి తాతకు తగ్గ మనవడు అనిపించుకోగలిగేవాడు. మొదటి నుంచి మొగలుల విశృంఖల వాతావరణంలో రికామిగా బతకడానికి అలవాటుపడ్డ సాహుకు రాజ్య భారాన్ని నెత్తినెత్తుకుని రెక్కలు ముక్కలు చేసుకునే ఓపిక, కోరిక రెండూ లేవు. పైగా అప్పుల బాధ ఒకటి. అతడి రాజ్యాధికారాన్ని నిలబెట్టటానికి సైన్యాన్ని సమకూర్చడంకోసం బాలాజీ విశ్వనాథ్ భారీగా అప్పులు చేశాడు. అవన్నీ ఎలా తీర్చాలో, అప్పుల వాళ్ల ఒత్తిళ్లకు ఏమి సమాధానం చెప్పాలో సాహుకు తెలియదు. కనుక పీష్వా పదవిని బాలాజీ కుమారుడికే అప్పగిస్తే ఆ పాట్లేవో అతడే పడతాడులెమ్మని సాహు అనుకున్నాడు. అందుకే - అంత చిన్నవాడికి పెద్ద బాధ్యత ఇవ్వడం తగదని, చిన్న చిన్న పనులు అప్పగించి అతడి సత్తా ఏమిటో ముందుగా గమనించడం మంచిదని బాలాజీ వ్యతిరేకులైన ఉన్నతాధికారులు వారించినా వినకుండా.... విఫలుడైతే అనక తొలగిద్దాములెమ్మని చెప్పి... గతించిన బాలాజీ పట్ల కృతజ్ఞతా సూచకంగా ఆయన పెద్ద కుమారుడు బాజీరావుకు హుటాహుటిన ప్రధానమంత్రిత్వం కట్టబెట్టాడు.

నాటికి బాజీరావు వయస్సు కేవలం 22. చక్కని చుక్క కాశీబాయిని పెళ్లాడి నిండా నలభై రోజులు కాలేదు. 38 ఏళ్ల సాహుకే రాచకార్యాల కంటే రాస కార్యాల మీద మక్కువ అయినప్పుడు 22 ఏళ్ల కొత్త పెళ్లికొడుకుకు ఆ యావ ఇంకా ఎక్కువ వుండాలి. పైగా చెట్టంత తండ్రిని కోల్పోయి ఇంకా ఇరవై రోజులు అవలేదు. పుట్టెడు దుఃఖంలోని తల్లిని ఓదార్చడానికి, ఇంటి వ్యవహారాలు చూసుకోవడానికి సమయం చాలడంలేదు. అంతలోనే పీష్వా స్థానంలో కూచుని పాలనా చక్రాన్ని తిప్పాల్సివస్తే సామాన్యులు ఎవరైనా బెంబేలు పడతారు. కాని - బాజీరావు తొణకలేదు. దైవం ఇచ్చిన అవకాశాన్ని హుందాగా స్వీకరించి శివాజీ తరవాత అంతటి మహావీరుడిగా, హైందవ ధర్మదీక్షాబద్ధుడిగా అద్భుత విజయాలతో చరితార్థుడయ్యాడు.

బాజీరావు వయసు చిన్నదైనా తండ్రి ఇచ్చిన తర్ఫీదు గొప్పది. బాలాజీ కుమారులిద్దరినీ చిన్నతనం నుంచే కఠోర క్రమశిక్షణలో పెంచి మహాయోధులుగా తీర్చిదిద్దాడు. అజానుబాహువు, దృఢకాయుడు అయిన బాజీరావుకు ఏకబిగిన ఏడొందల మైళ్లు గుర్రపు స్వారీ చేసినా అలుపు వచ్చేది కాదు. చిన్నతనం నుంచీ తండ్రితో కలిసి రణరంగంలోనే అతడు ఎక్కువగా గడిపాడు. సేనాపతి చంద్రసేన్ యాదవ్ కత్తిగట్టి రాహువులా వెంటాడినప్పుడూ, బందిపోటు నాయకుడు దమాజీ థొరాట్ మోసం చేసి ఖైదులో పెట్టినప్పుడూ బాజీరావు తండ్రి పక్కనే వుండి పరాజయాల నుంచి విలువైన పాఠాలు నేర్చుకున్నాడు. పీష్వాగా తండ్రి పనితీరును శ్రద్ధగా గమనించి, మంత్రాంగాల్లో, రాజకీయ వ్యవహారాల్లో మెళకువలను, రాజనీతి ధర్మసూక్ష్మాలను ఆకళింపు చేసుకున్నాడు. సయ్యద్ హుసేనలీకి సాయంగా చక్రవర్తి మీదికి సైన్యంతో దండెత్తి వెళ్ళినప్పుడూ తండ్రి వెంట వుండి ఢిల్లీ దర్బారును దగ్గరినుంచి అధ్యయనం చేసి, జయపూర్ మహారాజా జయసింగు వంటి వారితో పరిచయం పెంచుకుని బాజారావు రాజకీయంగా రాటుతేలాడు.

ఊహ తెలిసినది మొదలుకుని యుద్ధ శిబిరాలలోనే, పోరాటాలతోనే ఎక్కువగా కాలం చెల్లిపోవడంవల్ల బాజీరావు తండ్రిలా మంచి విద్వాంసుడు కాలేకపోయాడు. తల్లి పెంపకం ధర్మమా అని అతడి వ్యక్తిత్వ వికాసానికి ఆ లోపం అడ్డురాలేదు. శివాజీని జీజీబాయి తీర్చిదిద్దినట్టే బాజీరావుకు తల్లి రాధాబాయి పసితనం నుంచి చదువులలోని సారాన్ని, దేశభక్తిని నూరిపోసి హిందూ ధర్మదీక్షాబద్ధుడిని చేసింది. ఏతావతా 1720 ఏప్రిల్ 17న పీష్వా అయ్యేనాటికి వయసు ఇరవై రెండే అయినా బాజీరావుకు మరాఠాల ముందున్న సవాళ్లమీద, సావకాశాలమీద.. వారి బలం గురించి, శత్రువుల బలహీనతల గురించి...

జాతీయ శక్తుల పునరేకీకరణ తక్షణావశ్యకత గురించి స్పష్టమైన అవగాహన వుంది. ఆ స్పష్టతవల్లే పరిపాలన పగ్గాలను అందుకున్న కొద్ది కాలానికే నిండు సభలో నిలబడి - అప్పటిదాకా దర్బారు ప్రముఖుల్లో ఎవరికీ ఊహకైనా అందని వినూత్న వ్యూహాన్ని సభాసదులు నిశ్చేష్టులై వింటూండగా మహారాజు ముందు ప్రతిపాదించాడు. అప్పటికి మొగలు సామ్రాజ్యం ఛిన్నాభిన్నమైంది. ఏడాదిలో మూడు తోలుబొమ్మలు కూలి నాలుగోది తెరముందుకొచ్చింది. కింగ్ మేకర్లనుకున్న సయ్యద్ సోదరులు కుక్కచావు చచ్చారు. రోహిల్లాలు, రాజపుత్రులు, జాట్లు తల ఎగరేసి స్వతంత్ర రాజ్యాలు స్థాపించుకోవడంతో కేంద్రాధికారం కుప్పకూలింది. దేశ రాజకీయ స్థితి ఈ గతులకు స్థూలంగా సింహావలోకన చేశాక -

"పట్టిపోయిన దక్కను ఎల్లలను దాటి నేరుగా మొగలు సామ్రాజ్యపు గుండెలమీదికే మరాఠా గుర్రాలను నడిపించవలసిన సమయం వచ్చింది. మొగలుల పని అయిపోయింది. మనకు బలం వుంది. మన మొట్టమొదటి కర్తవ్యం మధ్య భారతదేశాన్ని జయించడం" అన్నాడు బాజీరావు.

వింటున్న "ప్రతినిధి" శ్రీపతిరావు కస్సున లేచాడు. అతడికి మొదటినుంచీ బాలాజీ అంటే పడదు. బాలాజీ కొంకణ్ బ్రాహ్మణుడు కనక కొంకణుల అధిపత్యానికి వ్యతిరేకంగా దక్కనుకు చెందిన "దేశస్థబ్రాహ్మణ" వర్గాన్ని కూడగట్టి చాలా కాలంగా రాజకీయం చేస్తున్నాడు. బాలాజీ మరణానంతరం పీష్వా పదవిని ఆశించిన ఎందరో సీనియర్లను పక్కన పెట్టి 22 ఏళ్ల కుర్రకుంకకు కీలక బాధ్యత నిచ్చినందుకు అసలే అతడు లోలోన మండుతున్నాడు. ఏకంగా పోయి ఉత్తరాదిమీద పడదామని ఇప్పుడు బాజీ అనేసరికి చిర్రెత్తి, మహారాజు దగ్గర తనకున్న చనువుకొద్దీ చడామడా నిప్పులు చెరిగాడు.

"మహారాజా! ఇతడు చెప్పేది వినకండి. ఇది దుందుడుకు పిల్ల చేష్ట. ఇతడి పథకం మనల్ని నాశనం చేస్తుంది. అసలే మహారాష్ట్రం ఆర్థికంగా చితికి వుంది. దక్కను సుబేదారు నిజాం ఉల్‌ముల్క్ సైన్యం మన గుమ్మం ముందే - దెబ్బతీయడానికి అదనుకోసం కాచుకుని ఉన్నదని మరచిపోకండి. కొంకణ్‌లో చాలా పట్నాలు ఇంకా సిద్దీల చేతుల్లోనే వున్నాయి. మన రాజ్యాన్ని పదిలపరచుకుని, కాస్త కాలూ చెయ్యి కూడదీసుకున్నాక దండయాత్ర సంగతి ఆలోచించవచ్చు. అప్పుడైనా మనకు చుట్టు పట్ల దక్షిణాది భూమండలంమీదే మనం దృష్టి సారించడం సబబు. దక్షిణాన శివాజీ జయించిన ప్రాంతాలను, బిజాపూర్ భూభాగాలను, జింజీకోటను మొగలులు వశం చేసుకున్నారు. వాటిని తిరిగి గెలుచుకుందాం. తంజావూర్‌లోని మనవారి రాజ్యంతో సమన్వయం చేసుకుని క్రమేణా దక్షిణాన విస్తరిద్దాం. అంతే గానీ - ఇప్పుడు మనం వున్న స్థితిలో మన పెరటిలో పొంచి వున్న నిజాం ఉల్‌ముల్క్ ముప్పును విస్మరించి రాజ్య భద్రతను పట్టించుకోకుండా బలహీనంగా వదిలేసి ఢిల్లీ మీదికి దండెత్తితే మొదటికే మోసం వస్తుంది. ఈ ఆత్మహత్యా సదృశమైన పిచ్చి ఆలోచనలు మాని మనకున్న దానిని సుస్థిరం చేసుకోవడం మంచిది" అని శ్రీపతిరావు వాదన.

'అతడంటున్నదీ నిజమేకదా' అని సభాసదులు పలువురు తల పంకిస్తూండగా బాజీ రావు లేచి చక్కని వాగ్ధాటితో స్ఫుటంగా ఉద్వేగభరితంగా ప్రతివాదాన్ని తుత్తునియలు చేశాడు.

"మన ఆర్థిక స్థితి బాగవ్వాలంటే హిందుస్తాన్‌లోని సంపన్న రాజ్యాలను కైవసం చేసుకోవడమే దగ్గరి దారి. బీడువారిన దక్కన్ మైదానాలకోసం మన రక్తాన్ని ధారపోసి ప్రయోజనం లేదు. ప్రభూ! మీ తాతగారైన శివాజీ మహారాజ్‌ను గుర్తుచేసుకోండి. ఆయనకూ వనరులు చాలీ చాలనివే. ఆయననూ సమస్యలు చుట్టుముట్టాయి. అయినా - ఇవాళ ప్రతినిధి శ్రీపతిరావులా ఆయన ఆలోచించలేదు. ప్రపంచంలోకెల్లా బలిష్ఠమైన సామ్రాజ్యంతో ధైర్యంగా తలపడ్డాడు. మన ప్రతినిధిగారు మనకు చెబుతున్నట్టుగా వ్యవహరించి బీజాపూర్‌నో, గొల్కొండనో వశపరచుకోవాలనకుండా నేరుగా కర్ణాటక కుంభస్థలం మీదే దెబ్బ కొట్టాడు. శత్రువు మహా బలశాలి అయిన ఆ కాలంలోనే ఆయన అంత ప్రతాపాన్ని ప్రదర్శిస్తే ఇప్పుడు మనమెందుకు వెనకాడాలి? ఎవరీ మొగలులు? బలహీనులు; సోమరిపోతులు; బుద్ధిహీనులు! చక్రవర్తి నల్లమందు మత్తులో జోగుతూ ఉంపుడుగత్తెల పరికిణీలను దాటి ఆలోచించలేకపోతున్నాడు. పవిత్ర భరతవర్షం నుంచి మ్లేచ్ఛులను హిమాలయాల ఆవలికి గెంటివేయాల్సిన సమయం ఆసన్నమైంది. హిందుస్థానం ముక్కలు ముక్కలుగా విడివడిన ప్రస్తుత అనిశ్చితినే మనకు అనుకూలంగా మార్చుకుని కృష్ణ నుంచి సింధునదివరకూ భగవాధ్వజాన్ని ఎగురవేయాలి" అని వినేవారికి ఉత్సాహం ఉప్పొంగేలా బాజీరావు భాషించాడు.

The commanding stature, which all but reached the low ceiling of the royal palace, the rich, clear voice, the bold, virile features, the dark imperious eyes that forced attention, and above all, the rare felicity of diction... produced an irresistible effect. At the close of a lofty peroration, the minister fixed on Shahu his glowing gaze and said :

"Strike, strike at the trunk and the branches will fall of themselves. Listen but to my counsel and I shall plant the Maratha banner on the walls of Attock".

[*A History of the Maratha People,*
**C.A. Kincaid & D.B. Parasnis,** *Vol. II. P. 184*]

(రాజ సభామందిరం లోకప్పును దాదాపుగా తాకే నిలువెత్తు విగ్రహం... స్పష్టంగా ఖంగున మోగే గొతు... ధైర్యం, పౌరుషం ఉట్టిపడే ముఖ కవళికలు... దర్పంతో, ఆకట్టుకునే నల్లటి కళ్లు. అన్నిటికీ మించి అనర్గళ వాగ్ధాటి ఎదురులేని ప్రభావం చూపాయి. గంభీర ప్రసంగాన్ని ముగిస్తూ మెరిసే దృష్టిని సాహుపై నిలిపి పీష్వా ఇలా అన్నాడు. 'కొట్టండి! చెట్టు మొదలునే కొట్టివేయండి. కొమ్మలు వాటికవే రాలిపోతాయి. నా సలహాను మన్నించండి. మరాఠా పతాకాన్ని నేను (సింధునది తీరాన) అటక్ మీదే ప్రతిష్ఠిస్తాను.')

బాజీరావు చేసిన ఉత్తేజకరమైన మార్గదర్శనంతో సంశయాలన్నీ సమసి సాహు రాజు ఉత్సాహంగా అరిచాడు "నాకు తెలుసు! నువ్వు కైలాస శిఖరం మీదే జండా ఎగరేయగలవ"ని. అభ్యంతరాలను తోసిరాజని ప్రభువు ఇచ్చిన పూర్ణానుమతితో బాజీరావు జాగు సేయకుండా రంగంలోకి దిగాడు. తన మేధాశక్తినంతా రంగరించి వ్యూహాలు పన్నాడు. మెరుపు వేగంతో సేనలలను నడిపించి, అద్భుత పరాక్రమంతో పోరాడాడు. సమయాన్ని

బట్టి పట్టు, విడుపులతో తెలివిగా వ్యవహరించి - రాజుకిచ్చిన మాట నిలబెట్టుకున్నాడు. మరాఠా సామ్రాజ్యానికి 75 ఏళ్ళ కింద శివాజీ వేసిన పునాదులపై విజయ సౌధం నిర్మించాడు. మొగలుల అధఃపతనంతో నెలకొన్న రాజకీయ శూన్యాన్ని గొప్పగా పూరించి మరాఠాలను ఉపఖండంలోనే బలీయ రాజకీయ శక్తిగా రూపొందించాడు. అతడు పీష్వాగా ఉన్న ఇరవై ఏళ్ళలో మరాఠాలు అఖిల భారతంలో జైత్రయాత్ర సాగించి దిగ్విజయాలెన్నిటినో వరసగా సాధించారు.

ప్రతినిధి శ్రీపతిరావు ద్వారా సాహు రాజును బుట్టలో వేసి, తన అవసరానికి మరాఠా సైనిక శక్తిని వాడుకుని, దక్కన్ సుబేదారు నిజాం-ఉల్-ముల్క్ అక్కర తీరాక బేష్వే అని కొల్హాపూర్‌లోని శంభాజీని చేరదీశాడు. దాయాదుల మధ్య అంతర్యుద్ధం తెచ్చి సతారాను నిజాం శతవిధాల సతాయించిన కాలంలో బాజీరావు కనుక లేకపోతే సాహు పని ఖాళీ అయ్యేదే! మొదట పాల్‌ఖేడ్‌లోనూ, తరువాత భోపాల్‌లోనూ నిజాంను (హైదరాబాద్ నిజాం సంస్థానానికి ఇతడే మూలపురుషుడు) బాజీరావు భీకర యుద్ధాల్లో చిత్తుగా ఓడించాడు. సిద్దీలు, పోర్చుగీసువారు ఆక్రమించిన మరాఠా ప్రాంతాలను తిరిగి గెలుచుకున్నాడు. దక్షిణాదిన తన కత్తికి ఎదురులేకుండా చేసుకోవడంతోబాటు రాజపుత్రుల సాయంతో మాళవ రాజ్యాన్ని సునాయాసంగా జయించాడు. గుజరాత్‌ను కైవసం చేసుకుని దండయాత్ర చేసి మొగలు సామ్రాజ్య మహావృక్షాన్ని కూకటివేళ్ళతో పెకలించివేశాడు. తమ్ముడు చిమ్నాజీ అప్పా, మెరికల్లాంటి అనుచరులు ఉదయ్ పవార్, మల్హర్‌రావు హోల్కర్, రణోజీ సింధియాలు వీర విధేయతతో వెన్నంటి నిలిచి బాజీరావు దిగ్విజయంలో అద్భుతంగా తోడ్పడ్డారు. వాయువేగంతో పరిగెత్తే జవనాశ్వాల బలం బాజీరావు విజయానికి కీలకం. యాభై అరవై వేల మరాఠా గుర్రాలు భారీ సామాన్ల లంపటాలేవీ లేకుండా తేలిగ్గా గాలితో పందెంవేస్తూ.... బాజీరావు నేతృత్వంలో తూటాల్లా అగ్గిబరాటాల్లా దూసుకుపోతోంటే జాతి జనుల హృదయాలు గర్వంతో పొంగేవి. శత్రువుల గుండెలదిరేవి. ఈ అశ్వశక్తి ధాటికి తాళలేక నిజాం-ఉల్-ముల్క్ అంతటి గండరగండడే తోకముడిచి లెంపలేసుకున్నాడు.

విశేషమేమిటంటే బాజీరావు రణతంత్రాన్నీ, పోరాట పటిమనూ అతడి సమకాలికులే గాక ఆధునిక యుగంలో కొమ్ములు తిరిగిన యుద్ధ నిపుణులూ మెచ్చుకున్నారు. ఉదాహరణకు - రెండో ప్రపంచ యుద్ధకాలంలో హిట్లర్ సైనిక శక్తిని ధ్వంసం చేయడంలో కీలక పాత్ర వహించిన ఫీల్డ్ మార్షల్ మాంట్ గొమెరి 1968లో రాసిన ***History of Warfare*** ఉద్గ్రంథంలో ప్రాచీన కాలంనుంచి ఆధునిక యుగం వరకూ ప్రపంచంలో జరిగిన అతి ముఖ్యమైన యుద్ధాల్లో ఒకటిగా బాజీరావు పాల్‌ఖేడ్ సంగ్రామాన్ని పేర్కొన్నాడు.

"The Palkhed Campaign of 1727-28 in which Baji Rao I out-generalled Nizam-ul-Mulk is a masterpiece of strategic mobility". *(ఒక చోటినుంచి ఒక చోటికి వ్యూహాత్మకంగా కదిలే యుద్ధకళకు 1727-28లో నిజాం-ఉల్-ముల్క్‌ను బాజీరావు ఓడించిన పాల్ఖేడ్ పోరు ఉత్తమ ఉదాహరణ)* అని మాంట్‌గొమరీ అంతటి ఆధునిక యుద్ధ నిపుణుడు ఎందుకు ప్రస్తుతించాడు? వేల సంవత్సరాల చరిత్రలో ప్రపంచంలో ఎన్నో వేల మహాయుద్ధాలు జరగగా, అత్యద్భుతంగా సేనలను నడిపించి చారిత్రాత్మక విజయాలను సాధించిన మహావీరులు వందల సంఖ్యలో ఉండగా వారిలో ముఖ్యంగా బాజీరావునే గుర్తుచేసుకోవలసిన ప్రత్యేకత ఏమిటి?



# నేలకరిచిన నిజాం

**'మహామహా మొగలులనే మట్టి కరిపించాను. ముష్టి మరాఠాలు నాకో లెక్కా' అనుకున్నాడు నిజాం-ఉల్-ముల్క్. అతడు వట్టి అహంకారి కాదు. రణ తంత్రాల్లో ఆరితేరి మహాసైన్యాలను ఓడించి ఉద్దండ పిండాలెందరినో పిండి చేసిన అనుభవశాలి.**

నిజాం-ఉల్-ముల్క్ దక్కను సుబేదారు. అలాగని మొగల్ చక్రవర్తికి తాబేదారు కాదు. తన దారికి అడ్డు తగిలితే పాదుషానైనా అతడు లెక్క చేయడు. 18వ శతాబ్దం మొదటి పాదంలో మొగలు రాజ్యంలో అతడి కత్తికి ఎదురులేదు. 1720లో అతడు మాళవ గవర్నరుగా ఉన్నప్పుడు ఢిల్లీలో చక్రం తిప్పుతున్న సయ్యద్ సోదరులు కక్షగట్టి వెనక్కి పిలిపిస్తే నిజాం తిరగబడి పెద్ద సైన్యంతో వెళ్లి దక్కనును ఆక్రమించాడు. తన మీదికి దండెత్తిన ఢిల్లీ సైన్యాన్ని చిత్తుగా ఓడించి, సయ్యద్‌ల ముక్కున గుద్ది దక్కను సుబేదారుగా తనను గుర్తించే ఫర్మానా రాబట్టాడు. మూడేళ్ల తరవాత ఢిల్లీ దర్బారుకు వజీరు హోదాలో వెళ్ళి చక్రవర్తితో సరిపడక దక్కనుకు నిజాం తిరిగి వచ్చాడు. అక్కడ తనను భారీ సేనతో ఎదిరించిన సుబేదారు ముబ్రేజ్‌ఖాన్ తల నరికి వెండి పళ్ళెంలో పెట్టి మొహమ్మద్ షా చక్రవర్తికి కానుకగా పంపించాడు. దాంతో వేరే దారి లేక మహమ్మద్ షా తోక ముడిచి మళ్లీ నిజాంనే దక్కన్ సుబేదారుగా నియమిస్తూ ఫర్మానా ఇచ్చాడు. అది మొదలుకుని పేరుకు సుబేదారు అయినా నిజాం-ఉల్-ముల్క్ సర్వస్వతంత్రంగానే దక్కనును ఏలుతున్నాడు. దక్షిణాదిన స్వతంత్ర రాజ్యస్థాపనకు సన్నాహాలు చేస్తున్నాడు.

అప్పుడు దక్కనులో మరాఠాల ప్రభ ఉజ్వలంగా వెలిగి పోతున్నది. తన రాజ్యకాంక్ష నెరవేరాలంటే ఏనాటికైనా వారితో ఘర్షణ తప్పదని నిజాంకు తెలుసు. అందుకే మొదటి నుంచీ తెలివిగా పథకం వేశాడు. కాలూ చెయ్యీ కూడదీసుకుని తాను కుదుటపడేవరకూ మరాఠాలతో మంచిగానే ఉన్నాడు. 1723లో ముబ్రేజ్‌ఖాన్‌ను జయించేందుకు పీష్వా బాజీరావు సైనిక సహాయాన్ని తీసుకున్నాడు. (తమకు ప్రధాన శత్రువైన ముబ్రేజ్‌ఖాన్ పీడ విరగడ చేసుకోవటానికి బాజీరావు తమకు పాత విరోధి అయిన నిజాంకు వ్యూహాత్మకంగా

సహకరించాడు). తనపైకి చక్రవర్తి ఉసిగొలిపిన శత్రువులందరి అడ్డు తొలగించుకొని దక్కనులో కాలు నిలదొక్కుకున్నాక మరాఠాల పనిబట్టేందుకు నిజాం ఆయత్తమయ్యాడు.

దానికి చాలా ఒడుపుగా వ్యూహం పన్నాడు. ముందుగా – మరాఠాల దాడికి తేలికగా లోనయ్యే ఔరంగాబాదు నుంచి దూరంగా, సైనిక రక్షణ దృష్ట్యా పటిష్ఠమైన హైదరాబాదుకు తన రాజధానిని మార్చాడు. తరవాత – సాహు పక్షంలోని పెద్ద సర్దార్లు, గొప్ప సేనానులు కొందరిని జాగీర్లతో, ఇతర ప్రలోభాలతో బుట్టలో వేసుకున్నాడు. ఈ పన్నాగంలో భాగంగానే ప్రతినిధి శ్రీపతిరావును మంచి చేసుకున్నాడు. 'మరీ నా రాజధాని నుంచి కూడా మీరు 'చౌథ్' వసూలు చేయడం నాకు నామర్దా కదా? మంచి జాగీరు ఇస్తాను. దాన్ని తీసుకుని హైదరాబాదును చౌథ్ నుంచి మినహాయించండి' అని శ్రీపతిరావు ద్వారా సాహుకు బేరం పెట్టాడు. బాజీరావు అంటే గుడ్డి ద్వేషంతో రగులుతున్న శ్రీపతిరావు నిజాం ప్రతిపాదనను అంగీకరించమని సాహు రాజుకు నచ్చచెప్పి ఒప్పించాడు.

తొలుత హైదరాబాదుకు మాత్రం మినహాయింపు పొందిన నిజాం... దక్కనులోని మొత్తం ఆరు సుబాల్లోనూ చౌథ్ కట్టేది లేదని కొన్నాళ్లకు అడ్డం తిరిగాడు. ఇదేమి పనయ్యా అని శ్రీపతిరావు మొత్తుకుంటే ఏకంగా సాహు అధికారానికే ఎసరు పెట్టాడు. మొగలు చక్రవర్తి ఏనాడో అంగీకరించిన సాహు ప్రభుత్వపు హక్కును తిరగదోడి, కొల్హాపూర్‌లోని దాయాది శంభాజీని ఎగదోసి అతడి చేతా 'చౌథ్' అడిగించాడు. 'మీ ఇద్దరిలో అసలు హక్కుదారులెవరో ముందు తేలాలి. నా దగ్గరికి మీ మనుషులను పంపి ఎవరి వాదన వారు వినిపించండి. అన్నీ విన్నాక ఎవరిది న్యాయమో నేను నిర్ణయిస్తా'నని సాహుకు కబురు పంపాడు.

శ్రీపతిరావుకు ఇందులోని మర్మం అర్థం కాలేదు. 'సరే! అలాగే చేద్దాం. నిజాం దగ్గరికి ఎవరినైనా పంపి మన హక్కేమిటో తెలియజెబుదా'మని రాజుకు అతడు సలహా ఇచ్చాడు.

బాజీరావుకు చిర్రెత్తింది. 'అమాయకంగా నిజాం వలలో పడకండి. అతడి మోసాన్ని గ్రహించండి' అని అతడు రాజును వారించాడు. తమను దెబ్బ తీసేందుకు కొంతకాలంగా పథకం ప్రకారం నిజాం వేస్తున్న ప్రతి అడుగునూ గుర్తు చేశాడు. మనం జాగ్రత్త పడి వెంటనే యుద్ధంలో అతణ్ణి నాశనం చేయపోతే అతడే మనల్ని నాశనం చేసి తీరుతాడు' అని హెచ్చరించాడు. సాహు సరేనన్నాడు.

ఆ సంగతి తెలిసి నిజాం వికటంగా నవ్వాడు. మరాఠాల్లో అంతర్యుద్ధం తెచ్చి, పెద్ద సైన్యంతో శంభాజీని తనవెపు తిప్పుకున్నందున మరాఠాలను సునాయాసంగా నలిపేయ్యగలనని అతడు మిడిసిపడ్డాడు. తన అంచనాలన్నిటినీ తలకిందులు చేయగల శక్తి బాజీరావుకు ఉన్న సంగతి అతడు గ్రహించలేదు.

మొగల్ చక్రవర్తి సైన్యాన్ని ముమ్మారు చిత్తు చేసిన మహాయోధుడిగా ఆ కాలంలో నిజాంకు పెద్ద పేరు. అతడి శతఘ్ని దళాన్ని తలచుకుంటేనే శత్రువులకు హడలు. ఉభయ పక్షాలూ మామూలు సాంప్రదాయిక పద్ధతిలో యుద్ధం చేసినంతవరకూ నిజాంను ఎవరూ జయించలేరు. కానీ మరాఠాలది మామూలు పద్ధతి కాదు. శత్రువుతో బాహాబాహి తలపడి, ఎట్టిపరిస్థితిలోనూ విరోధికి వెన్నుచూపకుండా చివరి వీరుడు నేలకొరిగేవరకూ పోరాడి వీర మరణానికి అర్రులు సాచే రాజపుత్రుల వంటివారు కారు మరాఠాలు. వారితో యుద్ధం నీడలతో యుద్ధం వంటిది. మెరుపు దాడి వారి ప్రత్యేకత. వారి రణతంత్రాన్ని పోల్చుకోవడం కంటే పాదరసాన్ని పట్టుకోవటం తేలిక.



అసలు – సేనల మోహరింపు, కదనానికి కదలికలలోనే నిజాం తీరుకూ, మరాఠాలకు విపరీత వ్యత్యాసం ఉంది. ముందు అగ్రదళం. దాని వెనక కుడి, ఎడమల చతురంగ బలాలు కాపు కాస్తుండగా మధ్యలో ప్రధాన సైన్యంతో నిజాం! ఆ వెనుక రిజర్వు దళం; ఇతర మందీ మార్బలం. గుమాస్తాలు, పరిచారకులు, వంటవారు, సామాన్లు మోసేవారు, సామాన్లు సరఫరా చేసే కాంట్రాక్టర్లు, దుకాణాల వారు, వార్తాహరులు, గూఢచారులు, నాట్యగత్తెలు, ఫకీర్లు...! యుద్ధం చేసే సైనికుల కంటే నానాబాపతుల జనం సంఖ్య ఎక్కువ! నడిచే ఊరు లాంటి ఈ భారీ పరివారం నెమ్మదిగా తప్ప కదలలేదు. అన్నట్టు, దీనికి తోడు శతఘ్నులు! ఎదుట పడిన వారిని తునాతునకలు చేయగలవు. ఎంతటి కోటలనైనా కూల్చగలవు. కాని అవి వేగంగా పరిగెత్తలేవు. ఎందుకంటే శతఘ్నులను లాగేవి ఎడ్లు. వాటి వేగం వాటిది! మైదాన ప్రాంతాల్లో ఏమోగాని కొండలు, గుట్టలు, లోయల వెంబడి ఎగుడుదిగుళ్ల దారిలో ఇంత భారీ లంపటంతో శత్రువును వెంటాడాలంటే తలప్రాణం తోకకు రావలసిందే!

ఇక ఆవలివైపు మరాఠాలకు ఈ బాదరబందీ ఏదీ లేదు. వారి దగ్గర శతఘ్నులు కాదు – నాటు తుపాకులు కూడా లేవు. డాలు, కత్తి, బల్లెం వారి ప్రధానాయుధాలు. గుర్రం వారి వాహనం. కొండలు, కోనలు చిరపరిచితాలు కనుక కళ్లు మూసుకుని దూసుకుపోగలరు. ఎక్కడ ఏది దొరికితే అది తినడమే! నిద్రవస్తే ఎక్కడ పడితే అక్కడ పడుకోవటమే తప్ప వంట, గింట, బస ఏర్పాట్లకు సామాన్లను, మనుషులను వారు మోసుకుపోరు. శత్రు రాజ్యంలో ఊళ్లు దోచుకునేటప్పుడూ బంగారం, వెండి నగలు, నగదే తప్ప సరుకులు, సామాన్లు సంగ్రహించరు. ఎక్సెస్ లగేజి సమస్య ఉండదు. కాబట్టి మెరపు వేగంతో వారు కదలగలరు. అధాటున శత్రువుపై దాడి చేసి కన్ను మూసి తెరిచేంతలో మాయమవగలరు.

మహారాష్ట్రలో వానాకాలం ఎవరూ యుద్ధాలు చేయరు. దూర దేశాలకు యుద్ధం నిమిత్తం వెళ్ళిన సైనికులు కూడా వర్షరుతువు కల్లా స్వస్థలానికి తిరిగి వచ్చి ఇంటి దగ్గర వ్యవసాయం చేసుకుని దక్కనులో మళ్లీ సీజనులో సైనిక దుస్తులు ధరించడం రివాజు. ఆ ఏడు వర్షాకాలం గడిచేంత వరకూ ఆగి 1727 నవంబరు మధ్యలో సాహు రాజ్యంపై శంబాజీ సైన్యంతో కలిసి దండెత్తాలని నిజాం నిశ్చయించాడు. ఆ సంగతి వేగుల ద్వారా బాజీరావుకు తెలిసింది. తమను ముట్టడించడానికి ముందే శత్రువుపై ఎదురుదాడి చేయదలిచి, కుండపోతగా వర్షాలు కురుస్తుండగానే ఆరేడు వేల అశ్వదళంతో ఆగస్టు చివరిలోనే చిచ్చరపిడుగులా బయలుదేరాడు.

ఆ తరువాత జరిగింది ప్రపంచ యుద్ధ నిపుణులనే ఆశ్చర్యపరచిన చరిత్రాత్మక సంగ్రామం!

కొద్దిపాటి అశ్విక దళంతో బాజీరావు ఎక్కడా ఎక్కువకాలం ఆగకుండా అడ్డుతగిలిన వారిని సంహరించుకుంటూ దూసుకువెళ్లి నిజాం పాత రాజధాని ఔరంగాబాద్ మీద పడ్డాడు. దానినీ, పక్కనే ఉన్న జాల్నా జిల్లానూ యథేచ్ఛగా కొల్లగొట్టాడు. కబురు తెలిసిన నిజాం ఉలిక్కిపడి ఔరంగాబాద్ రక్షణకు హుటాహుటిన సైన్యాన్ని తరలించాడు. అది అడంగు చేరేలోపే బాజీరావు మాహూర్ పట్టణానికి, అక్కడి నుంచి జాఫరాబాద్‌కు తరలి నిరాఘాటంగా నగానట్రా దోచుకున్నాడు. నిజాం సేన తనను చేరుకొనేలోపే గజిబిజిగా కదిలి ఉత్తర బేరార్‌ను కొల్లగొట్టాడు. అక్కడి నుంచి హఠాత్తుగా ఉత్తరం వైపు తిరిగి హడగావ్ మీద పడి పశ్చిమానికి చక్కరుకొట్టి ఖాందేశ్‌లో తేలాడు. రోజుకు ముప్ఫై నలభై మైళ్ళ చొప్పున ప్రయాణిస్తూ బాజీరావు తన రాజ్యంలో ఊరు తరవాత ఊరును కొల్లగొడుతూంటే నిజాంకు

దిక్కుతోచలేదు. సేనలను ఎటువైపు పరిగెత్తించినా, బాజీరావు దండును అందుకోవడం సాధ్యపడలేదు. ఎక్కడా నిలకడగా సంకుల సమరం సాగించకుండా, ఇట్టే పోరాడి అట్టే మాయమయ్యే మరాఠాలను ఎంత భారీ అశ్వదళం, బండ్లకొద్దీ ఎన్ని శతఘ్నులు ఉండీ, నిజాం పట్టుకోలేకపోయాడు. వెనకా ముందూ, కుడీ, ఎడమా దాడుల వరసతో నిజాంకు చెమటలు పట్టించిన మీదట బుర్హాన్‌పూర్‌ను దోచుకొని, దగ్ధం చేయబోతున్నట్టు భ్రమగొలిపి, కొద్ది బలగంతో ఆ నగరం దిశగా బాజీరావు కదిలాడు. ఎలాగైనా అతడిని అడ్డుకోవాలని తన నలభై వేల సైన్యంతో చస్తూ పడుతూ పరుగెత్తి బుర్హాన్‌పూర్, చేరితే అక్కడ బాజీరావు అయిపు లేదు. 'ఎక్కడ ఆ సైతాన్? గాలిలో కలిశాడా, నరకానికి పోయాడా?' అని నిజాం-ఉల్-ముల్క్ చిందులు తొక్కుతుండగా బాజీరావు రెండు పెద్ద నదులు తపతి, నర్మదలను దాటి ఎవరూ ఊహించని రీతిలో గుజరాత్‌కు మరలాడు.

ఇక ఇలాగైతే లాభం లేదని, పీష్వా సొంత స్థావరాన్నే ముట్టడించి బుద్ధి చెప్పాలనుకుని నిజాం భారీ సైన్యంతో పుణె మీద విరుచుకుపడ్డాడు. ఆ సమయానికి అక్కడి సేనలు చాలా వరకు బాజీరావుకు సాయంగా వెళ్ళాయి. ఏమి చేయాలో తోచక సాహు రాజు పురందర్ కోటలో తలదాచుకుని, బాజీరావును తక్షణం తిరిగి రమ్మంటూ ఆర్తనాదాలు చేశాడు. నిజాం వికటాట్టహాసంతో పుణెలో ప్రవేశించి, శంభాజీని రాజుగా ప్రకటించాడు. ఓ రాజపుత్ర కన్యనిచ్చి అతడికి పెళ్ళి కూడా చేశాడు.

బాజీరావుకు ఈ సంగతి తెలిసింది. అయినా బెంబేలు పడి పూణెకు పరుగున పోలేదు. నా కోటను నువ్వు పట్టుకుంటే నీ కోటను నేను పట్టుకుంటానని ఆగ్నేయం దిక్కుకు మరలి ఔరంగాబాద్‌ను కొల్లగొట్టాడు. ఆయువు పట్టు మీద దెబ్బ తగలడంతో నిజాం కంగారుపడి పూణె నుంచి ఆఘమేఘాల మీద ఔరంగాబాద్‌కు ససైన్యంగా పరుగుపెట్టాడు. నెలల తరబడి కొండకోనల వెంబడి వందల మైళ్లు పిచ్చెత్తేలా పరుగులు తీయించిన మీదట ఔరంగాబాద్‌కు 28 మైళ్ల దూరంలోని పాల్ఖేడ్ వద్ద బాజీరావు అతడి కోసం కాచుకుని ఉన్నాడు. సరైన స్థలం, సమయం ఎంచుకుని శత్రువుతో ముఖాముఖి తలపడ్డాడు.

కాల్బలం, అశ్వబలం, శతఘ్నిదళం, ఇతర మందీమార్బలం మొత్తం 40 వేల బలగంతో నిజాం గోదావరి దాటవలసి వచ్చింది. అంతా ఒకేసారి కట్టకట్టుకుని దాటటం కుదరదు. సగం సైన్యంతో నిజాం ముందుగా నది దాటి, మిగతా వారి కోసం పడవలని వెనక్కి పంపాడు. ఒక రోజంతా సైన్యం ఈ ఒడ్డున, శతఘ్నులు ఆ ఒడ్డున ఉండిపోవలసి వచ్చింది. ఆ అదను కోసమే వేచి ఉన్న బాజీరావు తన అశ్వదళంతో నిజాం మీదికి ఉరికాడు. పథకం ప్రకారం ఆగి ఆగి మెరుపు దాడులు చేసి మాయమవుతూ శత్రుసేనను నీళ్లు పుట్టని ప్రాంతానికి తరిమి, చక్రబంధంలో ఇరికించాడు. నీళ్లు సామాన్లు మోసుకొచ్చే గాడిదలను, బండ్లను అడ్డగించి, ఆకలి దప్పులతో నిజాం సేన అలమటించేట్టు చేసి ఎటూ తప్పించుకోలేకుండా తన గుర్రాలతో చుట్టుముట్టాడు. అప్పటికి ఏకబిగిన 700 మైళ్లకు పైగా గుర్రపు స్వారీ చేస్తున్నా బాజీరావులో అలుపూ సొలుపూ లేదు. నాటికి అతడి వయసు 28 కాగా నిజాం ఉల్‌ముల్క్ 57 ఏళ్లవాడు. చంద్రసేన్ యాదవ్, అవాజ్‌ఖాన్ లాంటి నిజాం సర్దార్లూ వయసు మళ్లినవారే. గుర్రాలకు దాణాలేక, తమకూ అన్నం నీళ్లులేక నకనకలాడుతూ పోరు సాగించటం చేతకాక వారు చేతులెత్తేసి కాళ్ళ బేరానికి వచ్చారు. దక్కనులోని ఆరు సుబాల్లో చౌథ్, సర్దేశ్‌ముఖిలను బకాయిలతో సహా చెల్లించి, మరాఠా ప్రభువుగా సాహు ఆధిపత్యాన్ని



అంగీకరించే షరతులపై 1728 మార్చిలో సంధి కుదిరింది. అప్పటికి బాజీరావు సుడిగాలి దండయాత్రను ప్రారంభించి ఏడు నెలలు. పాల్ఖేడ్ దిగ్విజయంతో బాజీరావు సత్తా ఏమిటో అందరికీ తెలిసి వచ్చింది. శ్రీపతిరావుల వంటి వారి దుర్బోధలకు చెవి ఒగ్గడం మాని, సాహు కూడా అప్పటి నుంచీ పీష్వా చెప్పినట్టే నడచుకోసాగాడు.

పాల్ఖేడ్ పరాభవంతో నిజాం-ఉల్-ముల్క్ కథ అయిపోలేదు. తొమ్మిదేళ్ల తరువాత మళ్లీ అతడు తగుదునంటూ బాజీరావు జోలికొచ్చాడు. మళ్లీ ఘోర పరాజయం పాలయ్యాడు. అది ఇంకో రసవత్తర గాథ.

మాళవ, గుజరాత్ స్థానాలకు నయానో భయానో మరాఠా ప్రాబల్యాన్ని విస్తరించి, పోర్చుగీసు వారిని మట్టి కరిపించిన మీదట బాజీరావు 1737లో ఢిల్లీ మీదికి దండెత్తాడు. రాజధానిని అతలాకుతలం చేసి చక్రవర్తి మహమ్మద్ షాను గడగడ లాడించాడు. మంత్రులు, సేనాపతులు, సర్దార్లు లెక్కకు మిక్కిలిగా ఉండి కూడా బాజీరావు ధాటిని ఒక్కరూ అడ్డుకోలేక పోవటంతో మొహమ్మద్‌షాను పిరికితనం ఆవహించింది. బాజీరావు మళ్లీ దాడి చేస్తే తిండి దండుగ సేనానులెవరూ అడ్డుకోలేరు కనుక తన గతి ఏమిటా అని బెంబేలుపడిన భయవిహ్వల స్థితిలో నిజాం-ఉల్-ముల్క్ ఒక్కడే రక్షకుడిగా కనపడ్డాడు. గతంలో అతడు తన మీదే తిరగబడిన సంగతి కూడా మరిచిపోయి వెంటనే వచ్చి మరాఠాల బారి నుంచి సామ్రాజ్యాన్ని కాపాడమని పాదుషా దేబిరించాడు. పాల్ఖేడ్ దెబ్బతో దిమ్మతిరిగి మళ్లీ మరాఠాల తెరువు పోకుండా తలవాల్చుకుని ఉన్న నిజాంకు తోక లేచింది. ఢిల్లీలో మేళతాళాలతో ఘన స్వాగతం ఇచ్చి, నెమలి సింహాసనం దిగి వచ్చి పాదుషా అతడిని అక్కున చేర్చుకున్నాడు. వెలలేని కానుకలతో, అత్యున్నతమైన 'అసఫ్‌జా' బిరుదుతో సత్కరించి 'నా సైన్యాన్ని, నా సర్వస్వాన్నీ' నీ చేతుల్లో పెడుతున్నాను. మాళవ, గుజరాత్‌ల నుంచి మరాఠాలను తరిమేసి ఆ రాజ్యాలను నువ్వే తీసుకో' అన్నాడు. నిజాంకు ఆశపుట్టి సరేనన్నాడు. వానలు వెనకబట్టగానే తుపాకులు, ఫిరంగులు తీసుకుని అట్టహాసంగా 70 వేల సేనతో మాళవ మీదికి దండెత్తాడు. ఇక మరాఠాల పని ఖాళీ అని అందరూ అనుకున్నారు. 

ఆ సమయానికి పోర్చుగీసు వారితో పోరులో బాజీరావు తలమునకలుగా ఉన్నాడు. కబురు అందగానే 80 వేల సేనను పోగేసి హుటాహుటిన నర్మద దాటి ఉత్తరాదికి తరలాడు. 1737 డిసెంబరులో రెండు సేనలూ భోపాల్ వద్ద తారసపడ్డాయి. వెనక సరస్సు, ముందు, పక్కల సైనిక రక్షణతో దుర్భేద్యమైన భోపాల్ కోటను ఆక్రమించి, చుట్టూతా సైన్యాన్ని పెట్టుకుని బాజీరావు రాక కోసం నిజాం వేచి ఉన్నాడు. ఎటూ సందు లేకుండా మరాఠాలకు దిగ్బంధం చేశాననే నిజాం అనుకున్నాడు. అతి జాగ్రత్తగా తాను పన్నిన వ్యూహమే తన మెడకు పాశమవుతుందని అతడు ఊహించలేకపోయాడు. 

బాజీరావు సేనలతో నలువైపులా చుట్టుముట్టి బయటి నుంచి గడ్డిపరక కూడా కోట లోపలికి పోకుండా అడ్డగించాడు. ఆహారపు నిల్వలు అయిపోవడంతో కొన్నాళ్లకు హాహాకారాలు మిన్నుముట్టాయి. వెంటనే సైన్యంతో వచ్చి ఆదుకోమని హైదరాబాద్‌లోని తన కుమారుడు నాసర్ జంగ్‌కు నిజాం కబురు పంపాడు. అతడు ఉన్నపళాన బయలుదేరాడు. ఆ సంగతి బాజీరావు ముందుగానే ఊహించాడు. తమ్ముడు చిమ్నాజీ అప్పాను తపతి తీరాన కాపలా పెట్టి అతడిని అడ్డగించాడు. బయటపడేందుకు అన్ని యత్నాలూ విఫలమవడంతో నిజాం విధిలేక రాజీకి దిగివచ్చాడు. మాళవ మీద సర్వాధికారాలను మరాఠాలకు దఖలు పరిచి,

ఆగ్రా సమీపంలోని చంబల్ నది నుంచి నర్మద వరకూ విశాల ప్రాంతాన్ని వారికి అప్పగించి, 50 లక్షల రూపాయల పరిహారాన్ని చెల్లించేందుకు చక్రవర్తి తరఫున 1738 జనవరి 7న ఒడంబడి, నిజాం బతుకు జీవుడా అని బయటపడ్డాడు.

దక్కనులో తమకు పక్కలో బల్లెం లాంటి నిజాం రెండుమార్లు తన చేతికి చిక్కినా, అతణ్ని నాశనంచేసి శాశ్వతంగా అడ్డు తొలగించుకునేందుకు అవకాశం వచ్చినా రెండు సార్లూ బాజీరావు అతణ్ని ఎందుకు విడిచిపెట్టాడన్నది చరిత్రలోని మిస్టరీల్లో ఒకటి. బహుశా మొగలు సింహాసనం పట్ల సాహుకు గల చిత్రమైన గౌరవభావం ఇందుకు కారణమై ఉండవచ్చు. లేదా - చంపదగిన శత్రువు చేత చిక్కిన ప్రతిసారి భారత చరిత్రలో ఆది నుంచీ హిందూ ప్రభువులను కమ్మిన జీవకారుణ్యమే బాజీరావునూ అవహించి ఉండవచ్చు. ఏమైతేనేమి కుటిలాత్ముడైన శత్రువును అవకాశం వచ్చినప్పుడు నిర్మూలించకుండా చూపిన ఔదార్యం మూలంగా దక్షిణాదిన మరాఠాలకు నిజాం రాజ్యం శాశ్వతమైన బెడద అయింది. కాలక్రమంలో మరాఠాలపై బ్రిటిష్ వారు తుపాకులు ఎక్కుపెట్టేందుకు ఆ ముస్లిం రాజ్యమే వాటంగా ఉపయోగపడింది. నిజాం పట్ల చూపిన ఉపేక్ష కాలసర్పమై కడకు మరాఠా మహాశక్తినే కాటు వేసింది!

మరాఠాల చారిత్రక తప్పిదాల్లో ఇదొకటి!....



# ఛత్రసాల్ ఛత్రం

ఛత్రసాల్‌ను మళ్ళీ విధి వెక్కిరించింది.

చిన్నతనం నుంచీ అతడికి అన్నీ కష్టాలే. బుందేల్‌ఖండ్‌లో మొగల్ సామ్రాజ్యంపై తిరగబడ్డ అతడి తండ్రిని, తల్లిని ఒక నమ్మకద్రోహి సాయంతో ఔరంగజేబు మనుషులు చంపేశారు. అప్పుడు ఛత్రసాల్‌కి పన్నెండేళ్లు. నానా అవస్థలు పడి పెద్దయ్యాక తన తండ్రి మీద అభిమానం గల రాజా జయసింగును ఆశ్రయించాడు. అప్పుడాయన దక్కనులో మొగలు సుబేదారుగా మరాఠాలతో యుద్ధాలు చేస్తున్నాడు. ఛత్రసాల్‌ను, అతడి అన్నను మొగల్ సైన్యంలో చేర్చుకున్నాడు. పరాక్రమంతో పాదుషాను మెప్పించమన్నాడు. దేవగఢ్ యుద్ధంలో ఛత్రసాల్ మరాఠాలపై వీర విహారం చేసి ఒళ్ళంతా గాయాలైనా లెక్క చేయక పోరాడి మొగలులకు గొప్ప విజయం సాధించి పెట్టాడు. ఆ విజయానికి అంతా మురిసిపోయారే గానీ దానికి కారకుడైన ఛత్రసాల్‌ను ఎవరూ పట్టించుకోలేదు. యుద్ధంలో పాల్గొన్న ముసల్మానులందరికీ పాదుషా నుంచి గొప్ప బహుమానాలు అందాయి. ఛత్రసాల్‌కు కనీసం ఒక మంచి మాటయినా దక్కలేదు.

ఛత్రసాల్‌కు దుఃఖం వచ్చింది. తన మీద తనకే అసహ్యం వేసింది. సుక్షత్రియ కుటుంబంలో పుట్టి, ముసల్మాన్ల పంచన చేరి వారి గుర్తింపు కోసం అంగలార్చడమేమిటని అనుకున్నాడు. తండ్రిలాగే తానూ ధర్మదీక్షతో మొగలులపై పోరాడాలని నిశ్చయించాడు. చేతిలో ధనంగానీ, బలగం లేని నిస్సహాయ స్థితిలో వందల మైళ్ల దూరంలోని స్వస్థలానికి తిరిగి వెళ్ళి పోరాటం నడపటం తనకు శక్తికి మించిన పనిగా అతడికి తోచింది. అందుకని మొగలులకు వ్యతిరేకంగా యుద్ధం సాగిస్తున్న హిందూ ప్రభువులెవరి పక్షంలోనైనా చేరిపోవడమే ఉత్తమమని భావించాడు. అలా తాను ఆశ్రయించి, సేవించడానికి అన్ని విధాల యోగ్యుడిగా ఒకే ఒక్క హిందూ వీరుడు అతడికి కనిపించాడు :

శివాజీ!

మొగలు మహాసామ్రాజ్యాన్ని నిర్భయంగా ఎదిరించి, ఔరంగజేబును గడగడలాడిస్తున్న శివాజీయే తనకు శరణ్యమన్న ఆలోచన కలగగానే ఛత్రసాల్ ఆయనను వెదుక్కుంటూ కొద్ది పరివారంతో బయలుదేరాడు. అప్పట్లో దక్కను నుంచి మరాఠా రాజ్యంలో అడుగుపెట్టటం మహాకష్టం. రహదారుల మీద గట్టి నిఘా ఉంది. అనుమతి లేకుండా శత్రురాజ్యం నుంచి తమవైపు ఎవరు అడుగుపెట్టినా, తమ నుంచి అటుకేసి పోతున్నా గస్తీదళాలు అటకాయించి ప్రాణాలు తీసేవి. దీనికి తోడు దట్టమైన కీకారణ్యాలు. వాటి నిండా క్రూరమృగాలు. కాలు పెట్టరాని కొండలు, లోయలు. వాటి మధ్యే కాలే కడుపులతో, ఎండే గొంతులతో వందల మైళ్లు పళ్లబిగువన ప్రయాణించి ఛత్రసాల్ పరివారం ఎట్టకేలకు మహారాష్ట్ర చేరుకుంది.

అప్పుడు శివాజీ సింహగఢ్ కోటలో విడిది చేసి ఉన్నాడు. అతి కష్టం మీద ఛత్రసాల్ ఆయన దర్శనానికి అనుమతి సంపాదించాడు. చుట్టూ కొండచరియల సహజ రక్షణతో... కొండలను కలుపుతూ దుర్భేద్యంగా నిర్మించిన ఉక్కులాంటి గోడలతో ఆరు బ్రహ్మాండ ప్రాకారాలతో ఆకాశమంత ఎత్తున ఉన్న సింహగఢ్ కోట వైభవాన్ని చూడటానికి అతడి రెండు కళ్ళూ చాలలేదు. అతి ప్రయాసతో పైకి చేరుకున్న ఛత్రసాల్‌కు శివాజీని చూడగానే బడలిక అంతా పోయింది. ఉత్సాహం ఉప్పొంగింది.

శివాజీ లేచి ఛత్రసాల్‌ను సాదరంగా ఆహ్వానించి తన పక్కన కూచోబెట్టుకున్నాడు. సగౌరవంగా అతిథి మర్యాదలు, కుశల ప్రశ్నలు అయ్యాక ఛత్రసాల్ తన పరిస్థితి విన్నవించి అసలు విషయానికి వచ్చాడు.

'మహారాజ్! ఇవాళ హిందూ దేశానికి ఏకైక ఆశాజ్యోతి తమరే. మీ పరాక్రమంతో, మీ ధర్మదీక్షతో జాతి మొత్తానికి తమరు ఆదర్శంగా నిలిచారు. అందుకే ఇంత దూరం మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చాను. మీ సేవలో తరించి, మీ పక్కన నిలబడి పోరాడటం కన్నా ప్రపంచంలో నేను కోరదగింది మరొకటి లేదు' అని ఉద్వేగంతో ఆత్మసమర్పణం కావించుకున్నాడు.

శివాజీ దీర్ఘంగా ఆలోచించి, కొంత సేపటికి ఛత్రసాల్ భుజం మీద ఆప్యాయంగా చెయ్యి వేసి, ప్రేమాభిమానాలతో కర్తవ్య బోధ చేశాడు.

"My brave friend! conquer and subdue your foes! resume and rule your native land! destroy the Emperor's army! slay the Turks and Moguls, and trust not that deceitful race! and whenever they evince an intention of attacking you, I will distract their attention, and subvert their plans, by active co-operation...

...Return then to your native land; levy an army; expel the invaders, grasp the sword, and kunheeyu will protect you... ...If victorious you will repossess your country, and immortalise your name. If in this quarter we attack the enemy, the fame of the deed will be mine. It is therefore expedient to commence hostilities in your own dominions..."

[*A History of the Bondelas*, **Capt. W.R. Pogson**, *pp.52-53*]



(మిత్రమా! నీ శత్రువులను జయించి లొంగదీయి. నీ రాజ్యాన్ని నువ్వు గెలుచుకో. చక్రవర్తి సైన్యాన్ని నాశనం చేయి. తురకలను, మొగలులను వధించు! ఆ మోసపు జాతిని ఎప్పుడూ నమ్మకు! వారు నీ జోలికి వస్తే నేను వారి దృష్టి మరలించి, వారి పథకాలను భగ్నం చేసి నీకు సహకరిస్తాను... నీ మాతృభూమికి మరలు. సైన్యం తయారు చేయి. దురాక్రమదారులను గెంటెయ్యి. కత్తి పట్టు. కన్హయ్య (కృష్ణుడు) నిన్ను కాపాడతాడు... గెలిచావా, నీ రాజ్యాన్ని తిరిగి పొందుతావు. నీ పేరు చిరస్థాయిగా నిలుస్తుంది. అలాగాక ఇక్కడ ఉండి శత్రువుతో పోరాడితే దానివల్ల వచ్చే కీర్తి నాదవుతుంది. కాబట్టి నీ రాజ్యంలోనే యుద్ధం సాగించడం మంచిది" –

అని ధీరోదాత్తంగా కర్తవ్యం బోధించి శివాజీ తన ఒరలోని కత్తిని ఛత్రసాల్ చేతికిచ్చి విజయీభవ అని దీవించి పంపాడు. అంతదాకా ఆవహించిన నిరాశా నిస్పృహల చీకట్లు తొలగి బుందేల్ వీరుడి మనసంతా మహాపురుషుడిచ్చిన ఉత్తేజపు కాంతిపుంజాలతో వెలిగిపోయింది. వట్టి సలహాతో సరిపెట్టక – ఎప్పుడు కష్టం వచ్చినా సాయపడతానని శివాజీ అంతటివాడు ఇచ్చిన భరోసాతో ఛత్రసాల్‌కు వెయ్యి ఏనుగుల బలం వచ్చింది. దైవం మీద నమ్మకంతో, అచంచల ఆత్మవిశ్వాసంతో మాతృభూమి విముక్తికి కంకణం కట్టుకుని అతడు బుందేల్‌ఖండ్‌కు బయలుదేరాడు. అది 1670 సంవత్సరం. అప్పుడు ఛత్రసాల్ వయసు 21. అతడు ఇంకా అరవై ఏళ్లు బతికాడు. అరవై ఏళ్ళూ శివాజీ ఇచ్చిన కత్తిని దించకుండా, పట్టిన దీక్ష సడలకుండా హేమాహేమీల్లాంటి శత్రువులతో పోరాడుతూనే ఉన్నాడు. ఎన్నో మహా యుద్ధాలు చేశాడు. మహా విజయాలను సాధించాడు.

శివాజీని కలిసిన నాటికి ఛత్రసాల్ చేతిలో ఉన్న బలగం అంతా కలిపి ఐదుగురు అశ్వికులు; పాతిక మంది పదాతి దళం. మహా శక్తివంతమైన మొగల్ సామ్రాజ్యాన్ని ఢీకొనటానికి ఆ బలం ఎందుకూ కొరగాదు. సైనిక, ఆర్థిక వనరులు సమృద్ధిగా ఉన్నవారిని కలుపుకుని ఉమ్మడిగా పోరాడితే తప్ప ప్రయోజనం ఉండదు. అదే ఉద్దేశంతో ఛత్రసాల్ అప్పుడు దక్కనులో మొగలుల కొలువు చేస్తూ మరాఠాలపై పోరాడుతున్న బుందేల్ ప్రముఖుడు రాజా శుభకరణ్ దగ్గరికి వెళ్ళి సహాయం కోరాడు. ఆ రాజా గారికి నవ్వొచ్చింది. 'కొండలాంటి ఔరంగజేబుతో తలపడి బుందేల్‌ఖండ్‌లో తిరుగుబాటు తేవాలన్న ఆలోచన పిచ్చివాడి కల. మనం మనం కావాలసినవారం కాబట్టి పాదుషాను ఒప్పించి మంచి మున్సబీ ఇప్పిస్తాను. తృప్తిపడు' అన్నాడు. ఛత్రసాల్ అక్కర్లేదన్నాడు. పరాయివాడు కలిసి రాకపోయినా, కనీసం తోడబుట్టిన అన్న సహాయం చేయకపోతాడా అనుకుని నర్మద దాటి తన సీమకు పోయి ఒక మోస్తరు ప్రాబల్యంగల సోదరుడు రతన్ షా దగ్గరికి ఛత్రసాల్ వెళ్లాడు. అక్కడా చుక్కెదురైంది. 18 రోజులు ఎన్ని విధాల నచ్చచెప్పినా లాభం లేకపోయింది. 'అంత గొప్ప బలం గల చక్రవర్తిని నువ్వు ఎలా ఎదుర్కొనగలవురా? నీదగ్గర సైన్యం ఏది? వనరులు ఏవి? నీకు ఎవరు సాయపడతారు?' అని అన్న చులకనగా మాట్లాడాడు. 'దేవుడే ఉన్నాడు. వాడే సాయపడతాడు లెమ్మ'ని చెప్పి ఛత్రసాల్ వట్టి చేతులతో వెనక్కి వచ్చాడు.

చేతిలో ధనం సైన్యం లేదు; రాజ్యం లేదు; తనకంటూ బలమైన ఒక్క స్థావరమూ లేదు. ఇవేవీ లేకుండా, ఒక్కరూ సహాయపడకుండా ప్రపంచంలోకెల్లా తిరుగులేని మహా

సామ్రాజ్యంతో ఎలా పోరాడాలా అని మథనపడుతున్న సమయంలో ఛత్రసాల్‌కి కాలం అనుకూలించింది. సింహాసనానికి పోటీదారులందరినీ వేటువేసి, గద్దె మీద స్థిమితపడ్డాక ఔరంగజేబులో మత పైత్యం ప్రకోపించింది. కాఫిర్ల మతాన్ని కాలరాచేసి హిందుస్తాన్ మొత్తాన్నీ బలవంతంగానైనా ఇస్లామీకరించాలన్న పట్టుదల పెరిగింది.

> ... the temples and holy places of the Hindoos pulled down, and their hearts trembled at beholding the sacrilegious destruction of all they held sacred and dear; for an imperial mandate had been received by Fidaee Khan, stating, that in the city of Orchcha the Hindoos practiced the rites of idolatry, sounding the Sunkh, ringing bells, putting marks on their foreheads..., that, by the toleration of such rites, infidelity remained in the world...; and that it had therefore become expedient to suppress those customs, and to decree that their temples should be destroyed, and mosques built on their sites... it being obvious, that when their temples no longer existed, their faith would dwindle away.
>
> [*A History of the Boondelas*, **Capt. W.R.Pogson**, *P.54*]
>
> *(హిందువుల దేవాలయాలను, పవిత్ర స్థలాలను కూల్చివేయసాగారు. తాము పవిత్రంగా, అపురూపంగా పరిగణించే వాటన్నిటినీ అపచారపూర్వకంగా నాశనం చేయటాన్ని చూసి హిందువుల హృదయాలు చలించాయి. (అప్పుడు గ్వాలియర్ గవర్నరుగా ఉన్న) ఫిదాయి ఖాన్‌కు పాదుషా నుంచి ఫర్మానా వచ్చింది. ఏమంటే - "బుందేల్‌ఖండ్‌లోని ఓర్చా నగరంలో హిందువులు విగ్రహాలను పూజిస్తూ, శంఖాలు ఊదుతూ, గంటలు మోగిస్తూ, నుదుట తిలకం ధరిస్తున్నారని తెలియవచ్చిందనీ; అలాంటి దురాచారాలను సహించటంవల్లే ప్రపంచంలో విశ్వాసరాహిత్యం ఉందనీ... కాబట్టి అటువంటి దుష్టాచారాలను అవశ్యం అణచివేయాలనీ, వారి దేవాలయాలను ధ్వంసం చేసి వాటి శిథిలాల మీద మసీదులు కట్టించాలనీ... ఎందుకంటే - ఆలయాలు మాయమైతే వారి మతమూ అంతరించిపోతుందనీనూ).*

రాజాజ్ఞకాగానే ఫిదాయిఖాన్ విజృంభించి గుళ్ళూగోపురాలు కూల్చేసి, పవిత్ర దేవతా విగ్రహాలను ముక్కలు చేసి కాళ్ల కింద వేసి తొక్కించసాగాడు. నుదుట బొట్టు పెట్టుకుందుకూ, మెడలో జంధ్యం వేసుకుందుకూ, ఇంట్లో పూజలు చేసేందుకు కూడా వీల్లేకుండా ముసల్మాన్లు అమానుషంగా సతాయించడంతో సాధారణంగా ఒకరి జోలికి పోని హిందువుల్లో సైతం ధర్మాగ్రహం ప్రజ్వరిల్లింది. తిరగబడితే తప్ప తమ మతానికి మనుగడ ఉండదని తేలిపోయాక సమర్థుడైన నాయకుడి కోసం అన్వేషణ మొదలైంది. గతంలో రాజా చంపత్‌రాయ్ మొగలులపై ఎంత ప్రతాపం చూపిందీ గుర్తుకు తెచ్చుకుని ఆయనే ఇప్పుడు ఉంటే ముసల్మాన్లు ఇంతగా పేట్రేగగలిగేవారా అని సామాన్య జనం చర్చించుకోసాగారు. సరిగ్గా అదే సమయంలో సాక్షాత్తూ చంపత్‌రాయ్ కుమారుడైన ఛత్రసాలే ఆపద్బాంధవుడిలా వచ్చి వారికి నాయకత్వం వహిస్తానన్నాడు. ప్రజల ఆనందానికి అవధుల్లేక పోయాయి. కొద్ది నెలల కిందట ఛత్రసాల్ స్వయంగా వెళ్ళి బతిమిలాడినా తోడ్పడటానికి అంగీకరించని రాజా శుభ కరణ్‌లో కూడా తాజా దాష్టీకాల దరిమిలా మతావేశం రగిలింది. ప్రత్యేకంగా దూతను పంపి ఛత్రసాల్‌ను తన దగ్గరికి పిలిపించుకుని 'ధర్మాన్ని రక్షించడానికి నడుం బిగించి పోరాడు. నీ వెంట నేనుంటాను. సకల సహాయాలు చేస్తాను. నీ పరాక్రమాన్ని చూపి ప్రతి బుందేలా గర్వపడాలి' అని భుజం తట్టి చేయగలిగిన సాయమల్లా చేశాడు. అక్కడి నుంచి ఔరంగాబాదులో బుందేల్ వీరుడు రాజా వీర్ బలదేవ్ దగ్గరికి పోతే నెత్తిన పెట్టుకుని పూజించి, 'ఇక నుంచీ నీ వెంటే నేనూ' అని బాస చేసి పెద్ద బలగంతో ఛత్రసాల్ వెంట బుందేల్‌ఖండ్‌కు తరలాడు. ఔరంగజేబు మతద్వేషం బారి నుంచి హిందూ ధర్మాన్ని రక్షించగల వీరుడి కోసమే అతడూ ఇంతకాలమూ ఎదురుచూస్తున్నాడు.

గణనీయమైన బలం సమకూర్చుకుని ఛత్రసాల్ తిరిగివచ్చేసరికే బుందేల్‌ఖండ్ వీరావేశంతో ఊగిపోతున్నది. చక్రవర్తి ఆజ్ఞ ప్రకారం ఓర్చాలో సుప్రసిద్ధ దేవాలయాలను కూల్చివేయటానికి 18వేల సైన్యంతో వచ్చిన ఫిదాయిఖాన్‌ను రాజా ధర్మాంగద్ అనే బుందేల్ వీరుడు చిత్తుగా ఓడించి అప్పటికే తరిమికొట్టి ఉన్నాడు. ఈ ప్రతిఘటనకు మండిపడి హిందువుల మీద ఔరంగజేబు ఎలాంటి ప్రతికారం తీర్చుకుంటాడో... ఎంత భారీ సైన్యాన్ని తమ మీదికి ప్రయోగిస్తాడో... ఆ బెడదను ఎలా తట్టుకోవాలోనని జనం కలవరపడుతూండగా ఛత్రసాల్ రంగంలోకి దూకాడు. తొలుత ఛత్రసాల్ సైన్యం వందల సంఖ్యలో ఉన్నా అనతికాలంలో అది అనూహ్యంగా పెరిగింది. చంపత్‌రాయ్ చేతి కింద పోరాడి, ఆయన మరణానంతరం పనిలేకుండా ఉన్న వేలాది బుందేలాలు తమ ప్రభువు కుమారుడు కత్తిపట్టి నిలిచాడని తెలియగానే పరుగున వచ్చి అతడి శ్రేణుల్లో కలిశారు. అంతకు ముందు వరకూ మొగలుల కొలువులో దీర్ఘకాలం పాదుషాను సేవించిన ప్రముఖులు పలువురు కూడా మతానికి వచ్చిన ముప్పును గుర్తించి తమంతట తాము ఛత్రసాల్ ఛత్రం కింద నిలిచిపోరాడారు. అంతా కలిసి ప్రజల మద్దతుతో ఛత్రసాల్‌ను బుందేల్‌ఖండ్ మహారాజుగా ప్రకటించారు.

ఈ రకంగా బలం పుంజుకుని, ధర్మరక్షణకు రాజా ఛత్రసాల్ ప్రారంభించిన సమైక్య పోరాటం అర్థశతాబ్ది పాటు అప్రతిహతంగా సాగింది. హోషింఖాన్, సయ్యద్ బహాదూర్, సయ్యద్ లతీఫ్, అన్వర్ ఖాన్, ఆనందరాయ్ లాంటి కొమ్ములు తిరిగిన మొగల్ సర్దార్లు ఛత్రసాల్ చేతిలో చిత్తుగా ఓడారు. పట్టువదలని ఔరంగజేబు రెట్టించిన పంతంతో దండయాత్ర తరవాత దండయాత్రను చేయిస్తూనే వచ్చాడు.

ఒకసారి మొగలు కొలువులో వున్న కేశవ్‌రాయ్ బుందేలా అనే గండరగండడు పాదుషా పనుపున దండెత్తి వచ్చి 'ఎక్కడ ఆ ఛత్రసాల్? దమ్ముంటే నా ముందుకు రమ్మను, క్షత్రియ జన్మ ఎత్తితే నా దగ్గర ప్రతాపం చూపించమను' అని రంకెలు వేశాడు. ఛత్రసాల్ గుర్రం మీద అతడి ముందుకు ధైర్యంగా వెళ్ళి 'నేనే ఛత్రసాల్‌ని. నాతో యుద్ధం కత్తితోనా, బల్లెంతోనా, బాణాలతోనా అన్నది నువ్వే ఎంచుకో' అన్నాడు. ప్రత్యర్థి అన్ని ఆయుధాలూ ప్రయోగించాడు. ఏ ఆయుధంతోనూ గెలవలేకపోయాడు. ఇరువైపులా సైన్యం నివ్వెరపోయి చూస్తుండగా జరిగిన ద్వంద్వ యుద్ధంలో ఛత్రసాల్ అతడిని పరలోకానికి పంపాడు.

ఇంకోసారి ఛత్రసాల్ ఒక కన్యను వివాహమాడుతుండగా మొగలు సేన చుట్టుముట్టింది.

ఛత్రసాల్ తొణకకుండా వధువుతో కలిసి అగ్ని చుట్టూ ఏడు ప్రదక్షిణాలూ పూర్తి చేసి, పసుపు బట్టలతో అటు నుంచి అటే గుర్రమెక్కి శత్రువులపైకి ఉరికాడు. అనేక అద్భుత విజయాలతో అతడి పరాక్రమం ప్రఖ్యాతి చెందాక గతంలో చిన్నచూపు చూసిన అన్న రతన్‌షా వంటి వారు కూడా వెదుక్కుంటూ వచ్చి అతడి శిబిరంలో కలిశారు.

బలవంతులైన 70 మంది బుందేలీ సర్దార్లు వెన్నంటి ఉండగా గొప్ప సేనతో, శత్రు భీకరమైన ఆశ్విక, ఫిరంగి దళాలతో శత్రువులు తేరిపార చూడలేనంత దుర్నిరీక్ష్యంగా బుందేల్‌ఖండ్‌లో అనేక దశాబ్దాలు ఛత్రసాల్ ప్రభ వెలిగింది. అతడిపైకి ఔరంగజేబు చేయించిన దండయాత్రలన్నీ విఫలమయ్యాయి. ఈ లోపు దక్కను ఊబిలో కూరుకుపోయి నిరంతర యుద్ధాల్లో మరాఠాల సవాలును తట్టుకునేందుకే ఎక్కడి సమయమూ చాలకపోవడంతో ఔరంగజేబు ఒక దశలో పరిస్థితితో రాజీపడి ఛత్రసాల్ తెరువు పోవడం మానుకున్నాడు. ఛత్రసాల్ క్రమేణా కాలు నిలదొక్కుకుని, భీషణ సంగ్రామాల్లో కాలింజర్ వంటి గొప్ప కోటలను వశపరచుకుని ఉత్తరాన యమున నుంచి పశ్చిమాన రాజపుత్ర స్థానం వరకూ దక్షిణాన నర్మద దాకా తన ఆధిపత్యాన్ని విస్తరించుకున్నాడు. కవి గాయకులను, కళలను పోషించి దీర్ఘకాలం శాంతి సుస్థిరతలతో రాజ్యమేలాడు.

1707లో ఔరంగజేబు మరణానంతరం గద్దెనెక్కిన అతడి కుమారుడు బహాదూర్ షా ఛత్రసాల్‌తో రాజీకొచ్చి సఖ్యంగా మెలిగాడు. ఫర్రుఖ్ సియర్ చక్రవర్తిగా ఉన్నప్పుడూ ఛత్రసాల్‌తో, ఆయన పుత్రులతో సఖ్యంగా ఉన్నాడు. కానీ మొగలులతో బాధలు శాశ్వతంగా తప్పాయన్న సంతోషం ఎన్నో ఏళ్లు నిలవలేదు. ఎన్నో యుద్ధాల్లో ఢక్కామొక్కీలు తిన్న అంతటి మహావీరుడే చరమదశలో మొసలి వాత పడిన గజేంద్రుడిలా శత్రువు గుప్పిట్లో చిక్కాడు. గజేంద్రుడిని విష్ణుమూర్తి రక్షించినట్టు అతడిని ఒక మహావీరుడు ఆదుకున్నాడు.



# గజేంద్రమోక్షం

*జో గత్ గ్రహ గజేంద్రాకి సోగత్‌భాయి హె ఆజ్*
*బాజీ జత్ బుందేలాన్‌కి రఖో బాజి లాజ్*

- మరాఠీ అంచె పరాక్రమ్

What befell Gajendra has come to pass now.
The Bundela's honour is being lost save him O Bajirao
[*A History of the Maratha People,* **Kincaid & Parasnis,** *Vol. II p.215*]

*మొసలి బారిని పడిన గజేంద్రుడి గతి నాకు పట్టింది. బుందేలాల మర్యాద మంట గలుస్తోంది. బాజీ! వెంటనే వచ్చి రక్షించు.*

బుందేల్‌ఖండ్ ప్రభువు రాజా ఛత్రసాల్ 1729 ఫిబ్రవరిలో పీష్వా బాజీరావుకు ఆర్తనాదంగా పద్య రూపంలో పంపిన సందేశమిది. అప్పుడు బాజీరావు బుందేల్‌ఖండ్‌కు దగ్గరలోనే మాళవలో మొగలుల ఆధిపత్యం అంతమొందించి మరాఠా బావుటాను ప్రతిష్ఠించే పనిలో నిమగ్నుడై ఉన్నాడు. ఛత్రసాల్ చిక్కుల్లో పడ్డట్టు అతడు సంవత్సరంగా వింటున్నాడు. మొగలులతో పోరాడుతున్న సాటి హిందూ రాజ్యానికి సాయపడాలనే అనుకుంటున్నాడు. కాని దక్కనులో నిజాం-ఉల్-ముల్క్‌తో హోరాహోరీ పోరులో తానే తలమునకలుగా ఉన్నందున... పాల్ఖేడ్‌లో నిజామును గెలిచిన వెనువెంటనే ఖాందేశ్ మాళవల మీద దృష్టి నిలపవలసి వచ్చినందున ఏమీ చేయలేక పోయాడు. తక్షణ సమస్యల నుంచి తేరుకున్నాక నేరుగా ఛత్రసాల్ నుంచే 'రావే రక్షక' అని పిలుపు రావడంతో బాజీరావు క్షణం జాగు సేయక పెద్ద సైన్యంతో అటు నుంచి అటే హుటాహుటిన కదిలాడు.

పౌరుషానికి, పరాక్రమానికి పెట్టింది పేరయిన రాజా ఛత్రసాల్‌ది అంతే తేలికగా ఓటమిని అంగీకరించి, సహాయం కోసం ఆక్రోశించే తత్వం కాదు. అర్ధశతాబ్దికి పైగా

ఎన్నో యుద్ధముల ఆరియు తేరి, ఎన్నో అద్భుత విజయాలను సాధించిన ఆ వృద్ధ మూర్తికి మరీ రెండు మూడేళ్ళుగా చెడ్డకాలం దాపురించింది. ఫర్రుఖ్ సియర్ విషాదాంతం తరవాత మొహమ్మద్ షా చక్రవర్తి అయినప్పటి నుంచీ ఛత్రసాల్‌కు మొగలులతో వరసగా తలనెప్పులు వస్తూనే ఉన్నాయి. సయ్యద్ సోదరులకు ఎదురు తిరిగి పాదుషా పక్షాన చేరినందుకు ప్రతిఫలంగా రొహిల్లా సర్దారు ముహమ్మద్ ఖాన్ బంగషును 1720 చివరిలో అలహాబాదుకు గవర్నరుగా పంపారు. ఆ కాలంలో మొగలు సామ్రాజ్యంలో అతడిని మించిన సేనా నాయకుడు లేడు. అనేక యుద్ధాల్లో గొప్ప ప్రతాపం చూపి 'సంగ్రామ సింహం' అని బిరుదు పొందాడతడు. బుందేల్‌ఖండ్‌లో అత్యధిక ప్రాంతం కొత్తగా అతడికి అప్పగించిన రాష్ట్రం కిందికే వస్తుంది. భూమి శిస్తు వసూలు చేసుకుందుకు ముహమ్మద్ ఖాన్‌కు మొగలు పాదుషా దఖలు పరచిన పరగణాలూ బుందేల్ ఖండ్‌లోనే ఉన్నాయి. దాంతో అక్కడ ఛత్రసాల్ ఆధిపత్యాన్ని అంతం చేయడాన్ని ప్రథమ కర్తవ్యంగా అతడు భావించాడు. ఛత్రసాల్ పీచమణచి రమ్మని దిలేర్‌ఖాన్ అనే సర్దారును పెద్ద సైన్యంతో పంపితే ఛత్రసాల్ వాడిని యుద్ధంలో చంపాడు. మొగలు సామ్రాజ్యంపై తిరగబడిన ఇతర రాజ్యాల వారికి ఛత్రసాల్ సహాయపడుతూండటంతో అసలే గుర్రుగా ఉన్న పాదుషా దీనితో ఇంకా మండిపడి ఏది ఏమైనా ఛత్రసాల్‌ను అణచివేయమని ముహమ్మద్ ఖాన్‌ను ఆదేశించాడు. అతడు ఎన్ని కుతంత్రాలు పన్నినా, ఎన్ని పోరాటాలు చేసినా ఐదేళ్ళదాకా ఛత్రసాల్ తలవెంట్రుకను కూడా చెదరగొట్టలేకపోయాడు.

ఆ తరవాత బుందేలుల అదృష్టం వక్రించింది. 1727 ఆరంభంలో ముహమ్మద్‌ఖాన్ తన జాతీయులైన రొహిల్లాలతో భారీ సైన్యాన్ని సమీకరించి ఛత్రసాల్ మీద భీకర యుద్ధం ప్రకటించాడు.

Muhammad Khan Bangash Ghazanfar Jang, with an army of eighty thousand horse and more than a hundred elephants, proceeded to the province of Allahabad, to fight against Raja Chatrsal. After exertions and many actions, the fort of Jitgarh, where he resided, was taken. Chatrsal fled for refuge to the zamindars of Jharna and Purna, and the whole territory came into the possession of the Khan.

[*Tarikh - I Hindi of Rustam Ali*, **Elliot & Dowson**, *VIII. p. 46*]

(మహమ్మద్ బంగష్ ఘజన్‌ఫర్‌జంగ్ 80 వేల అశ్వదళంతో, నూరుకుపైగా ఏనుగులతో – ఛత్రసాల్‌తో యుద్ధానికి అలహాబాద్ వెళ్ళాడు. ఎన్నో ప్రయాసలు పడి అనేక సైనిక చర్యల అనంతరం ఛత్రసాల్ నివసించే జత్‌గఢ్ కోటను అతడు పట్టుకున్నాడు. ఛత్రసాల్ పారిపోయి జార్నా, పూర్ణా జమీందార్ల ఆశ్రయం పొందాడు. ఆ ప్రాంతమంతా ఖాన్‌కు వశమైంది).

1727 జనవరి నుంచి 1728 డిసెంబరు వరకూ పూర్తిగా రెండేళ్లు సాగిన ముట్టడి పర్యవసానంగా జైత్‌పూర్ కోట శత్రువుల స్వాధీనమయింది. 80 ఏళ్ల వయసులోనూ ఎంతో పరాక్రమం చూపి ఎన్ని విధాల పోరాడినా ప్రయోజనం లేకపోయి ఛత్రసాల్ సకుటుంబంగా





ముహమ్మద్ ఖాన్‌కు లొంగిపోయాడు. వారిని ఖైదీలుగా పట్టుకొచ్చి దర్బారులో నిలబెట్టేందుకు పాదుషా అనుమతి కోరుతూ ముహమ్మద్ ఖాన్ జాబు పంపాడు. దానికి జవాబు కోసం ఎదురుచూస్తూ యుద్ధం గెలిచానన్న ధీమాతో అతడు జైత్‌పూర్ కోటలో ఆదమరిచి ఉండగా తక్షణం వచ్చి రక్షించమంటూ బాజీరావుకు ఛత్రసాల్ రహస్య సందేశం పంపాడు.

కబురు అందగానే బాజీరావు 25 వేల అశ్వదళంతో రివ్వున కదిలాడు. తాను వస్తున్నట్టు ముందే బుందేలీ రాజపుత్ర జమీందారులకు వర్తమానం పంపాడు. తమ తమ బలగాలతో వారూ వచ్చి దారిలో కలిశారు. చెర నుంచి ఎలాగో బయటపడి ఛత్రసాల్, ఆయన కుమారుడు కూడా వారిని చేరుకున్నారు. అంతా కలిసి లక్ష సైన్యంతో జైత్‌పూర్ వైపు దూసుకెళ్లారు.

ఇక్కడ ఇదంతా జరుగుతుంటే కోట లోపల ముహమ్మద్ ఖాన్ మాత్రం కాళ్లు బారజాపి చిదానందంగా సుఖిస్తున్నాడు. దీర్ఘకాల యుద్ధం ఎట్టకేలకు అయిపోయిందన్న నిశ్చింతతో ఆఫ్ఘన్ సైనికులు చాలా మందిని సెలవు మీద ఇళ్లకు పంపాడు. నిండా నాలుగు వేల సైన్యం కూడా ఆ సమయంలో అతగాడి దగ్గర లేదు. మాళవ వైపు నుంచి మరాఠాలు దాడి చేయవచ్చని పుకార్లయితే వినిపిస్తున్నాయి గానీ అతడికి నమ్మబుద్ధి కాలేదు. తన చేతిలో చిత్తుగా ఓడిన బుందేలీలు ఇంతలోనే మరాఠాలతో చెయ్యి కలిపేంత దుస్సాహసానికి తెగిస్తారని అతడు ఊహించలేదు.

ఆ తరవాత ఏమైందో ***The Later Mughals*** గ్రంథంలో ఇర్విన్ మాటల్లో వినండి.

The Mahrattas were within two and twenty miles of the camp before Muhammad Khan could be persuaded to believe in their approach. With great difficulty he now made up his army to nine thousand men... The invaders were under the chief command of Baji Rao, the Peshwa... and as he advanced his forces were joined by te turbulent zamindars till it had swollen to seventy thousand men... .... Gradually the Mahrattas closed round the camp, the commonest grain cost twenty rupees a seer, ...for two months the Muhammadans subsisted on the flesh of camels, horses and cows... ... For close on four months, the garrison held out under the most heart - rending conditions... Many men died of starvation; many deserted; all gave up their arms were allowed to pass out.

[*The Later mughals* - **Irvine,** *pp.238-39*]

(మరాఠాలు మీద పడుతున్నట్టు ముహమ్మద్ ఖాన్‌కు నమ్మకం కుదిరేసరికే వారు అతడి శిబిరానికి ఇరవై రెండు మైళ్ళ దూరంలోకి వచ్చేశారు. అతి కష్టం మీద అతడు తొమ్మిది వేల సైనికులను కూడగట్టగలిగాడు. దాడిచేస్తున్న వారికి ముఖ్య నాయకుడు బాజీరావు పీష్వా... వచ్చేదారిలో జమీందార్లు కలియడంతో అతడి బలం 70 వేలకు పెరిగింది... క్రమేణా మరాఠాలు ఖాన్ శిబిరాన్ని చుట్టుముట్టి, బయటి నుంచి సరఫరాలన్నిటినీ అడ్డగించారు. మామూలు తిండి గింజలకే సేరు ఇరవై రూపాయల ధర పలికింది... రెండు నెలలపాటు మహమ్మదీయులు సైనిక

గుర్రాలు, ఒంటెలు, ఆవుల మాంసాల మీదే బతికారు. ఎందరో ఆకలి చావుచచ్చారు. చాలా మంది చేతులెత్తేశారు. ఆయుధాలు వదిలేసిన వారిని మరాఠాలు బయటికి పోనిచ్చారు).

శత్రువుల చక్రబంధంలో చిక్కి తిండికి మొగం వాచిన దురవస్థలో ముహమ్మద్ ఖాన్ తక్షణం సైన్యాన్ని పంపి రక్షించమని పాదుషాకు మొరపెట్టుకున్నాడు. దర్బారులో విరోధులు అప్పటికే అతడి మీద చాడీలు చెప్పి పాదుషా మనసు విరిచారు. అదిగో ఇదిగో అని కాలయాపన చేయడమే తప్ప ఖాన్‌కు సాయంగా ఢిల్లీ నుంచి దండు ఏదీ వెడలనే లేదు. ముహమ్మద్ ఖాన్ భార్య, కుమారుడు సింహాసనం ముందు మోకరిల్లి దీనంగా ప్రార్థించినా ప్రయోజనం లేకపోయింది. ముహమ్మద్‌ఖాన్ కుమారుడు కాయిమ్‌ఖాన్ దాంతో భగ్గుమని సాటి రోహిల్లాలను రెచ్చగొట్టి 30 వేల అఫ్ఘాన్ సేనను సమీకరించి తండ్రికి సాయంగా యమున దాటి బయలుదేరాడు. కానీ మరాఠాలు అప్రమత్తంగా ఉండి జైత్‌పూర్ దాకా వెళ్ళకుండానే అతడి సేనను నిలువరించి చిత్తుగా ఓడించారు. ఇక ఎటు నుంచీ సహాయం అందే ఆశ లేక, తిండీ నీళ్లూ లేకుండా లోపల బతికే వీలూ లేక 'సంగ్రామ సింహం' ముహమ్మద్ ఖాన్ తోకముడిచి రాజీ కొచ్చాడు. మళ్లీ జన్మలో బుందేల్‌ఖండ్‌లో అడుగుపెట్టనని ఒట్టు పెట్టుకుని, జైత్‌పూర్ కోటను ఛత్రసాల్‌కి తిరిగి ఒప్పగించి, మిగిలిన అనుచరులతో కాలికి బుద్ధి చెప్పాడు.

ఈ ఘట్టాన్నే **తారిఖ్-ఇ-హిందీ**లో పర్షియన్ చరిత్రకారుడు **రుస్తుం అలీ** ఇలా ఉల్లేఖించాడు.

> The Emperor received intelligence that Baji Rao Mahratta, having collected an army of 1,00,000 horse had come to assist Raja Chatrsal and had beseiged Muhammad Khan Bangash in Jitgarh. The time of decadence of the Empire had arrived... and no plan of repelling the army proved effectual. From that time to this the power and dominion of that tribe had daily increased.
>
> [*Tarikh-I Hindi of Rustam Ali*, **Elliot & Dowson,** *Vol. VIII, p. 48*]

(బాజీరావు మరాఠా లక్ష గుర్రాల సైన్యాన్ని సేకరించి రాజా ఛత్రసాల్‌కు సాయంగా వెళ్ళి జిత్‌గఢ్‌లో మహమ్మద్ ఖాన్ బంగషును ముట్టడించాడని చక్రవర్తికి వేగు అందింది. సామ్రాజ్యానికి అంత్యకాలం ఆసన్నమైంది... ఆ సైన్యాన్ని తిరుగకొట్టటానికి వేసిన ఏ పథకమూ పని చేయలేదు. ఆ సమయం నుంచి నేటి దాకా మరాఠా తెగ ప్రాభవం, ఆధిపత్యం రోజు రోజుకూ పెరగసాగాయి).

పౌరులు జయధ్వానాలు చేస్తుండగా, మరాఠా ఫిరంగులు మోగుతూండగా, సకల రాజలాంఛనాలతో రాజా ఛత్రసాల్ సగర్వంగా మళ్లీ తన రాజధానిలో అడుగు పెట్టాడు. వానాకాలం రాక ముందే స్వస్థలం చేరుకోవాలి కనుక మరాఠాలు కొద్ది రోజులకే తిరుగు ముఖం పట్టారు. పిలవగానే దిగ్గున వచ్చి తన మర్యాదను కాపాడి, శత్రు వశమైన రాజ్యాన్ని తనకు తిరిగి సాధించి పెట్టిన బాజీరావు మేలు ఛత్రసాల్ మరవలేదు. వట్టి మెరమెచ్చులతో సరిపెట్టకుండా బాజీరావును సొంత కుమారుడిలా సంభావించాడు. అంతే కాదు. తన మరణానంతరం కన్న కుమారులతో సమానంగా తన రాజ్యాన్ని పంచి ఇచ్చాడు. ఎల్లకాలం బాజీరావును సొంత సోదరుడిగానే భావించాలని, ఎప్పుడు అవసరమైనా సైన్యంతో వెళ్ళి అతడికి సాయపడాలనీ, అదే విధంగా తన కుమారులకు ఎప్పుడు ఆపద వచ్చినా తనను ఆదుకున్నట్టే వారినీ బాజీరావు ఆదుకోవాలనీ తన మరణ శాసనంలో రాశాడు.

కులం వేరైనా, ప్రాంతం వేరైనా సాటి హిందూ వీరుడి మీద ఒక హిందూ రాజు ఇంతటి ప్రేమాభిమానాలు కురిపించడం అపూర్వం. హిందూ రాజుల మధ్య సాధారణంగా సఖ్యత ఉండేది కాదనీ ఒకరి మీద ఒకరు కక్షలూ కార్పణ్యాలతో రగిలి, బయటి శత్రువును బాగుచేసి ఉభయులూ భ్రష్టులవుతూ వచ్చారనీ... అధిక్షేపించేవారు శివాజీ - ఛత్రసాల్-బాజీరావుల నడుమ పరిమళించిన ఉదాత్త ఆత్మీయానుబంధాన్ని గమనిస్తే మేలు.

సమయానికి బాజీరావు వచ్చి ఆదుకోవటంతో చిక్కులు తొలిగిన రాజా ఛత్రసాల్ ఏణ్ణర్థం తరవాత 82వ ఏట పండు వయసులో తృప్తిగా, ప్రశాంతంగా కన్నుమూశాడు. గొప్ప యోధునిగా, సమర్థ పాలకుడిగా, పాండిత్యం ఔదార్యం, సచ్ఛీలం కలగలిసిన ధర్మప్రభువుగా, చీలికలు పేలికలయిన బుందేలా జాతిని సంఘటితపరచి సుమారు అర్ధశతాబ్దం ఏకచ్ఛత్రంగా ఏలి మొగలు సామ్రాజ్యం గుండెల్లో నిద్రించి, దాని అంతిమ పతనానికి అనల్పకృషి చేసిన జాతీయ వీరుడిగా ఛత్రసాల్ పేరు జాతి జనుల మదిలో కలకాలం నిలిచి ఉంటుంది.

బుందేల్‌ఖండ్‌కు వెళ్ళినందుకు బాజీరావుకు గొప్ప కానుకే దక్కింది. వెలలేని బహుమానాలు, రాజ్యంలో వాటాతో బాటు చక్కని చుక్క మస్తానీని కూడా ఛత్రసాల్ అతడి చేతిలో పెట్టాడు.

అది ఒక అపురూప ప్రేమ కథకు నాంది.

# ఎంత తేడా?!

***Nadirshah came of the fort, sat in the golden Masjid ... and gave orders for a general massacre. For nine hours an indiscriminate slaughter of all was committed. It is said that the number of those who were slain amounted to one hundred thousand. The losses and calamities of the people of Delhi were exceedingly great.***

[*Tarikh-I Hindi, Rustam Ali,* **Elliot & Dowson.** *Vol. VIII. p. 64*]

నాదిర్షా కోట నుంచి వచ్చి బంగారు మసీదులో కూర్చుని జనం ఊచకోతకు ఉత్తర్వు ఇచ్చాడు. తొమ్మిది గంటలపాటు కనపడిన వారినెల్లా విచ్చల విడిగా నరికేశారు. అలా చంపబడిన వారి సంఖ్య లక్ష ఉంటుంది. ఢిల్లీ ప్రజలు పడిన నష్టాలు, కష్టాలు మహా భయానకమైనవి.

... ... the bloodshed, the devastation and the ruin of families were irreparable. For a long time the streets remained strewn with corpses... The town was reduced to ashes... writers were appointed to levy ransom from to inhabitants... Emissaries of the kotwal wandered from house to house and from street to street, to take inventories of the property, so that the sum to be contributed by each individual might be fixed according to his means.

[*Tazkira,* **Anand Ram Mukhlis, Elliot & Dowson,** *Vol.VIII. p.89-90*]

రక్తపాతం, విధ్వంసం, కుటుంబాల నాశనం మహా దారుణంగా జరిగాయి. చాలా కాలం వీధులలో శవాల గుట్టలు పడి ఉన్నాయి. ఢిల్లీ నగరం కాలి బూడిదైంది. పురజనుల నుంచి చెరవిడుపు కట్నం వసూలు చేసేందుకు గుమాస్తాలను పెట్టారు... ఆస్తిపాస్తులను లెక్కచేసి స్తోమతును బట్టి చెల్లింపు మొత్తాన్ని నిర్ణయించేందుకు కొత్వాలు మనుషులు వీధి వీధీ తిరిగారు.

1739 మార్చిలో ఢిల్లీని ఆక్రమించిన పర్షియన్ రాజు నాదిర్షా సామాన్య జనంపై నిష్కారణంగా సాగించిన పైశాచిక ఘాతుకాల గురించి ఆయా దురంతాలు కళ్ళారా చూసిన, స్వయంగా తెలిసిన పర్షియన్ చరిత్రకారులు రాసి పెట్టిన రికార్డులివి.

నాదిర్షా మహమ్మదీయుడు. ఢిల్లీ పాదుషా కూడా మహమ్మదీయుడు. ఇదీ ముస్లిం రాజ్యమే కనుక ఇక్కడి జన బాహుళ్యంపై నాదిర్షాకు మతద్వేషమో, మరో కక్షో ఉండేందుకు ఆస్కారం లేదు. మొహమ్మద్ షా పాదుషా అతడికి పూర్తిగా పాదాక్రాంతమయ్యాడు. మొగలు సైన్యం చేష్టలుడిగి అతడికి లొంగిపోయింది. ఎటునుంచీ ఎలాంటి ప్రతిఘటన లేదు. అయినా - తానూ ఒక దేశానికి రాజు అయి ఉండీ - పిచ్చెత్తినట్టు, తైమూర్ పిశాచం ఆవహించినట్టు నిస్సహాయ జనాన్ని ఒక రోజంతా ఊచకోత కోయించి, లక్ష మందిని బలిగొని, మిగతా జనాభాను అమానుషంగా పీడించి అంతులేని అఘాయిత్యాలకు నాదిర్షా పాల్పడ్డాడు.

దీనికి రెండు సంవత్సరాల కిందట అదే ఢిల్లీపై అదే మొహమ్మద్ షా హయాంలో ఇంకోదాడి జరిగింది. దాడి చేసినవాడు పీష్వా బాజీరావు. హిందువు. కాబట్టి మతపరమైన మొహమాటం పాదుషాతో అతడికి ఉండాల్సిన పని లేదు. పైగా అతడు రెచ్చిపోయేందుకు కావలసినన్ని కారణాలున్నాయి. అతడికి బుద్ధి చెప్పి రమ్మని పాదుషా పెద్ద సైన్యాన్ని ఉసిగొలిపాడు. అతడికి శృంగభంగం చేసేశామని మొగలు సర్దార్లు ఒళ్లు మండేలా ప్రగల్భాలు పలుకుతున్నారు. బాజీరావును కాళ్ల కింద తొక్కేశానని పాదుషాయే మిడిసి పడుతున్నాడు. ఇందుకు మరాఠా వీరుడు ఎంతయినా ఆగ్రహించవచ్చు. తలచుకుంటే పాదుషాను, అతడికి రాజధానినీ, అందులోని జనాన్నీ ఏమైనా చేయగలిగేవాడు.

మరి బాజీరావు ఏమి చేశాడు?

* * *

ఢిల్లీ పైకి దండెత్తి మొగల్ సామ్రాజ్య కుంభస్థలాన్ని కొట్టాలని బాజీరావు ఎప్పటినుంచో అనుకుంటున్నాడు. 1736 నాటికి గానీ అతడికందుకు వెసులుబాటు దొరకలేదు. అప్పటికి అతడి విరోధులు, ప్రత్యర్థులు అందరూ నేలకరిచారు. పక్కలో బల్లెంలాంటి శంభాజీ - సాహు ఆధిపత్యాన్ని అంగీకరించాడు. సేనాపతి త్రింబకరావు ధామాడే పదవీభ్రష్టుడయ్యాడు. ఉత్తరాదిన మీ జైత్రయాత్రకు అడ్డు రానంటూ నిజాం-ఉల్-ముల్క్ రాజీకి వచ్చాడు. గుజరాత్‌లో మరాఠా అధికారానికి అడ్డంకులు తొలిగాయి. పశ్చిమ తీరంలో శత్రువులు ఓడిపోయారు. బాజీరావు ముఖ్య సహచరులు మల్హార్ రావు హోల్కర్, రణోజీ సింధియా, ఉదయజీ పవార్‌లు అద్భుత పరాక్రమంతో అనేక యుద్ధాలు చేసి, మాళవను హస్తగతం చేసుకున్నారు. సవాయ్ జయసింహ్‌తో పాత స్నేహం పుణ్యమా అని రాజపుత్ర వీరులతోనూ మరాఠాలకు తలనెప్పులు పోయి మైత్రీబంధం వెల్లివిరిసింది. బుందేల్‌ఖండ్ అయితే బాజీరావును ఏకంగా దత్తత చేసుకుంది. రాజా ఛత్రసాల్ కోరినట్టే ఆయన కుమారులూ

బాజీని తోడబుట్టిన వాడి కంటే మిన్నగా భావించి వెన్నంటి నిలిచారు. చిక్కులన్నీ చక్కబడటంతో ఉత్తర దిగ్విజయానికి ఇక ఏ అడ్డంకీ లేదు.

నర్మద నుంచి యమున వరకు గల విశాల భూభాగాన్ని మరాఠా పెత్తనం కిందికి తెచ్చేందుకు జాగ్రత్తగా వ్యూహ రచన చేసి సన్నాహాలన్నీ పూర్తయ్యాక సాహురాజు అనుమతి పొంది పుణేలో బయలుదేరి 1737 జనవరిలో బాజీరావు మాళవ రాజ్యం ప్రవేశించాడు. అంతకు ముందే రణోజీసింధియా, మల్హారావు హోల్కర్‌లను అక్కడికి పంపి యుద్ధానికి సైన్యాన్ని, సాధన సామాగ్రిని సిద్ధం చేయించాడు. అటు నుంచి నర్మద దాటి భోపాల్‌ను ముట్టడించాడు. దాన్ని రక్షించుకోవటానికి మొగల్ సర్దార్లు కిందు మీదవుతూండగానే ఇస్లాంనగర్‌ను, అటు నుంచి భిల్సాను వశపరచుకుని ఢిల్లీ దండయాత్రకు తయారవమని రణోజీకి చెప్పి కొంత సైన్యంతో తాను బుందేల్‌ఖండ్ వెళ్లాడు.

ఈలోపు మొగల్ పాదుషా చేతులు ముడుచుకుని కూచోలేదు. మరాఠాలు తన వాకిలిపైకి విరుచుకు పడనున్నారని వెరచి వారిని నిలువరించటానికి సర్వశక్తులూ ఒడ్డాడు. అఫ్ఘనిస్తాన్ నుంచి కూడా సైన్యాన్ని వెనక్కి తెప్పించి హేమాహేమీల్లాంటి సర్దార్లందరినీ సమీకరించి సాదత్‌ఖాన్ నేతృత్వంలో రెండు లక్షల సైన్యంతో పరుగెత్తించి ఢిల్లీకి రాకముందే మరాఠాలను అడ్డగించి మట్టుపెట్టమని పురమాయించాడు. వారు దిక్కులదిరేలా ఫెళఫెళార్భాటంతో వెళ్ళి, యమున దాటిన రణోజీ సేనను ఆగ్రాకు అవలే అడ్డగించి చిత్తుగా ఓడించారు. ఆ గెలుపుతో సాదత్‌ఖాన్ కళ్లు నెత్తిమీది కెక్కాయి. 'మరాఠాల మాదు పగలగొట్టాము. రెండువేల మందిని చంపేశాము. బాజీరావు పని అయిపోయింది. త్వరలో యమున దాటి వెళ్ళి చంబల్ అవలి దాకా మరాఠాలను తరిమిగొడతాము' అని పాదుషాకు కబురు పంపాడు. పాదుషా పరమానంద భరితుడై వారందరికీ ముత్యాల దండలు, గొప్ప బహుమానాలు పంపించాడు. బాజీరావు మారువేషంలో గాడిదనెక్కి పారిపోతుంటే వారూ వీరూ చూశారనీ పుకార్లు పుట్టాయి.

ఇదంతా బుందేల్‌ఖండ్‌లో విడిది చేసిన బాజీరావుకు తెలిసింది. అతడికి ఒళ్లు మండింది. సరే! బాజీరావు తడాఖా ఏమిటో మీ అందరికీ రుచి చూపిస్తాలే అనుకున్నాడు. ముందుగా ఆగ్రా వెళ్ళి సాదత్‌ఖాన్ సైన్యాన్ని గెలవడమా, లేక నేరుగా రాజధానికి వెళ్ళి, ఢిల్లీ నగరాన్ని తగలబెట్టి పాదుషా కళ్లు పచ్చబడేట్టు చేయడమా-అని ఆలోచిస్తే రెండోదే మంచిదని అతడికి తోచింది. శతఘ్నులు, ఫిరంగుల వంటి భారీ సామాగ్రిని జైత్‌పూర్‌లో ఛత్రసాల్ కుమారుడి దగ్గర వదిలేసి మెరికల్లాంటి అశ్వదళంతో మెరుపు వేగంతో వెంటనే కదిలాడు. ముహమ్మద్ ఖాన్ బంగష్, ఖాన్ దౌరాన్, వజీర్లతో కలిసి సాదత్‌ఖాన్ విందు వినోదాలలో తాగి తందనాలాడుతూండగా వారికి అల్లంత దూరంలో వేరే దారిన బాజీరావు ఢిల్లీ దిశగా దూసుకుపోయాడు. 1737 మార్చి 28 నాటికి ఢిల్లీ పొలిమేరల్లో హఠాత్తుగా ప్రత్యక్షమయ్యాడు.

అప్పుడు చక్రవర్తి చేతిలో పెద్దగా సైన్యం లేదు. పిలిస్తే పలికేందుకు ఏ సర్దారూ అందుబాటులో లేదు. పాదుషాకి చెమటలు పట్టాయి. రెండు వైపులా లక్షపైగా సైన్యాన్ని మోహరించినా అందరి కళ్లూ కప్పి ఈ సైతాన్లు రాజధాని ఎలా చేరారో అర్థంకాక అతడు తెల్లబోయాడు. ఏమి చేయాలో తోచదు. సలహా చెప్పేవారు లేరు. తనకా కైపులూ వలపులే తప్ప యుద్ధాలు, పోరాటాలు చేతకావు. వచ్చినవాడు ఎక్కడ అగ్గి పెడతాడో తనను, తన సింహాసనాన్ని ఏమి చేస్తాడో, అసలు బతకనిస్తాడో లేదో తెలియదు. ఇలా భయవిహ్వల స్థితిలో కర్తవ్యం పాలుపోక గజగజలాడి మొగల్ చక్రవర్తి గడప ముందు నిలిచిన మరాఠా



వీరుడి చేతికి గువ్వపిట్టలా చిక్కాడు. సంధి కుదరకపోతే ప్రాణాలతో సపరివారంగా బయటపడటానికి యమున ఒడ్డున రాజమందిరం కింద పడవలను కూడా సిద్ధం చేయించాడు.

తరవాత ఏమి జరిగిందో, బాజీరావు ఏమి చేశాడో, ఎందుకు చేశాడో తెలుసుకుందుకు చరిత్రకారులను అడగక్కర్లేదు. యుద్ధరంగం నుంచి తమ్ముడు చిమ్మాజీకి పంపిన లేఖలో స్వయంగా బాజీరావే అన్నీ వివరించాడు.

ఆ జాబులోని భాగాలు మచ్చుకు కొన్ని:

"...we accordingly decided to march against Delhi and setting fire to the capital", bring to the notice of the Emperor the existence of the Marathas. ...we pitched our camp near Kushbandi (a suburb of Delhi) ...we wanted to burn the capital to ashes, but on second thought we saw no good in destroying this mighty city and ruining the imperial throne at Delhi... An act of outrage breaks the thread of politics... Moreover the Emperor ... desired to make peace with us ... we sent word in reply... 'we are marching on to the zil Tank as our presence near the city is likely to disturb its peace. 'And we moved on..."

[*A History of Maratha People* - **Kancaid & Parasnis,** *pp. 226-27*]

(అలా మేము ఢిల్లీపై దండెత్తి రాజధానికి నిప్పు పెట్టి తద్వారా మరాఠాల అస్తిత్వాన్ని చక్రవర్తి గుర్తించేలా చేద్దామని నిర్ణయించాం... ఢిల్లీ శివారులోని కుష్‌బంది వద్ద విడిదికి డేరాలు వేశాం... రాజధానిని బూడిద చెయ్యాలనే అనుకున్నాము గానీ మళ్లీ ఆలోచిస్తే ఈ గొప్ప నగరాన్ని ధ్వంసంచేసి ఢిల్లీలో సామ్రాజ్య సింహాసనాన్ని నాశనం చేయడం మంచిది కాదనిపించింది... అఘాయిత్యపు పని రాజకీయపు దారాన్ని తెంపుతుంది. పైగా పాదుషా మాతో సంధి కుదుర్చుకోదలిచాడు... అతడికి పంపిన జవాబులో 'నగరానికి దగ్గరలో మేము ఉంటే శాంతికి భంగం కలగవచ్చు కనుక జీల్ చెరువు వద్దకు తరలుతున్నామ'ని చెప్పాం. అలాగే అక్కడకి వెళ్లాం...)

కోపావేశంతో మొగల్ రాజధానిని దగ్ధం చేయాలని అనుకున్నా, వాస్తవంగా అందుకు అవకాశం వచ్చేసరికి అటువంటి అకృత్యానికి బాజీరావుకు చేతులు రాలేదు. మరాఠా సైన్యం వెళ్ళేసరికి విడిది దగ్గరలో రామనవమి ఉత్సవాలు కోలాహలంగా జరుగుతున్నాయి. తాను హిందువు కనుక హిందూ జనావాస ప్రాంతాలకు హాని చేయరాదన్న భావంతోటే బాజీ తనను తాను నిగ్రహించుకున్నాడనుకోలేము. కొన్ని శతాబ్దాల కిందట అదే ఢిల్లీలో తైమూర్ ముస్లిం నివాస ప్రాంతాలను మాత్రం వదిలేసి మిగతా నగరమంతటా ఊచకోతల, దహనాల ఘోరకలిని సాగించినందుకు చారిత్రక ప్రతీకారంగా తాను ఆ నగరంలోని ముస్లిం ప్రాంతాలను తగలబెట్టాలన్న దుష్టాలోచన కూడా అతడికి కలగలేదు. ఇంత గొప్ప నగరాన్ని ధ్వంసం చేయడం అపచారమనే అతడి వివేకం ప్రబోధించింది.

ఆగడం చేయదలచుకుంటే బాజీరావుకు కారణాలు కావలసినన్ని. దానికి కొద్ది రోజుల కిందటే ఆగ్రా సమీపాన మొగల్ సర్దార్లు బాజీ సేనలో వందల మందిని చంపి వెయ్య

మంది సైనికులను బందీలుగా పట్టుకున్నారు. రాజధానిని ముట్టడించాక రాజీకి సుముఖమైనట్టుగా బాజీరావుకు అభిప్రాయం కలిగించినా అతడిని చూసి మొగల్ పాదుషా గజగజ వణికి కాళ్ల బేరానికేమీ రాలేదు. మరాఠాల దాడిని తిప్పికొట్టటానికి తాను పన్నగలిగిన పన్నాగాలు కడదాకా పన్నుతూనే ఉన్నాడు. తనకు ఇష్టుడైన అమీర్‌ఖాన్ అనేవాడికి చిన్నచితకా సేనలను తోడిచ్చి, పన్నెండు వేల సైన్యాన్ని సమకూర్చి ఫిరంగుల దళంతో సహా బాజీ దండు మీదికి ఉసిగొలిపాడు. పెద్ద ఎత్తున సైన్యాన్ని తీసుకురమ్మని సవాయి జయసింహ్‌కు కబురు మీద కబురు పంపాడు. ఆదమరచి మరాఠాల కదలికలను గమనించలేకపోయిన సాదత్‌ఖాన్ వగైరాలను హుటాహుటిన రాజధానికి వచ్చి మరాఠాల భరతం పట్టమన్నాడు. అన్ని యత్నాలు, అన్ని తంత్రాలు విఫలమయ్యాకే గతి లేక రాజీకి వచ్చాడు.

బాజీరావు తలచుకుంటే నిరాఘాటంగా రాజధాని నగరంలో ప్రవేశించి మొగలు పాదుషాను కూలదోసి మరాఠా పతాకాన్ని సగర్వంగా ఎర్రకోటపై ప్రతిష్ఠించగలిగేవాడు. గుర్రం మీద కొద్ది నిమిషాల్లో రాజప్రాసాదానికి చేరగలిగినంత దూరంలోనే అతడున్నాడు. అనేక దశాబ్దాలుగా మరాఠాల తడాఖా ఎరిగిన మొగలు దర్బారు వారందరూ ఎప్పుడు ఏమి జరుగుతుందో, తమ గతి ఏమవుతుందోనని గుండెలు గుప్పిట్లో పెట్టుకుని హడలిపోయారు.

కాని–ఆశ్చర్యం! బాజీరావు తన పరాక్రమాన్ని ప్రదర్శించి, మాళవపై మరాఠా ఆధిపత్యాన్ని పాదుషా గుర్తించేట్టు చేసుకోవడంతోనే సంతృప్తిపడ్డాడు. వచ్చినంత వేగంగా ఢిల్లీ వదిలి రాజపుత్ర స్థానానికి తరలాడు. యావద్భారతం దాదాపుగా మరాఠాల ఆధిపత్యంలోకి ఎలాగూ వచ్చినందున, చచ్చిన పాములాంటి మొగలు పాదుషాను ఇంకా కుళ్ళబొడవటం కంటే సాహురాజుకు గల మొగలు పక్షపాతాన్ని మన్నించి నామమాత్రపు చక్రవర్తిత్వాన్ని కొనసాగించడమే విజ్ఞత అని అనుకున్నాడా? కోరలు పీకేసిన పాదుషా నుంచి ఆ సమయంలో అదనంగా రాబట్టవలసింది ఏమీ లేదని భావించాడా? లేక – దిగ్భ్రమ నుంచి తెప్పరిల్లి సాదత్‌ఖాన్ భారీ సైన్యంతో తన పైకి పరుగున వస్తున్న తరుణాన దూరదేశంలో కొద్దిపాటి సైన్యంతో ఎక్కువసేపు నిలవడం మంచిదికాదని తలిచాడా... అన్నది శేషప్రశ్న. ఏమైతేనేం – తన సత్తా ఏమిటో శత్రువుల గుండెలవిసేలా ప్రదర్శించి, అనర్థకపు ఆవేశకావేశాలకూ, అమానుష ప్రతీకార కాంక్షలకూ లోనవకుండా హుందాగా వ్యవహరించి బాజీరావు జాతి ప్రతిష్ఠ పెంచాడు.

బాబర్ నాటి నుంచి మొహమ్మద్ షా దాకా మొగలు పాదుషాల మీద భారత ప్రజలకు ప్రేమాభిమానాలు ఎన్నడూ లేవు. ముఖ్యంగా ఔరంగజేబు మతద్వేషంతో సాగించిన దేవాలయ విధ్వంసాలు, ఇతర అకృత్యాల మూలంగా హిందువుల మనసు విరిగింది. మొగలు పరిపాలన పట్ల సామాన్య హిందువులందరికీ ఉన్న ఏహ్యత బాజీరావుకూ (కొంచెం ఎక్కువ పాళ్ళలోనే) ఉంది. కాబట్టే శివాజీ స్ఫూర్తితో నర్మద దాటి హిందుస్తాన్ మొత్తాన్నీ జయించబూనినప్పుడు 'హిందూ పదపాదుషాహి' (హిందూ సామ్రాజ్య) స్థాపనను తన ధ్యేయంగా ప్రకటించాడు.

రాజపుత్ర వీరుల ఐచ్ఛిక సహకారం పొంది వారి రాజ్యాలపై మరాఠా ఆధిపత్యాన్ని సంతోషంగా అంగీకరించేట్టు చేయటం కోసం వెళ్ళినప్పుడు ఉదయపూర్ మహారాణా నమస్కరించి తన సరసన ఆసనం చూపినా బాజీరావు వినయంగా దిగువన కూచుని



స్వహస్తాలతో రాణాకు చామరం వీచాడు. అదే రాజపుత్ర స్థానంలోని జైపూర్‌కు వెళ్ళినప్పుడు రాజా జయసింహ్ సరసన దర్జాగా కూచుని హుక్కాపొగ ముఖం మీదే వదిలాడు. ఈ తేడా ఎందుకని జయసింహ్ అడిగితే – 'ఉదయ్‌పూర్ రాణా మొగలు చక్రవర్తి ముందు ఎన్నడూ తలవంచలేదు. తనకు ప్రభువుగా అంగీకరించలేదు. మరి మీరు? మొగలు దర్బారులో సేవకులు. వట్టి మున్సబ్‌దారులు' అన్నాడు నిర్మొహమాటంగా.

చెప్పొచ్చిందేమంటే మొగలు సింహాసనం పట్ల అంతటి తూష్ణీభావం, హిందుత్వం పట్ల గొప్ప మమకారం గల బాజీరావు విదేశీయుడైన నాదిర్షా నుంచి దేశానికి ముప్పు వచ్చినప్పుడు తనకు పట్టనట్టు ఊరుకోలేదు. మత భేదాలను, ఇతర స్పర్థలను పక్కన బెట్టి దేశం మొత్తం ఏకం కావలసిన సమయంగా దాన్ని గుర్తించాడు. 'ఇవాళ హిందుస్తాన్‌కు ఒకడే శత్రువు. హిందువులు, ముసల్మాన్లు, దక్కను శక్తి యావత్తూ కలిసి అతడితో పోరాడాలి' అని ఎలుగెత్తి చాటాడు. 'పర్షియన్ ప్రభువు దండెత్తి వచ్చాడు. మొహ్మమద్ షాకు సాయంగా హోల్కర్, సింధియా, పవార్లను సైన్యంతో పంపుతున్నాను. నేనూ ఉత్తరానికి బయలుదేరుతున్నాను' అని తన సేనాని పిలాజీకి రాసిన జాబులో అన్నాడు. ***(The Later Mughals, p. 336)***

ఉదయ్‌పూర్ రాణా నేతృత్వంలో రాజపుత్రులను, బుందేలాలను కూడగట్టి నాదిర్షాపై సమైక్య ప్రతిఘటన తెచ్చేందుకు బాజీరావు సకల సన్నాహాలు చేశాడు. నాదిర్షా దక్షిణం వైపు వస్తే నామరూపాలు లేకుండా చేయడానికి అన్న కట్టుదిట్టాలూ జరిపాడు. కాని – నాదిర్షా దక్షిణానికి మరలనూ లేదు. బాజీరావు సేన తనను అందుకునేదాకా ఆగనూ లేదు. చిక్కిన కాడికి మూట కట్టుకుని, కొల్లగొట్టిన సంపదతో వచ్చినంత వేగంగా తన దేశానికి వెళ్ళిపోయాడు.

అనుకున్న ప్రకారం నాదిర్షాను బాజీరావు సారథ్యంలో జాతీయ శక్తులు సకాలంలో అడ్డుకుని ఉంటే చరిత్ర గతి ఎలా ఉండేదో!

# మస్తానీ

ఇదో ప్రేమకథ.

ప్రపంచంలోని గొప్ప ప్రేమ పురాణాలలో దేనికీ తీసిపోదు.

దీనిని మహత్తర ప్రణయగాథగా మలచడానికి అందమైన అబద్ధాలు ఆడనక్కర్లేదు. అల్లిబిల్లి కల్లలను అల్లనక్కర్లేదు. జీవిత వాస్తవాన్ని ఉన్నదున్నట్టుగా అంగీకరించి అక్షరబద్ధం చేస్తే చాలు. ఇబ్బందికరమైన యథార్థాలను మరుగుపరచకుండా, దాటవేయకుండా నిజాయితీగా చరిత్రకు న్యాయం చేస్తే చాలు.

దురదృష్టవశాత్తూ ఆ నిజాయితీయే చాలా మంది చరిత్రకారులలో లోపించింది. అందుకే - చరిత్ర ప్రఖ్యాతి పొందిన ఒక మహా పురుషుడితో జీవితం పంచుకుని, నీడలా వెన్నంటి నిలిచి, ప్రేరణనిచ్చి అనన్య ప్రభావం చూపిన ప్రణయిని ప్రామాణిక (మనుకునే) చరిత్ర గ్రంథాల్లో అజ్ఞాతంగా, అనామకంగా, మహా అయితే ఒక పాదపీఠికగా లేక ప్రాముఖ్యం లేని పేరాగ్రాఫుగా మిగిలిపోయింది.

ఆమె పేరు మస్తానీ.

శివాజీ తరవాత అంతటి మహావీరుడిగా మరాఠా చరిత్రలో పేరెన్నికగన్న పీష్వా బాజీరావు మెచ్చిన నెచ్చెలి.

బాజీరావు శూరుడే కాదు. సుందరుడు కూడా. ఆజానుబాహుడు. స్ఫురద్రూపి. చక్కని ముఖ కవళిక. పచ్చని మేనిఛాయ. 'అందరూ గొప్పగా చెప్పుకునే ఆ అందగాడిని చూడాలని ఉంది. ఈసారి అతడు మన దర్బారుకు వచ్చినప్పుడు పరదాల చాటు నుంచి మమ్మల్ని చూడనివ్వండి' అని నిజాం-ఉల్-ముల్క్‌ను అంతఃపుర కాంతలు కోరారట. అంతటి మోహనాంగుడే మస్తానీకి వశుడై ఆమెను విడిచి బతకలేనంతగా వెర్రెత్తి పోయాడంటే ఆమె అందం చందం ఎటువంటివో ఊహించవచ్చు.

మస్తానీని చేపట్టేనాటికి బాజీరావు వయస్సు 31. నాటి నుంచి అతడు అకాలమృత్యువు పాలయ్యేంతవరకూ పదకొండేళ్లపాటు నీడలా వెంట ఉండి కష్టాల్లో సుఖాల్లో పాలుపంచుకుని వలచి వలపించుకున్న మస్తానీ - బాజీరావుకు దేవుడిచ్చిన వరం. కానీ మూర్ఖలోకం దృష్టిలో ఆ వరమే ఒక శాపం! అతడిని చుట్టుముట్టి, చివరి దశలో మనశ్శాంతి లేకుండా చేసిన అనేక సమస్యలకు అదే ఆది మూలం!!

బాజీరావు హిందువు. మస్తానీ ముస్లిం. అక్కడ వచ్చింది చిక్కు.

ముస్లిం పేరు పెట్టుకున్నా మస్తానీకి మహమ్మదీయ మతం మీద మక్కువ లేదు. తల్లి మహమ్మదీయురాలు అయినా ఆమె తండ్రి హిందువు. అదీ - ఆషామాషీ మనిషి కాదు. హైందవ ధర్మవీరుడు, బుందేల్ ఖండ్ ప్రభువు అయిన రాజా ఛత్రసాల్!



మస్తానీ

[Kincaid, Parasnis రాసిన *A Comprehensive History of Maratha Empire* గ్రంథం నుంచి]

మస్తానీ నిజాం-ఉల్-ముల్క్ కూతురనీ, మరాఠాలతో సఖ్యత కోరి ఆమెను బాజీరావుకు కానుకగా ఇచ్చాడని కొందరంటారు. ఆమె మొగల్ సేనాని మహాజత్ ఖాన్ ఉంపుడుగత్తె అనీ, యుద్ధంలో మరాఠాలకు చిక్కి ఆత్మహత్య చేసుకోబోగా బాజీరావు తమ్ముడు చిమ్మాజీ ఆమెను ఆదరించి అన్నగారికి బహూకరించాడనీ మరి కొందరంటారు. ఈ కథలు నమ్మదగినవి కావు. ఆమె ఛత్రసాల్‌కు మహమ్మదీయ మతస్థురాలైన ఉంపుడుగత్తె వల్ల కలిగిన సంతానమనీ, 1729లో తాను మొగలాయీ మొసలి బారిన గజేంద్రుడిలా చిక్కినప్పుడు పిలవగానే వచ్చి ఆదుకుని తన రాజ్యం తనకు ఇప్పించినందుకు కృతజ్ఞతగా మూడో వంతు రాజ్యంతో బాటు ప్రియపుత్రిక మస్తానీని బాజీరావు చేతుల్లో పెట్టాడని రావు బహదూర్ పరాస్నిస్ పరిశోధించి కనుగొన్నదే వాస్తవానికి దగ్గరగా ఉందని విజ్ఞులందరూ అంగీకరించారు.

పుట్టుక గురించి భిన్నాభిప్రాయలున్నా మస్తానీ బహుముఖ ప్రత్యేకతల విషయంలో ఎవరికీ సందేహం లేదు. ఆమె అతిలోక సుందరి. మధుర గాయని. మైమరపించే నర్తకి. పుణె రాజప్రాసాదంలో బాజీరావు సన్నిహిత బంధుమిత్రులను ఆహ్వానించి ఏటా జరిపే గణపతి వేడుకల్లో మస్తానీ ఆటపాటలే ప్రధానాకర్షణ.

అందెగత్తెలు ఎందరో ఉంటారు. గంధర్వ కాంతల్లా పాడి, అప్సరసల్లా నాట్యం చేసి మహావీరులను పాదాక్రాంతం చేసుకోగలిగిన భామినులు చరిత్రలో కొల్లలు. మస్తానీ ప్రత్యేకత ఏమిటంటే స్త్రీ సహజమైన లాలిత్యం, కళా కౌశలాలతో బాటు శౌర్య పరాక్రమాలకూ ఆమె పెట్టిందిపేరు. గజ్జెకట్టి నాట్యం చేసినంత అలవోకగా ఆమె కత్తిపట్టి యుద్ధం చేయగలదు. వీణను శ్రుతి చేసినంత తేలికగా వందల మైళ్లు అలుపు లేకుండా గుర్రాన్నీ స్వారీ చేయగలదు.

ఈ కళ కూడా ఉంది కాబట్టి యుద్ధ సమయంలోనూ ప్రియుడిని వదిలి ఉండాల్సిన బాధ లేదు. రికాబు మీద కాలు కాలు తగిలేంత దగ్గరగా గుర్రం మీద ఆమె బాజీరావును ప్రతి యుద్ధంలోనూ అనుసరించేది. కత్తితో బల్లెంతో శత్రు సంహారం సాగించేది. గుడారాల్లో కలిసే ఉండేది. కష్టాలన్నీ పంచుకునేది.

ఇంతటి ఇష్టసఖి చెంతనుండగా బాజీరావుకు సహజంగానే రణం కూడా ప్రణయం లాగే మనోహరంగా గడిచేది. రాజధాని ఢిల్లీ మీదికి దండెత్తి అనేక వారాలపాటు అనేక శ్రమలకోర్చి సంగ్రామం సాగించి తిరిగి వస్తుండగా ఒక మజిలీ వద్ద వారు ఒక మొగల్ సేనాని కంటపడ్డారు. అప్పుడు బాజీరావు, అతడి ప్రియురాలు జీనుకు పరిచే బట్ట కింద వేసుకుని పక్కపక్కన కులాసాగా కూచుని కూనిరాగాలు తీస్తున్నారట. ఏకబిగిన నలభై మైళ్ల స్వారీ చేసిన బడలిక ఏదీ లేకుండా పిక్నిక్‌కు వచ్చిన ప్రేమ పక్షుల్లా వారు కిలకిలలాడుతున్నారట. "She was Kanchani (a dancing girl) skilled in riding and handling the sword and spear. She always accompanied Bajirao in his campaigns and rode stirrup to stirrup with him." (గుర్రపు స్వారీలో, బల్లెం, కత్తి యుద్ధాల్లో ఆ నర్తకి బహు నేర్పరి. ప్రతి యుద్ధానికీ గుర్రమెక్కి బాజీరావు వెంట వెళ్ళేది) అని *Tarikh-i-Muhammad Shahi* లో పర్షియన్ చరిత్రకారుడు పేర్కొన్నాడు.

ఇలా అన్ని విధాలా, అన్నివేళలా సహధర్మచారిణిలా తనను వెన్నంటి ఉండి సమరంలోనూ సరసంలోనూ సమాన ప్రజ్ఞను చూపిన మస్తానీని విడిచి బాజీరావు క్షణం ఉండలేకపోయేవాడు. ఒకసారి రాజదర్శనానికి సతారా వెళ్ళినప్పుడు రాచమర్యాదను అతిక్రమించి మస్తానీని కూడా అతడు వెంటబెట్టుకుపోగా సాహు మహారాజు మందలించాడట. రాజసన్నిధిలోనే అలా ఉంటే సొంత ఇంట్లో సంగతి చెప్పనే అక్కర్లేదు. పుణెలో తాను నిర్మించిన శనివార్ పాలెస్‌లో (శనివారం శంకుస్థాపన జరిగింది కనుక ఆ పేరు) మస్తానీ కోసం ప్రత్యేకంగా ఒక వాటా కట్టించి ఖాళీ సమయంలో ఎక్కువ భాగం ఆమెతోనే గడిపేవాడు. ఆ తమకంలో ధర్మపత్ని కాశీబాయిని, కన్నబిడ్డలను కొంచెం నిర్లక్ష్యమే చేశాడు.

సహజంగానే అది కుటుంబానికి కంటగింపయింది. తురక పిల్లను తెచ్చి ఇంట్లో పెట్టాడని అసలే మంట. ఆపై భార్యాబిడ్డలను పట్టించుకోవటం లేదన్న దుగ్ధ. బాజీరావు భార్య కాశీబాయి ఉత్తమ ఇల్లాలు. అమెకైతే మస్తానీ మీద ఈర్ష్యగానీ, ద్వేషంగానీ లేవు. తనను నిరాదరించినా భర్తను పల్లెత్తు మాట అనేది కాదు. ఆమెకున్న విశాల హృదయం కుటుంబంలో మిగతా వారికి లేవు. బాజీరావు తల్లి రాధాబాయి, తమ్ముడు చిమ్మాజీ, కుమారుడు బాలాజీలు మస్తానీ పేరు చెబితే మండిపడేవారు. ఆమెను వదిలి పెట్టమని తల్లి అనేక విధాల చెప్పింది. బాజీరావు వినలేదు. పోనుపోను పంతాలు పెరిగాయి.

ఒకసారి బాజీరావు ఊళ్లో లేని సమయంలో అతడి తమ్ముడు, కుమారుడు మస్తానీని దౌర్జన్యంగా వేరే ఇంటికి లాక్కెళ్లి గదిలో పెట్టి బంధించారు. తనను విడిచిపెట్టనంత వరకూ అన్నం ముట్టేది లేదని మస్తానీ భీష్మించింది. ఆ బెదిరింపు పనిచేయలేదు. ఇక లాభం లేదని ఆమె పరిసరాలను, కాపలాదారుల అనుపానులను, ముఖ్యంగా అశ్వశాల ఉనికిని జాగ్రత్తగా గమనించి, పథకం వేసి, ఒక రాత్రి కాపలా వారి కళ్లుగప్పి తప్పించుకుని గుర్రమెక్కి రివ్వున ప్రాణనాథుడు ఉన్నచోటికి పోయింది. సంగతి తెలిసి బాజీరావు చాలా బాధపడ్డాడు.



ఇంటివారే ఇలా చేస్తే, బయటివారి విషయంలో అడగాలా?! ముఖ్యంగా ఛాందస బ్రాహ్మణీకం బాజీరావుపై కత్తిగట్టింది. శ్రోత్రియ బ్రాహ్మణ కుటుంబంలో పుట్టినా బాజీరావు జీవితమంతా రణరంగాల్లో, సైనిక గుడారాల్లోనే గడిచింది. నిరంతర సైనిక జీవనం వల్ల అతడి ఆహారపు అలవాట్లు మారాయి. చాలా మంది సైనికుల్లాగే అతడు మద్య మాంసాలకు అలవాటు పడ్డాడు. అది అతడి వ్యక్తిగత విషయం. అతడున్న పరిస్థితుల్లో మామూలు మహారాష్ట్ర బ్రాహ్మణుడిలా అంటూసొంటూ పాటిస్తూ శ్రోత్రియంగా బతకడం కుదరని పని. ఆ సంగతి గుర్తించి పీష్వాలో తమకు అభ్యంతరకరమైన అలవాట్లను కుల పెద్దలు పెద్ద మనసుతో ఉపేక్షిస్తే సరిపోయేది.

కానీ అలాంటి ఔదార్యం ఛాందస బ్రాహ్మణ్యానికి ఏనాడూ లేవు. శివాజీ అంతటి మహా పురుషుడినే జన్మతః క్షత్రియుడు కాదు కనుక పట్టాభిషేకానికి అర్హత లేదు పొమ్మని బిర్రబిగిసిన మూర్ఖ వర్గమది. వారి ధాటికి తాళలేక శివాజీ అంతటి వాడే దేశాలు గాలించి గాగాభట్ అనే పండితుడిని కాశీనుంచి పట్టుకుని వచ్చి తనది క్షత్రియ వంశమేనని ప్రకటింపజేసుకుని అతడి చేతులతోనే ఛత్రపతిగా పట్టాభిషేకం చేయించుకోవలసి వచ్చింది.

ఛత్రపతి శివాజీనే లెక్కచేయని వారు పీష్వా బాజీరావుకు భయపడతారా? మద్య మాంసాలు ముట్టి కులభ్రష్టుడైనాడని మొదలే రగిలిపోతున్నవారు ఏకంగా తురక బీబునే ఇంటికి తెచ్చి కాపురం పెట్టటంతో అగ్గిమీద గుగ్గిలమైనారు. బాజీరావు అధికార ప్రాభవానికి వెరచి కులం నుంచి వెలివేయలేక, దెబ్బతీసేందుకు సమయం కోసం వేచి ఉన్నారు.

మస్తానీకీ అందచందాలే కాదు; తెలివితేటలూ ఉన్నాయి. తండ్రి తనను బాజీరావు చేతిలో పెట్టగానే ఆమె అతడికి వశమై పోలేదు. పీష్వా తనను ఎంత మోహించి మరులుగొన్నా... తనను భార్యలా చూసి తనకు పుట్టే కొడుకుకు ఆస్తిలో తగిన వాటా ఇస్తానని మాట తీసుకున్నాక గానీ ఆమె దగ్గరవలేదు. ఆ ప్రకారమే బాజీరావు ఆమెను సొంత లోగిలిలో కాపురం ఉంచాడు. కొంతకాలానికి ఆమె పండంటి కొడుకుని కన్నది. బాజీరావు ఆ కుమారుడికి శాస్త్రోక్తంగా నామకరణం చేసి హిందువుగా పెంచదలిచాడు.

బ్రాహ్మణ్యం ససేమిరా వీల్లేదంది. హిందూ ధర్మంలో మతం మార్పిడి కుదరదంది. తురకదానికి పుట్టినవాడు, తురకే తప్ప హిందువు కావడానికి ఒప్పుకునేది లేదంది. ఈ విషయంలో కులం అంతా ఒక్క కట్టుపై నిలిచి, పౌరోహిత్యానికి ఏ బ్రాహ్మడూ అంగీకరించక పోవడంతో బాజీరావు గత్యంతరం లేక ఆ కుమారుడికి 'షంషేర్ బహదూర్' అని పేరు పెట్టి ముసల్మానుగానే పెంచాడు.

(ఆ పుత్రుడు బాజీరావు ఒద్దికలో పేరుకు తగ్గట్టు మహాయోధుడిగా ఎదిగాడు. ధైర్య సాహసాలతో తుదిశ్వాస దాకా పోరాడి 27వ ఏట పానిపట్టు యుద్ధభూమిలో నేలకొరిగాడు. మస్తానీకిచ్చిన మాట ప్రకారం అతడికి బాజీరావు పంచి ఇచ్చిన బుందేల్‌ఖండ్ జాగీరును అతడి కుమారుడు అలీబహదూర్ విస్తృతపరచి బండా సంస్థానాన్ని స్థాపించాడు. అతడి వారసుడైన బండా నవాబు 1857 స్వాతంత్ర్య సమరంలో ఝాన్సీరాణి లక్ష్మీబాయికి బాసటగా నిలిచి బ్రిటిష్ వారితో పోరాడాడు.)

శివాజీ ఆదర్శంగా హిందూధర్మ ప్రతిష్ఠాపనకు అంకితమై అవక్ర విక్రమంతో సంఘర్షించిన హైందవ ధర్మవీరుడు బాజీరావుకే తన కన్నకుమారుడిని హిందువుగా పెంచుకునే అవకాశం లేకపోవడం హిందూ సమాజానికి సిగ్గుచేటు. ఇలాంటి సిగ్గుచేటు నిర్వాకాలు... క్షమించరాని,

ఆత్మహత్యా సదృశమైన అపరాధాలు చాదస్తపు బ్రాహ్మణీకం వల్ల ఇంకా చాలా జరిగాయి. ఆ చారిత్రక తప్పిదాలే హిందూ సమాజంలో అనైక్యతకు, వెర్రితలలకు ముఖ్య కారణమయ్యాయి.

ముస్లిం మస్తానీకి జన్మించిన కుమారుడికి హైందవ మత సంస్కారాన్ని చేయడానికి నిరాకరించడంతోటే సనాతన బ్రాహ్మణ వర్గం ఆగలేదు. కాశీబాయి వల్ల బాజీరావుకు జన్మించిన రఘునాథరావు ఉపనయనానికీ వారు అడ్డం తిరిగారు. కులభ్రష్టుడైన బాజీరావు కనుక హాజరైతే పౌరోహిత్యం చేసేదే లేదు పొమ్మన్నారు. అరివీర భయంకరుడైన అంతటి మహాయోధుడు కూడా సంప్రదాయపు పట్టుకు నిస్సహాయుడయ్యాడు. మస్తానీతో అతడి సంపర్కం ఇంటా బయటా పెద్ద వివాదమైంది. మస్తానీని విడిచిపెట్టమని బాజీరావును తల్లి కూడా గట్టి వత్తిడి చేసింది. అంతా ఆక్షేపించేవారే, అందరూ తనకు కావలసినవారే. ఎవరినీ సమాధానపరచలేక, ఎవరి నోరూ మూయించలేక అలాగని ప్రాణ సమానురాలైన మస్తానీనీ వదులుకోలేక బాజీరావు మహాక్షోభ పడ్డాడు.

ఏమి జరిగిందో సరిగ్గా తెలియదు. మస్తానీని బాజీరావు నుంచి వేరుచేసి శనివారవాడలోని గదిలో దాదాపుగా బంధించడంలో అతడి తల్లి, తమ్ముడు, కొడుకు కృతకృత్యులయ్యారు. బలప్రయోగం చేయాలని తలచినా గృహచ్ఛిద్రానికి వెరచి బాజీరావు ఆ ప్రయత్నం విరమించుకున్నాడు. ఎన్నో యుద్ధాల్లో నిరుపమాన ధైర్యసాహసాలను చూపి ఎంతటి సవాలునైనా అవలీలగా ఎదుర్కొన్న వీరుడికి వ్యక్తిగత విషయం దగ్గరికి వచ్చేసరికి పరాక్రమం సన్నగిల్లి చివరి దశలో చిత్రమైన పలాయన మనస్తత్వం ఆవహించింది. తనను నమ్ముకున్న మస్తానీని రాబందుల్లాంటి బంధువుల బారిన వదిలేసి ఇంట్లో దొరకని మనశ్శాంతిని యుద్ధరంగంలో వెదుక్కుంటూ వెళ్ళాడు. సంధి షరతుల్లో భాగంగా నిజాం-ఉల్-ముల్క్ తనకు ఇవ్వడానికి గతంలో ఒడంబడి ఆ దరిమిలా ఎగగొట్టిన జాగీరును స్వాధీన పరచుకోవడానికి 1739 డిసెంబరులో పూనా నుంచి పెద్ద సైన్యంతో దండెత్తి వెళ్ళాడు. నలభై వేల సైన్యంతో తనను ఎదుర్కొన్న నిజాం కుమారుడు నాసర్‌జంగ్‌తో గోదావరి తీరాన రెండు నెలలు హోరాహోరిగా పోరాడి ఓడించాడు. తనకు రావలసిన జాగీరును రాబట్టుకుని ఘన విజయం సాధించాక కూడా ఇంటికి పోవడానికి మనసొప్పక కొత్త జాగీరు తనిఖీ నెపంతో ఇండోర్ వైపు వెళ్లాడు.

ఈలోపు పూనాలోని మూర్ఖాగ్రేసరుల ముఠా మస్తానీని ఏకంగా ఖూనీయే చేసి అడ్డుతొలిగించుకోవాలని ఆలోచించింది. కానీ మహారాజుకు అత్యంత ఆప్తుడైన పీష్వా ప్రియసతిపై అటు వంటి అఘాయిత్యాన్ని రాజుకు తెలియకుండా చేసేందుకు ధైర్యం చాలక దురాలోచనకు అనుమతి కోరారు. పీష్వాను కష్టపెట్టే అలాంటి పిచ్చి పని ఏదీ చేయరాదని సాహు రాజు శాసించాడు. అక్కడితో ఆ కుతంత్రం ఆగింది. మస్తానీ వియోగాన్ని భరించలేక ప్రవాసంలోని బాజీరావు లోలోన కుమిలిపోసాగాడు. అన్నగారి చిత్తక్షోభను స్వయంగా గమనించిన చిమ్మాజీ తాను పుణెకి తిరిగి రాగానే 'ఆమెను అతడి దగ్గరికి పంపించక తప్పదు' అని బాజీ కొడుకు బాలాజీకి 1740 మార్చి 7న జాబు పంపాడు.

కాని విధి మరోలా తలచింది. పుణె వారికి దయ కలిగి మస్తానీని భర్త దగ్గరికి చేర్చక ముందే బాజీరావును మృత్యువు ఈ లోకం నుంచే ఎత్తుకు పోయింది. నర్మద ఒడ్డున రావేర్ సమీపాన విపరీత మద్యపానం వల్లో, దుర్భర చిత్తక్షోభ వల్లో బాజీరావు జీవితంలో



మొదటిసారిగా జబ్బుపడ్డాడు. మూడురోజులు జ్వరంతో బాధపడి, స్పృహకోల్పోయి 1740 ఏప్రిల్ 28న ఆ మహావీరుడు 42 ఏళ్ల పిన్నవయసులో కన్ను మూశాడు. మరణించే సమయానికి భార్య కాశీబాయి, కుమారుడు జనార్దన్ అతడి పక్కన ఉన్నారు. మస్తానీకి ఆ భాగ్యం కూడా దక్కలేదు.

బతికి ఉండగా బలవంతాన విడదీసిన వారు బాజీరావు మరణించాక మస్తానీని చివరి చూపుకు అనుమతించారు. రాధాబాయి, చిమ్మాజీ, బాలాజీల వెంట జీవచ్ఛవంలా స్మశానానికి నడిచివెళ్ళిన మస్తానీ ఏమి తలచిందో ఏమి చేయనున్నదో ఎవరూ ఊహించలేదు. చితికి నిప్పు అంటించగానే అందరూ నిశ్చేష్టులై చూస్తుండగా మస్తానీ చిరునవ్వు నవ్వుతూ మంటల్లోకి దూకి ప్రాణనాథుడితో కలిసి అగ్నికి ఆహుతి అయింది.

Seperated from her lover in this world, Mastani passed fearlessly through the flames to greet him in the next.

[*Compehensive History of the Maratha Empire,* **Kincaid & Parasnis,** *Vol, p.266*]

(ఈ లోకంలో ప్రియుడి నుంచి వేరుచేయబడిన మస్తానీ పై లోకంలో అతడిని స్వాగతించేందుకు నిర్భయంగా మంటల్లో ప్రవేశించింది.)

మస్తానీ విషాదం గురించి కిన్‌కైడ్, పారాస్నిస్‌లు చెప్పిన ఈ వివరంతో సుప్రసిద్ధ చరిత్రకారుడు జి.ఎస్. సర్దేశాయి విభేదించారు. ఆయన అభిప్రాయం ప్రకారం –

As soon as the news of Baji Rao's death reached Mastani she died in the palace of Poona, whether by suicide or of shock, it is difficult to say. Her dead body was removed to Pabal, a village about 20 miles east of Poona... where an unpretentious tomb reminds passers by of the story of her love and her tragic end. By common consent she was known as the most charming woman of her time.

[*New History of Marathas,* **G.S. Sardesai,** *Vol. II, p.181*]

(బాజీరావు మరణ వార్త తెలియగానే పూనా పాలెస్‌లో మస్తానీ మరణించింది. ఆత్మహత్య చేసుకుందా, షాక్ వల్ల ప్రాణం పోయిందా అన్నది చెప్పడం కష్టం, ఆమె భౌతికకాయాన్ని పూనాకు 20 మైళ్ల దూరంలో పాబాల్ గ్రామానికి తరలించారు. అక్కడి సాదాసీదా సమాధి వచ్చేపోయే వారికి ఆమె ప్రేమను, విషాదాంతాన్ని ఈనాటికీ గుర్తు చేస్తుంది. ఆ కాలంలో ఆమెను మించిన సౌందర్యవతి లేదని అందరూ అంగీకరించారు.)

సహగమనం చేస్తేనేమి? భర్త మృతిని తట్టుకోలేక గుండె ఆగి మరణిస్తేనేమి? భర్తలేని లోకంలో మస్తానీ క్షణమైనా నిలవదలచలేదు. ఆ మగమహారాజు చివరి దశలో తన ఖర్మకు తనను వదిలేసినా తాను మాత్రం ప్రాణాలన్నీ నాథుడి మీదే పెట్టుకుని బతికింది. సమకాలీన సమాజపు అల్పత్వాన్ని, మూర్ఖత్వాన్ని అపహసించి జాలిలేని ప్రపంచం నుంచి నవ్వుతూ నిష్క్రమించింది – పాపం, మస్తానీ!

# ఆహా! మన మంచితనం!!

'నీ తండ్రి తాతలు నాకు విశ్వాసపాత్రులై ఎన్నో ఘనకార్యాలను సాధించారు... మొగల్ సామ్రాజ్యాన్ని సంరక్షిస్తూనే మొత్తం హిందుస్తాన్‌ను జయించాలని బాజీరావు ఆకాంక్షించాడు. నువ్వు అతడి కుమారుడివి. నీ తండ్రి కోరికను సాధించు. నీ అశ్వికులను అటక్ గోడల అవలి దాకా నడిపించు'.

కొత్త పీష్వాగా నియమిస్తూ బాలాజీరావుతో 1740 జూన్ 25న మరాఠా రాజు సాహు అన్న మాటలివి. తండ్రి బాజీరావు చిన్నవయసులో హఠాత్తుగా కన్నుమూసి ఇంకా రెండు నెలలు కాలేదు. అప్పటికి బాలాజీరావుకు 19వ ఏడు కూడా నిండలేదు. ఇరవై ఏళ్ల కింద 20 సంవత్సరాల బాజీరావును తండ్రి స్థానంలో పీష్వాగా కూచోబెట్టినందుకే చాలా మంది ఆశ్చర్యపోయారు. ఇప్పుడు అతడి కుమారుడికి పద్దెనిమిదిన్నర సంవత్సరాల లేతవయసులో విశాల రాజ్యానికి ప్రధానమంత్రిత్వం అప్పగిస్తుంటే దర్బారులో ప్రతి ఒక్కరూ ముక్కున వేలేసుకున్నారు.

పీష్వా పదవి ఆనువంశికంగా తండ్రి తరవాత కుమారుడికి దక్కి తీరాలన్న నియమం లేదు. రాజు తలచుకుంటే ఎవరికైనా దానిని కట్టబెట్టగలడు. మీసాలు కూడా సరిగా రాని బాలాజీనే ఆ కీలక బాధ్యతకు ఎంచుకోవడానికి అనేక కారణాలున్నాయి. బాలాజీ చిన్న తనం నుంచి సాహుకు బాగా తెలుసు. ఆ కుర్రాడంటే అతడికి చాలా ప్రేమ. తండ్రి చేతికింద నలిగి, పినతండ్రి ఒద్దికలో పెరిగి, రణరంగంలోనూ పాలనా రంగంలోనూ రాటుతేలి ఆ బాలుడు ఎంతగా ఈడుకు మించిన పరిణతి చెందిందీ రాజుకు తెలుసు. అందుకే రఘూజీభోస్లే వంటి యోధుడు, బాబూజీ జోషీలాంటి మోతుబరి పోటీ పడ్డా వారిని కాదని, ప్రధాన మంత్రిత్వాన్ని ఒడుపుగా నడపటానికి ఈ పిల్లవాడే యోగ్యుడని నిశ్చయించాడు. మునుపు బాజీరావు విషయంలోలాగే అతడి కుమారుడి యోగ్యత గురించీ సాహు చేసిన నిర్ణయం సరైనదని కాలం రుజువు చేసింది.



"నానా సాహెబ్'గా ప్రఖ్యాతుడైన బాలాజీరావు మరాఠా రాజ్యానికి పీష్వాగా 1740 నుంచి 1761 దాకా 21 ఏళ్లు పని చేశాడు. తండ్రిలాగే అతడూ 40 ఏళ్ల వయసులోనే ఆకస్మిక అనారోగ్యంతో మరణించాడు. తాత వలె గొప్ప రాజకీయ తంత్రజ్ఞుడు కాకున్నా తండ్రివలె మహావీరుడు కాకపోయినా బాలాజీకి బృహత్తర రాజ్యభారాన్ని సవ్యంగా నిభాయించడానికి కావలసిన ఓర్పు, నేర్పు... వినయం, వివేకం పుష్కలంగా ఉన్నాయి. తండ్రి నోరు కరకు. ఇతడి మాట మృదువు. తండ్రిని చూస్తే ఎవరికైనా భయమో భక్తో ఏదో ఒకటి కలిగేది; అనుచరులూ సహచరులే తప్ప స్నేహితులు పెద్దగా ఉండేవారు కాదు; దగ్గరి వారు కూడా చనువు చూపలేకపోయేవారు. కుమారుడి తత్వం ఇందుకు భిన్నం. బాలాజీ శత్రువుతో సైతం సౌమ్యంగా మాట్లాడగలడు. ఉత్తర, దక్షిణ ధ్రువాల వంటి ప్రత్యర్థులను కూడా చాకచక్యంతో కలుపుకు వెళ్ళగలడు. పంతానికి పోకుండా సమయాన్ని బట్టి పట్టు, విడుపు ప్రదర్శించి రాజకార్యాన్ని, రాజ్యక్షేమాన్ని చక్కబెట్టగలడు.

ఈ గుణగణాలతో తాను పీష్వాగా ఉన్న 21 ఏళ్ల కాలంలో బాలాజీ అనేక విజయాలను సాధించాడు. అతడి హయాంలో మరాఠా ప్రాభవం దేశం నలుదిశలా విస్తరించి తారాస్థాయిని అందుకుంది. తండ్రిలాగే అతడూ యుద్ధంలో గెలిచో, రాజ్యాన్ని కలుపుకునో, చౌథ్, సర్దేశ్‌ముఖులను వసూలు చేసో యావద్భారతాన్నీ మరాఠా ప్రభావం, ప్రాబల్యాల కిందికి తేవాలని శాయశక్తులా పరిశ్రమించాడు. గుజరాత్, మాళవ, బుందేల్‌ఖండ్, బేరార్, తదితర ప్రాంతాల్లో తండ్రి బాజీరావు పరాక్రమంతో పోరాడి సాధించిన విజయాలను, హక్కులను బాలాజీ స్థిరపరచి క్రమబద్ధీకరించాడు. మొగలు రాజప్రముఖుడైన సవాయ్ జయసింహ్‌ను మంచితనంతో మెప్పించి, తన తండ్రికి ఒడంబడిన ప్రకారం మాళవపై సుబేదారీ హక్కులను మొగలు చక్రవర్తి నుంచి సునాయాసంగా సాధించిన తీరు బాలాజీ దౌత్య ప్రతిభకు మచ్చుతునక.

బాజీరావు ప్రపంచమంతా ఏకమై తనపైకి దండెత్తినా ధైర్యంగా పోరాడగలిగిన మహావీరుడే. అంతటి పరాక్రమశాలి కూడా అప్పులవాళ్ల పేరు చెబితే హడలిపోయేవాడు. బతికినంత కాలమూ అతడికి అప్పుల బాధ. ఎన్ని యుద్ధాలు చేసి, ఎన్ని రాజ్యాలు కొల్లగొట్టి, చౌథులు ఎన్ని లక్షలు వసూలు చేసినా ఎక్కడి సొమ్మూ రాజ్య ఖర్చులకూ, దర్బారు వ్యయానికీ, సైనికుల జీతాలకూ చాలేది కాదు. ఎంత సొమ్ము రాబట్టినా వ్యక్తిగత పూచీ మీద తెచ్చిన అప్పుల భారం అంతకంతటికీ పెరిగేదే తప్ప తగ్గేదికాదు. అప్పుల వాళ్ళ ఒత్తిళ్లకు తట్టుకోలేక బాజీరావు సతమతమయ్యేవాడు. 'హిందూస్తాన్ మీద దిగ్విజయంగా దండయాత్ర చేసి వచ్చాను. నికర లాభం ఏమీ లేదు. సైన్యం ఎన్ని కష్టాలు పడ్డా రుణదాతల నరకం నాకు తప్పడంలేదు. షావుకార్లను, సిలేదార్లను తృప్తిపరచడానికి నేను నుదుటి చర్మం చిట్లేలా వారి కాళ్ల మీద పడుతున్నాను' అని 1736లో తన గురువు బ్రహ్మేంద్రస్వామికి రాసిన లేఖనుబట్టి బాజీరావు ఎంతటి ఆర్థిక క్షోభ అనుభవించాడో అర్థం చేసుకోవచ్చు.

బాలాజీరావు పీష్వా అయ్యేనాటికి తండ్రి నుంచి సంక్రమించిన అప్పు 14 లక్షల రూపాయలు. కుర్రవాడన్న అలుసుతో అతడి మీద అప్పుల వారి దాష్టీకమూ దారుణంగా ఉండేది. రాజ్యపాలనకు నిరంతరం పెరిగే అవసరాలు తీర్చడానికి ఎన్ని యుద్ధాలు చేసినా సరిపోయేవి కాదు. ఈ స్థితిలో ఎలా చేశాడో, ఏమి చేశాడో తెలియదు గాని అస్తవ్యస్త

ఆర్థికస్థితిని బాలాజీ సక్రమ నిర్వహణతో, గట్టి అజమాయిషీతో చక్కబరిచి లోటును కాస్తా మిగులుకు తేల్చాడు. దారిదోపిళ్లు చేయించో, దేశాన్ని దోచుకునో, దుర్మార్గాలు చేసో సొమ్ములు రాబట్టాడని అతడి మీద బద్ధ విరోధులు కూడా నింద వేయలేదు. పీష్వా మీ కంటే బాగా సిరిసంపదలతో వెలిగిపోతున్నాడని గిట్టనివారు ఒక దశలో తన మీద రాజుకు చాడీలు చెప్పేంతటి ఆర్థిక పుష్టిని రాజ్యానికి సంతరించి పెట్టటం బాలాజీ వ్యవహార దక్షతకు దృష్టాంతం.

'చౌథ్' బకాయిల వసూళ్ల కోసం, హక్కుల కోసం, రాజ్యవిస్తరణ కోసం ఎంతగా తంటాలు పడ్డా బాలాజీకి గాని, అతడి తండ్రి, తాతలకుగాని పెత్తనమే పరమావధి కాదు. తాము సేవిస్తున్న రాజుకు, జన్మస్థలమైన మహారాష్ట్రకు నిశ్చల నిబద్ధత చూపుతూనే హిందూ మతం పట్ల, హిందూ సమాజ విశాల ప్రయోజనాల పట్ల, హైందవ ధర్మపునరుద్ధరణ పట్ల వారు భక్తి, విశ్వాసాలను కనపరిచి, వాటికోసం తమకున్న పరిమితుల్లో చేయగలిగిందంతా చేశారు. పర్షియన్, బ్రిటిష్ చరిత్రకారుల రాతల మీద ఆధారపడిన కొన్ని చరిత్ర గ్రంథాల్లో మరాఠాలను దోపిడీదారులుగా, డబ్బుల కోసం పెత్తనం కోసం ఇతర ప్రాంతాలను పీడించిన దుండగీళ్లుగా, కుతంత్రాలు నడిపిన కిరాయి మూకలుగా చిత్రించడం కనిపిస్తుంది. సమకాలిక మరాఠా చారిత్రక పత్రాలను, సాంప్రదాయక మరాఠా చరిత్రలను పరిశీలిస్తే హైందవ ధర్మవీరులుగా మరాఠాలు పోషించిన భూమిక తక్కువేమీ కాదని తేటతెల్లమవుతుంది. ఉదాహరణకు బాలాజీరావుకు స్ఫూర్తి, మార్గదర్శి అయిన పినతండ్రి చిమ్మాజీ అప్పా 1740 జూన్ 2న మొగలు దర్బారులో ముఖ్యుడు మహాదేవ్ భట్ హింగ్నేకు రాసిన లేఖలోని ఈ అంశాలను చూడండి.

"... ...The Peshwa's young son Nana has now assumed the same responsibility. He and I are ready to carry to completion the unfinished programme.... the basis of which was first laid down by my revered father (Balaji Viswanath, the first peshwa)... He thus earned a great name and left the precious heritage to his son, (Baji Rao) who faithfully carried out the benevolent programme chalked out for him, viz. the regeneration of religion, of gods and Brahmans, of the sacred places of Hindu pilgrimage like Benares... His great ambition was to restore the Kashi Vishveshwar shrine of Benares to its pristine glory and greatness... ...Sawaiji has agreed to abtain imperial sanads for ... ... the remittance of the pilgrim tax at Prayag and the cession of Benares. You must impress upon Sawaiji that in our hearty co-operation lies his interest as well as ours."

[***New History of the Maratas*, G.S. Sardesai,** *Vol. II. p.200-01*]

(స్వర్గస్థుడైన పీష్వా కుమారుడైన నానా ఇప్పుడు అదే బాధ్యతను చేపట్టాడు. అతడు, నేను అసంపూర్ణ కార్యక్రమాన్ని పూర్తి చేయదలిచాము. దానికి ప్రాతిపదికను మా పితృదేవుడు (ప్రథమ పీష్వా బాలాజీ విశ్వనాథ్) నిర్దేశించి వున్నారు... ఆయన



గొప్ప పేరు గడించి, తన అనర్ఘ వారసత్వాన్ని తన కుమారుడు (బాజీరావు)కి వదిలిపెట్టారు. మత పునరుత్థానాన్ని, దేవ బ్రాహ్మణుల, వారణాసి వంటి పవిత్ర క్షేత్రాల అభ్యుత్థానాన్ని సాధించడమనే ఉదాత్త కార్యక్రమాన్ని ఆయన విశ్వాసంతో నిర్వర్తించాడు... కాశీ విశ్వేశ్వరాలయానికి పూర్వ వైభవాన్ని పునరుద్ధరించాలని ఆయనకి గొప్ప కోరిక ఉండేది... ... ప్రయాగలో యాత్రికులపై పన్ను రద్దుకు, వారణాసీపై హక్కులు వదులుకోవటానికి చక్రవర్తి నుంచి ఉత్తర్వులు సంపాదించటానికి సవాయి జయసింహ్ గారు అంగీకరించారు. ఆయన హృదయపూర్వక సహకారంలోనే ఆయన ప్రయోజనం, మా ప్రయోజనం ఇమిడి ఉన్నదని మీరు కూడా ఆయనకు నచ్చచెప్పాలి).

ఇంత ధర్మనిరతి గల పీష్వాలు మరాఠా రాజ్యానికి చోదకశక్తి అయినప్పుడు, దేశంలో ఆనాడు మరాఠా కత్తికి ఎదురులేనప్పుడు, హిందూ ధర్మ పునరుద్ధరణ సంకల్పం నిరాఘాటంగా నెరవేరి ఉండాల్సింది. యావద్దేశాన్ని ఏకచ్ఛత్రంగా ఏలిన మొగల్ సామ్రాజ్యం చితికి ఛిద్రమై నామమాత్రావశిష్టమైన దశలో, ప్రచండ సైనిక శక్తితో దేశమంతటా విస్తరించిన మరాఠాలు తలచుకుని ఉంటే పాచి పీనుగు వంటి మొగలాయీ అవశేషాన్ని పాతిపెట్టి అఖండ హిందూ మహాసామ్రాజ్యాన్ని అవలీలగా స్థాపించగలిగేవారు. దూరదృష్టితో శివాజీ ప్రవేశపెట్టిన అష్టప్రధాన్ పద్ధతిలోనో, దానిని మార్చి బాలాజీ విశ్వనాథ్ రూపొందించిన రాష్ట్ర కూటసమాఖ్య సరళిలోనో అఖిల భారతంలో హిందూ పతాకను సగర్వంగా ఎగురవేయగలిగే వారు. అనేక శతాబ్దాలు తురుష్క రాకాసుల చేతిలో యమ యాతనలు పడి, దారుణ దురాగతాలకు లోనై స్వదేశంలో స్వధర్మానికి దిక్కులేకుండా పోయినందుకు తరాల తరబడి కుమిలి కునారిల్లిన కోట్లాది హిందూ ప్రజానీకం మళ్ళీ దేశంలో సగర్వంగా తలెత్తుకు తిరిగేట్లు చేయగలిగేవారు. అదే కాలంలో చాపకింద నీరులా వ్యాపించి, కుట్రలూ కుహకాలతో, నీచాతి నీచమైన పన్నాగాలతో మొత్తం దేశాన్ని కబళించనున్న తెల్లవారి ఆగడాలను అరికట్టి బహుశా చరిత్ర గతినే మార్చి ఉండేవారు. మరికొన్ని శతాబ్దాల బానిసత్వపు బాధను భరతమాతకు తప్పించగలిగేవారు.

తలచుకుని ఉంటే ఇవన్నీ చేయగలిగేవారే. కాని తలచుకోలేదు. ఎందుకంటే చరిత్రలో అరుదైన స్వర్ణావకాశం చేతికందిన సానుకూల సమయంలో మరాఠాల ఆలోచనలను వారి ప్రభువు ఆ దిశగా సాగనివ్వలేదు. చిన్నతనం నుంచీ మొగలుల పంచన పెరిగి మొగలాయీ సంస్కృతిని జీర్ణించుకుని, మొగలు సింహాసనం పట్ల ఆరాధనా భావం పెంచుకున్న సాహుకు మొగలుల చెరవీడి స్వరాజ్యం హస్తగతమైన తరవాత కూడా పాతవాసనలు పోలేదు. మొగలాయీ మమకారం చావలేదు. ముసల్మాన్ సర్దార్లే తిరగబడి ఏ ప్రాంతానికా ప్రాంతంలో సొంత ప్రభుత్వాలు నడుపుతూ మొగలు చక్రవర్తి ఆధిపత్యాన్ని గుర్తించడం మానేసినా, పాదుషా ప్రాభవం ఢిల్లీ దర్బారుకూ అంతఃపురం నాలుగు గోడలకూ పరిమితమైనా, సవాయి జయసింహ్ లాంటి మొగలాయీల వీర విధేయులు సైతం స్వమతాభిమానంతో మరాఠాల ప్రాబల్యానికి మనస్ఫూర్తిగా సహకరించడానికి సిద్ధంగా ఉన్నా మొగలు సింహాసనాన్ని చేజిక్కించుకోవాలన్న కోరిక సాహు మారాజుకు కలగనే లేదు.

మహారాష్ట్ర ఎల్లలు దాటి మరాఠా శక్తి దశదిశలా విజృంభించడం సాహుకు ఇష్టమే.

హిందుస్తాన్ అంతటినీ చెప్పు చేతుల్లో తెచ్చుకోవాలనీ ఉబలాటమే. కాని ఇదంతా మొగలు పాదుషా అధికారాన్ని గౌరవిస్తూనే, మొగలుల పనుపునే, వారి ఆధికారిక ప్రతినిధి హోదాలోనే జరగాలని అతడి కోరిక. బాజీరావు అసమాన పరాక్రమంతో భీకర యుద్ధాలు చేసి అనేక రాష్ట్రాల్లో మొగలు సుబేదారులను జయించినా, సాహు అవశ్యం సంధికి తొందరపడి, తేలికపాటి షరతులు పెట్టి, వాటిని సాధించడంలో తృప్తి పడింది ఈ కారణంచేతే.

ఉదాహరణకు - తన జీవితంలో చివరి యుద్ధాన్ని గెలిచి మొగల్ సర్దారు నిజాం ఉల్‌ముల్క్ కుమారుడు నాసిర్ జంగ్‌ను చిత్తుగా ఓడించిన తర్వాత 1740 ఫిబ్రవరి 9న బాజీరావు తన కుమారుడు బాలాజీకి రాసిన లేఖలో ఇలా అన్నాడు.

"I am at this movement in a position to eradicate the Mughal completely if only His Highness will immediately order all his chiefs to run to my support. If he does not respond to my call, I shall close this affair by negotiating only an advantageous peace."

[*New History of The Marathas*, **G.S. Sardesai**, *Vol. II. p. 281*]

(ఈ క్షణాన నేను మొగలులను పూర్తిగా నిర్మూలించగలను. నాకు అండగా పరిగెత్తుకు వెళ్ళమని తన సేనానులందరికీ మహారాజు ఉత్తర్వు చేస్తే చాలు. ఆయన నా అభ్యర్థనకు స్పందించపోతే కేవలం లాభసాటి శాంతిని మాత్ర బేరమాడుకుని ఈ ఘట్టాన్ని ముగిస్తాను.)

మొగలు పాలనలోని రాష్ట్రాన్ని జయించినప్పుడు మరాఠా సామ్రాజ్యంలో దాన్ని కలిపేసుకుని సార్వభౌమాధికారం చెలాయించడానికి ఏ అడ్డూ లేకున్నా ఆ రాష్ట్రానికి సుబేదారుగానో, గవర్నరుగానో తమను నియమిస్తూ పాదుషా నుంచి ఫర్మానాను పొందడానికి సాహు రాజు వెంపర్లాడేవాడు. లేదా - ఆ రాష్ట్రంలో సర్కారు రెవెన్యూలో నాలుగో వంతును 'చౌథ్' కింద తాము వసూలు చేసుకునే హక్కును మంజూరు చేయించుకునేందుకు పైరవీ నడిపి శ్రమపడేవాడు. ప్రభువుకు గల ఈ బానిస మనస్తత్వం వల్లే - తన తండ్రి బాజీరావు భుజబలంతో జయించిన మాళవకు సుబేదారీ 'సనద్' ఉత్తర్వును పాదుషా నుంచి పొందడానికి పీష్వా బాలాజీరావు తన దౌత్య ప్రజ్ఞనంతా వినియోగించవలసి వచ్చింది. అలాగే - పరమ పావన వారణాసి క్షేత్రానికి ముసల్మాను చెర తప్పించి పూర్వ ప్రాభవం చేకూర్చాలని హిందూ పుణ్యక్షేత్రాలలో హిందువులకు నిర్నిబంధ స్వేచ్ఛ కల్పించాలని బాజీరావుకు, (పైన ఉటంకించిన జాబునుబట్టి) అతడి సోదరుడు చిమ్మాజీకి, అతడి ఒద్దికలో ఎదిగిన బాలాజీ పీష్వాకు ఎంతగా కోరిక ఉన్నా ఆయా తీర్థ స్థలాలకు స్వశక్తితో విమోచన కలిగించగలిగిన సత్తా ఉండి కూడా... నామమాత్రావశిష్టమైన మొగలు సింహాసనం నుంచి ఫర్మానాల కోసం అంగలార్చవలసి వచ్చిందీ సాహు రాజు దౌర్బల్యపు పుణ్యమే! 42 ఏళ్ల ఏలుబడిలో సాహు అనుసరించిన మెతక విధానమే మరాఠాల బలహీనతకు ముఖ్యహేతువు.

బాజీరావు గాని, అతడి వారసుడు బాలాజీగాని గట్టిగా ఒక పట్టుపడితే ఈ మౌలిక వైరుధ్యాన్ని సరిచేయగలిగేవారే. సొంత పరాక్రమంతో తాము సాధించిన విజయాలను తమ రాజుకున్న మొగలు భక్తి సెంటిమెంటు కోసం నీరుగార్చుకుని, నిర్జీవ ప్రేతం లాంటి



మొగలు సార్వభౌమత్వానికి తామెందుకు తాబేదార్లు కావాలన్న ఆలోచన వారికి కలిగితే చరిత్రలో ఎందరో వీరుల్లా స్వాతంత్ర్యం ప్రకటించుకుని సొంత సామ్రాజ్యం స్థాపించగలిగేవారే. వంశ పారంపర్యంగా రాజ్యాన్ని ఏలగలిగేవారే. కాని వారిలో రాజభక్తి అటువంటి స్వార్థచింతనను కలలో కూడా దగ్గరికి రానివ్వలేదు. రాజ్యం కోసం కన్నతండ్రిని బంధించి, తోబుట్టువులను హతమార్చిన మొగలాయీ దుష్ట చరిత్రతో పోల్చితే పీష్వాల స్వామిభక్తి పరాయణత గొప్పతనం విశదమవుతుంది. ఈ వ్యక్తిగత సుగుణం దీర్ఘకాలిక ప్రయోజనాలకు మంచిదా కాదా అన్నది వేరే సంగతి.

# వారసుడొచ్చాడు

దత్తస్వీకారం తప్పదనే అనుకున్నాడు మహారాజు సాహు.

తన తరవాత - పరిస్థితి ఏమిటన్న ప్రశ్నను అతడు చాలా కాలంగా దాటవేస్తూ వచ్చాడు. సాచివేత ఇంకే మాత్రం కుదరదనే దశ వచ్చింది. శ్రీపతిరావు వంటి ప్రాణమిత్రుడు, ప్రాణం కంటే మిన్నగా తాను ప్రేమించిన రాణి సగుణాబాయి మరణించడంతో సాహుకు జీవితం మీద విరక్తి పుట్టింది. మిగిలిపోయిన ముఖ్యకార్యాలు చక్కబెట్టి జీవయాత్రను ప్రశాంతంగా చాలించడానికి సిద్ధంకాక తప్పదనిపించింది.

ముందుగా తేల్చాల్సింది వారసత్వ వ్యవహారం. నలుగురు ధర్మపత్నులున్నా ఒక్కరి వల్లా సాహుకు పుత్రసంతానం కలగలేదు. ఒక్క సగుణాబాయికి మాత్రం కొడుకు పుట్టాడు. కాని మూడో ఏటే మరణించాడు. డెబ్బయ్యో పడికి దగ్గర పడిన స్థితిలో కొత్తగా కొడుకు పుడతాడన్న ఆశలేదు. ఔరసుడు లేనప్పుడు దత్త స్వీకారం మినహా గత్యంతరం లేదు. సుక్షత్రియ రాజపుత్ర వంశం నుంచి ఎవరినైనా దత్తత తీసుకుందామని ప్రయత్నాలు చేశాడు. కాని ఫలించలేదు. తన వంశంలో రక్త సంబంధీకుల్లోనూ యోగ్యుడు కనపడలేదు. కొల్హాపూర్‌లో దాయాది శంభాజీని ఉత్తరాధికారిగా ప్రకటించాలని పీష్వా బాలాజీరావు సహా చాలా మందికి మనసులో ఉంది. కానీ సాహుకు అతడంటే మొదటి నుంచీ గిట్టదు. పైగా శంభాజీ వయసు కూడా 50కి దగ్గర పడింది. అతడికీ పిల్లలు లేరు. కనుక అతడి చేతిలో రాజ్యం పెట్టినా వంశం నిలుస్తుందన్న ఆశలేదు.

ఇక మిగిలింది ఒకటే దారి: చుట్టాలలో నుంచి మంచి పిల్లవాడెవరినైనా దత్తు తీసుకోవడం. సాహుకు బంధువు, ముఖ్య సర్దారులలో ఒకడు అయిన రఘుజీ భోస్లే తన కొడుకు ముధోజీని దత్తు ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాడు. రఘుజీ భార్య, రాణి సగుణాబాయి అక్కా చెల్లెళ్ల పిల్లలు. ఆ కుర్రాడిని పెంచుకోవాలని సగుణాబాయి చాలా ప్రయత్నాలు చేసింది. అది జరిగితే సవతి ప్రాముఖ్యం పెరిగిపోతుందన్న దుగ్ధతో సాహు పెద్దభార్య సక్వరబాయి దానిని పడనివ్వలేదు. సగుణాబాయి మరణంతో ఆ భయం పోయింది.



రఘుజీతో లోపాయకారీ అంగీకారానికి వచ్చి ఆ కుర్రవాడినే దత్తత తీసుకోవాలని సక్వరబాయే పట్టుబట్టింది. ఆమె మహా గయ్యాళి. ఇంటి పోరు పడలేకా... బాలాజీ పీష్వా లాంటి ఆప్తులూ అదే మంచిదని సలహా ఇవ్వడంవల్లా... ముధోజీ భోస్లేను దత్తు తీసుకోవాలని సాహు నిశ్చయించాడు. ఒకరోజు ఆంతరంగిక కార్యదర్శి గోవిందరావు చిట్నీస్‌ను పిలిచి దత్త స్వీకారానికి ఏర్పాట్లు చేయమని పురమాయించాడు అప్పుడే జరిగింది అనుకోని సంఘటన.

అతడు అలా వెళ్లాడో లేదో భటుడు వచ్చి కొల్హాపూర్ నుంచి రాణి తారాబాయమ్మగారి దూత దర్శనానికి వేచి ఉన్నట్టు చెప్పాడు. తారాబాయి ఎవరో తెలుసు కదా? సాహు పినతండ్రి రాజారాం భార్య. భర్త మరణానంతరం బాలుడైన కుమారుడు శివాజీ పేరు మీద చాలా ఏళ్లు - సాహు మొగలు చెర నుంచి తిరిగి వచ్చే వరకూ - ఆమే సతారాలో కడు సమర్థంగా రాజ్యం చేసింది. సాహుకు రాజ్యం ఇవ్వకుండా హోరాహోరీ పోరాడి విఫలమై కొల్హాపూర్ కోటకు చేరి పోటీ రాజ్యం నడిపింది. ఆమె కుమారుడు శివాజీ అకాల మరణం చెందగానే పీష్వా బాలాజీ విశ్వనాథ్ సాయంతో రాజారాం రెండో భార్య తిరగబడి తారాబాయిని బంధించి తన కుమారుడు శంభాజీని సింహాసనం మీద కూచోబెట్టింది. ఆ తరువాత 30 ఏళ్లుగా నిర్బంధంలో చచ్చిన పాములా పడి ఉన్న తారాబాయి నాటికి నేడు తన దగ్గరికి దూతను పంపటమేమిటి అని సాహు ఆశ్చర్యపోయాడు.

వెంటనే దూతను పిలిపించాడు. అతడు వినిపించిన సందేశాన్ని వింటే సాహుకు మతిపోయింది.

'ఛత్రపతి శివాజీకి నేరుగా వారసుడైనవాడు ఉండగా నీకు ఉత్తరాధికారిగా బయటి వాడిని ఎందుకు దత్తత తీసుకోవాలి'? అని తారాబాయి కబురు.

సాహురాజు అదిరిపడి 'ఏమిటి నువ్వనేది? నాకు కొడుకు లేడు. శంభాజీకి కొడుకు లేడు. తారాబాయి కుమారుడు శివాజీకి కొడుకు పుట్టాడు గానీ పురిటిలోనే పోయాడు. ఇక మా వంశానికి వారసుడెక్కడ'? అన్నాడు.

'మీరు ఇలా అంటారని రాణిగారు చెప్పారు. మీ ప్రశ్నకు జవాబు వారి మాటల్లోనే మీకు వినిపిస్తాను' అని దూత మొదలు పెట్టాడు.

"నాకుమారుడు శివాజీ మరణించేనాటికి అతడి భార్య భవానీబాయి గర్భవతి. మూణ్నెల్లకు ఆమె మగబిడ్డను కన్నది. నా సవతి రాజస్బాయి ఎక్కడ చంపిస్తుందోనన్న భయంతో ఆ వంశాంకురాన్ని నమ్మకస్తులకు ఒప్పగించి రహస్యంగా పెంచుదామని నా కోడలికి ఉపాయం చెప్పాను. ఆ ప్రకారమే పుట్టగానే బిడ్డకు నల్లమందు తినిపించి మగతకమ్మించి, అర్ధరాత్రి నేను, కోడలు పెద్దగా ఏడవసాగాం. పరుగున వచ్చిన కాపలా వారికి బిడ్డ మరణించాడని చెప్పాం. తరవాత రాజపుత్ర దంపతులకు పసివాడిని రహస్యంగా ఒప్పగించాను. శంభాజీ అనుమతితో బయటికి వెళ్ళి చచ్చిన కోడిని కట్టిన మూటను బిడ్డ శవంలా అందరినీ నమ్మించి భూమిలో పాతిపెట్టాను.

'నా ఆజ్ఞ ప్రకారం రాజపుత్ర దంపతులు బావడే గ్రామంలో భగవంతరావు రామచంద్ర దగ్గరికి బిడ్డను తీసుకుపోయారు. ఐదేళ్లపాటు అతడే వారికి పోషణ ఖర్చులు ఇచ్చాడు. అంతలో బిడ్డ బతికే ఉన్నడని కొల్హాపూర్‌లో పుకారు పుట్టింది. రాజస్బాయి మనుషుల్ని పంపి ఊరూరా గాలించసాగింది. పట్టుబడకుండా పసి రాకుమారుడిని ఆ దంపతులు

కొంకణ్‌కు తరలించారు. కొన్నాళ్లకు పెంపుడు తల్లి మరణించడంతో ఆమె భర్త పిల్లవాడిని పన్‌గావ్‌కు తెచ్చి దర్యాబాయి నింబాల్కర్ రక్షణలో ఉంచాడు. దర్యాబాయి దగ్గరలోని తుల్జాపూర్‌లో పాటలు పాడి బతికే గంధోళి వాళ్ల ఇంట్లో రాజకుమారుడిని దాచింది. (భర్తపేరును భార్య పలకగూడదు కనుక) నా భర్త రాజారామ్ పేరులో పదాలను మార్చి రామ్‌రాజా అని ఆ బిడ్డకు పేరు పెట్టాను. ఆ రామరాజు ఇప్పటికీ తుల్జాపూర్ సమీపంలోనే దర్యాబాయి రక్షణలో ఉన్నాడు. వాడే నీకు అసలైన వారసుడు'.

తారాబాయి చెప్పి పంపిన ఈ విచిత్రకథను విన్న రాజు తన చెవులను తానే నమ్మలేక పోయాడు. వెంటనే తారాబాయి వద్దకు పోయి 'ఇదంతా నిజమేనా? రుజువేమిటి?' అని అడిగి రమ్మని గోవిందరావు చిట్నిస్‌ను హుటాహుటిన పంపాడు. చిట్నిస్ కొల్హాపూర్‌లోని తారాబాయిని కలిసి ఆమె వాఙ్మూలాన్ని కాగితం మీద రికార్డు చేశాడు. అదంతా నిజమనడానికి నిదర్శనమేమిటమ్మా అంటే - పోయి భగవంతరావును అడగమని తారాబాయి చెప్పింది.

ఈ సంగతి తెలియగానే సాహురాజు భగవంతరావును ఉన్నపళాన తన సన్నిధికి రప్పించి గుచ్చిగుచ్చి ప్రశ్నించాడు. రాజమాత చెప్పింది నిజమే; ఆ బిడ్డను నేను చూశాను; నా ఖర్చుతో ఐదేళ్లు పోషించాను అని భగవంతరావు చెప్పాడు. అయినా రాజుకి నమ్మకం చిక్కలేదు. కృష్ణానదిలో నిలబడి పవిత్ర జలాల మీద ప్రమాణం చేసి ఇదే మాట చెబుతావా అన్నాడు. అతడు అలాగే ప్రమాణం చేశాడు.

రాజుకు నమ్మకం కుదిరింది. వంశంలోనే వారసుడున్నప్పుడు బయటివాడి దత్తత ప్రసక్తి లేదు. రామరాజాను పిలిపించి యువరాజుగా ప్రకటించడమే ఒక జరగవలసింది. కానీ దానికి సాహుకు ధైర్యం చాలలేదు. ఎందుకంటే ఈ లోపే రామరాజు అజాపజా తెలిసి గయ్యాళిరాణి సక్వరబాయి నానాయాగీ మొదలెట్టింది. రాజు వద్దన్నా సరే ముధోజీ భోస్లేను తానే దత్తు తీసుకుంటానని హడావుడి చేసింది. రామరాజు కథ పచ్చిదగా అంది. అదంతా తారాబాయి బనాయింపు... పెత్తనం కోసం పీష్వా బాలాజీరావు పన్నిన కుట్ర అని గగ్గోలు పెట్టింది. పీష్వాకు వ్యతిరేకులైన దక్కనీ వర్గపు మరాఠా సర్దార్లను కూడగట్టి తిరుగుబాటుకు పెద్ద ప్రయత్నం చేసింది. తారాబాయి పొడగిట్టని కొల్హాపూర్ రాజు శంభాజీకి రహస్య రాయబారం పంపి, బలగాలతో వచ్చి పీష్వా కుట్రను భగ్నం చేయమంది. (ఆమె పిలుపు మీద శంభాజీ సేనాలతో సతారా పైకి దండు వెడలాడు కూడా. కానీ - పరిస్థితిని జాగ్రత్తగా గమనిస్తూ వచ్చిన పీష్వా మెరుపులా కదిలి దాడిని తిప్పుకొట్టేందుకు భారీ సైన్యాన్ని దింపడంతో శంభాజీ తోక ముడిచి మధ్య దారి నుంచే వెనుదిరిగిపోయాడు).

కుట్రలు, కూహకాలు ప్రబలి సర్వత్రా అనిశ్చితి, అయోమయం ఆవరించిన ఈ స్థితిలో పట్టుబట్టి రామరాజును తీసుకొచ్చి దత్తత చేసుకునే తెగువ సాహుకు లేకపోయింది. స్వతహాగా అతడు సాత్త్వికుడు; సజ్జనుడే తప్ప కుట్రలూ, ప్రతికుట్రలూ, రాజకీయ టక్కుటమారాల్లో చెయి తిరిగినవాడు కాదు. తనకు హాని తలపెట్టిన వారికి కూడా మేలుచేసే తత్వం అతడిది. ఎవరికైనా ఇవ్వడమే తప్ప లాక్కోవడం అతడికి నచ్చదు. నిండు సభలో తన రాజరికానికి ఇవ్వాల్సిన గౌరవం ఇవ్వకుండా మర్యాదను అతిక్రమించిన వారితో కూడా మృదువుగా వ్యవహరించి, వారి తప్పు వారికి తెలిసి వచ్చేట్టు చేసే సౌమ్యుడతడు.

ఈ సందర్భంలో మచ్చుకు ఒక ముచ్చట. ఇంద్రోజీ అనేవాడు మొగలు కొలువులో



పెద్ద సర్దారు. ఒక సారి సెలవు మీద మహారాష్ట్రలో స్వగ్రామానికి వచ్చాడు. వచ్చినవాడు ఊరుకోకుండా సతారాలో రాజదర్బారుకు వెళ్లాడు. మర్యాదగా రాజదర్శనం చేసుకుని వెళితే సరిపోయేది. కాని - తలబిరుసుగా రాజు ముందు తన పటాటోపం అతిగా ప్రదర్శించబోయాడు, వెండి నాడాలు తొడిగిన గుర్రమెక్కి ఒంటినిండా ధగధగలాడే ఆభరణాలను దిగవేసుకుని మేళతాళాలతో దర్బారుకు వెళ్ళాడు. రాజుకు వినపడేలా బాజాభజంత్రీలను మోగించడం ఎంత గొప్పవాడికైనా మర్యాద కాదు. ఆ సంగతి తెలిసే ఈ మొగలాయీ సర్దారు ఫెళఫెళార్భాటంతో రాజసన్నిధికి పోయాడు. రాజపురుషులకు ఒళ్లు మండింది. అనుమతిస్తే ఆకతాయికి గట్టి శాస్తి చేస్తామని లేచారు. రాజు వద్దని వారించి, తనదైన రీతిలో ఆ సవాలును ఎదుర్కొన్నాడు.

ఎలాగంటే - బడాయిబాబు సభలో అడుగుపెట్టేలోగా సాహు తన తలపాగా తీసి తన వేటకుక్కకు తగిలించి ఉన్నతాసనంలో కూచోబెట్టాడు. తన ఒంటిమీది ఆభరణాలన్నిటిని కుక్కకే తగిలించాడు. అది చూసి దర్బారులో మిగతా వారూ తలపాగాలు, ఒంటి మీది నగలు తీసేశారు. ధమధమధ్వానాలతో ఇంద్రోజీ రాగానే రాజు ఆదరంగా ఉచితాసనం చూపాడు. పట్టరాని దర్పంతో కూచున్న ఇంద్రోజీ గర్వంగా చుట్టూ చూసి తెల్లబోయాడు. మొత్తం సభలో ఒళ్ళంతా నగలు దిగవేసుకుని ఉన్నది అతడు, కుక్క మాత్రమే!! అప్పుడు అతడి అవస్థ ఊహించవలసిందే!

అన్నట్టు - అ కుక్క ప్రత్యేకంగా ఆ రోజు తోలుకొచ్చినది కాదు. అది రోజూ సభలో అదే ఉన్నతాసనం మీద కూచుంటుంది! దానిపేరు ఖాండ్యా. ఎప్పుడో వేటకెళ్ళిన సాహును పులి చంపబోతూంటే ఈ కుక్క దాని మీదికి లంఘించి ప్రాణం తీసి ప్రభువు ప్రాణం కాపాడిందట. ఆ కృతజ్ఞతతో సాహు దానికి ఒక జాగీరు రాసిచ్చి, పల్లకి, గుర్రా లాంఛనాలు కల్పించి మిగతా జాగీర్దారుల్లాగే దానికీ రాజసభలో గౌరవస్థానం కల్పించాడు! మేలు చేసిన కుక్కకు ఏకంగా జాగీరు ఇచ్చిన మారాజు ప్రపంచ చరిత్రలో బహుశా సాహు ఒక్కడేనేమో!

నిండుసభలో తనను తూష్ణీకరించబోయిన అహంకారినే క్షమించి, మెత్తటి చెప్పుతో సుతారంగా స్పృశించి వదిలేసిన ప్రభువు అసలే జీవితేచ్ఛ నశించి తీవ్ర అనారోగ్యం పాలైన అవసాన దశలో గయ్యాళి ఇల్లాలు సాగిస్తున్న కూహకాలను కరాఖండిగా ఎదుర్కొనగలడా? తెగబడి ఎవరినీ ఎదిరించలేకపోయినా జరగవలసిన దానికి సాహు ఏర్పాట్లు బాగానే చేశాడు. వెంటనే సైనిక బలగంతో వచ్చి రాజ్యాన్ని కాపాడమంటూ పీష్వా బాలాజీరావుకు హుటాహుటిన కబురు పంపాడు. కొద్దికాలం కిందట సక్వరబాయి దుర్బోధకు తలొగ్గి పీష్వాను పదవి నుంచి తొలగించినా రెండు నెలలకే తన తప్పుడు గ్రహించి అతడి అధికారాన్ని అతడికి సాహు తిరిగి అప్పగించాడు. కొన్ని విషయాల్లో పీష్వా చొరవను హరించినా... ద్రోహులని తేలినవారిని ఉపేక్షించి, మిత్రపక్షపాతం చూపి అసంకల్పితంగా పీష్వాను అనేక ఇబ్బందులకు గురిచేసినా వ్యక్తిగతంగా బాలాజీ అంటే రాజుకు మహా ఆపేక్ష. అతడి శక్తి సామర్థ్యాల మీద, రాజభక్తి మీద ఎనలేని గురి. అంతఃపురంలో కొట్లాడుకుంటున్న రాణుల సవతి పోర్లను పరిష్కరించడానికి కూడా అతడి మీదే ఆధారపడేవాడు. అరాజకం, అంతర్యుద్ధాల బారి నుంచి రాజ్యాన్ని రక్షించగలిగినవాడు అతడొక్కడేనన్న నమ్మకంతోటే బాలాజీని లిఖితపూర్వకంగా ఇలా ఆజ్ఞాపించాడు.

To Balaji Pradhan Pandit,

It is hereby ordered that you should command the whole forces. We are ill and are afraid that we shall not recover. The government of the empire must be carried on. Someone of our relative must continue the dynasty. But bring no one from Kolhapur. We have told everything to Chitnis. He will tell you our wishes... In consultation with him preserve our Kingdom. Our descendants will not interfere with your office. Be prudent and wise.

[*Comprehensive History of the Maratha Empire*, **Kincaid & Parasnis.** *Vol. II. p. 319*]

(బాలాజీ ప్రధాన్ పండిట్‌కు,

నీవే మా మొత్తం సైనిక బలగాలను నువే నియంత్రించాలని ఇందు మూలంగా ఆజ్ఞాపించడమైనది. మేము జబ్బుపడ్డాము. కోలుకునే ఆశలేదు. రాజ్యపాలన కొనసాగించవలెను. కాని కొల్హాపూర్ నుంచి ఎవరినీ తీసుకురావద్దు. మేము చిట్నిస్‌కు అంతా చెప్పాము. మా అభిమత మేమిటో అతడు నీకు చెబుతాడు... అతడిని సంప్రదించి మా రాజ్యాన్ని నిలుపు. మా వారసులెవరూ నీ అధికారంలో జోక్యం చేసుకోరు. వివేకంతో తెలివిగా వ్యవహరించగలవు).

వేరెవ్వరినీ దగ్గరికి రానివ్వకుండా గయ్యాళి భార్య నీడలా అంటిపెట్టకుని ఉన్న స్థితిలో ఇంతకు మించి, సాహు ఏమీ చేయలేకపోయాడు. మరాఠా సర్దార్లు కొందరిని కూడగట్టిన సక్వరబాయి లేవదీయదలిచిన తిరుగుబాటును అప్రమత్తంగా ఉండి అణచివెయ్యమని, రామరాజాను ప్రవాసం నుంచి తీసుకొచ్చి పట్టం గట్టమని పీష్వాకు చిట్నిస్ చేత కబురు కూడా చేశాడు. మరణశయ్య చెంతకు అతడిని రప్పించి 'భోస్లే వంశాన్ని కాపాడు. నేనిచ్చిన జాగీర్లను, మాన్యాలను కొనసాగించు' అని కోరి, నీ వంశపారంపర్యంగా పీష్వా పదవిని అనుభవించమంటూ బాలాజీరావు చేతికి రాజప్రతం అందించి, దీవించి పంపాడు. తరువాత అందరినీ బయటికి పంపి ఒళ్లంతా విభూతి రాచుకుని, జపమాలతో శివధ్యానం చేస్తూ కొన్ని గంటలు మృత్యుముఖంలో ఉండి 1749 డిసెంబర్ 15 రాత్రి సాహు తన 67 ఏట ప్రశాంతంగా కన్నుమూశాడు.

పీష్వా వెంటనే మెరపు వేగంతో కదిలాడు. సతారా లోపలా వెలుపలా ఉంచిన 35వేల సైన్యాన్ని రంగంలోకి దించాడు. వేకువజామునే సేనలు వెళ్ళి ప్రధాన కుట్రదారు అయిన "ప్రతినిధి" జగ్జీవన్‌ను, సక్వరాబాయికి నమ్మినబంటు అయిన యమాజీ శివదేవ్‌ను బంధించి, సుదూరపు కోటలకు తరలించారు. రాజధానిలో ప్రతివీధినా, ప్రతి కూడలిలో కోట అంతటా పీష్వా సేనలు మోహరించాయి. మధ్యాహ్నం మంత్రి మండలిని సమావేశ పరచి గతించిన మహారాజు తనకిచ్చిన అధికార పత్రాలను బాలాజీ చూపించాడు. రాజు అభిమతం ప్రకారం రామరాజుకు రాజ్యం అప్పగించడం మినహా మరోదారి లేదని అందరూ అంగీకరించారు.

మరి – అసలు కుట్రదారు అయిన మహారాణిని ఏమి చేయాలి? రామరాజు పెత్తనాన్ని ఆమె సనేమిరా అంగీకరించదు. ప్రశాంతంగా పని చేయనివ్వదు. పితలాటకం పెడుతూనే



ఉంటుంది. చెరలో పెడదామా అంటే మహారాణిని బంధించారన్న అప్రతిష్ఠ. మరి ఏమి చేయాలా అని ఆలోచిస్తే మంత్రి మండలికి ఒకటే దారి కనిపించింది. ఆ కాలంలో భర్త మరణిస్తే భార్య సహగమనం చేయడం పరిపాటి. ధర్మపత్నులందరూ, ఆఖరికి ఉంపుడుగత్తెలు కూడా ఇష్టపూర్వకంగా చితి ఎక్కి అగ్నికీలలకు ఆహుతి అయ్యేవారు. సక్వరబాయి కూడా భర్తతో అగ్నిప్రవేశం చేస్తానని వేరే ఉద్దేశంతో ప్రకటిస్తూ వచ్చింది. కాబట్టి అన్న మాట ప్రకారం ఆమె చేత సహగమనం చేయించడమే మేలని మంత్రిమండలి నిర్ణయించింది. కొల్హాపూర్ నుంచి చేరుకున్న తారాబాయి కూడా అదే సలహా ఇచ్చింది. రాజప్రముఖుల ఏకగ్రీవ నిర్ణయం ప్రకారం "సతి"గా వినుతికెక్కి కుటుంబానికి మంచి పేరు తెమ్మని సక్వరబాయికి సొంత సోదరుడు నచ్చచెప్పాడు. ఆట కట్టిందని గ్రహించి, పరిస్థితితో రాజీపడి ఆమె కూడా, హుందాగా, స్వచ్ఛందంగా సాంప్రదాయక రీతిలో సహగమనం చేసింది.

కొత్త రాజును తోడ్కొని రావటానికి అంతకు ముందే రాజపరివారం గుర్రాల మీద వేగంగా తుల్జాపూర్‌కు వెళ్ళింది.

అంతటితో అయిపోలేదు. అసలు కథ అప్పుడే మొదలైంది.

# మామ్మ తీసిన గొయ్యి

కాల్పనిక కథల్లో వీరులు, క్రూరులు విడిగా ఉంటారు. ఆయా పాత్రల నడవడి, గుణగణాలను బట్టి జాతికి వీరు మేలు చేసినవారు, వీరు కీడు చేసినవారు అని సులభంగా వింగడించవచ్చు. చరిత్ర అలా కాదు. జీవితంలో ఉన్నంత వైవిధ్యం, వైరుధ్యం చారిత్రక వ్యక్తుల్లోనూ ఉంటాయి. గొప్ప ఘనకార్యాలను సాధించిన వారే ఒక్కోసారి తెలిసోతెలియకో గొప్ప తప్పులను చేయవచ్చు. ఒక దశలో విశాల దృష్టితో బాధ్యతాయుతంగా వ్యవహరించి నిశ్చల నిబద్ధతతో జాతి క్షేమాన్ని సంరక్షించిన వారే ఇంకో దశలో సంకుచిత స్వార్థంతో అధికార దాహంతో విశృంఖలంగా బరితెగించి ప్రజాహితానికి తామే ప్రధాన సమస్యగా దాపురించవచ్చు.

శివాజీ కుమారుడు శంభాజీ చిత్రవధ అనంతరం రాజారామ్ ఛత్రపతి అయిన తరవాత ధర్మపత్నిగా అతడి వెనక ఉండీ, భర్త మరణించాక కుమారుడి పేరు మీద రాజ్యం చేసీ తారాబాయి మొగల్ మహాసామ్రాజ్యంపై సాగించిన పోరాటం మరాఠా చరిత్రలో ఒక ఉజ్వల ప్రకరణం. ఔరంగజేబు అంతటి సర్వశక్తి సంపన్నుడైన సమ్రాట్టునే గడగడలాడించి, మరాఠా శక్తిని ఒక్క తాటిపై సమర్థంగా నడిపించిన ఈ వీరనారే చరమదశలో కుటిల రాజకీయ కుతంత్రాలకు పాల్పడి అదే మరాఠాల ప్రయోజనాలను దుష్టశక్తిలా పీడించింది.

భర్త మరణానంతరం తారాబాయి సవతిని వేధిస్తే, కొన్నేళ్ళకు విధి వక్రించి సవతే ఆమెను రాజ్యం గుంజుకుని సతాయించింది. సవతి కొడుకు చెరలో మూడు దశాబ్దాలు గడిపాక తారాబాయికి మంచి రోజులు మళ్ళీ వచ్చాయి. తాను ఆచూకీ తెలిపిన మనవడికి సాహు ఉత్తరాధికారిగా రాజ్యాభిషేకం చేయడానికి మరాఠా పెద్దలు అంగీకరించడంతో ఆమెకు దశ తిరిగింది. సతారాకు మకాం మార్చింది. మనవడు రాజయ్యాడు. పెద్ద దిక్కుగా తన ప్రాముఖ్యం పెరిగింది. పీష్వా మొదలుకుని రాజ పరివారమంతా ఆదరాభిమానాలతో గౌరవిస్తున్నారు. తనకూ 75 ఏళ్లు వచ్చాయి. వెనకా ముందూ ఎవరూ లేరు. పెద్దరికానికి తగ్గట్టు అందరితో మంచిగా తన మానాన తాను బతికి ఉంటే బావుండేది.

కాని ఆమె తారాబాయి. ముప్పైఏళ్ల తరవాత నిర్నిబంధ స్వేచ్ఛ, స్వాతంత్ర్యం మళ్లీ రాగానే ఆమెలో అధికార కాంక్ష ప్రజ్వరిల్లింది. పెత్తనం కోసం ఆరాటం లావయింది. అదే ఆమెనూ, తన్మూలంగా మరాఠా రాజ్యాన్నీ అనేక సంవత్సరాలు అతలాకుతలం చేసింది.

రామరాజు తన దయవల్ల గద్దెనెక్కినవాడు. పైగా రాజ్యతంత్రం అనుపానులు తెలియని అమాయకుడు. కనుక ఆజన్మాంతం తనకు కృతజ్ఞుడై కీలుబొమ్మలా పడివుండి తాను ఆడించినట్టల్లా ఆడతాడని, అతడిని గుప్పిట్లో పెట్టుకుని తాను చక్రం తిప్పవచ్చునని తారాబాయి ఆశించింది. ఆ పన్నాగంతోటే కుర్రరాజును అక్కున చేర్చుకుని, నా మనవడు, శివాజీ వంశానికి వారసుడు అంటూ అందరికీ పరిచయం చేసింది. ఎనలేని ప్రేమాభిమానాలు కురిపించింది. రఘూజీ భోస్లే వంటి సర్దారులకు నమ్మకం కుదరక అతడే నిజంగా మీ మనవడు అయితే అతడితో కలిసి భోజనం చెయ్యండి అంటే తారాబాయి క్షణం ఆలోచించకుండా రామరాజుతో కంచం పొత్తు కలిపింది. ఆమె మాట మీద విశ్వాసంతో కులీనులైన మరాఠా కుటుంబాల వారు రామరాజుకు ముగ్గురు కన్యలనిచ్చి పెళ్ళి కూడా చేశారు.

నాయనమ్మగారు అనుకున్నట్టే కుర్రరాజుకు రాజ్యం చేసే యోగ్యత, దక్షత లేవు. 27 ఏళ్ళు అనామకంగా ఏబ్రాసిలా బతికిన వాడికి హఠాత్తుగా పట్టంగట్టి కిరీటం పెట్టినంత మాత్రాన రాజలక్షణాలు రావు. ఆకస్మిక అదృష్టానికి దిమ్మెరపోయి పడుచు భార్యలతో నిరంతరం సుఖభోగాలలోనే అతడు మునిగి తేలాడు. కాని దానివల్ల తారాబాయికి ఆశించిన అవకాశం చిక్కలేదు. రాజుకూ ఆమెకూ నడుమ పీష్వా ఉన్నాడు. తారాబాయి ఆవలించకుండానే అతడామె పేగులు లెక్కపెట్టగలడు. తొమ్మిదేళ్ళపాటు సాహురాజు అదుపాజ్ఞలకు లోబడి, అతడి చుట్టూ చేరినవారి దుర్బోధలకు, దుర్మార్గాలకు దుష్ఫలితాలు తాను అనుభవిస్తూ, వ్యవహార స్వేచ్ఛకు నోచుకోక బాలాజీరావు పీష్వా చాలా అవస్థలు పడ్డాడు. కొత్త రాజు కొలువులోనూ అవే బాధలు పడటానికి అతడు సిద్ధంగా లేడు.

బాలాజీ పీష్వా తలచుకుని ఉంటే సాహూ మరణించిన వెనువెంటనే రాజ్యాన్ని చేజిక్కించుకోగలిగేవాడే. అప్పుడు సైన్యమంతా అతడి అధీనంలోనే ఉంది. మరాఠా ముఖ్యులెవరూ అతడికి ఎదురు నిలవగలిగేవారు కాదు. అతడంటే గిట్టని రఘూజీ భోస్లే వంటి సర్దార్లు కొందరు ఆ సమయానికి లేకపోలేదు. వారు చాలా దూరంలో ఉన్నారు. తన కత్తికి తిరుగులేదని తెలిసి కూడా బాలాజీలోని రాజభక్తి అతడిని హద్దు మీరనీయలేదు. రాజు కనుమూయగానే ఆయన అభిమతం ప్రకారం రామరాజును సగౌరవంగా రప్పించి, ఏనుగెక్కించి తాను వెనుక నిలబడి వింజామర వీస్తూ సభామందిరానికి తీసుకువెళ్ళి (1750 జనవరి 4న) పట్టాభిషేకం చేశాడు. కొత్తరాజు సమర్థుడు, వ్యవహారదక్షుడు అయి ఉంటే ఎలా ఉండేదో. కాని రాజ్యమేలే కళ రామరాజులో ఏ కోశానా లేదు. ఆ సంగతి పీష్వా మొదటే గ్రహించాడు. తారాబాయి తత్వం కూడా తెలిసినవాడు కనుక రాజును ఆమె కీలుబొమ్మగా మార్చుకోవడానికి అవకాశమివ్వకుండా తానే ముందు కదిలాడు. కీలెరిగి వాత పెట్టాడు.

అధికారం కోసం తారాబాయితో పీష్వా పోటీ పడవలసింది ఏమీ లేదు. అతడికి అధికారాన్ని దివంగత ప్రభువే ఇచ్చాడు. సైన్యం మీద పెత్తనాన్ని, పాలనాధికారాలను వంశపారపర్యంగా పీష్వాకు దఖలు పరుస్తూ మరణించే ముందు సాహు ఇచ్చిన ఆజ్ఞాపత్రం

బాలాజీ చేతుల్లో ఉంది. ముఖ్యులందరినీ సమావేశ పరచి దానిని చూపించి తనపై రాజు మోపిన బాధ్యతను నిస్సంకోచంగా నిర్వర్తించదలిచానని చెప్పాడు. వారు సరేనన్నారు. రామరాజు సైతం తన పరిమితుల నెరిగి, పీష్వాను నమ్మి పరిపాలనను అతడి మీద వదిలేశాడు.

ఇది తారాబాయికి కంటగింపైంది. పీష్వా తనకు గౌరవ మర్యాదల లోపం చేయకపోయినా, రాజ్య వ్యవహారాలలో తనను తప్పక సంప్రదిస్తానని రాజుకు హామీ ఇచ్చినా ఇవన్నీ పై మెరమెచ్చులేననీ, తన పెత్తనానికి లోబడే ఉద్దేశం పీష్వాకు ఎంత మాత్రం లేదనీ ఆమెకు తెలుసు.అందుకే పీష్వాపై చాడీలు చెప్పి, నిన్ను తోలుబొమ్మలా ఆడిస్తున్నాడని రామరాజును రెచ్చగొట్టజూసింది. ఆ పాచిక పారలేదు. సాలుకు 65 లక్షల రూపాయల వరుమానంతో, ముగ్గురు భార్యలతో సుఖంగా ఉన్న ప్రాణాన్ని నాయనమ్మ కోసం రాజు కష్టపెట్టకోదలచలేదు. ఇక అతడివల్ల లాభం లేదని గ్రహించి తారాబాయి వేరే దారి పట్టింది.

తారాబాయి భర్త రాజారామ్ చితాభస్మం సింహగఢ్ కోటలో ఉంది. అతడి స్మారకార్థం అక్కడ ఒక మందిరం కూడా కట్టారు. స్వామి సేవ చేసుకుంటూ శేష జీవితాన్ని అక్కడే గడుపుతానని చెప్పి రామరాజు పట్టాభిషేకమైన మూన్నెల్లకు తారాబాయి సింహగఢ్‌కు వెళ్ళింది. దుర్భేద్యమైన ఆ దుర్గం పంత్ సచివ్ చిమ్మాజీ అధీనంలో ఉంది. ఆ కోటలో పీఠం పెట్టాక వైరాగ్యం ముసుగును తారాబాయి తీసి అవతల పారేసింది. పీష్వా పైకి సేనలను నడిపి, అతడి ఉక్కు పిడికిలి నుంచి కుర్రరాజును విడిపించమంటూ పంత్ సచివ్‌ను ప్రేరేపించింది. తిరుగుబాటుకు సన్నాహాలు మొదలయ్యాయి. ఎంత గోప్యంగా కథ నడిపినా పీష్వా వాసన పట్టాడు.

ఆ సమయానికి బాలాజీ పీష్వా పుణెలో కుమారుడు విశ్వాసరావుకూ, పినతండ్రి కొడుకు సదాశివరావుకూ పెళ్ళిళ్ల హడావుడిలో ఉన్నాడు. ఆహ్వానించినా ఆ వివాహాలకు తారాబాయి హాజరు కాలేదు. శుభకార్యాలు కాగానే తారాబాయినీ, పంత్ సచివ్‌నూ రాక తప్పదని సుతిమెత్తగా చెప్పి పుణె పిలిపించాడు. పెద్దరాణికి సకల లాంఛనాలతో సగౌరవంగా రాచమర్యాదలు చేసి, ఆమె తైనాతీ అయిన పంత్ సచివ్‌ను నిర్బంధించి ఖైదులో పెట్టాడు. సతారా నుంచి రాజును సవినయంగా పుణె రప్పించి, జరిగిందంతా వివరించి సింహగఢ్ కోటను పంత్ సచివ్ నుంచి ఊడగొట్టి పంపించాడు. ఆట కట్టిందన్న ఆక్రోశంతో తారాబాయి రగిలిపోతూ సతారాకు తిరిగి వచ్చి సమయం కోసం కాచుకు కూర్చున్నది.

చిక్కులన్నీ చక్కబడ్డాయని అందరూ అనుకుంటూండగానే తారాబాయి పంజా విసిరింది. అనునయంగా చెబితే రాజు తన మాట వినడం లేదు కనుక దౌర్జన్యంగా అతడిని నిర్బంధించి, అతడి పేరు మీద మరాఠా సర్దార్లను కూడగట్టి పీష్వా పీడ విరగడ చేసుకోవడమే తరణోపాయమని ఆమెకు తోచింది. పథకం ప్రకారం పావులు కదిపింది.

మొదట తీర్థయాత్ర నెపంతో తారాబాయి సతారాకు సమీపంలోని కోటకు వెళ్ళింది. వెళ్ళే ముందే అక్కడి దళవాయి షేక్‌మీరాకు కబురు పంపి ఆయుధాలను, బలగాలను, ఇతర సంభారాలను సమీకరించింది. రాజసపు దర్పంతోనూ, భూరి బహుమానాలతోనూ కోటలోని సిబ్బందిని, సేనలను తన వైపుకు తిప్పుకుంది. సంగోలా, మంగళవీడె కోటలను వశపరచుకొని అప్పుడే దిగ్విజయంగా తిరిగివచ్చిన రామరాజును ఒక్కసారి వచ్చి తనను చూసి పొమ్మని ఆప్యాయంగా ఆహ్వానించింది. అసలే విజయోత్సాహంతో ఉన్న రాజు ఏ



మాత్రం అనుమానించకుండా నాయనమ్మను చూడవెళ్లాడు. మామూలు కుశల ప్రశ్నలయ్యాక తారాబాయి అతడిని పక్కకు తీసుకువెళ్ళి - వెంటనే ప్రతినిధినీ, దక్కను వర్గం సర్దార్లనూ పిలిపించు. పీష్వాను ఇప్పుడే ఇక్కడే బర్తరఫ్ చేసెయ్ అని వత్తిడి చేసింది.

రాజుకు తల తిరిగిపోయింది. మామ్మ నయాన భయాన ఎంతగా నచ్చచెప్పినా పీష్వాను వేటు వేయడానికి అతడికి ధైర్యం చాలలేదు. అవ్వకు ఆగ్రహం వచ్చింది. కానీ తమాయించుకుంది. ఎందుకంటే రాజు ఒంటరి కాదు. బాపూజీ ఖండేరావు నేతృత్వంలో పెద్ద అంగరక్షక దళం అతడి వెంట ఉంది. ఇక చేసేది లేక 'సరే! నీ ఇష్టం' అంది తారాబాయి. రాజు క్షేమంగా తిరిగి వచ్చాడు.

మర్నాడు నవంబరు 24. ఆ రోజు మార్గశిర శుక్లషష్ఠి, దాన్నే చండషష్ఠి అంటారు. మల్లాసురుడిపై ఖండోబా విజయానికి గుర్తుగా ఆ రోజు విందు చేసుకోవడం రివాజు. ఆ విందుకు ఎవరైనా ఆహ్వానిస్తే దాన్ని కులదైవమైన ఖండోబా పిలుపుగా పరిగణిస్తారు కనుక ఎవరూ కాదనరు. ఉదయమే తారాబాయి సేవకులను పంపి మనవడిని విందుకు ఆహ్వానించింది. మామ్మ ప్రేమ ఒలకబోయడం బాగానే ఉంది. కాని కిందటి రోజు కోటలో ఆమె కొరకొర చూపును, ఆమె మనుషుల అనుమానాస్పద వైఖరిని ఖండేరావు మరచిపోలేదు. ఇందులో ఏదో మోసం ఉంది; దయచేసి వెళ్ళకండి అని రాజును వారించాడు.

ఇలాంటి పరిస్థితిని తారాబాయి ముందుగానే ఊహించి, దూతలకు తగిన తర్ఫీదు ఇచ్చి పంపింది. రాజు ఊగిసలాట చూపి వారు బోలెడు దిగ్భ్రాంతితో 'మహారాజా! మీరు అంతటి పుణ్యాత్మురాలినే అనుమానిస్తున్నారా? చంపే మనిషే అయితే పురిటి పొత్తిళ్లలోనే చంపగలిగేది కదా? మిమ్మల్ని బతికించాలని అంత ప్రయాస పడేదా? మిమ్మల్ని కూలదోయాలన్న దురుద్దేశమే ఆమెకు ఉంటే పదినెలల కింద ఆమె మిమ్మల్ని గద్దెనందుకు ఎక్కిస్తుంది?' అని గొప్పగా నమ్మబలికారు.

ఇదంతా నాటకమని ఖండేరావు పోల్చుకున్నాడు. కాని రాజు మోసపోయాడు. వారు చెప్పింది నిజమే కదా, పాపం ముసలి మామ్మను అనవసరంగా అనుమానించటమెందుకు అనుకున్నాడు. తాను ఫరవాలేదన్నా అనుచరులు సమాధానపడేట్టు లేరు. వారికి ప్రతిదీ అతిగా ఊహించుకుని భయపడటం అలవాటైంది. తానే తెగించి వెళ్ళి మీవన్నీ అకారణభయాలని వీళ్లకి రుజువు చేయాలి అనుకున్నాడు రాజు. దూతలు వెళ్ళిన కాసేపటికే అంగరక్షకులను ఏమార్చి ఒక్కడే గుర్రమెక్కి మామ్మ చెంతకు పోయాడు.

అక్కడ అతడు అనుకున్నట్టే అయింది. కోటలో సాదర స్వాగతం లభించింది. నాయనమ్మతో కబుర్లాడి కులాసాగా విందారగించి సెలవు తీసుకున్నాడు. తిరిగి వెళ్ళాక జరిగింది చెబితే మనవాళ్ల మొహాలు ఎలా ఉంటాయో చూడాలి అని లోలోన నవ్వుకుంటూ కోట గుమ్మం దగ్గరికి చేరేసరికి తలుపులు మూసి ఉన్నాయి. అడ్డంగా సాయుధ భటులు నిలబడి ఉన్నారు. తమరు బయటికి వెళ్ళటానికి రాణిగారి ఆజ్ఞలేదన్నారు.

ఆ సమయంలో ప్రభువు కన్నెర్రచేసి గర్జిస్తే బహుశా బయటపడగలిగేవాడే. సాక్షాత్తూ ఛత్రపతి ఆజ్ఞను ధిక్కరించే ధైర్యం సామాన్య భటులకు ఉండదు. కాని అర్భకపు రాజు అధికార దర్పం ప్రదర్శించాల్సింది పోయి పిల్లిలా తోకముడిచి, మళ్ళీ లోపలికి వెళ్లాడు. ఈ సారి అక్కడ ముద్దులాడటానికి నాయనమ్మ లేదు. ఎటు చూసినా విచ్చు కత్తులతో సైనికులు కనిపించారు. రాగానే రాజును పట్టి నిరాయుధుణ్ని చేసి, చీకటి కొట్లో బంధించారు.

ఆపదను ఊహించి రాజబలగం పరుగున వచ్చింది. కాని కోట తలుపులు బిడాయించి ఉన్నాయి. భారీ ఎత్తున ఫిరంగులతో కోటను ముట్టడిస్తే తప్ప లోనికి ప్రవేశం దొరకదు.

విషయం తెలిసి బాలాజీ పీష్వా విస్తుపోయాడు. అప్పుడతడికి చేతులు ఖాళీగా లేవు. కర్ణాటకలో నిజాము కుమారుడు నాసిర్‌జంగ్ విసిరిన సవాలును తట్టుకోవటానికి సేనలను తరలించి శక్తియుక్తులన్నీ కేంద్రీకరించి పోరాడుతున్నాడు. ఇదే సమయాన స్వరాజ్యంలో రెండో సంగ్రామాన్ని మొదలెట్టడానికి అతడు సిద్ధంగా లేడు. పైగా రాచవారిపై తిరగబడితే బావుండదన్న రాజభక్తి. అదీగాక రాజును బంధించినంత మాత్రాన రాజ్యమంతా తారాబాయి స్వాధీనమై పోతుందన్న భయం లేదు. ఎదురు తిరిగిన 'ప్రతినిధి' నుంచి సంగోలా కోటను వశపరచుకున్న సందర్భంలో కొద్దివారాల కిందే రామరాజా మంత్రిమండలిలో ఇబ్బందికరమైన వారిని ఏరివేస్తూ మార్పుచేర్పులు చేసి పీష్వాకు సమస్త పాలనాధికారాలు దఖలు పరిచాడు. అంతకంటే ముందే పరిపాలన కేంద్రాన్ని సతారా నుంచి పుణెకి రాజానుమతితో తరలించి ఉన్నాడు. ప్రభుత్వం తన పట్టులో దృఢంగా ఉంది. కనుక పీష్వా కలవరపడలేదు.

"If she persists in keeping the King a close prisoner and conducts the administration herself, the whole Maratha Raj suffers disgrace in public. How is it possible for Her Highness to supervise from her smug perch on the fort political operations ranging over a wide area from Delhi to Rameshwar? It is not impossible for me at once to revert her to her former confinement, but I refrain from such a drastic measure, remembering that we are the Chatrapati's servants through three generations. Any coercive steps by me will appear like a rebellion against the master".

[*New History of the Marathas*, **G.S. Sardesai,** *Vol. II. p. 294*]

ఆమె ఇలాగే మహారాజును బంధించి తానే పరిపాలన సాగిస్తూ పోతే మొత్తం మరాఠా రాజ్యం అప్రతిష్ఠ పాలవుతుంది. ఢిల్లీ నుంచి రామేశ్వరం వరకూ రాజకీయ కార్యకలాపాలను తన కోటలో కూచుని పర్యవేక్షించడం రాణిగారికి ఎలా సాధ్యం? వెంటనే ఆమెను పట్టి బంధించటం నాకు అసాధ్యమేమీ కాదు. కాని మనం మూడు తరాలుగా ఛత్రపతి సేవకులమన్న సంగతి గుర్తుంచుకుని అలాంటి తీవ్ర చర్యకు నేను తెగించటంలేదు. అణచివేతకు నేను ఏ అడుగు వేసినా అది యజమానిపై తిరుగుబాటుగానే కనపడుతుంది - అని అప్పుడు పురందరేకు పంపిన జాబు ఆ సమయంలో పీష్వా మనఃస్థితిని సూచిస్తుంది.

బాలాజీ పీష్వా ఒకందుకు నిగ్రహం చూపితే తారాబాయి దానిని బలహీనతగా పరిగణించి మొదట్లో మహా రెచ్చిపోయింది. నమ్మకస్థులను పిలిపించి, పీష్వాపైకి సేనలతో దండెత్తమని పురికొల్పి, అవిధేయులనుకున్నవారి తలలు నరికించి ఎంత చెలరేగినా రాజ్యం మీద పట్టు సాధించలేకపోయింది. పీష్వాను దెబ్బతీసేందుకు నిజాంతోనూ. పోర్చుగీసువారితోనూ చేతులు కలిపేందుకూ ఆ మహాతల్లి వెనకాడలేదు. ఎన్ని కుతంత్రాలు పన్నినా పగ్గాలు తన చేతికి



చిక్కలేదన్న ఆక్రోశంలో చెరలోని రామరాజును దుర్భాషలాడి, సరిగా తిండి కూడా పెట్టకుండా తారాబాయి సతాయించింది. అసలు వీడు నా మనవడే కాదు. వట్టి గంధోళిగాడు అని ఒక దశలో పదుగురి ముందూ తూలనాడింది.

తారాబాయి మాటను నమ్మి, శివాజీ వంశీకుడన్న విశ్వాసంతో రామరాజుకు పిల్లనిచ్చి సంబంధాలు కలుపుకున్న మరాఠా కులీనులు దీంతో తెల్లబోయి ముసలిరాణిపై మండిపడ్డారు. క్రమంగా అందరికీ దూరమై, పీష్వాను ఏవిధంగానూ సాధించలేక చివరికి తారాబాయే తిక్కకుదిరి దారికొచ్చింది. 1752 సెప్టెంబరు 14న జెజూరిలో దేవుడి ముందు ప్రమాణం చేసి తారాబాయి పీష్వాతో సంధి కుదుర్చుకుంది. రామరాజు నిజంగా మనవడు కాదని, తక్కువజాతి వాడిని తెచ్చి తానే నాటకమాడానని ఆ సందర్భంలో ఆమె బహిరంగంగా ఒప్పుకుంది.

అది మొదలుకుని మహారాష్ట్రలో పీష్వాలదే రాజ్యమైంది. అంతదాకా నామమాత్రపు రాజరికంలో అనధికారంగా సాగుతూ వచ్చిన ఏర్పాటు ఆ దరిమిలా అధికార ప్రతిపత్తిని సంతరించుకుంది. కొత్తగా వచ్చే పీష్వాకి అధికారలాంఛనాలు అందచేయటం, పీష్వాల అదుపులో, వారిచ్చే భృతితో సతారాలో కాలం వెళ్లదీయడం మినహా ఆ దరిమిలా ఛత్రపతులకు పనిలేకుండా పోయింది.

తారాబాయి తరవాత తొమ్మిదేళ్లు బతికింది. రామరాజును మాత్రం ఆమె తన జీవితకాలంలో చెర నుంచి వదిలిపెట్టలేదు. అతడే నకిలీ అని తేలడంతో పీష్వా కూడా వదలమని పట్టుబట్టలేదు.

మొత్తానికి ముసలి రాణి అధికార దాహంతో తీరి కూర్చుని తెచ్చిన సంక్షోభం పుణ్యమా అని విలువైన రెండేళ్ల సమయం వృథా అయింది. రాజకుటుంబంలో గొడవలను అలుసుగా తీసుకుని బందిపోట్లు, అరాజక శక్తులు రాజ్యంలో విజృంభించాయి. అత్యంత కీలకమైన ఉత్తరాది రంగంపై దృష్టి సారించి తక్షణావసరమైన చర్యలు తీసుకోవడానికి, సైనిక వ్యవస్థను పటిష్ఠం చేసుకోవడానికి బాలాజీ పీష్వాకు సావకాశం లేకుండా పోయింది.

ఇటువంటి అనేక లొసుగుల, లుకలుకల, వైఫల్యాల పర్యవసానమే పానిపట్టు పరాభవం.

# వగలాడి ముగలానీ

'భారతీయ సర్దార్ల ద్రోహం వల్ల నేను నాశనమయ్యాను. నాకు తెలిసి కోట్లు విలువచేసే వస్తువులు, నగదు పూర్వపు వజీరైన మా మామగారి భవంతిలో పాతిపెట్టి ఉన్నాయి. ఇవిగాక పైకప్పులో బంగారం, వెండి రాశులు ఉన్నాయి. మీరు ఈసారి హిందుస్తాన్‌పై దండెత్తి వస్తే సకల సంపదలతో భారత సామ్రాజ్యం మీకు కైవసమవుతుంది'.

[*New History of Marathas,* **G.S. Sardesai,** *Vol. II. p. 387*]

అఫ్గాన్ ప్రభువు అహ్మద్‌షా అబ్దాలీకి 1756లో ఢిల్లీ నుంచి ముగలానీ బేగం పంపిన రహస్య వర్తమానం ఇది. పదహారేళ్ళ కిందట నాదిర్షా సాగించిన భయానక ఘాతుకాలను పోలిన దారుణ దురాగతాల ఘోరకలికి అది నాంది.

ముగలానీ నీతి మాలిన వగలాడి. ఆమె కొంతకాలం మొగలు వజీరుగా పనిచేసి గతించిన కమరుద్దీన్ కోడలు. పంజాబ్‌లో మొగలాయీ సుబేదారు ముయిన్ ఉల్ ముల్క్ అనే మీర్ మన్ను భార్య. పేరుకు మొగలుల రాజ్యమైన పంజాబ్ కొన్నేళ్ల కిందటే అఫ్గాన్‌షా అబ్దాలీ అధిపత్యంలోకి వెళ్ళింది. 1753 నవంబరులో అనుమానాస్పద పరిస్థితుల్లో మీర్ మన్ను మరణించాడు. ఈ స్థానంలో సమర్థుడైన వ్యక్తిని నియమించకుండా మీర్ మన్ను మైనర్ కుమారుడిని సుబేదారుగా ప్రకటించి ముగలానీకి పెత్తనం అప్పగించారు. కొంతకాలానికి ఆ కుమారుడూ విష ప్రయోగం వల్ల మరణించాడు. ముగలానీ విశృంఖలంగా బరితెగించి ప్రభుత్వాన్ని సానివాడగా మార్చి రాజకీయ వర్గాల్లో భ్రష్టు పట్టింది. ఆమె , ఆమె ప్రియులు, వారికి నమ్మకస్థులైన కొజ్జాలు విచ్చలవిడిగా పేట్రేగి రాజ్యాధికారాన్ని నవ్వులపాలు చేయడాన్ని సహించలేక పంజాబీ సర్దార్లు తిరగబడ్డారు. ఆమె భర్తకు సన్నిహితుడైన సర్దారొకడు ఆమెను బంధించి అధికారం గుంజుకున్నాడు. అతడిని వెళ్ళగొట్టమని ముగలానీ తన మేనమామను వేడుకుంటే అతగాడు అఫ్గాన్ల సాయంతో తిరుగు బాటుదారు నయితే గెంటేశాడు. కాని ముగలానీ ఆశించినట్లు అధికారం ఆమెకు అప్పగించకుండా తానే చేజిక్కించుకుని మేనకోడలికి మొండిచెయ్యి చూపాడు.

ఆ పళాన ముగలానీ ఢిల్లీ పాదుషాకు వజీరుగా చక్రం తిప్పుతున్న గాజీయుద్దీన్ అనే ఇమాద్ ఉల్ ముల్క్‌ను ఎలాగో పట్టింది. తన కుమార్తెను అతడికిచ్చి పెళ్ళిచేసి, బంధుత్వం కలుపుకుని అతడి సాయంతో పంజాబ్‌ను మళ్ళీ తన గుప్పిట్లో తెచ్చుకోవాలని పథకమైతే బాగానే వేసింది. కాని అవతలివాడు కుట్రలు, కూహకాల్లో ఆమెను మించినవాడు. నక్క కంటే, ఊసరవెల్లి కంటే గొప్పవాడైన నిజాం ఉల్ ముల్క్‌కు అతడు మనవడు; అచ్చమైన వారసుడు. తనను నమ్మి చేరదీసిన అహ్మద్‌షా పాదుషాను దొంగదెబ్బతో జయప్రదంగా కూల్చేసి, కళ్లు పొడిచి బంధించి, రెండవ ఆలంగీర్ పేరిట అప్పటికే అతడు ఒక అనామకుడిని గద్దెమీద నిలిపాడు. పచ్చటి పంజాబ్‌ను ఎలాగైనా వశపరచుకోవడానికి అతడు దారులు వెదుకుతున్నాడు. ముగలానీ ఒకందుకు పిల్లనిస్తానంటే అతడు ఇంకొకందుకు సరేనన్నాడు. పెళ్లి నెపంతో పెద్ద సైన్యంతో లాహోర్ వెళ్ళి, ఎదుర్కోలు సన్నాహాల్లో ఉన్న ముగలానీని చెరపట్టి, ఆమె సంపదను కొల్లగొట్టి ఆమెనూ కూతురినీ ఢిల్లీ తీసుకువెళ్ళి ఖైదు చేశాడు. తిరుగుబాటుదారుని తొలగించి తన మనిషిని పంజాబ్ గవర్నరుగా నియమించాడు.

ఇలా గొప్ప సాహసంతో పంజాబ్‌ను అఫ్గాన్ సుల్తాన్ పట్టు నుంచి అవలీలగా జయించానని గాజీయుద్దీన్ మురిసిపోయాడు. కాని అసలు తిప్పలు అప్పుడే మొదలయ్యాయి. ఘనత వహించిన మొగల్ సామ్రాజ్యం చితికి ఛిద్రమై నామమాత్రావశిష్టంగా నిలిచిన రోజులవి. తెరపిలేని తిరుగు బాట్లతో, వరస దండయాత్రలతో ఖజానా ఖాళీ అయి, కనీసావసరాలకు తెరువులేక రాజకుటుంబీకులే నానా అగచాట్లు పడుతున్నారు. చక్రవర్తికి, తనకు చేసిన సైనిక సాయానికి ప్రతిఫలంగా మరాఠాలకు ఒడంబడిన సొమ్ము కింద ఎక్కడెక్కడి సంపదను ఊడ్చి ఇచ్చేసరికే వజీరులకు తలప్రాణం తోకకొచ్చింది. దీనికి ఉపరి – చిరకాలంగా జీతాల్లేని సైనికుల ఒత్తిడి. వజీరుగారి హవేలీ మీదే అతడి తుపాకుల బలగం దాడిచేసి, అడ్డొచ్చిన వారినల్లా చితకబాది, కంటికి ఆనిన వస్తువులన్నీ జీతం బకాయిల కింద ఎత్తుకునిపోయారు. వీరిని చూసి చక్రవర్తిగారి సొంత తుపాకీదండు జీతం బకాయి ఇస్తారా చస్తారా అని హఠం వేసుకుకూర్చుని కోటలోకి ఆహార పదార్థాలేవీ పోకుండా, అడ్డుకుని అతికష్టంమీద వారం రోజులు వేతనాలు రాబట్టగలిగింది. ఆకలిగొన్న సైనికులు వజీరు వంటశాలమీదే పడి అందిన పదార్థాన్నల్లా ఎత్తుకెళ్ళారు.

సైనికులు ఆకలితో మాడారంటే అర్థం ఏలినవారు సుష్టుగా మృష్టాన్నాలు ఆరగించారని కాదు. అడుక్కునే వాళ్లకి పంచి పెట్టటానికి ఒక పర్వదినాన పులుసు, అన్నం వండించి ఆనవాయితీ ప్రకారం ఒక పిసరు రుచి చూడమని ఆలంగీర్ పాదుషా వారి దగ్గరికి తీసుకుపోతే 'ఇందులో కాస్త మాకు కూడా లోపలికి పంపించండి. అంతఃపురంలో అన్నం వండి రెండురోజులైంది' అన్నాడట. అదీ మహాప్రభువుల పరిస్థితి. ఆకలి బాధకు తట్టుకోలేక అంతఃపురంలో రాజకుమార్తెలు, ఘరానా స్త్రీలు ఓరోజు పెద్ద సంఖ్యలో కేకలు వేస్తూ బయటికి వెళ్ళబోతే పరువు పోతుందన్న భయంతో కోట తలుపులు మూయించారట.

ఇదిగో – దేశాన్నేలే చక్రవర్తే తిండికి మొగంవాచి... రాజాంతఃపురంలోనే ఆకలి కేకలు మిన్నుముట్టిన ఈ దౌర్భాగ్యస్థితిలోనే – రాజధానిలో వెండి, బంగారం రాశులుగా పడి ఉన్నాయనీ, తమరు వెంటనే దండెత్తి వస్తే సకల సంపదలు వశమవుతాయనీ ముగలానీ బేగం విదేశీ రాజుకు రహస్య వర్తమానం పంపింది. నిర్బంధంలో ఉన్నందున ఆమె ఒక్కర్తే అయితే అంత గ్రంథం నడపలేకపోయేదే. వృద్ధ రాజమాత మాలికా జామానీ, అంతః

పురంలోని ఇతర ఆడంగులూ ఆమెకు సాయపడ్డారు. నిత్యావసరాలైన మాంసానికీ మదిరకూ నల్లమందుకూ కటకటలాడవలసిన తమ దారుణ దురవస్థకు వజీరు గాజీయుద్దీనే కారణమనీ.. తమకు చిల్లిగవ్వ విదల్చకుండా ఎక్కడి సొమ్మునూ అతడే కాజేస్తున్నాడనీ వారికి అక్కసు. మరాఠాలు అండగా ఉన్నంతవరకూ అతడిని ఎవరూ ఏమి చేయజాలరు. కనుక మరాఠాల కంటే బలవంతుడైన వాడిని ఆశ్రయిస్తే తప్ప లాభం లేదన్న దురాలోచనతో వారు ముగలానీతో రహస్య మంత్రాంగం నడిపారు. దానివల్ల తన దరిద్రం ఏకాస్తయినా తీరి, పూర్వపు పాదుషాల్లా మదిర, మగువల మధ్య తందనాలాడగలిగితే చాలునన్న ఆశతో పాదుషా కూడా అందుకు తల ఊచాడు. ఇందరు సహకరించారు కాబట్టే అఫ్గాన్‌షా అబ్దాలీతో పూర్వ పరిచయాన్ని పురస్కరించుకుని ముగలానీ దండయాత్ర చేయమని పురికొల్పుతూ సందేశం పంపింది.

అహ్మద్‌షా అబ్దాలీకి హిందూదేశం కొత్త కాదు. కడచిన తొమ్మిదేళ్లలో అతడు మూడు సార్లు ఈ దేశంపైకి దండెత్తి వచ్చాడు. మొదటిసారి మొగలు సేన చేతిలో ఓడిపోయాడు. అసంతుష్టులైన సర్దార్లు పిలవనంపగా పిట్టలపోరు పిల్లి తీర్చినట్టు రెండుసార్లు పంజాబ్ పైకి దండెత్తి, తన కీలుబొమ్మలను ప్రతిష్ఠించి, పాదుషాల బలహీనతను ఆసరా చేసుకుని పంజాబ్ జిల్లాలు కొన్నిటిని హక్కు భుక్తం చేసుకుని మరలాడు. నాటి నుంచీ ఢిల్లీ మీద అతడికి కన్ను ఉన్నా, గతంలో జరిగిన పరాభవం దృష్ట్యా అందుకు సాహసించలేక పోయాడు. మొగలులకు రక్షణగా మరాఠాల ప్రచండ సైనిక శక్తి వెన్నంటి ఉన్నదన్న వెరపు అతడికి జాస్తి.

మరాఠాల ప్రాబల్యపు సెగలు అప్పటికే ఇంచుమించుగా సరిహద్దుల దాకా పాకాయి. మొగలు పాదుషా అశక్తతను అలుసుగా తీసుకుని తట్టా, ముల్తాన్, పంజాబ్‌లను అబ్దాలీ ఆక్రమిస్తే... ఆ ప్రాంతం నుంచి 'చౌథ్' వసూలు హక్కును పాదుషా నుంచి పొంది వాటిని తిరిగి స్వాధీనపరచుకోవడానికి మరాఠాలు ఉద్యుక్తమయ్యారు. వారి వత్తాసు చూసుకునే వజీరు గాజీయుద్దీన్ 1754లో పంజాబ్ పైకి దండెత్తి అక్కడ అబ్దాలీ పెత్తనాన్ని తుంగలో తొక్కాడు. ఈ ధిక్కారంతో భగభగలాడుతున్న అఫ్గాన్ ప్రభువుకు మరాఠాల రక్షణలో ఉన్నదనుకుంటున్న ఢిల్లీ అంతఃపురం నుంచే, నజీబుద్దౌలా వంటి మహమ్మదీయ ముఖ్య సర్దార్ల నుంచే తమ దేశం మీదికి దయచేసి దండెత్తి రమ్మంటూ అయాచిత ఆహ్వానం అందటంతో నెత్తిన పాలు పోసినట్టయింది. తనది పవిత్ర మతయుద్ధంగా చిత్రించి నికృష్ట స్వార్థానికి మతం ముసుగు వేసుకోవడానికి వీలు కలిగింది. అందునా కోట్ల విలువైన సంపద వశమవుతుందనేసరికి అతడికి మరీ ఆశ పుట్టింది. పైగా ఆ సమయానికి మరాఠా పెద్దలు దక్కనులో తమ గొడవల్లో తాము మునిగి ఉన్నందున మొగల్ పాదుషా తరఫున మరాఠాలు తనపై తక్షణం విరుచుకు పడతారన్న భయం అబ్దాలీకి లేకపోయింది. ఇలా అన్ని విధాల కాలం అనుకూలించడంతో 80 వేల సైన్యంతో సుడిగాలిలా సింధు దాటి, పంజాబ్‌ను ఆక్రమించి 1757 జనవరికల్లా ఎలాంటి ప్రతిఘటన లేకుండా ఢిల్లీకి దూసుకువెళ్ళాడు.

అబ్దాలీ రాహువులా వస్తున్నాడని తెలియగానే అసలే నానా అగచాట్లు పడుతున్న ఢిల్లీ ప్రజల గుండెల్లో రాయి పడింది. ఉన్న కొద్ది సైనికులు కట్టు తప్పి జీతాల బకాయిల కోసం దొమ్మీలకు, ఘరానా సర్దార్ల ఇళ్ల లూటీలకు పాల్పడుతున్న స్థితిలో బయటి శత్రువు బారి



నుంచి తమకు రక్షణ ఉంటుందన్న ఆశ జనానికి లేకపోయింది. బతికుంటే బలుసాకు తినవచ్చున్నట్టు - అవకాశమున్న సంపన్నులు బండ్లు కట్టుకుని మథురకో, ఆగ్రాకో పారిపోసాగారు. రహదారులన్నీ ఇలా వలసపోయే బండ్లతో కిక్కిరిసాయి. గోరుచుట్టుపై రోకటి పోటులా దారిపొడవునా పౌరులు అబ్దాలీ రాకాసి మూక చేతిలో యమ యాతనలు పడ్డారు. సర్వనాశనమయ్యారు.

పెనుతుఫానులా ఫెళఫెళార్భాటంతో ముందుకు వస్తున్న అహ్మద్ షా అబ్దాలీని ఎలా అడ్డుకోవాలో వజీరు గాజీయుద్దీన్‌కు తోచలేదు. చేతిలో సైన్యం లేదు. ఆ కాలాన ఉత్తరాదిన గొప్ప సర్దారుగా వెలుగుతున్న రోహిల్లా నాయకుడు నజీబ్‌ఖాన్ నుంచి సైనిక సహాయం కోరబోతే - అతడు అప్పటికే అఫ్గాన్ల పక్షాన చేరిపోయాడు. మరాఠా సర్దారు అంతాజీ మంకేశ్వర్‌ను గ్వాలియర్ నుంచి హుటాహుటిన ఢిల్లీకి పిలిపించినా, నగర రక్షణకు అతడు శాయశక్తులా పోరాడుతున్నా అతడి 5వేల సేన అఫ్గాన్ మహా సైన్యం ముందు నిలవడం కల్ల. ఈ పరిస్థితుల్లో ఏమి చేయాలో దిక్కుతోచక చివరికి తాను నిర్బంధించిన ముగలానీ కాళ్లే వజీరు పట్టుకున్నాడు. ఎలాగైనా అబ్దాలీకి చెప్పి వెనక్కి మరలేట్టు చేయమని ప్రాధేయపడ్డాడు.

తలలు మార్చే ముగలానీకి అంతకంటే కావలసింది ఏముంది? సరే, నేను చూసుకుంటాలే అని భరోసా ఇచ్చి ఎంచక్కా నమ్మకద్రోహం చేసింది. వజీరు పక్షాన మాట్లాడుతున్నట్టే నటించి అబ్దాలీతో మంత్రాంగం నెరపి అతడికి కావలసిన సమాచారమంతా చేరవేసింది. కోటలో ఎవరున్నారో, ఎవరి బలం ఏమిటో, ఎవరి దగ్గర ఎంతెంత సంపద ఉందో, ఎక్కడ వెదికితే ఏమి లభిస్తుందో పూసగుచ్చినట్టు వెల్లడించింది. నగరంలోని అధికారుల, బ్యాంకర్ల ఆనుపానులను, సంపద వివరాలను తనకు తెలిసినంతవరకూ విశదీకరించింది.

అబ్దాలీ ఢిల్లీ సమీపానికి రాగానే గాజీయుద్దీన్ పోయి అతడి కాళ్ల మీద పడ్డాడు. నిన్ను వజీరుగా కొనసాగించాలంటే రెండు కోట్లు చెల్లించమన్నాడు అబ్దాలీ. అతడేమో నా దగ్గర లక్ష కూడా లేదన్నాడు. దాంతో అతణ్ని తీసి పడేసి, రెండు కోట్లు ఇస్తానన్న అతడి మామ ఇంతజామ్‌ను వజీరుగా నియమించి 1757 జనవరి 28న ఢిల్లీ కోటలో అబ్దాలీ ప్రవేశించాడు. అలంగీర్ పాదుషా బతికుండగానే, అతడిని తొలగించకుండానే తనను తాను హిందుస్థాన్ పాదుషాగా ప్రకటించుకుని, మసీదు ఖుత్బా కూడా తన పేర చదివించుకున్నాడు.

ఢిల్లీని జయించినా గద్దెనెక్కి ఇక్కడ రాజ్యమేలాలన్న కాంక్ష అబ్దాలీకి లేదు. పుట్టెడు గొడవలతో నానా గత్తరగా ఉన్న ఢిల్లీ సింహాసనం మీద అతడికి మోజు లేదు. స్వదేశంలోనే అతడికి కావలసినన్ని చికాకులున్నాయి. ఏమరుపాటు ఏమాత్రం చూపినా శత్రువులు దెబ్బతీసే ప్రమాదం ఉంది. కాబట్టి అందినకాడికి సంపద మూటగట్టుకుని, వేసవి ముదరక ముందే వేగిరంగా వెనుదిరిగి పోవాలనే ఎంతసేపూ అబ్దాలీ ధ్యాస. పనిలో పనిగా హిందూ కాఫిర్లను వీలైనంత మందిని నరికి పారేసి అల్లాను సంతృప్తిపరచాలన్న మతావేశమూ అతడికి ఉంది. అందుకే జాగు చేయకుండా తాను వచ్చిన పనిని కానిచ్చాడు - మహా క్రూరంగా, నాదిర్షా సైతం గోరీలో ఉలిక్కిపడేంత భయానకంగా!

"Most people's houses in Delhi were dugup to find hidden treasures... Many men have been killed; many women have been ravished; several committed suicide; others drowned themselves

to avoid dishonour... every Hindu lady of handsome features was hunted out and taken into some Moslem harem... Every house in the city was searched; Every householder was served with a written order to disclose his wealth. Those who resisted suffered terrible hardships... Minute details were supplied to the Shah by Mughlani Begam"

[*New History of the Marathas*, **G.S. Sardesai,** *Vol. II. p. 389*]

(ఢిల్లీలో చాలావరకూ ఇళ్లను దాచిపెట్టిన సంపదల కోసం తవ్వి పోశారు... ఎందరో పురుషులను చంపేశారు; ఎందరో స్త్రీలు అత్యాచారాలకు గురయ్యారు. పలువురు ఆత్మహత్యలు చేసుకున్నారు. మానం కాపాడుకోవడానికి చాలా మంది నదిలో దూకి చనిపోయారు. అందంగా ఉన్న ప్రతి హిందూ స్త్రీని వేటాడి ఏదో ఒక ముస్లిం లోగిలికి లాక్కుపోయారు... నగరంలో ప్రతి ఇంటినీ వెదికారు. మీ సంపద వివరాలు చెప్పమని ప్రతి గృహస్థుకూ ఆర్డరు జారీ చేశారు. ఎదిరించిన వారు భయానకమైన కష్టాలు పడ్డారు... 'షా'కు సూక్ష్మమైన వివరాలను ముగలానీ బేగం అందించింది.)

ఇల్లిల్లూ వెదికి, స్త్రీలను చెరిచి, హిందువులను నరికి, ప్రతి ఇంటినీ, ప్రతి గృహస్థునూ కొల్లగొట్టి అబ్దాలీ సాగించిన ఘాతుకాలకు లెక్కా పత్రం లేదు. **హిందూ పద పాదుషాహి** గ్రంథంలో **వి.డి. సావర్కార్** రాసిన దాని ప్రకారం ఢిల్లీలో కొద్ది గంటల్లోనే 18 వేల మంది హిందువులను ఊచకోత కోశారు. అఫ్గాన్ల బాధలు భరించలేక ఢిల్లీ వాసులు కొంపా గోడూ వదిలేసి వేల సంఖ్యలో పారిపోయారనీ, దోచుకున్న సంపదను, వెలలేని వస్తువులను ఏనుగుల మీదా ఒంటెలమీదా గుర్రాల మీదా వేసి పదివేల సేన కాపలాతో అబ్దాలీ తన కుమారుడిని కాబూల్‌కు పంపించాడనీ **జి.ఎస్.సర్దేశాయ్** తన ప్రామాణిక చరిత్ర గ్రంథంలో అన్నాడు.

సాధారణ పౌరులనే ఇంతగా చెండుకు తిన్న ధన పిశాచులు రాచవారి లోగిళ్లను వదులుతాయా? ముగలానీ బేగం అందించిన ఉప్పుతో ఢిల్లీ దర్బారులో ప్రతి ప్రముఖుడి ఇంటినీ శోధించారు. డబ్బు, నగలు ఎక్కడ దాచారో చెప్పమని ఘరానా కుటుంబాల స్త్రీలను, పురుషులను చితకబాది చిత్రహింసలు పెట్టారు. ఆఖరికి రాజప్రాసాదంలోని అంతః పుర స్త్రీలనూ బట్టలు ఊడదీసి వెదికారు. నిధుల కోసం కొంపలు కూల్చడంతోబాటు సదురుగా కనిపించిన మహిళనల్లా అఫ్గాన్లు పాడుచేశారు.. ముగలానీ బేగం ఎన్నిక చేసిన ప్రకారం మరీ అందమైన అమ్మాయిలను అబ్దాలీ, అతడి కుమారుడు ఉంచేసుకోగా ఇతరులను తక్కినవారు పంచుకున్నారు.

ఇలా నెలరోజుల పాటు ఢిల్లీ నగరాన్ని అతలాకుతలం చేసి, అక్కడి అభాగ్య పౌరులను పీల్చి పిప్పిచేసిన మీదట అబ్దాలీ పాపిష్టి కన్ను హిందువుల పవిత్ర క్షేత్రాలైన మథుర, బృందావనాల మీద పడింది. తాను రావడానికి ముందే ఢిల్లీ ధనికులు బండ్ల కొద్దీ సంపదతో మథుర వైపు పారిపోయారని ముగలానీ చెప్పగా వారిని మాత్రం ఎందుకు వదలాలనుకుని అతడు తన రాకాసి మూకను ప్రయోగించాడు. చెప్పరాని ఘోరాలకు ఒడిగట్టాడు. ఆ వైనాలను జి.ఎస్. సర్దేశాయ్ ఇలా వివరిచాడు.



Abdali Shah gave clear orders to his men that "Mathura and other places are holy cities of the Hindus. It is your sacred duty to kills as many non-muslims as you can and make heaps of their servered heads" promising that he would pay them Rs. 5 for each head. Mathra fell an easy victim to the enemy's ferocious swords. Several houses were burnt down, idols in the temples were broken to pieces and trampled under feet... The Afgans squirted the blood spray to imitate Hindu gaiety. They plundered Mathura, Brindavan and Gokul and filled the roads literally with corpses... Several thousand Hindus were cut down, Jahan Khan alone being responsible for slaying three thousand Bairagis and pilgrams.

[*New History of the Marathas*, **G.S. Sardesai,** *Vol. II. p. 390-91*]

(మథుర, ఇతర పట్నాలు హిందువులకు పవిత్ర స్థలాలు. అక్కడ మహమ్మదీయేతరులలో ఎంతమందిని వీలయితే అంతమందిని చంపి, నరికిన తలలను గుట్టలుగా పేర్చటం మీ పవిత్ర కర్తవ్యం'. అని అబ్దాలీ షా తన మనుషులకు స్పష్టంగా ఆజ్ఞాపించాడు. వారు తెగవేసిన ప్రతి తలకూ ఐదు రూపాయల చొప్పున చెల్లిస్తానని అతడు మాట ఇచ్చాడు. శత్రువు భీకర కరవాలానికి మథుర తేలికగా బలి అయింది. ఎన్నో ఇళ్లు దగ్ధమయ్యాయి. ఆలయాల్లో దేవతా విగ్రహాలను ముక్కలు చేసి కాళ్లతో తొక్కారు... హిందువులు సంతోషంగా జరుపుకొనే హోళీని అనుకరిస్తూ వారి నెత్తుటితో హోళీ ఆడారు. మథుర, బృందావనం, గోకులాలను కొల్లగొట్టారు. వీధులన్నిటినీ శవాలతో నింపారు... వేలాది హిందువులను నరికేశారు. అబ్దాలీ ముఖ్య సర్దారు జహాన్‌ఖాన్ ఒక్కడే మూడు వేల మంది బైరాగులను, యాత్రికులను నరికి చంపాడు).

ప్రత్యక్ష సాక్షుల, సమకాలిక చరిత్రకారుల కథనాల ఆధారంగా జి.ఎస్. సర్దేశాయి ఇచ్చిన ఇటువంటి వివరాలను బట్టి ఆ సమయంలో మతమౌఢ్యపు నరపిశాచి పదఘట్టనల తీవ్రతను అర్థం చేసుకోవచ్చు. ఈ దారుణ దురాగతాలను అభాగ్య మానవులు అడ్డుకోలేక పోయినా అఫ్గాన్ల పాపం ఊరికే పోలేదు. 1757 మార్చిలో మథుర, గోకుల, బృందావనాలలో నెత్తుటి హోళీ ఆడి వారం తిరక్కుండా శవాల గుట్టల కారణంగా అంటువ్యాధులు ప్రబలాయి. భయంకరమైన ప్లేగుతో అబ్దాలీ సైనికులు రోజూ వందల సంఖ్యలో పిట్టల్లా రాలారు. వేసవి ఎండలు మండి యమునానది ఎండిపోయింది. తాగేందుకు నీరు దొరకక, కాలుష్యానికి, అంటువ్యాధులకు తాళలేక అబ్దాలీ షా ఢిల్లీ గద్దెను అలంగీర్ పాదుషాకు తిరిగి అప్పగించి, గాజీయుద్దీన్‌నే వజీరుగా కొనసాగనిచ్చి 12 కోట్ల రూపాయల విలువైన సంపదను అందిన కాడికి మోసుకుని ఏప్రిల్ 1న పడుతూ లేస్తూ స్వదేశానికి మరలిపోయాడు.

మరి – ఇన్ని కుతంత్రాలు పన్ని, ఇన్ని కుత్సితాలు సాగించి, దేశంలో ఇంతటి చిచ్చుపెట్టి, ఆఫ్ఘాన్ రాజుకు ఇంత ఘనమైన సేవ చేసిన ముగలానీ ఏమి బావుకుంది? అన్నిటికీ ప్రతిఫలంగా ఆమెకు ఏమి దక్కింది? అక్కర తీరగానే అబ్దాలీ ఆమెను పురుగులా తీసి అవతల పారేశాడు. ఇస్తానన్న జాగీరూ ఇవ్వలేదు. ఆమె సౌజన్యంతో దోచుకున్న సంపదలో

వాటానూ ఇవ్వలేదు. దర్బారులో ఏ పదవీ చూపలేదు. నా సంగతి ఏమిటని అడుగుతూ తన వెంట పడ్డా ఆమెను కనికరించలేదు. ఆఖరికి పంజాబ్‌లోనూ తన కుమారుడు తైమూర్ షాను పోతూ పోతూ గవర్నరుగా పెట్టి వెళ్ళాడేతప్ప ముగలానీకి పూచిక పుల్లపాటి ప్రాముఖ్యం ఇవ్వలేదు.

ఈ ఆశాభంగాన్ని ముగలానీ తట్టుకోలేకపోయింది. పిచ్చిదానిలా ఆక్రోశించింది. అబ్దాలీ వజీరు షావలీ గుడారానికి పోయి గొడవ చేస్తే ఆమెను కర్రలతో మెత్తగా తన్ని తగలేశారు. చేతిలో చిల్లిగవ్వ లేకుండా పోవడంతో తాను ఒకప్పుడు మహారాణి భోగం వొలకబోసిన లాహోర్‌లోనే వీధుల్లో బిచ్చమెత్తి హీనంగా బతికి ముగలానీ కుక్క చావు చచ్చింది.





# అటకెక్కిన ఆశ

*ఎంత చక్కని కబురు? ఎన్నాళ్లకెన్నాళ్లకు?!*

*ఎన్నో శతాబ్దాలుగా భారతీయ వీరులెవరూ సాహసించని కార్యాన్ని మరాఠా చిచ్చరపిడుగులు అవలీలగా సాధించారు. 12వ శతాబ్దాంతాన ఘోరీ చేతిలో పృథ్వీరాజ్ నిహతుడైన తరవాత తొలిసారిగా హిందుస్థాన్‌కు ఉత్తరపు కొసన హిమాలయ పర్వత సానువులలో అటక్ మీద హిందూ పతాకం రెపరెపలాడింది. వేదాలను కన్న సింధునది పవిత్ర జలాల్లో మరాఠా విజయాశ్వాలు ఓలలాడాయి.*

ఆ శుభవార్త విని ప్రతి భారతీయుడు గర్వపడ్డాడు. దేశమంతటా ఆనందోత్సాహాలు వెల్లి వెరిశాయి. రాజధాని ఢిల్లీలోనూ, మధుర, బృందావనాల వంటి పావన పుణ్యక్షేత్రాలలోనూ ఆఫ్ఘన్‌రాజు అహ్మద్‌షా అబ్దాలీ మత ద్వేషంతో పేట్రేగి, కొద్ది నెలల కిందట పైశాచికంగా సాగించిన హిందూ జన సంహారానికి, దేవాలయాల విధ్వంసాలకు, ఘోరమైన దైవాపచారాలకు గుండెలవిసేలా తల్లడిల్లిన హిందూ ప్రజానీకానికి ఈ అపురూప విజయ ఘోషతో ప్రాణం లేచి వచ్చింది.

అవును మరి, పీష్వా సోదరుడు రఘునాథరావు, అతని వీర సేన సాధించిన ఘనత సామాన్యమైనదా? మరాఠా మహాసైన్యాన్ని కళ్లచూసేసరికి శత్రువులు హడలి ప్రాణభయంతో పరుగులు పెట్టారు. ఢిల్లీలో తన ప్రతినిధిగా అఫ్ఘాన్ ప్రభువు నిలిపివెళ్లిన నజీబ్‌ఖాన్ చేతులెత్తేసి సైన్యంతో సహా లొంగిపోయాడు. మొగల్ సింహాసనం మళ్లీ మరాఠాల చెప్పుచేతల్లోకి వచ్చింది. అబ్దాలీ తిరిగి వెళ్లిన దారినే వెంబడిస్తూ, అతడు జయించిన ప్రాంతాలను తిరిగి స్వాధీనపరచుకుంటూ వెళ్లిన రఘునాథరావు సేనకు సర్‌హింద్‌లో అబ్దాలీ సేనాని అబ్దుస్ సమద్‌ఖాన్ పదివేల సేనతో పాదాక్రాంతుడయ్యాడు. అక్కడి నుంచి లాహోర్ దిశగా జైత్రయాత్ర సాగించగా మరాఠాల ఎదుటపడేందుకు ధైర్యం చాలక... అబ్దాలీ పనుపున రాజ ప్రతినిధిగా ఉన్న అతడి కుమారుడు తైమూర్‌షా, అబ్దాలీ ముఖ్య సేనాపతి జహాన్‌ఖాన్‌లు వీలైనంత సంపదను వెంటేసుకుని లాహోర్ వదిలి పారిపోయారు. మరాఠా దండు వారిని

తరుముకుంటూ వెళితే చీనాబ్ నది దగ్గర సామాన్ల సరంజామాను వదిలేసి ఆ ఇరువురూ కట్టుబట్టలతో తమ దేశానికి పలాయనమయ్యారు. ఆ విధంగా మొత్తం పంజాబ్‌ను అబ్దాలీ పట్టు నుంచి తిరిగి స్వాధీనపరచుకున్నాక పరాక్రమానికి పరాకాష్ఠగా 1758 జులైలో అటక్ కోటపై జయకేతనాన్ని మరాఠా వీరులు ఎగరేశారు. 38 ఏళ్ల కింద బాజీరావు పీష్వాకు సాహురాజు నిర్దేశించిన లక్ష్యాన్ని బాజీరావు కుమారుడు గొప్పగా సాధించాడు.

"All Maharashtra felt electrified with the proud performance of Raghunathrao and his bands having reached the extreme frontier of India and bathed their horses in the Indus".

[*New History of Marathas*, **G.S Sardesai,** *Vol. II. p. 401*]

జి.ఎస్. సర్దేశాయి మాటల్లో చెప్పాలంటే - భారతదేశపు చివరి పొలిమేరను చేరి, సింధు నదిలో తమ గుర్రాలను జలకాలాడించిన రఘునాథరావు, అతడి సేనల ఘనకార్యానికి అఖిల మహారాష్ట్రం ఆశ్చర్యచకితమైంది.

నిజానికి ఆ సమయంలో మరాఠా ప్రతాపం అటక్ చేరడంతోటే ఆగదలచలేదు. అబ్దాలీ రాజ్యంలోకి చొచ్చుకువెళ్లి, అతడికి నిలవ నీడ లేకుండా చేసి, కాబూల్, కాందహార్‌లను తిరిగి భారత సామ్రాజ్యంలో కలిపివేయాలని రఘునాథరావు ఆకాంక్షించాడు. 1758 మే 4న తన సోదరుడు నానాసాహెబ్ బాలాజీ పీష్వాకు అతడు రాసిన లేఖను పరికిస్తే ఆనాడు మరాఠాల పౌరుషం ఎంత ప్రచండంగా ఉన్నదీ అవగతమవుతుంది.

"The foreces of Sultan Taimur and Jahankhan were routed and their very camp, with all their belongings, fell in our hands. Only a few could recross Attock alive. The Shah of Iran had defeated Abdally and has personally written to me pressing me to advance further on to Kandahar and proposes that, when Abadally is thus crushed, he would recognise Attock as the frontier of our empire. But I do not know why we should confine ourselves to Attock. The two provinces of Kabul and Kandahar belong to our Hindustani empire ever since the days of Akbar to Aurangzeb. Why then should we hand them over to the foreigner?"

[***Hindu-pad-padshahi,*** **V.D. Savarkar,** *p.97*]

*(సుల్తాన్ తైమూర్, జహాన్‌ఖాన్‌ల సేనలను ఓడించాం. వారి సామానులతో సహా మొత్తం అఫ్ఘాన్ శిబిరం మన చేతికి చిక్కింది. కొద్ది మంది మాత్రమే అటక్ దాకా తిరిగి వెళ్ళగలిగారు. అబ్దాలీని ఓడించిన ఇరాన్‌షా కాందహార్ పైకి కదలమని కోరుతూ నాకు స్వయంగా జాబు రాశాడు. అబ్దాలీని కలిసి అణచివేశాక మన సామ్రాజ్యానికి సరిహద్దుగా అటక్‌ను గుర్తించగలనని అతడి ప్రతిపాదన. కాని మనం అటక్‌కే ఎందుకు పరిమితం కావాలి? కాబూల్, కాందహార్ రాష్ట్రాలు రెండూ అక్బర్, ఔరంగజేబుల కాలం నుంచీ హిందుస్థానీ సామ్రాజ్యానికి చెంది వున్నాయి. వాటిని విదేశీయులకు మనం ఎందుకు ఒప్పగించాలి?).*



కొద్ది నెలల కిందట భారతదేశంపైకి నిరాఘాటంగా దండెత్తి వచ్చి, పాదుషాను, ప్రభుత్వాన్ని గడగడలాడించి, అంతఃపుర స్త్రీలను బట్టలు వొలిచి నగలు లాక్కొనగలిగిన అఫ్ఘాన్ ప్రభువును సొంత కోటలోనే అణచి కాలరాచి వేయగలనని మరాఠా పీష్వా సోదరుడు విశ్వసించడం మనకు విడ్డూరంగానే ఉంటుంది. కాని 1758 నాటి అంతర్జాతీయ రాజకీయ స్థితిగతులను దృష్టిలో ఉంచుకుంటే రఘునాథరావుది వట్టి ప్రగల్భంగా కొట్టివేయలేము. అనుకోని అవకాశం అయాచితంగా రావడంతో హిందుస్థాన్ మీదికి దండయాత్ర చేసినా ఇక్కడ సింహాసనం మీద కూచోవాలన్న కోరికగాని, ఈ దేశాన్ని తన సామ్రాజ్యంలో కలిపేసుకుని ఏలాలన్న ఆలోచనగానీ అబ్దాలీకి లేదు. అతడిది బందిపోటు మనస్తత్వం. అందినంత సంపద దండుకుపోవాలనే అతడి ధ్యాస. గతంలో మొగలు సేన చేతిలో తన పరాజయాన్ని అతడు మరచిపోలేదు. మరాఠాల సైనిక శక్తి సంగతి అతడికి బాగా తెలుసు. కోట్లు కొల్లగొట్టి హుటాహుటిన భారతదేశం నుంచి తిరిగి వచ్చాక స్వస్థలంలో అబ్దాలీకి కష్టాలు ఎక్కువయ్యాయి. అఫ్ఘానిస్థాన్‌లో తాను ఆక్రమించిన రాజ్యాన్ని నిలుపుకోవటమే అతడికి కష్టంగా ఉంది. పశ్చిమం నుంచి పర్షియన్లు అతడి అంతు చూడటానికి కమ్ముకొస్తున్నారు. సొంత సోదరుడి కుమారుడే అబ్దాలీపై కత్తి గట్టి అతడిని కూలదోయటానికి సాయపడమంటూ పుణె వెళ్లి పీష్వాను ఆశ్రయించాడు. ఇక ఆ కాలంలో ఆసియాలో గొప్ప సైనికులుగా పేరెన్నికగన్న సిక్కులు ముగ్గురు మహానేతల నాయకత్వంలో సంఘటితమై, తమ పవిత్ర స్వర్ణదేవాలయాన్ని మలినపరిచిన అబ్దాలీపై రాజీలేని పోరాటం సాగిస్తున్నారు. వారు మరాఠాలకు చేరువయ్యారు.

ఇలాంటి అనుకూల పరిస్థితుల్లో - కటక్ నుంచి అటక్ దాకా, రామేశ్వరం నుంచి ముల్తాన్ వరకూ తమ కత్తికి ఎదురులేక ఉపఖండంలో ప్రబల సైనిక శక్తిగా ఎదిగిన మరాఠాలు గాంధార రాజ్యాన్ని తిరిగి జయించి అఖండ భారతంలో విజయ కేతనాన్ని సగర్వంగా ఎగరవేయాలని సంకల్పించడంలో అవాస్తవికత లేదు; అత్యాశాలేదు. సాధించిన సైనిక విజయాలను సుస్థిరపరచుకొని, చిక్కిన ఆధిక్యం చేజారిపోకుండా ఎక్కడికక్కడ గట్టి కట్టుదిట్టాలు చేసి... నయవంచనలకు, మెరమెచ్చులకు మోసపోకుండా, తెలివిగా దృఢంగా నిలబడి... దూరదృష్టితో పటిష్ఠ వ్యూహంతో సన్నాహాలన్నీ చేసుకుని సమర్థంగా ముందుకు కదిలి ఉంటే అనుకున్న లక్ష్యం కష్టంగానైనా సిద్ధించేది. చరిత్ర గతి మరో విధంగా ఉండేది. సుమారు రెండు శతాబ్దాల విదేశీ దాస్యం దేశానికి తప్పేది.

దురదృష్టవశాత్తు ఆ వ్యవహార దక్షతే మరాఠా నాయకత్వానికి సరైన అదనులో లోపించింది. పరాక్రమానికి తగిన మంత్రాంగం మరాఠాలకు మృగ్యమైంది. ఒడుపుగా పావులు కదిపి, అన్ని వైపుల నుంచి ఆత్మరక్షణ చేసుకుంటూ ప్రత్యర్థిని చుట్టుముట్టి కదలనీయకుండా కట్టివేయాల్సిందిపోయి - తెలివితక్కువగా తప్పటడుగులు వేసి, అతిశయించిన ఆత్మవిశ్వాసంతో సర్వానర్థాన్ని కోరికొని తెచ్చుకుని, మరాఠాలు స్వర్ణావకాశాన్ని జారవిడుచుకున్నారు. బుర్రలేని పనులతో తాము నాశనమై విశాల జాతి హితానికీ తీరని నష్టం కలిగించారు.

అటక్ నుంచి బంగాళాఖాతం వరకూ మహావిశాలమైన మైదాన ప్రాంతం. అనేక నదీనదాలు మినహా సహజసిద్ధ అడ్డంకులు అక్కడ ఏమీ ఉండవు. ఆ నదులు కూడా

ఎండాకాలం ఎండి పోతాయి. సింధులోయకు ఆవలి నుంచి వచ్చే దురాక్రమణదారు ఎవరైనా అటక్‌ను దాటగలిగితే, లాహోర్‌లో ఎదురులేకపోతే మొత్తం ఉత్తర భారతాన్ని తేలికగా కబళించగలడు. అలగ్జాండర్ నుంచి అబ్దాలీ వరకూ లెక్కలేనన్ని దండయాత్రల్లో రుజువైన చారిత్రక సత్యమిది. మునివాకిలి దగ్గరే శత్రువును నిరోధించే దిక్కు లోపించిన దుష్ఫలితాన్ని అనేక శతాబ్దాల పర్యంతం అనుభవించిన మీదట ఎట్టకేలకు అటక్ మీద తిరిగి భారతీయులకు పట్టు చిక్కింది. ఈ ఘన విజయపు ప్రాముఖ్యాన్ని, అది వమ్మయితే దేశ రక్షణకు కలిగే తీవ్రానర్థాన్ని గుర్తించి రఘునాథరావు తగుజాగ్రత్తపడవలసింది. కాందహార్, కాబూల్‌లను కైవసం చేసుకోలేకపోయినా, కనీసం గెలుచుకున్న ప్రాంతాలను సురక్షిత పరచేంతవరకైనా రంగంలో నిలిచి గట్టి ఏర్పాట్లను చేయవలసింది. దురదృష్టవశాత్తూ - అందుకు కావలసిన నేర్పు, ఓర్పు రఘునాథరావుకు, అతడిని పరివేష్టించిన సర్దార్లకు లేకపోయాయి. ఫలితంగా అటక్ విజయం ఆర్నెల్లకే అణగారిపోయింది. దేశం మళ్లీ అబ్దాలీ వశమైంది. అది ఎలా జరిగిందన్నది పెద్ద కథ.

రఘునాథరావుకు క్షాత్రం ఉన్నా ఆత్రం ఎక్కువ. 1756 అక్టోబరులో పుణె నుంచి అబ్దాలీపైకి దండు వెడలినది మొదలుకుని పంజాబ్ దిగ్విజయం వరకూ తన ధాటికి ఎవరూ తాళలేక అన్నీ విజయాలే సిద్ధించడంతో... ప్రధాన శత్రువు అబ్దాలీ సర్వత్రా సమస్యలతో సతమతమవుతూ కనిపించడంతో తన జైత్రయాత్ర అప్రతిహతంగా సాగితీరుతుందని అతడికి అతి విశ్వాసం కలిగింది. స్వయంగా తాను కత్తెత్తి నిలబడితేగానీ పని జరగదన్న భయంలేదనీ.. మిగిలిపోయిన కొద్దిపాటి కార్యాన్నీ తన ప్రతినిధులు కళ్లు మూసుకుని సాధించగలరనీ అతడు భావించాడు. తన వంతు పని పూర్తయిందని అనుకోగానే అతడికి ఇంటి మీద గాలి మళ్లింది. ఆ ఊపులోనే ఇందాక ఉటంకించిన లేఖలో For the time being. I must hasten back to the Deccan. My successsors will see that these extensive designs bear fruit and our regular administration is introduced in the provinces of Kabul and Kandahar. *(ప్రస్తుతానికి నేను త్వరగా దక్కనుకు మరలితీరాలి. ఈ విస్తృతమైన పథకాలన్నీ ఫలించి, కాబూల్ కాందహార్ రాష్ట్రాల్లో మన పరిపాలన మామూలు పద్ధతిలో నడిచేట్టు నా తరవాతవారు చూడగలరు)* అని పీష్వా అన్నయ్యకు రాశాడు. జవాబు కోసం కూడా ఆగకుండా తరవాత కొద్ది రోజులకే పుణెకి ప్రయాణమయ్యాడు.

వాస్తవానికి అటక్ కోటను పట్టుకునేంతవరకూ కూడా రఘునాథరావు రంగంలో లేడు. నెల రోజులు లాహోర్‌లో మకాం చేశాక 1758 మేలో అతడు వెనక్కిపోగా ఆ తరువాత రెండు నెలలకు తుకోజీ హోల్కర్, సాబాజీ సింధియాలు పంజాబ్‌ను పూర్తిగా జయించి అటక్ కోటమీద భగవాధ్వజాన్ని ఎగరేశారు. సింధునది వరకూ పన్నులు వసూలు చేసి మరాఠా తరహా పరిపాలననూ ప్రవేశపెట్టారు. కాని ఆ ముచ్చట నిండా ఆరు నెలలు కూడా నిలవలేదు.

రాజ్యాన్ని రక్షించటానికి ముఖ్య నాయకుడే కత్తి పట్టుకుని ఎల్లవేళలా కాపలా కాయనవసరంలేదు. ఛత్రపతి శివాజీ ఎన్నో సైనిక విజయాలను తాను కదలకుండా అనుచరులను పురమాయించే సాధించగలిగాడు. మరాఠా స్కంధావారంలో గండర గండలైన మహాయోధులెందరో ఉన్నందున తన పరోక్షంలో ఏమవుతుందోనన్న బెంగ రఘునాథరావుకూ



ఉండనక్కర్లేదు. నమ్మకస్థులైన సమర్థులను తన ప్రతినిధులుగా నియమించి, కథ అడ్డం తిరక్కుండా గట్టి ఏర్పాట్లు చేసి వెళ్లి ఉంటే రఘునాథరావు రంగం నుంచి నిష్క్రమించినా ప్రమాదం ఉండేది కాదు. కాని - సరిగ్గా ఆ ప్రతినిధుల ఎంపికలోనే రఘునాథరావు బోల్తాపడ్డాడు.

అహ్మద్‌షా అబ్దాలీ పనుపున పదివేల సేనతో సర్‌హింద్‌లో కాపలా ఉన్న పఠాన్ సేనాని అబ్దుస్ సమద్‌ఖాన్ మరాఠాల సైనికశక్తి ధాటికి నిలవలేక సైన్యంతో సహా లొంగిపోయాడు. రఘునాథరావు అతడిని చెరలో పెట్టాడు. కొన్నాళ్లకు అతడు మాయమాటలు చెప్పి, తాను గత్యంతరంలేకే అబ్దాలీని సేవించినట్టు నమ్మించి,రఘునాథరావును తెలివిగా బుట్టలో వేశాడు. తన మీద విశ్వాసం ఉంచి బాధ్యత అప్పగిస్తే గతంలో అబ్దాలీని సేవించిన దానికంటే ఎక్కువగా అతివిధేయతతో తమ కొలువు చేయగలవాడనని అర్థించాడు. ఆ నటనకు రఘునాథరావు మోసపోయాడు. అదే సమయాన పుణెలో బాలాజీ పీష్వా కూడా తన శరణుజొచ్చిన అబ్దాలీ దాయాది అబ్దుర్ రహమాన్ ప్రార్థనలకు పొంగి, ప్రగల్భాలను నమ్మి శత్రువుకు శత్రువు మిత్రుడన్న రాజనీతి ప్రకారం ఇతడిని అబ్దాలీపై రణతంత్రంలో ఉపయోగించుకోవలసిందంటూ రఘునాథరావు దగ్గరికి పంపించాడు. ఇంకేం? అబ్దాలీ పొడగిట్టని అబుస్‌సమద్, అబ్దుర్ రహమాన్‌లు తన పక్షాన ఉండగా రక్షణ గురించి చింతలేదని రఘునాథరావు భ్రమపడ్డాడు. పెషావర్‌లో ఉండి అబ్దాలీ కదలికలను అప్రమత్తంగా కనిపెట్టి, కాబూల్ కాందహార్‌లను వశపరచుకోవలసిందని ఆ ఇద్దరినీ ఆదేశించి, విజయోత్సాహంతో ఈలవేస్తూ ఇంటిదారి పట్టాడు. దేశానికి వాయువ్య ముఖద్వారంలో కొత్తగా జయించిన కీలక రాజ్యాన్ని ఇద్దరు ముస్లిం ఏజంట్ల చేతిలో పెట్టే ముందు వారిని కనిపెట్టి ఉండి అవసరమైతే గట్టి ప్రతిచర్యలు తీసుకోవటానికి సమర్థులు, అనుభవజ్ఞులు అయిన మరాఠా సర్దార్లను తగిన సైన్యంతో సిద్ధంగా ఉంచాడా అంటే అదీ లేదు. తుకోజీహోల్కర్, సాబాజీ సింధియా వంటి దిగువస్థాయి దండ నాయకులను కొద్దిపాటి సైన్యంతో అట్టేపెట్టి పంజాబ్‌ను జాగ్రత్తగా చూసుకోండని చెప్పి తన దారిన తాను పోయాడు. అప్పట్లో డీలాపడిన అబ్దాలీ కోలుకునే సూచన లేదు కనుక పూనా నుంచి పెద్ద సేనతో బయలుదేరిన దత్తాజీ సింధియా వచ్చేలోపు మామూలు కాపలాకు ఆ బలగం సరిపోతుంది లెమ్మని రఘునాథరావు తలిచాడు. చివరికి ఆ అలసత్వమే మరాఠాల కొంపముంచింది.

నెమ్మది కావలసిన సమయంలో ఆత్రపడినట్టే... ఆత్రపడాల్సిన అదనులో నెమ్మదిగా కదలడం కూడా రఘునాథరావు ప్రత్యేకత! అతడే కనుక జాగు చేయకుండా కదనానికి కదిలి ఉంటే అంతకు ముందు సంవత్సరం ఢిల్లీ, మథురలపై ఘోర కిరాతకాలను అబ్దాలీ నిరాఘటంగా సాగించగలిగే వాడే కాదు. ముగలానీ బేగం, నజీబ్‌ఖాన్‌ల ఆహ్వానం మీద హిందుస్థాన్ మీదికి అబ్దాలీ దండెత్తనున్నట్టు బాలాజీ పీష్వాకు 1756 అక్టోబర్‌లోనే తెలిసింది. బయటి శత్రువుల బారినుంచి సామ్రాజ్యాన్ని రక్షించేందుకు మొగలు పాదుషాకు ఒడంబడిన ప్రకారం వెంటనే మల్హార్‌రావు హోల్కర్ తోడుగా రఘునాథరావును పెద్ద సైన్యంతో పీష్వా పంపాడు. అంటే - కాబూల్ నుంచి అబ్దాలీ, పూనా నుంచి రఘునాథరావు ఇంచుమించుగా ఒకే సమయంలో బయలు వెడలారు. ఆ రెండు నగరాలకూ ఢిల్లీ దాదాపుగా ఒకే దూరంలో ఉన్నందున ఇరు సేనలూ ఇంచుమించుగా ఒకే సమయంలో ఢిల్లీకి చేరుకుని ఉండాలి.

అబ్దాలీ కదిలినంత వేగంగా రఘునాథరావు కూడా కదిలి ఉంటే రాజధానిలో దారుణ జనసంహారాన్ని నివారించగలిగేవాడు. కానీ - జరిగిందేమిటో సర్దేశాయి మాటల్లో వినండి:

Raghunanthrao left Poona in October 1756 and should have reached Delhi in time to face Abdali and compel him to return. But, moving slowly... he reached Indore when Abdali had sent out parties against Mathura. Raghunathrao and Malharrao occupied themselves in exacting tributes from the Rajputs thereby contracting their ill will, and reached Agra in May...

[*New Hisotyrof Marathas*, **G.S.Sardesai**, *Vol. II. p-395*]

*(1756 అక్టోబరులో పూనా వదిలిన రఘునాథరావు ఢిల్లీకి సకాలంలో చేరుకుని అబ్దలీని ఎదిరించి వెనక్కి మరలేట్టు చేయవలసింది. కాని నెమ్మదిగా కదులుతూ అతడు - అబ్దాలీ మధుర పైకి దళాలను పంపే సమయానికి ఇండోర్ చేరుకున్నాడు. అక్కడ అతడు, మల్హర్‌రావు రాజపుత్రుల నుంచి బలవంతంగా కప్పం వసూలు చేయడంలో పొద్దుపుచ్చి మే నాటికి ఆగ్రా చేరుకున్నారు).*

పెళ్ళినడకలు నడుస్తూ వీరు గమ్యం చేరేసరికి జరగాల్సిన నాశనం జరిగేపోయింది. దోచినదంతా దండుకుని అబ్దాలీ అప్పటికి స్వదేశం తిరిగి వెళ్లటం కూడా అయింది. పోనీ - ఆ తరువాత తెలివిగా, దృఢంగా వ్యవహరించి మళ్లీ శత్రువుల బెడదలేకుండా గట్టి ఏర్పాటు చేసిందీ లేదు. భారీ సైన్యంతో మరాఠాలు రాగానే ఢిల్లీలో తన మనిషిగా అబ్దాలీ నిలిపివెళ్లిన గుంటనక్క నజీబ్‌ఖాన్ కాళ్ల బేరానికి వచ్చాడు. అతడికి నిలువెల్లా విషం. ఆ కాలంలో భారతదేశపు పఠాన్లకు అతడే నాయకుడు. మొగలులన్నా హిందువులన్నా అతడికి మంట. దండెత్తి రమ్మని అబ్దాలీని ఆహ్వానించిందీ, వచ్చాక దగ్గరుండి అనుపానులన్నీ చెప్పి మధుర, బృందావనాల్లో హిందువులపై అమానుష ఘాతుకాలను జరిపించిందీ అతడే. అబ్దాలీకి, మరాఠాలకు ఏ విధమైన సంధి కుదరకుండా సైంధవుడిలా అడ్డుపడిందీ అతడే. అటువంటి వాడు తమ చేతికి చిక్కాక మరాఠాలు నరికివేసినా పాపం కాదు. చంపకపోయినా కనీసం ఖైదుచేసి మళ్లీ పేట్రేగకుండా అడ్డుకుని ఉండాలికదా? కాని - చిత్రంగా అతడి మీద మల్హర్‌రావు హోల్కర్‌కు వల్లమాలిన ప్రేమ పుట్టకొచ్చింది. 'నీ కొడుకు లాంటివాడిని, నన్ను వదిలేస్తే మా ఊరికి పోయి బుద్ధిగా బతుకుతాను. మీకు ఆజన్మాంతం విధేయుడినై ఉంటాను' అని నజీబ్‌ఖాన్‌రస్సా వేయగానే, అతడి మాయమాటలకో, అతడు పెట్టిన లంచానికో మల్హర్‌రావు కరిగిపోయాడు. అతడు వదిలేయమనగానే రఘునాథరావు బుర్ర లేకుండా నజీబ్‌ను నమ్మి వదిలేశాడు. మరాఠా ముఖ్య సర్దార్లందరూ వద్దు వద్దని వారిస్తున్నా ఆ విషసర్పాన్ని తోకమాత్రం తొక్కి విడిచిపెట్టాడు.

పాదుషాకు మళ్లీ గద్దెనప్పగించి, నజీబ్‌ను తొలగించి తిరిగి గాజీయుద్దీన్‌కు పెత్తనం ఇవ్వడంతో చిక్కులన్నీ చక్కబడ్డాయని భ్రమించి, అటునుంచి ఆదరాబాదరా పంజాబ్‌కు సుడిగాలిలా వెళ్లి, సింధూజలాల్లో గుర్రాలను నీళ్లు తాగించి, సుడిగాలిలాగే రఘునాథరావు వెనక్కి మరలాడు. పుణె నుంచి పంజాబ్‌ను నియంత్రించటం కుదిరే పనికాదు. కనుక, కొన్నాళ్లు ఢిల్లీలో ఉండి, నజీబ్‌ఖాన్ కదలికలను గమనించి, రాజ్యరక్షణకు గట్టి కట్టడులన్నీ



చేవలసిందని మరాఠా ముఖ్యలు కొందరు ఎంతగా చెప్పినా అవకతవక ఏర్పాట్లను ఎక్కడిదక్కడ వదిలేసి రఘునాథరావు ఇంటికెళ్లాడు. తాను నిర్వహించ లేకపోయిన మహా కార్యభారాన్ని తన కింది వాడైన దత్తాజీ సింధియా భుజాల మీద మోపి, 'నజీబ్‌ఖాన్‌ను నమ్మకు. బోనులో పెట్టు. పంజాబ్‌ను కాపాడు - కాబూల్‌ను జయించు' అని ఆజ్ఞాపించి, చేతులు దులిపేసుకున్నాడు.

అగ్రనాయకుడిలో క్షమించరాని ఈ నిర్లక్ష్యంవల్లే - అటక్‌లో మొలకెత్తిన ఆశ మూణ్నాళ్లకే అటకెక్కింది. అదే చివరికి పానిపట్టు ఘోరకలికి దారితీసింది.

# పానిపట్టు పరాజయం

**యుద్ధాలు మనకి కొత్త కాదు. భారత చరిత్ర నిండా ఉన్నవే అవి.**

**యుద్ధం అన్నాక సంహారం తప్పదు. కాని *1761* సంవత్సరం మొదట్లో ముస్లింలు – మరాఠాల మధ్య పానిపట్టు యుద్ధంలో జరిగింది మామూలు సంహారం కాదు. చరిత్రకారుల అంచనాలు వేరువేరుగా ఉన్నా ఆ భయానక యుద్ధంలో నిహతులైన వారి సంఖ్య కనీసం లక్షకుపైనే. రక్తం ఏరులై పారిన అటువంటి భీకర యుద్ధం ఆధునిక భారత చరిత్రలో మరొకటిలేదు.**

ప్రాచీన, మధ్యయుగాల్లో ఇంతకంటే భయంకరమైన రక్తసిక్త యుద్ధ ప్రకరణాలు ఎన్నో ఉన్నమాట నిజం. పానిపట్టు వరకే చూసినా.. మొత్తం భారత ఉపఖండంలోని క్షత్రియ వర్గం యావత్తూ సర్వనాశనమై, అనంతరకాలంలో దేశ దుర్గతికి ముఖ్య హేతువైన మహా భారత సంగ్రామ కురుక్షేత్రం అక్కడికి చాలా దగ్గరే. 1526లో ఇబ్రహీంలోడీ – బాబర్‌ల నడుమ మహాప్రచండంగా చెలరేగి, మొగలాయీ సామ్రాజ్య స్థాపనకు దారి తీసిన పానిపట్టు మొదటి యుద్ధంలోనూ విశేష ప్రాణ నష్టం జరిగింది. 1556లో అక్బర్ – హేముల మధ్య జరిగిన రెండవ పానిపట్టు యుద్ధంలోనూ గుట్టలు పడిన పీనుగుల పోగులకు లెక్కలేదు. ప్రాణనష్టం అంతకంటే ఎక్కువగా జరిగిన యుద్ధాలు ఇంకా అనేకం ఉండవచ్చునేమో. కాని, భారత చరిత్రలో మిగతా యుద్ధాలన్నీ ఒక ఎత్తు... 1761 నాటి మూడవ పానిపట్టు యుద్ధం ఇంకో ఎత్తు. ఇంకా చెప్పాలంటే ఇటువంటి యుద్ధాన్ని బహుశా ప్రపంచ చరిత్రలోనే ఎవరూ కనీవినీ ఉండరు!

యుద్ధాల్లో సాధారణంగా ఏమి జరుగుతుంది? శత్రువు పైకి సైన్యంతో దండెత్తి వెళ్ళిన వారు తమకు అన్నివిధాలా అనువైన స్థలాన్నీ, సమయాన్నీ యుద్ధానికి ఎంచుకుంటారు. తమ బలాన్నీ, బలహీనతనూ గుర్తెరిగి వాటికి తగినట్టుగా యుద్ధ వ్యూహం రూపొందించుకుంటారు. అన్ని రకాలుగా తమకు అనుకూలమైన పరిస్థితి ఆసన్నమవగానే మెరపులా కదిలి అనుకూలత ఉండగానే అనుకున్నది సాధించబూనుతారు. ఒక వేళ ఊహించని ఉపద్రవమేదో ముంచుకొచ్చి పథకం పల్టీ కొడితే – యుద్ధ ప్రయత్నం విరమించి, సేనలను సాధ్యమైనంత త్వరగా ఉపసంహరించి, సురక్షితంగా బయటపడటం ఎలాగన్న దాని మీద దృష్టి కేంద్రీకరిస్తారు. తప్పకపోతే అవమానకరమైన షరతులకు సైతం ఒడంబడి, సంకటం నుంచి బయటపడ్డాక మళ్లీ బలాలు సమీకరించుకుని దెబ్బకు దెబ్బ తీసే విషయం ఆలోచిస్తారు.

1761లో మరాఠాలు చేసింది ఇందుకు పూర్తిగా విరుద్ధం! యుద్ధంలో ఏవేవి చెయ్యాలో అవేవీ మరాఠాలు చేయలేదు. ఏవేవి చేయకూడదో అవన్నీ చేశారు. శత్రువు చిక్కుల్లో ఉన్నంతకాలమూ దాడి చేయకుండా కాలయాపన చేసి, పరిస్థితి తలకిందులై తాము చిక్కుల్లో పడ్డాక అనువుగాని చోట, అనువుగాని వేళ, అనువుగాని రీతిలో భీషణ సంగ్రామానికి దిగారు.

యుద్ధంలో జయాపజయాలు ఎప్పుడూ దైవాధీనమే. కాని ఎవరైనా గెలవాలనే పోరాడుతారు. గెలిచి తీరుతామన్నప్పుడే ఎవరైనా యుద్ధం మొదలెడతారు. కాని పానిపట్టులో గెలిచే ఆశ లేదని, మరణం తథ్యమని తెలిసే మరాఠాలు మహా యుద్ధం ప్రారంభించారు. వీర మరణం కోసమే రణంలోకి దూకారు!

మహా బలవంతుడైన పాపిష్టి శత్రువు తమను చుట్టు ముట్టాక, యుద్ధాన్ని నివారించేందుకూ, క్షేమంగా, పరువుగా బయటపడేందుకూ దారి లేనప్పుడు – చస్తామని తెలిసీ వెర్రి తెగింపుతో యుద్ధం చేసి నేల కొరిగిన రాజపుత్రుల వంటి వీరుల గాథలు మనకు తెలుసు. ఖిల్జీ, అక్బర్ వంటి సైతానులు కోటను ముట్టడించి, సరఫరాలను అడ్డగించి లోపలి వారిని ఆకలి దప్పులతో మాడ్చినప్పుడు గత్యంతరం లేక – దుర్గ రక్షకులు కోట తలుపులు తెరుచుకుని శత్రుసైన్యం మీదికి ఉరికి, వీలైనంత మందిని చంపి తాము హతమైన ఉదంతాలు చిత్తోడ్ వంటి చోట్ల అనేకం జరిగాయి. కాని – విశాల మైదాన ప్రాంతంలో యుద్ధంకోసం తాము విడిది చేసిన చోటే లక్షల జనం ఆకలిదప్పులతో అలమటించి, ఆ బాధకు తాళలేక అన్నివిధాల ప్రతికూల పరిస్థితుల్లో ఎటుచూసినా ప్రతిబంధకాలతో మహా సమరానికి ముందుకురకటం ఒక్క పానిపట్టులోనే సంభవించింది.

ఇంకా ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే – అంతటి విధి వైపరీత్యంలో, కాలే కడుపులతోనే మరాఠా వీరులు మహాద్భుతంగా పోరాడారు. ఆ సమయంలో వారికి శత్రుపక్షంలో ఉండి, యుద్ధాన్ని ప్రత్యక్షంగా తిలకించిన కాశీరాజా పండిట్ ఉల్లేఖించిన ఈ కింది వాక్యాలు మరాఠా సేనలను నడిపించిన సదాశివరావు భావు, విశ్వాసరావుల అసమాన శౌర్య ప్రతాపాలకు మచ్చుతునక.

In the centre of the line, the Bhow with Biswas Row... charged the division of the Grand Vizier. The Mahrattas broke through a line of ten thousand horse, seven thousand Persian Musketeers and one thousand camels... ...I found the Grand Vizier in an agony of rage and despair, reproaching his men for quitting him. "Our Country in far off, my friends" said he, "Whither do you fly?" but no one regarded his orders or exhortations. Seeing me, he said, "ride to my son Shuja-ul-Dowlah,

and tell him, that if he does not support me immediately, I must perish".

[*An Account of the Last Battle of Panipat, by* **Casi Raja Pundit Tr.by H.G. Rawlinson,** *p. 36-37*]

(యుద్ధ శ్రేణి నడిమధ్యలో భావు, విశ్వాసరావులు అబ్దాలీ ముఖ్య వజీరు బలగం మీదికి సేనలను ఉరికించారు. పదివేల గుర్రాలను, ఏడువేల పర్షియన్ తుపాకి దళాన్ని, వెయ్యి ఒంటెలను ఛేదించుకుని మరాఠాలు చొచ్చుకు వెళ్ళారు... పెద్ద వజీరు సైనికులు అతడిని వదిలేసి పారిపోసాగారు. ఆయన ఆగ్రహంతో, ఆక్రోశంతో 'ఎక్కడికి పారిపోతున్నారు మీరు? ఇక్కడికి మన దేశం చాలా దూరం' అని కేకలేస్తున్నా ఎవరూ లక్ష్యపెట్టలేదు. వజీరు నన్ను చూడగానే, 'మా అబ్బాయి షుజా ఉల్ దౌలా దగ్గరికి వెంటనే వెళ్లు. అతడు కనక వెంటనే నాకు సాయపడకపోతే నేను నాశనమవుతానని చెప్పు' అన్నాడు.)

అబ్దాలీ వంటి మహాయోధుడి సారథ్యంలో రణరంగాన ఒక పార్శ్వంలో మోహరించిన పదివేల గుర్రాల, ఏడువేల తుపాకుల, వెయ్యి ఒంటెల రక్షణ శ్రేణిని ఛేదించుకుని వెళ్ళి వీరవిహారంతో శత్రుసేనను కకావికలం చేయగలిగారంటే మరాఠాల సైనిక బలం, పరాక్రమం ఎంత గొప్పవై ఉండాలి? 'దేశం కాని దేశంలో ఎక్కడికి పారిపోగలరురా మీరు' అని పెద్ద వజీరే నెత్తి కొట్టుకోవలసిన పరిస్థితి తెచ్చిపెట్టగలిగి కూడా సదాశివరావు సేన ఘోరంగా ఓడి ఊచకోతకు గురయింది? నాటికి ఎన్నో భీకర యుద్ధాల్లో వరసగా ఘన విజయంసాగిస్తూ వచ్చిన మరాఠా శక్తికి పానిపట్టులో ఘోర పరాజయం సంప్రాప్తించడానికి కారణభూతమైన పరిస్థితులేమిటి? ఆకలి చావు కంటే యుద్ధంలో చావు మేలనుకునే దయనీయ సంకటానికి మహావీరుల మహా సైన్యాన్ని నెట్టటంలో ఎవరి బాధ్యత ఎంత?

స్వదేశీ, విదేశీ చరిత్రకారులు పలువురు తప్పంతా సేనా నాయకత్వం వహించిన సదాశివరావుదేనని, అతడు దూరాలోచన లేకుండా దుడుకుగా వ్యవహరించి, మేరలేని అహంభావంతో ముఖ్య సర్దార్లను అవమానించి, వారి హితవులను వినకుండా తప్పుడు నిర్ణయాలు వరసగా చేయటం వల్లే పానిపట్టులో అలా జరిగిందని తేల్చారు. సదాశివరావు వంకలేని సేనాని ఏమీకాదు. అతడి లోపాలు అతడికున్నాయి. కాని వాటిని మాత్రం చూపి పానిపట్టు పరాభవం మొత్తానికీ అతడొక్కడినే పాపాల భైరవుడని చిత్రించటం అన్యాయం. కర్ణుడి చావుకులాగే పానిపట్టు పరాజయానికి అనేక కారణాలున్నాయి. వాటిలో చాలా భాగం సేనాపతి అదుపులోలేనివి. లేదా అతడితోబాటు పీష్వాకూ, ఇతర మరాఠా పెద్దలకు ప్రమేయం ఉన్నవి. ఒక్క మాటలో చెప్పాలంటే పానిపట్టులో తటస్థించింది మరాఠా నాయకత్వ సమష్టి వైఫల్యం.

సేనా నాయకుడి ఎంపిక దగ్గరనుంచి యుద్ధవ్యూహం వరకూ చరిత్రకారులు తప్పుపట్టిన కీలక నిర్ణయాలన్నీ మరాఠా అగ్రనాయకులు కలిసి చేశారు. దక్కనులో సదాశివరావు సేనలు దిగ్విజయంగా జైత్రయాత్ర సాగించి, నిజాం కంచుకోటను పగులగొట్టి, కర్ణాటకలో ఘన విజయాలు సాధించి, మరాఠా కత్తికి ఎదురు లేదని మురిసి పోతున్న సమయంలో పీష్వా బాలాజీరావుకు ఉత్తరాది నుంచి వరసగా దుర్వార్తలు వచ్చాయి. రఘునాథరావు ఇటు ఇంటికి మరలిరాగానే అటు ఆఫ్ఘన్‌రాజు అబ్దాలీ కాలూ చెయ్యీ కూడదీసుకుని,



కుటిల తంత్రం నడిపి అటక్‌ను మళ్ళీ వశపరచుకున్నాడు. లాహోర్‌ను తిరిగి లాక్కున్నాడు. పెషావర్‌లో రఘునాథరావు కాపలాకు పెట్టి వచ్చిన అబ్దుస్ సమద్‌ఖాన్ నమ్మక ద్రోహం చేసి మళ్ళీ అబ్దాలీకి దాసోహమన్నాడు. పంజాబ్ రక్షణకు సాబాజీ సింధియా ఎంత వీరోచితంగా పోరాడినా అబ్దాలీ మహాసైన్యం ధాటికి నిలవలేకపోయాడు. పంజాబ్ చేజారిపోవడమే పెద్ద దెబ్బ అనుకుంటే దానికి మించిన నష్టం నజీబ్‌ఖాన్ నమ్మకద్రోహం మూలంగా ఢిల్లీ వద్ద మరాఠా బొబ్బిలి దత్తాజీ సింధియా ఘోర పరాజయంపాలై యుద్ధంలో నేలకొరగడం! ఈ అపజయాల పరంపరతో కల కరిగింది. ఉత్తర భారతం మళ్ళీ అబ్దాలీ బారిన పడి కథ మొదటికి వచ్చింది. సమర్థుడైన సేనాపతిని పెద్ద సైన్యంతో తక్షణం ఉత్తరాదికి పంపిస్తే తప్ప అబ్దాలీ బెడదను తట్టుకొనజాలమని పీష్వాకు ఆర్తనాదాల వర్తమానాలందాయి. మహావీరుడు దత్తాజీ వధకు ప్రతీకారం చేసి తీరాలని మరాఠా సర్దార్లందరూ ముక్తకంఠంతో అన్నారు.

అదిగో ఆ పూర్వరంగంలో ఉత్తరాదికి ఎవరిని పంపాలి, కొత్త సవాళ్లను ఎలా ఎదుర్కోవాలి అన్నది తేల్చడానికి బాలాజీ పీష్వా ముఖ్యులందరినీ 1760 మార్చిలో పాతదూర్‌లో సమావేశపరిచాడు. వారంరోజులపాటు పాత తప్పులను, తప్పటడుగులను రేయింబవళ్లూ చర్చించి, ప్రస్తుత పరిస్థితిని సింహావలోకన చేసిన అనంతరం పెద్దలందరూ కలిసి సదాశివరావు భావు నేతృత్వంలో ఉత్తరాదికి దండయాత్ర చేయాలని నిశ్చయించారు. అంతకు కొన్ని నెలల కిందటే ఉత్తరాదికి తరలి, అటక్ మీదా జండా పాతి వచ్చిన పీష్వా తమ్ముడు రఘునాథరావునే మళ్ళీ ఎందుకు పంపలేదు? అతడి ఆర్భాటంవల్ల చేతి చమురు వదిలి, సైన్యానికి 88 లక్షల రూపాయలు జీతం బకాయి పడటమే తప్ప లాభం సున్న అని తేలినందుచేత! ఉత్తర హిందూస్థానంలో హోల్కర్, సింధియాల వంటి మరాఠా ముఖ్య సర్దార్ల విరోధాలను, వైరుధ్యాలను అదుపుచేసి సమన్వయ పరచటం రఘునాథరావు వల్ల కాలేదని స్పష్టమైనందువల్ల! అతడి దండగమారి దండయాత్ర నిర్వాకాన్ని సదాశివరావు ఎత్తి పొడవటం చేతే అతడు అలిగి మళ్లీ సేనా నాయకత్వానికి కోరినా ఒప్పుకోలేదని అతడి మనస్తాపాన్ని అర్థం చేసుకోకుండా అంతటి కార్యశూరుడిని వదిలేసుకుని, ప్రగల్భాల సదాశివరావును నెత్తికెత్తుకోవటం తప్పయిందని కొందరు చరిత్రకారులు అంటారు. కాని పూర్వపు దండయాత్రలో రఘునాథరావు అనాలోచిత నిర్ణయాలను, అసమర్థ నిర్వాహకాన్ని, అదే సమయంలో దక్కను రంగాన సదాశివరావు అద్భుత విజయాలను గమనిస్తే మరాఠా పెద్దల నిర్ణయం సరైందేనని విస్పష్టం. జి.ఎస్.సర్దేశాయి అన్నట్టు Sadasivarao was doubtless the fittest leader that the Maratha nation then possessed (ఆ సమయాన మరాఠా జాతికి ఉన్నవారిలో నిస్సందేహంగా సదాశివరావే కడు సమర్థుడైన నాయకుడు).

సేనాపతి ఎంపిక తరవాత తేల్చుకోవలసింది యుద్ధం చేసే పద్ధతి, సైనిక వ్యూహాల గురించి. అంతదాకా మరాఠాలు ముఖ్యంగా అనుసరిస్తూ వచ్చింది సాంప్రదాయక గెరిల్లా యుద్ధ పద్ధతి. ప్రతిచెట్టూ పుట్టా రాయీ రప్పా తమకు క్షుణ్ణంగా తెలిసిన కొండకోనల్లో తమ ప్రజల మధ్య శత్రువును తిప్పలు పెట్టి, జవనాశ్వాలతో వెంటాడి, మెరపు దాడులు చేయటానికి శివాజీ కాలంనుంచీ ఆ పద్ధతి మరాఠాలకు ఉపకరించింది. కాని సింధు నది నుంచి బంగాళాఖాతం వరకూ సహజమైన ఏ కనుమలూ, కోనలూ లేని ఉత్తర భారత మైదాన ప్రాంతాల్లో వారికి పరిచయం లేని కొత్త చోట్ల, శత్రుత్వం చూపే ప్రజల మధ్య

అబ్దాలీవంటి కాకలు తీరిన మహాయోధుడి భారీ సైన్యంతో తల పడటానికి గెరిల్లా పద్ధతి అక్కరకు రాదు. బిజాపూర్, మొగలాయి కిరాయి సేనల పీచమణచడానికైతే బాగా పనికి వచ్చిన గుర్రాలబలం అనేక యుద్ధాల్లో ధక్కామొక్కీలు తిని రాటుతేలిన అఫ్ఘాన్ల అశ్వశక్తి ముందు ఎంతవరకు చాలుతుందన్నది ప్రశ్న. పైగా అబ్దాలీకి శతఘ్ని దళం పెద్ద అండ. దానిని తట్టుకోవటానికి మామూలు గెరిల్లా తరహా బలగం సరిపోదు. ఆ సంగతి అంతకుముందు సంవత్సరం మల్హార్‌రావు హోల్కర్, దత్తాజీ సింధియాలను అబ్దాలీ చిత్తుగా ఓడించగలగడాన్ని బట్టే స్పష్టమైంది. కనుక తమకూ దీటైన శతఘ్ని బలం, సుశిక్షితమైన పదాతి దళం ఉంటే గానీ అబ్దాలీతో తలపడలేమని తీవ్ర తర్జనభర్జనల అనంతరం మరాఠా పెద్దలు నిశ్చయానికి వచ్చారు.

ఆ అదనపు హంగులకోసం ఎక్కడో వెదుక్కోవలసిన పని లేదు. కొద్దివారాల కిందట ఉద్గీర్‌లో సరిగ్గా ఆ విధంగానే ఇబ్రహీంఖాన్ గార్ది శతఘ్నుల సాయంతో సదాశివరావు నిజాంపై ఘన విజయం సాధించి ఉన్నాడు. అప్పట్లో దక్కనులో ప్రతి ఒక్కరూ ఔరా అని అబ్బురపడుతున్న ఫ్రెంచి సేనాని బుస్సీ దగ్గర తర్ఫీదు అయిన ఇబ్రహీంఖాన్‌ను తన వద్దకు తెచ్చుకోవటంతో సదాశివరావు అదృష్టం పండింది. దేశానికి కొత్తగా తెలిసిన యూరోపియన్ పద్ధతిలో శతఘ్నుల రక్షణ కవచంతో పోరాడటానికి క్రమశిక్షణ గల పదాతి దళాన్ని సమకూర్చుకోవడమూ దక్కన్ దిగ్విజయంలో సదాశివరావుకు లాభించింది. ఈ అంశాలన్నీ ఆలోచించి, మంచి చెడ్డలు సాకల్యంగా చర్చించాకే శివాజీ కాలపు పాత పద్ధతిని విడనాడి ఆధునిక యూరోపియన్ ఫక్కీలో అబ్దాలీ సవాలును ఎదుర్కోవాలని మరాఠా నాయకత్వం కీలక విధాన నిర్ణయం చేసింది.

అప్పుడున్న పరిస్థితిల్లో అదే సబబు. అయితే ఆధునిక రీతిని అనుసరించాలనుకున్నప్పుడు ఆ ఆధునికత పోరాటంలోని ప్రతి పార్శ్వానికీ ప్రసరించాలి. మారిన పద్ధతికి తగ్గట్టు రణతంత్రాన్ని రూపొందించుకోవాలి. వివిధ బలాలను దానికి అనుగుణంగా మోహరించాలి. దానికి సరిపోయేట్టే యుద్ధ క్షేత్రాన్ని జాగ్రత్తగా ఎంచుకోవాలి. సైన్యం కదలికలకు... సమయానికి తగ్గట్టు ఎత్తుగడలను చప్పున మార్చుకోవడానికి ఇబ్బంది లేకుండా పాత అలవాట్లను విడిచిపెట్టి అనవసరపు బాదర బందీని తొలగించుకోవాలి. కొత్త టెక్నిక్కును ఆకళింపు చేసుకుని ప్రతి అడుగూ దానికి అనుగుణంగా వేయాలి. అసలైన ఈ విషయంలోనే మరాఠాలు పొరబడి అదుసులో కాలేశారు. సర్వానర్థం కొని తెచ్చుకున్నారు.

యుద్ధంలో గెలవటానికి కావలసింది ప్రతాపం... పటాటోపం కాదు. శివాజీ అయినా బాజీరావు అయినా ఏ ఆడంబరం లేకుండానే సాదాసీదాగా సైనికులతో కలిసి, గుర్రాల మీద రోజూ మైళ్లకు మైళ్లు స్వారీ చేసి, చెట్లకింద నిద్రపోయి, ఏది దొరికితే అది తిని ఏక దీక్షగా పోరు సలిపారు. కనకే మహాఘనత వహించిన ఔరంగజేబు చక్రవర్తి, కొమ్ములు తిరిగిన నిజాం ఉల్ ముల్క్ వంటివారు సైతం చతురంగ బలాలలతో ఎంత అట్టహాసం చేసినా మరాఠాల ధాటికి నిలవ లేకపోయారు. ఏనుగులనూ, ఒంటెలనూ, దాసదాసీ పరివారాన్ని, నాట్యగత్తెలను, వంటవాళ్లను వెంటేసుకుని పోవడం వల్లే మొగలాయీలు ఎంత శక్తి ఉండీ మెరపు తీగల్లాంటి మరాఠా అశ్వికుల చేతిలో చిత్తయ్యారు.

చిత్రమేమిటంటే చరిత్ర చెప్పే ఈ ప్రాథమిక పాఠాన్ని కాలక్రమంలో మరాఠాలే మరిచిపోయారు. అధికారం, రాజకీయ ప్రాబల్యం పెరిగేకొద్దీ వారిలోనూ రకరకాల




అవలక్షణాలు చోటుచేసుకున్నాయి. మొగలులను చూసి వీరికీ ఆడంబరం మీద మక్కువ ఎక్కువైంది. దాంతో వారు చేసిన తప్పులే వీరూ చేయసాగారు. ఒక మోస్తరు శత్రువులతో పరిమిత యుద్ధాలు చేసి గెలిచినంతవరకూ, వృథా పటాటోపం వల్ల పెద్దగా నష్టంలేకపోయింది. దురదృష్టవశాత్తూ ఆ పటాటోపమే పానిపట్టులో మరాఠాల కొంప ముంచింది.

పాతదూరులో మేధోమథన సమావేశానంతరం సదాశివరావు భావు నేతృత్వంలో అబ్దాలీపై కదనానికి కదిలిన మరాఠా సైన్యపు వైభవాన్ని సుప్రసిద్ధ చరిత్రకారుడు గ్రాంట్‌డఫ్ ఇలా వర్ణించాడు :

The equipment of this army was more splendid in appearance than any Mahratta force that ever took the field. The lofty and spacious tents, lined with silks and broad cloths, were surmounted by large gilded ornaments, conspicuous at a great distance... Vast numbers of elephants, flags and all those accomplishments of an Indian army... seemed to be collected from every Quarter... cloth of gold was the dress of the officers, and all seemed to vie in profuse and gorgeous display... It was imitation of the... magnificient Moghuls in the zenith of their glory.

[***History of the Marathas,*** **James Grant Duft,** *Vol. II. p. 100*]

(మునుపు యుద్ధానికి కదలిన మరాఠా సేనలన్నిటికంటే ఎక్కువగా ఈ సైన్యం సామగ్రి కళ్లకు మిరుమిట్లు గొల్పుతుంది... చాలా ఎత్తయిన, విశాలమైన డేరాలు, వాటికి పట్టుకుచ్చుల లైనింగులు, నగిషీలు చెక్కిన వస్త్రాలంకరణలు ఎంత దూరానికైనా కొట్టొచ్చినట్టు కనిపిస్తాయి... భారతీయ సైన్యానికి హంగులనుకునే ఏనుగుల మందలు, జండాలు, వగైరాలను అన్నివైపులనుంచీ సేకరించినట్టుంది... సైన్యాధికారులు బంగారు పూతగల యూనిఫారం ధరించారు. దాంబిక ప్రదర్శనల్లో వారు పోటీలు పడ్డారు... సామ్రాజ్యం ప్రభ మహోజ్వలంగా వెలిగిపోయిన కాలంలో మొగలుల తీరుకు ఇది అనుకరణ).

డేరాలకు జరీ కుచ్చులు, సైనిక దుస్తులకు బంగారు నగిషీల వంటి విలాసాలతోటే ఆగితే చెప్పుకోవలసిన పనే లేదు. జిగేలు మనిపించే ఈ డాబుదర్పాలకంటే వెయ్యింతలు అనర్థహేతువైన బాదరబందీ – మరాఠా మందీ మార్బలంలో ఉంది. చివరికి అదే వినాశానికి దారితీసింది.

# లంపటం తెచ్చిన సంకటం

**యుద్ధంలో జరిగేది వీర విహారమే. కాని–యుద్ధానికి వెళ్లటమంటే విహార యాత్ర చేయటం కాదు. కదనానికి కావలసినవి సైనికులూ, ఆయుధాలూ, వాహనాలే తప్ప పనివాళ్లూ వంటవాళ్లూ ప్రియురాళ్లూ కాదు. కుటుంబ పరివార సమేతంగా తరలి వెళ్లటానికి – యుద్ధం అనేది పెళ్లికాదు; పిక్నిక్కు కాదు.**

*ఈ కామెన్‌సెన్సు పాయింటే 18వ శతాబ్ద ద్వితీయార్థంలో మరాఠా నాయకులకు అర్థం కాలేదు. అర్థమయ్యేసరికి దారుణమైన అనర్థం జరిగిపోయింది.*

మరాఠా పౌరుషానికి మూల పురుషుడైన శివాజీ క్రమశిక్షణలో మహానిక్కచ్చి. యుద్ధం ఖర్చును యుద్ధం నుంచే రాబట్టాలన్నది ఆయన నీతి. వానాకాలం ఎవరి ఊళ్లో వారు వ్యవసాయమో మరొకటో చేసుకుని పిల్లా పాపలతో ఇంటి పట్టున ఉన్న సాధారణ జనులే వర్షాలు వెనకబట్టాక సైనిక దుస్తులు ధరించి గుర్రమెక్కి ఛత్రపతి వెంట యుద్ధానికి కదిలేవారు. ఒకటో రెండో జతల దుస్తులు, పరిమితంగా తినుబండారాలు మాత్రమే చిన్న సంచిలో వెంట తీసుకుని వెళ్లేవారు. దండయాత్రలో గెలిచిన ఊళ్లను కొల్లగొట్టి, నగలు, నగదు, తేలికగా తీసుకుపోగలిగిన విలువైన వస్తువులు మాత్రమే దోచుకుని మరోచోటికి కదిలేవారు. దోచినదంతా నాయకుడికి సమర్పించి, కుటుంబ ఖర్చులకు సమృద్ధిగా సరిపోయేంతలా ఆయన ఇచ్చినది తీసుకుని, మళ్లీ వానాకాలం నాటికి సంతోషంగా స్వస్థలాలకు చేరుకునేవారు. ఎంతటి దుర్గమ ప్రాంతాల్లోనైనా రివ్వున దూసుకుపోయే తేలిక పాటి గుర్రాల మీద, అతి తక్కువ సరంజామాతో, మెరపుదాడులు చేసే – మరాఠా వీరులు ఎన్నో మహా విజయాలను సాధించగలిగారు.

శివాజీ పెట్టిన ఒరవడి బాజీరావు కాలం వరకూ దివ్యంగా కొనసాగింది. ఆ తరవాత మొగలాయీ అవలక్షణాలు కొన్ని మరాఠాలనూ ఆవహించాయి. పెద్ద సైన్యంతో ఘన విజయాలను వరసగా సాధించడంతో తమ శక్తి అజేయమన్న ధీమా వారికి కలిగింది. సంవత్సరంలో హెచ్చు కాలం దండయాత్రల్లోనే గడిపేటప్పుడు, ఆ కాలమంతా అయిన వాళ్లకు దూరంగా, కట్టుబట్టలతో చెట్ల కింద ఎందుకు కష్టాలు పడాలి అన్న తలంపు వచ్చి సుఖాల మీదికి గాలి మళ్లింది. భార్యలు కూడా వెంబడి ఉంటే సైనికులు ఇంకా హుషారుగా పోరాడగలరన్న అభిప్రాయంతో మొదట అర్ధాంగులకు అనుమతి అభించింది. తల్లుల వెంట బిడ్డలు సరేసరి. మామూలు సైనికుడి భార్యయితే తన వంట, తనపని తాను చేసుకోగలదు. పెద్ద సేనానుల, గొప్ప సర్దార్ల దొరసానుల విషయంలో అలా కుదరదు. వారు కదిలారంటే వారి హోదాకు తగ్గట్టు అన్నీ అమర్చి పెట్టడానికి సేవకులు, వంటవాళ్లు తప్పనిసరి. గొప్పింటివాళ్ల అవసరాలకు కావలసివచ్చే సరుకులను అమ్మటానికి వ్యాపారులూ హాజరులో ఉండాలి. ఆయా సరుకుల సరంజామాలను మోయటానికి గాడిదలూ, పనివాళ్లూ కావాలి. ఇలా గ్రంథం పెరిగి పెరిగి చివరికి యుద్ధంలో పోరాడే సైన్యం కంటే వెంట వెళ్లే అమాంబాపతుల జనం సంఖ్య మూడింతలు దాటింది. అది రకరకాల అనవసరపు చిక్కులకు కారణమైంది.

1761 పానిపట్టు యుద్ధంలో మరాఠాల పక్షాన ఉన్నది 45వేల అశ్వబలం; 15 వేల పదాతి దళం. అంటే పోరాడేవారు వెరశి 60 వేలు. కాగా వెంట వెళ్లిన భార్యలు, బిడ్డలు, వ్యాపారులు, సేవకులు, గుమాస్తాలు వగైరాల సంఖ్య దీనికి దాదాపు మూడురెట్లు!

> ... although the Maratha assemblage at Panipat numbered about 2 lacs of souls, quite two thirds of these were non-combatants, being personal servants, clerks, shopkeepers and other non-descript people.
>
> *(పానిపట్టులో మరాఠాల సంఖ్య సుమారు 2 లక్షలు అయినా, ఇందులో మూడింట రెండు వంతుల మంది పరిచారకులు, గుమాస్తాలు, దుకాణదారులు, ఇతరులూనూ)*
>
> [*New History of Marathas*, G.S. Sardesai, *Vol. II. p. 417*]

నిజమే, ఇలా కుటుంబ పరివార సమేతంగా యుద్ధాలకు వెళ్లటం మరాఠాలతోటే మొదలుకాలేదు. అంతకుముందు కృష్ణదేవరాయల కాలం నుంచీ ఇలా తిరునాళ్ల వలె జైత్రయాత్రలకు తరలి వెళ్లే ఆనవాయితీ ఉన్నట్టు చరిత్ర చెబుతుంది. కాని కృష్ణరాయల నాటి యుద్ధాలు వేరు; పరిస్థితులు వేరు. అంగళ్లలో రతనాలు రాసుల పోసి అమ్మిన సిరిపంపదల కాలంలో ఎన్ని లక్షల మందిని ఎన్ని సంవత్సరాలైనా ఏ లోటూ లేకుండా పోషించి శత్రువుల బారినుంచి సంరక్షించి క్షేమంగా వెనక్కి తీసుకురాగలిగిన శక్తిసామర్థ్యాలు ప్రభువులకు ఉండేవి. సమయం, స్థలం జాగ్రత్తగా ఎంచుకుని సాగించే జైత్రయాత్రల్లోనే తప్ప సుల్తాన్లతో ఆకస్మిక యుద్ధాలకు నారీ జనాన్ని, నటవిట కవి గాయక గణాన్ని కృష్ణదేవరాయలు కూడా వెంట పెట్టుకుపోలేదు.

1760 నాటి మరాఠాలకు అలాంటి ఆర్థిక పుష్టి లేదు. వారు సాగించింది సాధారణ జైత్రయాత్రా కాదు. అంతకు కొద్దినెలల ముందే రఘునాథరావు ఉత్తరాది దండయాత్ర నుంచి ఉత్త చేతులతో, సైన్యానికి మోపెడు వేతనాల బకాయిలతో తిరిగి వచ్చాడని, ఆర్థిక సమస్యల్లో మునిగి ప్రభుత్వాన్ని ఏ విధంగానూ ఆదుకోలేకపోయాడనీ పీష్వా మొదలుకుని మామూలు మున్షీ వరకూ అందరూ విసుక్కుంటున్నారు. అంతలోనే సుడిగాలిలా విరుచుకుపడ్డ

అఫ్ఘన్‌షా అబ్దాలీని నిలువరించటానికి మళ్లీ దండెత్తవలసి వచ్చింది. సైనికుల జీతాలే సరిగా చెల్లించలేని పరిస్థితుల్లో స్త్రీలనూ, సేవకులనూ కూడా తోడ్కొని వెళ్లాలంటే ఇంకా బోలెడు ఖర్చు. పైగా పోయేది – చుట్టూ విరోధులే ఎక్కువగా ఉండే ఉత్తర హిందుస్థానానికి! అననుకూల ప్రదేశాల్లో ఇంత మందికి తిండి, నీరు బస సమకూర్చేసరికి తల ప్రాణం తోకకొస్తుంది. పైగా మత ద్వేషంతో రగిలే విదేశీ ముసల్మాన్ల రాకాసి మూకతో తలపడేటప్పుడు ఈ నిరాయుధ నారీ జనానికి రక్షణ కల్పించటం చాలా పెద్ద సమస్య.

ఇవన్నీ మరాఠా పెద్దలకు తెలియక కాదు. కానీ – దక్షిణాదిన అద్భుత సైనిక విజయాలను అప్పుడే సాధించిన ఉత్సాహంలో... యావద్భారతాన తమ కత్తికి ఎదురు లేదన్న ధీమాతో... మహాపరాక్రమశాలురైన మహావీరులెందరో తమ పక్షాన బారులుతీరి ఉన్నారన్న భరోసాతో... శత్రు దుర్భేద్యమైన ఇబ్రహీంఖాన్ భారీ శతఘ్ని దళం రక్షా కవచంగా ఉన్నంతవరకూ ఏ పఠాన్ సేనా తమను ఏమీ చేయజాలదన్న అతి విశ్వాసంతో... సేనకూ పరివారానికీ నిత్యావసరాలన్నిటినీ యుద్ధాల్లో కొల్లగొట్టే అపార ధనం నుంచి అవలీలగా వెళ్లదీయగలమన్న ఆశాభావంతో వారు తమ తాహతును అతిగా ఊహించుకున్నారు. ముందు గతిని కానలేకపోయారు.

సరే ! భార్యబిడ్డలను, సేవక గణాన్ని వెంట తీసుకుపోతే పోయారు. దేశాంతరంలో భీకర సంగ్రామానికి ఉపక్రమించబోయే ముందు ఈ జనాభా అంతటినీ సురక్షిత స్థలంలో వదిలివెళ్లటం మేలు కదా? దేశం కాని దేశంలో అటువంటి ఆదరువు దొరకకపోతే వేరే సంగతి. తమకు మిత్రుడైన ఒక ప్రభువు తన రాజ్యంలో ఈ జనమంతటికీ ఆశ్రయం ఇచ్చి లోటు లేకుండా జాగ్రత్తగా చూసుకుంటానని చెప్పినప్పుడైనా సావకాశాన్ని దొరకపుచ్చుకోవాలి కదా?

మరాఠాలు ఆ పనీ చేయలేదు. 1760 మార్చి 14న పాతదూరు నుంచి బయలుదేరిన సదాశివరావు భావు సైన్యం జూలై మధ్యలో గ్వాలియర్, ఆగ్రాల మీదుగా మధురకు చేరింది. అక్కడి జాట్ ప్రభువు సూరజ్ మల్ అబ్దాలీకి బద్ధ విరోధి. మరాఠాలకు మిత్రుడు. అబ్దాలీపై పోరులో పదివేల సేనతో సాయపడతానని హామీ ఇవ్వడంతో బాటు మీ స్త్రీలను, పోరుకు అవసరంలేని ఇతర జనాన్ని నా దగ్గర ఉంచి వెళ్లండి; జాగ్రత్తగా కాపాడతానని ఆయన స్వచ్ఛందంగా ముందుకొచ్చాడు. పానిపట్టు యుద్ధానికి ప్రత్యక్షసాక్షి అయిన **కాశీరాజా పండిట్** మాటల్లో...

> As soon as the army of the Mahrattas approached to Agra, Surja Mul paid his respects to the Bhow; and said"... ... the Families of the chiefs and soldiers, the large train of baggage and the heavy artillery will be great impediments to carrying on the kind of war which you have now in hand... I will put you in possession of one of the large forts in my country, Deig, or Combeir or Burtpoor, in which you may lodge the baggage and followers; and I will join you with all my forces..."
>
> **[*An Account of the last Battle of Panipat by* Casi Raja Pundit, Tr. by. H.G. Rawlinson, *pp. 6,7*]**



(మరాఠా సైన్యం ఆగ్రా చేరగానే సదాశివరావు భావుకు ప్రణామాలర్పించి సూరజ్‌మల్ అన్నాడు. ... "దండ నాయకుల, సైనికుల కుటుంబాలు, విపరీతంగా ఉన్న సమాన్లు, భారీ శతఘ్నులు మీరిప్పుడు చేయబోయే యుద్ధానికి పెద్ద ప్రతిబంధకాలు... మాదేశంలో దీగ్‌లోనో, కుంభేర్‌లోనో, భరత్‌పూర్‌లోనో విశాలమైన కోటను మీకు అప్పగిస్తాను. దానిలో మీ సామాన్లను, అనుచరులను విడిచి చేయించవచ్చు. నా సకల బలగాలతో నేను మీ వెంట వస్తాను...")

మల్హర్‌రావు, సింధియాల వంటి మరాఠా ముఖ్యులూ సూరజ్‌మల్ సలహాను బలపరచారు. ఆదినుంచీ మరాఠాలకు గుర్రమే మూల బలం. వడిగా పరిగెత్తి మెరుపు దాడులతో శత్రువును వేధించి వేటాడే సావకాశం భారీ శతఘ్నులు, భారీ పరివారం వెంట ఉంటే కుదరదు. పెద్ద శతఘ్నిని రంగంలో అమర్చుకోవటానికే చాలా సమయం పడుతుంది. ఒకసారి అమర్చాక వేరేచోటికి వేగంగా తీసుకుపోవటం సాధ్యపడదు. అశ్వబలంలో మరాఠాలకు సరిఉజ్జీ అయిన అఫ్ఘాన్లతో పోరాటానికి జవనాశ్వాలే తప్ప భారీ శతఘ్నులు పనికిరావని మల్హర్‌రావు మొదటినుంచీ మొత్తుకుంటున్నాడు. అయితే పాత పద్ధతులను పాటించి ఉత్తరాదిన కొద్దికాలం కిందటి యుద్ధాల్లో మల్హర్‌రావు ఊడబొడిచిందీ ఏమీలేదు. పైగా సూరజ్‌మల్‌ను నమ్మి మొత్తం పరివారాన్ని, సామాన్లను అతడికి అప్పగిస్తే ఏమవుతుందోనన్న భయమూ భావుసాహెబ్‌కు ఉంది. తనకు పరిచయం లేని కొత్త ప్రాంతాల్లో ఎంతవరకు సురక్షితమో తెలియని చోట స్వజనాన్ని విడిది చేయించేకన్నా వెంటనే ఉంచుకుని శతఘ్నుల రక్షణలో కాపాడటం మంచిదని అతడికి తోచింది.

దానికి తగ్గట్టే తొలి దశలో అన్నీ భావుసాహెబ్‌కు అనుకూలంగానే జరిగాయి. యమునకు ఆవలి ఒడ్డున అబ్దాలీ సైన్యం ఉంది. వరద ఉధృతి కారణంగా నది దాటి అతడి మీదికి ఎకా ఎకి లంఘించటం వీలుకాకపోవటంతో మరాఠా సేన దారిమరలి ఢిల్లీ మీదికి వెళ్లింది. ముఖ్యంగా ఇబ్రహీంఖాన్ ఫిరంగుల దాడివల్లే ఢిల్లీకోట మరాఠాల వశమైంది. అప్పటికే దోపిడిల పరంపరతో సర్వస్వం నష్టపోయి ఉన్న ఢిల్లీ రాజప్రాసాదంలో సభా మందిరానికి గల వెండి లోకప్పును కూల్చి కరగిస్తే 17 లక్షల రూపాయలు భావుసాహెబ్‌కు గిట్టుబాటయింది. దాంతో ఆర్థిక ఇక్కట్లు తగ్గాయి. అటునుంచి 78 మైళ్ల దూరంలో యమున ఒడ్డున గల కుంజపురా మీదికి దండెత్తినప్పుడూ మళ్లీ ఇబ్రహీంఖాన్ ఫిరంగుల వల్లే అబ్దాలీ సేన చేతిలోని కోట సదాశివరావుకు వశమైంది. కోట రక్షణకు అబ్దాలీ నిలిపి ఉంచిన పదివేల పఠాన్ సేనను మరాఠాలు ఊచకోత కోశారు. తన సైన్యానికి అవసరమైనప్పుడు వాడుకోవటానికి ఆ కోటలో అబ్దాలీ నిలువ చేయించి ఉంచిన ధన, వస్తు, ధాన్య సంపద మరాఠాల చేతికి చిక్కింది. దాంతో కరువు తీరి, అందరి ముఖాలూ కళకళలాడాయి. యుద్ధం ముగించి అబ్దాలీని ఓడించి ఇంటికి వెళ్లేంతవరకూ తమ అవసరాలకు ఏలోటూ ఉండదనే అంతా అనుకున్నారు. తన స్థావరాన్ని కొల్లగొట్టి, వేల సంఖ్యలో తన సైనికులను మరాఠాలు నరికేస్తున్నా ఏమీ చేయలేక ఆవలి ఒడ్డున పళ్లుకొరుకుతూ ఉండి పోయిన అబ్దాలీషా ఆ క్షణాన వంటింటి కుందేలుగానే మరాఠాల కంటికి కనపడ్డాడు. ఎక్కడవీలైతే అక్కడ నది దాటి అతడిపైకి లంఘించి శృంగభంగం చేయటమే తరువాయి!

ఇలా మరాఠాలకు ఆత్మవిశ్వాసం అతిశయించిన సమయంలోనే వారి అదృష్టం వక్రించింది. భయంకరమైన కష్టకాలం మొదలైంది.

ఢిల్లీ నుంచి మొదలుపెట్టి యమునా నది కుడి ఒడ్డు పొడవునా నది దాటటానికి పాటిరేవు కోసం గాలిస్తూ పోయినా 78 మైళ్లదూరంలోని కుంజపురా వరకూ మరాఠాలకు ఎక్కడా వీలూ చాలూ కనిపించనే లేదు. తమకు వీలు దొరకలేదు కనుక ఒడ్డు నుంచి అబ్దాలీ కూడా తమవైపు రాజాలడని వారు అనుకున్నారు. ఆ నమ్మకంతోటే – వెనుకనుంచి శత్రువు తరుముకొస్తాడన్న భయం లేకుండా ఎంతసేపూ ఎదురుదాడి మీదే ధ్యాసతో నదిని దాటటానికి పాటిరేవును గాలిస్తూ ఎగువకు కదిలారు.

అలోగా వారు ఊహించనిది జరిగింది. కుంజపురా కూలడంతో అబ్దాలీ అగ్గిరాముడయ్యాడు. "ఈ మరాఠా కాఫిర్ల ధిక్కారాన్ని చూస్తూ ఊరుకోపడానికి వీల్లేదు. ప్రాణం పోయినాసరే వారి అంతు చూడాల్సిందే" అని సైనికులను ప్రేరేపించి కాలనాగులా కదిలాడు. యమున ఎడమ ఒడ్డున తాను విడిది చేసిన స్థలం నుంచి వెదుక్కుంటూ పోతే ఢిల్లీకి ఉత్తరాన 20 మైళ్ల దూరంలోని భాగ్‌పట్ వద్ద పాటిరేవు అతడికి కనిపించింది. వరద ఉధృతంగా ఉన్నందువల్ల అక్కడ నదిని దాటటం ఎంత సాహసికైనా ధైర్యం చాలని పని. మధ్య ఆసియాలో ప్రమాదకరమైన నదీ నదాలను దాటటంలో ఆరితేరిన అబ్దాలీకి పగతో రగులుతున్న ఆ సమయంలో వెర్రి తెగింపు వచ్చింది. గుర్రం కట్టువిప్పి నదిలోకి దూకించి అతి కష్టంమీద ఆవలి ఒడ్డుకు చేరాడు. అతణ్ని చూసి సైనికులూ సాహసించారు. పలువురు ప్రవాహంలో కొట్టుకుపోయారు. కాని అత్యధిక సంఖ్యాకులు క్షేమంగా ఆవలికి చేరారు. మూడురోజుల్లో మొత్తం సైన్యాన్ని అబ్దాలీ అవతలి ఒడ్డుకు చేర్చగలిగాడు. అక్కడి నుంచి మరాఠాలను మహావేగంగా వెంబడించాడు.

ఇది ఊహించని పరిణామమే. అయినా భావు సాహెబ్ తొట్రు పడలేదు. పైగా – తనకు నది దాటే శ్రమ తగ్గించి శత్రువే తన చెంతకు వచ్చి చేతికి చిక్కుతున్నందుకు సంతోషించాడు. రెట్టించిన ఉత్సాహంతో వెనక్కి మరలి, తనకు అన్నివిధాల అనువైన పానిపట్టు వద్ద దండు విడిశాడు. 1760 అక్టోబరు చివరిలో ఇరు సేనలూ కనుచూపుమేరలో తారసపడ్డాయి. కొత్తచోట కుదుటపడేలోపే శత్రువుపై విరుచుకుపడాలని భావు సాహెబ్ మొదట అనుకున్నాడు... నింపాదిగా ఆలోచిస్తే అది కుదిరే పని కాదని తేలింది. మరాఠాల సైనిక బలాలకి లోటు లేదు. పోరాట పటిమకూ కొదవలేదు. కాని భావు వెంట ఉన్నది సైన్యం ఒక్కటే కాదు. స్త్రీలు, పిల్లలు కూడా పెద్దసంఖ్యలో ఉన్నారు. శత్రుసేనపై భాహాబాహీ తలపడితే వారికి భద్రత ఉండదు. జి.ఎస్.సర్దేశాయి మాటల్లో చెప్పాలంటే.

Bhau Saheb was encumbered with a large number of non-combatants and some ladies; these now formed a drag on him consuming his supplies and requiring protection. If Bhau had only the fighting force with him, he would have easily fought his way through the enemy ranks.

[*New History of Marathas,* **G.S. Sardesai.** *Vol. p. 426*]

(పోరాటం చేయలేని వారు, స్త్రీలు భావు సాహెబ్‌కు పెద్ద లంపటం. అతడి సరఫరాలను స్వాహా చేస్తూ రక్షణను కోరుతూ వారు అతడికి గుదిబండ అయ్యారు. వెంట ఉన్నది పోరాట దళాలు మాత్రమే అయితే, అతడు తేలికగా శత్రు శ్రేణులలోకి చొచ్చుకు వెళ్లగలిగేవాడు).



ఈ పరిస్థితుల్లో సహజంగానే భావు ధ్యాస శత్రువుపై దాడినుంచి ఆత్మరక్షణవైపు మళ్లింది. ఇబ్రహీంఖాన్ సలహామేరకు 6 మైళ్ల వెడల్పు, 2 మైళ్ల పొడవున గుడారాలు, గుడిసెలతో శిబిరం నిర్మించి, చుట్టూ 6 గజాల లోతున పెద్ద కందకాలు తవ్వి, అన్నివైపులా భారీ శతఘ్నులను అమర్చి దుర్భేద్యంగా చేశాడు. అది చూసి అబ్దాలీ కూడా అక్కడ మూడు మైళ్ల దూరంలో అలాగే పక్కా శిబిరం నిర్మించుకుని, కందకాలు తవ్వి, కూల్చిన చెట్లతో బాటలను అడ్డగించి కూర్చున్నాడు. ఇలా ఇరుపక్షాలూ 'అఫెన్సు' మాని 'డిఫెన్సు'లో పడ్డాయి. స్వస్థలాలకు మరలిపోలేకుండా ఒకరిదారిని ఒకరు దిగ్బంధం చేసి, అవతలివారు ఎప్పుడు డీలాపడతారా అని ఇవతలివారు గిరిగీసుకుని కాచుకు కూచోవడంతో చిత్రమైన ప్రతిష్టంభన ఏర్పడింది.

ఈ పరిస్థితుల్లో ముందుగా ఎవరు ఎవరిని ఆకలి దప్పులతో మాడ్చివేయగలిగితే వారికి విజయం లభిస్తుంది. నిత్యావసర సరుకుల నిల్వలు చూస్తే అఫ్ఘాన్ల పరిస్థితి దారుణం; మరాఠాలది సంతృప్తికరం. కుంజపురలో కొల్లగొట్టిన వాటితో కలిపి మరాఠా శిబిరం సర్వసమృద్ధితో వెలిగిపోతున్నది. అటువైపు అబ్దాలీ దగ్గరున్న కొద్దిపాటి నిల్వలతో 40 వేల అశ్వికులు, 40 వేల కాల్బలానికి ఎన్నో రోజులు వెళ్లవు, వారికి ఒకవైపు పరవళ్లు తొక్కే యమున, ఒకవైపు మరాఠా సైన్యం, ఇంకోవైపు మరాఠాలకే ప్రాబల్యంగల దోవాబ్ ప్రాంతం. అటునుంచి ఏ సరఫరాలూ వారికి చేరకుండా అడ్డుకోగల సత్తా ఆ ప్రాంతంలో మరాఠాల ప్రతినిధి గోవింద బల్లాల్ బుందేలాకు ఉంది. ఢిల్లీలోనూ మరాఠాలదే పెత్తనం కనుక అటునుంచీ అఫ్ఘాన్లకు సహాయం అందే ఆస్కారం లేదు. అబ్దాలీ సేన ముందుకు వస్తే మరాఠా శతఘ్నులు ముక్కలు చేస్తాయి. ఉన్నచోటే ఉంటే మరికొద్దిరోజుల్లో ఆకలి చావులు తప్పవు. ఇలా వారికి ముందు నుయ్యి –వెనక గొయ్యి' అని మరాఠాలు మహా సంతోషంగా ఉన్నారు. వారు అనుకున్నట్టే కొన్నాళ్లకు అబ్దాలీ శిబిరంలో హాహాకారాలు చెలరేగాయి. మరాఠా గుర్రాల ప్రతాపానికి అన్ని దారులూ మూసుకుపోవటంతో అఫ్ఘాను తన పని ఖాళీ అనుకుని బేజారయ్యారు.

అన్ని విధాల అనుకూలమైన ఆ సమయంలో 1760 నవంబరు మొదట్లోనే మరాఠాలు శత్రు సేనపై యుద్ధానికి దిగి ఉంటే సునాయాసంగా గెలిచేవారు. కాని, దురదృష్టం! బాబర్ విషయంలో సంగారాణా ఖాన్వా యుద్ధంలో చేసిన తప్పునే పానిపట్టులో సదాశివరావు చేశాడు. తన ఆధిక్యాన్ని, శత్రువు దౌర్బల్యాన్ని అతిగా అంచనా వేసి, విలువైన సమయాన్ని వృథా చేశాడు. శత్రువు ఇంకా డీలా అయ్యాక కదులుదామని రెండు నెలలు అతడు పట్టిగా కూర్చోవడంతో పరిస్థితి తారుమారైంది. కూచుని తింటే కొండలైనా కరుగుతాయి. మరాఠా శిబిరంలో నిల్వలు క్రమేణా హరించుకుపోయి ఆకలి కేకలు ఎక్కువయ్యాయి. పానిపట్టు పరిసరాల్లోని సరుకులు, నిల్వలు అన్నీ అప్పటికే మరాఠాలకు కైంకర్యం అయిపోయాయి. చుట్టూ శత్రు ప్రాంతాలే అవటంతో ఎటునుంచీ సాయం అందే ఆశలేదు. ఈ లోపు గోవింద పంత్ బుందేలాను, అతని అశ్విక దళాన్ని అఫ్ఘాన్లు నిర్మూలించడంతో వారికి దిగ్బంధం తప్పి మరాఠాలకు దిగ్బంధం మొదలైంది.

From 1st November 1760 to 14th January 1761 for full two and a half months the Marathas remained entrenched in their camp and lost whatever chance they at first had of achieving

success, every day that passed making their position worse. They gradually lost heart.... Starvation and death loomed large before everybody's eye. Animals died in large numbers and consequent stench became most obnoxious young and old, leaders and men all urged Bahu Saheb that it was no use waiting any longer, that they would rather die fighting with the enemy than perish through starvation in the camp.

[***New History of Marathas*, G.S. Saidesai,** *Vol. II. p. 429, 437*]

*(1760 నవంబర్ 1 నుంచి 1961 జనవరి 14 వరకూ పూర్తిగా రెండున్నర నెలలు మరాఠాలు తమ శిబిరంలో కందకాల మధ్య కూచుని ఉండి, తొలుత ఉన్న విజయావకాశాన్ని కోల్పోయారు. ఒక్కోరోజు గడిచేకొద్దీ వారి స్థితి దిగజారింది. క్రమంగా వారికి గుండె చెదిరింది... ... ఆకలిబాధ, చావు కళ్లముందు కదలాడాయి. జంతువులు పెద్ద సంఖ్యలో చావడంతో దుర్గంధం దుర్భరమైంది. చిన్నలూ పెద్దలూ, నాయకులూ, సిపాయిలూ అందరూ ఇంకేమాత్రం వేచి ఉండి ప్రయోజనం లేదని, శిబిరంలో ఆకలి చావు చచ్చేకంటే శత్రువుతో పోరాడుతూ చావడం మేలని భావు సాహెబ్‌ను ఒత్తిడి చేశారు).*

భావు సాహెబ్ యుద్ధాన్నే కోరుకుంటున్నాడు. శత్రువు తన మీదికి దాడిచేస్తే బాగుండునని అతడు వెయ్యి దేవుళ్లకు మొక్కుకుంటున్నాడు. ఎలాంటి దాడినైనా తన శతఘ్నులు తుత్తునియలు చేయగలవని అతడికి తెలుసు. ఆ సంగతి అబ్దాలీకీ తెలుసు. అందుకే ఎవరు ఎంతగా ఉసికొల్పినా రెచ్చిపోకుండా నిమ్మకు నీరెత్తినట్టు ఉండి మరాఠాల రక్షణ వ్యవస్థ దానికదే కుప్పకూలే సమయంకోసం వేచి ఉన్నాడు. మధ్యలో ఎవరో తనకు వేరే సలహా చెప్పబోతే 'నేను సైనికుడిని. యుద్ధం ఎలా చేయాలో, ఎప్పుడు చేయాలో నాకు వదిలేయండి. రాజకీయ తంత్రాలు మీరు చూసుకోండి' అని చెప్పాడు.

చివరికి అబ్దాలీ పథకమే ఫలించింది. కందకాలను, శతఘ్నుల రక్షణ కవచాన్ని వదలి 1761 జనవరి 14న మరాఠా సేనాలే చావుకు తెగించి ఖాళీ కడుపులతో అఫ్ఘాన్ల మీద భీకరంగా దాడి చేశాయి.

అదే వినాశానికి రహదారి.



# ఓడిన వారే వీరులు

అర లక్ష సైనికులు... వారి భార్యాబిడ్డలు, సేవక పరివారం... మొత్తం కలిపి కనీసం రెండు మూడు లక్షల జనం. ఇల్లు విడిచి తొమ్మిది నెలలు దాటింది. దేశం కాని దేశంలో శత్రువుల నడుమ చిక్కుబడి మూడో నెల నడుస్తోంది. సంకుల సమరం సాగించి విరోధులకు తమ ప్రతాపం చవిచూపించాలనే అందరికీ ఉంది. కానీ ఎందుకనో నాయకులు యుద్ధానికి అనతివ్వకుండా చేతులు కట్టేసి కూచోబెట్టారు. ఈలోపు వెంట తెచ్చుకున్న సరుకులు అయిపోయాయి. తిండికే మొగం వాచే దురవస్థ వచ్చింది. ఎముకలు కొరికే చలికి తాళలేక వందల సంఖ్యలో పశువులు చచ్చిపోతున్నాయి. దుర్వాసన భరించలేకుండా ఉంది. వెనుకటి ఉత్సాహం పోయి క్రమేణా నిరాశ, నిస్పృహలు ఆవరించాయి. ఆకలి బాధను, శత్రువుల బెడదను తట్టుకుని ప్రాణాలతో బతికి బయటపడే ఆశలేదు.

ఈ పరిస్థితుల్లో సాధారణంగా ఏమి జరుగుతుంది? హాహాకారాలు చెలరేగుతాయి. సైన్యంలో కట్టుతప్పుతుంది. తిరుగుబాట్లు లేస్తాయి. ప్రాణం మీద తీపితో ఎవరికివారు పారిపోయేందుకు ప్రయత్నిస్తారు. అది వీలుకాకపోతే నాయకత్వాన్ని ధిక్కరించి వెళ్లి శత్రువులకు లొంగిపోతారు. తమ నాయకులపై ఎంతటి కక్ష ఉన్నా తమను మాత్రం కనికరించి ప్రాణభిక్ష పెట్టమని ప్రార్థిస్తారు.

కాని 1761 జనవరిలో పానిపట్టులో చుట్టుముట్టబడిన మరాఠా శిబిరంలో ఇలాంటి బలహీనతలేవీ పొడసూప లేదు. చావుకు చేరువైన భయానక సంకటంలోనూ బాధలను, భయాలను లోపలే దాచుకుని మరాఠా శ్రేణులు నిశ్చలంగా నిలిచాయి. ప్రపంచ చరిత్రలోనే ఇది అరుదైన ఘట్టం.

ఓటమి, వినాశనం తప్పదని అర్థమయ్యాక కూడా సదాశివరావు భావు తన దిగులును బయటపడనీయకుండా అందరికీ ధైర్యం చెబుతూ నిబ్బరంగా ఉన్నాడు. యుద్ధాన్ని, జన నాశాన్ని నివారించాలని అతడు కడదాకా ప్రయత్నించాడు. ఆకలి చావుకంటే యుద్ధంలో

మరణం మేలని అందరూ కలిసి నిశ్చయించుకున్నాక... మిగిలిన కొద్ది పదార్థాలనూ వాడేసి, జీవితంలో బహుశా అదే ఆఖరి పండుగ అనుకుని సంక్రాంతి భోజనాలు చేసి, ఆత్మార్పణానికి గురుతుగా సైనికులు కాషాయపు పట్టీలు కట్టాక... తెల్లవారగానే యుద్ధానికి సకల సన్నాహాలు చేశాక కూడా భావు సాహెబ్ జనవరి 13 రాత్రి ఆఫ్ఘన్ శిబిరంలోని తన మనిషి కాశీరాజా పండిట్‌కు చివరి కబురు పంపాడు. "చివరి అంచుదాకా నీళ్లొచ్చాయి. ఇంకో బొట్టు కూడా భరించే పరిస్థితిలేదు. సర్దుబాటుకు చేయగలిగింది ఏమైనా ఉంటే తక్షణం చేసి నాకు తెలియపరుచు" అని ఆ జాబులో రాశాడు. అటునుంచి ఎలాంటి స్పందనా లేదు. అనుకున్న ప్రకారం యుద్ధం మొదలైంది.

ఈ చరిత్రాత్మక సంగ్రామం ఎలా సాగింది, ఎవరు ఎలా మోహరించారు, ఏ వ్యూహం ఎలా పరిణమించింది అన్న వివరాలు ఇక్కడ అక్కర్లేదు. వేకువ జామునే రణరంగానికి కదిలి సాయంత్రం 4 గంటలదాకా మరాఠా సైనికులు వీరవిహారం చేస్తూనే ఉన్నారు. ఆకలితో, అలసటతో వారికి సత్తువ తగ్గే సమయానికి రిజర్వులో ఉంచిన పదివేల అశ్వ దళాన్ని అబ్దాలీషా వ్యూహాత్మకంగా రంగంలోకి దింపి ఉండకపోతే... శత్రు సేనలు కకావికలైన సమయంలో తుపాకి గుండుకు విశ్వాసరావు నేల కొరగకపోతే... అది చూసి ఉద్విగ్నుడై భావు సాహెబ్ ఏనుగు నుంచి గుర్రానికి మారి ఉండకపోతే యుద్ధంలో మరాఠాలే గెలిచేవారేమో. తీవ్ర ప్రతికూల పరిస్థితుల్లో చివరికి ఓడిపోయినా మరాఠాల శౌర్యం చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయింది. వారి అద్భుత పరాక్రమాన్ని వారి శత్రువైన అహ్మద్‌షా అబ్దాలీయే ఇలా ప్రస్తుతించాడు :

"The enemy too distinguished themselves and fought so well, that it was beyond the capacity of other races.. Those dauntless bloodshedders didnot fall short in fighting and doing glorious deeds. Suddenly the breeze of victory began to blow as willed by the Divine Lord... forty to fifty thousand troopers and infantrymen of the enemy became as grass before our pitiless swords... All the enemy's artillery, elephants and property have been seized by my men".

[*New History of Marathas*, **G.S. Sardesai.** *Vol. II. p.444*]

(*మా శత్రువులు కూడా ఇతర జాతులకు అసాధ్యమైనంత గొప్పగా పోరాడారు... ఉజ్వల పరాక్రమాన్ని ప్రదర్శించటంలో వారు ఎక్కడా వెనకబడలేదు. హఠాత్తుగా దేవుడి దయవల్ల మాకు విజయపవనం వీచసాగింది... నలభైవేల శత్రు సైనికులు మా కత్తులకు గడ్డిపరకల్లా ఎర అయ్యారు... శత్రువుల శతఘ్నులను, ఏనుగులను, ఆస్తులను నా మనుషులు వశపరచుకున్నారు.*)

యుద్ధంలో శత్రు సైన్యాన్ని సంహరించటం సహజమే. ఓడిన వారి ఆయుధాలను, వాహనాలను, ఆస్తులను గెలిచినవారు స్వాధీనపరచుకోవటమూ తప్పుకాదు. అయితే అబ్దాలీ ప్రతాపం అక్కడితో ఆగలేదు. నిరాయుధులు, నిస్సహాయులు అయిన అమాయక ప్రజలనూ అతడు పరమ కిరాతకంగా ఊచకోత కోయించాడు. మామూలుగా యుద్ధం ముగియగానే గెలిచిన సేన ఓడిన వారి శిబిరం మీద పడి దొరికిందల్లా దోచుకుంటుంది. ప్రాణ భయంతో



పారిపోతున్న వారిని ఉపేక్షించి అందిన కాడికి ధన, వస్తు, ఆయుధ సంపదను కొల్లగొట్టటంలో నిమగ్నమవుతుంది. పానిపట్టులో అలా జరగలేదు. అబ్దాలీ ఉక్కు క్రమశిక్షణతో సైనికులను కట్టడిచేసి, దోచుకోవటం మీద కాక మరాఠా జనాన్ని హతమార్చడం మీదే దృష్టి కేంద్రీకరించాడు. పారిపోతున్న సైనికులను, సైన్యం వెంట వచ్చిన స్త్రీలను, పిల్లలను, ఇతర సామాన్య జనాన్ని వెంటాడి, వేటాడాడు. ఎక్కడెక్కడి వారినీ వెదికి పట్టుకుని, నరికి పోగులు పెట్టించాడు. భయానక జన సంహారానికి ప్రత్యక్షసాక్షి అయిన కాశీ రాజా పండిట్ నాటి ఘాతుకాన్ని కళ్లకు కట్టేలా వివరించాడు.

Of every description of people, men, women, and children, there were said to be five hundred thousand souls in the Mahratta camp of whom the greatest part were killed or taken prisoners... The unhappy prisoners... were most of them murdered in cold blood, the Durranies saying that when they left their own country, their mothers, sisters and wives desired that whenever they should defeat the unbelievers, they would kill a few of them on their account, that they also will possess a merit in the sight of God. In this manner thousands were destroyed and every tent had heads piled before the door of it."

[*Battle of Panipat, Casi Raja Pundit,* **Tr.H.G. Rawlison**, *pp. 40-41*]

(*పురుషులు, స్త్రీలు, పిల్లలు అన్ని రకాలవారూ కలిసి మరాఠా శిబిరాలలో ఐదు లక్షల మంది ఉన్నారు. వారిని అత్యధిక సంఖ్యలో చంపేశారు. లేదా ఖైదీలుగా పట్టుకున్నారు. ఖైదీల్లో కూడా అత్యధిక సంఖ్యాకులను నిలువునా నరికేశారు. అలా నరికేస్తూ అఫ్ఘాన్లు ఏమన్నారంటే - వారు దేశం వదిలి వచ్చేప్పుడు వారి తల్లులు, అక్కచెల్లెళ్లు, భార్యలు చిన్న కోరిక కోరారట. అవిశ్వాసులను ఓడించినప్పుడు వారిలో కొందరిని తమ పేరు చెప్పి చంపి, ఆ పుణ్యంలో తమకూ కాస్త భాగం ఇమ్మన్నారట! ఈ ప్రకారంగా వేల మందిని చంపేసి ప్రతి డేరా గుమ్మం ముందూ నరికిన తలలను గుట్టగా పోశారు.*)

దీన్నిబట్టే తెలుస్తుంది కదా ఆ సమయాన ముసల్మాన్లను పట్టింది మతద్వేష పైశాచికత్వమే తప్ప మామూలు సైనికాగ్రహం కాదని?! కాశీరాజా పండిట్ అఫ్ఘాన్ల పక్షాన ఉన్నప్పటికీ ఎంతయినా హిందువే కనుక అతడి ప్రత్యక్ష కథనాన్ని నమ్మలేమని అనడానికి వీలులేదు. ఎందుకంటే పానిపట్టు యుద్ధానికి సాక్షి కాశీరాజ్ ఒక్కడే కాదు. మనకు తెలిసినంతలో ఇంకో మహమ్మదీయ చరిత్రకారుడు కూడా ఉన్నాడు. పేరు మహమ్మద్ జాఫర్ షామ్‌లు. 'స్వయంగా చూసింది చూసినట్టు చెబుతున్నాను. దీనికంటే భిన్నంగా ఎవరు ఏది చెప్పినా నమ్మవద్దు' అని హెచ్చరించి అతడు పానిపట్టు దృశ్యాన్ని తన TARIKH-I-MANAZILUL FUTUH గ్రంథంలో ఇలా వర్ణించాడు:

Out of that vast army, consisting of three lacs and fifty thousand cavalry and infantry, only 50,000 souls succeeded in returning to the Deccan ... while the remainder pursued the path

of perdition, either in the field or on the road, through the swords of the Holy Warriors.

The ever victorious warriors pursued the fugitives as far as... sixty kos.

[***Muhammad Jafar Shamlu*, Elliot & Dowson,** *Vol. VIII. p. 155*]

*(మూడున్నర లక్షల మంది గల ఆ భారీ సైన్యంలో 50 వేల మంది మాత్రమే దక్షిణ్‌కు తిరిగి వెళ్ళగలిగారు. మిగిలిన వారు యుద్ధ రంగంలోనో, రహదారిమీదో 'పవిత్ర యుద్ధ' యోధుల కత్తులకు నాశనమయ్యారు. విజేతలైన యోధులు పారిపోయేవారిని అరవైకోసుల దూరం వరకూ తరుముతూ పోయారు).*

పానిపట్టులో మరాఠా సైనిక శిబిరం చుట్టూ 25 గజాల వెడల్పు 6 గజాల లోతుతో ఆరు మైళ్ల పొడవున తవ్విన భారీ కందకమంతా అఫ్ఘాన్లు నరికేసిన వారి శవాలతో నిండి పోయిందనీ, 75 వేల మంది మరాఠాలు ఈ మహా నరమేధంలో బలిఅయ్యారనీ ఎస్.జి.సర్దేశాయి తన చరిత్ర గ్రంథంలో అంచనా వేశాడు.

12వ శతాబ్దాంతంలో మహమ్మద్ ఘోరీ హిందూ దేశం మీదికి దండెత్తినప్పుడు 150 రాజ్యాల ప్రభువులు పృథ్వీరాజ్‌కు అండగా కదనానికి కదిలారని పర్షియన్ చరిత్రకారులు సైతం పేర్కొన్నారు. కాలం గడిచేకొద్దీ జాతీయ సంఘీభావం పెంపొంది బయటి శత్రువును ఎదుర్కోవడంలో ఐకమత్యం ఇతోధికంగా పెరగాల్సిందిపోయి క్షీణించింది. ఆరు శతాబ్దాల తరవాత అదే ఆఫ్ఘనిస్తాన్ నుంచి తొలుత నాదిర్షా, ఆనక అబ్దాలీ రాక్షసంగా విరుచుకుపడి దేశాన్ని అతలా కుతలం కావించి అమాయక జనాన్ని అనేక పర్యాయాలు ఊచకోత కోసినా దేశంలో సమైక్య ప్రతిఘటన అనేది లేకపోయింది.

విదేశీ శత్రువును తరిమి వేసే బృహత్ యత్నంలో పాలుపంచుకోవలసిందిగా కోరుతూ 1760 మార్చిలో చతురంగ బలాలతో వైరి వర్గాల గుండెలదిరేలా దండు వెడలడానికి ముందే ఉత్తరాదిన వివిధ రాజపుత్ర రాజ్యాలకు, ఇతర హిందూ ప్రభువులకు పీష్వా నుంచి సందేశాలు వెళ్లాయి. ఢిల్లీ, మధుర, బృందావనాల్లో ఇంతకుమందు దండయాత్రలో అబ్దాలీ హిందువులపై సాగించిన పాతకాలు, ఊచకోతలు గుర్తుండి కూడా జోధ్‌పూర్ రాథోడ్లు కానీ, జైపూర్ కచ్ఛవాహలు కానీ, బుందీ చౌహాన్లు కాని, మేవాడ్ సిసోదియాలు కాని మరాఠాల విన్నపాన్ని మన్నించలేదు. అంతకుముందు రెండు దశాబ్దాలుగా వారి నడుమ జ్ఞాతివైరాలలో మరాఠాలు తడవకొకరి కొమ్ముగాసి చివరికి అందరికీ కంటు అయిన మాట నిజం. కాని మొత్తం దేశానికి ఉపద్రవం ముంచుకొచ్చినప్పుడు ఇటువంటి చిల్లర స్పర్థలను మనసులో పెట్టుకుని ఐక్యపోరాటానికి కలిసి రాకపోవడం క్షంతవ్యం కాదు. మొత్తం భారత జాతికి, హిందూ ధర్మానికి ప్రబల శత్రువు అని ఏనాడో రుజువైన అఫ్ఘనీ అబ్దాలీపై ఉమ్మడి పోరుకు భరత్‌పూర్ జాట్ ప్రభువు సూరజ్‌మల్ మినహా ఎవరూ ముందుకు రాలేదు. తొలుత సంసిద్ధమైన ఆ సూరజ్ మల్ కూడా ఢిల్లీని తిరిగి స్వాధీనపరచుకున్న దరిమిలా మరాఠాలతో పొరపొచ్చాలొచ్చి చెప్పాపెట్టకుండా ఇంటి దారి పట్టాడు. పానిపట్టు యుద్ధ భూమి నుంచి అష్టకష్టాలు పడుతూ ప్రాణాలు అరచేత పెట్టుకుని పారిపోయి వచ్చిన మరాఠాలనయితే ఆయన ఆశ్రయమిచ్చి దేవుడిలా ఆదుకున్నాడు. కాని – అసలైన యుద్ధానికి సంబంధించినంతవరకూ రాజ పుత్రులలాగే జాట్ల తోడ్పాటూ సున్న. సమ ఉజ్జీలైన మరాఠా, పఠాన్ల యుద్ధంలో ఎవరు గెలుస్తారో చూశాక ఎవరితో తమ వైఖరి ఏమిటో తేల్చుకోవచ్చునన్న అవకాశవాదం ఒకప్పుడు శౌర్యపరాక్రమాలకు మారుపేరైన రాజపుత్రులను ఆవహించడం దురదృష్టం. ధర్మానికీ, అధర్మానికీ... జాతీయతకూ విదేశీ బెడదకూ నడుమ పానిపట్టు కురుక్షేత్రంలో జరిగిన భీషణ సంగ్రామంలో భారతీయుల పక్షాన మరాఠాలు మాత్రమే ఒంటరిగా పోరాడిన పరిస్థితికీ... అనేక శతాబ్దాల కింద గజనీ, ఘోరీలపై మొత్తం రాజలోకం అండదండలతో ఆనందపాలుడు, పృథ్వీరాజ్‌లు పోరాడిన స్థితిగతులకూ ఎంత తేడా?!.

హిందూ రాజుల మధ్య ఉన్నటువంటి స్పర్థలు, కక్షలు మహమ్మదీయ సర్దార్ల నడుమా ఉన్నాయి. ఆ కాలంలో భారతీయ పఠాన్ల నాయకుడైన రోహిల్లా నజీబ్‌ఖాన్‌కూ అయోధ్య సుబేదారు సుజా ఉద్దౌలాకూ క్షణం పడదు. నజీబ్ సున్నీ; సుజాది షియా తెగ. నజీబ్‌ఖాన్ మల్హర్‌రావును బుట్టలో వేసి మరాఠాలకు నమ్మకద్రోహం చేసిన వంచకుడు. సుజా ఉద్దౌలా మొదటినుంచీ మరాఠాలకు మిత్రుడు. వజీరుగా ఉన్నప్పుడు అతని తండ్రి సఫ్దర్ జంగ్‌కూ మరాఠాలు అండగా ఉన్నారు. సఫ్దర్ జంగు గతంలో మొగలుపాదుషా పక్షాన మరాఠా సాయంతో అబ్దాలీతో యుద్ధం చేశాడు. మరాఠాలతో ఇన్ని మొహమాటాలు, నజీబ్, అబ్దాలీలతో ఎన్నో వైరాలు ఉన్న సుజా ఉద్దౌలా న్యాయంగా అయితే పానిపట్టు యుద్ధంలో మరాఠాల పక్షానే పోరాడవలసింది. చిరకాల మైత్రిని గుర్తుచేసి భావుసాహెబ్ అతడి సహాయాన్ని అపేక్షించాడు కూడా. సుజా కనుక మరాఠాలతో కలిస్తే మనకు చాలా కష్టం కనుక ఎలాంటి షరతుకైనా ఒప్పుకుని ఎలాగైనా అతడిని మనవైపు తిప్పమని చెప్పి అబ్దాలీషా నజీబ్‌ఖాన్‌ను రాయబారిగా పంపాడు. నజీబ్ అంటే ఎంతటి అపనమ్మకం ఉన్నా అతగాడు మతం మంత్రం ప్రయోగించి, "ఎన్ని గొడవలున్నా మనం మనం ముసల్మాన్లం, భావు సాహెబ్‌కు ముసల్మాన్లంటే ద్వేషం. అతడిది పైచేయి అయితే మమ్మల్నే కాదు – నిన్నూ నాశనం చేయకుండా వదలడు కాబట్టి ఇస్లాం కోసం మాలో కలు. నువ్వు ఎలా చెబితే అలా నడుచుకుంటాం" అనే సరికి సుజాఉద్దౌలా మిత్రధర్మాన్ని మరచి, అబ్దాలీతో చేతులు కలిపాడు, అది మరాఠాలకు ఊహించని దెబ్బ. వ్యక్తిగత కక్షలు కార్పణ్యాలకంటే మత ప్రయోజనాలు ప్రధానమని తలచి ముసల్మాన్ సర్దార్లు కనపరచిన ఐకమత్యం ఆపత్కాలాన అటువైపు హైందవ పక్షంలో లోపించటం దురదృష్టం.

పానిపట్టు జాతీయ ఉపద్రవం. ఆధునిక భారత చరిత్రలో ఇంతటి భయానక యుద్ధం మరొకటి లేదు. ఇందులో నేలకొరిగిన వీరుల జాబితా రాస్తూపోతే చేంతాడంత అవుతుంది. మల్హర్‌రావు హోల్కర్, మహాద్‌జీ సింధియా మినహా మరాఠా మహాయోధులందరూ వీరమరణం పొందారు. చేతికందిన కొడుకు విశ్వాసరావు, కుడి భుజంలాంటి సోదరుడు సదాశివరావు భావు ఇద్దరూ ఇక లేరని తెలియగానే బాలాజీరావు పీష్వాకు గుండె పగిలినట్టయింది. కలలో కూడా ఊహించని ఘోర కలికి తట్టుకోలేక ఆర్నెల్లు తిరక్కుండా ఆయన ప్రాణాలు వదిలాడు. మృతుల సంఖ్య లక్షల్లో ఉండటంతో మహారాష్ట్రలోని ప్రతి కుటుంబమూ కనీసం ఒక ఆత్మబంధువును కోల్పోయి విలపించింది. ఎన్నో యుద్ధాల్లో ఆరితేరిన సైన్యం మొత్తం నాశనమయ్యాక రాజ్యం మళ్లీ కోలుకోవటం సాధారణంగా అసాధ్యం. పానిపట్టులో ఘోర పరాజయంతో మరాఠాల కథ ముగిసిందనే అందరూ అనుకున్నారు.

ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే ఇంత దారుణ దుర్గతికి లోనై కూడా మరాఠా శక్తి నేలకు కొట్టిన బంతిలా లేచింది. పగవాడికి కూడా రాకూడని కష్టాన్ని పళ్ల బిగువున

తట్టుకుని, సర్వనాశనం నుంచి క్రమేణా తేరుకుని చెదరని ఆత్మస్థైర్యంతో మళ్లీ బలం పుంజుకుంది. అతిరథ మహారథులు అసువులు బాసినా, ఆ యుద్ధం నుంచి దైవికంగా ప్రాణాలలో బయటపడ్డ నానా ఫడ్నవిస్, మహాద్‌జీ సింధియాలు నాయకత్వపు శూన్యాన్ని సమర్థంగా పూరించారు. బేసెన్ ఒప్పందంలో 1803 యుద్ధంలో బ్రిటిష్ అధిపత్యం సుప్రతిష్ఠితమయ్యేదాకా నలభై ఏళ్లపాటు మరాఠా ప్రాభవం ధగధగలాడింది. వ్యూహాత్మకంగా తప్పులుచేసినా, రణరంగంలో దారుణంగా ఓడిపోయినా భావు సాహెబ్‌ను మరాఠా ప్రజలు తప్పుపట్టలేదు. గుండెలవిసే కఠోర పరీక్షా సమయంలోనూ మొక్కవోని ధైర్యంతో చెక్కు చెదరక నిలిచి జాతి పౌరుషాన్ని, పరువును నిలబెట్టిన పానిపట్టు అమర వీరులు తమ జాతిజనులకు కొత్తస్ఫూర్తినిచ్చారు. మేజర్ **Evans Bell** అన్నట్లు.

"The battle of Panipat was a triumph and a glory for the Marathas. They fought in the cause of India for the Indians... And though the Marathas were defeated the victorious Afghans retired and never again interfered in the affairs of India".

(పానిపట్టు యుద్ధం మరాఠాలకే ఉజ్వల విజయం. "భారతదేశం భారతీయులకే" అన్న ఆశయం కోసమే వారు పోరాదారు... మరాఠాలను ఓడించినప్పటికీ అఫ్ఘాన్లు నిష్క్రమించారు. భారతదేశ వ్యవహారాల్లో మళ్లీ ఎప్పుడూ వారు జోక్యం చేసుకోలేదు).

ఔను! పానిపట్టు జాతీయ పరాక్రమానికి, పోరాట పటిమకు చరిత్రలో చిరస్థాయిగా నిలచే కొండ గుర్తు. దానిలో గెలిచికూడా అబ్దాలీ బావుకున్నది ఏమీలేదు. కాని - దురదృష్టవశాత్తూ "పానిపట్టు"కు నాలుగేళ్లపూర్వం దేశంలో ఇంకో యుద్ధం జరిగింది. పానిపట్టుతో పోల్చితే దాని స్థాయి, రక్తపాతపు తీవ్రత చాలా తక్కువే. ఆ కాలంలో చాలా మంది దాన్ని పెద్దగా పట్టించుకోనే లేదు. కాని ప్లాసీలో జరిగిన ఆ పరిమిత యుద్ధం పర్యవసానాలు మాత్రం మహా దారుణం. అందులో గెలిచిన విదేశీయులు - అబ్దాలీ వలె కాక చాలా బావుకున్నారు. చివరికి దేశాన్నే దారుణంగా కబళించారు.



# మేము పెద్దమనుషులం కాము

పరమ గురుడు చెప్పినవాడు పెద్దమనిషి కాదురా
పెద్దమనుషులంటేనే బుద్ధులన్ని వేరురా

**- అన్న సినిమా పాట చాలామందికి గుర్తుండే ఉంటుంది. తెలివి తక్కువవాళ్లని అందరూ అనుకునే 'పరమానందయ్య శిష్యులు' కూడా ఫలానా వాడు పెద్దమనిషి అవునోకాదో లక్షణాలను బట్టి తమదైన ఫక్కీలో పోల్చుకోగలిగారు. చాలా తెలివిగల వాళ్లమని అనుకునే మనం మాత్రం అడ్డమైన తప్పుడు పనులు చేసిన తొల్లదొరలు పెద్దమనుషులని 250 ఏళ్ల తరవాత కూడా భావిస్తూనే ఉన్నాం!**

అది మనతప్పుకాదు. చాలా గొప్పవాళ్లనీ, మహామేధావులనీ, తెల్లవారితో భీకరంగా పోరాడి స్వాతంత్ర్యాన్ని సాధించి నవ భారతాన్ని నిర్మించిన మహనీయులనీ మనం భక్తితో కొలిచే మహానుభావులు మనకు కలిగించిన అభిప్రాయమిది.

ఉదాహరణకు జవహర్లాల్ నెహ్రూను తీసుకోండి. బ్రిటిష్ వారు భారతదేశాన్ని ఎలా ఆక్రమించగలిగారన్న విషయంలో 'డిస్కవరీ ఆఫ్ ఇండియా' గ్రంథంలో ఆయన చెప్పింది:

"అనుకోకుండా పరిస్థితులు వరసగా కలిసి రావటం వల్ల, తటాలున అవకాశాలు అందటం వల్ల బ్రిటిష్‌వారు ఇండియాను స్వాధీనపరచుకోగలిగారు. కొద్దిపాటి ప్రయత్నంతోనే గొప్ప సామ్రాజ్యాన్ని వారు గెలవగలిగారు. అప్పటి పరిస్థితుల్లో అది అనివార్యం. అదృష్టం ఉంటేనే చాలదు. దాని నుంచి లాభపడే సామర్థ్యం కూడా ఉండాలి... మొగల్ సామ్రాజ్య విచ్ఛిత్తితో కేంద్రాధికారం భగ్నమైంది. అప్పుడు పెత్తనం కోసం పోటీపడ్డ సాహసికుల్లో బ్రిటీషు వారికి మాత్రమే గెలవటానికి కావలసిన లక్షణాలున్నాయి. మరాఠాలు, మిగతా భారతీయ శక్తులూ ఔత్సాహికులు, సాహసికులు కాగా దేశంలోని ఆంగ్లేయులేమో పక్కా ప్రవీణులు. బ్రిటిష్ నాయకుల్లో సాహసవంతులు చాలా మంది ఉన్నా తమతమ రంగాల్లో వారు అనుసరించిన విధానం దుస్సాహసికమైనది కాదు... బ్రిటిష్ సామ్రాజ్యంలో మరే కాలంలోనూ లేనంతగా నక్షత్ర మండలం లాంటి తేజోవంతుల సమూహం ఈస్టిండియా కంపెనీ కొలువులో ఉండేదని ఎడ్వర్డ్ థాంప్సన్ రాశాడు...

"ఆంగ్లేయుల గూఢచారి వ్యవస్థ పకడ్బందీగా ఉండేది. తమ ప్రత్యర్థుల దర్బార్లలో ఏమి జరుగుతూందో, సైనిక బలమెంతో వారికి ఎప్పటికప్పుడు పూర్తిగా తెలిసేవి. వారి ప్రత్యర్థులేమో ఆంగ్లేయులు ఏమి చేస్తున్నారో ఏమి చేయబోతున్నారో తెలియని అజ్ఞానంలో ఉండేవారు. బ్రిటిష్ వారి పంచమాంగ దళం నిరంతరంగా పనిచేసేది. సంక్షోభ సమయాల్లో, యుద్ధం మధ్యలో శత్రుపక్షం నుంచి వారివైపు ఫిరాయింపులు జరిగేవి. దాంతో ఫలితంలో గొప్ప మార్పు వచ్చేది. వాస్తవంగా పోరాటం మొదలుకాకముందే ఆంగ్లేయులు చాలావరకూ యుద్ధాలు ఈ ప్రకారంగా గెలిచేవారు. ప్లాసీలో అదే జరిగింది. సిక్కు యుద్ధాల వరకూ అదే పునరావృతమైంది..."

"బ్రిటిష్ వారికి భారతీయులకంటే ఉన్నతమైన రాజకీయ, సైనిక వ్యవస్థ ఉండేది. అది సుసంఘటితంగా ఉండేది. చాలా సమర్థులైన నాయకులుండేవారు. చక్కని సమాచార సేకరణ వ్యవస్థ ఉండేది. భారతీయ ప్రభువుల్లోని అనైక్యతను, స్పర్థలను వారు తమ ప్రయోజనానికి పూర్తిగా వినియోగించుకున్నారు... తాత్కాలికంగా ఓటమి పాలైనా వారు చప్పున తేరుకుని శత్రువులపై లంఘించగలిగేవారు. భారతీయ శక్తులకేమో ఓటమి అంటే కోలుకోలేని ఉపద్రవమే."

"ఆంగ్లేయులు ఉన్నతమైన ప్రగతిశీల సాంఘిక వ్యవస్థకు ప్రతినిధులు కాబట్టే... తనవారి లోటుపాట్లవల్లే -భారతదేశం విదేశీయులకు వశమైంది. ఈ రెండు పక్షాల మధ్య తేడా కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. భారతీయులకు సమర్థత ఎంత ఉన్నా వారి ఆలోచనలు, చేతలు సంకుచిత వర్తులంలో సాగేవి. బయట ఏమి జరుగుతున్నదో వారికి తెలిసేది కాదు. మారిన పరిస్థితులకు తగ్గట్టు నడుచుకోవటం వారికి చేతనయ్యేది కాదు. వీరికంటే ఆంగ్లేయులకు ప్రపంచ జ్ఞానం చాలా ఎక్కువ. తమ దేశంలోనూ, ఫ్రాన్సు అమెరికాల్లోనూ వచ్చిన పెనుమార్పులతో వారిలో పెద్ద కుదుపు వచ్చింది... భారీయంత్రాల పారిశ్రామిక నాగరికతకు వైతాళికులు కాబట్టే ఆంగ్లేయులు ఇండియాని జయించి, ప్రపంచంలో అజేయ శక్తిగా నిలిచారు."

[డిస్కవరీ ఆఫ్ ఇండియా, పేజీలు *276,277,279,280,281,312*]

నెహ్రూ పండితుడు వెలిబుచ్చిన ఈ వెల లేని అభిప్రాయాన్ని వింటే తెల్లవాళ్లు చాలా గొప్పవాళ్లు; బహుదొడ్డ మనుషులు అన్న భావన ఎవరికైనా కలుగుతుంది. రాజకీయంగా, సైనిక పరంగా మనకంటే వారు ఉన్నతులు, మనకంటే విజ్ఞానవంతులు కాబట్టే... మనకు లేని విశాల హృదయం, ప్రపంచ జ్ఞానం వారికి సమృద్ధిగా ఉన్నాయి కాబట్టే... మనకు లేని విశాల అభ్యుదయ భావాలను, ప్రగతిశీల సామాజిక వ్యవస్థను వారు పుణికి పుచ్చుకున్నారు కాబట్టే మనదేశాన్ని వీరోచితంగా జయించి మనను ఉద్ధరించారన్న భక్తిభావం మొలకెత్తుతుంది. ఐకమత్యంతో, దీక్షాదక్షతలతో తేజోమూర్తులుగా వెలుగొందిన సీమ దొరల సమర్థ నాయక శ్రేణి ముందు నిలవలేక... సంకుచితపు ఆలోచనలతో, అనైక్యతతో, అజ్ఞానంతో వెలావెలాపోయి వినాశనం పాలైన మన ప్రారబ్ధాన్ని తలచుకుంటే అంతులేని ఆత్మన్యూనతా భావం కలుగుతుంది. ఆంగ్లేయులు అభ్యుదయ వైతాళికులుగానూ, ఆ కాలపు మన పూర్వీకులు అభివృద్ధి నిరోధకులైన అప్రయోజకులుగానూ మనో నేత్రానికి పొడగట్టటంతో మనలను శతాబ్దాల పర్యంతం అణగదొక్కిన విదేశీయుల సంస్కృతి, విలువల పట్ల ఆరాధనాభావం మనకు తెలియకుండానే రేకెత్తుతుంది.



చిత్రమేమిటంటే - దేశాన్ని తమ శక్తియుక్తులతో ఆక్రమించిన విదేశీయులు వారివరకూ దొడ్డమనుషులేనని మనమూ, మన ఆరాధ్య నాయకులూ ఎంతగా విశ్వసిస్తున్నా తాము పెద్దమనుషులమన్న భ్రమ ఆ విదేశీయులకే లేదు! తాము జెంటిల్మన్లు కామనీ పెద్దమనుషులెవరినీ తమలో చేరనిచ్చేది లేదని ఈ దేశంలో అడుగుపెట్టటానికి ముందే వారు విస్పష్టంగా చెప్పుకున్నారు.

తెల్లవాళ్లు హిందూ దేశాన్ని శతాబ్దాల పర్యంతం దోచుకున్న కథ దోపిడితోనే మొదలైంది. పోర్చుగల్ నుంచి హిందుస్థాన్‌కు సముద్ర మార్గాన్ని వాస్కోడిగామా కనిపెట్టిన దరిమిలా పోర్చుగీసువారు క్రీ.శ. 1500 లోనే కాలికట్‌లో గిడ్డంగిని స్థాపించి వ్యాపారం చేస్తూ బోలెడు లాభాలు ఆర్జించసాగారు. అది చూసి బ్రిటిష్‌వారికి కన్నుకుట్టింది. ఆ దారి ఏదో తామూ కనుక్కొని, లాభపడాలని అర్ధ శతాబ్దానికి పైగా తంటాలు పడినా వారికి అనుపానులు చిక్కలేదు. చివరికి 1578లో ఇండియా నుంచి లిస్బన్‌కు తిరిగి వెళుతున్న పోర్చుగీసు ఓడను సర్‌ఫ్రాన్సిస్ డ్రేక్ అనే ఇంగ్లీషు దొరగారు పట్టుకుని దోచుకున్నాడు. దోచుకున్న వస్తువులలో అతడికో పటం దొరికింది. కేఫ్ ఆఫ్ గుడ్ హోప్ నుంచి ఇండియాకు పోవటానికి రూటుమాపు అందులో ఉంది. రహస్యం బయటపడింది.

ఆ పళాన - అదృష్టాన్ని వెతుక్కుంటూ, దేశాలు తిరుగుతూ, సముద్రపు దొంగతనాలు చేస్తూ, సాహసకృత్యాలతో పొట్టపోసుకుంటూ గడిపే కొంతమంది ఆంగ్లేయులు పోగై తూర్పు దేశాలతో వర్తకానికి ఒక కంపెనీ పెట్టుకున్నారు. ఆ విధంగా వ్యాపారం చేసుకోవటానికి ఎలిజబెత్ రాణిగారి నుంచి క్రీ.శ.1600లో అనుమతి పట్టాకూడా తీసుకున్నారు.

ఆ దేశ దిమ్మరుల, సాహసికుల సంఘమే 'ఈస్టిండియా కంపెనీ తాము ఎలాంటి వారైనదీ, ఎలాంటి పనులు చేయబోతున్నదీ 'కుంఫిణీ' వారికి మొదటి నుంచీ బాగా తెలుసు. ఇండియాకు బయలుదేరిన మొట్టమొదటి సముద్రయాత్రలో ప్రభువులకు అభిమానపాత్రుడైన ఒకానొక పెద్దమనిషిని కూడా తీసుకుపొమ్మని నాటి బ్రిటిష్ ప్రభుత్వం కోరగా కంపెనీ డైరెక్టర్లు అర్జంటుగా సమావేశమై -

resolved "not to employ any gentleman in place of charge" and requested" "that they might be allowed to sort their business with men of their own quality, lest the suspicion of the employment of gentlemen being taken hold upon by the generalite, do dryve a greate number of adventurer to withdraw their contributions".

పెద్దమనిషి ఎవరినీ ఏ బాధ్యతకూ వినియోగించరాదనీ... మా రకం మనుషులతోనే మమ్మల్ని పనిచేసుకోనివ్వండి; లేకపోతే జంటిల్మెన్లను నియమించినందుకు అనుమానం వచ్చి చాలామంది సాహసికులు తమ పెట్టుబడి డబ్బును తీసుకుని లేచిపోగలరు అని ప్రభువులకు మనవి చేయాలనీ తీర్మానించారు.

[*Annals of the Hon'ble East India Company, Vol. I. p. 128*]

ఈ అభ్యంతరానికీ కారణం ఉంది. పెద్ద మనుషులుంటే తమ ఆటలు, ఆగడాలు సాగవని దిమ్మరీడుల సంఘానికి భయం. ***Rise of the Christian Power in India*** గ్రంథంలో **Major B.D. Basu** అన్నట్టు "ఈస్టిండియా కంపెనీవారు ప్రాచ్యఖండాల్లో

క్రైస్తవేతర జాతుల యెడ కావించిన అత్యాచారాలకు అకృత్యాలకు మూల కారణమేమిట్తో ఈ కంపెనీలో చేరిన మెంబర్ల పుట్టుపూర్వోత్తరాలను బట్టే బోధపడగలదు. కంపెనీ మొదలు పెట్టింది మొదలుకుని ఆఖరు రోజువరకూ ఇందులో చేరుతూ వచ్చినవారు అల్పబుద్ధులైన సాహసికులు తప్ప పెద్దమనిషి అని చెప్పదగ్గవాడు ఒక్కడూ లేడు. సాహసికులు ఎలాంటి నీతినీ నియమాన్నీ పాటించరు".

ఇక్కడ కొంతమందికి సందేహం కలగవచ్చు. ఈస్టిండియా కంపెనీ ఏర్పాటయ్యాక రెండు శతాబ్దాల తరవాత గానీ భారతదేశం దానికి పూర్తిగా వశమవలేదు కదా? తొలి నాళ్లలో దేశదిమ్మరులూ సాహసికులూ మాత్రమే ఆ కంపెనీలో ఉన్నా... పెద్ద మనుషులు తమకు పనికిరారని మొదట్లో మొరాయించినా... కాలక్రమంలో కంపెనీ పెద్దమనిషి లక్షణాలను సంతరించుకుని ఉండవచ్చు కదా? నెహ్రూ పండితుడు, ఇతరులు అన్నట్టు ప్రతిభ, సామర్థ్యం, అభ్యుదయ లక్షణాలతోనే ఆంగ్లేయులు దేశాన్ని కడకు జయించి ఉండవచ్చు కదా?

సందేహం సబబే! కాని - అలాంటి అనుమానం ఆంగ్లేయులకే లేదు! తెలివి తేటలతోనో, శౌర్య పరాక్రమాలతోనో, బుజుమార్గంలో తాము ఇండియాను గెలుచుకున్నామన్న భ్రమ బ్రిటిష్ మేధావులకే లేదు. భారతీయులు చేతకాని తనం వల్లే, అజ్ఞానంవల్లే, పోరాట పటిమ లేనందువల్లే తమ చేతిలో ఓడిపోయారని వారు ఏనాడూ అనుకోలేదు. వ్యాపారంకోసమో, కొల్లగొట్టే ఉద్దేశంతోనో ఇండియాకు వచ్చింది ఆంగ్లేయులు మాత్రమే కాదు. వారికంటే ముందే పోర్చుగీసువారు దేశంలో పీఠం పెట్టారు. ఫ్రెంచి వారు, డచ్చివారు, డెన్మార్క్‌వారూ రంగంలో ఉన్నారు. ఇంగ్లీషు వారికున్నపాటి 'ప్రపంచ జ్ఞానం', 'అభ్యుదయ దృక్పథం', 'రాజకీయ, సైనిక ఔన్నత్యం', 'కార్యసామర్థ్యం' వారికీ (బహుశా కొంచెం ఎక్కువ పాళ్లలోనే) ఉన్నాయి. ఫ్రెంచి వారైతే ఇండియాను జయించటానికి ఆంగ్లేయులకంటే చాలా ముందే బృహత్ పథకం వేశారు. రాజనీతిజ్ఞతలో, సైనిక పరాక్రమంలో, వ్యవహార దక్షతలో బ్రిటిష్ క్లయివ్‌ను తలదన్నిన డూప్లే అంతటి మహారథుడే ఫ్రెంచి తంత్రాన్ని నడిపించాడు. అయినా - అటు వంటి ప్రత్యర్థుల ప్రతాపమంతా నిష్ఫలమై, మిగతా విదేశీశక్తులన్నీ కాకావికలై అంతిమంగా బ్రిటిష్ వారిదే పై చేయి ఎలా అయింది? కన్యాకుమారి నుంచి హిమాలయాల వరకూ అఖండ భారత భూమండలం సునాయాసంగా, అయాచితంగా, ఆంగ్లేయుల హస్తగతమైందంటే... వేల సంవత్సరాల భారత చరిత్రలో వరసగా సాగిన విదేశీ దండయాత్రలు వేటిలాగూ కాక - కత్తి ఎత్తకుండానే, భీకర యుద్ధమే సాగించకుండానే చాపకింద నీరులా వ్యాపించి, విశాల సామ్రాజ్యాన్ని తెల్లవారు కబళించగలిగారంటే... ప్రపంచ చరిత్రలోనే అరుదైన ఈ విజయానికి ఆంగ్లేయులు అనుసరించిన పంథా ఎలాంటిది? ఎంత న్యాయబద్ధమైనది? శ్వేతజాతికి ఎటువంటి గర్వకారణమైనది?

ఈ సంగతులను చరిత్రపత్రాలను ముందేసుకుని ఇప్పుడు మనం పరిశోధించవలసిన పనిలేదు. ఇండియాలో ఇంగ్లీషువారిది ఎటువంటి విజయమో, సభ్యత, సంస్కారం, మానవత్వం గలవారు దాని గురించి ఏమనుకోవాలో-19వ శతాబ్దంలో, ఈస్టిండియా కంపెనీ ఈ దేశాన్ని పరిపాలిస్తున్న కాలంలోనే పలువురు ఆంగ్లేయ మేధావులు కుండ బద్దలు కొట్టినట్టు చెప్పారు. మచ్చుకు కొన్ని :



"ఇండియాను జయించటానికి చేసిన ప్రతి పోరాటంలోనూ మనం మన సొంత శక్తి సామర్థ్యాల వల్ల గాక, భారత ప్రజల స్వభావంలో గల దౌర్బల్యంవల్లనే గెలిచాము... భారత జనాభాలో కనీసం ఇరవైలో ఒక భాగం ప్రజలు మన అంతటి కుట్ర బుద్ధిగలవారై, మనంతటి మెళకువ చూపితే చాలు. మనం ఎంతవేగంగా పైకి వచ్చామో అంత వేగంగా వెనక్కిపోతాం. మనం ఇక్కడ కాలుపెట్టినప్పుడు ఉన్నంతటి అనామక స్థితికి మళ్లీ దవుడు తీస్తాం" అని 1821 మే "Asiatic Journal" లో Carnaticus అనే పేరుతో ఒక బ్రిటిష్ అధికారి రాశాడు.

"Jusitce for India" (ఇండియాకు న్యాయం) అనే బహిరంగ లేఖలో బ్రిటిష్ మేధావి డాక్టర్ రాంగ్రేవ్ ఇలా అన్నాడు.

Our conquests in the East have been without the excuses... for, sundered as we are by so prodigious distance from India, we had no old grudges to avenge upon her, no mischief, no danger to apprehend from her; she belonged to one sphere, we to another... we crossed the seas to trade with her; we were kindly and hospitably received by her; we were permitted to build factories upon her coasts; but, alas for her! we found her weak, and disorganised - and therefore we conquered her. we conquered it just as the Spaniards conqured Mexico and Peru... with the same treachery and almost the same inhumanity

**[*Political History of India,* Sir John Malcolm, *p.49*]**

(ఇండియాను మనం జయించటానికి ఏ సాకూ చెప్పటానికి వీల్లేదు. ఏమంటే మనకు ఇండియా (ఆరువేల మైళ్ల) దూరంలో ఉంది. ఆ దేశానికీ మనకూ పాత వైరాలు ఏవీ లేవు. ఆ దేశంవల్ల మనకేదో అపాయం వస్తుందన్న శంకకూ ఆస్కారం లేదు. భూగోళంలో అది ఒక వైపున ఉన్నది. మనం ఇంకోవైపున ఉన్నాము. వ్యాపారం చేయటానికి మనం సముద్రాలు దాటి అక్కడికి వెళ్లాం. ఇండియా మనల్ని ఆదరించి, ఆతిథ్యమిచ్చింది. అయ్యో, పాపం! ఆ దేశపు గుట్టు మనకు తెలిసింది. ఇండియా దుర్బలమైనదని, అసంఘటితంగా ఉన్నదని మనం కనిపెట్టాం. కాబట్టి దాన్ని జయించాం. స్పెయిన్ దేశస్థులు మెక్సికో, పెరూలను ఎంత ద్రోహంతో ఎంత అమానుషంగా జయించారో అంతే ద్రోహంతో, అంతే అమానుషంగా మనమూ ఇండియాను జయించాం).

ఇక ***The English in India - System of Territorial Aquisition*** - గ్రంథంలో సుప్రసిద్ధ చరిత్రకారుడు **విలియం హోవిట్** ఏమన్నాడో ఆలకించండి :

The mode by which the East Inida Company has possessed itself of Hindustan, is the most revolting and un-Christian that can possibly be conceived... if ever there was one system more Machiavellian... more cold, cruel, haughty and unrelenting than

another, it is the system by which the government of the different States of India has been wrested from the hands of their respecitve princes.

(ఈస్టిండియా కంపెనీవారు హిందూస్థాన్‌ను వశపరచుకున్న తీరుకంటే అత్యంత హేయమైనది; క్రైస్తవ ధర్మానికి పూర్తిగా విరుద్ధమైనది మరొకటిలేదు... మాకియవెల్లి కుతంత్రాలను మించిన కుత్సితంతో... అంతకంటే క్రూరంగా దురహంకార భరితంగా, నిర్దయగా తడిగుడ్డతో గొంతు కోసిన చందంగా భరతఖండంలోని నానా ప్రాంతాల రాజులను కూల్చి వారి వారి రాజ్యాలను 'కంపెనీ' చేజిక్కించు కున్నది).

పచ్చిమోసాలతో, నమ్మకద్రోహాలతో అధర్మంగా, అన్యాయంగా, అమానుషంగా భారతదేశంలో ఆంగ్లరాజ్యస్థాపన జరిగింది. ఆంగ్లేయమేధావులు, చరిత్రకారులు ఆ కాలంలోనే నిష్కర్షగా చెప్పినా... దారుణ దుర్గయానికి లోనైన మనం మాత్రం తెల్లదొరలే మనను చీకటి కూపం నుంచి ఉద్ధరించి, విద్యాబుద్ధులు, నాగరికత నేర్పిన పుణ్యాత్ములని నేటికీ అనుకుంటున్నామంటే - మన బానిస మనస్తత్వాన్ని ఏమనాలి?!



# కుంఫిణీయల కుతంత్రం

చెబితే చిత్రంగా ఉండొచ్చు కాని - ఇది నిజం.

ఈస్టిండియా కంపెనీ వారి ఆదేశాలను కింది అధికారులు తు.చ. తప్పక నిజాయతీగా పాటించి ఉంటే భారతదేశం బ్రిటిష్ వారి పాలబడి ఉండేదే కాదు. రవి అస్తమించని బ్రిటిష్ మహా సామ్రాజ్యానికి అంకురార్పణ జరిగేదే కాదు.

కంపెనీ పాలక మండలి ఏది వద్దన్నదో ఇండియాలోని కుంపిణీ అధికారులు అదే చేశారు. పైవారు ఎలా మెలగమంటే కిందివారు సరిగ్గా దానికి-వ్యతిరేకంగా నడిచారు. ఏఏ తప్పుడు పనులు చేయవద్దని యజమానులు చెప్పారో అవే తప్పుడు పనులను ఉద్యోగులు చేశారు. అంతులేని ధనదాహంతో అడ్డమైన అవినీతికి పాల్పడి, నీచ స్వార్థంకోసం అఘాయిత్యాలను, నమ్మక ద్రోహాలను, పచ్చిమోసాలను పాప భీతి లేకుండా సాగించారు. నయవంచనల, నమ్మకద్రోహాల, అమానుష దుష్కృత్యాల మెట్లతోనే మహాసామ్రాజ్యానికి నిచ్చెన వేశారు. ఈ నీచత్వాన్ని కప్పిపుచ్చుకోవటంకోసం తాము నిరపరాధులైనట్టూ, దేశీయ ప్రభువులు నిష్కారణంగా తమపైకి కత్తి ఎత్తి వెంటపడినట్టూ, విధిలేని పరిస్థితుల్లోనే తాము ఫలానా ఫలానా తీవ్ర చర్యలకు పాల్పడవలసి వచ్చినట్టూ కంపెనీ యజమానులకు పచ్చి అబద్ధాల సంజాయిషీలిచ్చుకున్నారు.

ఈ అడ్డగోలు అబద్ధాలనే బ్రిటిష్ చరిత్ర కారులు చాలా మంది అక్షర సత్యాలుగా ఔదల దాల్చారు. వాస్తవంగా జరిగిందేమిటో వారికి తెలియక కాదు. కంపెనీ అధికారుల పాపాలకు, ద్రోహాలకు కట్టెదుట కనిపించే సాక్ష్యాధారాలు వారి దృష్టికి ఆనకా కాదు. ఆయా చరిత్రకారులు కలాలు పట్టేనాటికి భారతదేశంలో బ్రిటిష్ సామ్రాజ్య నిర్మాణం నడి మధ్యలో ఉండటమో, అప్పుడప్పుడే పూర్తికావస్తూ ఇంటా బయటా అనేక ఆక్షేపణలను ఎదుర్కొంటూండటమో, లేక జాతీయోద్యమం ధాటికి ఆంగ్ల మహాసామ్రాజ్యం పునాదులు కదులుతూండటమో జరిగింది. చిక్కులు చక్కబడని అలాంటి ప్రతికూల పరిస్థితుల్లో గతాన్ని

తరచి, మూలాల్లోకి వెళ్లి తమ సామ్రాజ్యపు పాపిష్టి పుట్టుకను బయటవేయటం తమకు పాడికాదన్న తలంపుతో దేశభక్తిగల తెల్లదొరలు గమ్మునుండి పోయారు. ఇలా తెలిసి కొందరు, తెలియక కొందరు పాశ్చాత్య గ్రంథకర్తలు అసత్యాలను, అర్ధ సత్యాలను ప్రచారంలో పెట్టటంతో ఆంగ్ల మానసపుత్రులైన మన దేశవాళీ మహామేధావులు వాటినే తిరుగులేని చారిత్రక సత్యాలుగా కిమ్మనక నమ్మేశారు.

తొలినాళ్ళలో ఈస్టిండియా కంపెనీ అధికారుల లంచగొండితనం గురించి, వారి మహాపాపాల గురించి ఆ కాలంలోనే ఇంగ్లండులో పెద్ద కలకలం రేగింది. రాబర్ట్ క్లయివ్‌ను, వారన్ హేస్టింగ్స్‌ను బోనులో పెట్టి అభిశంసించటానికి బ్రిటిష్ పార్లమెంటరీ, మేధావి వర్గాల్లో గట్టి ప్రయత్నాలే జరిగాయి. కానిపనులు ఎన్ని చేసినా మహా సామ్రాజ్యాన్ని నిర్మించి జాతికి మహోపకారం చేశారు కనుక వారి చేతల లోతులకు వెళ్లకపోవటం మంచిదని బ్రిటిష్ పార్లమెంటు వారు లౌక్యంగా నిర్ణయించటం వేరే సంగతి.

సుమారు 200 ఏళ్ల కింద (1806లో) జేమ్స్ మిల్ రాసిన ***The History of Britsh India*** నేటికీ బ్రిటిష్ కాలానికి సంబంధించిన ఒక ప్రామాణిక చరిత్ర గ్రంథం. ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి యూనివర్సిటీలు వెలువరించిన 'భారత చరిత్ర' సంపుటాలే నేటికీ మన చరిత్ర బోధకులకు, సోకాల్డ్ 'పరిశోధకులకు' అవశ్య పఠనీయాలు. **'ఆక్స్‌ఫర్డ్ హిస్టరీ ఆఫ్ ఇండియా'లో** బ్రిటిష్ కాలపు సంపుటిని రాసినవాడు **విన్సెంట్ స్మిత్.** క్లయివ్ మహావీరుడు, చాలా గొప్పవాడు కాబట్టి అతడి పనులను మరీ లోతుగా తరచకుండా ఉండటమే మేలన్నదే ఆయన భావన! 'కేంబ్రిడ్జి హిస్టరీ ఆఫ్ ఇండియా'లో డాడ్వెల్ రాసింది తప్పుల తడక. అతడయినా, శ్వేత జాతి పక్షపాతులైన ఇతర చరిత్రకారులైనా సమాచారానికి ముఖ్యంగా ఆధారపడ్డది క్లయివ్‌కు సమకాలికుడు, మిత్రుడు అయిన ***Robert Orme*** రాసిన గ్రంథం మీద! అతడూ పత్తిత్తు కాదు. క్లయివ్‌లాగే, మిగతా వారిలాగే తప్పుడు పనులు చేసి అందినకాడికి దండుకున్నవాడే. 'కర్నాటక నవాబు నుంచి పెద్దమొత్తాలను గుంజినట్టు' 1761లో ఈస్టిండియా ఆఫ్ కంపెనీ డైరెక్టర్ల కోర్టు చేత మాటపడ్డవాడే. ఇక అంతటి నీతిమంతుడు, ఘోరమైన తప్పులను ఒప్పులుగా చిత్రిస్తూ తిమ్మని బమ్మి చేసిన పుస్తకంలో ఉన్నవన్నీ అబద్ధాలు; లేదా అసంబద్ధాలు. బ్రిటిష్ సామ్రాజ్య స్థాపనకు సంబంధించి నేటివరకూ వచ్చిన అనేకానేక దేశీయ విదేశీయ చరిత్ర గ్రంథాలు దాదాపుగా అన్నీ ఈ అబద్ధాల సాక్ష్యాలవల్ల ప్రభావితమయినవే.

'విష్ణుమాయ'ను తలదన్నిన ఈ 'ఆంగ్లమాయ'కు సిరాజుద్దౌలా నవాబు భ్రష్టుపట్టిన తీరు మచ్చుతునక. ప్రత్యేకంగా అతడి గురించే ఎందుకు మాట్లాడుతున్నామంటే - ఇండియాను చడీచప్పుడు లేకుండా తెల్లవాడు కబళించటం బెంగాల్‌లో సిరాజుద్దౌలా పతనంతోనే ప్రారంభమైంది కనుక.

ఈనాటివరకూ చరిత్ర గ్రంథాలుగా చలామణీ అవుతున్న వాటిని చదివితే ఎవరికైనా కలిగే అభిప్రాయం ఏమిటంటే - సిరాజుద్దౌలా ఆకతాయి; అవివేకి; దుష్టుడు; భ్రష్టుడు! నిండు గర్భిణుల పొట్టలు చీల్చి... నిండా జనం ఉన్న పడవలను బలవంతంగా గంగలో ముంచి పైశాచికానందం అనుభవించే వాడు. (అని హెన్రీడాడ్వెల్ అన్నాడు) అతడికి ఉన్న కాస్త మతికూడా చెడ తాగుడువల్ల మొద్దుబారి పోయింది (అని రాబర్ట్ ఓర్మి దొరగారు చెప్పారు). అతడి తాత అలీ వర్దీఖాన్ బెంగాల్ సుబేదారుగా ఉన్నంతకాలమూ ఏ సమస్యాలేదు.



మొగల్ పాదుషా ఆంగ్లేయులకిచ్చిన ప్రత్యేక హక్కులను గౌరవించి, కలకత్తా, కాసింబజార్ తదితర స్థావరాల్లో వారి మానాన వారిని బతకనిచ్చిన పెద్దమనిషి ఆయన. కొడుకులు లేని కారణంగా, ఆయన మరణానంతరం మనవడు వారసుడైనప్పటి నుంచీ గొడవ మొదలైంది. చపలచిత్తుడైన సిరాజుద్దౌలా ఆంగ్లేయుల మీద అకారణంగా ద్వేషం పెంచుకున్నాడు. తమకు శత్రువులైన "ఫ్రెంచి వారి దాడి నుంచి ఆత్మరక్షణ చేసుకునేందుకు వారు తమ స్థావరాలను కాస్త కట్టుదిట్టం చేసుకుంటే నవాబుకు కళ్లుకుట్టింది. తక్షణం వాటిని కూల్చేస్తారా చస్తారా అని పంతం పట్టి, చెప్పేది వినిపించుకోకుండా దండెత్తి వెళ్ళి కాసింబజారు గిడ్డంగిపై దుర్మార్గంగా పడి దోచుకున్నాడు. అంతటితో ఆగక ఆంగ్లేయుల జాగీరు అయిన కలకత్తా పై కత్తి ఎత్తి కోటను కొల్లగొట్టాడు. పట్టుమని పది మంది కూడా పట్టని చీకటి కొట్లో 146 మంది బ్రిటిష్ బందీలను కుక్కి తెల్లవారేకల్లా 123 మందిని ఊపిరాడక దుర్మరణం పాలయ్యేట్టు చేశాడు. ఈ దురంతాలు తెలిసి మద్రాసు నుంచి నౌకలో రివ్వున వచ్చిన క్లయివ్ పరాక్రమానికి తాళలేక తోక ముడిచి, వారు కోరిన షరతులకల్లా సమ్మతించి సంధి కుదుర్చుకున్నాడు. మీరు నాకు పరమ మిత్రులు; మీ శత్రువులు నాకూ శత్రువులు అని ఇచ్చిన మాట తప్పి ఆంగ్లేయులను దెబ్బతీసేందుకు వారి శత్రువులైన ఫ్రెంచి వారితో లాలూచీ పడ్డాడు. అతడి నేరాలను; ఘోరాలను భరించలేక ఓరిమి నశించి సన్నిహితులూ, సేనాపతులే ఎదురు తిరిగారు. బ్రిటిష్ వారితో మూర్ఖంగా తలపడి, ప్లాసీ యుద్ధంలో చిత్తుగా ఓడి సిరాజుద్దౌలా పరారయ్యాడు. అతడిపై తిరగబడిన మీర్జాఫర్ నవాబయ్యాడు. మారువేషంలో తిరుగుతుంటే తరవాతెప్పుడో సిరాజుద్దౌలా పట్టుబడి శత్రువులు చేతిలో హతమయ్యాడు.

క్లుప్తంగా ఇదీ - ఆంగ్ల చరిత్రకారుల కథనం. వివరాలతో విభేదించి, మొత్తం మీద ఆంగ్లేయులదే తప్పని తేల్చి, సిరాజ్‌ను సమర్థించిన ఆధునిక చరిత్రకారుల్లో కూడా చాలా మంది - ఆ నవాబు అనవసరంగా ఆవేశపడి, ఆంగ్లేయ స్థావరాలపై దూకుడుగా దండెత్తి వినాశనం కొని తెచ్చుకొన్నాడని అభిప్రాయపడ్డారు. గోబెల్స్ తాతలకు ముత్తాతలైన తెల్లదొరలు అల్లిన కల్ల చరిత్రల మహిమ అది.

ఇది నిరాధార నిందా ప్రచారమని నిరూపించడానికి సాక్ష్యాలకోసం నవాబు పక్షంవారి వాదనలనో, మహమ్మదీయ చరిత్రకారుల రాతలనో, సమకాలిక భారతీయ వర్గాల ఆక్షేపణలనో తరచి చూడవలసిన పనిలేదు. ఆ కాలంలో బ్రిటిష్ వారి మధ్య నడిచిన ఉత్తరప్రత్యుత్తరాలను, ఈస్టిండియా కంపెనీ రికార్డులను పరిశీలించినా అసలు గుట్టు బట్టబయలవుతుంది.

ఉదాహరణకు - నవాబు ఆగ్రహానికి గురి అయిన నిర్మాణాలను ఆంగ్లేయులు ఎందుకు చేపట్టాల్సి వచ్చిందన్న సంగతే తీసుకుందాం. క్లయివ్ నేస్తుడైన రాబర్ట్ ఒర్మి చెప్పింది:

> In the begining of April 1756 letters had been received from England, informing the Presidency that war with France was inevitable and ordering them to put the Settlement in a state of defence; but to do this was impossible without building the fort anew ...The spies employed by the Nabob in Calcutta... represented that the English were busy in raising strong fortifi-

cations. The Nawab whose cowardice easily led him to believe anything that alarmed his fears, gave entire credit to the report.

[*A History of the Military Transactions of the British Nation in Indostan...* **Robert Orme,** *Vol. II. p. 54*]

(ఫ్రాన్సుతో యుద్ధం అనివార్యం కనుక మీ స్థావరాలకి తగు రక్షణ కల్పించమని 1756 ఏప్రిల్‌లో ప్రెసిడెన్సీ వారికి ఇంగ్లండు నుంచి ఉత్తర్వులు అందాయి. కోటను మళ్ళీ కొత్తగా కడితే తప్ప ఇది అయ్యేపని కాదు... ఇంగ్లీషు వారు కోటను పటిష్టీకరించడంలో నిమగ్నమయ్యారని కలకత్తాలో నవాబు నియోగించిన గూఢచారులు అతడికి తెలియపరచారు. తనను భయపెట్టేది దేన్నయినా విశ్వసించే ఆ పిరికిపంద వారు చెప్పిందంతా నిజమని నమ్మాడు).

దీని సారాంశం- 1 ఏప్రిల్ 1756 వరకూ కోటలు దిట్టపరచుకోవాలన్న ఆలోచనే ఆంగ్లేయులకు రాలేదు. 2. అప్పుడు నిర్మాణాలను సాగించిందైనా ఫ్రెంచి వారి దాడినుంచి కాచుకోవటానికి మాత్రమే. 3. పిరికి నవాబు బెదిరిపోవలసింది ఇందులో ఏమీ లేదు. 4. ఆంగ్లేయులు తమ కోటలో తాము ఏమి చేసుకుంటారనేది వారి ఇష్టం. నవాబుకు అనవసరం. అంతేకదా?

నిజానికి - కోటలు పటిష్టపరచుకోవాలన్న ఆలోచన అంతకు రెండేళ్ల కిందటే ఆంగ్లేయులకు కలిగింది. అదీ ఫ్రాన్సు నుంచి ప్రమాదం వల్ల కాదు. దేశ ప్రజల్లో ఆంగ్లేయుల పట్ల పెరుగుతున్న వ్యతిరేకత కారణంగా! కంపెనీ చీఫ్ ఇంజనీరు చెప్పిన ప్రకారం ఫలానా కట్టడాలను కట్టుకోండి. కాని దానికి ముందు నవాబు అనుమతిని తప్పక తీసుకోండి - అని లండన్ అధికారులు ఇక్కడివారికి విస్పష్టంగా చెప్పారు. ఆ సంగతి 1754 నవంబరు 29న కోర్ట్ ఆఫ్ డైరెక్టర్లు పంపిన ఈ కింది ఆదేశాన్ని చూస్తే తెలుస్తుంది.

"We observe Collonel Scott laid a project for securing our settlement from any Attacks from the Country Forces... Do not begin or make any progress in the Works until you have your Sentiments Leave and Concurrence... If they are begin without the previous consent of the Country Government, we may expend great sums of money and either be entirely prevented from finishing them or lye at their Mercy for leave to proceed... ..."

[*The Indian Records : Old Fort William in Bengal,* **C.R. Wilson,** *Vol. II. p. 20*]

(దేశీయ శక్తుల దాడుల నుంచి మన స్థావరాన్ని రక్షించుకోవటానికి కల్నల్ స్కాట్ పథకం రూపొందించిన సంగతి గ్రహించాము... అక్కడి పాలకుడి అనుమతి, ఆమోదం పొందేంతవరకూ ఏ పనులను మొదలు పెట్టటం కాని, కొనసాగించటం కానీ చేయవద్దు. ...దేశీయ ప్రభుత్వ పూర్వామోదం లేకుండా వాటిని మొదలెడితే మనం పెద్ద మొత్తాలు ఖర్చుపెట్టాక వాటిని పూర్తి చేయకుండా మనల్ని అడ్డుకోవచ్చు. ముందుకు వెళ్ళటానికి వారి దయ మీద మనం ఆధారపడాల్సి రావొచ్చు).



నవాబుకు చెప్పి, ముందుగా అనుమతి తీసుకొని కాని అడుగు ముందుకు వేయవద్దని కంపెనీ పాలకవర్గం నిక్కచ్చిగా చెప్పినా, ప్రెసిడెన్సీ దొరలు ఆ ఆదేశాన్ని అతిక్రమించి కట్టడాలు సాగించారు. తన రాజ్యంలో తనను అడగకుండా విదేశీ వ్యాపారులు కోటలు కట్టి, కందకాలు తవ్వి, యుద్ధ సన్నద్ధం అవుతుంటే ప్రపంచంలో ఏ రాజూ చూస్తూ ఊరుకోడు. అదే బెంగాల్‌లోని చంద్రనగర్ స్థావరంలో ఫ్రెంచివారు కొంతకాలం కింద ఇలాగే కోటలను పటిష్టపరచుకోబోతే నవాబు బలవంతంగా ఆపించాడు. ఆ సంగతి ఆంగ్లేయులకూ తెలుసు. అయినా - నవాబు అధికారాన్ని, వర్తకులుగా తమ తాహతును వారు గుర్తించలేదు. అక్కడికీ కొత్త నవాబు సిరాజుద్దౌలా తొందరపడకుండా సాధ్యమైనంత నిగ్రహం చూపాడు. 'వ్యాపారం చేసుకునే మీకు కోటలు, రక్షణలు ఎందుకు? అనుమతి లేకుండా కట్టిన వాటిని తొలగించి, తవ్విన కందకాలు పూడ్చండి' అని అతడు సౌమ్యంగా కబురు పంపాడు. తెల్లదొరలు ఏమి చేశారు? "మీ ముసల్మాన్ల తలకాయలతో నింపి కందకాలు పూడ్చేస్తాములే" అని ఒళ్లుమండే జవాబు పంపారు.

అలాగే - సర్కారీ సొమ్ము కాజేసి, నవాబు లెక్క అడిగితే అరకోటి రూపాయల దొంగసొమ్ముతో పరారైన ఒకానొక ఉన్నత రాజోద్యోగి కుమారుడు కృష్ణదాస్ అనే వాడి దగ్గర భారీగా లంచం పట్టి బ్రిటిష్ వాళ్లు తమ స్థావరంలో ఆశ్రయమిచ్చారు. వాడిని తక్షణం తమకు అప్పగించవలసిందని ఆదేశిస్తూ నవాబు దూతను పంపితే గవర్నర్ డ్రేక్ గారు ఆ సందేశాన్ని చింపి దూత మొహాన కొట్టి దారుణంగా అవమానించి పంపాడు.

సుంకం లేకుండా విదేశీ వ్యాపారం చేసుకునేందుకు మొగల్ పాదుషా ఇచ్చిన షరతులతో కూడిన రాయితీని ఇంగ్లీషువారు విశృంఖలంగా దుర్వినియోగం చేస్తున్నందుకు వారిపై నవాబు అసలే భగభగలాడుతున్నాడు. 'కంపెనీ' పరంగా చేసే వ్యాపారానికి, అదీ విదేశీ ఎగుమతి దిగుమతులకు సంబంధించే ఇవ్వబడిన ఆ వెసులుబాటును తెల్లదొరలు ఎడాపెడా వాడేసుకుని కంపెనీ ఉద్యోగులు చేసుకునే సొంత వర్తకాలకూ, దేశంలోపల దేశస్థులతో జరిపే క్రయవిక్రయాలకూ పన్ను మినహాయింపు పత్రాలను పప్పుబెల్లాల్లా అమ్మేసుకోసాగారు. దీనివల్ల సర్కారు ఖజానాకు న్యాయంగా రావాల్సిన ఆదాయానికి అరకోటి రూపాయల గండిపడినట్టు నిరూపించడానికి నవాబు దగ్గర కావలసినన్ని సాక్ష్యాధారాలు పోగయ్యాయి. ఈ తప్పుడు పనులు మానెయ్యమని, ఎగ్గొట్టిన పన్నుకు పరిహారం చెల్లించమని నవాబు ఎన్నివిధాల చెప్పినా కంపెనీ గ్రంథసాంగులు ఖాతరు చెయ్యడం లేదు. పౌరుషం ఉన్న ఏ ప్రభుత్వమూ సహించి ఊరుకోజాలని ధిక్కారమిది. అగ్నికి ఆజ్యం తోడైనట్టు ఇదే సమయంలో రాజద్రోహి పుత్రుడికి ఆశ్రయం..., కందకాలు, బురుజులను వద్దంటున్నా యుద్ధ ప్రాతిపదికన కట్టేయటం జరగడంతో ఇక లాభం లేదని తలచి సిరాజుద్దౌలా నవాబు తెల్ల వర్తకులను హద్దుల్లో పెట్టి బుద్ధి గరపటానికి ప్రత్యక్ష చర్యకు దిగాడు.

అంతవరకూ సిరాజ్ మంచితనాన్ని బలహీనతగా భావించి పేట్రేగిన సీమ సాహుకార్లు అతడు అన్నంత పనీ చేయడంతో బెంబేలెత్తారు. కాసింబజారు గిడ్డంగి మీదికి అతడు దండెత్తగానే పెద్ద దొరలందరూ పిరికిపందల్లా నావలెక్కి పారిపోయారు. అప్పటికైనా తిక్క కుదిరి బుద్ధిగా దారికొస్తారేమోనని ఓపిక పట్టినా ప్రయోజనం లేకపోవడంతో కొద్ది వారాలకు మళ్లీ దాడిచేసి కలకత్తా స్థావరాన్నీ నవాబు పట్టుకున్నాడు. దోపిడీ కోసమే అతడు దాడిచేశాడని, నానా అఘాయిత్యాలు చేసి సంపదనంతా కొల్లగొట్టాడని, చీకటి కొట్లో వేసి బందీలను

క్రూరంగా చంపించాడనీ ఇంగ్లీషు మేధావులు అనంతర కాలంలో కట్టుకథలనైతే బాగా అల్లారు. కాని - నవాబు తమ పట్ల దురుసుగా ప్రవర్తించినట్టు, దోపిడీలు సాగించినట్టు కంపెనీ అధికారులు ఏ ఒక్కరూ పేర్కొనలేరు. గువ్వపిట్టల్లా చేతికి చిక్కినవారిని నిలువునా చంపేసినా తనను అడిగేవారు లేకపోయినప్పటికీ... నిర్దయగా కాలరాచి వేయడానికి కావలసినన్ని కారణాలు తనకు ఉన్నా సిరాజుద్దౌలా ఇంగ్లీషు వర్తకులతో చాలా మృదువుగా, సౌమ్యంగా వ్యవహరించాడు.

ఈ మేలుకు వారు చేసిన ప్రత్యుపకారమేమిటి?



# విజయానికి దొంగదారి

యుద్ధాలు, సంధులు భారతీయులకు కొత్త కావు. వేల సంవత్సరాల చరిత్రలో బయటినుంచి వచ్చిన విదేశీయులతోనూ, దేశంలోని విరోధులతోనూ మన రాజులు లెక్కలేనన్ని యుద్ధాలు చేశారు. ధర్మబద్ధంగా పోరాడినా, అధర్మ యుద్ధానికి దిగినా ఎవరికివారు శత్రుపక్షంపై భీకర సంగ్రామం సాగించేవారు. సైనికబలం, పరాక్రమం, యుద్ధనైపుణ్యం, అదృష్టం ఎవరి పక్షాన ఉంటే వారిని విజయం వరించేది. తరవాత విజేతల షరతుల మేరకు సంధి కుదిరేది. యుద్ధం గెలిచాక కూడా పగ చల్లారక శత్రు సైన్యాన్ని, చేతికి చిక్కిన అమాయక జనాన్ని ఊచకోత కోసి, నర రూప రాక్షసుల్లా అఘాయిత్యాలు చేసినవారు కూడా... దూకుడు తగ్గాక కత్తిని దించి సర్దుబాటుకు సుముఖమయ్యేవారు. ఒక సారి సంధి అంటూ కుదిరిన తరవాత మళ్లీ కొత్త పేచీలు, పొరపొచ్చాలు రానంతవరకూ రాజీ షరతులను ఎవరూ అతిక్రమించేవారు కాదు.

విదేశాలనుంచి తెరలు తెరలుగా వచ్చిన మహమ్మదీయులతో హిందువులు హోరాహోరీ సమరాలు అనేకం చేశారు. ఆ క్రమంలో అనేక మోసాలకూ, ద్రోహాలకూ లోనయ్యారు. అయినా... శత్రు పక్షం దాడినుంచి తమను తాము ఎలా కాచుకోవాలి... తమ కోటలనూ, రాజ్యాన్నీ చతురంగ బలాల సాయంతో ఎలా రక్షించుకోవాలి అన్న ధ్యాసే తప్ప... తమకు వ్యతిరేకంగా తమ సైన్యంలోనే చిచ్చుపెట్టి, సేనాపతులను తనవైపు తిప్పుకుని శత్రువు మాయ చేస్తాడేమోనన్న భయం హిందూ రాజులకు గాని, తురక సుల్తాన్లకు గానీ సాధారణంగా ఉండేది కాదు. ఒకసారి రాజీకి ఒడంబడిన తరవాత అవతలివారు మర్నాటినుంచే దాన్ని తుంగలో తొక్కి నీచానికి పాల్పడగలరన్న సంశయం వారికి సర్వసామాన్యంగా కలిగేది కాదు.

యుక్తాయుక్తాలకూ, నీతి నియమాలకూ సంబంధించి అనేక శతాబ్దాల పాటు అందరూ పాటించిన ఈ కట్టుబాటు తెల్లవాడు కాలు బెట్టాక దిక్కులేకుండా పోయింది. అంతవరకూ

హిందూ ముస్లిం ప్రభువులు తమలోతాము ఎన్ని యుద్ధాలు చేసి ఎన్ని వేలూ లక్షల తలలు తెగవేసుకున్నా, విరోధుల కుట్రలూ కుహకాలకు ఎన్ని విధాల లోనైనా ఇటువంటి మాయావులను ఎవరూ ఎన్నడూ చూసి ఉండలేదు. సీమ నుంచి వచ్చినవారు గోమాయువులన్న సంగతి గ్రహించటానికే చాలా సమయం పట్టింది. వారి తత్వం అర్థమయ్యేసరికి పరిస్థితి చేయిదాటి పోయింది. మొత్త దేశం మహాఘోరంగా నక్కలపాలయింది.

సీమ నుంచి దిగబడింది ఆయుధాలు పట్టిన సైనికులు కాదు. సరకుల వర్తకానికి వచ్చిన వ్యాపారులు! తమ ముందు సాగిలపడి, నంగి వినయం చూపి, తమ దయాధర్మంపైనే ఆధారపడి బతుకుతున్నట్టు చెప్పుకునే ఈ బేరగాళ్ల గుంపు తమ వెనకే గోతులు తీసి తమ అధికారానికే గోరీ కట్టబోతోందని మన అమాయక ప్రభువులు పసికట్టలేకపోయారు. శీతాకాలంలో ఫుట్‌పాత్‌లపై స్వెట్టర్లు అమ్ముకోవటానికి వచ్చే నేపాలీలను చూసి ఈ కాలంలో మనం పాపం అనుకుంటున్నట్టే... తక్కువ ధరకు మంచి సరుకు అమ్ముతున్నారని సంతోషపడుతున్నట్టే ఆ కాలపు మన పాలకులు వేల మైళ్ల దూరం నుంచి ఓడల్లో వచ్చిన తెల్లవర్తకులను చూసి జాలిపడ్డారు. తమ పట్ల వారి అణుకువకు, వారి వర్తకం వల్ల తమ ఖజానాకు కలిగే ఆర్థిక లాభానికి సంతోషించి... అడపాదడపా హద్దుమీరినప్పటికీ వారిని స్వల్ప శిక్షలతో వదిలేసే వారు. పిచ్చుక మీద బ్రహ్మాస్త్రం వేయడమెందుకని వారి ఆగడాలను ఉపేక్షించేవారు.

అదిగో ఆ ఉపేక్షే బెంగాల్‌లో సిరాజుద్దౌలా నవాబు రాజ్యానికీ, అతడి కంఠానికీ ఉరితాడు అయింది.

సిరాజ్‌కు ఆంగ్లేయులంటే మహా చులకన! ప్రపంచమంతా కలిపి చూసినా యూరోపియన్లు పది పన్నెండువేల మందికి మించరనీ, అందరూ కట్టకట్టుకు వచ్చినా తన మహాసేన ముందు నిలవలేరనీ అతడు తరచూ అనేవాడు. తెల్లవాళ్లను అదుపులో ఉంచటానికి కావలసిందల్లా ఒక చెప్పుల జత – అని అతడి అభిప్రాయం! ఈ చిన్నచూపు వల్లే - అతడు 1756లో తనను ధిక్కరించిన ఇంగ్లీషువారిని చెంపలు మాత్రం వాయించి విడిచిపెట్టాడు. కాసింబజారు స్థావరాన్నీ, కలకత్తా కోటనూ అవలీలగా వశపరచుకున్నా అక్కడి ఆంగ్లేయుల ఆస్తిపాస్తులలో పూచికపుల్ల కూడా ముట్టకుండా, ఎవరినీ శిక్షించకుండా వదిలేశాడు. తన సైనికులు పట్టుకున్న ఇంగ్లీషు అధికారిని పిలిపించి, కట్టువిప్పించి, "నేను ఉన్నంతవరకూ మీ తలవెంట్రుక కూడా చెదరద"ని అడక్కుండానే అభయం ఇచ్చాడు. తన దెబ్బకు హడలి, కోట వదిలి పారిపోయి ఫుల్తావద్ద తలదాచుకున్న కుంపిణీ పరివారానికి ఆయన సకల సదుపాయాలూ కల్పించాడు. "మా దేశం వెళ్లిపోవటానికి ఓడకోసం వేచి ఉన్నాము దేవరా" అని వారు అనగానే జాను కాబోలనుకున్నాడు. తినడానికి తిండి లేక వారు అల్లాడుతున్నారని ఎవరో చెప్పగానే తక్షణం అంగళ్ల తెరిపించి వారికి కావలసిన సరుకులన్నీ ఇప్పించండి అని ఉత్తర్వు వేశాడు. "వెధవలకు ఇప్పటికి బుద్ధి వచ్చింది. ఇక నుంచీ తమ తాహతుకు తగ్గట్టు మెలగుతారు" అనుకుని, అంతా సవ్యంగా ఉందన్న ధీమాతో కలకత్తా రక్షణ బాధ్యతను తన ఫౌజ్‌దారు మాణిక్ చంద్‌కు అప్పగించి, రాజధాని ముర్షిదాబాద్‌కు నవాబు చక్కాబోయాడు.

అసలు కుట్ర అప్పుడు మొదలైంది.



ఫుల్తా శిబిరంలో కుంపిణీ కాందిశీకులు ఎదురు చూస్తున్నది వారన్నట్టు స్వదేశానికి తీసుకుపోయే ఓడ కోసం కాదు. నవాబు ముందు లెంపలేసుకుని, వొంగి వొంగి దండాలు పెడుతూనే వారు మద్రాసులోని తమ సెయింట్ జార్జి కోటకు బలగాల కోసం కబురు పంపారు. కాసింబజారు స్థావరం చేజారిందని మొదటి కబురు రాగానే అక్కడినుంచి కిల్ పాట్రిక్ అనే ఆయన 250 మంది సిపాయిల్ని తీసుకుని ఓడలో బయలుదేరాడు. అది అడంగు చేరేసరికి... కలకత్తా కోట కూలిందనీ, 20 వేలకు పైగా బలగంతో నవాబు సేన అక్కడ మోహరించి ఉన్నదనీ తెలియవచ్చింది. దాని ముందు తమ శక్తి ఎందుకూ కొరగాదనీ మళ్లీ చెన్నపట్నానికి ఆర్తనాదం వెళ్లింది. ముంచుకొచ్చిన ప్రమాదం తీవ్రతను గ్రహించిన వారై, దక్కనులో చేయదలిచిన సైనిక కుతంత్రాలన్నిటినీ ఆంగ్లేయులు వాయిదా వేసుకుని, సర్వశక్తులనూ సమీకరించి అడ్మిరల్ వాట్సన్, కర్నల్ క్లయివ్‌ల నాయకత్వంలో సైనికబలగాన్ని హుటాహుటిన బెంగాల్ తీరానికి తరలించారు.

ఈ విధంగా... కలకత్తా నుంచి తెల్లవారిని గెంటేసిన ఆరు నెలలకు బ్రిటిష్ వారి అందుబాటులో ఉన్న సమస్త సైనిక బలగాలూ వంగభూమికి చేరుకున్నాయి. 52 మంది ఆఫీసర్లు, 940 మంది సిపాయిలూ, 160 మంది లస్కర్లు వగైరా... అంతా కలిపి రెండువేల బలమే. అటువైపు మోహరించి ఉన్న 20 వేల పైచిలుకు నవాబు సైన్యం ముందు అది ఎందుకూ చాలదు. ఎదిరించి నవాబును గెలిచే ఆశలేదని తేలిపోయినప్పుడు వాస్తవంతో రాజీపడి, నవాబు సౌమనస్యాన్ని వినియోగించుకుని గౌరవప్రదమైన పరిష్కారం కుదుర్చుకోవటం మినహా గత్యంతరం లేదు. ఆ పరిస్థితుల్లో ఫ్రెంచివారో, డచ్చివారో ఉంటే ఆ పనే చేసేవారేమో.

కాని – మనం మాట్లాడుతున్నది నక్కకు జిత్తుల నేర్పగల ఆంగ్లేయుల గురించి. శౌర్యం వల్ల కాని పనిని మోసం వల్ల సాధించడమే ఉత్తమమని వారు అనుకున్నారు. నవాబు సేనను గెలవన్నప్పుడు నవాబుకు వ్యతిరేకంగా అతడి సేనను లోబరచుకోవడమే మేలని వారికి తోచింది. ఇంకేం? చడీ చప్పుడు కాకుండా 'వల' విసిరారు. నవాబు సేనాని మాణిక్‌చంద్‌ను లంచం ఎరతో బుట్టలో వేశారు. ముందుగా కూడబలుక్కున్న ప్రకారం బ్రిటిష్ సేన దాడి చేసే సమయానికి నవాబు సైన్యాన్ని సేనాపతి వేరేచోటికి మరలించేవాడు. తుపాకులు పేల్చాల్సిన శ్రమ దొరలకు ఇవ్వకుండా సకాలంలో ఖాళీచేసి పోయి, బజ్‌బజ్, కలకత్తా, హుగ్లీ కోటలను ఒకటితరవాత ఒకటిగా వారికి పళ్లెంలో పెట్టి అప్పగించాడు.

అనంతర కాలంలో పలువురు ఆంగ్లచరిత్రకారులు, వారి కబుర్లను నమ్మి మన దేశవాళీ గ్రంథకర్తలు అభివర్ణించినట్టు కొద్దిపాటి బలంతోనే ఈస్టిండియా కంపెనీ విజృంభించి బెంగాల్ స్థావరాలను తిరిగి స్వాధీనపరచుకో గలిగింది – రాబర్ట్ క్లయివ్ అద్భుత పరాక్రమం వల్ల కాదు. సుశిక్షితమైన సైనిక పాటవం వల్లా కాదు. నీచమైన ప్రలోభానికి లొంగి, ఏ సైనికుడూ చేయకూడని పని చేసి, స్వామి ద్రోహానికీ, దేశ ద్రోహానికి ఒడిగట్టిన మాణిక్‌చంద్ అనే ఆశపోతు సేనాపతి వల్ల!

ఆ సంగతి కంపెనీ వారికి బాగా తెలుసు. అందుకే దేశద్రోహానికి ప్రతిఫలంగా మాణిక్‌చంద్ కుమారుడికి తమ కంపెనీలో పెద్ద ఉద్యోగం ఇచ్చారు.

"The government (in 1763) agreed to entertain on the company's pay the son of the deceased Manik Chand, who was

useful to them in various ways during the preceeding 30 years; though he led the Nawab's troops against the England at the battle of Budge Budge".

[*Selections from the Government Records, quoted by* **Basu** *in "Rise of Christian power in India, p. 68*]

(బజ్ బజ్ యుద్ధంలో ఇంగ్లీషు వారికి వ్యతిరేకంగా నవాబు సేనలను నడిపించినప్పటికీ గత 30 సంవత్సరాల్లో తమకు వివిధ విధాలుగా ఉపయోగపడిన మాణిక్‌చంద్ కుమారుడిని కుంపిణీ కొలువులోకి తీసుకునేందుకు (1763లో) ప్రభుత్వం అంగీకరించింది.)

రెవరెండ్ లాంగ్ సంపుటీకరించిన బ్రిటీష్ ప్రభుత్వ రికార్డులోని ఈ వాక్యమే మాణిక్ చంద్ ద్రోహానికి రుజువు. ఈ వాక్య నిర్మాణాన్ని బట్టి "గతంలో చేసిన సేవలకు ప్రతిఫలంగానే ఇంగ్లీషువారు ఉపకారం చేసి ఉండొచ్చు గదా అన్న సంశయం అక్కర్లేదు. మాణిక్ చంద్ చేసిన అసలు ఉపకారమే బజ్ బజ్ తదితర కోటలను పువ్వుల్లో పెట్టి తెల్లవారికి అప్పగించటం.

తరవాత ఉండబోయేవారు రావటానికి ముందే అద్దెకున్నవాడు ఇల్లుఖాళీ చేసి వెళ్లి పోయినట్టు - ఇంగ్లీషు సేన చేరుకోవటానికి పూర్వమే బజ్ బజ్ కోటను మాణిక్ చంద్ ఖాళీ చేసి పోయాడు. ఎలాంటి ప్రతిఘటనా లేకుండా అంత పటిష్ఠమైన కోట అవలీలగా తమ వశమైనందుకు ఆ సమయంలో ఇంగ్లీషు సేనను నడిపించిన కెప్టెన్ కూటె ఇలా ఆశ్చర్యపడ్డాడు.

While I was on board a sailor that was drunk, stole away to the fort gate, and fired his pistol and cried out the place was his, upon which Captain King's troops, entered the fort without any opposition. Thus the place was taken without the least honour to anyone; We found the fort very strong, with a wet ditch all round it.

[*Coote's Journal quoted by* **Ram gopal** *in How The British Occupied Bengal, p. 121*]

(నేను నౌకలో ఉన్న సమయంలో ఒక తాగుబోతు నావికుడు తూలుతూ కోట గేటు దగ్గరికిపోయి, పిస్టల్ పేల్చి 'ఈ కోటనాది' అని అరిచాడు. అది చూసి కెప్టెన్ కింగ్ దళాలు ఏ ప్రతిఘటనా లేకుండా కోటలో ప్రవేశించాయి. ఈ విధంగా ఎవరూ తమకు గౌరవంగా చెప్పుకోజాలని రీతిలో అది స్వాధీనమైంది. కోట చాలా పటిష్ఠంగా మాకు కనిపించింది. దాని చుట్టూ నీటి కందకం ఉంది.)

సైనిక వ్యూహంతో కాక నమ్మకద్రోహం ద్వారా శత్రువును గెలవటం సైనికుడన్నవాడికి సిగ్గుచేటు. ఇలాంటి సిగ్గుచేటు పనులు ఇంగ్లీషువారు ఇంకా ఎన్నో చేశారు. చేశారు కాబట్టే విశాల భారత సామ్రాజ్యాన్ని కరిమింగిన వెలగలా నీచాతినీచంగా కబళించారు.

సరే! ఎవరి గుణం వారిది. ఎవరి సంస్కారం వారిది. పౌరుషంతో పోరాడి గెలవలేమని తెలిసినందున మోసంతో కార్యం సాధించడమే మేలని తెల్లవారు అనుకున్నారు. ఆ ప్రకారమే తాము కోల్పోయిన కోటలను, గిడ్డంగులను తిరిగి వశపరచుకోగలిగారు. వారికి వేరే దుర్బుద్ధి



ఏదీ లేకపోతే ఆ తరవాతయినా స్థానిక నవాబుతో సఖ్యంగా ఉండేందుకు ప్రయత్నించాలి కదా? తమ వ్యాపారమేదో తాము చేసుకుంటూ, తమ లాభాలేవో తాము గడిస్తూ తమ ప్రాబల్యంలోని ప్రాంతాలపై పెత్తనాన్ని చలాయించుకుంటూ తమ హద్దుల్లో తాము ఉండాలి కదా?

నవాబు దుష్టుడు, దుర్మార్గుడై వారిమీద కత్తి కడితే వేరే సంగతి. తన రాజ్యంలో ఆంగ్ల వర్తకుల ఉనికిని సహించేది లేదని, వారిని నామరూపాలు లేకుండా నిర్మూలించి తీరతానని అతడు వెంటపడి ఉంటే ఆత్మరక్షణ నిమిత్తం ఆ వర్తకులు ఎదురుదాడికి దిగవలసి వచ్చిందని సరిపెట్టుకోవచ్చు. నిజానికి పగ అనేది ఉంటే గింటే నవాబుకు ఉండాలి. తన రాజ్యంలో ఉండి, తన అధికారాన్నే ధిక్కరించి, తన దూతలను అవమానించి, రాజద్రోహులకు ఆశ్రయమిచ్చి, ఖజానాకు యధేచ్ఛగా గండి కొట్టిన మహాపరాధాలకు అతడు మండిపడి, కంపెనీవారందరినీ నరికి పోగులు పెట్టినా ఎవరూ అది తప్పు అనగలిగేవారు కాదు. సిరాజుద్దౌలా పెద్ద మనసుతో వారిని క్షమించి, స్థావరాల నుంచి మాత్రమే గెంటేసి ఊరుకున్నాడు. ఆ తరవాత ఆరునెలల పాటు తన గడ్డమీద వారిని ఉండనిచ్చి, సకల సదుపాయాలూ కల్పించినా వారు పెడబుద్ధిని మానకుండా చెన్నపట్నం నుంచి భారీ సైనిక బలగాలను రప్పించుకున్నందుకు సిరాజుద్దౌలా ఆగ్రహోదగ్రుడు అయి ఉండాల్సింది. ఇక తన సేననే లోబరచుకుని, దొంగదారిలో తన నుంచి కోటలను గుంజుకున్నందుకైతే సిరాజుద్దౌలా స్థానంలో వేరెవరున్నా బ్రిటిష్ వారిపై యుద్ధం ప్రకటించి నిశ్శేషంగా నాశనం చేసి ఉండేవారే.

ఇంత జరిగాక కూడా సిరాజ్ సంయమం వీడలేదు. ప్రతీకారేచ్ఛతో భగభగలాడలేదు. విషయం తెలియగానే పెద్ద సైన్యంతో కలకత్తాకైతే వచ్చాడు. కాని - యుద్ధానికి కాక సంధికే అతడు కడదాకా తంటాలు పడ్డాడు. "మీ వ్యాపారాలు మీరు చేసుకోవటానికి అనుమతిస్తాను; మీ పూర్వ హక్కులన్నీ పునరుద్ధరిస్తాను! ఇంకా ఏమి కావాలన్నా చేస్తాను. మీకు నమ్మకమైన దూతలిద్దరిని నా వద్దకు పంపండి. మాట్లాడుతాను" అని క్లయివ్‌కు అతడు కబురు పంపాడు.

నవాబే అంతటి ఔదార్యం చూపాక ఆంగ్లేయులకు సంశయించాల్సిన అవసరమే లేదు. ఆ పరిస్థితుల్లో అతడికి అణిగి ఉండటంకంటే వారు చేయగలిగిందీ లేదు. అతడి సైనిక శక్తి ముందు వారు నిలబడగలగటం కల్ల. నవాబు సైన్యంతో పోల్చితే తమదీ ఒక సైన్యమే అని చెప్పుకోవటానికే వీల్లేదని ఆంగ్ల సేనానులే అంగీకరించారు. ఇటువంటి సంకటంలో బలవంతుడైన శత్రువుకు తలొగ్గి, అతడి షరతుల మేరకు సంధి కుదుర్చుకోవటం కంటే గత్యంతరం లేదు. మీ షరతులకే నేను ఒప్పుకుంటానని అవతలివారే అన్నప్పుడు వెనకాడాల్సిన పని అసలే లేదు.

కాని - ఇవతలివాడు రాబర్ట్ క్లయివ్! అతడి బుద్ధి ఎప్పుడూ వంకర. ముందు అన్నిటికీ సరే అన్నాడు. కలకత్తాలో నవాబు విడిది చేసిన తోటకు అతడు కోరిన ప్రకారం 1757 జనవరి 4న ఇద్దరు దూతలను పంపాడు. వారు మాట్లాడినట్టే నటించి, ఆనుపానులన్నీ కనిపెట్టారు. సంభాషణను సాగదీసి, రాత్రి పొద్దుపోయాక తమకు కేటాయించిన గుడారంలోకి వెళ్లి, దీపాలు ఆర్పేశారు. నిద్రపోతున్నారు కాబోలని అందరూ అనుకుంటుండగా మెల్లగా బయటపడి చీకట్లో కలిసి పొలిమేరల్లో కాచుకుని ఉన్న క్లయివ్ దండును కలుసుకున్నారు.

ఎవరు ఎక్కడ ఉన్నారో, సేనల మోహరింపు ఎలా ఉన్నదో వారి నుంచి తెలుసుకుని క్లయివ్ మెరుపులా కదిలాడు. 5వ తేదీ తెల్లవారు జామున దట్టమైన పొగ మంచు మాటున నవాబు శిబిరంపై విరుచుకుపడ్డాడు.

రాజీ చర్చలు జరుగుతుండగా శత్రువులు దాడిచేస్తారని సాధారణంగా ఎవరూ ఊహించరు. బాబర్‌కూ సంగరాణాకూ, అక్బర్‌కూ రాణాప్రతాప్‌కూ... ఔరంగజేబుకూ శివాజీకీ మధ్య భీషణ యుద్ధాలు ఎన్ని జరిగినా సంభాషణల ఘట్టంలో దొంగదాడికి మహానీచులైన మొగలులు కూడా దిగజారలేదు. 'అంగ్రేజీ'లను బద్ధవైరులుగా తాను తలచటం లేదు కనక, తనతో రాజీ వారికే లాభం కనక - తాము నిద్రిస్తుండగా వారు మీదపడతారన్న అనుమానం సిరాజ్‌కు సహజంగానే లేకపోయింది. రక్షణ దళాలూ ఆదమరచి నిద్రావస్థలో వున్నాయి. అందువల్ల పొగమంచు అడ్డం చేసుకుని శిబిరం పైపడి, నవాబు ఉన్నట్టుగా తనకు దూతలు ఉప్పందించిన గుడారంలోకి క్లయివ్ ఎకాఎకి దూసుకు వెళ్లాడు.

నవాబు కనుక అక్కడ వుండి వుంటే అతడి కథ ఆనాడే ముగిసేది. కాని -అదృష్టవశాత్తూ క్రితం రాత్రి కుంపిణీ దూతల వాలకాన్ని చూసి అనుమానం తోచిన దివాను ఎందుకైనా మంచిదని పడుకోబోయే ముందు నవాబును వేరే గుడారానికి మార్చాడు. కాబట్టి సిరాజ్ బతికిపోయాడు. మెరపుదాడికి దిమ్మెరపోయిన నవాబు బలగాలు త్వరగానే తెప్పరిల్లి శత్రువులతో బాగానే పోరాడాయి. నవాబు పక్షంలో 1300 మంది, ఇంగ్లీషువారివైపు 200 మంది చనిపోయారు. మామూలు ప్రకారం ఉదయం 8 కల్లా మంచు తెరలు విడిపోయివుంటే తాము నిర్ణయాత్మక విజయం సాధించి వుండేవారమని, అలా జరగని కారణంగా ఏమీ సాధించకుండానే వెనుదిరగవలసి వచ్చిందని స్వయంగా క్లయివే చెప్పాడు. అయినా అతడిని మించిన రాజభక్తి కలిగిన డాడ్వెల్ దొరగారు మాత్రం 1757 ఫిబ్రవరి 5 వేకువన జరిగిన ఆ పోరే నవాబు పరాజయంలో నిర్ణయాత్మకమైనదనీ, అప్పుడు క్లయివ్ దెబ్బకు జడిసే నవాబు పరారై, రాజీ బేరానికి తొందరపడ్డాడనీ కేంబ్రిడ్జి హిస్టరీ ఆఫ్ ఇండియాలో లోకానికి చాటాడు.

నవాబు ఆంగ్లేయులతో రాజీకీ తొందరపడిన మాట నిజమే. కాని అది క్లయివ్ ప్రతాపానికి హడలిపోయి కాదు. దానికి బలమైన కారణం వేరే వుంది. అదేమిటో సాక్షాత్తూ క్లయివే 1757 మార్చి 11న మద్రాసులోని జార్జి పిగాట్‌కు పంపిన లేఖలో ఇలా వాక్రుచ్చాడు.

> "I had already acquainted you of the revolution which has happened at Dilly, since which the Nabab writes me, he has received advices that the Afghans are marching towards his Provinces. He has desired me in the strongest terms to join him, and has affored to pay a Lack of Rupees per month for the maintenace of the forces..."
>
> [*How The British Occupied Bengal* - **Ram Gopal,** *p. 16*]
>
> *(ఢిల్లీలో జరిగిన విప్లవం గురించి మీకు ఇంతకుముందే తెలియపరిచాను. ఆ తరువాత నాకు నవాబు జాబు రాశాడు. ఏమనంటే - అఫ్ఘాన్లు తన పరగణాలపైకి దండెత్తి వస్తున్నట్టు అతడికి సమాచార మందిందట. ఈ సవాలును ఎదుర్కోవడానికి తనతో చేతులు కలపవలసిందని అతడు చాలా గట్టిగా కోరాడు. మన బలగాల*



> *ఖర్చులకింద నెలకు లక్ష రూపాయలు చొప్పున చెల్లించటానికి అతడు సిద్ధపడ్డాడు).*

అదీ సంగతి! బెంగాల్‌లో సిరాజ్ తెల్లవారితో తలపడుతున్న సమయంలోనే అఫ్ఘానిస్తాన్ నుంచి అహ్మద్ షా అబ్దాలీ దండెత్తి వచ్చి మొగలు సింహాసనం ఆక్రమించాడు. తన పేర నాణేలను కూడా ముద్రించాడు. పాదుషాకు చెందిన సుబాలు అన్నిటినీ వశపరచుకోవటానికి ఉరకలు వేస్తున్నాడు. దాంతో దేశమంతటా మహా గగ్గోలుగా వుంది. ఎప్పుడు ఏమి జరుగుతుందో, విదేశీ శత్రువు బారినుంచి తమను ఎలా రక్షించుకోవాలో మొగలు సర్దార్లకు, సుబేదార్లకు బోధపడటంలేదు. ఏకంగా తన గద్దెకిందికే నీళ్లు వస్తున్న ఆపత్సమయంలో సర్వశక్తులూ సమీకరించి, అందరినీ కూడట్టుకుని విదేశీ శత్రువును ఎదుర్కోవడం మేలని సిరాజుద్దౌలా భావించాడు. తన ముందు అర్భకులని తాను అనుకున్న తెల్లవారి తప్పిదాలను ఉపేక్షించి, ఎలాగైనా వారిని సంతుష్టిపరచి, వారి సైనిక సహాయాన్ని పొందాలని అతడు నిశ్చయించుకున్నాడు. అందుకే తొందరపడి, తనకు నష్టమని తెలిసినా ఆంగ్లేయులడిగిన హిరణ్యాక్ష వరాలన్నిటికీ ఒప్పుకుని 1757 ఫిబ్రవరి 9న ఇంగ్లీషు వారితో ఒప్పందం కుదుర్చుకున్నాడు. అది అన్ని విధాల మనకే లాభం; ఇంతటి సావకాశాన్ని వదులుకోవటం అవివేకం అని క్లయివ్ అంతటివాడే ఆనందపడ్డాడు.

ఆ ప్రకారంగా - కాలం కలిసివచ్చి ఆంగ్లేయులు ఎగిరి బూర్ల గంపలో పడ్డారు. వారి పెత్తనం, వారి పూర్వ ప్రాభవం వారికి మళ్లీ వచ్చాయి. నవాబు సౌజన్యం మూలంగా కలలో సైతం ఊహించలేని అదృష్టం వారిని పట్టింది.

ఆ తరువాతయినా వారు నవాబుతో సరిగా ఉన్నారా? అతడి బతుకు అతడిని బతకనిచ్చారా?

# మహాద్రోహుల మాయాబజార్

**అది తెలివిమీరిన తోడేలు. నవనవలాడుతున్న మేక వాగులో నీరు తాగుతుండగా చూసింది. నోరూరింది. ఆరగించటానికి కారణం కావాలి కదా? నేను తాగుతున్న నీళ్లను నువ్వు ఎంగిలి చేశావు కనుక నీకు మరణ శిక్ష వేస్తున్నానని ప్రకటించింది. 'నేను దిగువన ఉన్నా. నువ్వు ప్రవాహానికి ఎగువన ఉన్నావు. నీ నీరు నేను ఎలా ఎంగిలి చేయగలను' అని అమాయకంగా అడిగింది మేక. 'నువ్వు కాకపోతే నీ తాత! ఎప్పుడో నా నీరు మురికి చేసేఉంటాడులే' అని చెప్పి తోడేలు చప్పున మేకను చప్పరించేసింది.**

సందర్భం వేరు. సన్నివేశం వేరు. కాని 1757 బెంగాలీ నీటి పట్టున ఇంగ్లీషు తోడేలు చేసింది కూడా ఇలాంటి పనే!

ఆ సంవత్సరం ఫిబ్రవరి 9న తనకు అవసరమై ఇంగ్లీషు వారితో సంధి కుదుర్చుకోవటంతో వైరం సమసి, అంతా పరిష్కారమైపోయిందనే సిరాజుద్దౌలా నవాబు అనుకున్నాడు. కాని- వారు అలా అనుకోలేదు. అడగ్గానే అన్నిటికీ ఒప్పేసుకున్నందుకు ఆంగ్లేయులు ఆనందపడి, తన మంచితనానికి ముగ్ధులై జీవితాంతం తనకు మిత్రులుగా ఉండి పోతారని వెర్రి నవాబు ఆశపడ్డాడు. 'అడగ్గానే ఒప్పుకునేవాడిని ఈ కొంచెమే అడిగామేమిటి? ఇంకా చాలా అడిగితే అవి కూడా ఒప్పుకునేవాడు కదా-' అని తెల్లదొరలు గింజుకున్నారు. సంధి పత్రం మీద సంతకాల తడి ఆరకుండా మూడో నాటికే కలకత్తా పెద్ద దొరలు అందరినీ కేకేసి అర్జంటు సమావేశం పెట్టారు. ఎందుకు? నవాబును ఒత్తిడి చేసి ఇంకా మరిన్ని లాభాలు పొందటానికి మన బలం సరిపోదా; మనం గట్టిగా పట్టుబడితే నవాబు అదనపు షరతులకు ఒప్పుకోడా... అన్నది చర్చించటానికి.

చివరికి అంతా కలిసి తేల్చిందేమిటంటే... నవాబు మెడలు వంచటానికి మన బలం ఎందుకూ చాలదు. అతి చేస్తే గతి చెడుతుంది. మొదటికే మోసం రాకుండా ఉండాలంటే తెలివిగా పథకం వెయ్యాలి. మనవాడొకణ్ని మన ప్రతినిధిగా నవాబు దర్బారులో ఉంచి, జాగ్రత్తగా కథ నడపాలి - అని! ఆ ప్రకారమే మిస్టర్ వాట్స్ అనే మాయావిని స్పెషల్ డ్యూటీ మీద ముర్షిదాబాద్ పంపారు. అతడి పనల్లా నవాబు నోట మన్నుకొట్టి దశలవారీగా అతడి రాజ్యాన్ని ఆంగ్లేయులు ఆరగించటానికి కుంటిసాకులు వెదికి, మడతపేచీలు పెట్టి, రంగం సిద్ధం చేయడమే.

అప్పటికి సిరాజుద్దౌలాకు పట్టుమని పాతికేళ్లు లేవు. పెత్తనం చేతికొచ్చి నిండా సంవత్సరం కాలేదు. చడీ చప్పుడు కాకుండా గుడిని, గుళ్లో లింగాన్ని మింగెయ్యగల తెల్లవారి కపట నాటకాలను పోల్చుకుని తగిన ప్రతిక్రియ చేయగలిగిన సత్తా అతడికి సహజంగానే లేదు. ఢిల్లీని ఆక్రమించిన అబ్దాలీ తన పైన త్వరలోనే చేస్తాడనుకుంటున్న దాడిని ఎదుర్కోవడం ఎలాగన్నదే అతడి ఆదుర్దా అల్లా. ఆ ముప్పునుంచి కాచుకునేందుకే, ఆపదలో ఆదుకుంటారన్న ఆశతోటే ఇంగ్లీషు వారు కోరినదానికల్లా తల ఊచాడు. సంధి షరతులు అమలు గురించి తనకూ, 'కంపెనీ'కి మధ్య సంధానం చేయటానికి వాట్స్‌ను పంపుతామని ఆంగ్లేయులంటే సరే అన్నాడు. తన తరఫున సదరు వాట్స్‌తో మాట్లాడి, పనులు సమన్వయం చేటానికి ఏరి కోరి అమీర్ చంద్ అనే పంజాబీ వ్యాపార శ్రేష్ఠుడిని ఎన్నికచేశాడు.

అమీర్ చంద్ తన ఉప్పు తింటూ చాలాకాలం నుంచి తనకు నమ్మకస్థుడిగా ఉన్నాడు కనుక తెల్లవారితో తెలివిగా వ్యవహారాలు చక్కబెట్టి తన ప్రయోజనాలు కాపాడగలడని నవాబు అమాయకంగా తలపోశాడు. అతడికి ఒక సంగతి తెలియదు. అమీర్ చంద్‌ను అప్పటికే ఇంగ్లీషువాళ్లు బుట్టలో వేశారు. డబ్బాశపెట్టి, భూరి లాభాల భ్రమలు గొలిపి అతడిని తమవైపు తిప్పుకొని మూడో కంటికి తెలియకుండా భయంకరమైన మాస్టర్ ప్లాన్ వేశారు. దర్బారు ఆనుపానులను, రాజకీయ బలాబలాలను, నవాబు బలహీనతలను అమీర్‌చంద్ ఎప్పటికప్పుడు తెల్లవారి చెవిన వేసే వాడు. ఎలా దెబ్బకొడితే నవాబు దారికొస్తాడో చెప్పేవాడు. ద్రోహులను కూడగట్టి, ఒకరి తరవాత ఒకరుగా నవాబు మనుషులను ప్రలోభాలతో లోబరచుకుని, వెనకనుంచి నవాబు కాళ్లు నరికేసేందుకు నీచమైన కుట్ర చేశాడు.

అమీర్ చంద్ అంతటి నమ్మకద్రోహం చేస్తాడని ఒక్క నవాబేకాదు; బెంగాల్‌లో సంగతి సందర్భాలు తెలిసిన ఏ ఒక్కరూ ఊహించలేదు. ఎందుకంటే - ఆంగ్లేయుల చేతిలో కొద్ది కాలం కిందే అతడు తిన్న చావుదెబ్బ అలాంటిది.

అమీర్ చంద్‌కు 'కంపెనీ' వారితో చాలా ఏళ్లుగా వ్యాపార లావాదేవీలున్నాయి. వారివల్ల అతడు చాలాకాలుగా లాభపడ్డాడు. ఆ కృతజ్ఞతతోటే కుక్కను పోలిన విశ్వాసంతో వారు అడిగిందల్లా చేస్తూ వచ్చాడు. నవాబు ఆగ్రహానికి గురైన కృష్ణదాసుకు కంపెనీవారు అడిగితే అతడే ఆశ్రయమిచ్చాడు. 1756 జూన్‌లో నవాబు కలకత్తా మీదికి దండు వెడలినప్పుడు ఇదే అమీర్ చంద్ పట్ల ఇంగ్లీషువారు అమానుషంగా వ్యవహరించారు. ఎక్కడ సాయపడతాడోనన్న అనుమానంతో అతడిని ఇంగ్లీషువారు బంధించారు. అతడి దగ్గరి బంధువులనూ ఖైదు చేశారు. అంతటితో ఆగక అతడి ఇంటిమీదికి సైనికులను ఉసికొల్పారు. ఆ ఇంటినిండా స్త్రీలు, మగదిక్కులేదు... అప్పుడు

> The head of the peons, who was an Indian of a high caste, set fire to the house, and in order to save the women of the family from the dishonour of being exposed to strangers, en-

tered their apartments, and killed, it is said, thirteen of them with his own hand, after which, he stabbed himself.

[***Robert Orme,*** *Vol. II. p. 60*]

(ఒమీచందు నౌకర్లలో పెద్ద అయిన జమేదారు వెంటనే ఇంటికి నిప్పంటించాడు. పరులకంటపడి అవమానం పాలవకుండా కులస్త్రీలను రక్షించటం కోసం అతడే జనానాలోకి దూసుకుపోయి తన చేతితో పదముగ్గురు మహిళలను నరికివేసి, అటుపిమ్మట తనకు తాను పొడుచుకున్నాడు.)

తనపై అంతటి ఘాతుకానికి ఆంగ్లేయులు ఒడిగట్టిన తరువాత అమీర్‌చంద్ మళ్లీ జన్మలో వారిని దగ్గరకు రానివ్వడనే అంతా అనుకున్నారు. కానీ అమీర్‌చంద్‌ది కుక్క బుద్ధి! ఆంగ్లేయుల ప్రాపకాన్ని తిరిగి పొందటానికే అంగలార్చాడు. వారి విశ్వాసం తిరిగి పొందే మహద్భాగ్యం కోసం ఎంతటి నీచానికైనా ఒడిగట్టాడు.

సిరాజుద్దౌలా నవాబుగా ఉన్నంతకాలం తమ ఆటలు సాగవు. కనుక అతడిని పడగొట్టి తమకు తైనాతీ అయినవాడిని గద్దె మీద కూర్చుబెడితే గాని తమ పప్పులు ఉడకవని కంపెనీ వారు గ్రహించారు. అలా తమకు అనువైన కీలుబొమ్మ ఎవరా అని గాలిస్తే వారి కంటికి మీర్జాఫర్ కనబడ్డాడు.

మీర్జాఫర్ నవాబు కుటుంబంలోని వాడే. పాత నవాబు అలీవర్దీఖాన్ సోదరికి అతడు పెనిమిటి. పైగా అతడే సర్వసైనాధిపతి. అంగ్లేయులు అమీర్‌చంద్‌ను ప్రయోగించి... నిన్ను నవాబును చేస్తామని ఆశ పెట్టగానే అతడు రక్కున వలలో పడ్డాడు... అధికారం దక్కుతుందనేసరికి బంధుత్వాన్ని, విధ్యుక్త ధర్మాన్ని, దేశం పట్ల బాధ్యతను తుంగలో తొక్కాడు. ఏమి చేయమన్నా చేస్తాను; దేనికైనా ఒప్పుకుంటాను; మీరు గీచిన గీటు దాటను అని ఒట్టేసి విదేశీయులతో లాలూచీ పడ్డాడు.

ఇంకేం? పీటల మీద కూచోడానికి పెళ్లికొడుకు దొరికాడు. ప్రస్తుతం ఏలుతున్నవాడిని కూల్చివేయటమే తరువాయి. ఆ పుణ్యకార్యం అయ్యాక ఎవరికి గిట్టుబాటయ్యేది ఏమిటో ముందే కాగితం మీద రాసుకుందామనుకున్నారు. మీర్జాఫరును నవాబు చేస్తే ప్రత్యుపకారంగా అతడు ఆంగ్లేయులకు ఎలాంటి లాభాలు ఏవిధంగా చేసేదీ రహస్య ఒప్పందంలో పొందుపరచే ఘట్టంలో అమీర్‌చంద్ 'నా సంగతి ఏమిటి' అన్నాడు. కుట్ర మొత్తానికీ సూత్రధారి తానే కనుక ఆ కష్టానికి ప్రతిఫలంగా 30 లక్షల రొక్కమూ, రేపు కొల్లగొట్టబోయే నవాబు సంపదలో 5 శాతం వాటా అతడు కావాలన్నాడు. క్లయివ్ సరేనన్నాడు. ఒప్పందంలో ఆ క్లాజును కూడా చేర్చి మీర్జాఫరు, దొరలు సంతకాలు కూడా చేసేశారు.

ఈ ప్రకారం ఇంగ్లీషు తోడేలు చాలా ఒడుపుగా ఆరగింపుకు రంగం సిద్ధం చేసుకుంది. అమాయకపు మేకకు సాకును చూపించడమే మిగిలింది. అందుకని కంపెనీ దొరలు తీరి కూర్చుని నవాబును ఉత్త పుణ్యానికి సతాయించటం మొదలుపెట్టారు. ఒప్పుకున్న ప్రకారం తాను చేయవలసినవి అన్నీ తు.చ. తప్పక నవాబు చేశాడు. ఆ సంగతి ఇంగ్లీషువారికీ తెలుసు. 1757 మార్చి 30న మద్రాసు సెలక్టు కమిటీకి రాసిన ఉత్తరంలో "He (Siraj-ud-daula) has fulfilled most of the Articles of the treaty made with us" (మనతో కుదుర్చుకున్న ఒప్పందంలోని అన్ని షరతుల్లో అత్యధికభాగం నవాబు నెరవేర్చాడు) అన్న క్లయివ్ మాటలే ఇందుకు రుజువు.





అయితే ఆంగ్లేయులకు కావలసింది ఒప్పందం అమలుకాదు... నవాబును వేటు వేసేందుకు ఏదో ఒక మిష. దానికోసమే ఫిబ్రవరి 9న ఒప్పందం కుదిరింది మొదలుకుని ఏదో ఒక విషయంలో లేనిపోని రాద్ధాంతం చేస్తూ అడ్మిరల్ వాట్సన్ ఎవరికైనా ఒళ్లు మండించే ఉత్తరాలు నవాబుకు రాయసాగాడు. ఒకదానికి అతడు వివరణ ఇవ్వగానే ఇంకో కొత్త పేచీ! ఒక షరతుపై తాను చేసిందీ, చేయలేకపోయిందీ, కొరవది ఎప్పుడు పూర్తి చేసేదీ తెలియపరచగానే ఒప్పందంలో లేని విషయంపై నడమంత్రపు షరతులు ఏకపక్షంగా రుద్దుతూ తక్షణం వాటిని తీర్చమంటూ వేధింపు. ఇదంతా ఎందుకు జరుగుతున్నదీ, తన మెడకు ఉచ్చు క్రమేణా ఎలా బిగుస్తున్నదీ గ్రహించలేని నవాబు అక్కడికీ శాంతంగా, ఓపికగానే వారి సవాళ్లన్నిటికీ సమాధానమిచ్చి... నాకు సాయంగా తాము పంపుతామని మీరు ఒప్పుకున్న సైన్యాన్ని త్వరగా పంపండి. ఖర్చులిచ్చుకుంటాను. అవతల నాకు ప్రమాదం ముంచుకొస్తున్నది - అని అభ్యర్థించాడు.

అదే అతనికి అసలు ప్రమాదమైంది. 'పక్కలో బల్లెంలా మా పొరుగునే ఫ్రెంచి విరోధులు పొంచి ఉండగా మా సేనలను మీ సేవకు ఎలా తరలించగలము? ముందు చంద్రనగర్‌లోని ఫ్రెంచి స్థావరాన్ని మమ్మల్ని ఆక్రమించనివ్వండి. ఆ తరవాత మీరు ఏమి చెయ్యమంటే అది చేస్తాం. మీ వెంట ఢిల్లీదాకా వస్తాం' అని ఆంగ్లేయులు కొత్త పితలాటకం పెట్టారు.

ఆ మాట ఫిబ్రవరి 9 ఒప్పందం సందర్భంలోనే తెల్లవారు అడిగారు. అందుకు ససేమిరా అంగీకరించనని ఆనాడే నవాబు చెప్పాడు. అతడి దృఢ వైఖరివల్లే ఒప్పందంలో ఆ అంశాన్ని చేర్చడం కుదరలేదు. కాని -సంతకం చేసి నవాబు వెనుదిరగగానే అతడు ఇంకా ముర్షిదాబాద్‌దాకా చేరుకోకముందే ఒప్పందం స్ఫూర్తికి విరుద్ధంగా చంద్రనగర్‌లోని ఫ్రెంచి స్థావరం మీద దాడికి ఆంగ్లేయులు సన్నాహాలు మొదలెట్టారు. ఈ సంగతి తెలియగానే నవాబు తెల్లవారిని ముక్క చివాట్లు పెడుతూ ఉత్తరం రాశాడు. "మరాఠాలకూ మాకూ చాలా యుద్ధాలు జరిగాయి. ఎన్ని విరోధాలున్నా ఒకసారి సంధి కుదిరాక అందులోని అంశాలను వారు ఎన్నడూ అతిక్రమించలేదు. మరాఠాలు కాఫిర్లు. ప్రవక్తను నమ్మరు. అయినా వారికి నీతి ఉంది. మీరు ప్రవక్తను, పవిత్ర గ్రంథాన్ని నమ్మేవారు. ఏసుక్రీస్తు మీద ప్రమాణం చేసి ఒప్పందం కుదుర్చుకున్నారు. అయినా వారం తిరక్కుండా ఒడంబడికకు తూట్లు పొడవసాగారు" అని నిష్ఠూరం కూడా ఆడాడు.

ఏం లాభం? ఇంగ్లీషువారి నీతి మాలినతనం షరా మామూలే. నవాబు వద్దని వారించినా పరాసులపై పగను వారు మానలేదు. ఆ సమయంలో అంతర్జాతీయంగా ఇంగ్లండు, ఫ్రాన్సుల మధ్య సైనిక సంఘర్షణలు జరుగుతూండటం ఇందుకు ఒక మిష. అసలు కారణం ఏమిటంటే - పరాసులతో నవాబు సఖ్యంగా ఉన్నాడు. వారు అన్నివిధాల తమకు సమ ఉజ్జీలు. తమ తాకిడిని తట్టుకోవటానికి నవాబు వారిని ఆశ్రయించే ప్రమాదం ఉంది. కనుక - వారి బెడదను ముందే వదిలించుకుంటే నవాబు తమకు వంటింట్లో కుందేలు అవుతాడని ఆంగ్లేయుల ఆలోచన. అందుకే - రెండు యూరోపియన్ శిబిరాలూ బెంగాల్‌లో పరస్పరం తటస్థత పాటించాలన్న నవాబు ప్రతిపాదనకు పరాసులు సరేనన్నా ఇంగ్లీషు వారు మోకాలు అడ్డారు. బెంగాల్ ఆరగింపు క్రమంలో మొదటి కబళంగా ఫ్రెంచి శిబిరాన్ని గుటుక్కుమనిపించ దలిచారు.

ఈ దురుద్దేశాలు, దుష్టయత్నాలు ఏమి తెలియని నవాబు అఫ్ఘాన్లను ఎదుర్కోవటం

కోసం సాయంగా సైన్యాన్ని పంపమని అడగటంతో తెల్లవారి పని మరీ సులువైంది. నవాబు ఒకందుకు రమ్మంటే వారు ఒకందుకు సైన్యాన్ని కదిలించి, సర్కారు అనుమతితోనే సర్కారీ పరగణా గుండా వెళ్ళి 1757 మార్చి 14న చంద్రనగర్‌లోని ఫ్రెంచి స్థావరాన్ని ముట్టడించారు.

ఇది ఏ ప్రభువూ సహించి ఊరుకోజాలని దుర్మార్గం. నవాబుకూ పరాసులకూ ఎటువంటి వైరం లేదు. వారి నుంచి అతడికి ఏ సమస్యాలేదు. అతడితో సఖ్యంగా ఉంటూ అతడి ఆజ్ఞలకు లోబడి వారి వ్యాపారాలేవో వారు చేసుకుంటున్నారు. తన ఆశ్రయంలో ఉన్నవారికి దురాక్రమణల నుంచి రక్షణ కల్పించటం పాలకుడిగా నవాబు బాధ్యత. అందుకే - తన అనుమతి లేకుండా, తాను వద్దన్నా ఆగకుండా క్లయివ్ దండు చేయనున్న దాడిని సమర్థంగా ఎదుర్కొని, పరాసులకు తగిన రక్షణ కల్పించవలసిందిగా తన స్థానిక ఫౌజ్‌దారు నందకుమార్‌ను నవాబు ఆదేశించాడు.

ఈ విషయంలో పర్యవసానం ఏమవుతుందో, యుద్ధంలో తెల్లవారిని గెలవగలమో లేదో అన్న చింత సిరాజుద్దౌలాకు లేదు. ఇంగ్లీషు వారితో పోల్చితే అతడి సైనిక బలం ఎన్నోరెట్లు ఎక్కువ. తనబలమూ, ఫ్రెంచి సైనిక పాటవమూ కలిస్తే ఇంగ్లీషువారి తుక్కురేగకొట్టటం ఖాయం అనుకున్నాడు నవాబు.

కాని - చిత్రం! ఊహించని రీతిలో కథ అడ్డం తిరిగింది. శౌర్యంతో సాధించలేనిదానిని ఎప్పటిలాగే, ద్రోహం ద్వారా తెల్లవారు అవలీలగా సాధించారు. సేనాపతి మాణిక్ చంద్‌ను లోబరచుకొని బజ్‌బజ్, కలకత్తాలను తిరిగి కొట్టేసినట్టే ఫౌజ్‌దార్ నందకుమార్‌ను భారీ లంచంతో వలలో వేసుకుని చంద్రనగర్‌లో నవాబు సైనిక శక్తిని నిర్వీర్యం చేశారు. గతంలో మాణిక్ చంద్ చేసినట్టే ఇక్కడ నందకుమారూ తెల్లదండు వస్తోన్నదనగానే తన సేనను పక్కదారిన రంగం నుంచి తప్పించాడు. అతడిలాగే ఇతడికీ నచ్చచెప్పి, ఆశలు పెట్టి, స్వామిద్రోహానికి, దేశద్రోహానికి పురికొల్పిన పుణ్యం అమీర్‌చంద్‌దే. అతడు కనుక ఆ ఉపకారం చేసి ఉండకపోతే చంద్రనగర్ ఆంగ్లేయులకు వశమయ్యేదేకాదు.

ఆ విషయాన్ని 1757 ఏప్రిల్ 10 సెలక్ట్ కమిటీ మీటింగులో ఇలా రాసుకున్నారు.

> We the servants of the East India Company should always be grateful to that noble-minded and wealthy native merchant of Calcutta, Omichand. It was through his agency that we succeeded to secure the assistance and co-operation of Dewan Nuncoomar, phoujdar of Hoogly. a body of Subadar's troops was stationed within the bounds of Chandernuggor previously to our attack of that place... under the command of Nuncomar. If these troops were not withdrawn, it would have been highly improbable to gain the victory.
>
> [*Rise of the Christian Power in India.* **B.D. Basu,** *pp.84-85*]
>
> (ఈస్టిండియా కంపెనీ సేవకులమైన మనం గొప్ప మనసుగల ఆ కలకత్తా సంపన్న వ్యాపారి ఓమిచంద్‌కు సర్వదా కృతజ్ఞులమై ఉండాలి. అతని ద్వారానే మనం హుగ్లీ ఫౌజ్‌దారయిన నందకుమార్ సహాయ సహకారాలను పొందగలిగాము. మన ముట్టడికి పూర్వం చంద్రనగర్‌లో నవాబు సేన కొంత - నందకుమార్ నాయకత్వంలో మోహరించి ఉండేది. ఆ దండునే కనుక ఉపసంహరించి ఉండకపోతే మనకు గెలుపు అసంభవమయ్యేది).



ఇలా వైరిపక్షం సేనానిని లోబరచుకుని మోసం ద్వారా గెలవటం ఏ రకమైన పరాక్రమమో తెల్లవారికే తెలియాలి!

ద్రోహం చేసింది నవాబు ఫౌజ్‌దారు ఒక్కడే అయితే పరిస్థితి ఎలా ఉండేదో! నవాబు సైన్యం సమయానికి ఆదుకోకపోయినా పరాసులు తమకున్న ఫిరంగి బలంతో, సుశిక్షిత సైనిక పాటవంతో హోరాహోరీగా పోరాడి ఆంగ్లేయుల బారి నుంచి తమ కోటను రక్షించుకోగలిగేవారేమో. కాని - ఇంగ్లీషువారి కబంధహస్తాలు చాలా పొడవు. నవాబు సేనానిని పట్టినట్టే ఫ్రెంచి శిబిరంలోకీ అవి చొచ్చుకుపోగలిగాయి. అవినీతి మంత్రం అక్కడా పారింది. చంద్రనగర్ రక్షణ దళంలో నియుక్తుడైన లెఫినెంట్ టెర్రనౌ అనే ఫ్రెంచి సైన్యాధికారి కాసుల కక్కుర్తితో నది దాటేందుకు శత్రువుకు తోవ ఇచ్చాడు.

చంద్రనగర్‌లో ఆంగ్లేయుల దురంతం తెలిసి సిరాజుద్దౌలాకు కాళ్లు చల్లబడ్డాయి. ఆత్మ రక్షణ కోసం అంగ్రేజీల ప్రాపకానికి తాను ఆశపడితే అంగ్రేజీలవల్లే తన కొంప మునుగుతోందన్న సంగతి అతడికి అర్థమైంది. 'మీరూ వద్దు; మీ సాయం వద్దు; మీ సేనను మీరు వెనక్కి తీసేసుకోండి' అని 'కంఫినీ'కి కబురు పంపాడు. కాని అప్పటికే పరిస్థితి అతడి చేయి దాటిపోయింది. అంతకు ముందుదాకా అణిగిమణిగి ఉన్నట్టు అతి వినయం అభినయించిన ఇంగ్లీషువారు మోసపు ముసుగు అవతల పారేశారు. మా సీమ నుంచి అదనపు బలగాలు తెప్పించి మీ భరతం పడతాం; నీ రాజ్యానికి అగ్గిపెడతాం. గంగలోని నీళ్లన్నీ పోసినా ఆ అగ్గిని చల్లార్చలేవు ఖబడ్దార్ అని రంకెలు లంకించుకున్నారు. ఆంగ్లేయుల దురాక్రమణవల్ల నిర్వాసితులైన ఫ్రెంచివారు నవాబు శరణుజొచ్చగా, తన రాజ్యంలో అన్యాయానికి లోనైన దీనులకు అతడు అభయమివ్వటమే మహాపరాధమైనట్టుగా చిత్రించి తక్షణం వారిని తమకు అప్పగించి తీరాలని గాండ్రించారు.

ఆత్మ గౌరవం ఇంకా పూర్తిగా కోల్పోని నవాబు సహజంగానే అందుకు సమ్మతించలేదు. ఇంకేం? ఇంగ్లీషు తోడేలుకు కావలసిన సాకు దొరికింది.

# ప్లాసీ లాలూచీ

ఇంత ఘన విజయం సాధించిన రాబర్ట్ క్లయివ్‌కు ఇండియా హౌస్ ఆవరణలో శిలా విగ్రహం వేశారు. క్లయివ్ గౌరవార్థం, ప్లాసీ యుద్ధ జ్ఞాపకార్థంగా ఒక మహావీర పతకాన్ని ముద్రించారు. పతకపు బిళ్లకు ఒక పక్క క్లయివ్ ఒక చేత్తో బ్రిటిష్ జండా పట్టుకుని, రెండో చేత్తో మీర్జాఫర్‌కు నవాబుగిరీ ప్రసాదిస్తూ నిలబడి ఉంటాడు. దిగువన 'బంగాళాకివ్వబడిన నవాబుగిరీ *(a subah given to Bengal)* అన్న మాటలు. మెడల్‌కు రెండో వైపున - చేతిలో జయ చిహ్నంతో విజయదేవత ఏనుగుమీద కూచుని ఉంటుంది. దిగువన ప్లాసీ విజయం - క్లయివ్ సేనాపతి' *(Victory of plassey-clive commander)* అన్న అక్షరాలు.

**[*Rise of the Christian Power in India*- B.D. Basu, *p.97*]**

ప్లాసీలో గెలిచి, భారతదేశంపై బ్రిటన్ కబ్జాకు అడ్డరోడ్డు వేసిన ఘనుడు అప్పటి బ్రిటిష్ ప్రభువులు వీరపూజ చేసి నీరాజనమివ్వటంతో ప్రపంచ దృష్టిలో వీరాధివీరుడు అయిపోయాడు. అద్భుత పరాక్రమంవల్లే కీలకమైన ప్లాసీ యుద్ధంలో బెంగాల్ నవాబును ఆంగ్లేయులు అవలీలగా ఓడించి, భారతదేశాన్ని వాయిదాల పద్ధతిలో వీర భోజ్యంగా వశం చేసుకున్నట్టు ఆంగ్ల మానస పుత్రులైన మన దేశవాళీ చరిత్రకారులు ఇప్పటికీ నమ్మకంగా చెబుతారు.

ఇంతకీ చరిత్రాత్మకమైన ప్లాసీ యుద్ధంలో క్లయివ్ చూపింది ఎటువంటి పరాక్రమం? సాధించింది ఎటువంటి గెలుపు?

ఇది తెలుసుకోవడానికి వేరే రుజువులూ, సాక్ష్యాలకోసం ప్రయాసపడవలసిన పనిలేదు. వాస్తవంగా జరిగింది ఏమిటని నేరుగా క్లయివ్‌నే అడిగితే సరిపోతుంది! స్వయానా అతడి మాటలను, అతడి రాతలను, అతడిచ్చిన సాక్ష్యాలనుబట్టే అతడు వీరుడు కాడు... నీచుడు అని అమాయకులకు సైతం అర్థమవుతుంది. అతడు ఉత్త పిరికిపంద... ఉచ్చనీచాలెరుగని నయవంచకుడు; నమ్మకద్రోహి అని తేటతెల్లమవుతుంది.

18వ శతాబ్ది ద్వితీయార్థం నాటికి ఫ్రెంచి వారెంతో ఇంగ్లీషువారూ అంతే. ఉభయులూ వర్తకం చేసుకోటానికి వచ్చి, భారత ప్రభువుల అనుమతితో, వారి అధికారానికి లోబడి బతుకుతున్నవారే. దేశీయ ప్రభువులెలా మెలగాలో ఎవరితో ఎప్పుడు ఎలా వ్యవహరించాలో నిర్ణయించే తాహతు సరుకులు అమ్ముకునేందుకు వచ్చిన విదేశీ వ్యాపారులకు లేదు. ఆ ఇంగితజ్ఞానం లోపించి తెల్లవాళ్లు విర్రవీగారు. తమ వికారపు చేష్టలకు, దుష్టపోకడలకు విసిగి వేసారిన నవాబు సిరాజుద్దౌలా ఎందుకైనా మేలని ఫ్రెంచి వారితో మంచిగా ఉంటే ఆంగ్లేయుల దృష్టిలో అదే మహాపరాధమైంది. నిష్కారణంగా, దుర్మార్గంగా తాము దాడిచేసి వెళ్లగొట్టిన పరాసువారికి నవాబు ఆశ్రయమివ్వటమే ఘోర నేరమైనట్టు వారు చిత్రించారు. ఒడంబడిక ప్రకారం తమకు పూర్వ సదుపాయాలన్నీ పునరుద్ధరించి, చెల్లిస్తానన్న పరిహారమంతా చెల్లించి నవాబు మాట నిలబెట్టుకున్నాడని తమలో తాము జనాంతికంగా అంగీకరిస్తూనే... సంధి షరతులు ఉల్లంఘించావంటూ నవాబుపై పథకం ప్రకారం యాగీచేశారు. నవాబు దర్బారులో ఇంగ్లీషు నక్షత్రకుడు వాట్స్ చాపకింద నీరులా కుట్ర సాగించి, మీర్జాఫరును బుట్టలో వేసే పుణ్యకార్యాన్ని పూర్తి చేయగానే క్లయివ్ దొర కపట నాటకపు పతాక సన్నివేశానికి తెర లేపాడు. నవాబు చేసిన వాగ్దాన భంగాన్నీ, తమకు జరిగిన అన్యాయాన్నీ దర్బారులో పెద్దమనుషుల ముందు పెట్టి న్యాయం కోరటంకోసం తమ సన్నిధికి వేంచేస్తున్నానంటూ నవాబుకు మాయ ఉత్తరం పంపి, సైన్యంతో ముర్షిదాబాద్‌కు బయలుదేరాడు.

ఆ ఉత్తరం చూసి, నిజంగా తనకు విన్నపం చేసుకోవటానికి క్లయివ్ తన దగ్గరికి వస్తున్నాడని అమాయకపు నవాబు మామూలుగా అయితే అనుకునే వాడేమో. కాని - పరాసులపై అడ్డగోలు దాడి దరిమిలా అతడికి ఆంగ్లేయుల ఆంతర్యం మీద అనుమానం బలపడింది. దానికి తగ్గట్టు క్లయివ్ జాబు అందిన రోజే దర్బారులో వాట్స్ తదితర ఆంగ్ల ప్రతినిధులు వాహ్యాళి నెపంతో కట్టకట్టుకుని పోయి మళ్లీ తిరిగి రాలేదు. వారి పలాయనంతో క్లయివ్ దుర్మార్గం సిరాజుకు అర్థమైంది.

కాని - అప్పటికే పరిస్థితి చెయిజారి పోయింది.

అంతకు కొద్ది రోజుల ముందే మీర్జాఫరుకు, నవాబుకు పెద్ద గొడవ అయింది. దివాను మోహన్‌లాల్‌ను మీర్జాఫరు బహిరంగంగా అవమానించినందుకు ఆగ్రహించి అతడిని బంధించి తీసుకురమ్మని నవాబు భటులను పంపాడు. మీర్జాఫరేమో ఆ వచ్చిన వారిని బయటికి గెంటించాడు. దానికి నవాబు తగిన ప్రతి క్రియచేసే లోపే తెల్లవారి బెడద వచ్చి పడింది. దాంతో పాత కలతలకు అది సమయం కాదని ఎంచి, నవాబు ఏ భేషజమూ లేకుండా నేరుగా తానే మీర్జాఫరు ఇంటికి పోయి తనకు బాసటగా నిలుస్తానని ఖొరాన్ మీద ప్రమాణం చేయమన్నాడు. అతడు తటపటాయించకుండా ప్రమాణం చేశాడు. ఇంకేం మీర్జాఫరు తనవాడే అని వెర్రి నవాబు భ్రమించి అతడికే సేనా నాయకత్వం అప్పగించి తెల్లవారిపై దాడికి వెంటతీసుకుపోయాడు. మీర్జాఫరును అతడు క్షమించి, అంతా మరచిపోయినా మీర్జాఫరు ఏదీ మరవలేదు. ముఖ్యంగా తన స్వార్థాన్ని. అప్పటికే సిరాజ్‌ను లేపేసి అతడు నవాబు అయ్యేందుకు కుంఫిణీ వారితో బేరసారాలు, రాతకోతలు అన్నీ పూర్తయ్యాయి. ఇవేవీ తెలియని నవాబు దొంగ చేతికి తాళం చెవులు ఇచ్చినట్టు అసలు కుట్రదారుకే తన రక్షణ బాధ్యత అప్పగించడంతో తెల్లవారి రొట్టె విరిగి నేతిలో పడింది.

ముర్షిదాబాద్‌కు 20 మైళ్ల దూరంలోని ప్లాసీవద్ద అప్పటికే నవాబు సేనలు కొంత కాలంగా దండువిడిసి ఉన్నాయి. అదనపు బలగాలతో మీర్జాఫరు అక్కడికి తరలి ఆంగ్లసేనపై పోరు సలపాల్సి ఉంది. ప్లాసీదాకా వెళ్లకుండా మధ్యలోనే కట్వావద్ద మీర్జాఫరు సేన క్లయివ్ సేనతో చేరితే, అంతా కలిసి అక్కడి నుంచి ప్లాసీకి దండయాత్ర చేయాలని కుట్రదారుల పథకం. అదే ప్రకారం క్లయివ్ సంకేత స్థలం వద్ద ఎదురు చూస్తుండగా... ఎందువల్లో కాని మీర్జాఫరు పథకం మార్చి నేరుగా ప్లాసీలోనే సమయం చూసి మీవైపు ఫిరాయిస్తానని చీటీ రాసి పంపాడు.

"మహావీరుడు" క్లయివ్ గుండెలో రాయి పడింది. తాను నవాబును మోసం చేసినట్టు మీర్జాఫరు తనను మోసం చేస్తాడేమోనని హడలిపోయాడు. అతడి దగ్గర ఉన్నది 650 మంది సీమ సైనికులు; 2100 మంది సిపాయిలు; ఎనిమిది ఫిరంగులు; ఎటునుంచి ఎటుకూడినా మొత్తం బలం అన్ని బాపతులూ కలిపి మూడు వేలు మించదు. ఆ వంక చూస్తే నవాబు బలం 18 వేల గుర్రాలు, 50 వేల కాల్బలం, 40 ఫిరంగులు వెరశి 68వేల పైచిలుకు. యూరోపియన్ యుద్ధ పద్ధతి ఎంత గొప్పదైనా, తెల్ల తుపాకులు ఎంత ఘనమైనవైనా, క్లయివ్ ప్రతాపం గురించి బయటివారు ఎలా భ్రమసినా తన తాహతేమిటో అతడికి తెలుసు. నవాబు సైనికశక్తి ముందు తన బలం గడ్డిపరకతో సమానమని అతడు ఎరుగును. అన్న ప్రకారం మీర్జాఫరు రాజద్రోహంచేసి సైన్యంతో సహా తనకు అండగా రాకపోతే కొంప మునుగుతుందని, నవాబుకు లొంగిపోయి చెంపలేసుకోవటం కంటే గత్యంతరం ఉండదని క్లయివ్ హడలిపోయాడు. నిన్నే నమ్ముకున్నాను. నన్ను ముంచకు అంటూ ఆ ఆదుర్దాలోనే 1757 జూన్ 22న ప్లాసీకి బయలుదేరుతూ మీర్జాఫరుకు ఇలా జాబు రాశాడు:

> I am determined to risque everything on your account... I shall be on the other side of the river this evening. If you will join me at Placis, I will march halfway to meet you... Be assured if you do this you will be Subah of these provinces... ...but if you won't comply even with this this, pardon me, I shall make it up with the Nawab.
>
> [*How The British Occupied Bengal*, **Ram Gopal,** *p. 209*]

(నీ గురించి నేను సర్వం రిస్కు చేస్తున్నాను... ఈ సాయంత్రానికి నేను నది ఆవలి తీరం చేరుతాను. ప్లాసీ వద్ద నీవు వచ్చి కలిసేటట్లయితే నేనే నీకు ఎదురు వస్తాను. ఇది చేస్తే నువ్వు ఈ సుబాకు నవాబు అవుతావు... నువ్వు మాట తప్పితే మాత్రం - క్షమించాలి. నేను నవాబుతో రాజీ చేసుకుంటాను).

మోసంతో తప్ప గెలవలేని ఈ పిరికిపందే ఆంగ్లేయుల దృష్టిలో మహావీరుడు!

మీర్జాఫరును నమ్ముకుని మనం ప్రాణాల మీదికి తెచ్చుకోవడమెందుకు, వెనక్కి పారిపోదాం అని కంపెనీ సేనానులు చెప్పడంతో మొదట తటపటాయించినా క్లయివ్ తోడు దొంగను నమ్మడానికే చివరికి నిశ్చయించాడు. ఎందుకూ చాలని 3 వేల సేనతో ముందుకు సాగి రాత్రి రెండు జాములు దాటాక ప్లాసీ గ్రామం చేరుకున్నాడు. అక్కడ నవాబు సైన్యాలు 50 వేల పదాతులతో 18 వేల గుర్రపు దళాలతో 50 ఫిరంగులతో కందకాల వెనుక సురక్షితంగా



మోహరించి ఉన్నాయి. జూన్ 23 పొద్దుపొడిచేసరికి నవాబు సేనలు కందకాలను విడిచి శత్రుసైన్యంపై పడ్డాయి. శత్రువును కోలుకోలేని దెబ్బతీస్తుండగానే, యుద్ధం నడి మధ్యలో ఉండగా నవాబు పక్షంలోని ద్రోహులు అర్ధంతరంగా పోరు ఆపించి సేనను వెనక్కిలాగారు. మరి కాసేపటికి మీర్జాఫరు తన కిందనున్న గుర్రపు దళాలతో చీలి కుంఫిణీ శిబిరంలో చేరిపోయాడు. దాంతో కథ అడ్డం తిరిగింది. ద్రోహుల సాయంతో క్లయివ్ పులి అయిపోయి, నవాబు మీదికి దండెత్తాడు. స్వపక్ష సైనిక ద్రోహం మూలంగా నవాబు సైన్యాలు ధైర్యం చెదిరి, స్థైర్యం కోల్పోయి చిందర వందర అయ్యాయి. అయినవారి వెన్నుపోటు కారణంగా 60వేల సేన చేతిలో ఉండీ 3వేల తెల్ల చీమల చేతుల్లో సిరాజ్ నవాబు దారుణంగా ఓడిపోయాడు. ఆ గెలుపు ఒక గెలుపు కాదు. విద్రోహుల ప్రభావమే తప్ప క్లయివ్ ప్రతాపం దానికి కారణం కాదు.

అందుకే ప్రపంచ చరిత్రలో నిర్ణయాత్మక యుద్ధాలను గ్రంథస్థం చేసిన కర్నల్ మాలెసన్ ప్లాసీ విజయాన్ని ఇలా తూష్ణీకరించాడు.

> It was only when treason had done her work, when treason had driven the Nuab from the field, when treason had removed his army from its commanding position, that Clive was able to advance without the certainty of being annihilated. Plassey, though decisive, can never be considered a great battle.
>
> [*Decisive Battles of India*- **Colonel Malleson,** *p. 73*]

(రాజ ద్రోహమే సర్వం అమర్చి పెట్టిన తర్వాత, విద్రోహమే నవాబును యుద్ధ రంగం నుంచి తరిమివేసిన తరవాత, విద్రోహమే నవాబు సేనను వ్యూహాత్మకంగా పటిష్ఠమైన స్థితి నుంచి తప్పించిన తరవాతనే... కచ్చితంగా నిర్మూలించబడతానన్న భయం పోయి క్లయివ్ యుద్ధరంగంలోకి నడిచి వెళ్ళగలిగాడు. కాబట్టి నిర్ణయాత్మకమే అయినా ప్లాసీని గొప్ప యుద్ధంగా పరిగణించలేము.)

చరిత్రలో మహా గణనకెక్కిన ప్లాసీ సమరంలో విజేతలయిన ఆంగ్లేయులు కోల్పోయింది మొత్తం కలిపి నలుగురు యూరోపియన్లను, 16 మంది భారతీయ సిపాయిలను! ఇక నవాబు పక్షాన్ని చూస్తే 500 మంది సైనికులూ, మూడు ఏనుగులూ, ఎన్నో గుర్రాల ప్రాణాలు పోయాయి. వేలూ లక్షల సంఖ్యలో ప్రాణనష్టం జరిగిన పానిపట్టు యుద్ధంతో పోల్చితే ప్లాసీది చిన్నపాటి సైనిక ఘర్షణగానే భావించాలి. తమ చేతికి మట్టి అంటకుండా ఎదిరి పక్షంలో చిచ్చు పెట్టి అధర్మంగా గెలిచారు కాబట్టే తెల్లవారు అతి తక్కువ నష్టంతో బయటపడ్డారు.

అనంతరం కాలంలో బ్రిటిష్ పార్లమెంటరీ కమిటీ బోనులో నిలబడినప్పుడు ప్లాసీలో అతి స్వల్ప రక్తపాతానికి కారణాలు చెబుతూ లార్డ్ క్లయివ్ "సిరాజుద్దౌలాకు తన సేన మీద, సేనకు అతడి మీద నమ్మకం లేకపోయింది. అందుకే సైనికులు తాము చేయాల్సిన పనిని చేయలేదు" అన్నాడు. ఆ విధంగా సేనను చెడగొట్టి స్వామిద్రోహానికి, దేశ ద్రోహానికి పురికొల్పటానికి తాను చేసిందేమిటో మాత్రం అతడు చెప్పలేదు.

సేనా నాయకుడే ద్రోహిగా మారి శత్రుపక్షంలో చేరిపోయాక ఎంత సేన ఉండీ ప్రయోజనమేమిటి? కుటుంబంలోని మనిషి అని తాను నమ్మి కీలక బాధ్యత అప్పగించిన

వాడే పవిత్ర ఖొరాన్ మీద చేసిన ప్రమాణాన్ని కూడా ఉల్లంఘించి విదేశీ కుట్రదారులతో కుమ్మక్కవటంతో యుద్ధరంగంలో ప్రత్యక్షంగా ఉన్న సిరాజుద్దౌలాకు కాళ్లకింద నేల కదిలినట్టయింది. దిక్కుతోచని స్థితిలో ఏనుగెక్కి కొద్ది పరివారంతో కాలికి బుద్ధిచెప్పి అదే రాత్రి ముర్షిదాబాద్‌కు చేరుకున్నాడు. జరిగిన ద్రోహాన్ని వివరించి, బంధువులనూ బలగాలను కూడగట్టాలని అతడు శాయశక్తులా ప్రయత్నించాడు.

కాని అప్పటికే అతడి అదృష్టం అస్తమించింది. ఆ సంగతి అందరికీ అర్థమైపోయింది. ఎవరో ఎందుకు? పిల్లనిచ్చిన సొంత మామే తనకు అండగా ఉండమని సిరాజ్ ఎంతగా వేడుకున్నా వినిపించుకోకుండా ఊరువదిలి పారిపోయాడు. బంధుత్వం వల్ల కానిది లంచంవల్లనైనా సమకూడుతుందేమోనన్న ఆశతో సిరాజుద్దౌలా తన ఖజానా తెరిచి సైనికులకు డబ్బును పంచి పెట్టాడు. అలా సంతోషపెట్టటం వల్ల వారంతా తనకు విధేయులై నమ్మకంగా వెన్నంటి ఉంటారని అతడు ఆశపడితే వాళ్లేమో జేబులు నింపుకొని అయిపు లేకుండా పోయారు.

మర్నాటి సాయంత్రానికల్లా మీర్జాఫరు, క్లయివ్ కలిసి తన మీదకి దండెత్తి వస్తూ రాజధాని పొలిమేరలకు చేరుకున్నారని నవాబుకు వార్త అందింది. ఇక చేసేది లేక ఫకీరు వేషం వేసుకుని ఎవరికీ చెప్పకుండా సిరాజుద్దౌలా పరారయ్యాడు. తెల్లవారికి మోకరిల్లి, క్లయివ్ దయవల్ల నవాబుగా గుర్తింపు పొందిన మీర్జాఫర్ వస్తూ రాగానే దొరల ఆదేశం మేరకు సిరాజ్‌ను వెదికి వేటాడేందుకు మనుషుల్ని ఉరికించాడు. నాలుగైదురోజులు గమ్యం లేకుండా తిరుగాడిన మీదట సిరాజ్ 'రాజ్‌మహల్' అనే ఊరికి పోయి ఒక ఇంట తలదాచుకుంటే ఇంటివాడు గుర్తుపట్టి స్థానిక ఫౌజ్‌దారులకు ఉప్పందించాడు.

ఆ ఫౌజ్‌దారు స్వయానా మీర్జాఫర్ తమ్ముడు. అతను వెంటనే సిరాజ్‌ను బంధించి అఘమేఘాల మీద ముర్షిదాబాద్‌కు తరలించాడు. మీర్జాఫరు అతడిని తన కుమారుడి 'రక్షణ'లో ఉంచగా, ఆ సుపుత్రుడు తండ్రిగారి ఇంగిత మెరిగి రాత్రికి రాత్రే సిరాజ్‌ను చెరలోనే సఫా చేశాడు. ఆ నేరంతో తనకు ప్రమేయం లేదని క్లయివ్ బుకాయించకపోలేదు. కానీ "క్లయివ్‌గాడి గాడిద'గా పేరుపడ్డ మీర్జాఫర్ దొరగారికి చెప్పకుండా, ఆయన ఆజ్ఞ లేకుండా ఇటువంటి ఘాతుకానికి సొంతంగా పాల్పడటం వట్టిమాట. మరునాడు సిరాజ్ తలను, మొండాన్ని ఏనుగు మీద వేసి, వీధులవెంట ఊరేగిస్తుంటే లార్డుగారు చోద్యం చూశారే తప్ప పల్లెత్తు మాట అనలేదు.

అలా ముగిసింది నమ్మిచెడిన సిరాజుద్దౌలా కథ!

అసలు దరదృష్టమేమిటంటే - ఇంత జరుగుతున్నా జనానికి పట్టలేదు. సీమ నుంచి సరుకులు అమ్ముకోవటానికి వొంగి వొంగి దండాలు పెడుతూ వచ్చిన వర్తకులు తోక జాడించి, కుట్రలూ కూహకాలతో ప్రభువులను పడగొట్టి ప్రభుత్వాలనే శాసించేందుకు బరితెగించినా... ఎక్కడికక్కడ నమ్మకద్రోహులను వలలో వేసుకుని నిష్కారణంగా తమ నవాబుని వేటు వేసినా బెంగాలీలు కనీసం చిటికెనవేలును కదిలించలేదు. పాపిష్టి పనికి సమర్థింపుగా క్లయివ్ కూడా పార్లమెంటరీ కమిటీ ముందు అదే మాట అన్నాడు.

His Lordship said he entered Muxadavad City at the head of 200 Europeans and 500 sepoys. That the inhabitants who were spectators upon that occasion, must have amounted to



some hundred thousands; they might have done it with sticks and stones.

[*Rise of the Christian Power in India*, **B.D.Basu,** *p. 96*]

*(200 యూరోపియన్లు, 500 సిపాయిలను వెంటబెట్టుకుని నేను ముర్షిదాబాద్ నగరంలో ప్రవేశించాను. అప్పుడు మమ్మల్ని చూడవచ్చిన పురజనులు కొన్ని లక్షలు ఉంటారు. వారే గనక మన యూరోపియన్లను చంపదలచుకుంటే కర్రలతో, రాళ్ళతో కొట్టి ఉండేవారు-అని లార్డుగారు చెప్పారు)*

క్లయివ్ చెప్పినట్టు ముర్షిదాబాద్ వాసులే కనుక నిజంగా ఆ పని చేసి ఉంటే దేశ చరిత్ర ఎలా ఉండేదో! శతాబ్దాల బానిసత్వం భరతజాతికి తప్పేదేమో!!

# కొండచిలువ కౌగిలి

**జంతువు నేలబడింది. చర్మం వొలిచి ఎవరి వాటా మాంసాన్ని వారు పంచుకోవటమే తరువాయి! నికృష్టపు కుట్రలు చేసి సిరాజ్ నవాబును కష్టపడి కూల్చిన ద్రోహులు ప్రతిఫలంగా తమకు ముట్టాల్సిన సొత్తును ఎప్పుడెప్పుడు నొల్లుకు పోదామా అని లొట్టలేసుకుంటూ ఎదురు చూశారు.**

ఆ శుభ ఘడియ రానే వచ్చింది. ప్లాసీ యుద్ధం ద్రోహుల సాయంతో గెలిచినా... ఆ పాపిష్టి పనికి ఆగ్రహించి జనం తన భరతం ఎక్కడ పడతారోనన్న భయంతో రాజధాని పొలిమేరల్లో నాలుగు రోజులు తచ్చాడిన క్లయివ్... ఫరవాలేదు రావొచ్చని మీర్జాఫరు నుంచి కబురు వచ్చాక 1757 జూన్ 29న ముర్షిదాబాదులో అడుగుపెట్టాడు. మరునాడే మహాద్రోహి మీర్జాఫరుకు మూర్ధాభిషేకం. దొరగారి ఎదుట గద్దెపై కూచోవటానికి మీర్జాఫరు బిడియపడగా క్లయివే అతడి రెక్కపుచ్చుకుని తఖ్తుమీద కూచోబెట్టి సలాం చేశాడు. ఆ మర్యాదలు యథావిధిగా అయ్యాక తమరిని నవాబు చేసినందుకుగాను మా కట్నాలు మాకిమ్మంటూ మీర్జాఫర్ చేతిలో క్లయివ్ పెద్ద బిల్లు పెట్టాడు.

అది మహాలావు. అయినా కట్టక తప్పుతుందా? కుంఫిణీ దొరలు తమ సొంతానికిగాను పదమూడు లక్షల రూపాయలు తీసి అక్కడ పెట్టమన్నారు. మీర్జాఫరు కిమ్మనక చెల్లించాడు. అందులో క్లయివ్, డ్రేక్‌గార్లు చెరి మూడు లక్షలు తీసుకున్నారు. మిగిలింది ఇంకో ముగ్గురు పంచుకున్నారు. ఇవిగాక క్లయివ్ అదనంగా లక్షా అరవైవేల మొహిరీలు కొత్త నవాబు నుంచి బహుమతిగా స్వీకరించాడు. ఇంత పెద్ద మొత్తాలు ఎందుకు పట్టావయ్యా అని తరవాత పార్లమెంటు వారు అడిగితే 'నవాబు ఖజానాలో కోట్లకొద్దీ రత్నరాసులు పడి ఉన్నాయి. ఇంత తక్కువ తీసుకున్నానేమిటా అని నాకే ఆశ్చర్యమైంది' అని జవాబు చెప్పాడు!

ప్రైవేటుగా భూరి సంభావనలను నొక్కేసిన సీమదొరలు కుంఫిణీకీ అన్యాయం చేయలేదు. కంపెనీకి కోటి రూపాయలు... కలకత్తాలో యూరోపియన్లకు అప్పుడెప్పుడో కలిగిన ఇబ్బందికి పరిహారం కింద 50 లక్షలు... సీమ సైనికులకు సంతోష సూచకంగా 50 లక్షలు దాఖలు చేసుకోవలసిందని నవాబును కోరారు. ఆ బాపతులన్నీ కలిపి 27 లక్షలు నవరసులయ్యాయి. అవన్నీ చెల్లించటానికి ఖజానాలో ధనం లెక్కించి ఒడంబడిన షరతుల్ని మీర్జాఫరు తక్షణం ఎంతవరకు అమలు జరిపే వీలుందో తేల్చమని ఇద్దరు సేటులను పురమాయించారు. ఖజానా అంతా ఊడ్చేసినా తెల్లవారి రాకాసి ఆకలి తీర్చడానికి సరిపోదని తేలడంతో ఆ సేట్లేమో సగం ఇప్పుడు-మిగతా సగం మూడేళ్లలో నవాబు తీర్చేట్టు పరిష్కారం చేశారు.

ఈ డిమాండ్లు – పరిష్కారాలు తన ప్రమేయమే లేకుండా, తన ఉనికినే పట్టించుకోకుండా జరిగిపోతూంటే అసలు సేటు అమీర్‌చందుకు నోట మాట రాలేదు. కుట్ర అంతటికీ అతడే సూత్రధారి. నవాబు ఖజానానుంచి నొల్లుకునే సంపదలో 5శాతం వాటా తనకు చెందాలని, అదిగాక 30 లక్షల రొక్కం తనకివ్వాలని అతడు ముందే పట్టుబట్టి కంపెనీ వారిచేత ఎర్రకాగితం పై కరారునామా కూడా రాయించుకున్నాడు.

అమీర్‌చందు కలకత్తాలో పేరుమోసిన బ్యాంకరు. ఆ కాలంలో ఆర్థిక వ్యవస్థకు బ్యాంకర్లే ఆయువుపట్టు. వారి మాటను ఎంతటి వారూ జవదాటే వారు కాదు. ఈ కుబేరుల మద్దతు లేకుండా ఎంత గొప్ప ప్రభువైనా పెద్ద పెద్ద పనులకు పూనుకునేవాడు కాదు. రాజ్యాంగ చక్రాన్ని తిప్పే పెద్దలంతా వారి సాయాన్ని సదా అపేక్షిస్తూ వారి సుహృద్భావంకోసం వెంపర్లాడేవారు. అంతగా తిరుగు లేని పలుకుబడి ఉన్నది కాబట్టే తన షరతులను కుంఫిణీయులు చచ్చినట్టు తీర్చుతారని అమీర్‌చంద్ ధీమాగా ఉన్నాడు. ఆ ఆశతోటే అడ్డమైన పనులు చేసి సిరాజుద్దౌలాను నమ్మకద్రోహంతో సాగనంపాక... ఒప్పందం ప్రకారం తన వాటాకు రావలసిన లప్పను మోసుకుపోవటానికి అతడు తహతహలాడుతున్నాడు.

కాని – తెల్లవారు అతడిని మించిన మాయగాళ్లు. అక్కర తీరాక ఎవరినైనా అవతల పారేయటంలో వారు అసాధారణ ప్రజ్ఞావంతులు. తమకు కావలసినదంతా అతడితో చేయించుకున్నాక అతడి మొగం కూడా ఎరగనట్టే వారు ప్రవర్తించారు. జేబులోంచి తెల్లకాగితం తీసి మీర్జాఫరుతో తాము కుదుర్చుకున్న ఒప్పందం అంశాలను నిండు సభలో క్లయివ్ చదవసాగినప్పుడే అమీర్‌చందుకు అనుమానం తోచింది. తనకు రావలసిన వాటా ఊసే ఆ షరతుల్లో లేకపోయేసరికి అతడికి కాళ్లు చేతులు చల్లబడ్డాయి. రోషంతో, ఉక్రోషంతో దిగ్గున లేచి 'అసలు ఒప్పందం ఇది కాదు. నాకు చూపించింది ఎర్ర కరారు నామా' అని అరిచాడు. క్లయివ్ తొణక్కుండా బెణక్కుండా 'అవునోయ్ ఓమీ చందూ! అయితే ఏమంటావు? ఇది తెల్లకరారునామా' అన్నాడు.

అమీర్ చందు నిశ్చేష్టుడయ్యాడు. సభ ముగిశాక కూడా అతడు అలాగే నోట మాట రాకుండా ఉంటే క్లైవు అతడి చెంతకుపోయి 'ఓమీచెందూ! ఏమనుకోకు. ఆ ఎర్ర కాగితం వట్టి ట్రిక్కు. నీకు వచ్చేదేమీ లేదు' అన్నాడు. అమీర్‌చంద్‌కు నెత్తిన పిడుగుపడినట్టయింది.

జరిగిందేమిటంటే – తనకు వాటా ఇచ్చి తీరాలని, లేకుంటే కుట్ర సంగతి సిరాజుద్దౌలా నవాబు చెవిలో వేస్తానని అమీర్‌చందు పట్టుబట్టేసరికి క్లయివ్ మాయ చేశాడు. సేటుకు వాటా ఇచ్చే షరతును చేర్చి ఎర్ర కాగితంపై ఒక కరారు నామా, ఆ ప్రస్తావన లేకుండా తెల్ల కాగితంపై ఇంకో కరారు నామా రాయించి రెండిటిమీదా మీర్జాఫరుతో సంతకాలు చేయించాడు. నమ్మిన మనిషిని మరీ అంత దారుణంగా మోసం చేయడానికి మనసొప్పక అడ్మిరల్ వాట్సన్ బూటకపు పత్రం మీద సంతకం చేయనని చెప్పాడు. పాపభీతి ఏ కోశానా లేని క్లయివ్ అతడి సంతకాన్ని జంకులేకుండా తానే ఫోర్జరీ చేశాడు. అలా అతడు

బనాయించిన పత్రమే అసలైన ఒప్పందమనుకుని అమాయకంగా నమ్మి అమీర్‌చంద్ నిలువునా బొందలో పడ్డాడు.

అమీర్ చంద్ చేసిన రాజద్రోహానికి, దేశద్రోహానికి, ధర్మద్రోహానికి ఇటువంటి శాస్తి జరగవలసిందే. సందేహం లేదు. ఆ సంగతి అలా ఉంచితే, ఆంగ్లేయులు చేసిన మోసం వారు గొప్పగా నుడివే నీతులకు, నాగరిక విలువలకు ఎటువంటి శోభాయమానం?

ఒమీచంద్ ఇంగ్లీషు వారికెంత సహాయము చేయవలెనో అంత సహాయము చేసెను. సిరాజ్ ఉద్దౌలాను సింహాసనము నుండి కూలద్రోయు కుట్రలో యింగ్లీషువారు జయమొందుటకు యీ ఒమీచెందే కారకుడు. ఇంగ్లీషువారు చిల్లర దుకాణదారులైతే, ఒమీచంద్ కూడా ఆ తరగతికి చెందినవాడే. ఆ అప్రాచ్య తంత్రజ్ఞులు చేయమన్న చండాలపు పనులన్నింటిని వీడు నిర్లజ్జగ చేసివైచెను. ఈ చండాలపు పనులన్నింటికి తగిన కూలి - ప్రతిఫలము - తనకిత్తురని యీతడు ఆశించెను. ఒమీచంద్ ఆత్మద్రోహి. తన యేలికకు, తన జాతికి ద్రోహి. కాని పరాయివారలు కిరస్తానీలకు నమ్మినబంటు. వారిని పూర్తిగ నమ్మి, వీడు వారికి సహాయము చేసెను. దొంగలలో కూడా నిజాయితీ ఉన్నదందురు. కాని, యీ విలాయతీ దొంగలకు - యీ క్లైవు వాట్సను దొంగల ముఠాకు - నీతి, జాతి లేదు, తమ కింత ఉపకారము చేసిన ఒమీచంద్‌నకు ద్రోహ మొనర్చుటకు వారు జంకలేదు. ఏ రీతిగ మోసగించిరి? ఇదివరకు ప్రపంచ చరిత్రలో, యే యుగములోను, యెక్కడ కనివిని యెరుగని నీచాతినీచ మార్గముగ ద్రోహమొనర్చిరి... క్లైవు స్వర్గము నుండి దిగివచ్చిన సేనాపతియనియు, యిండియాలో ఆంగ్లరాజ్యమును స్థాపించిన మహానుభావుడనియు, యింగ్లీషు వారతనిని పూజించుచుందురు. ఇట్టి కిరస్తానీ క్లైవు విధర్ముడని వెక్కిరింపబడు ఒమీచందుని మోసపుచ్చుటకై ఫోర్జరీ చేసెను.

(బ్రిటిష్ మహాయుగము - ప్రథమ సంపుటము అను. మానికొండ సత్యనారాయణ శాస్త్రి, *124 పే.*)

'ఈస్టిండియా కంపెనీ నౌకర్లమైన మనము ఉదారుడు ధనాఢ్యుడు అయిన ఆ కలకత్తా దేశీయ వర్తకుడు ఒమీచందుకి సర్వదా కృతజ్ఞులమై ఉండాలి' అని 1757 ఏప్రిల్ 10న కంపెనీ వారి సెలక్టు కమిటీ ప్రొసిడింగ్సులో గట్టిగా ఒట్టుపెట్టుకున్నవారే రెండు నెలలు తిరక్కుండా ఒట్టు తీసి గట్టునపెట్టి, ఫోర్జరీతో అదే ఉపకారి నోట మట్టి కొట్టారంటే ఏమనుకోవాలి? ఇంగ్లండులో ఆ కాలాన అమల్లో వున్న శిక్షాస్మృతి ప్రకారం ఫోర్జరీ చేసిన వాడిని ఉరితీయాలి. తన నడతపై స్వదేశంలో దుమారం రేగి, పార్లమెంటరీ బోనులో నిలబడినప్పుడు అడ్మిరల్ వాట్సన్ సంతకాన్ని తాను ఫోర్జరీ చేయించినట్టు క్లయివ్ స్వయంగా ఒప్పుకున్నా చట్టప్రకారం అతడి తల తీయాల్సిందిపోయి గొప్ప బిరుదులిచ్చి, 'వీరతాడు'లు వేసి నెత్తినెక్కించుకున్నారంటే ఆంగ్లప్రభువుల నీతిమాలిన అవకాశ వాదాన్ని ఎలా అర్థం చేసుకోవాలి?

పోనీ! అమీర్‌చంద్ అనేవాడు అల్పజీవి; అత్యాశతో గొంతెమ్మ కోర్కెలు కోరాడు కనుక దొరలు అతడిని 'తెలివిగా' వంచించి, తమ కార్యానికి పావులా వాడుకుని వదిలేశారు; అది వారి రాజనీతి లెమ్మని సరిపెట్టకుందాం. సిరాజుద్దౌలా నవాబు వారిని తూష్ణీకరించాడు



కనుక; వారి స్థావరాలపై దాడిచేసి వారిని వెళ్లగొట్టాడు కనుక; వారి విరోధులైన పరాసులను చేరదీశాడు కనుక; అతడు గద్దెమీద ఉన్నంతవరకూ తమ ఆటలు సాగవు కనుక; నేరుగా అతడితో పోరాడి గెలిచేందుకు తమకు శక్తిచాలదు కనుక... ధర్మమా, అధర్మమా అన్న గుంజాటన లేకుండా ద్రోహాలను ప్రయోగించి అడ్డదారిలో దొరలు అతడి అడ్డు తొలగించుకొనవలసి వచ్చిందనీ సంశయలాభం ఇద్దాం. మరి - వారినే పూర్తిగా నమ్ముకుని, చేయమన్న తప్పుడు పనినల్లా చేసి, వారి కాళ్లకు మొక్కి గద్దెనెక్కి, వారి చేతిలో కీలుబొమ్మ కావడానికి ఇష్టపూర్వకంగా సిద్ధపడ్డ మీర్జాఫరుతోనైనా వారు సరిగా ఉన్నారా? అతడి మానాన అతడిని ప్రశాంతంగా బతకనిచ్చారా?

1757 జూన్ 29న 500 మంది సైనికులతో ముర్షిదాబాద్‌లో భయం భయంగా ప్రవేశించి మీర్జాఫరుకు స్వహస్తాలతో పట్టం గట్టిన సందర్భంలో క్లయివ్ సభాసదులందరికీ తన వైఖరిని వివరించాడు. సిరాజుద్దౌలాను ఏ పరిస్థితుల్లో తొలగించవలసి వచ్చిందో చెప్పి, కొత్త నవాబు బహుయోగ్యుడు కనుక ఇకపై తాము ప్రభుత్వ వ్యవహారాల్లో జోక్యం చేసుకోబోమని హామీ ఇచ్చాడు. అతడి మాటల్లోనే చెప్పాలంటే...

> I only attempted to convince them, that it was not the maxims of the English to war against the Government... ... and that as the present Nabob was a brave and good man, the country might expect to be quiet and happy under him; and for our parts, we should not anyways interfere in the affairs of the Government, but leave that wholly to the Nabob... and we should return to Calcutta and attend solely to commerce, which was our proper sphere and our whole aim in these parts.
>
> **[*Robert Clive of India*- Nirad C. Chaudhuri, *p. 254*]**

(ప్రభుత్వంపై యుద్ధం చేయటం ఇంగ్లీషువారి నీతి కాదని నేను వారిని నమ్మించటానికి ప్రయత్నించాను... ప్రస్తుత నవాబు ధైర్యశాలి, మంచివాడు కాబట్టి అతడి కింద ప్రశాతంగా, సంతోషంగా ఉండగలమని ప్రజలు ఆశించవచ్చుననీ, మాకు సంబంధించినంతవరకూ ప్రభుత్వ వ్యవహారాల్లో ఎలాంటి జోక్యం చేసుకోకుండా నవాబుకే అన్నీ వదిలేస్తామనీ.... కలకత్తాకు తిరిగి వెళ్లి మా ప్రధాన రంగమైన వ్యాపారం మీదే పూర్తిగా నిమగ్నమవుతామనీ, అదే మా పరిపూర్ణ లక్ష్యమనీ నేను ప్రకటించాను).

అన్నట్టుగానే - ఇంగ్లీషువారు వ్యాపారం మీదే పూర్తిగా నిమగ్నమయ్యారు. సరుకుల క్రయ విక్రయాల మామూలు వ్యాపారం మీద కాదు. కొంపలు కూల్చే, మందిని ముంచే, తలలు మార్చే రాజకీయ వ్యాపారం మీద! తమను నమ్మి, తమ పాలబడిన వాడి మూలగులు పీల్చి, సారమంతా లాగేసి, పూర్తిగా పిప్పి చేశాక చర్మాన్నీ, ఎముకలనూ అమ్ముకునే నికృష్ట వ్యాపారం మీద!!

దేవుని ముందు, పవిత్ర మత గ్రంథం మీద ప్రమాణం చేసి 1757 జూన్‌లో ఉభయ పక్షాలు కుదుర్చుకున్న ఒప్పందం ప్రకారం కుంఫిణీ వారికి ఇచ్చిన వరాలన్నిటినీ మీర్ జాఫర్‌ఖాన్ బహదూరు తీర్చాడు. వారు కోరుకున్న ప్రాంతాలన్నిటిపై వారికి జమీందారీ

హక్కులను ఇచ్చి, వారి విరోధులను రాజ్యం నుంచి గెంటేసి, వారి కోటలను వారు పటిష్ఠ పరచుకోవటానికీ, తన కోటలను తాను పటిష్ఠం చేసుకోకుండా ఉండటానికీ సమ్మతించి, ఇంకా వారు కోరిన అనేకానేక వ్యాపార రాయితీలనిచ్చి అన్ని విధాల సంతుష్టపరిచాడు. అతడి వల్ల కానిదల్లా కుంఫిణీ వారిని పట్టిన ధన పిశాచానికి తిన్నకొద్దీ ఎక్కువయ్యే దయ్యపు ఆకలిని తీర్చటం.

మీర్జాఫరు సైనికుడే తప్ప ఆర్థికవేత్త కాదు. పాలనా నిపుణుడూ కాదు. నవాబు కావాలన్న ఆబతో ఆంగ్లేయుల పన్నాగాలలో చిక్కుకున్నప్పుడు ఖజానాలో ఎంతుందో అతడికి తెలియదు. తనను గద్దెనెక్కిస్తే కంపెనీకి, దాని అధికారులకు వల్లమాలిన ధనమిస్తానని ధారాళంగా వాగ్దానమైతే చేశాడు. తీరా సింహాసనమెక్కి ఖజానా తెరిచి చూస్తే అతడు అనుకున్నంత ధనం కనిపించలేదు. ధనాగారంలోని సంపదనంతా దోచిపెట్టినా తెల్లవారికి ఇవ్వవలసిన మొత్తాలు చెల్లుకాలేదు. అక్కడికీ క్లైవుకు, ఇతరులకు చెప్పతరం కాని ముల్లెను కట్టబెట్టాడు. తన సొమ్ము తిన్న కృతజ్ఞతతో వారు తన యెడ కాస్త సానుభూతి చూపి కంపెనీకి తాను ఇవ్వలేకపోయిన బాకీని రద్దు పరచటానికి సిఫారసు చేయకపోతారా అని మీర్జాఫరు ఆశపడ్డాడు. ఖజానా వట్టి పోయిందనీ, వచ్చే ఆదాయంలో ఖర్చులు పోగా మిగిలేదేమీ కనిపించటం లేదనీ, అతడు ఎంత మొత్తుకున్నా దొరలు ఆలకించలేదు. అంతదాకా విదేశీయులకు నిషిద్ధమైన వస్తువుల వ్యాపారాలను కుంఫిణీవారు అడ్డగోలుగా సాగిస్తున్నందు వల్లే, పన్నుల రూపేణా జమ పడవలసిన ఆదాయం వారి మూలంగా ఆగిపోయినందువల్లే తనకు కష్టాలు వచ్చాయి కనుక కనికరించమని నవాబు ఎంతో ప్రాధేయపడ్డాడు. ప్రయోజనం లేకపోయింది. 'నా ప్రజలు చూడండి - ఎంత దీన స్థితిలో తినటానికి కూడు లేక అఘోరిస్తున్నారో! నా సైనికులను చూడండి- జీతాలు ముట్టక ఎట్లా అవస్థ పడుతున్నారో' అని కాళ్లావేళ్లాపడినా దొరల గుండెలు కరగలేదు. ఇస్తానన్న డబ్బు ఇస్తావా, చస్తావా అని వారు నవాబు కంఠంమీద కూచున్నారు.

అప్పటికి నవాబు గోళ్లూడగొట్టి తెల్లవారు వసూలు చేసిందే వారు జన్మలో ఎన్నడూ కళ్లజూడనంత! రాబర్ట్ క్లయివ్ ఆప్త మిత్రుడైన ఓర్మి రికార్డు చేసిన ప్రకారం – "మీర్జాఫరు నవాబు అయిన వారం రోజుల లోపలే ఈస్టిండియా కంపెనీ వారికి 73 లక్షల రూపాయల వెండి నాణెలు ముట్టాయి. ఈ ఖజానా అంతా 700 పెట్టెల్లో పెట్టి, సీళ్లు వేసి, నూరు పడవలలో ఎక్కించి, సిపాయిల పారాతో నడియాకు తీసుకుపోయారు. అక్కడనుంచి కంపెనీ నౌకాదళంలోని పడవలన్నీ వెంట రాగా జండాలు ఎగర వేస్తూ బ్యాండు మేళాలతో ఊరేగిస్తూ సీమకు కొనిపోయారు. ...ఇంగ్లీషు జాతి ఇదివరకెన్నడూ ఇంతటి ధనాన్ని కరకు నాణేల్లో ఒక్కసారిగా బహుమతిగా సంపాదించ లేదు. ఇంగ్లీషు టంకసాల లెక్కప్రకారం అది ఎనిమిది లక్షల నవరసులకు సమానం.

తేరగా దొరికిన సంపద చూసేకొద్దీ కుంఫిణీయులకు దురాశ పెరిగింది. మొదటి ఆర్నెల్లలో బకాయిపడిన మొత్తం కింద బర్ద్వాన్, నడియా, హుగ్లీ జిల్లాల రెవెన్యూను కంపెనీ వారికి దఖలు రాసి ఇచ్చినా, సొంతంగా క్లైవుకు సాలుసరి 26 వేల పౌండ్లు గిట్టుబాటయ్యే జాగీరును సమర్పించుకున్నా, ప్రభుత్వానికి గంగిగోవులాంటి సురేకారం వ్యాపారంపై మీరాశీ హక్కును ఆంగ్లేయుల చేతిలో పెట్టినా నవాబు కష్టాలు తీరలేదు. ఆంగ్లేయులకు తృప్తి కలగలేదు. ప్రభుత్వ వ్యవహారాల్లో జోక్యం చేసుకోబోమన్న హామీని గాలి కొదిలి... సేనలో



పరిపాలనలో నవాబు తలపెట్టిన కొద్ది మార్పులకు కూడా వీల్లేదంటూ క్లయివ్ మోకాలు అడ్డాడు. కొత్త నవాబు మంచివాడు... అతడి పాలనలో ప్రజలు ప్రశాంతంగా బతికెదరుగాక అని పుత్రచేత్తో దీవించిన క్లైవే మీర్జాఫర్ నెత్తినెక్కి స్వారీ చేస్తూనే అతడిని కూలగొట్టి సార్వభౌమాధికారాన్ని తామే చేజిక్కించుకోవాలని కుతంత్రాలు చేశాడు. "ఇప్పటి నవాబు ముసలివాడు. ఇతడి కొడుకు క్రూరుడు; పనికిమాలినవాడు; వారు రాజ్యానికి రావటం మనకు క్షేమం కాదు. రెండువేల యూరోపియన్ సైన్యం ఉంటే చాలు వీరిద్దరిని తోసేసి రాజ్యాన్ని మనమే కాజేయవచ్చు" అని 1759 జనవరి 7న బ్రిటిష్ ప్రధాని విలియం పిట్టుకు క్లయివ్ రహస్య లేఖ కూడా రాశాడు. అతడి వంటి ధూర్తుడు కాదు కాబట్టి పిట్ ఆ సలహాను తోసిపుచ్చాడు. అయినా కుంఫిణీవారు కుత్రబుద్ధిని మానలేదు. మీర్జాఫరు అనంతరం గద్దెనెక్కటానికి అతడి కుమారుడు మీరాన్‌కు గల వారసత్వ హక్కును తాము కాదనజాలరు కనుక, అతడంటే తమకు గిట్టదు కనుక తమదైన శైలిలో ముందుగానే అతడి అడ్డు తొలగించుకున్నారు. ఏమైందో తెలియదు. ఓరోజు పొద్దున మీరాన్ చచ్చి పడి ఉన్నాడు. పిడుగు పడి పోయాడని తెల్లవారు అన్నారు. జనం నమ్మలేదు.

సిరాజుద్దౌలాను చంపించి విప్లవం పుట్టించటం వల్ల ఆశించిన మేళ్లన్నీ మూడేళ్లలోపలే ఇంగ్లీషువారికి సమకూరిపోయాయి. స్వామిద్రోహి మీర్జాఫర్ తమకు రాసిన కరారు నామా షరతులన్నిటినీ అక్షరాలా చెల్లించాడు. ఇక ఏ మొగం పెట్టుకుని కొత్త సౌకర్యాలని అతడి నుంచి పిండగలరు? అప్పటికే మీర్జాఫరుకు కూడా ఆంగ్లేయుల ఆలింగనం కొండచిలువ కౌగిలి వంటిదని అనుభవంలో బోధపడింది. అతడికి భ్రమలు తొలగటంతో ఇంకే మాత్రమూ తమకు పనికి రాడని తెల్లవారికి విశదమైంది. అతడి స్థానంలో తెరకెక్కించటానికి కొత్త కీలుబొమ్మ కోసం వెదికితే మీర్జాఫరు అల్లుడు మీర్ కాసిం వాటంగా వారికి దొరికాడు.

బేరం కుదిరింది. కొండచిలువ నోరు తెరిచింది.

# బొమ్మలాట

**ఒంగి ఒంగి సలాములు చేసి నవాబుల గుడారంలో ప్రాపకాన్ని సంపాదించిన ఇంగ్లీషు ఒంటె దేశంలో కాలూనాక క్రమేణా నవాబులనే మరబొమ్మలను చేసి ఆడించి, కొనగోటితో కూల్చి పారేసే స్థితికి చేరుకుంది. పేరుకు సార్వభౌముడైన మొగల్ పాదుషాకు గాని, పాలిత ప్రజలకు గాని ప్రమేయం లేకుండా విదేశీ దుకాణాదారుల చిల్లర గుంపు బరితెగించి పాలకుడిగా ఎవరుండాలో, ఎవరు పోవాలో చిత్తం వచ్చినట్టు నిర్ణయించసాగింది.**

1757లో సిరాజుద్దౌలా నవాబును కూల్చటానికి ఆంగ్లేయులు యుద్ధాలు చేసి, ఎత్తులు వేసి, ద్రోహులను ప్రయోగించి చాలా ప్రయాసపడవలసి వచ్చింది. చచ్చీచెడి అతడి స్థానంలో ఒక కీలుబొమ్మను కూచోబెట్టాక ఎప్పుడుపడితే అప్పుడు బొమ్మలను మార్చటం వారికి గడ్డితిన్నంత తేలికైంది.

'నిన్ను నమ్మాను; నన్ను ముంచకు; నా తలపాగా తీసి నీ చేతిలో పెడుతున్నాను; దాని గౌరవం కాపాడు" అని ప్రాధేయపడిన సిరాజుద్దౌలాను దగ్గరి బంధువన్న కనికరం కూడా లేకుండా ద్రోహం చేసి, తాను విదేశీయులతో చేతులు కలపకుండా ఉంటే ఈరోజున తనకీగతి పట్టేది కాదు కదా? విదేశీయుల నుంచి ఇన్ని తాపులు తినవలసి వచ్చేది కాదు కదా- అని మీర్జాఫరుకు బుద్ధి వచ్చేసరికే పరిస్థితి చెయిదాటి పోయింది. క్లయివ్ స్థానంలో కొత్త గవర్నరుగా వచ్చిన వన్సీటార్ట్, సేనాపతి కైలాడ్‌ను వెంటబెట్టుకుని అప్పటికే (1760 అక్టోబరులో) ముర్షిదాబాద్‌కు బలగాలతో చేరుకున్నాడు. కాసింబజారు ఇంగ్లీషు గిడ్డంగిలో మకాం చేసి నవాబును తన సన్నిధికి పిలిపించాడు. ఇష్టం వచ్చినట్టు బనాయించిన అభియోగాల పత్రాన్ని అతడి మొగాన విసిరేసి 'నీ పరిపాలన బాగా లేదు. ఏం చేస్తావ్?' అని అడిగాడు.

'మా వాళ్లతో మాట్లాడి చెబుతాను. కొంచెం వ్యవధి ఇవ్వండి' అని అర్థించాడు నవాబు.

'అసలు నీ వాళ్లని అనుకుంటున్న వాళ్లే నీకు పగవాళ్లు, సమస్యలన్నీ నీ సలహాదారుల వల్లే వచ్చాయి. వారు కాదు- నీ దగ్గరి బంధువులలోనే... ఎవరిని సంప్రదిస్తావో ఒక పేరు ఇప్పుడే చెప్పు' అని తెల్లవాడు గొంతుమీద కూచున్నాడు.

విధి లేక నవాబు నలుగురు చుట్టాల పేర్లు చెప్పాడు. అల్లుడు మీర్ కాసిం అందులో ఒకడు. అతడే తెల్లవారికి కావలసినవాడు. అప్పటికే అతడితో వారికి లాలూచీలు, బేరాలు జరిగిపోయాయి. ఆ సంగతి నవాబుకు తెలియదు.

'సరే! మీ అల్లుణ్ని ఇక్కడికే పిలుస్తాము. అతడితో మాట్లాడుకో, అందాకా ఇక్కడే ఉండు' అని ఆజ్ఞాపించాడు గవర్నరు.

అప్పటికే రాత్రి పొద్దుపోయింది. గంటల తరబడి వారి పితూరీలు వినివిని నవాబుగారికి తల తిరుగుతున్నది. ఆకలి దంచేస్తున్నది. 'ఇప్పటికి నన్ను వదిలేయండి. నా మహలుకు పోయి విశ్రాంతి తీసుకుంటా' అని ఆయన అర్థిస్తే దొర దయతలచి 'సరే, పో' అన్నాడు.

బతుకుజీవుడా అని మీర్జాఫర్ బయటపడ్డాడు. తన పరిస్థితి చూసి జాలితోనో, మేలుచేద్దామన్న ఉద్దేశంతోనో గవర్నరు తనను వెనక్కి పంపాడని అతడనుకున్నాడు. కాని - కాదు. అతడిటు రాగానే అల్లుడు అటు వెళ్లాడు. మంతనాలన్నీ పూర్తయ్యాక అతడిని వెంటబెట్టుకుని 8 కంపెనీల సైనికులతో కర్నల్ కైలాడ్ అక్టోబరు 19 రాత్రి చీకటిమాటున ముర్షిదాబాద్ మీదికి దండు వెడతాడు.

అది శరన్నవరాత్రుల కాలం. మీర్జాఫర్ ఆస్థానంలోని ముఖ్యుల్లో చాలామంది హిందువులు. వారందరూ దసరా విందులో సొక్కి ఆదమరిచి నిద్రిస్తున్నవేళ ఆనుపానులు చూసుకుని కుంఫిణీ సైన్యం మెల్లిగా నది దాటి తెల్లవారు జామున 4 గంటలకు రాజభవనాన్ని చుట్టుముట్టింది. ముఖ్య సచివులు ముగ్గురిని బంధించాక, నవాబును నిద్రలేపి సభామందిరానికి రావించి గవర్నరు శ్రీముఖాన్ని చేతిలో పెట్టారు. 'దుష్టుల సలహాలకు చెవి ఒగ్గినంత కాలమూ నీకు నేను చెప్పేది తలకెక్కదు. నీకు మేలు చేసే ఉద్దేశంతోటే కైలాడ్‌ను నీకు సాయంగా సేనతో పంపుతున్నాను. నువ్వు ఏమిచేయాలో అతను చెబుతాడు. విను' అని దాని సారాంశం.

మీర్జాఫరు కాళ్లుచేతులు ఒణికాయి. నువ్వు మోసుకొచ్చిన సందేశం ఏమిటయ్యా అని కర్నల్ దొరను అడిగితే 'ఏముంది? పేరుకు నువ్వే నవాబుగా ఉండు. పెత్తనమంతా నీ అల్లుడికి అప్పజెప్పు. తరవాత సంగతి మేము చూసుకుంటాం' అన్నాడు.

నవాబు అరిచాడు. గోల పెట్టాడు. జుట్టు పీక్కున్నాడు. 'ఇలా జరుగుతుందని నేను అనుకుంటూనే ఉన్నాను. మీరిలాంటి వాళ్లని మా అబ్బాయి చచ్చేదాకా హెచ్చరిస్తూనే ఉన్నాడు' అని కేకలు వేశాడు. మీ బెదిరింపులకు లొంగేవాణ్ని కానని చిందులు తొక్కాడు. ఇంగ్లీషువాడు మారు మాట్లాడకుండా చోద్యం చూస్తూ కూర్చున్నాడు. రెండు గంటలు అలా ఎగిరెగిరి పడ్డాక తాను చేయగలిగింది ఏమీ లేదని నవాబుకు అర్థమైంది.

మరి ఇప్పుడు ఏం చేయాలి? ఖజానా ఎప్పుడో ఖాళీ అయింది. జీతాల బకాయి కోసం సైనికులు నానా అల్లరిచేస్తూ, తన మహలులోకే చొరబడి తననే బూతులు తిడుతున్నారు. ఈ స్థితిలో ఉత్సవ విగ్రహంలా తాను నవాబు కుర్చీలో కూచుని ప్రయోజనం లేదు. ఇంత బతుకూ బతికి అల్లుడి పెత్తనానికి లోబడటం నామర్దా. పైగా ఇంకో భయం. పాత నవాబుకు తాను ద్రోహం చేసినట్టే తనకు అల్లుడు ద్రోహం చేశాడు. చేతికి చిక్కగానే పాత నవాబును తాను ఖూనీ చేయించినట్టు, రేపు తన అల్లుడు తనకూ అదే మర్యాద చేస్తే...?!

ఇలా అన్నీ ఆలోచించుకున్నాక 'నేను వెళ్లిపోతాను. మీర్‌కాసింనే నవాబుగా ఉంచండి. మీ ఇష్టం వచ్చినట్టు చేసుకోండి' అని నిష్ఠురంగా పలికి 'వచ్చి రాజముద్రికలు తీసుకుపొమ్మ'ని అల్లుడికి మీర్జాఫరు కబురు పంపాడు. అతడు రాగానే అప్పగింతలు పెట్టి, నెత్తిన గుడ్డ వేసుకుని కలకత్తాకు పోయాడు. బానిస బుద్ధికొద్దీ మళ్లీ ఇంగ్లీషువారి రక్షణలో వారి ఇలాకాలోనే (మళ్లీ తనకు దశ తిరిగేదాకా) కాలం వెళ్లదీశాడు. మీర్ మహమ్మద్ ఖాసిం అల్లీఖాన్ బహదూర్ వారే కొత్త నవాబు అని కర్నల్ కైలాడ్ ఎలుగెత్తి చాటాడు.

పడగొట్టటం అయ్యాక దొంగలు దొంగలు వాటాలు పంచుకోవటమే తరువాయి. ఈ విషయంలో లోగడ మీర్జాఫరుకున్న సౌలభ్యం ఇప్పుడు మీర్‌కాసింకు లేదు. సిరాజ్ హయాంలో ఖజానా ధనరాశులతో నిండి ఉన్నది కనుక అతణ్ని వేటువేశాక మీర్జాఫర్ ధనాగారం తెరిచి ఉన్నదంతా దొరలకు దోచిపెట్టాడు. ఈసారి ఆ ఛాన్సులేదు. జాఫర్ మామ ఖజానా అయ్యవార్లంగారి నట్టిల్లులా ఉంది. మొత్తం కూడినా నలభై యాభై వేల రూపాయలకు మించి లేదు. దొరల సంభావనలకు అది ఎందుకూ చాలదు.

అయితేనేమి? మీర్‌కాసిం మహా ధనికుడు. సొంత బొక్కసంలో అతడికి కావలసినంత సిరి ఉంది. దాని నుంచే ఇయ్యకొన్న కట్నాలన్నీ దొరవార్లకు యథావిధిగా చెల్లించుకున్నాడు. అదీ ఎంతెంత? వన్సిటార్ట్ దొర ఒక్కడికే ఐదు లక్షల రూపాయలు, కైలాడ్‌కు రెండు లక్షలు. ఇంకో నలుగురు దొరలకు కలిపి పదిలక్షలు. వ్యక్తిగత లంచాలు మొత్తం 17 లక్షలు కాక కుంపిణీ వారికి ఖర్చులకింద 15 లక్షలు. వెరశి 32 లక్షల రూపాయలు చేతినుంచి వదిలించుకుని, ద్రోహుల జాబితాలో మామలాగే తన పేరునూ శాశ్వతంగా స్థిరం చేసుకుని మీర్ కాసిం నవాబు గద్దెనెక్కాడు. ఆశించిన ప్రకారం లంచాలు భారీగా ముట్టి తన బతుకులు బంగారం అయ్యాయి కనుక కుట్రలో భాగం పంచుకున్న దొరలు తమ ఘనతకు సంతసించి ఆనంద పరవశులయ్యారు.

అంతరాత్మ అనేది లేదు కనుక; డబ్బే వారికి సర్వస్వం కనుక కుంఫిణీ దొరలకు ఇందులో అనౌచిత్యం ఏమీ కనిపించి ఉండకపోవచ్చు. కానీ - వారు చేసినది మాత్రం ఏ విధంగానూ ఎవరూ సమర్థించలేని దుర్మార్గం; నీచమైన దురాగతం. ప్రసిద్ధ ఆంగ్ల చరిత్రకారుడు హెన్రీ టోరెన్స్ మాటల్లో చెప్పాలంటే -

> The iniquity of this transaction finds few apologists... The treaty with Mir Jaffir still subsisted... He was the sworn and blood-knit ally of the Company; and if ever men were bound by decency to maintain at least the forms of good faith, the Governor and the Council of Calcutta were so bound. Yet, being so, for the sum of £200,000 to them privately paid, and for the cession of three rich and populous provinces, they sold their too confiding friend and ally.
>
> [*Empire in Asia,* W.M. Torrens. *p. 34*]
>
> (ఈ వ్యవహారపు నీచత్వాన్ని సమర్థించేవారెవరూ కానరారు... మీర్జాఫరు తోడి సంధి ఒప్పందం ఇంకా అమల్లోనే ఉంది... మీర్జాఫరు కుంఫిణీ వారిని నమ్మి ప్రమాణ పూర్వకంగా తన నెత్తురుతో వారి నేస్తు కట్టాడు. మనిషన్న వాడికి మాటమీద నిలబడాలన్న ఇంగితజ్ఞానం ఉంటే కలకత్తా గవర్నరు, కౌన్సిలు మీర్జాఫరుతో ఒప్పందానికి కట్టుబడి ఉండాల్సింది. అయినా - మీర్‌కాసిం తమకు ప్రైవేటుగా ముట్టచెప్పిన రెండు లక్షల పౌండ్లకూ మూడు సంపన్న జిల్లాలకూ వారు తమను నమ్ముకున్న మిత్రుడిని అమ్మేశారు).




అనంతర కాలంలోని చరిత్రకారులే కాదు, ఆ కాలంలో జీవించిన కంపెనీ అధికారుల్లోనూ నీతి, న్యాయం పట్ల పట్టింపున్న కొద్ది మందికి ఒప్పందాన్ని ఉల్లంఘించి మీర్జాఫరును నిష్కారణంగా, దుర్మార్గంగా గద్దె నుంచి లాగేసిన తీరు నచ్చలేదు. ఇలాంటి తప్పుడు పనికి సభ్యసమాజం ముందు ఏ సమాధానం చెబుతాము; ఇలాగైతే మనల్ని ఎవరు నమ్ముతారు అంటూ కలకత్తా గవర్నింగ్ కౌన్సిల్‌లో కొద్ది మంది మెంబర్లు ధ్వజమెత్తారు. ఇది కుంఫిణీ వర్గాల్లో పెద్ద వివాదం అయింది. కాసులకు కక్కుర్తిపడి గూడుపుఠాణీ పన్ని తాముచేసిన నిర్వాకాన్ని సమర్థించుకుందుకు పక్షం రోజుల తరవాత హాల్వెల్ దొర "నవాబు మార్పిడికి కారణాలు" అంటూ ఓ డాబుసరి డాక్యుమెంటును బనాయించాడు. అందులో మీర్జాఫరును పాపాలభైరవుడిగా చిత్రించి అతడు నీచుడు, నిష్కారణంగా మనుషుల ప్రాణాలు తీసిన ధూర్తుడు అని అభియోగం మోపాడు. ఫలానా ఫలానా పెద్దమనుషులు ఎనమండుగురు, వారుగాక ఇంకో డెబ్బైమంది అమాయకులు నవాబు పిచ్చి ఉత్తర్వుల వల్ల చంపబడ్డారని ఏకరువు పెట్టాడు.

ఆ అభియోగాలు యావత్తూ పచ్చి అబద్ధాలు. ఆ సంగతి ఆరేళ్ల తరవాత కంపెనీ దొరలే ఒప్పుకున్నారు. 1766 సెప్టెంబరు 30న కలకత్తా కౌన్సిల్ వారే సీమలోని కంపెనీ డైరెక్టర్లకు ఇలా రాశారు- 'పాపం! గతించిన మీర్జాఫరు గురించి మనం చెడ్డగా అనుకోకూడదు. అతడిపై హాల్వెల్ మోపిన అభియోగాలలో అసలు నిజం ఏమిటో మీకు తెలియజెప్పటం మా బాధ్యత. హాల్వెల్ చెప్పినట్టు మీర్జాఫర్ భయంకర నరహంతకుడు కాదు. అతడు చంపించాడని చెప్పబడిన వారిలో ఇద్దరు మినహా అందరూ నేటికీ బతికే ఉన్నారు. ఆ ఇద్దరి మరణానికీ అతడి బాధ్యత లేదు'.

తరువాతెప్పుడో తాపీగా రికార్డును సరిదిద్దితేనేమి? జరగాల్సిన దారుణం జరిగేపోయింది.

ఇక మీర్‌కాసిం సంగతి. అనేక జీవిత కాలాలకు సరిపోయేంతటి సొంత సంపదను దొరలకు ధారపోసి అతడు బావుకున్నదీ ఏమీలేదు. స్వామిద్రోహంలో మామదీ, అతడిదీ ఒకటే బడి అయినా పాలనాదక్షతలో మీర్‌కాసిం చాలా నయం. నవాబుగిరీ చేపట్టాక ప్రభుత్వ వ్యయాన్ని అదుపుచేసి, ఆర్థిక వ్యవస్థను బాగుపరచి ప్రభుత్వ పనితనాన్ని పెంపొందించాడు. సైనికుల బకాయిలను తీర్చాడు. కుంఫిణీ వారికి ఇవ్వవలసినవి ఇచ్చేశాడు. ప్రజలు గోడును ఆలకించి, అన్యాయాలను సరిచేయటానికి దృఢవైఖరి అవలంబించాడు.

అదిగో అక్కడే అతడికీ, తెల్లవారికీ గొడవ వచ్చింది. ముఖ్యంగా వాణిజ్య సుంకాల దగ్గర.

ఇంగ్లీషువారు మొదట దేశంలో ప్రవేశించినపుడు కంపెనీ సరుకులపై రోడ్లమీద గాని, ఓడలమీద గానీ సుంకం వసూలు చేయకుండా మొగల్ పాదుషానుంచి ఫర్మానా పొందారు. కంపెనీవారి గిడ్డంగుల అధికారులు ఇచ్చిన దస్తకు (చీటీ) చూపితే వాటిని కంపెనీ సరుకులుగా భావించి సర్కారువారు వదిలేస్తూ వచ్చారు. ఆ సదుపాయాన్ని దుర్వినియోగం చేసి గిడ్డంగుల

అధికారులు తమ కింది నౌకరులకు నామమాత్రంగా జీతాలిచ్చి రహస్యంగా సొంత వ్యాపారం చేసుకునేందుకు చీట్లను ఇచ్చేవారు. దీనివల్ల ప్రభుత్వానికి పన్ను రాబడి నష్టమయ్యేది. అలీవర్దీఖాన్, సిరాజ్‌ల హయంలోనే దీని మీద తరచూ గొడవలు అయ్యేవి.

నవాబులనే చిత్తానుసారం మార్చేసే స్థితికి వచ్చిన కుంఫిణీ వారికి ఇప్పుడు కళ్లు నెత్తికెక్కాయి. తమ చేతిలో కీలుబొమ్మలైన నవాబులు తమనేమి చేస్తారన్న ధీమాతో వారు బరితెగించి సరకుల వర్తకాన్ని పగటి దోపిడీగా మార్చారు. తమ చీటీ చూపిన వారి సరకులనెల్లా కిమ్మనక వదిలెయ్యాలని చౌకీల అధికారులను నిర్బంధించేవారు. మారుమాట్లాడిన ఉద్యోగులను కంపెనీ సిపాయిలు కొట్టి, చీకటికొట్లో వేసి హింసించేవారు. విదేశీ వర్తకానికి మాత్రమే పొందిన పన్ను రాయితీని దేశం లోపల అన్ని బాపతుల వర్తకాలకూ ఏకపక్షంగా వర్తింపజేసుకున్నారు. ఊరూరా చొరబడి, పన్నులెగబెట్టి దౌర్జన్యంగా వ్యాపారాలు సాగించారు. వారేమో సుంకాలు కట్టరు. దేశీయ వ్యాపారులేమో సర్కారుకు అన్ని సుంకాలూ కట్టాలి. కాబట్టి వీరికంటే తక్కువ ధరకు వారు సరుకులను అమ్మగలగటంతో దేశవాళీ వ్యాపారుల నోట్లో మన్ను పడింది. తరవాత ఇంకో అడుగుముందుకేసి పంటలను తమకే అదీ తాము ఇచ్చిన ధరకే అమ్మాలని ఇటు రైతులను... తాము చెప్పిన ధరకు తమ దగ్గరే సరుకుల కొనాలని అటు ప్రజలను కంపెనీ వారు సతాయించేవారు. మాట వినకపోతే సిపాయిలను పిలిపించి గొడ్డును బాదినట్టు బాదించేవారు. దాంతో తెల్లవాళ్లు వస్తున్నారంటేనే జనం హడలిపోయి ఊరు వదిలి పారిపోయేవారు. నవాబు కంపెనీకి కీలుబొమ్మ కావటంతో కంపెనీలో పనిచేసే ప్రతి నౌకరూ తానూ నవాబుననే అనుకుని, ఏ సర్కారీ అధికారాన్నీ గుర్తించకుండా దాదాగిరీ చేసేవాడు.

కంపెనీవారు చేస్తున్న అఘాయిత్యాల గురించి ప్రతిరోజు మీర్‌కాసింకు ఫిర్యాదులు వస్తుండేవి. అక్కడికీ అతడు రెండున్నర ఏళ్లపాటు ఓపికపట్టి ఘర్షణ రాకుండా తమాయించుకున్నాడు. ఊరుకున్నకొద్దీ వారు పేట్రేగుతుండటంతో అతడికి ఓరిమి నశించింది. అప్పుడైనా అతడు చేసింది - జరుగుతున్న తప్పిదాలను ప్రెసిడెన్సీ అధికారుల ముందు పెట్టి, మీవారిని కాస్త అదుపుచేయమని అర్థించటమే. దానికే తెల్లవారు మండిపడి, తనను గద్దె నెక్కించారన్న కృతజ్ఞతయినా లేకుండా తమమీదే తప్పులెన్నుతున్నాడని పళ్లుకొరికారు. అతడి దగ్గర తాను భారీ లంచం పట్టిన సంగతి మరచిపోని గవర్నరు వాన్సిటార్టు అతడు చెప్పేదానిలో న్యాయం ఉందని నమ్మి ఉప్పు వర్తకం మీద నామమాత్రపు సుంకం కట్టటానికి ఒప్పందం కుదుర్చుకుంటే ఆ నిర్ణయాధికారం గవర్నరుకెక్కడిదని మిగతా దొరలు మోకాలు అడ్డారు. ఇక వారి పోరు పడలేక... తగువంతా సుంకాల దగ్గరే వస్తున్నది కాబట్టి మొత్తం సుంకాలనే ఎత్తేస్తే ఏ గొడవా ఉండదని నవాబు అనుకున్నాడు. ఇకపై ఎవరూ సుంకాలు కట్టనవసరం లేదని అతడు ఉత్తర్వు చేసేయగా అదెలా కుదురుతుందని ఆంగ్లేయులు అడ్డం తిరిగారు. సుంకాలు లేకపోతే దేశీయ సరుకులూ చౌక అవుతాయి; అప్పుడు మా తెరువు చూసేవారు ఉండరు. కనుక - మమ్మల్ని మాత్రమే మినహాయించి దేశీయ వర్తకులందరి మీదా సుంకం వేసి తీరాల్సిందేనని పట్టుబట్టారు.

ఇది అడ్డగోలు కోర్కె. దానికి మీర్‌కాసిం సమ్మతించలేదు. దాంతో సంఘర్షణ తప్పలేదు. వరసగా అనేక యుద్ధాలు జరిగాయి. మీర్‌కాసిం తెల్లవారి గుండెలదరగొట్టి పెద్దసేనతో వీరోచితంగా పోరాడినా చివరికి పరాజయం తప్పలేదు. విధి వక్రించడంతో చేసేది లేక



అయోధ్యలో వజీరు సుజా ఉల్ దౌలా దగ్గర ఆశ్రయం పొంది, దీర్ఘకాలం అనామకంగా బతికి అక్కడే మీర్‌కాసిం దరిద్రుడుగా మరణించాడు.

తాము నిలబెట్టిన నవాబు తమ దగ్గర కుక్కలా పడి ఉండి చెయ్యమన్నదల్లా చేసే రకం కాదని తేలిపోవడంతో కుంఫిణీవారు కొత్త 'బక్రా' కావాలనుకున్నారు. అట్లే కష్టపడి వెదకాల్సిన అవసరం లేకుండా వారికి కళ్ల ఎదుటే రడీమేడ్‌గా మీర్జాఫర్ కనిపించాడు.

ఇంకేం? మూడేళ్ల కింద తాము కూలదోసిన వాడితోనే సిగ్గులేకుండా దొరలు మళ్లీ బేరాలు సాగించారు. కలకత్తాలో పలకరించే దిక్కులేకుండా పడిఉన్న మీర్జాఫరుకు అంతకంటే కావలసింది ఏముంది? అడ్డమైన ప్రతి షరతుకూ సరేనన్నాడు. అచ్చంగా ఇచ్చెయ్యమని దొరలు అడిగిన జిల్లాలనల్లా వారికి రాసి ఇచ్చాడు. మీర్‌కాసిం చేసిన సంస్కరణలన్నీ కొట్టిపారేస్తానన్నాడు. ఉపరి 30 లక్షల కట్నాన్ని షరా మామూలుగా దొరలకు అర్పించుకుందుకు సిద్ధపడ్డాడు.

ఆ ప్రకారంగా మూడేళ్లు తిరక్కుండా 1763 జులైలో మీర్జాఫరు మళ్లీ బంగాళా నవాబు కావటంతో కథ మొదటికి వచ్చింది. కాదు - మునుపటికంటే దారుణమైన మలుపు తిరిగింది.

# పేనుకు పెత్తనం

**'డామిట్, కథ అడ్డం తిరిగిందే' అని సీమ దొరలు బోలెడు చిరాకుపడ్డారు. వారు ఈస్టిండియా కంపెనీని పెట్టిందే అందరూ ఘనంగా చెప్పుకునే ఇండియా సిరిసంపదలను సాధ్యమైనంత దండుకుని ఇబ్బడిముబ్బడిగా వ్యాపార లాభాలు గడించాలని. మొదట్లో అంతా సవ్యంగానే సాగినట్టు కనిపించింది. పోర్చుగీసు, ఫ్రెంచి, డచ్చి పోటీదార్లతో కయ్యాలు, యుద్ధాలు వచ్చినా వ్యాపారం స్థిరపడి, లాభాలు బాగానే వచ్చాయి. బెంగాల్‌లో క్లయివ్ ఒడుపుగా నడిపిన రాజకీయ తంత్రం పుణ్యమా అని సిరాజుద్దౌలా నవాబు పోయాక కుంపిణీ గల్లా పెట్టెలు గలగలలాడాయి. లక్షలూ, కోట్లలో ధనరాశుల రాబడికి కంపెనీవారు రుచి మరిగాక ఏమైందో గానీ క్రమేణా అయివేజు తగ్గిపోయింది.**

కీలుబొమ్మ నవాబుల్ని మార్చేసిన సందర్భాల్లో పట్టిన భారీ సంభావనల్ని కంపెనీ అధికారులే ఎక్కువగా నొక్కేసేవారు. మొత్తం తామే కాజేస్తే గొడవవుతుందన్న వెరపుతో కంపెనీకి వారు పెద్ద మొత్తం జమకట్టించినా అందులో చాలా వరకూ సేనల జీతభత్యాలకు, ఇతర ఖర్చులకే చెల్లిపోయేది. కంపెనీ డైరెక్టర్లు వద్దని వారించినా కంపెనీ ఉద్యోగులు తెగబడి ప్రైవేటు వర్తకాలను సాగించేవారు. కంపెనీ సరుకులకు మాత్రమే వర్తించాల్సిన సుంకం రాయితీలను విచ్చలవిడిగా సొంతానికి వాడేసుకుని జేబులు నింపుకునేవారు. దేశీయ వర్తకులను, స్థానిక రైతులను, పేద ప్రజలను పిశాచాల్లా పీడించి, హింసించి ప్రతికంపెనీ ఉద్యోగీ నవాబుదర్జా వెలిగించేవాడు. కొన్నేళ్లు ఇండియాలో కొలువుచేసి సీమకు తిరిగొచ్చే ప్రతివాడూ మోయలేనన్ని డబ్బు మూటలను, వెండి, బంగారం నింపిన పెట్టెలను ఓడలో వేసుకుని వస్తున్నాడు. కుంపిణీ డైరెక్టర్లకు మాత్రం వట్టి కాగితాల రికార్డులు కొదవ లేకుండా అందుతున్నాయి. కృతఘ్నులైన ముసల్మాన్లపైనా, నికృష్టులైన ఫ్రెంచి వారిపైనా కుంపిణీ సేనలు సాధించిన మహత్తర విజయపరంపరలను చక్కగా వర్ణించిన లేఖలకైతే మితిలేదు. వట్టి మాటలే గానీ డబ్బు మాత్రం కుంపిణీకి ఒక దమ్మిడీ కూడా ఎక్కువ రావటంలేదు. కట్టుదిట్టాలు లేని ఈ రకమైన దోపిడీవల్ల తమకింది ఉద్యోగులు బాగుపడుతున్నారే తప్ప కుంపిణీకి లాభమూ లేదు; వాటాదారులకు కడుపు నిండా ఇవ్వటానికి డివెడెండ్లూ లేవు. ఈ పరిస్థితుల్లో ఏమిచేయాలి? ఇండియాలో దోపిడీని తమకు లాభకరంగా ఎలా మార్చాలి?

ఇది ఈస్టిండియా కంపెనీ దొరలను వేధించిన ప్రశ్న. కర్తవ్యమేమిటా అని ఆలోచిస్తే ఆ సమయంలో వారి దృష్టి లార్డ్ క్లయివ్ మీద పడింది.

మీర్జాఫరును తెర మీదికి ఎక్కించిన మీదట అడ్డగోలుగా సంపాదించిందంతా మూటకట్టుకుని క్లయివ్ అప్పటికి ఐదేళ్ల కిందట ఇంగ్లాండు చేరాడు. బర్క్లీ బజారులో పెద్ద భవంతి కొని, నౌకర్లను చాకర్లను పెట్టుకుని, లార్డ్‌గిరీ పొంది దర్జా ఒలకబోస్తున్నాడు. పార్లమెంటులో అతని చేతికింద పన్నెండు ఓట్లు ఉన్నందున రాజకీయ హేమాహేమీలు అతడి ప్రాపకం కోసం అంగలారుస్తున్నారు. వాస్తవం ఏమైనా అప్పటి ఇంగ్లీషు ప్రజల, ప్రభువంశీకుల దృష్టిలో అతడొక మహావీరుడు. గొప్ప సామ్రాజ్య నిర్మాత. అతణ్ని కనుక మళ్లీ ఇండియాకు పంపిస్తే వ్యవహారాలను చక్కబెట్టి తమ లాభాలు తమకు సమకూర్చి పెట్టగలడని కుంపిణీ వారు ఆలోచించారు. ఇంకేం? ఆసియా ఖండంలోని బ్రిటిష్ సేనలకన్నింటికీ సర్వసేనాధిపతిగా చక్రవర్తి చేత అభిషిక్తుడై క్లయివ్ దొర 1765 మేలో మళ్లీ కలకత్తాలో అడుగుపెట్టాడు.

సెకండ్‌రవుండులో చేయవలసిందేమిటో లార్డ్ క్లయివ్‌కు ఒకరు చెప్పక్కర్లేదు. ఈ విషయంలో అతడికి చాలా స్పష్టమైన, ఆ కాలంలో సీమలో ఎవరికీ లేనంత అవగాహన ఉంది. ఇండియాకు బయలుదేరకముందే ఈస్టిండియా కంపెనీ డైరెక్టరు మిస్టర్ రౌస్‌కు రాసిన జాబులో దొరగారు ఇలా అన్నాడు :

"We are at last arrived at that critical period which I have long foreseen, which renders it necessary for us to determine whether we shall take the whole to ourselves; for it is not hyperbole to say, To-marrow the whole Mogul Empire is in our power... The new Nawabs whom we might support would be jealous of our power. We must become Nawabs ourselves, in fact, if not in name".

[*Empire in Asia*, **W.M. Torrens**, *p. 44*]

(నేను చిరకాలంగా ఎదురు చూస్తున్న కీలక స్థితికి చివరికి ఇప్పుడు చేరుకున్నాం. మొత్తం మనమే పరిగ్రహించాలా అన్నది తేల్చుకోవడం అవసరం. ఎందుకంటే మొత్తం మొగల్ సామ్రాజ్యమంతా రేపు మన చేతిలో వచ్చిపడుతుందనటం అతిశయోక్తికాదు...: మనమిప్పుడు మద్దతు ఇస్తున్న నవాబులే మన అధికార బలం చూసి ఈర్ష్యపడవచ్చు. పేరుకు కాకపోయినా వాస్తవానికి మనమే నవాబులం అయితీరాలి).

మొగలు సామ్రాజ్యం స్థానాన్ని ఆక్రమించి దేశాన్ని క్రమేణా ఎలా హస్తగతం చేసుకోవాలో క్లయివ్‌కు బాగా తెలుసు. బెంగాల్ నవాబుగా ఉన్నది తన "గాడిద" మీర్జాఫరే కాబట్టి వాడిని వాడుకుని కార్యం సాధించవచ్చునని అతడి ధీమా.

ఇంతలో ఒక చిక్కొచ్చింది. డబ్బులకోసం యములాళ్ళలా పీడించి ఇంగ్లీషువారు పెట్టిన బాధలకు తాళలేక ముసలి మీర్జాఫర్ 1765 జనవరిలో గుండె పగిలి చచ్చిపోయాడు. మీర్జాఫరు తరవాత నవాబు ఎవరుకావాలన్నది కుంపిణీ వారితో అతడు కుదుర్చుకున్న ఒప్పందంలో లేదు. వారసత్వానికి ఇద్దరు పోటీదారులున్నారు. ఒకడు – మీర్జాఫరుకు చనిపోయిన కుమారుడి కుమారుడు. ఆరేళ్ల పసివాడు. రెండోవాడు మీర్జాఫరు ఉంపుడుగత్తె కుమారుడైన ఇరవై ఏళ్ల నాజిం.

మద్రాసులో ఓడ దిగేసరికి ఈ సంగతులన్నీ క్లయివ్‌కు తెలిశాయి. మీర్జాఫర్ పోవడమూ ఒక రకంగా మంచిదేనని దొర అనుకున్నాడు. ఆరేళ్ల బాలుణ్ని కనుక గద్దెమీద కూచోబెడితే అతడి పేరు మీద చక్రమంతా తామే తిప్పవచ్చునని, పరిపాలనంతా దేశీయుల ద్వారా జరుగుతున్నట్టు లోకానికి చూపెట్టి, అసలైన ఆర్థిక వనరులన్నీ తమ వశం చేసుకుని, వాస్తవానికి తామే సర్వంసహాధికారం చలాయించవచ్చునని క్లయివ్ తలిచాడు. అయితే కలకత్తాలో ఉన్న ఇంగ్లీషు దొరలు దురాశలో, కుటిల నీతిలో అతడిని మించిన వారు. వేశ్యాపుత్రుడి దగ్గర ఇరవై లక్షల రూపాయలు లంచం పట్టి, నెలకు ఐదు లక్షల చొప్పున కంపెనీకి కట్టేట్లు, ఆంగ్లేయుల చెప్పుచేతుల్లో ఉండేట్టు కాగితం రాయించుకుని నాజిం ఉద్దౌలాను క్లైయివ్ కలకత్తా చేరేలోపే అర్జంటుగా గద్దెనెక్కించారు.

ఆ సంగతి తెలిసి క్లయివ్ లబోదిబోమన్నాడు. 'అకటా! ఇంగ్లీషు వారి పేరు ఎంత నీచ స్థితికి దిగజారింది! బ్రిటిష్ జాతికి ఎంతటి అప్రతిష్ఠ వచ్చింది' అని ఆ నీతుల రాయుడు తెగ గింజుకున్నాడు. ఎనిమిదేళ్ల కింద సిరాజ్‌ను కూల్చి మీర్జాఫరును పైకి తెచ్చినప్పుడు అతడు చేసిందీ అదే! తాను చేస్తే లౌక్యం... పరులు చేస్తేనేమో మోసం అవుతుందా? అదే మాట కలకత్తా దొరలూ అడిగారు. ఇంత అవినీతికి ఎలా పాల్పడ్డారయ్యా అని క్లయివ్ నిగ్గదీస్తే తమరు చూపిన దారినే మేమూ అనుసరించాం తప్పేమిటని వారు సవినయంగా మనవి చేశారు. దొరకు నోరు పెగలలేదు.

ఎనిమిదేళ్ల కిందట క్లయివ్ నాటిన అవినీతి విత్తనాలు అప్పటికి మహావృక్షాల్లా ఎదిగాయి. కుంపిణీ కమతంలో వాటి ధాటిని చూసి అతడికి కంపరం పుట్టింది. 'ఇక్కడ పరిస్థితి ఘోరంగా ఉంది. మన అధికారులందరూ తెగబడి లంచాలు మేస్తూ, తగని దర్జా వొలకబోస్తున్నారు. సివిల్, మిలిటరీ ఉన్నతాధికారుల నుంచి మామూలు గుమాస్తాల వరకూ అందరూ సొంత లాభమే చూసుకుంటూ, ఎంత నీచానికైనా ఒడిగడుతూ, జనాన్ని పీడిస్తున్నారు. పరిపాలన అనేది బొత్తిగా లేదు' అంటూ అతడు లండన్‌లోని పై అధికారులకు ఫిర్యాదు చేశాడు. దానిమీద కంపెనీ కోర్ట్ ఆఫ్ డైరెక్టర్లు కదిలి 'We think the vast fortunes acquired in the inland trade have been obtained by a scene of the most tyrannic and oppressive conduct that ever was known in any age or country' (మన కంపెనీ నౌకర్లు దేశీయ వర్తకంలో సంపాదించినదంతా ప్రపంచంలో ఇదివరకు ఏ దేశంలోనూ, ఏ కాలంలోనూ కనీ వినీ ఎరుగనటువంటి ఘోరకృత్యాల ద్వారానే లభించిందని మాకు నిశ్చయమై పోయింది) అని 1766 మేలో క్లయివ్‌కు రాశారు. ఈ అక్రమాలను అరికట్టేందుకు గట్టి కట్టుదిట్టాలను చేసే బాధ్యతను కూడా వారు ఈ దొర మీదే మోపారు.

తన అమోఘమైన బుద్ధితో ఆలోచిస్తే అప్పటి గందరగోళాన్నంతా సరిచేయటానికి క్లయివ్



గారికి ఒక్కటే దారి కనిపించింది. అదేమిటంటే – నవాబును పూర్తిగా పిండి బొమ్మను చేసి కూచోబెట్టి, బెంగాలుకు దివాన్‌గిరీ నేరుగా ఇంగ్లీషువాళ్ల చేతుల్లోకి తీసేసుకోవటమే!

ఆలోచన రాగానే క్లయివ్ దానిని ఆచరణలో పెట్టాడు. ఆ సమయానికి అలహాబాద్‌లో తలదాచుకున్న మొగల్ పాదుషా షా ఆలంవద్దకు వెళ్లి, అంతకు ముందు అయోధ్య నవాబు నుంచి తాను గెలిచిన రెండు జిల్లాలను నజరానాగా ఇచ్చి, అందుకు ప్రతిఫలంగా ఏడాదికి ఇరవై ఆరు లక్షల రూపాయల కప్పం కట్టి, నవాబు ఖర్చులు భరించే షరతు మీద బెంగాల్, బీహార్, ఒరిస్సా రాష్ట్రాల్లో రెవిన్యూ వసూలు చేసుకునే హక్కులను కంపెనీకి దఖలు పరుస్తూ 1765 ఆగస్టు 9న ఫర్మానా పొందాడు.

అదే చరిత్ర ప్రసిద్ధికెక్కిన 'దివానీ'! మొగల్ సామ్రాజ్య వినాశానికి అదే ధూమకేతువు.

ఘోర్జరీకోరైన క్లయివ్ కుతంత్రాన్ని అమాయక చక్రవర్తి కనిపెట్టలేకపోయాడు. కష్టపడాల్సిన అవసరం లేకుండా సాలుకు పాతిక లక్షల రూపాయలు తన విలాసాలకు, జనానా ఖర్చులకు వచ్చిపడతాయన్న ఆబతో ముందుగతి కానకుండా తెల్లవాడి ఉచ్చులో ఇరుక్కున్నాడు. అనేక సంవత్సరాలుగా మొగల్ పాదుషాపై అనేక యుద్ధాలుచేసి, అనేక దుర్మార్గాలకు పాల్పడిన ఇంగ్లీషువారిని పాదుషా తిరిగి నమ్మటమే చిత్రం! ఆ కాలాన ఢిల్లీ దర్బారుకు పట్టిన దారుణ దుర్గతికి 'దివానీ' ఫర్మానా గొప్ప ఉదాహరణ.

పన్నులు వసూలు చేసే అధికారాన్ని మాత్రం ఇంగ్లీషువారు తీసుకుని మామూలు పరిపాలన అంతా నవాబు మీదే వదిలేయటానికీ ఒక కారణం ఉంది. అదేమిటో 1765 సెప్టెంబరు 30న కంపెనీ డైరెక్టర్లకు రాసిన లేఖలో క్లయివే ఇలా విడమర్చి చెప్పాడు:

> ఈ రాష్ట్రాలను అజమాయిషీ చేయగల అధికారం మనకు ఉన్నప్పటికీ దానినిప్పుడు మనం చలాయించకూడదు. పరిపాలన పని అంతా నవాబు ఉద్యోగులకే వదిలేస్తే మనకు దమ్మిడీ ఖర్చుండదు. రెవిన్యూ వసూలులో మనకు కొంచెం నష్టం కలిగినా పెద్ద తప్పులు చేసినవాళ్ళను మనం సులభంగా కనుక్కొని శిక్షించవచ్చు... రాజ్యాధికారం నెత్తిన పెట్టుకోవటం వల్ల వచ్చే చిక్కులేవీ మనకు ఉండవు. నవాబు మాత్రం ఇంకా ఉంటాడు. దర్జాకు తగ్గదబ్బేదో వాడిమొగాన పారవేస్తూంటాం. రాష్ట్రాల పరిపాలనంతా దేశీయుల చేతుల్లో ఉంటుంది. వారు మనకు, నవాబుకు జాయింటుగా జవాబు చెప్పాల్సి ఉంటారు. డబ్బు సంచి మాత్రం మన చేతుల్లో ఉంటుంది.

[*The Rise of Chirstian Power in India*, **B.D. Basu**, *p. 187*]

ఉత్సవ విగ్రహంలా నవాబును కూచోబెట్టటంతోబాటు దఫాల వారీగా అతడి మనోవర్తిని కోతబెట్టి కరిమింగిన వెలగను చేసే పనీ మొదలైంది. అంతకుముందు నవాబు మారిన ప్రతిసారీ అతడు కుంపిణీకి కట్టాల్సిన మొత్తాన్ని అమాంతం పెంచేస్తూ వచ్చారు. 'దివానీ' చేజిక్కించుకున్న తరవాతేమో నవాబు మారినప్పుడల్లా కొత్త నవాబుకు కుంపిణీ ఇవ్వాల్సిన మొత్తాన్ని కోత వేస్తూ వచ్చారు. కొంతకాలానికి అసలు ఈ నవాబు మాత్రం ఎందుకు, దండుగ చేటు అనుకుని ఎత్తి చెత్తకుండీలో పారవేశారు. రెండోమారు తాను ఇండియాకు వచ్చినప్పుడు బెంగాల్ గద్దెమీద ఉన్న కుర్ర నవాబు నాజిం ఉద్దౌలాను సంవత్సరం తిరక్కుండా తన చేతికి మట్టి అంటని విధంగా ఖూనీ చేయించి క్లయివ్ దొరే ఈ చారిత్రక క్రమానికి తోవ తీశాడు.

నానా రకాల అక్రమ వ్యాపారాలకు, విచ్చలవిడిగా పన్ను ఎగవేతలకు, చెప్పనలవి కాని నేరాలకు ఘోరాలకు పేరు మోసిన ఇంగ్లీషు వారి చేతికి పన్నుల వసూలు చేసే అధికారాన్ని ఇవ్వటమంటే పేనుకు పెత్తనం ఇచ్చిన చందమే. దీని దుష్ఫలితానికి నవాబులు, పాదుషాలు, వారి జనానాలు మాత్రమే గురి అయి ఉంటే ఎవరూ కంటనీరు పెట్ట వలసిన పనిలేదు. కానీ – మొగల్ పాదుషా కాసుల కక్కుర్తితో అంగీకరించిన ఈ అడ్డగోలు ఏర్పాటు వల్ల ఇంగ్లీషు తోడేళ్ల బారిన పడింది అన్నెం పున్నెం ఎరుగని అభాగ్యజనం.

అంతదాకా–చెల్లించాల్సిన పన్నులు, సుంకాలు ఏదీ కట్ట కుండా ఖజానాకు ఎగనామం పెడుతూ వచ్చిన సీమదొరలే... వసూలు అధికారం తమ చేతికి వచ్చేసరికి రెచ్చిపోయి జనం మీద పడి గోళ్లూడకొట్టి శిస్తులు, పన్నులు వసూలు చేయసాగారు. క్లయివ్ ప్రవేశపెట్టిన ద్వంద్వ పరిపాలన వల్ల సామాన్య ప్రజల పరిస్థితి పెనం మీంచి పొయ్యిలో పడినట్టయింది. ఎక్కడ చూసినా అరాచకమే. ఎవరి ప్రాణానికీ, ఆస్తికీ భద్రత లేకుండా పోయింది. అనేక సంవత్సరాలుగా తెల్లవారి అక్రమ వ్యాపారాల దాదాగిరీ మూలంగా దేశీయ వ్యాపారులు చితికి పోయారు. స్థానిక పరిశ్రమలు మూతపడ్డాయి. మార్కెట్లు మట్టి కొట్టుకుపోయాయి. పంట పండించే రైతులు దయనీయ దైన్యం అనుభవిస్తున్నారు. దీనికి తగ్గట్టు 1768 ప్రాంతాల్లో తీవ్ర దుర్భిక్షం తాండవించింది. వెనకటి రోజుల్లోనైతే దయగల స్వదేశీ ప్రభువులు అలాంటి దుస్థితిలో శిస్తులు మాఫీ చేసి, సహాయక చర్యలు చేపట్టి ప్రజలను ఆదుకునేవారు. అటువంటి కనికరమేదీ విదేశీ రాబందులకు లేదు. అణాపైసలతో సహా రావలసిన పన్నులను గోళ్లూడగొట్టి వసూలు చేసి కుంపిణీ ఇనప్పెట్టెలను నింపటమే వారికి ప్రధానం. అందుకే దయాదాక్షిణ్యాలు లేకుండా వసూళ్ల కోసం జనం మీద విరుచుకుపడ్డారు. ఆదుకునే నాథుడు లేక దుర్భిక్షం కాస్తా భయానక కరవుగా మారింది. శిస్తుల బాధపడలేక, తినడానికి మెతుకు లేక కోట్లాది జనం కొంపాగోడూ వదిలి అన్నమో రామచంద్రా అని ఆక్రందిస్తూ వీధినపడ్డారు. బిచ్చం కూడా దొరక్క లక్షల మంది ఆకలి చావులు చచ్చారు. ఒకప్పుడు ధనధాన్యాలతో తులదూగిన పూర్ణియా జిల్లాలో మూడవ వంతు ప్రజలు నశించారు. తక్కిన ప్రాంతాల్లోనూ ఇదే గతి. పశువులనమ్ముకొని కొందరు, వ్యవసాయ పరికరాలు తాకట్టుపెట్టి కొందరు, అడుక్కుని కొందరు బతుకు వెళ్లదీశారు. చాలా మంది ఆకలి భరించలేక పసిపిల్లల్ని అమ్ముకున్నారు. కొంతమందైతే పీనుగులను కూడా పీక్కుతిన్నారు. లక్షల జనం కృశించిన శరీరాలతో, గుంపులు గుంపులుగా పల్లెలనుంచి పట్నాలకు తరలితే మశూచి, ప్లేగు లాంటి అంటువ్యాధులూ వారి వెంట వ్యాపించాయి. గుట్టలు పడిన శవాలను తొలగించే దిక్కు లేకపోయింది. మృత్యు దేవతకవి తిరునాళ్ల రోజులు. ఆ కాలంలో సర్కారు ఉద్యోగులు వేసిన అంచనాలను బట్టి బెంగాల్ కరువుకు కోటి మంది బలి అయ్యారు. ప్రపంచంలో మరే దేశంలోనూ, మరే కాలంలోనూ ఇటువంటి ఘోరకలి ఎరుగం.

ఇంతటి భయానక పర్యవసానాలకు కారణభూతమైన ద్వంద్వ పరిపాలనను తెచ్చి పెట్టి రాబర్ట్ క్లయివ్ తాను బావుకున్నదీ ఏమీ లేదు. రెండోసారి వచ్చినప్పుడు అతడు గొడవపడ్డ కుంపిణీ అధికారులు కొలువుమాని, అక్రమార్జనను సంచుల్లో మోసుకుని సీమకు తిరిగి వెళ్లాక అతడి నిర్వాకం మీద పెద్ద యాగీ చేశారు. బెంగాల్‌లో ఆంగ్ల రాజ్యస్థాపనకు క్లయివ్ అనుసరించిన పద్ధతులు, వాటి మంచిచెడ్డల మీద పెద్ద దుమారం రేగింది. పార్లమెంటరీ విచారణలో చీకటి సత్యాలన్నీ బయటికి వచ్చాయి. ఘోర తప్పిదాలు కట్టెదుట కనిపిస్తున్నప్పటికీ బ్రిటిష్ సామ్రాజ్య విస్తరణకు అమూల్య సేవలందించాడన్న కృతజ్ఞతాభావంతో బ్రిటిష్ పాలకులు అతడి తప్పులను క్షమించారు. పార్లమెంటు అభిశంసనను ఎలాగో తప్పించుకున్నా క్లయివ్‌ను అంతరాత్మ వదిలిపెట్టలేదు. సిరాజుద్దౌలాకు తాను చేసిన నమ్మక ద్రోహం నుంచి నాజిం ఉద్దౌలాను చంపించటం వరకూ తాను చేసిన, చేయించిన పాపాలు నీడలా వెంటాడి, అనుక్షణం కుళ్లబొడవడంతో తన మీద తనకే అసహ్యం కలిగి ఇంట్లో పిస్టల్ పేల్చుకుని క్లయివ్ ఆత్మహత్య చేసుకున్నాడు.

ఓ వంక బెంగాల్‌లో ఇన్ని దారుణాలు జరిగి, విదేశీ రాబందులు వికటాట్టహాసం చేస్తూ మొత్తం దేశాన్నే నెమ్మదిగా కబళించటానికి రంగాన్ని సిద్ధం చేసుకుంటూంటే మిగతా దేశం ఏమి చేసింది? ఎదురులేని జాతీయశక్తి అని అప్పట్లో అందరూ భావిస్తున్న మరాఠా కూటమి ఈ జాతీయ విపత్తుకు ఎలా స్పందించింది? పానిపట్టు యుద్ధంలో వారిని మనం విడిచి వచ్చిన తరవాత మరాఠా రాజ్యం ఏమైంది?

# పడిలేచిన మరాఠాలు

**మరాఠాల పని అయిపోయిందనే అందరూ అనుకున్నారు.**
**ఔను మరి! పానిపట్టులో వారికి తగిలిన దెబ్బ సామాన్యమైనదా?**
**సైనికులు, స్త్రీలు, పిల్లలు కలిసి ఐదు లక్షల మందికి పైగా మరాఠా శిబిరంలో ఉండగా... 1761 జనవరిలో జరిగిన ఘోర సంగ్రామంలో వీరిలో ముప్పాతిక భాగం ఊచకోతకు గురయ్యారు. నలభై వేల మంది దాకా బందీలయ్యారు. యుద్ధరంగమేగాక మరాఠా శిబిరం చుట్టూ భారీ కందకాలు, చుట్టుపట్ల అడవులు కూడా శవాల గుట్టలతో నిండిపోయాయని ఆ యుద్ధంలో అఫ్ఘన్ల పక్షాన ప్రత్యక్షంగా పాల్గొన్న కాశీరాజా పండిట్ గ్రంథస్థం చేశాడు.**

భయానక జన నష్టానికి మించి... ఛత్రపతి శివాజీ స్ఫూరితో అనేక తరాల తరబడి యుద్ధాల్లో ఆరితేరిన మెరికల్లాంటి మహాయోధానుయోధులు దాదాపుగా అందరూ నేల కొరిగారు. ఆశలెన్నో పెట్టుకున్న పెద్ద కుమారుడు విశ్వాసరావు, తనకు కుడి భుజమైన సోదరుడు సదాశివరావు అకాల మృత్యువు పాలవటం పీష్వా బాలాజీరావు గుండెను పిండేసింది. ఈ దారుణ దుర్వార్తలకు తట్టుకోలేక కొద్ది రోజులకే ఆయన కూడా ప్రాణం విడిచాడు.

మహారాష్ట్రులు... ఆ మాటకొస్తే యావద్భారత చరిత్రలోనే అది కనీ వినీ ఎరుగని ఘోరకలి. కొన్ని వేల సంవత్సరాల పూర్వం అదే పానిపట్టుకు దగ్గర కురుక్షేత్ర ధర్మయుద్ధంలో భరతఖండంలోని క్షత్రియజాతి దాదాపుగా తుడిచిపెట్టుకుపోయినా... మార్గదర్శనం చేయడానికి కృష్ణుడు, కార్యభారం మోయడానికి భీమార్జునుల్లాంటి మహావీరులు బతికే ఉన్నారు. మరాఠా భారతంలో మాత్రం పానిపట్టు అధర్మయుద్ధం తరువాత పెద్దల్లో మిగిలింది రఘునాథరావు అనే శకుని ఒక్కడే. (దాయాదుల మీద అలిగి యుద్ధానికి పోలేదు కనుక దేశ దురదృష్టంకొద్దీ అతడు బతికిపోయాడు). మహాయోధుల శ్రేణి అంతరించి, సమర్థుడైన పీష్వా కూడా కన్నుమూసి, సరైన ఉత్తరాధికారి ఎవరూ కనపడని ఆ విపత్కాలంలో మరాఠా చరిత్రకు ఆశ్వాసాంతమైందనే చాలా మంది అనుకున్నారు. చుట్టుముట్టిన బహుముఖ సమస్యలతో మరాఠా రాష్ట్రకూటమి దానికది కూలి పోతుందనే అందరికీ తోచింది. ఈ పరిస్థితిని అలుసుగా తీసుకుని సర్వత్రా శత్రువులు విజృంభించారు. మైసూరులో హైదరాలీ తిరుగుబాటు చేసి మరాఠా సామ్రాజ్యాన్ని వీలైనంత నొల్లుకోవటం మొదలెట్టాడు. అప్పటిదాకా మరాఠాల చెప్పుకింద తేలులా పడి ఉన్న నిజాం తల ఎగరేసి ఇంకోవైపు నుంచి కుమ్ముకు రాదలిచాడు. బాహాబాహీగా తలపడే శక్తి లేకపోయినా సందుచూసి అందిన మేరకు బాగుపడాలని ఆంగ్లేయ వర్తకులు గోతికాడ నక్కల్లా కాచుకుని ఉన్నారు. ఉత్తరాదిన మహమ్మదీయులే గాక రాజపుత్రులు, జాట్లు కూడా మరాఠా ఆధిపత్యంపై తిరగబడసాగారు. వీటన్నిటికీ మించి మరాఠాలకు మిగిలిన కొద్దిపాటి పోరాటపటిమను కూడా కుట్రలూ కుహకాలతో నిర్వీర్యం చేయడంలో రఘునాథరావు తీరిక లేకుండా ఉన్నాడు.

ఒక్కమాటలో చెప్పాలంటే పానిపట్టులో మహారాష్ట్రులకు జరిగింది సర్వనాశనం! కాని-ఆశ్చర్యం!! అంతటి ఘోర విపత్తును కూడా మరాఠా జాతి ఎవరూ ఊహించని రీతిలో తట్టుకుని తెప్పరిల్లింది. పీనుగుల పోగులనుంచే ఆ బూడిద రాశులనుంచే సమస్యల, సంక్షోభాల గండాలను దాటి అద్భుతమైన ప్రాణశక్తి ఉద్భవించింది. మరాఠా ప్రాభవం మునుపటికంటే మిన్నగా ధగధగలాడింది.

అసాధ్యమనిపించే ఈ అద్భుత ఘనతను సాధించిన వాడు... నమ్ముతారో లేదో... నూనూగు మీసాల చిన్నవాడు. పేరు మాధవరావు. పీష్వా బాలాజీరావుకు చిన్న కుమారుడు. తండ్రి మరణానంతరం పీష్వా అయ్యేనాటికి అతడి వయస్సు కేవలం 16 ఏళ్లు. ఆ తరవాత అతడు బతికింది కేవలం పదకొండేళ్లు. ఆ పిన్న వయసులోనే, ఆ కాస్త జీవిత కాలంలోనే తన పూర్వులు ఎవరూ సాధించని ఘనతలు సాధించాడు. పెద్దల పేరుని నిలబెట్టడమేగాక పీష్వాలందరిలోకీ నిస్సందేహంగా గొప్పవాడని చరిత్రకారుల ప్రశంసలందుకున్నాడు. ఛత్రపతి తరువాత అంతటి ఆదర్శమూర్తిగా, ప్రజల కష్టసుఖాలను పట్టించుకుని కడుసమర్థంగా పాలించిన ధర్మప్రభువుగా మహారాష్ట్రుల మదిలో చిరస్థాయిగా నేటికీ నిలిచి ఉన్నాడు.

మాధవరావు తండ్రి బాలాజీ రావు, తాత బాజీరావు కూడా పిన్నవయసులో పీష్వా అయినవారే. కాని వారికి తమ పెద్దల ఒద్దికలో తర్ఫీదు అయిన అనుభవం ఉంది. ఆత్మ బంధువుల అండ ఉంది. తండ్రి తరవాత వారసుడనుకున్న అన్న యుద్ధంలో మరణించడంతో ఆపద్ధర్మంగా 16 ఏళ్ల లేత వయసుకే రాజ్యాధికారం అందుకోవలసి వచ్చిన మాధవరావుకు అనుభవమూ లేదు; అండా లేదు. పెద్ద దిక్కు కావలసిన పినతండ్రే అతడి పాలిట పగవాడు.

అన్నగారు కాలం చేయగానే పీష్వాగిరీని తానే తన్నుకుపోవాలని రఘునాథరావు విశ్వప్రయత్నం చేశాడు. ఈ విషయంలో తనను బలపరచమంటూ పాదుషాకు, మొగల్ సర్దార్లకు, ఇంగ్లీషువారికి జాబులు కూడా రాశాడు. అయితే అతడి తత్వం ఎరిగిన మరాఠా ముఖ్యులు ఆ పన్నాగాన్ని సాగనివ్వలేదు. తన పక్షాన చేరడానికి ఒక్కడూ సిద్ధపడకపోవటంతో ప్రజల సెంటిమెంటుకు రఘోబా విధిలేక తలవంచాడు. అయినా కుట్ర బుద్ధిని మాత్రం మానలేదు. పెద్దవాడన్న గౌరవంతో, పెత్తనానికి కొత్త అయిన తనకు దారిచూపి నడిపిస్తాడన్న నమ్మకంతో మాధవరావు పెద్దరికం ఇస్తే దానిని అలుసుగా తీసుకుని పిల్ల పీష్వా లెక్కేమిటన్నట్టుగా అహంకరించి, తానే సర్వాధికారిలా చెలరేగాడు. మొదట్లో కొంతకాలం అణకువగా ఉండిన పీష్వా అనుపానులు గ్రహించి పరిపాలనపై క్రమేణా పట్టుబిగించుకున్నాక

కీలుబొమ్మలా పడి ఉండటానికి ఇచ్ఛగించక స్వతంత్రంగా వ్యవహరించసాగటంతో రఘునాథరావుకు కళ్లుమండాయి. అప్పటి నుంచీ పీష్వాను దెబ్బతీసి అధికారం తాను అందుకోవటానికి అతడు పన్నని కుతంత్రం లేదు. చేయని ద్రోహం లేదు.

తన దిక్కుమాలిన స్వార్థంకోసం విదేశీ వర్తకులతో కుమ్మక్కయ్యేందుకూ, మరాఠాలకు బద్ధశత్రువులైన నిజాం, హైదరాలీ వంటి మహమ్మదీయ ప్రభువులతో లాలూచీ అయేందుకూ బాబాయిగారు వెనకాడలేదు. మరాఠా రాజ్యాన్ని కబళించడానికి పెద్ద సైన్యంతో విరుచుకుపడ్డ శత్రువులను భీషణ యుద్ధంచేసి పీష్వా సేనలు అతి కష్టంమీద ఓడించినప్పటికీ... చేతికి చిక్కిన శత్రువులతో లోపాయకారీ బేరాలు కుదుర్చుకుని ఆషామాషీ షరతుల పూలచెండ్లతో మాత్రం కొట్టి వదిలేసిన ఘనుడు రఘునాథరావు.

రాజధానిలో ఉంచితే కుట్రలు చేస్తున్నాడని యుద్ధాలకు పంపితే విరోధులను అణచాల్సింది పోయి వారితోనే బేరాలాడుకుని శల్యసారథ్యం చేస్తాడు. ఆ ఎత్తులను గ్రహించి పీష్వా తగు జాగ్రత్తలు పడితే కాడి కింద పారేసి గోదావరి ఒడ్డుకువెళ్ళి రాజ్యమంటే రోత పుట్టిందంటూ కపట వైరాగ్యం అభినయిస్తాడు. అన్నం ముట్టనని హఠం చేస్తాడు. తనకేమీ అక్కర్లేదంటూనే రహస్యంగా పావులు కదిపి, గోతులు తీసి పీష్వాను కూల్చటానికి కుత్సితాలు పన్నుతాడు. అధికారం మీద యావ లేదని అంటూనే తిరుగుబాటును లేవదీసి రాజ్యంలో నా వాటా నాకు పంచివ్వమంటూ యాగీ చేస్తాడు. ఎన్ని విధాల నచ్చచెప్పినా ఫలితం లేక, విధిలేని పరిస్థితుల్లో బహిరంగ యుద్ధంలోనే బుద్ధి చెప్పినా వినడు. మారడు. ఇలా పక్కలో బల్లెంలా, కంట్లో నలుసులా తయారైన ప్రత్యర్థి ఔరంగజేబు లాంటి ఏ ముస్లిం సుల్తానుకో తటస్థిస్తే కళ్లలో ప్రేమగా సూదులుగుచ్చో, ఆప్యాయంగా విషం తాగించో, చాటునుంచి వేటు వేయించో ఒక్క రోజులో అడ్డుతొలగించుకునేవాడే.

మాధవరావు తరహా అదికాదు. అతనిదంతా భారతీయ పద్ధతి. నీచ స్వార్థంకోసం ఎంతటి ఘాతుకానికైనా పాల్పడటం ఔరంగజేబుల లక్షణం కాగా... అవసరమైప్పుడు కూడా కఠినత్వం చూపక, విష సర్పాల పట్ల జీవకారుణ్యం చూపటం భారతీయుల బలహీనత. రాజ్యంలో భాగం ఇస్తావా చస్తావా అని ధూముధాములాడిన పినతండ్రిని మెడపట్టి బందీఖానాలో పడవేయగల శక్తి ఉండి కూడా మాధవరావు పీష్వా ఏమని బదులిచ్చాడో తెలుసా?

*"బాబాయిగారూ! మీరు రాజ్యపంపకం గురించి మాట్లాడుతున్నారు. కాని ఈ మహాసామ్రాజ్యానికి యజమానులెవరు? భాగాలు చేయటానికి ఇదేమన్నా సొంత ఆస్తా? ఈ రాజ్యాన్ని ఇంత గొప్ప స్థితికి తేవడానికి వేల మంది కష్టపడ్డారు. దీన్ని కనుక చీలిస్తే చితికిపోతుంది. అది నేను సహించలేను. కావాలంటే రాజ్యం మొత్తాన్ని మీరే ఏలుకోండి. నేను ఆనందంగా తప్పుకుంటాను".*

**[*The Maratha Movement*, V.D. Savarkar, *p.133*]**

ఇంతగా వినయం చూపి, ఒక దశలో పిన తండ్రి చెప్పులు నెత్తిన పెట్టుకుని సయోధ్యకోసం ప్రాధేయపడిన మాధవరావు అంతటి ధర్మరాజుకు కూడా ఓరిమి నశింపజేసి, తనను ఖైదు చేయించక తప్పని పరిస్థితి తెచ్చిపెట్టిన యోగ్యుడు రఘునాథరావు.

మాధవరావు రాజ్యం చేసింది నిండా పదకొండేళ్లు లేదు. మొదట్లో కొన్నేళ్లు పిన తండ్రి



కర్ర పెత్తనం కింద ఒదిగి ఉండగా, చివరిలో కొన్నేళ్లు పేగులు తోడేసే క్షయవ్యాధితో నానా యాతన పడ్డాడు. కళ్లేలన్నీ చేతుల్లోకి తీసుకుని, పరాక్రమం ప్రదర్శించి, నలుదిశలా సేనలు నడిపించి, శత్రువులను జయించి, పరిపాలన మీద పూర్తిగా దృష్టి కేంద్రీకరించడానికి అతడికి నికరంగా దక్కినవి కేవలం ఐదారేళ్లు. ఇంత తక్కువ వ్యవధిలోనే అంతర్యుద్ధాలతో, పినతండ్రి కుత్సితాలతో సతమతమవుతూనే అతడు అద్భుత విజయాలను సాధించాడు. తరువాతి కాలంలో బ్రిటిష్ వారిని గడగడలాడించి ముప్పు తిప్పలు పెట్టిన హైదరాలీ అంతటివాడే మాధవరావుతో చేసిన ప్రతి యుద్ధంలోనూ ఘోరంగా ఓడాడు. 1763లో రాక్షసభువనం యుద్ధంలో నిజాం ఆలీ భారీ సైన్యాన్ని చిత్తుగా ఓడించి మాధవరావు చూపిన ప్రతాపం అతడి తాత బాజీరావు దిగ్విజయాలను గుర్తుచేసింది.

తన రాజ్యంపై అకారణంగా దాడిచేసి, దేవాలయాలను కూల్చి, దారుణ దురాగతాలకు పాల్పడ్డ నిజాం ఆలీని, అనంతరం దురాక్రమణకు దిగిన హైదరాలీని ఎదిరించి రాజ్యరక్షణ చేసుకోవడంతోటే మాధవరావు సంతృప్తి పడలేదు. శివాజీ మొదలుకుని తన తాత, తండ్రులవరకూ మరాఠా జాతిని ఉత్తేజితం చేసిన 'హిందూ పాదుషాహీ' లక్ష్యసాధనకు, దేశమంతటా హైందవ ధర్మ పునఃప్రతిష్ఠకూ మాధవరావు జీవితమంతా శాయశక్తులా పాటుపడ్డాడు. కర్ణాటక జైత్రయాత్రకు పూనా నుంచి 75వేల సేనతో 50 శతఘ్నులతో కదిలి... పూర్వపు మరాఠా పద్ధతిలో దోపిడి మీద కాకుండా రాజ్యాలను మొత్తంగా గెలవడం మీదే దృష్టి లగ్నం చేసి, ఏకదీక్షతో అరివీర భయంకరంగా శ్రీరంగపట్నం దిశగా హైదర్ మీదికి దండెత్తుతున్న మాధవరావు ప్రతాపాన్ని చూసి ఆంగ్లేయుల గుండెలదిరాయి.

"From the present conduct of the Marathas both in the North and the South, and from the genius, spirit, and ambition of Madhav Rao, we are inclined to suspect that their designs are not confined to the mere collection of chauth but extend to the subjection of the whole peninsula".

(ఉత్తరాదినా దక్షిణాదినా ఇప్పుడు మరాఠాలు వ్యవహరిస్తున్న తీరును, మాధవరావుకున్న అద్భుత ప్రతిభ, ఆత్మశక్తి, గాఢవాంఛలను గమనిస్తే వారి ఉద్దేశాలు కేవలం చౌథ్ వసూలుకు పరిమితం కాకుండా మొత్తం ద్వీపకల్పాన్ని స్వాధీన పరచుకోవాలనే దాకా విస్తరించినట్లు అనుమానం కలుగుతున్నది)

అని 1771లో బ్రిటిష్ అధికారులే అన్నారంటే [Bengal select committee proceedings, 10 March 1771] ఆ కాలంలో మరాఠా ప్రభ ఎంత ఉజ్వలంగా వెలిగిపోయిందో, వారిని నడిపించిన మాధవరావు ప్రతాపం ఎంత గొప్పదో ఊహించవచ్చు.

"The Marathas have not only the greatest force on their side, but the prayers of all the people who everywhere without expection are robbed and harassed... (మరాఠాల పక్షాన దేశంలోకెల్లా గొప్ప సైనిక శక్తి ఉండటం ఒకటేకాదు; సర్వత్రా దోపిడీకి, వేధింపులకు గురి అవతున్న ప్రజలందరి ప్రార్థనలూ వారి విజయాన్ని కాంక్షించాయి) అని **Peixoto** తన ఉద్గ్రంథంలో ***(History of Hyder Ali Khan**, Vol. VI, P. 101)* పేర్కొనడం ఈ సందర్భంలో గమనార్హం.

అటు నిజాంతో, ఇటు హైదర్‌తో అనేక యుద్ధాలు చేస్తూనే, పిన తండ్రి తదవక్కో విధంగా పెట్టే మడత పేచీలతో సతమతమవుతూనే మాధవరావు పీష్వా ఉత్తరాది మీద దృష్టి సారించాడు. ఇరుగూ పొరుగున తక్షణ సమస్యల నుంచి కొంచెం కుదుటపడిన వెంటనే 1769లో మరాఠా ముఖ్యసర్దార్లందరినీ పెద్ద సైన్యంతో సమీకరించి నర్మద ఆవలికి దండయాత్ర చేయించాడు.

పానిపట్టులో వేలూ లక్షల హిందువులను ఊచకోత కోయించి యుద్ధం గెలిచిన ఆఫ్ఘన్ రాజు అహ్మద్‌షా అబ్దాలీ దానివల్ల బావుకున్నది ఏమీలేక, సొంత సైన్యంలో అలజడులను తట్టుకోలేక అప్పటికి చాలా కాలం కిందటే అప్రతిష్ఠను మాత్రం మూటకట్టుకుని వెనుదిరిగిపోయాడు. పానిపట్టులో మరాఠా శక్తి చితికిపోయిందని తలచి తలలు ఎగరవేసిన రొహిల్లాలను, పఠాన్లను, రాజపుత్రులను, జాట్లను అనేక యుద్ధాల్లో మరాఠాలు చిత్తుగా ఓడించారు. షా ఆలం చక్రవర్తిని తమ అధీనంలో ఉంచుకుని నాటకాలాడాలనుకున్న ఇంగ్లీషువారి ఎత్తులను చిత్తుచేసి... భారతీయ సామ్రాజ్యమంతటినీ అజమాయిషీ చేసి సంరక్షించే బాధ్యత యావత్తూ మరాఠాలదేనని మొగల్ పాదుషా చేత ఒప్పుదల చేయించి మరాఠాలు దేశంలో తమ కత్తికి ఎదురు లేదనిపించుకున్నారు. మాధవరావు రాజకీయ రణతంత్రాల పుణ్యమా అని పానిపట్టు పరాభవాన్ని మరచి మరాఠాలు మళ్లీ రొమ్ము విరుచుకుని తిరగగలిగారు.

1761లో చేయలేకపోయిన జైత్రయాత్ర 1771లో జయప్రదంగా పూర్తయింది. బాబర్, అక్బర్, ఔరంగజేబుల మొగలాయి మహాసామ్రాజ్యం తుడిచిపెట్టుకుపోయి ఢిల్లీ నగరం మరాఠాలకు దాసోహమంది. చివరి దశలో ఒక వెలుగు వెలిగిన రొహిల్లాలను, పఠాన్లను మరాఠాలు కాలరాచివేయటంతో భారతదేశంలో మహమ్మదీయ శకం అంతరించింది. ఆ తరువాత దాదాపు యాభైఏళ్లు దేశంలో అతి ప్రధాన సైనిక శక్తి మరాఠాలదే అయింది.

'పాతికేళ్ల వయసులోనే ఇంతటి ఘన విజయం సాధించి పెద్దల పేరు నిలబెట్టిన మాధవరావు పీష్వాకు మరికాస్త వ్యవధి చిక్కి ఉంటే విశాల వ్యూహంతో యావద్భారతంలో అజేయమైన హిందూ సామ్రాజ్యాన్ని నిర్మించగలిగేవాడే. శివాజీ స్వరాజ్యాన్ని దేశవ్యాప్తం చేసి బహుశా విదేశీదాస్యం బాధను భారతజాతికి తప్పించగలిగే వాడే.

కాని-దురదృష్టం. దేశానికి తన అవసరం చాలా ఎక్కువగా ఉన్న సమయంలోనే మాధవరావు క్షయవాత పడి భగవన్నామ స్మరణ చేస్తూ 1772 నవంబరు 18న ప్రశాంతంగా కన్నుమూశాడు.

గ్రాంట్‌డఫ్ అన్నట్టు పానిపట్టు ఘోరకలి కంటే మాధవరావు అకాల మరణం వల్ల మరాఠాలకు కలిగిన నష్టం ఎక్కువ.

> "The plains of Panipat were not more fatal to the Maratha Empire than the early end of this excellent prince. Although the military talents of Madhoo Rao were very considerable, his character as a sovereign is entitled to far higher praise, and to much greater respect than that of any of his predecessors".
>
> [*History of the Maharattas*, **James Grant Duff**, *Vol. II, p. 163*]



(ఈ గొప్ప ప్రభువు అకాలమృతితో పోల్చితే మరాఠా సామ్రాజ్యానికి పానిపట్టు మైదానాల్లో తగిలిన చావు దెబ్బ ఎక్కువది కాదు. సైనికపరంగా మాధవరావు ప్రతిభాపాటవాలు చాలా చెప్పుకోదగ్గవే అయినా ఒక పరిపాలకుడిగా అతడి గుణగణాలు అతనికి ముందు రాజ్యమేలిన వారందరికంటే ఎక్కువగా గౌరవానికి, ప్రశంసకు పాత్రమైనవి).

# మధ్యాహ్నం హత్య

**ఓ రోజు పీష్వా మాధవరావు యుద్ధ శిబిరంలో కూచుని కమాండర్లతో సైనిక వ్యూహాన్ని చర్చిస్తున్నాడు. తమ్ముడు నారాయణరావు పక్కనే ఉన్నాడు. బయట పెద్ద కలకలం వినిపించింది. మదపుటేనుగు తప్పించుకుని ఇటువైపే దూసుకొస్తున్నదని భటులు అన్నారు. నారాయణరావు దిగ్గున లేచి పారిపోవడానికి ఉద్యుక్తుడయ్యాడు. అన్నగారు అతడి చెయ్యి పట్టుకుని ఆపి 'భయపడకు. ఏనుగు చేతిలో ఇవాళ చచ్చిపోవాలని మన నుదుట రాసిలేకపోతే ఏమీకాదు' అని వారించాడు.**

బయట గోల ఇంకా ఎక్కువైంది. ఎవరెన్ని విధాల అడ్డుకోజూసినా తోసిపారేసి మత్త గజం గుడారం లోపలికి విసురుగా చొరబడింది. సేనానాయకులు మెరుపులా కదిలి కత్తులూ బల్లేలతో ఏనుగును నిలువరించారు. అంతలో మావటి వాడు పరుగున వచ్చి ఏనుగును తీసుకుపోయాడు. గండం గడచింది.

'చూశావా?' అన్నట్టుగా తమ్ముడిని చూశాడు పీష్వా. 'అర్థమైంది' అన్నట్టు తలపంకించాడు పిరికి తమ్ముడు. నిజానికి అన్న నేర్పిన పాఠం వేరు. తమ్ముడు అర్థం చేసుకున్నది వేరు. ఎటువంటి ఆపదనైనా ధైర్యంగా ఎదుర్కోవడానికి అప్రమత్తమై ఉండాలే తప్ప సంక్షోభానికి భయపడాల్సిన పనిలేదు; విధివ్రాత ప్రకారం మృత్యువు ఆసన్నం కానంతవరకూ ఏ శక్తీ మనలను ఏమీ చేయలేదు - అని అన్న ఉద్దేశం. 'ఓహో! ఎంత సంక్షోభం వచ్చినా మనం ఏమీ చేయకుండా బేఫర్వాగా కూచోవాలన్నమాట' అని తమ్ముడు తన తత్వాన్ని బట్టి అర్థం చేసుకున్నాడు.

ఈ అవివేకమే చివరికి అతడి ప్రాణాన్ని తీసింది. మహారాష్ట్రులకు, తద్వారా మిగతా దేశానికి తీరని హాని చేసింది.

27 ఏళ్ల వయసులోనే అన్న కన్ను మూసినందు వల్ల, ఉత్తరాధికారి కావడానికి ఆయనకి పుత్రసంతానం లేనందువల్ల నారాయణరావు ఆపద్ధర్మంగా పీష్వా కావలసి వచ్చింది. అప్పటికి అతడికి 17 ఏళ్లు. అంతకంటే సంవత్సరం తక్కువ వయసులోనే, అంతకంటే తీవ్రమైన సంక్షోభ పరిస్థితుల్లోనే మాధవరావు గద్దెనెక్కి అద్భుత ప్రతిభాపాటవాలను చూపాడు. ఆ సమయానికి మరాఠాలకు పెద్దదిక్కులనుకున్న మహామహులందరూ పానిపట్టులో నేలకొరిగారు. సైనికంగా, పాలనాపరంగా ఎటుచూసినా శూన్యమే ఆవరించింది. అటువంటి సంకటం నారాయణరావుకు లేదు. మాధవరావు తన పదకొండేళ్ల హయాంలో కష్టపడి ప్రతిభావంతులను వెదికి పట్టుకుని, తర్ఫీదునిచ్చి, పరిపాలనకు సంబంధించిన అన్ని విభాగాల్లోనూ బాధ్యతలు మోయడానికి సమర్థమైన నాయకశ్రేణిని తయారుచేసి పెట్టాడు. రాజ్యాన్ని కంటికి రెప్పలా కాపాడటానికి రామ్‌శాస్త్రి, నానాఫడ్నవిస్, నారో అప్పాజీ, గోవింద్ తాత్యా, త్రయంబక రావు పీఠే, గోపాలరావు పట్వర్థన్ వంటి ఎందరో దిగ్గంతులు బారులుతీరి ఉన్నారు. అనేక యుద్ధాల్లో నేలకరిచి శత్రురాజులందరూ మరాఠాల పేరు చెబితే హడలిపోతున్నారు. ఇలాంటి అనుకూల పరిస్థితుల్లో కొత్త పీష్వా కుర్రవాడైనా... పరాక్రమం, పాలనా సామర్థ్యం లేని వాడైనా తగు మాత్రం తెలివి తేటలు కనుక ఉంటే రాజ్యం ఏ ఇబ్బందీ లేకుండా సాఫీగా నడిచిపోయేది.

నారాయణరావుకు తెలివి కూడా లేదు. అతణ్ని తీర్చిదిద్దాలని ఎంత ప్రయత్నించినా ప్రయోజనం లేకపోవటంతో విసిగి వేసారి 'వీడి మొహాన రాజ్యం చేసే యోగం రాసిపెట్టలేదు' అని మాధవరావే ఓసారి చిరాకుపడ్డాడు. అతడన్నదే నిజమైంది.

బయటి శత్రువులందరినీ మాధవరావు పాదాక్రాంతం చేసుకోగలిగినా, నూరు శత్రువుల పెట్టు అయిన లోపలి శత్రువు రఘునాథరావు బుసలు కొడుతూనే ఉన్నాడు. నయాన భయాన ఎన్ని విధాల నచ్చచెప్పినా... ప్రాధేయపడ్డా, ఖైదులో వేసినా... అతడి వంకరబుద్ధి మారలేదు. ఎంతటి నీచానికైనా ఒడిగట్టగలడని అర్థమయ్యాకయినా పినతండ్రి అనే మొగమాటం పక్కనపెట్టి రాజ్యక్షేమం కోసం మాధవరావు కరుకుగా వ్యవహరించి ఉండవలసింది. తన సామర్థ్యం మీద నమ్మకంతో దీర్ఘకాలం ఉపేక్షించినప్పటికీ... తాను ఇంకా ఎక్కువకాలం బతకబోనని తెలిసిన తరువాతైనా అతడు ముందు చూపుతో గుండెరాయి చేసుకుని, ఆ కాలంలో రాజులు, సుల్తాన్లు అనుసరించిన 'పద్ధతి'లో రఘునాథరావును అడ్డు తొలగించి ఉంటే చరిత్రగతి మరొకలా ఉండేది.

హిందువుల్లో ఎందరో పిచ్చిమారాజుల్లాగే మాధవరావు అతి మంచితనం చూపి, దుష్టాంగాన్ని సకాలంలో శిక్షించకుండా వదిలేసినా అతడి తల్లి గోపికాబాయి వెర్రిమాలోకం కాదు. తన మరిది తత్వం, అతడిని నడిపించే దుష్టశక్తి అయిన తోడికోడలు ఆనందిబాయి నైజం ఆమెకు బాగా తెలుసు. నారాయణరావుకి అండగా ఉంటానని చేతిలో చెయ్యివేయించుకుని, రఘునాథరావును నమ్మి చెరసాలనుంచి మాధవరావు విడుదల చేసి పోయినా, ఆ తరవాత కొన్ని నెలల్లు కొత్త పీష్వా పట్ల రఘునాథరావు వల్లమాలిన అభిమానం ఒలకబోస్తున్నా - అతడు వీలుదొరికితే వేటు వేయక మానడని గోపికాబాయి పోల్చు కోగలిగింది. అందుకే విడిచిపెట్టిన ఐదునెలల కల్లా మళ్లీ పట్టుబట్టి మరిదిని నిర్బంధింప చేసింది.

పుణెలోని శనివార్ పాలెస్‌లో పీష్వా మందిరం పక్క గదిలో గట్టి కాపలా మధ్య రఘునాథరావును ఉంచారు. కొద్ది రోజులకే ఆనందీబాయి కుట్రచేసి, పీష్వాలేని సమయంలో రఘునాథరావును చెరనుంచి తప్పించింది. పారిపోతుంటే సైనికులు వెంటబడి పట్టుకుని అతడిని మళ్లీ ఖైదులో వేశారు. ఆ తరవాత కాపలా ఇంకా కట్టుదిట్టం చేశారు. అయినా

రఘోబా దుర్బుద్ధి మారలేదు. పీష్వాను హతమార్చి తాను గద్దెనెక్కడానికి ఈసారి భయంకరమైన కుట్ర పన్నాడు. దిక్కుమాలిన రాజ్యకాంక్షతో పోయిపోయి జాతి శత్రువులైన ఆంగ్లేయులతో కుమ్మక్కయ్యాడు. మాధవరావు పీష్వా కాలంలో నుంచే రఘోభా ఇంగ్లీషువారిని మచ్చిక చేసుకోవడానికి లోపాయకారీ ప్రయత్నాలు చాలా చేశాడు. అవసరమైనప్పుడు తనకు అక్కరకొస్తారన్న ఆశతో పడరాని లాలూచీలు పడ్డాడు. ఆవలిస్తే పేగులు లెక్కపెట్టగల మాధవరావు ఉన్నంతకాలమూ ఎవరి ఆటలూ సాగలేదు. విభజించి పాలించే బ్రిటిష్ రాజనీతిలో భాగంగా దక్షిణాదిన హైదరాలీ, నిజాం, పీష్వాలు తెల్లవారికి వ్యతిరేకంగా ఏకం కాకుండా అడ్డుకుని... భారతదేశాన్ని కబళించే బృహత్ వ్యూహంతో తాము సాగిస్తున్న యుద్ధాల్లో నిజాం, హైదర్లకు మరాఠాల నుంచి సాయం అందకుండా చేయటానికి ఆంగ్లేయులు నియోగించిన మోస్టిన్ దొర పూనాలో ఎడమకాలు మోపడంతోటే మరాఠాలకు చేటుకాలం మొదలైంది. దేశాన్ని మింగే అసలు కుట్రను అర్థం చేసుకోకుండా రఘునాథరావు అధికార దాహంతో అతడికి చేరువయ్యాడు. నానాఫడ్నవిస్ లాంటి సమర్థుల మంత్రాంగంలో నడుస్తున్న నారాయణరావును రంగం నుంచి తొలగించి తమ కీలుబొమ్మ రఘోబాను పీష్వా చేయడం ఆంగ్లేయుల పాపిష్టి వ్యూహానికీ అవసరమైంది.

ఇంకేం? ఇంగ్లీషు బాణీలో భయంకరమైన కుట్రకు తెర లేచింది. కొంతమంది మరాఠా సర్దార్లను రెచ్చగొట్టి కొందరు రాజద్రోహులను కూడగట్టి, ఆనందిబాయిని, ఆమె భర్తను పావుల్లా వాడుకుని మోస్టిన్ తెర వెనుక నుంచి కథ నడిపిన నాటకంలో పైకి కనిపించిన విలన్లు 'గర్దీ'లనే సాయుధ దళనాయకులు.

తెల్లవారి పాత్రనైతే అప్పట్లో ఎవరూ పోల్చుకోలేదు గాని రఘోభాకు వత్తాసుగా పెద్ద కుట్ర ఏదో జరగబోతున్నదని కర్ణాకర్ణిగా బయటికి పొక్కింది. పీష్వాకూ చెవిన పడింది. విషయం తెలిశాకయినా ముప్పు తప్పించుకోవడానికి అతడు గట్టి ప్రయత్నం చేయలేదు. తనకు అందిన సమాచారం దివానుకు 'పాసాన్'చేసి నారాయణరావు ఊరుకున్నాడు. ఆ దివాను ఇతడికంటే ఘనుడు. వెంటనే అప్రమత్తమై ఆనుపానులు ఆరాతీసి కుట్రను వమ్ముచేయవలసింది పోయి అంతా వట్టి పుకారేనని కొట్టిపారేశాడు. రాజ్యానికి, పీష్వాకు వచ్చిన ప్రమాదం ఏమీలేదని భ్రమసి, రాజప్రాసాదం వదిలి స్నేహితుడి ఇంటికి విందారగించబోయాడు.

ఆ రోజు 1773 ఆగస్టు 30. ఎవరూ ఊహించని రీతిలో ఆ మధ్యాహ్నం మహా ఘోరం జరిగిపోయింది. నారాయణ రావు పీష్వా అయి అప్పటికి పదో నెల.

పీష్వాను పట్టుకుంటే తొమ్మిది లక్షల రూపాయలిస్తానని రఘునాథరావు చెరసాలనుంచి గర్దీల దళనాయకుడికి అప్పటికే హామీ పత్రం పంపాడు. అందులో ఒక అక్షరాన్ని మార్చి 'పట్టుకుంటే' ('ధరవే') అన్న పదాన్ని 'మట్టుబెడితే' ('మరవే')గా ఆనందిబాయి అప్పటికే మార్చేసింది. ఏమైతేనేం? కోరిన హామీపత్రం మధ్యాహ్నానికి చేతికందింది. గర్దీల దళ నాయకుడు మెరుపులా కదిలాడు. మధ్యాహ్నం 2 గంటలకు రెండు వేల మంది సాయుధులతో అతడు శనివార్ పాలెస్ ఉత్తర ద్వారాన్ని ముట్టడించాడు. అతడి తోడుదొంగల చేతిలోని రక్షక దళం కూడా వారితో కలిసింది. ఎదురువచ్చిన వారినల్లా నరికేస్తూ అంతఃపురంలోకి కుట్రదారులు చొచ్చుకుపోయారు. స్వామిభక్తిగల సైనికులు ఎంతగా అడ్డుకున్నా ప్రయోజనం లేకపోయింది.



బయట ఇంత గొడవ జరుగుతూ మృత్యువు తరుముకు వస్తుంటే పీష్వా నారాయణరావు ఏమి చేస్తున్నాడు? అంతా బాగానే ఉందన్న భ్రమలో సుష్టుగా భోంచేసి హాయిగా కలలుగంటూ నిద్రపోతున్నాడు. జీతాల బకాయిలు చెల్లించలేదన్న మిషతో పెద్దగా అరుస్తూ కనిపించిన వారినల్లా నరికేస్తూ ద్రోహుల మూక శయనమందిరంలో చొరబడ్డాకగాని అతడు మేలుకోలేదు. అప్పటికే సమయం మించిపోయింది. పీష్వా దిగ్గున లేచి ప్రాణభయంతో పరుగెత్తి పక్కగదిలోని రఘునాథరావు కాళ్లమీద పడ్డాడు. 'చిన్నాన్నా, రక్షించు. నా ప్రాణం కాపాడు' అని గుండెలవిసేలా ఏడ్చాడు. పినతండ్రి కనికరించలేదు. ఈలోపు కుట్రదారులు వచ్చి, రఘునాథరావు చేతుల్లోని పీష్వాను లాగేశారు. పీష్వా సేవకులిద్దరు అతడిని రక్షించేందుకు అడ్డుపడ్డా లాభం లేకపోయింది. వారినీ, పీష్వానూ ద్రోహులు నరికి వేశారు. తరువాత రాజభవనం మీదపడి గది గదినీ గాలించి విలువైన నగానట్రా యావత్తూ దోచుకున్నాకగానీ, వారు తిరిగివచ్చి రఘునాథరావు ముందు 'మీరే ఇక పీష్వా' అని మోకరిల్లలేదు!

అంతా ఆకస్మికంగా కొద్దిగంటల్లో జరిగిపోయింది. ఊహించని ఉపద్రవానికి అందరూ నిర్ఘాంతపోయారు. తెప్పరిల్లాక జరిగిందేమిటో అర్థమైంది. రఘునాథరావు ప్రముఖులందరినీ పిలిపించి, పీష్వా హత్యలో తన ప్రమేయమేమీ లేదని ఒట్లు సత్యాలు పెట్టి నమ్మించజూశాడు. ఎవరూ మోసపోలేదు. మరణించిన నారాయణరావు సమర్థుడు, పెద్దగా తెలివిగలవాడు కాకపోయినా చెడ్డవాడు కాదు. వ్యక్తిగతంగా అతడంటే అందరికీ ఇష్టమే. అలాంటి సౌమ్యుడిని అంత క్రూరంగా హతమార్చటం రాజ్యంలో ప్రతి ఒక్కరికీ ఒళ్లు మండించింది. మరణించిన పీష్వాకు కొడుకుల్లేనందువల్ల ఆనవాయితీ ప్రకారం పినతండ్రి గద్దెనెక్కడానికి అభ్యంతరం చెప్పలేకపోయినా ద్రోహులకు తగిన శాస్తి చేసితీరాలన్న కృతనిశ్చయం మరాఠీ ముఖ్యులకు కలిగింది. నారాయణరావు మరణించిన పదో రోజు తిలోదకాలు వదిలే సందర్భంలో నానాఫడ్నవిస్, త్రయంబకరావు పేఠే, హరిబల్లాల్ ఫడ్కే వంటి విధేయులు పన్నెండు మంది కలిసి రఘునాథరావుపై ప్రతీకారం తీర్చుకుని తీరతామని శపథం చేశారు. అన్నదమ్ములవంటి ఆ పన్నెండుగురి కూటమే చరిత్రలో "బారాభాయి"గా ప్రసిద్ధికెక్కింది.

ఈ కూటమే రాజ్యాన్ని వినాశనం పాలవకుండా దాదాపు ముప్ఫయ్యేళ్లు కాపాడింది.

సింహాసనం ఖాళీగా ఉండకూడదు కనుక రఘునాథరావు ఆనువంశిక అధికారాన్ని గౌరవించి పీష్వా కానిచ్చినా... తమందరికీ అతడు మంచి పదవులనే ఇచ్చినా 'బారాభాయీ'లు రఘోబా వలలో పడలేదు. అయితే సరైన వారసుడు దొరికితే తప్ప ద్రోహిని దించే అవకాశం లేదు. మరి ఎలాగా అని ఆలోచిస్తూ సమయం కోసం కాచుకుని ఉన్న సమయంలో ఒక శుభవార్త వారి చెవిన పడింది.

మరణించిన పీష్వా భార్యగంగాబాయి గర్భవతి!

హత్యకు కొద్ది రోజుల ముందు నారాయణరావే తన ఇల్లాలికి నెలతప్పిన వైనం సన్నిహితుల దగ్గర అన్నాడు. అది ఇప్పుడు ధ్రువపడింది.

భర్త మరణించగానే గంగాబాయి సహగమనానికి సిద్ధపడింది. అయితే 'సతి' శాపం ఎంత ప్రచండమో తెలుసు కనుక ఆనందిబాయి దానిని పడనివ్వలేదు. అప్పట్లో గంగాబాయి గర్భం సంగతి ఆమెకు తెలియదు. తెలిస్తే శాపాన్ని కూడా లెక్క చేయక బహుశా పిండ దశలోనే వారసుడిని చితిమీదికి ఎక్కించేదేమో. తరువాత కొన్నాళ్లకు గర్భం అనుమానం తోచాక మందులూ మాకులూ బలవంతంగా తినిపించి గర్భస్రావం చేయించాలని చూసింది.

కాని - లోపల ఉన్నది గట్టిపిండం.

ఆనందిబాయి దగ్గరే ఉంటే ఏదో ఒకటి చేసి, గంగాబాయిని చంపి అయినా వారసుడిని నిర్మూలించేదే. కానీ-పీష్వా అయిన వెంటనే రఘునాథరావు మోస్టిన్ ప్రోద్బలంతో యుద్ధానికి తరలవలసి వచ్చింది. మరాఠా రాజ్యంలో కల్లోలాన్ని ఆసరా చేసుకుని హైదరాలీ తనకుమారుడు టిప్పును పెద్ద సైన్యంతో దండెత్తించి గతంలో మాధవరావుకు తాను దఖలుపరచిన కర్ణాటక పరగణాలన్నిటినీ తిరిగి స్వాధీనపరచుకున్నాడు. ఇంకో వంక నిజాం అలీ కుతంత్రం పన్ని బేరార్‌ను వశపరచుకున్నాడు. దీంతో పీష్వా అయిన రెణ్నెల్లకే రఘునాథరావు కదనరంగానికి కదిలాడు. భ్రూణహత్య జయప్రదంగా చేశానన్న భ్రమతో ఆనందిబాయి కూడా ఆనందంగా అతడి వెంట వెళ్ళింది. అసలు కబురు తెలిశాక త్రుళ్ళిపడి, గంగాబాయిని చంపెయ్యమని కొందరు నమ్మకస్థులను పురమాయించి పంపింది. అదృష్టవశాతూ ఆ ముఠా నానాఫడ్నవిస్‌కు పట్టుబడింది. కుట్ర బయటపడింది.

'బారాభాయి'లు ఇక తాత్సారం తగదనుకున్నారు. బొంబాయి కుంపిణీ ప్రభుత్వం చేతిలో పనిముట్టుగా ఉపయోగపడుతున్న రఘునాథరావును పీష్వాగా కొనసాగనిస్తే మరాఠా సామ్రాజ్యానికి సర్వనాశనం తప్పదని వారికి అవగతమైంది. గంగాబాయిని సురక్షితమైన పురందర్ కోటకు వెంటనే తరలించారు. పుత్రోదయానికి సాక్షిగా ఉండటం కోసం ఆనందిబాయి కుమార్తెను కూడా వెంట పంపారు. మరణించిన పీష్వా భార్యకూ, ఆమె ప్రసవించబోయే కుమారుడికీ ప్రతినిధులుగా రాజ్యం చేయడానికి తమ అధ్వర్యంలో 'రిజెన్సీ'ని వారు ఏర్పరిచారు. రఘునాథరావును తోసిపారేసి ప్రభుత్వమంతా తామే నడపసాగారు. యుద్ధంలో బ్రిటిష్ వారికి పరమానందం అయ్యేలా తొలుత నిజాంను, ఆనక హైదరాలీని గెలిచి, ఆక్రమిత ప్రాంతాలను స్వాధీనపరచుకుని కప్పం కట్టించుకోగలిగినా రఘునాథరావుకు ఆ సంతోషం ఎన్నో రోజులు నిలవలేదు. మొదటికే మోసం వచ్చి పుణెలో తనకు దేవిడీమన్నా అయిన సంగతి తెలియగానే కంగారుపడి... రఘునాథరావు హుటాహుటిన వెనక్కి మరలాడు. కాని ప్రజల్లో తన మీద ఉన్న వ్యతిరేకతను, మరాఠా పాలక వర్గంలో తన మాట చెల్లని పరిస్థితిని గమనించాక పుణెలో అడుగు పెట్టేందుకు ధైర్యం చాలక తోకముడిచి గుజరాత్‌కు పారిపోయాడు. యుద్ధోత్సాహం కాస్తా నిరుత్సాహంగా నీరుగారి, ఏమీ చేయలేని నిస్సహాయతలో పళ్లు పటపట కొరుకుతుండగానే రఘునాథరావుకు 'దారుణమైన దుర్వార్త' తెలిసింది.

పురందర్‌లో గంగాబాయికి సుఖప్రసవమై 1774 ఏప్రిల్ 14న వంశోద్ధారకుడు జన్మించాడు.

ఆ శిశువే సవాయ్ మాధవరావు.

అసలు వారసుడు పుట్టాడంటే మహారాష్ట్రలో తన మొహం చూసేవారు ఉండరని రఘునాథరావుకు తెలుసు. తన అధికారం ఏకాస్తయినా నిలవాలంటే వారసుడెవరూ పుట్టనే లేదని వాదించటం అతడికి అవసరమైంది.

పుట్టినవాడు నారాయణరావు కొడుకే కాదని అతడు ఎత్తుకున్న వాదనకు బొంబాయి కుంపిణీ ప్రభువులు తందానతాన అన్నారు. వారి అవసరాలు వారివి. బొంబాయిలో తమ ప్రభుత్వాన్ని పదిలపర్చుకోవటం కోసం మరాఠాలకు చెందిన బాస్సెన్, సాల్సెటి దుర్గాలను వశపరచుకోవాలని వారు ఎప్పటినుంచో కన్ను వేశారు. కొన్నేళ్ళుగా ఎన్నివిధాల



ప్రయత్నిస్తున్నా వాటిని కొట్టేయడం వారివల్ల కావటం లేదు. నానాఫడ్నవిస్ అధికారస్థానంలో ఉన్నంతకాలమూ దాన్ని పడనివ్వడని వారికి తెలుసు. ప్రజాబలంగల ప్రభుత్వాన్ని కూల్చి తమ చెప్పుచేతుల్లో ఉండే కీలుబొమ్మను పీష్వాగా కూర్చోబెడితేగానీ వారి పన్నాగాలు పారవు. అందుకే రఘోబా కొమ్ముగాశారు. తన అక్రమ అధికారానికి అడుగు ఊడిన స్థితిలో రఘోబా కంటికి ఆంగ్లేయులే ఆపద్బాంధవులుగా తోచారు. వారు కనుసైగ చేయగానే పరుగుపరుగున బొంబాయి వెళ్ళి తనకు సైనికసాయం చేసి పీష్వాగా తన అధికారాన్ని నిలబెడితే బాస్సెన్, సాల్సెటిలను, సూరత్ ప్రాంతాలను పళ్లెంలో పెట్టి ఆంగ్లేయులకు సమర్పించుకుంటానని ఒడంబడి 1775 మార్చి 6న ఆంగ్లేయులతో మాయదారి సంధి కుదుర్చుకున్నాడు.

అదే మొదటి మరాఠా యుద్ధానికి నాంది.

# మరాఠా శని

*తేనె లొలికే పూల బాలలకు మూన్నాళ్ల*
*ఆయువిచ్చిన వాడినేమి కోరేది?*
*బండరాళ్లను చిరాయువుగ జీవించమని*
*ఆనతిచ్చిన వాడినేమి అడిగేది?*

*– అని సిరివెన్నెల సీతారామశాస్త్రి తనకి ఇంటి పేరునిచ్చిన సినిమాలో తిక్క శంకరుడిని నిష్ఠూరమాడతాడు. మహారాష్ట్రులు కనుక ఇది వింటే మా బాగా అన్నాడంటారు. ఎందుకంటే వారి చరిత్రలో ఈ విషయం చాల కరెక్టు!*

పరాక్రమానికి పర్యాయపదమైన మహావీరుడు బాజీరావు... సమర్థుడు, కార్యదక్షుడని పేరు తెచ్చుకున్న అతడి కుమారుడు బాలాజీరావు – నలభై నిండకుండానే మృత్యువాతపడ్డారు. తండ్రి, తాతల పేరున నిలబెట్టి పీష్వాలందరిలోకీ గొప్పవాడనిపించుకున్న మాధవరావయితే... చితికిన జాతికి పునర్వైభవం తెచ్చే పని పూర్తికాకుండా 27 ఏళ్ల పిన్న వయసులోనే పెద్దల్లో కలిశాడు. అయోగ్యుడు, అధముడు అయిన రఘునాథరావు మాత్రం తన వంశంలో ప్రసిద్ధులందరి కంటే ఎక్కువకాలం జీవించి... ఛత్రపతి శివాజీ నుంచి తన తాత, తండ్రుల వరకూ అనేక తరాల్లో అష్టకష్టాలు పడి మహారాష్ట్రులు నిర్మించుకున్న మహా సామ్రాజ్యాన్ని సర్వనాశనం చేశాడు. హిందూ ధర్మ పునరుత్థానంకోసం, భారతదేశ పునఃప్రాభవంకోసం తన జాతి జనుల నిరంతర తపనను నీరుగార్చి, జాతి వ్యతిరేకులైన విదేశీ వర్తకులతోకుమ్మక్కయి, తన నీచ స్వార్థం కోసం ప్రజాక్షేమాన్ని బలిపెట్టాడు. శివాజీ దివ్య స్ఫూరితో మొదటి బాజీరావు ప్రతాపంతో నింగికెగిసిన మరాఠా సామ్రాజ్య ప్రభ రఘునాథరావు పుణ్యమా అని, అతడి కుమారుడైన రెండో బాజీరావు అసమర్థ నాయకత్వంలో పరిపూర్ణంగా నేలమట్టమైంది.

18వ శతాబ్దంలో మూడొంతులు గడిచే నాటికి భారతదేశంలో మరాఠా మహా సామ్రాజ్యానికి ఎదురు నిలవగలిగిన శక్తి ఏదీ లేదు. దాని ఆధిక్యాన్ని సవాలు చేయాలని తలలు ఎగరేసిన వారందరూ దాదాపుగా మట్టి కరిచారు. సింధు నదికి ఆవలి నుంచి,



ఆవలి నుంచి మోరసాచిన పఠాన్లు, పర్షియన్లు, మొగలులు, తురుష్కులు వగైరా నానా గోత్రాల ముసల్మాన్లు మళ్లీ లేవనంతగా చావుదెబ్బ తిన్నారు. ఓడల మీద వ్యాపారం మిషతో వచ్చిన విదేశీయుల సంగతికొస్తే... ఒకప్పుడు ఆసియాలో దాదాపు సగభాగాన్ని తమ పలుకుబడిలోకి తెచ్చుకోగలిగిన పోర్చుగీసువారు కొంకణ్‌లో మరాఠాలు కొట్టిన దెబ్బకు దిమ్మతిరిగి కూలబడ్డారు. ముఖాముఖి ఎదిరించకపోయినా మహారాష్ట్రులను లోపాయికారీగా గుప్పిట్లోకి తెచ్చుకోవాలని చూసిన ఫ్రెంచి వారు... మరాఠాల ముందు తమ పప్పులు ఉడకని కారణంగానైతే నేమి... ఐరోపాలో ఆంగ్లేయులతో ఎడతెగని యుద్ధాలవల్లనైతేనేమి భారత ఆక్రమణ మీద ఆశలు వదులుకున్నారు. ఇక విదేశీయులందరిలోకీ ప్రమాదకారులైన ఇంగ్లీషువారు గుంట నక్కల్లా వ్యవహరించి, నీచపు ఎత్తుగడలతో దొంగదెబ్బలు తీసి, చాపకింద నీరులా వ్యాపించి తూర్పు తీరంలో బెంగాల్‌ను, దక్షిణ తీరంలో మద్రాసును కొంచెం కొంచెంగా కబళించగలిగినా ప్రధాన భూభాగంలో సగర్వంగా నిలిచిన మరాఠా శక్తిని తేరిపార చూసేందుకు సాహసించలేకపోయారు.

తెల్లవారు నేరుగా తమ జోలికి రాకపోయినా వారి వల్ల దేశానికి మునుముందు వాటిల్లే ముప్పును మరాఠాలు ఊహించలేకపోలేదు. వంగ దేశాన్ని మోసంతో కైవసం చేసుకున్న ఆంగ్లేయులకు తగిన శాస్తి చేయాలన్న ఉద్దేశంతోటే 1760-61 తలపెట్టిన ఉత్తరాది జైత్రయాత్రలో సదాశివరావు భావు బెంగాల్ మీద ప్రత్యేక దృష్టి పెట్టాడు. విదేశీయుల బారి నుంచి బెంగాల్‌ను విముక్తి చేసేందుకు 1760లో దత్తాజీ షిండే నేతృత్వంలో ఒక మరాఠా సేన బయలుదేరింది. అంతలో అఫ్ఘనిస్తాన్ నుంచి అహ్మద్‌షా అబ్దాలీ దండయాత్ర చేయడంతో బెంగాల్ సంగతి పక్కన పెట్టి ప్రధాన శత్రువుపైకి సర్వశక్తులూ సమీకరించవలసి వచ్చింది. తరువాత పానిపట్టు. ఆ వెనుకే బాలాజీపీష్వా అకాల మరణం. దాని వెంబడి రాజకీయ అనిశ్చితి; అంతఃకలహాలు. ఇలా మరాఠాలను కష్టాలు వరసగా చుట్టుముట్టడం ఆంగ్లేయులకు వరమైంది. ఈ సావకాశాన్ని వినియోగించుకుని బెంగాల్, మదరాసులపై పట్టు చిక్కించుకుని... మరాఠాలను ఏదో విధంగా దెబ్బతీసి, భారత సామ్రాజ్యాన్ని మొత్తంగా కబళించేందుకు దారులు వెదుకుతూ వారు కాచుకుని ఉన్నారు.

పానిపట్టు ఘోర పరాజయాన్ని సైతం తట్టుకుని, మరాఠా పోరాటశక్తి సమైక్యంగా నిలబడినంత కాలమూ తెల్లవారికి సందు చిక్కలేదు. తూర్పు, దక్షిణ తీరాల్లో తాము కాలుబెట్టిన కలకత్తా, చెన్నపట్నాల వంటి చోట్ల మాయోపాయాలు పన్ని క్రమేణా విశాల రాష్ట్రాలను తమ పెత్తనం కిందికి తెచ్చుకోగలిగినా, పశ్చిమతీరంలో బొంబాయి వద్ద ఆంగ్లేయుల ఉనికి శివాజీ కాలంలో ఎక్కడ ఉన్నదో మాధవరావు కాలానికీ అక్కడే నిలిచింది తప్ప అంగుళం విస్తరించలేదు. ఆ కాలంలో సైనిక పరంగా గాని, శాస్త్ర, సాంకేతిక పరంగా గాని భారతీయుల మీద ఆంగ్లేయులకు గొప్ప ఆధిక్యం ఏమీ లేదు. వేల మైళ్ల దూరంనుంచి వచ్చిన విదేశీయులకు పరాయిగడ్డన సమరానికి సహజంగానే ఎన్నో సమస్యలు ఉంటాయి. భారతదేశంలో నాడు బలీయ సైనిక శక్తిగా నిలిచిన మరాఠా శ్రేణుల్లో చిచ్చుపెట్టి పోరాట పటిమను కుంగదీస్తే గానీ తమ ఆటలు సాగవని 'కుంపిణీ' గోమాయువులకు తెలుసు. తాము ఆరితేరిన 'విభజించి పాలించే' రాజనీతిలో భాగంగానే మరాఠాల్లో ముసలం పుట్టించటానికి (జేమ్స్ గ్రాంట్ డఫ్ మాటల్లో... for the purpose of using every endeavour, by fomenting domestic dissensions or otherwise) గుంటనక్క మోస్టిన్‌ను 1772లో మాధవరావు

దర్బారుకు పంపారు. మరుసటి సంవత్సరమే మాధవరావు పీష్వా దేశ దురదృష్టం కొద్దీ కన్నుమూశాడు. అనంతరం గద్దెనెక్కిన నారాయణరావు కుట్రకు బలై తమ సైనాతీ రఘునాథరావు పీష్వా కావడంతో ఆంగ్లేయుల రొట్టెవిరిగి నేతిలో పడ్డట్టయింది. బ్రిటిష్ చరిత్రకారుడు **జేమ్స్ మిల్** వివరించినట్టు.

"The assasination of Narain Rao, and the succession of Ragoba, announcing a weak and distracted government, appeared to the Council to present a favourable opportunity for accomplishing an object which their honourable masters had so much at heart, the possession of Salsette and Bassein. In their Select consultations, on the 17th of September, 1773, they agreed to instruct Mr. Mostyn, their Resident at Poonah, to improve diligently every circumstance favourable to the accomplishment of that event, and on no account whatever to leave Mahratta Capital".

*[History of India,* **James Mill,** *Vol. III, P. 425]*

*(నారాయణరావు వధ అనంతరం రఘోభా అధికారం అందుకున్నాక ప్రభుత్వం బలహీన పడటం బొంబాయి కౌన్సిల్ వారికి అనుకూలమైన అవకాశంగా కనిపించింది. సాల్సెటి, బాస్సెన్‌లను ఎలాగైనా స్వాధీన పరచుకోవాలన్న తమ యజమానుల చిరకాల వాంఛ నెరవేరేందుకు సమయం ఆసన్నమైందని వారికి తోచింది. ఆ కార్యం సాధించటానికి అనుకూలమైన ప్రతి పరిస్థితిని తెలివిగా వాడుకోవాలనీ, ఎట్టి పరిస్థితుల్లోనూ మరాఠా రాజధానిని వదిలి వెళ్లవద్దనీ మోస్టిన్‌ను ఆదేశించాలని 1773 సెప్టెంబర్ 17న సెలక్టు కమిటీ నిర్ణయించింది).*

ఇదిగో ఈ తంత్రంలో మోస్టిన్ నిమగ్నుడై ఉన్నప్పుడే నడమంత్రపు పీష్వా రఘోబాకు రాజ్యంలో అందరూ ఎదురు తిరగడమూ, రాజధానికి వెళ్లేందుకు ధైర్యం చాలక యుద్ధభూమి నుంచి గుజరాత్‌కు పలాయనమై అక్కడి నుంచి ఆంగ్లేయులను ఆశ్రయించడమూ జరిగింది. తాము కోరిన ప్రకారం సాల్సెటి, బాస్సెన్‌లను పళ్లెంలో అప్పగించటానికి రఘోబా ఒడంబడటంతో అతడి కొమ్ముగాసి, తమ కీలుబొమ్మగా పూనాలో నిలబెట్టడానికి బొంబాయి కౌన్సిల్ చెంగున కదిలింది. రఘోబాకు సాయంగా వెళ్లి అతణ్ని పీష్వాగా ప్రతిష్ఠించి రమ్మని సైన్యాన్ని పురమాయించి పంపింది.

విదేశీ సేనను వెంటబెట్టుకుని రఘునాథరావు పుణె చేరేలోపే అతణ్ని పట్టుకోవటానికి పుణె ప్రభుత్వం పంపిన సేన తరుముకు వచ్చి అతడినీ, అండగా వచ్చిన ఇంగ్లీషు బలగాన్నీ గుజరాత్‌లోనే చిత్తుగా ఓడించింది. తక్షణం వెనక్కి రావలసిందిగా అంతర్గత రాజకీయ కారణాలవల్ల, పుణె నుంచి పిలుపు రావడంవల్ల... దానికి తోడు వానాకాలం దగ్గర పడినందుచేత శత్రువులను నిశ్శేషంగా నిర్మూలించకుండానే మరాఠా సైన్యం వెనక్కి మరలింది.

అదే సమయంలో మరాఠా రాష్ట్రకూటమిలోఒక ముఖ్య భాగస్వామి అయిన బరోడా గేక్వాడ్ రాజ్యంలో అంతర్యుద్ధం సాగుతున్నది. తండ్రి మరణానంతరం అధికార వారసత్వం కోసం నలుగురు అన్నదమ్ములు కొట్లాడుకుంటుండగా ఇంగ్లీషువాళ్లు ఆ తగవులో తలదూర్చి,



ఫతేసింగ్ అనే సోదరుడితో కుమ్మక్కయి అతడి పనుపున వెర్రివాడైన సాయాజీని గుజరాత్ గద్దెపై కూచోబెట్టి... ఇక నుంచీ కష్ట సుఖాల్లో తెల్లవారితోనే కలిసి ఉంటానని ఒప్పందం చేయించారు. దాంతో అభేద్యమనుకున్న మరాఠా కూటమిలో ఒక స్తంభం కూలింది.

ఘనకార్యం సాధించామన్న ఆనందంలో బొంబాయి కుంపినీ వారు కేరింతలు కొడుతుండగానే అనుకోని పరిణామాలు చకచకా సంభవించాయి. ఈస్టిండియా కంపెనీ రూపు రేకలను మారుస్తూ బ్రిటిష్ పార్లమెంటు 1773లో చేసిన చట్టం అమలులోకి వచ్చింది. దాని ప్రకారం బెంగాల్ ప్రెసిడెన్సీ గవర్నరు గిరీ గవర్నర్ జనరల్ స్థాయికి పెరిగింది. మద్రాసు, బొంబాయి ప్రెసిడెన్సీల గవర్నర్లు అతడి పెత్తనం కిందికి వచ్చారు. మొదటి గవర్నర్ జనరల్‌గా వారన్ హేస్టింగ్స్ నియమితుడయ్యాడు. పరిపాలనలో అతడికి సాయపడేందుకు సుప్రీం కౌన్సిల్ ఏర్పాటైంది. దానిలో నలుగురు సభ్యులు. వారిలో సర్ ఫిలిప్ ఒకడు. అతడు సజ్జనుడు. అక్రమాలను, అఘాయిత్యాలను సహించడు. వాటికి పాల్పడే వారి అంతు తేల్చకుండా వదలడు. భారత సామ్రాజ్యాన్ని అధర్మంగా చేజిక్కించుకునేందుకు వారన్ హేస్టింగ్స్ చేసిన తప్పుడు పనులను ఎండగట్టి, పెద్ద గొడవ చేసి, పట్టుబట్టి అభిశంసన బోనులో నిలబెట్టిన పుణ్యం ఆయనదే.

1774 చివరిలో సీమ నుంచి వచ్చి కొత్త బాధ్యత చేపట్టిన ఫ్రాన్సిస్ భారతదేశంలో తెల్లవారి దుర్మార్గాలను ఆకళింపు చేసుకున్నాడు. ముఖ్యంగా మరాఠాల ఆంతరంగిక వ్యవహారాల్లో బొంబాయి దొరలు తగని జోక్యం చేసుకుని, కాసుకు కొరగాని రఘునాథరావు కొమ్ముగాసి, విశాల జనబాహుళ్యపు అభిమతాన్ని కాలరాయ జూస్తున్న తీరును, గేక్వాడ్ల రాజ్యంలో అయోగ్యులతో కుమ్మక్కయి నడుపుతున్న రాజకీయ కుతంత్రాన్ని ఫ్రాన్సిస్ ఏవగించుకున్నాడు. సుప్రీం కౌన్సిల్‌లోని మిగతా సభ్యులకూ నచ్చచెప్పి, కొత్త గవర్నర్ జనరల్ మీద ఒత్తిడి తెచ్చి బొంబాయి వారి దూకుడుకు ముకుతాడు వేయించాడు. రఘునాథరావుతో 1775 మార్చి 6న సూరత్‌లో కంపెనీవారు కుదుర్చుకున్న ఒప్పందం "అసంబద్ధం, అవివేకం, అన్యాయం, అక్రమం" ("Unseasonable, impolitic, unjust and unauthorised") అని వారన్ హేస్టింగ్స్ చేత ఖండింపజేసి అడ్డగోలు ఒప్పందాన్ని తక్షణం రద్దుచేసి... అతడికి సాయంగా పంపిన బ్రిటిష్ సేనలను వెనక్కి పిలవాలని బొంబాయికి ఆదేశాలు పంపించాడు. సుప్రీం కౌన్సిల్ దూతగా కర్నల్ అప్టన్ అనే అధికారిని - ఆ సమయంలో పురందర్ కోటలో మకాం చేసి ఉన్న మరాఠా పాలక ప్రముఖుల దగ్గరికి పంపించి 1776 జూన్ 3న లిఖిత పూర్వకంగా సంధి కూడా కుదిర్చాడు.

ఈ పరిణామాలు బొంబాయి దొరలకు సహజంగానే ఒళ్లు మండించాయి. ఇలా చాదస్తంగా నీతి, నియమాలను పట్టుకు వేలాడితే పనులు ఎలా జరుగుతాయి? మా అధికారాన్ని పూచిక పుల్లలా తీసి-పడెయ్యటం ఏమి న్యాయం- అంటూ వారు లండన్‌లోని కంపెనీ డైరెక్టర్లకు పితూరీ చేశారు. ఆ డైరెక్టర్లలో ఫిలిఫ్ ఫ్రాన్సిన్ లాంటి పెద్ద మనిషి ఒక్కడు కూడా లేడు. ఎంతటి నీచానికైనా వెనుదీయకుండా ఎలాగైనా భారతదేశాన్ని వశపరచుకుని కళ్లు చెదిరే లాభాలు గడించటం అన్నిటికంటే ముఖ్యం అనుకునే బాపతే అందరూ. అందుకే - ఫ్రా[illegible] కృషివల్ల జరిగిన మంచినంతా వమ్ముచేసి, బొంబాయి వారు చెప్పేదే రైటని కంపెనీ పాలక వర్గం తీర్పు చెప్పింది. దాంతో కథ మొదటికి వచ్చింది. బొంబాయి ప్రభుత్వం రెచ్చిపోయింది. ఫ్రాన్సిస్ హిత వచనాలను తోసి రాజని వారన్

హేస్టింగ్స్ కూడా సిగ్గు వదిలి దేశం మీద పడ్డాడు. అధికార పూర్వకంగా తానే కుదిర్చి అధికారికంగా ధ్రువీకరించిన పురందర్ ఒప్పందాన్ని తానే పాపభీతి లేకుండా చిత్తుబుట్టలో వేసి, బొంబాయి బాబులకు తందానతాన అన్నాడు. ఫ్రెంచి వాడెవడితోనో లాలూచీ అయి ఆంగ్లేయులపై కుట్ర పన్నుతున్నారన్న నింద వేసి, మోస్టిన్‌ను ప్రయోగించి పుణెలో బొంబాయి వారు ఆడిన నాటకాలన్నిటికీ వత్తాసు పలికి... మునుపు తాను చీదరించిన రఘోభానే తిరిగి పీష్వాను ప్రతిష్ఠించటానికి పుణె మీదికి భారీ సైన్యాన్ని తరలించాడు. అంతదాకా తమను తప్పుబట్టిన గవర్నరు జనరల్‌కే తిక్కకుదిరి తమ దారికి రావటంతో బొంబాయి దొరలు పట్టపగ్గాలు లేకుండా మరీ రెచ్చిపోయారు. మరాఠాలను జయించిన ఘనత కలకత్తా వారికి ఎందుకు దక్కనివ్వాలి అనుకున్నారేమో... బెంగాల్ నుంచి సేనలు నెమ్మదిగా చేరుకునే లోపే తొందరపడి బొంబాయి నుంచి తమ సైన్యాన్ని తోడిచ్చి రఘునాథరావు వెంట పుణెపై దాడికి పంపారు.

ఇదంతా జరుగుతూంటే అక్కడ నానా ఫడ్నవిస్ చేతులు ముడుచుకుని లేడు. అతడి వేగుల వ్యవస్థ ఎంత పటిష్ఠమంటే... పుణెలో కూచునే దేశంలో ఎక్కడ ఏమి జరుగుతుందో, ఏ శిబిరంలో ఎలాంటి మంతనాలు, కుట్రలు జరుగుతున్నాయో ఎప్పటికప్పుడు తెలుసుకోగలడు. తెల్లవారు పురందర్ సంధికి జెల్లకొట్టారని, కలకత్తా, బొంబాయిల నుంచి తమపై సైనిక దాడులకు ఉపక్రమించారని తెలియగానే నానా అప్రమత్తమయ్యాడు. ఆ సమయంలో మరాఠా కూటమిలో అతిముఖ్యులైన సిందియా, హోల్కర్‌లు పుణెలోనే ఉన్నారు. శత్రువును ఎదుర్కొనే బాధ్యత నానా వారికి అప్పగించాడు.

మెరుపు దాడుల్లో, గెరిల్లా రణతంత్రంలో వారు ఆరితేరినవారు. బొంబాయి నుంచి వస్తున్న విదేశీ సేనను ఎదుర్కొన్నట్టే ఎదుర్కొని, అంతలోనే వెనక్కి తగ్గి అవతలివారు తమ వెంట పడేట్టు చేసి, మెల్లిగా వారిని రాజధాని పుణె దగ్గరి దాకా తీసుకొచ్చి, తాలెగావ్ వద్ద చక్రబంధంలో ఇరికించి చుట్టుముట్టారు. ఎటూ తప్పించుకునే వీలులేకుండా, తిండి, నీరు కూడా దొరకకుండా దిగ్బంధం చేసి భీకర యుద్ధానికి దిగారు. మరాఠాల ప్రతాపం ముందు ఆంగ్లేయుల తుపాకులు, శతఘ్నులు ఏవీ నిలవలేకపోయాయి. తెల్లసేన చిత్తుగా ఓడింది... రఘునాథరావు, అతడిని శిఖండిలా ముందు పెట్టుకుని వచ్చిన ఇంగ్లీషు వీరులు గువ్వపిట్టల్లా మరాఠాలకు చిక్కారు.

అప్పుడే అక్కడే అందరినీ నరికి పోగులు పెడితే పీడ విరగడయ్యేది. కాని– ఆది నుంచీ భారతీయులకు అవలక్షణమైన 'సద్గుణ వికృతి' ఆ సమయంలోనూ ప్రకోపించింది. పట్టుబడ్డ వారు సంధికి సిద్ధమన్నారు. మరాఠాలు సరేనన్నారు. రఘునాథరావును తమకు ఒప్పగించాలని, అప్పటిదాకా ఆంగ్లేయులు కాజేసిన తమ ప్రాంతాలను తిరిగి తమకు స్వాధీన పరచాలని, తమకు అయిన నష్టానికి పరిహారం కట్టాలని షరతుపెట్టారు. తెల్లవారు అన్నిటికీ సరేనని 1779 జనవరి 16న వాడగావ్ వద్ద సంధి పత్రంపై సంతకాలు చేశారు. అయితే కంపెనీ పక్షాన అంత పెద్ద నిర్ణయాలు చేసే అధికారం తమకు లేదు కనక, తమను బొంబాయి వెళ్లనిస్తే పై వారికి నచ్చచెప్పి సంధి షరతులను ధ్రువీకరించేట్టు చేస్తామన్నారు. మరాఠాలేమో 'సరే పొండి, కాని రఘునాథరావును ఇక్కడే ఉంచి వెళ్లండి. మీ తరపున బందీలుగా ఇదిగో ఈ ఇద్దరిని కూడా అట్టే పెట్టుకుంటాం. తేడా వచ్చిందో వాళ్లని చంపేస్తాం. అన్నట్టు కలకత్తానుంచీ మీ సైన్యం మా మీదికి బయలుదేరింది కదా?



దాన్ని వెనక్కి పొమ్మని ఉత్తరం రాసివ్వండి' అన్నారు.

ఇంగ్లీషువారు అన్నిటికీ సరేనన్నారు. కాని – బొంబాయి చేరుకోగానే షరతులన్నిటికీ బెబ్బే అన్నారు. వెనక్కి మరల వలసిందిగా మరాఠాల బలవంతంపై కలకత్తా ఆంగ్లసేనకు పంపిన ఆదేశాన్ని రద్దు చేశారు. ఈస్ట్ ఇండియా కంపెనీ పేరు మీద, బ్రిటిష్ సమ్రాట్టు మీద ప్రమాణం చేసి మరాఠాలతో కుదుర్చుకున్న వాడ్గావ్ సంధిని వారన్ హేస్టింగ్స్ నిస్సంకోచంగా చిత్తుబుట్టలో పడేశాడు

తెల్లవారు నమ్మదగని గోమాయువులన్న సంగతి నిర్ద్వంద్వంగా విశదమయ్యాకైనా మనవారు తెలివి తెచ్చుకున్నారా? మళ్లీ వారి మోసపు సుడిగుండంలో పడకుండా జాగ్రత్తపడ్డారా?



# చేజారిన అవకాశం

*The ways of Europeans are unfair and wily. It is their custom at first to ingratiate themselves with the Indian Princes, show them the advantages of their alliance and then put the prince himself into prison and seize his kingdom... We should, therefore, put down the Europeans, which course alone will preserve the dignity of the princes of the country... All the Chiefs in the Deccan have combined together. The Nawab, Nizam Ali Khan, Hydar Naik and the Peishwa have entered into a quadruple alliance, resolved to put down the English in all directions... In Northern India the Emperor and Najab Khan should combine together all the princes and put down the English.*

*[Rise of the Christian Poer in India,* **B.D.Basu,** *p. 233]*

*(తెల్లవారు మాయలమారులు. భారతీయ ప్రభువులకు తమ మీద దయకలిగేట్టు చేసుకుని, తమతో పొత్తు లాభసాటి అయినట్టుగా చూపించి, ఆ తరువాత అదే ప్రభువును బంధించి, రాజ్యాన్ని వశపరచుకోవటం వారి ఆనవాయితీ... కాబట్టి మనం తెల్లవారిని అణచివేయాలి. దేశంలోని ప్రభువుల గౌరవాన్ని కాపాడాలంటే అదొక్కటే దారి... దక్కనులో ముఖ్యులందరూ ఏకమయ్యారు. నవాబు, నిజాం ఆలీఖాన్, హైదర్ నాయక్, పీష్వాలు చతుర్ముఖ కూటమిని కట్టి, అన్ని దిక్కులా ఇంగ్లీషువారిని అణచడానికి సమాయత్తమయ్యారు. ఉత్తర భారతంలో ప్రభువులందరినీ పాదుషా, నజాబ్ ఖాన్‌లు ఒక్కతాటి మీదికి తెచ్చి ఆంగ్లేయుల పీచమణచాలి...)*

18వ శతాబ్ది ద్వితీయార్థంలో మరాఠా రాజ్యభారాన్ని తన భుజాలపై మోసి, శివాజీ స్ఫూరితో విశాల జాతీయ ప్రయోజనాల కోసం అకుంఠిత దీక్షతో పాటుబడ్డ నానా ఫడ్నవిస్ 1780 మే 6న మొగల్ పాదుషాకు పంపిన సందేశమిది. చాపకింద నీరులా చడీచప్పుడు కాకుండా కమ్ముకొచ్చి, బెంగాల్‌ను కబళించి, మొగల్ చక్రవర్తిని కీలుబొమ్మను కావించి మెల్లిమెల్లిగా మొత్తం భారతదేశాన్ని ఆక్రమించటానికి తెల్లవారు పన్నిన కుతంత్రాన్ని వమ్ముచేయడానికి స్వదేశీ ప్రభువులందరినీ సమీకరించి, నానా కట్టిన 'ఐక్య సంఘటన'ను ఈ సందేశం సూచిస్తుంది. 12వ శతాబ్ది చివరిలో మహమ్మద్ ఘోరీని ఎదుర్కోవటానికి పృథ్వీరాజ్ చేసిన సకల రాజలోక సమీకరణతో పోల్చదగిన జాతీయ ఐక్య పోరాటమిది. తెలివిగల తెల్లదొరలు చురుకుగా కదిలి, అనుకూలతలను చక్కగా ఉపయోగించుకుని, దశలవారీగా హిందూ దేశాన్ని జయిస్తుంటే... మూర్ఖులైన దేశవాళీ ప్రభువులు తమలో తాము కలహించుకుని, ఎవరికి వారేగా వ్యవహరించి, పరస్పర ద్వేషాలతో నెత్తికి చేతులు తెచ్చుకున్నారని ఇంగ్లీషు చదువుల గ్రంథసాంగులు చెప్పేది పచ్చి అబద్ధమనడానికి ఈ సందేశం ఒక్కటి చాలు.

అందరూ కలిసి తెల్లవారిని అణగదొక్కాలని హితవు పలకడంతో నానా ఫడ్నవిస్ ఊరుకోలేదు. ఆ లక్ష్యసాధనకు చొరవ తీసుకుని విదేశీయుల గుండెలదిరేలా పెద్ద రణతంత్రమే పన్నాడు.

ఆ సమయంలో గవర్నర్ జనరల్ వారన్ హేస్టింగ్స్ పరాభవభారంతో కంటికి కునుకు లేకుండా ఉన్నాడు. ఇట్టే పోయి మహారాష్ట్రను అట్టే జయించుకు వస్తారనుకుని బొంబాయి దొరలు పంపిన ఆంగ్ల సైన్యం మరాఠాల చేతిలో చిత్తుగా ఓడి చావు తప్పి కన్ను లొట్టబోయిన రీతిలో వెనక్కి మరలింది. తమ సేన వెనక్కి రాగానే 'కంపెనీ' దొరలు వాడగావ్ సంధిని చిత్తుబుట్టలో పడేశారు. ఆ సంధి 'అనవసరం, అక్రమం, చట్టవిరుద్ధం' అని వారన్ హేస్టింగ్స్ ప్రకటించాడు. తన రాజు మీద, తన కంపెనీ మీద ప్రమాణం చేసి తన ప్రతినిధులు అధికార హోదాలో కుదుర్చుకున్న ఒప్పందాన్ని పాపభీతి లేకుండా తోసిరాజన్నాడు. సిగ్గుచేటైన లొంగుబాటువల్ల కుంఫిణీకి వచ్చిందనుకున్న అప్రతిష్ఠను ఎలాగైనా తుడిచివెయ్యాలని అతడు కంకణం కట్టుకున్నాడు.

బొంబాయి సైన్యం సాధించలేక భంగపడిన కార్యాన్ని ఒడుపుగా నెరవేర్చుకు రమ్మని జనరల్ గొడ్డార్డ్‌ను హేస్టింగ్ ప్రయోగించాడు. అతడేమో పుణె ప్రభుత్వంతో రాజీకి ప్రయత్నిస్తున్నట్టు కనిపిస్తూనే సమాలోచనల నెపంతో కాలయాపన చేస్తూనే మరాఠా కూటమి ఐక్యతను చాటుమాటుగా విచ్ఛిన్నం చేసి, ఆయువుపట్ల మీద దెబ్బ కొట్టి. మరాఠా శక్తిని నిర్వీర్యం చేయటానికి సర్వశక్తులూ ఒడ్డాడు. రఘునాథరావును విధిలేక పుణె ప్రభుత్వానికి ఒప్పగించి, ఇకపై అతడి కొమ్ముకాసేది లేదని వాడగావ్ సంధిలో నమ్మబలికిన తెల్లవారు అక్కరతీరగానే ఒట్టు తీసి గట్టున పెట్టి మళ్ళీ రఘోబాను తలకెత్తుకున్నారు.

పీష్వాకి వ్యతిరేకులైన వారందరినీ కూడగట్టి, జాతి పరువును విదేశీయులకు కుదువబెట్టి, తన స్వార్థం సాధించటానికి రఘోబా యథాప్రకారం కుతంత్రాలు పన్నాసాగాడు. ఒప్పందానికి విరుద్ధంగా ఒక చెంప అతడితో కుటిల రాజకీయం నడుపుతూనే ఇంకో వంక మరాఠాలను మాయచేసి నయవంచనతో బుట్టలో వేయాలన్న తెల్లవారి దురాలోచనను నానాఫడ్నవిస్ గ్రహించాడు. ఇక ఉపేక్షిస్తే లాభం లేదని. కుంపిణీ కుటిలత్వానికి వ్యతిరేకంగా దేశంలో అందరినీ సమీకరిస్తే తప్ప లాభం లేదని అతడు నిశ్చయానికి వచ్చాడు. రాజకీయ తంత్రంలో ఆరితేరినవాడు కనుక ఇంగ్లీషువారితో శాంతి సంభాషణను కొనసాగిస్తున్నట్టు కనిపిస్తూనే...

వివరణల మీద వివరణలు అడుగుతూ కాలయాపన చేస్తూనే జాతీయ ఐక్య సంఘటనను కట్టటానికి ఏకదీక్షతో నిమగ్నమయ్యాడు.

వింధ్యకు దక్షిణాన ఆకాలంలో ఉన్నవి ముఖ్యంగా మూడు రాజకీయ శక్తులు. ఒకటి మరాఠాలది. రెండు - హైదర్ అలీ. మూడు- నిజాం. వీరిలో వీరికి బోలెడు గొడవలు. బాజీరావు కాలం నుంచీ నిజాంతోనూ, మాధవరావు హయాం నుంచీ హైదర్‌తోనూ మరాఠాలు అనేక యుద్ధాల్లో భీకర పోరాటాలు సాగించారు. వారి ప్రాబల్యాన్ని నిరోధించటమే మరాఠాల రాజనీతిలో ఒక ముఖ్యధ్యేయంగా ఉంది. అయినా ఇంగ్లీషువారి బెడదను ఎదుర్కొనే విశాల ప్రయోజనం కోసం ఈ చిరకాల వైరాలను కూడా విస్మరించి, పాత విరోధులను కలుపుకొని వెళ్ళేందుకు నానా ఫడ్నవిస్ గొప్ప చొరవ చూపాడు.

ఉత్తర సర్కార్లలో తన నుంచి నొల్లుకున్న నాలుగు జిల్లాలకు కట్టాల్సిన కప్పం కట్టకుండా ఎగవేయటంతోబాటు ఐదో జిల్లా అయిన గుంటూరును కూడా కుంపిణీవారు ఎగరేసుకుపోవాలని చూస్తుండటంతో ఆ సమయంలో నిజాం మదరాసు దొరల మీద భగభగలాడుతున్నాడు. పంతాలు మరిచి ఏకమవుదామని నానా అడగ్గానే సరే అన్నాడు. అలాగే ఆర్కాట్ నవాబును, మైసూరు మల్లుడు హైదరాలీని నానా ఒడుపుగా దువ్వాడు. హైదర్‌కు అంతకు ఎనిమిదేళ్ళ పూర్వం కూడా నానా ఫడ్నవిస్ ఇలాంటి ప్రతిపాదనే చేశాడు. అయితే ఆ సమయంలో తెల్లవారిమీద హైదర్‌కి కొన్ని భ్రమలుండేవి. మహారాష్ట్రులే తన ప్రధాన శత్రువులని అతడు భావిస్తూండేవాడు. అందుకే - ఇంగ్లీషువారి పీడ వదిలించుకోవటానికి అందరం కలిసి పోరాడదాం సోదరా అని నానా అంటే కలిసిరాకపోగా ఆ కబురు కాస్తా కుంపిణీ దొరలకు చేరవేశాడు. అది మరాఠా ప్రభుత్వానికి చాలా చికాకులను తెచ్చిపెట్టింది. అయితే ఆతరవాత తెల్లవాడి యథార్థతత్వం హైదర్‌కు కూడా అనుభవమైంది. నా మీద ఎవరు యుద్ధానికి వచ్చినా మేము సైనికంగా ఆదుకుంటాం అని హైదర్‌తో ఒప్పందం చేసుకున్న దొరలు... మరాఠాలు అతడి తుక్కురేగ్గొడుతుంటే ఎంత మొత్తుకున్నా వీసమెత్తు సాయం చేయలేదు. దాంతో హైదర్ ఆంగ్లేయులకు బద్ధవైరిగా మారాడు. సంయుక్త పోరాటానికి 1780లో నానా ప్రతిపాదించిన ప్రతిపాదనకు సరే అన్నాడు. అప్పటికి పీష్వాకు చెందిన విశాల ప్రాంతం హైదర్ ఆక్రమణలో ఉంటూ తేలవలసిన పేచీలు అనేకం ఉన్నాయి. అయినా వాటి ఊసు ఎత్తకుండా, విశాల ప్రయోజనాల దృష్ట్యా నానా అతడితో పొత్తు కలిశాడు.

ఆఖరికి మరాఠాలకు బద్ధ విరోధి అయిన జింజీరాసిద్దీతో కూడా తరతరాల వైరాన్ని పక్కనపెట్టి, రాయబారాలు నడిపి ఇంగ్లీషువారికి వ్యతిరేకంగా పీష్వాతో చేతులు కలిపేందుకు ఒప్పందం చేయించాడు. ఇరుగుపొరుగు విరోధాలనూ, మరాఠా శ్రేణుల్లో వైరుధ్యాలను సరిచేసి పటిష్ఠమైన రక్షణ వ్యవస్థను రహస్యంగా ఏర్పరచుకున్నాక వింధ్యకు ఆవల వున్న రాజకీయ శక్తులనూ ఐక్యపోరాటానికి సమీకరించేందుకు నానా ఫడ్నవిస్ ఉద్యుక్తమయ్యాడు. ఆ సందర్భంలో మొగల్ పాదుషాకు పంపిందే- ఈ వ్యాసం మొదట్లో ఉటంకించిన సందేశం.

ఇలా మెరపులా కదిలి, ఎక్కడికక్కడ పొత్తులు, సర్దుబాట్లు చేసుకుని బద్ధవైరులను సైతం ఆపద్ధర్మ మైత్రికి నానా ఫడ్నవిస్ ఒప్పించాడు. విదేశీ 'కంపెనీ' కుత్సితాల బెడదను కలిసికట్టుగా ఎదుర్కొనేందుకు జాతీయస్థాయిలో అతడు కట్టినది అపురూపమైన 'ఐక్య సంఘటన'. వర్తకంలో, ప్రాంతాలమీద ఆధిపత్యంలో పేచీలొచ్చి బ్రిటీషువారిపై కత్తిగట్టిన డచ్చి, పోర్చుగీసు,



ఫ్రెంచి వారితోనూ పొత్తు కలిసి, ఆంగ్లేయులపై పోరులో బాసటగా నిలుస్తామని మాట తీసుకున్నాడు. ఇరుగున హైదర్‌తో, పొరుగున నిజాంతో, వెలుపల మొగలులతో, ఆపైన విదేశీయులతో సంధి నెరిపి చారిత్రాత్మకమైన చతుర్ముఖ కూటమిని కష్టపడి నానా నిర్మించాడు.

నానా వ్యూహం ప్రకారం ఎక్కడివారిని అక్కడ ఎదుర్కొని ఈస్టిండియా కంపెనీవారిని దిగ్బంధం చేయాలి. బెంగాల్‌లోని కుంపిణీ వారిమీద నాగపూర్ భోసలే విరుచుకుపడాలి. మదరాసు కుంపిణీపై హైదరాలీ దాడిచేయాలి. తూర్పుతీరంలో నిజాం సేనలు తెల్లవారిని నిలువరిస్తూంటే గుజరాత్, కొంకణ్‌లలో పీష్వా సైన్యం ఆంగ్లేయుల భరతం పట్టాలి.

మరాఠా సమాఖ్యలోని కొందరు నీతి మాలిన స్వార్థపరులను తెలివిగా బుట్టలోవేసి గొడ్డార్డ్ గుజరాత్‌లో బాగానే పాగా వేశాడు. ఆ సంబరం ఆట్టేకాలం నిలవకుండా నానాఫడ్నవిస్ తెల్లవారికి ఊపిరి సలపకుండా ఆయువుపట్ల మీద ఏక కాలంలో వరస దెబ్బలు కొట్టాడు. అతడు కోరగానే కర్ణాటకలో హైదరాలీ సేనా నాయకత్వంలో సుశిక్షితులైన 90 వేల సైనికులు జవనాశ్వాల మీద సాగించిన భీకర యుద్ధాన్ని అనంతర కాలంలో బ్రిటిష్ కామన్స్ సభలో ఎడ్మండ్ బర్క్ ఇలా వర్ణించాడు.

> Having terminated his disputes with every enemy and rival who buried their mutual animosities in their common detestation, Hyder drew from every quarter whatever savage ferocity could add in the art of destuction... Then ensued a scene of war the like of which no man had seen... All the horrors of war before known or heard of were mercy to that new havoc...
>
> **[*The Tigers of Mysore*, Praxy Fernandes, *p. 55*]**

(అందరూ ఏవగించుకునే ఉమ్మడి శత్రువుతో తలపడటం కోసం పరస్పర వైరాలను పాతిపెట్టి, విరోధులందరితో తగవులు విరమించి హైదర్ ప్రతివైపు నుంచి భయానక క్రౌర్యాన్ని సమీకరించి వినాశనానికి ఆయత్తమయ్యాడు... మునుపెన్నడూ మనిషి చూసి ఎరుగని యుద్ధం అప్పుడు చెలరేగింది... గతంలో కన్న విన్న యుద్ధ బీభత్సాలన్నీ ఈ కొత్త ఉపద్రవం ముందు దిగదుడుపు).

హైదరాలీ ధాటికి పట్నాలు, నగరాలు కుప్పకూలి దక్షిణాన తంజావూరు వరకూ మైసూరు గుర్రాల గిట్టల కింద బ్రిటిష్ ఆక్రమిత ప్రాంతాలు గిజగిజలాడాయి. మన్రో అన్నట్టు ఇండియాలో బ్రిటిష్ సేనలకు తటస్థించిన పరాభవాలన్నిటికంటే అది పెద్దది. వేలాది సైనికులు నిహతులు కాగా 4వేల మంది బ్రిటిష్ సైనికులు యుద్ధ ఖైదీలుగా చిక్కారు. సరిగ్గా అప్పుడే మాళవలో మరాఠాలు, ఆంగ్లేయులపై విరుచుకుపడి సిరోంజ్ వద్ద 2వేల మంది ఆంగ్ల సైనికులను మట్టుపెట్టారు. దక్షిణాన ఆర్కాట్ యుద్ధంలో హైదరాలీ ఆంగ్లేయులను అద్భుతంగా చీల్చి చెండాడుతూ మద్రాసు ప్రెసిడెన్సీని గజ గజ వణికిస్తున్న సమయంలో పూనా నుంచి మరాఠా సేనలు కనుమలను దాటి బొంబాయిపై భీకరంగా పడి దిగ్బంధం చేశాయి. పూనా మీదికి దండెత్తిన గొడ్డార్డ్ సైన్యం చిత్తుగా ఓడింది. ఇలా అన్నివైపులా కమ్ముకొచ్చిన సైనిక దాడులతో తెల్లవారికి దిగచెమటలు పద్దాయి. విభజించి పాలించటం ఒక్కటే వారికి తెలిసిన రాజనీతి. మాయమాటలతో మనుషులను బుట్టలో

వేసి, ప్రలోభాలతో ప్రభువులను వశపరచుకుని, వెనకనుంచి గోతులు తవ్వి, మిత్రభేద తంత్రాలతో అనుచిత లాభం పొందడంలో వారిని మించినవారు లేరు. బహిరంగంగా యుద్ధంచేసి, పరాక్రమంతో గెలవటం వారికి ఏనాడూ చేతకాదు. అందరూ ఆదమరచి ఉండగా కుతంత్రాలతో దొంగదెబ్బలు తీయగలరేగాని అందరూ ఏకమైనప్పుడు వారు ఏమీ చేయలేరు.

తమ పీచమణచడానికి దేశంలో శక్తులన్నీ ఒకటి కాగానే కంపెనీ దొరల కాళ్లు చేతులు చల్లబడ్డాయి. గుజరాత్‌లో విజయం సాధించిన సంబరం మూణ్నాళ్లు కూడా నిలువకుండా ఇండియాలో వారి మనుగడకే పెనుముప్పు వచ్చింది. బొంబాయిలో మరాఠాలు, మద్రాసులో హైదరాలీ చేసిన దిగ్బంధంతో ఆర్థికంగా వారి వెన్ను విరిగింది. దొరల జనావాసాలు తిండి తిప్పలు లేక మలమలలాడే దుస్థితి ఆసన్నమైంది. మరాఠా- మైసూరు ఐకమత్యాన్ని ఛేదించి... ఉగ్రులైన మరాఠాలను శాంతింపజేస్తేగానీ తమకు బతుకు ఉండదని అర్థమవటంతో వారన్ హేస్టింగ్స్ కాళ్ళ బేరానికి దిగాడు. దేనికైనా ఒప్పుకుంటాము, సంధికి సమ్మతించమంటూ నానా ఫడ్నవిస్‌కు రాయబారం మీద రాయబారం పంపించాడు.

భారతదేశంలో మోసాలు, చేసి కుట్రలు నడిపి కాలూనిన దరిమిలా అంతటి బలహీన స్థితిలో ఇంగ్లీషువారు ఎన్నడూ లేరు. తమకు అవసరమై ఆంగ్లేయులు గత్యంతరం లేక సంధికి సుముఖమైనంత మాత్రాన, జాతీయ పక్షం అందుకు ఒప్పుకోవలసిన పనిలేదు. ప్లాసీ యుద్ధానికి ముందునుంచీ దేశంలో ఇంగ్లీషు కంపెనీ ఆగడాలను కుతంత్రాలను వరసగా చేసిన వాగ్దాన భంగాలను గ్రహించినవారెవరికైనా తెల్లవారి ఉనికి దేశానికి అరిష్టమన్న సంగతి అర్థమవుతుంది. విదేశీయుల ప్రమాదాన్ని తక్కువ అంచనావేసి, తమ తాహతును అతిగా ఊహించుకుని, పరస్పర కలహాల్లో మునిగి ప్రభువర్గం పరాకు చూపినందు వల్ల అప్పటికే కావలసినంత అనర్థం జరిగింది. ఈ విదేశీ వర్తకులు ఉపేక్షించదగని విష సర్పాలని, నయవంచనలో వాగ్దానభంగాల్లో ఆరి తేరిన వారని వంగదేశాన్ని మింగిన తీరునుబట్టే దేశ వాసులందరికీ తేటతెల్లమైంది. రఘునాథరావును ఎగదోసి వారు నడిపిన రకరకాల కుటిల తంత్రాలతో తెల్లవారి నీచత్వం, దుర్మార్గం అందరికీ అనుభవమైంది. ముప్పును గుర్తించి అందరూ ఏకమైన తరువాతైనా ఎత్తిన కత్తిని దించకుండా కడదాకా సాగనిచ్చి ఉంటే చరిత్రగతి మరొకలా ఉండేది. దేశానికి విదేశీయుల పీడ అప్పుడే శాశ్వతంగా విరగడయ్యేది.

కాని-అంతకుముందు అనేక సందర్భాల్లో జరిగినట్టే ఉమ్మడి లక్ష్యం నెరవేరకుండా జాతీయ శక్తుల ఐక్యత చెదిరిపోయింది. కారణాలు అనేకం. మీ ప్రాణానికి నా ప్రాణం అడ్డు; తెల్లవాడితో రాజీకి ఎట్టి పరిస్థితుల్లోనూ ఒప్పుకోవద్దు అని మరాఠాలకు నొక్కి చెప్పి భీకరంగా పోరాడసాగిన హైదరాలీ యుద్ధం పూర్తికాకుండానే హఠాత్తుగా జబ్బుపడి మరణించాడు. అతడి వారసుడైన టిప్పు సుల్తాన్‌తో మరాఠాలకు అంత సఖ్యత లేదు. అలాగే ఉమ్మడి పోరుకు సై అన్న నిజాం నవాబు తననుంచి కాజేసిన గుంటూరు మండలాన్ని ఆంగ్లేయులు తనకు తిరిగి అప్పగించి బేరం కుదుర్చుకోగానే వైరం మరచి గమ్మునుండి పోయాడు. అనుకున్న ప్రకారం తూర్పు తీరానికి నౌకాదళాన్ని తరలించి మద్రాసులో ఇంగ్లీషువారి పీచమణుస్తారనుకున్న ఫ్రెంచివారు అమెరికా యుద్ధం రంధిలో ఇండియా రంగాన్ని నిర్లక్ష్యం చేశారు. వీటికితోడు కుంపిణీవారు టక్కుటమారాలు ప్రయోగించి



మాధవరావు (మహాద్‌జీ) సింధియాను తెలివిగా బుట్టలో వేసుకుని మరాఠా కూటమికి చిచ్చుపెట్టారు. ఇలా వరుసగా ఎదురు దెబ్బలు తగిలి ఐక్య పోరాటం కాస్తా చిందరవందర కావటంతో మరాఠా నాయకత్వానికి కూడా నైతికధృతి సడలింది. ఇంగ్లీషువారిపై ఎత్తిన కత్తిని ఇష్టం లేకున్నా దించి, శత్రువు వేడికోళ్ళను మన్నించి 1782 మే 17న సాల్బేలో కుంపిణీ- మరాఠాలు సంధి కుదుర్చుకున్నారు.

నానా ఫడ్నవిస్ కష్టపడి సాధించిన అపురూప జాతీయ ఐక్యత ఆ విధంగా ఆవిరైంది. విభజించి పాలించడం ఇంగ్లీషు గుంటనక్కకు ఆ తరువాత మరీ సులువైంది.

# దొంగల దోపిడీ

సీమ నుంచి ఇండియాకి ఓడ బయలుదేరింది. ప్రయాణికుల్లో ఇద్దరు దంపతులు. వారిది కులీనుల కుటుంబం. భర్త చిత్రకారుడు. బతికి చెడ్డవాడు. చిత్తరువులు వేసి పొట్ట పోసుకోవటం కోసం సీమ వదిలి ఇండియా వెళుతున్నాడు. అతడి భార్య అందగత్తె. డబ్బు, హోదాల మీద ఆమెకు యావ ఎక్కువ. పైగా రసికురాలు. ఆమె రసికత్వాన్ని భర్త గ్రహించలేకపోయాడు. కాని ఓడలో తారసపడ్డ ఓ వయసు మీరిన యువకుడు చక్కగా పోల్చుకోగలిగాడు.

అతడేమీ అందగాడు కాదు. పీలగా మొరటుగా ఉంటాడు. పెద్దగా డబ్బున్నవాడుకాదు. కాని ఎలా సంపాదించాలో తెలిసినవాడు. ఎరలు వేసి మాయచేసి అనుకున్నది ఎలాగైనా సాధించటంలో మొనగాడు. అతడికీ వారికీ ప్రయాణంలో మాటలు కలిశాయి. వారాల తరబడి సముద్ర ప్రయాణం కనుక పరిచయం పెరిగింది. మధ్యలో అతడు జబ్బుపడితే ఆ మగనాలి శ్రమ అనుకోకుండా జాగ్రత్తగా సేవలు చేసింది. భర్త మంచివాడు కనుక వారించలేదు. అతడి మంచితనాన్ని అతగాడు ఉపయోగించుకుని దొరసానిని తెలివిగా బుట్టలోవేశాడు.

ఓడ ఎక్కేనాటికి అతడు వారి ముక్కూ మొగం ఎరుగడు. మద్రాసులో ఓడ దిగే సమయానికి పరసతి మనసు ఆక్రమించుకుని, ఆమెపై అసలు హక్కుదారు నెత్తిన గుడ్డవేసి 'మీ వివాహాన్ని రద్దుపరచుకుంటే ఉభయులకూ బాగుంటుంది... నువ్వు కొంచెం వదిలేస్తే నేను మీ ఆవిడను పెళ్లి చేసుకుంటాను' అని ప్రశస్తమైన ప్రతిపాదన చేశాడు. పైగా 'నేను దుర్మార్గుణ్ని కాను. ప్రతిదీ పద్ధతి ప్రకారమే చేస్తాను. ఈమె మీద నీకున్న హక్కుని ఎంతో గౌరవిస్తాను. విడాకులు తీసుకునేంతవరకూ నీ దగ్గరే ఉండనిస్తాను. ఆ తరవాత నీకు మనోవర్తి కూడా ఇస్తాను' అని పెద్దమనిషి తరహాలో పరాయివాడి పెళ్లాన్ని ఎగరేసుకుపోయాడు.

సరిగ్గా అలాంటి 'పెద్దమనిషి' తరహాతోనే, అలాంటి చాకచక్యంతోనే చక్రం తిప్పి భారతదేశంలో ఒక రాజ్యం తరవాత ఒక రాజ్యాన్ని కరిమింగిన వెలగలా హరించాడు.

ఆ పెద్దమనిషిపేరు వారన్ హేస్టింగ్స్.

హేస్టింగ్స్ ఇండియా రావటం అది రెండోసారి. అంతకు 19 ఏళ్ల ముందు ఈస్టిండియా కంపెనీ కలకత్తా కొలువులో అతడిని పినతండ్రి గుమాస్తాగా చేర్పించాడు. అప్పుడే క్లయివ్ కంటపడ్డాడు. నవాబు దర్బారులో ఉండి ఆనుపానులు కనిపెట్టి తనకు సమాచారం చేరవేయటానికి క్లయివ్ అతడిని ముర్షిదాబాద్ పంపాడు. అక్కడ ఉండగా నవాబు మీద క్లయివ్‌కు చాడీలు చెప్పాడు. ఉద్యోగం మానేసి సీమకు తిరిగొచ్చాక క్లయివ్ మీద పార్లమెంటరీ విచారణ సంఘం వారికి పితూరీలు చేశాడు. ఈ సందర్భంలోనే కంపెనీ యజమానుల దృష్టిలో పడ్డాడు. క్లయివ్‌ని వెనక్కి పిలిపించాక అస్తవ్యస్తమైన కుంపిణీ వ్యవహారాలు చక్కబెట్టటానికి మనిషి కావలసి వచ్చి వారు అతడినే మద్రాసు కౌన్సిల్‌కు మెంబరుగా పంపారు. (ఆ పని మీద 1768లో ఇండియాకి వస్తూండగానే పైన చెప్పిన ప్రేమాయణం నడిచింది). తరువాత రెండేళ్లకే బెంగాల్ ప్రెసిడెన్సీకి గవర్నరు అయ్యాడు. మళ్లీ రెండేళ్లు తిరక్కుండా కొత్త చట్ట ప్రకారం ఇండియాలోని ప్రెసిడెన్సీలన్నిటి మీద 1772లో గవర్నర్ జనరల్ అయ్యాడు.

ఇలా ఒకదాని తరవాత ఒక పదవి హేస్టింగ్సును వెదుకుంటూ వచ్చింది కేవలం అదృష్టంవల్లకాదు. తనదైన శైలిలో అతడు పడిన 'కష్టం' కూడా చాలా ఉంది!

ఆ కాలంలో ఈస్టిండియా కంపెనీ అంతటా దొంగల దోపిడీ! విదేశీయులను దోచుకుని, అక్రమ వ్యాపారాలు చేసి, లక్షలకొలది డబ్బును త్వరత్వరగా పిండుకుని, పైవారు వాసన పట్టకముందే... ఇక్కడి వేడికి సుకుమారపు ఒళ్లు వాడిపోకముందే డబ్బు సంచులతో సీమకు తిరిగెళ్లి, అక్కడ ఏ ప్రభువు కూతురినో పెళ్లాడి, వీలైతే రాజకీయాల్లో దిగి, తాగితందనాలాడటమే కంపెనీ నౌకర్లకు ఉపాదేయంగా ఉండేది. హేస్టింగ్స్ ఈ చిలక్కొట్లుకు కక్కుర్తి పడలేదు. అతడిది పెద్ద పట్టు. తోటి ఉద్యోగస్తుల్లా చిల్లర చేతివాటాలకు పోకుండా, అతడు పద్దు పుస్తకాలు ముందేసుకుని, అక్రమ వ్యాపారాలను ఉద్యోగుల మోసాలను అరికట్టి కంపెనీకి మంచి లాభాలు చూపించాడు. పైవారికి నమ్మకం కుదిరి తనకు మొత్తం పెత్తనం అప్పగించాక కంపెనీని లాభపెడుతూనే అడ్డదారిలో తానూ కోట్లు గడించాడు. అందుకోసం అడ్డమైన పనులు పాపభీతి లేకుండా చేశాడు.

బ్రిటిష్ ఇండియా చరిత్రలో మిగతా కాలాల కంటే సవిస్తరంగా వారన్ హేస్టింగ్స్ గవర్నర్ జనరల్‌గా ఉన్న పదమూడేళ్ల కాలం పూసగుచ్చినట్టు రికార్డుకెక్కింది. స్వదేశంలో అతడిపై నడచిన అభిశంసన పుణ్యమా అని ఎక్కడెక్కడి తప్పుడు పనులూ, చీకటి కోణాలూ, అడ్డగోలు లావాదేవీలూ ఉన్నదున్నట్టుగా బట్టబయలయ్యాయి. తనకు ముందు క్లయివ్ సాధించిన దానికి మించి అంగుళం నేలను కూడా వారన్ హేస్టింగ్స్ తన 13 ఏళ్ల హయాంలో కంపెనీకి అదనంగా సంపాదించి పెట్టలేకపోయాడు. కాని ఫోర్జరీలు, దగాలు చేసి క్లయివ్ గుంజుకున్న రాజ్యాన్ని హేస్టింగ్స్ తన కౌటిల్యంతో సుస్థిరపరిచాడు. గుంట నక్కలా మాయలు చేసి, గోతులు తీసి, అధర్మ యుద్ధాలకు దిగి, ఇరుగుపొరుగు రాజ్యాలను పథకం ప్రకారం బలహీన పరచి చాపకింద నీరులా బ్రిటిష్ ప్రాబల్యాన్ని పెంచాడు. వారన్ హేస్టింగ్స్ పగ్గాలు అందుకునేంతవరకూ ఆంగ్లేయులు బెంగాల్, బీహార్, ఒరిస్సాలపై పొందిన 'దివానీ'

అధికారంతోనూ, తూర్పు, పశ్చిమ తీరాల్లో తగుమాత్రం ఉనికితోనూ తృప్తిపడతారని చాలా మంది అనుకున్నారు. మోసాల్లో, నయవంచనలో అకారణ ధూర్తత్వంలో క్లయివ్‌ను తలదన్నిన హేస్టింగ్స్ ఎంతటి నీచానికైనా వెనుదీయకుండా దేశీయ శక్తులను అణగదొక్కి నమ్మిన వారిని కొద్దికొద్దిగా నంజుకు తిని, క్రమేణా మొత్తం దేశాన్ని ఆంగ్లేయులు కబళించేందుకు రాచబాట వేశాడు.

క్లయివ్ 'దివానీ' పేరిట ఖజానాను కొల్లగొట్టినా రాజ్యాపాలనను మాత్రం నవాబు పేరుమీదే కొనసాగనిచ్చాడు. విపరీతంగా పన్నులు విధించటానికి, గోళ్లూడకొట్టి వసూలు చేయటానికి, ఇష్టం వచ్చినట్టు ఖర్చుపెట్టుకోవటానికి అపరిమితమైన అధికారాలను కంపెనీవారు గుంజుకున్నా పైకి మాత్రం మొగల్ పాదుషా పేరు మీదనే పరిపాలన నడిచేది. సర్కారు నాణేలను అతడి పేరిటే ముద్ర గొడుతూండేవారు. నవాబు తనకు కావలసినంత మంది ఉద్యోగులను దర్బారులో నియమించుకోవటానికి, దర్జాగా కాలం వెళ్లదీయటానికి నిధుల లోపం ఉండేది కాదు. కోర్టుల్లో న్యాయ నిర్ణయాలు నవాబు పేరు మీదే జరిగేవి. పన్నుల ఆదాయం కూడా నవాబు రాజధాని ముర్షిదాబాదులో ఒక దేశీయ ఉద్యోగి ద్వారానే కంపెనీకి ముడుతూండేవి. ఇదే ఏర్పాటు ఎప్పటికీ కొనసాగాలని, నవాబుకు ఇవ్వాల్సిన భరణంలో కాని, అతడి అధికారాల్లో కాని ఎలాంటి కుదింపూ జరగరాదని సీమలోని కంపెనీ యజమానులు తమ తాబేదార్లకు పదే పదే గుర్తుచేసేవారు. ఖజానాను కొల్లగొట్టడం ద్వారా తమకు ఇబ్బడి ముబ్బడిగా లాభాలు ముట్టినంత వరకూ వారు సంతోషంగా ఉన్నారు. నీతి బోధలే చేశారు.

అయితే ఎంతటి ఖజానా అయినా లాగేస్తూపోతే కొంత కాలానికి ఖాళీకాక తప్పదు. ఎవరైనా ఎంత గొప్ప లోగిలినైనా ఒకసారి మాత్రమే దోచుకొనగలరు. అలవాటుపడిన అధిక లాభాలు కొంత కాలానికి తగ్గుముఖం పట్టాయి. దాంతో కంపెనీ పెద్దలు నీతులు తీసి గట్టునపెట్టి అడ్డగోలు పనులకు దిగారు. దేవుడి ఎదుట ప్రమాణం చేసి, అనుల్లంఘనీయమని, నిశ్చయంగా కట్టుబడతామని ప్రకటించి కుదుర్చుకున్న ఒప్పందాన్ని తలచిందే తడవుగా తిరగదోడి నవాబు భరణానికి అంటకత్తెర వేయసాగారు. నజూముల్ దౌలా నవాబుగా ఉన్న రోజుల్లో దివాణం ఖర్చుకు కంపెనీ వారు సాలుకు 53 లక్షలు ఇస్తూండేవారు. అతని తమ్ముడు గద్దె నెక్కాక ఆ మొత్తాన్ని 41 లక్షలను తగ్గించారు. అతడి తర్వాత నవాబు అయిన ముబారక్ ఉల్ దౌలా దగ్గరికి వచ్చేసరికి దీన్ని 32 లక్షలకు కోసేశారు. కొన్నాళ్లకు - నవాబు మైనరు; అతడికి ఇంత ధనం ఇవ్వటం దండగ; చుట్టూ తిండిపోతులు, భజనపరులు చేరి సొమ్ము కాజేస్తున్నారు. కాబట్టి మేజరు అయ్యేంతవరకూ నవాబు భృతిని సగానికి కోసేస్తున్నాం పొమ్మన్నారు.

మొట్టమొదట చక్రవర్తికి వొంగి వొంగి సలాములు చేసి 'దివానీ' ఫర్మానాను తెల్లవాళ్లు పొందినప్పుడు అనుకున్నది ఏమిటంటే- పన్నులు వసూలు చేసిపెట్టే పని మాత్రమే కంపెనీవారు చేస్తారనీ; మిగతా సమస్త అధికారాలూ పాదుషాకు, అతడి ప్రతినిధి అయిన సుబేదారుల చేతుల్లోనే ఉంటాయనీ! క్రమంగా ఒక్కొక్క అధికారాన్నే- ఇంగ్లీషువాళ్లు అడ్డగోలుగా లాగేసుకున్నారు. అంతా అయ్యాక- వెనుకటి బాధ్యతలేవీ ఇప్పుడు నవాబుకు లేవుగదా? అవన్నీ ఉన్నప్పుడు వాటని నిభాయించటం కోసం పెట్టుకున్న సైనిక బలగాలతో



ఇప్పుడు అతడికి అవసరం ఏముంది? ఎలాగూ నవాబుకు రక్షణ మేమే కల్పిస్తున్నాం కాబట్టి సేనల్ని తగ్గించి ఆ మేరకు నవాబుకిచ్చే మొత్తాన్నే కోసేస్తున్నాం పొమ్మన్నారు. ఇలా ఒట్లూ ప్రమాణాలూ గాలికొదిలేసి, ఆడిన మాట తప్పి, నవాబు అయివేజుకు అంటకత్తెర వేసి వేసి చివరికి హేస్టింగ్స్ దొర నవాబుకు అసలు సైన్యాలే అక్కరలేదని తేల్చాడు. క్లయివ్ చేసిన తెరచాటు ఏర్పాట్లను లాగిపారేసి సర్వాధికారాలను గుంజేసుకున్నాడు.

ఈలోపు ఇంగ్లండులో ఇంకో కథ నడిచింది. 'దివానీ' సంపాదనలవల్ల ఈస్టిండియా కంపెనీ షేర్లకు విపరీతంగా ధర పలికింది. అంతదాకా 6 శాతంగా ఉన్న డివిడెండును 10 శాతానికి పెంచాలని యాజమాన్య మండలి నిర్ణయించింది. ఇది చూసి బ్రిటిష్ ప్రభువర్గానికి కళ్లుకుట్టాయి. ఇంతలేసి లాభాలు వీరికి ఎలా వస్తున్నాయి? ఆ సంగతి ఆరా తీసి ఇండియాలో ఏమి జరుగుతుందో తెలుసుకుని, అవకతవకలుంటే సరిదిద్ది ప్రతిదీ న్యాయబద్ధంగా జరిగేట్టు చూడాలని పార్లమెంటులో ఒత్తిడి వచ్చింది. ఇందు కోసం కమిటీ కూడా ఏర్పాటైంది. ఒక చెంప పార్లమెంటులో సీరియస్‌గా చర్చ జరుగుతున్న సమయంలోనే కంపెనీ భాగస్వాములు కొలువుతీరి డివిడెండును 10 నుంచి అమాంతం పన్నెండున్నర శాతానికి పెంచేసుకున్నారు. సాలుకు కనీసం నాలుగు లక్షల పౌండ్ల లాభమైనా తమకు ముట్టి తీరాలని నిశ్చయించుకున్నారు.

ఇది సహించరాని ధిక్కారమని పార్లమెంటు మండిపడింది. కామన్స్ సభలో తీవ్ర స్థాయిన వాదోపవాదాలు నడిచాయి. వాటి పర్యవసానంగా ఈస్టిండియా కంపెనీ వ్యవహారాలన్నిటి మీదా గట్టి నిఘా పడి, అడ్డమైన దోపిడీని అరికట్టటానికి నిర్దుష్టమైన చర్యలు తీసుకుంటారని జనం ఆశించారు. తీరా జరిగిందేమిటంటే ఇండియాలో మీరు ఏమైనా చేసుకోండి- ప్రభుత్వ ఖజానాకు మాత్రం ఏడాదికి నాలుగు లక్షల పౌండ్లు కట్టండి అని ప్రభువులు 'ధర్మ నిర్ణయం' చేశారు. అంటే- దోపిడీని అడ్డుకోవలసిందిపోయి దోచుకున్న సొత్తులో సీమ సర్కారుకూ వాటా అడిగారు. ఇలా ప్రభుత్వమే బాధ్యత వదిలి 'లంచం' తీసుకోవటం దుర్మార్గం అని బర్కుదొర లాంటి వారు పార్లమెంటులో నెత్తిబాదుకున్నారు. విన్నవారులేరు

దాంతో కంపెనీ పెద్దలకు పట్టపగ్గాలు లేకుండా పోయాయి. ప్రభుత్వానికి పెద్ద వాటా ఇవ్వాల్సి రావటంతో లాభాలు నిలవాలంటే ఇండియా నుంచి ఇంకా ఇంకా డబ్బు పిండటం వారికి అవసరమైంది. ఎట్లాగైనా సొమ్ము గుంజటానికి వారి అధికారులు జనాన్ని పిశాచాల్లా పీడించసాగారు. అదే సమయంలో కాటకం వచ్చి వంగ దేశంలో పంటలన్నీ పాడయ్యాయి. పంట పండినా పాడయినా పన్ను కట్ట తీరాల్సిందేనని వారు అమానుషంగా పీక్కుతిన్నారు. వారి బాధలు పడలేక రైతులు కొంపాగోడూ వదిలి పోయారు. పంటల్లేక ధరలు విపరీతంగా పెరిగాయి. ఎక్కడెక్కడి ధాన్యాన్నీ దళారులు కొని అధిక లాభాలకు ఎగుమతి చేసుకున్నారు. ఆకలి రోదనలతో దిక్కులు దద్దరిల్లాయి. ఆకలిచావులు పెరిగేకొద్దీ విషజ్వరాలు, మశూచి, ఇతర అంటురోగాలు జాస్తి అయ్యాయి. జనం లక్షల సంఖ్యలో పిట్టల్లా రాలిపొయ్యారు. ఆకలి బాధలకు తట్టుకోలేక చాలా మంది తమ పిల్లల్ని కూడా అముకున్నారు. కొన్నాళ్లకు వారినీ కొనేవారు లేకపోయారు. బతికి ఉన్నవారు చచ్చిన శవాల్ని కూడా పీక్కుతింటున్నట్టు దేశీయోద్యోగులు కంపెనీ అధికారులకు విన్నవించారు. షోర్ అనే ఆంగ్లేయుడు ఈ ఘోర దృశ్యాలను కళ్లారా చూసి హృదయ విదారకంగా వర్ణించాడు.

అయినా కంపెనీ దొరల గుండె కరగలేదు. పన్నుల సతాయింపులు మానలేదు. ఆకలితో, అంటురోగాలతో అలమటిస్తూ నాశనమవుతున్న జనాన్ని ఆదుకోవటం మన పని కాదు-చేతనైతే ఇష్టమైతే దేశీయ జమీందారులనే వారి ప్రజల్ని రక్షించుకొననీ అని దొరలు బిర్రబిగిశారు. అక్కడికీ కొంత మంది జమీందారులు జనం కష్టాలు తీర్చాలని ప్రయత్నించారు, వారి స్తోమతూ అంతంత మాత్రమే. పంటలు పోవటంతో వారిదగ్గరా డబ్బులేదు. తాము మునిగినా సరే జనాన్ని చచ్చిపోనివ్వకూడదని కొంతమంది తెగించినా అప్పులపాలై వారు నాశనమయ్యారే తప్ప ఆపన్నుల దుర్గతి తీరలేదు. సర్వస్వం కోల్పోయిన ప్రజలనుంచి పన్నులు వసూలు చేయలేకపోయిన జమీందారులను కంపెనీ అధికారులు క్రూరంగా వేధించారు. కొందరి భూములు లాగేసుకున్నారు. ప్రజలకోసం అప్పులు చేసి, శిస్తు బకాయిలు కట్టలేకపోయిన నడియా, బీర్భూమ్, రాజషాహి, జమీందార్లను ఖైదు చేశారు.

The Minor Rajah of Birbhoom was imprisoned for non-payment of land tax; while the aged Rajah of Bishenpore was only let out of a debtor's prison when his end visibly drew nigh. Out of an assessment of £ 1,380,269 only £ 65,355 was remitted during the famine year. The ruin of the Hindu gentry excited little pity or forbearance... a third of the land was reported in the next two years to have gone out of tillage... ... villages ramained in ruins, field after field lay fallow, and rapidly returned to jungle... For fifteen years after the famine depopulation went on; and in 1789 a minute of the Viceroy in Council declared that one-third of the Company' territories in Bengal was "a Jungle inhabited only by wild beasts".

**[*Empire in Asia,* W.M. Torrens, *pp. 58-59*]**

*(పసివాడయిన బీర్భూమ్ రాజును కంపెనీకి శిస్తు బకాయిపడినందుకు ఖైదులో వేశారు. ముసలివాడయిన భిషన్పూరు రాజును చావుకు సిద్ధంగా ఉన్నాడని తెలిశాకే ఖైదునుంచి విడిచిపెట్టారు. కంపెనీకి రావలసిన 13,80,268 పౌండ్ల శిస్తులో 65,355 పౌండ్లు మాత్రమే కరువు సంవత్సరంలో వసూలయింది. హిందూ భూస్వామ్య కుటుంబాలు కూలిపోవటం దొరలకు కించిత్తు కూడా జాలిని, ఓర్పును కలిగించలేదు. తరవాత రెండేళ్లలో సాగుభూమిలో మూడోవంతు బీడు పడింది. గ్రామాలు పాడుపడ్డాయి. పంట పొలాలు బంజర్లయి అడవులుగా మారాయి... కాటకం తరవాత 15 ఏళ్లపాటు జన క్షయం జరుగుతూనే ఉంది. చివరికి 1789లో గవర్నర్ జనరల్ నివేదికలో 'బెంగాల్‌లోని కంపెనీ జనావాస ప్రాంతాల్లో మూడోవంతు అడవి మృగాలు మాత్రమే నివసించే అరణ్యంగా మారాయి' అని పేర్కొన్నారు).*

దీర్ఘకాలం కరువు కోరల్లో నలిగి, విశేష జన నష్టం జరిగి, గ్రామాలకు గ్రామాలు అంతరించి, సాగుచేసే దిక్కులేక లక్షల ఎకరాలు బీడుపడ్డా శిస్తుల రూపేణా తమకు రావలసిన ఆదాయంలో దమ్మిడీ వదులుకోవటానికి సీమ దొరలు ఇష్టపడలేదు. అత్యంత క్రౌర్యంతో ఎన్నివిధాల చెండుకు తిన్నా బొక్కసం నిండటంలేదు. అది నిండితే గాని దొరల దయ్యపు ఆకలి తీరదు. ఆ ఆకలి తీర్చటం ఎలాగన్నది వారన్ హేస్టింగ్స్ ఎదుర్కొన్న మొట్టమొదటి సమస్య. తెలివిగల వాడు కనుక ఆ సమస్యలోనే అతడికి అనేక అవకాశాలు కనిపించాయి. యజమానులను సంతుష్టపరచి, తాను బాగుపడేందుకు చక్కని చిక్కని అడ్డదారులు అతడి బుద్ధికి స్ఫురించాయి.

నీతుల గుంజాటనకు పోకుండా ఆ దారిపట్టాడు.

# దొరగారి దాదాగిరి

*ఔనంటే కాదనిలే- కాదంటే ఔననిలే*
*ఆడువారి మాటలకు అర్థాలేవేరులే*

*- అన్నాడో తెలుగు సినిమా కవి. ఆడవారి సంగతేమో కాని- ఆంగ్ల దొరల మాటలకు మాత్రం అర్థాలు గ్యారంటీగా వేరు.*

ఇండియాను కబళించిన కాలపు ఈస్టిండియా కంపెనీ రికార్డులను ఇప్పుడు తిరగేస్తే ఎవరికైనా ఒకందుకు బోలెడు ఆశ్చర్యం వేస్తుంది. దశల వారీగా దేశాన్ని ఆక్రమించేందుకు తెల్లవాడు చేసిందల్లా మోసమే. ఆడిందంతా నాటకమే. అడుగడుగునా నయవంచనలే, అడ్డగోలు నమ్మక ద్రోహాలే. చిత్రమేమిటంటే తప్పుడు పనులేవీ సీమదొరలు చేయమనలేదు. ప్రతిదీ పద్ధతి ప్రకారం జరగాలనే, ఎక్కడా హద్దుమీరకూడదనే వారు ఉత్తర్వుల్లో నొక్కిచెప్పారు. ధర్మం తప్పకూడదనే వారు ప్రతీసారి అన్నారు. ఇదెలా జరిగింది? పై దొరలు అంత ధర్మమూర్తులైతే, వారికింద పనిచేసే ఉద్యోగులు అంతలేసి అధర్మాలకు ఎలా ఒడిగట్టగలిగారు? ఇందులో అసలు కిటుకు ఏమిటో మెకాలే దొర మాటల్లో వినండి.

The Directors never enjoined or applauded any crime. Whoever examines their letters will find an admirable code of political ethics. But every exhortation is nullified by demand for money. "Govern leniently and send more money; "practise strict justice and moderations towards neighbouring Powers, and send more money". Being interpreted, these instructions simply mean "Be the father and oppressor of the people, be just and unjust, moderate and rapacious. Hastings correctly judged that the safest course would be to neglect the sermons and to find the rupees"

**[*"Critical and Historical Essays"*, Lord Macauly,** *Vol. III p. 244*]

(ఫలానా నేరం చేయవలసిందని డైరెక్టర్లు ఎన్నడూ చెప్పలేదు. చేసిన ఏ నేరాన్నీ వారు శ్లాఘించనూ లేదు. వారు రాసిన ఉత్తరాలను చూస్తే రాజకీయ ప్రవర్తన నియమాల గురించి అత్యుత్తమమైన శ్రీరంగనీతులు కనిపిస్తాయి. కాని ప్రతి ఉద్బోధకు తోకలుగా 'డబ్బు పంపండి' అన్న డిమాండు చేర్చడంతో ధర్మసూత్రాలకు విలువ మన్నయింది. 'మెత్తమెత్తగా పాలించు; ఎక్కువ సొమ్ము పంపించు', 'కచ్చితంగా న్యాయప్రకారం వ్యవహరించు; పొరుగు రాజ్యాలతో సఖ్యంగా మెలుగు; ఇంకా ఎక్కువ సొమ్ము పంపించు'. ఈ ఆదేశాలు ఎలా ఉన్నాయంటే 'తండ్రిలా ఉండు; ప్రజలను అణచివెయ్యి', 'న్యాయంగా ఉండు; అన్యాయం చెయ్యి', 'అతిగా పోకు; అంతా దిగమింగు' - అన్నట్టు! వీటిలో నీతులను వదిలేసి రూకల సంగతే పట్టించుకోవటం మేలని హేస్టింగ్స్ సరిగానే అర్థం చేసుకున్నాడు).

బ్రిటిష్ ప్రజలు నీతికి, న్యాయానికి విలువ ఇచ్చేవారు కాబట్టి వారిని మభ్యపెట్టటానికేమో నీతి బోధలు. అసలు ఉద్దేశం ఈస్టిండియా కంపెనీకి లాభాలు మూటగట్టటం కాబట్టి ఇంకా ఇంకా పైకం పంపమని పురమాయింపుల ముక్తాయింపులు! న్యాయంగా ధర్మబద్ధంగా పోతే పైకం చిక్కదు కాబట్టి కిందివారు అన్యాయాలే చేశారు. అధర్మాలకే ఒడిగట్టారు! ద్రోహాలే చేశారు. దయ్యపు ఆకలితో జనాన్ని కాల్చుకునే తిన్నారు. ఆ తప్పుడు పనులన్నిటినీ కంపెనీ యజమానులు చూసీ చూడనట్టుగా పోయి సాధ్యమైనంత వరకూ అపరాధుల కొమ్ముకాశారు. వారి ఆంతర్యం ఏమిటో వారన్ హేస్టింగ్స్ లాంటి బతకనేర్చిన వారికి బాగాతెలుసు. అందుకే ఇండియాకి రెండోసారి వచ్చి గవర్నరు అయ్యీ కాగానే హేస్టింగ్స్ జంకూ గొంకూ లేకుండా డబ్బువేటలో పడి అడ్డమైన అన్యాయాలను నిరాఘాటంగా సాగించాడు.

నిజానికి సీమ వదిలి ఇండియా వచ్చేముందే కాగల కార్యాన్ని కంపెనీ దొరలతో అతడు మాట్లాడుకున్నాడు. పెత్తనం మనం చేస్తూ పరిపాలన మాత్రం దేశీయుల ద్వారా నడిపించే ద్వంద్వ విధానం ఇక కుదరదనీ... తోలుబొమ్మలాటను చాలించి, ముర్షిదాబాదులో నవాబు దర్బారును పక్కకు నెట్టేసి, మొత్తం ప్రభుత్వాన్ని మన చేతుల్లోకి తీసుకోవాలనీ అతడన్నాడు. ఏమి చేస్తావో మాకు తెలియదు; డబ్బు మాత్రం సంపాదించు అన్నారు కంపెనీ దొరలు.

ఇంకేం? వారన్ హేస్టింగ్స్ వచ్చీరాగానే రెచ్చిపోయి దేశం మీద పడ్డాడు. బెంగాల్, బీహార్, ఒరిస్సాల దివానీని 'కంపెనీ' వారు గుంజుకున్న దరిమిలా మొగల్ పాదుషా, అతడి సుబేదార్లు కీలు బొమ్మలై అధికారమంతా నాయిబ్‌ల చేతిలో ఉంది. నవాబుకు దివానుగా ఉండి పరిపాలన నడిపిస్తూ ఈస్టిండియా కంపెనీ వారికి పన్నులు వసూలు చేసి పెట్టటం వారి పని. 'నాయిబ్' పదవుల విశ్వామిత్ర సృష్టి చేసింది కంపెనీ వారే; ఆ పదవుల్లో వారు కూచోబెట్టిందీ కావలి కుక్కల్లాంటి నమ్మకస్థులనే.

హేస్టింగ్స్ వచ్చేనాటికి ముర్షిదాబాదులో మహమ్మద్ రజాఖాన్, పాట్నాలో రాజా సీతబ్‌రాయ్ నాయిబ్‌లుగా ఉన్నారు. ఇద్దరూ యుక్తాయుక్తాల గుంజాటన లేకుండా విదేశీయులకు అమ్ముడుపోయి కష్టకాలంలో తెల్లవారికి విశేషంగా సాయపడ్డవారే. అంతగా ఉపకారం చేశారు కాబట్టి హేస్టింగ్స్ మొదట వారికే అపకారం చేశాడు! ఇండియాకు రాగానే అతడు నందకుమార్ అనే రాజప్రముఖుడిని దువ్వి, నాయిబ్ దివాను మీద

గూడుపుఠాణి చేశాడు. ఈ నందకుమార్ ఎవరో కాదు, సిరాజుద్దౌలా నవాబుగా ఉన్న రోజుల్లో హుగ్లీ ఫౌజుదారుగా ఉండి, క్లయివ్‌తో కుమ్మక్కయి చంద్రనగర్ కోటను ఇంగ్లీషువారికి పళ్లెంలోపెట్టి ఒప్పగించిన ద్రోహి! ఆ సేవకు ప్రతిఫలంగా నాయిబ్ పదవి తనకే ఇస్తారని ఆశపెట్టుకున్నాడు. అది తనకి కాకుండా తన విరోధి మహమ్మద్ రజాఖాన్‌కు దక్కటంతో అతణ్ని ఎలాగైనా దెబ్బతీయాలని కంకణం కట్టుకున్నాడు. ఈ మధ్యకాలంలో ఇంగ్లీషువారికి వ్యతిరేకంగా, దేశీయశక్తులకు అనుకూలంగా కొంత వ్యవహారం నడిపాడు. కానీ వారన్ హేస్టింగ్స్ వచ్చి కన్నుగీటగానే చెంగున ఎగిరి వలలో పడ్డాడు. ఖాన్‌ను దింపేశాక నిన్నే నాయిబ్‌ను చేస్తానని తెల్లవాడు ఆశపెట్టగానే మురిసి, దర్బారు గుట్టుమట్లన్నీ చెప్పేశాడు. అతడి నుంచి కావలసిన సమాచారమంతా రాబట్టి, ఉద్వాసనకు రంగం చేశాక హేస్టింగ్స్ పోలీసులను పంపించి ముఖ్య వజీర్లుగా పరిపాలన సాగిస్తున్న రజాఖాన్, సీతబ్‌రాయ్‌లను అడ్డగోలుగా అరెస్టు చేయించాడు.

ఖైదులో అయితే వేశాడు. కాని వారిపై నేరం రుజువు చేయటం హేస్టింగ్స్ వల్ల కాలేదు. వారి పలుకుబడిని చూసి జనం హడలిపోతారని, వారి పని ఖాళీ అయినట్టు పూర్తి నమ్మకం చిక్కాక గానీ సాక్ష్యమిచ్చేందుకు ఎవరూ ముందుకు రారనీ చెప్పి విచారణను సంవత్సరం వాయిదా వేయించాడు. ఆ తరవాత కూడా ఒక్క అభియోగాన్నీ రుజువు చేయలేకపోవటంతో న్యాయస్థానం ఇద్దరినీ విడిచిపెట్టింది. సాక్ష్యం లేక కాదు – పది లక్షల రూపాయల లంచం పట్టి హేస్టింగ్సే నిధుల కైంకర్యం అభియోగాన్ని నీరుగార్చి వారిని తప్పించాడని నందకుమార్ అన్నాడు. అదేమోగాని నందకుమార్‌కు మాత్రం తెల్లవారికి ఎంత చాకిరి చేసినా ఆశించిన పదవి దక్కలేదు. ఇస్తాఇస్తానని ఊరించి మొండిచెయ్యి చూపి హేస్టింగ్స్ ఏకంగా నాయిబ్ పదవినే రద్దు పరచాడు. దేశీయ అధికారుల తెరను లాగిపారేసి, పన్నుల వసూళ్ళు, పరిపాలన యావత్తూ హస్తగతం చేసుకుని, ఇకపై కంపెనీయే దివానుగా వ్యవహరిస్తుందని ఏకపక్షంగా ప్రకటించేశాడు. ముర్షిదాబాదు దర్బారును మూయించి కోర్టులనూ, ఇతర కచేరీలనూ కలకత్తాకు మార్పించాడు.

నామమాత్రపు అధికారాలను కూడా లాగేసి భరణాన్ని అంతకంతకూ కోత పెట్టటంతో నవాబు అప్పటికే చచ్చిన పాము అయ్యాడు. అయినా మొగల్ పాదుషాతో లావాదేవీ కొనసాగుతూనే ఉంది. న్యాయప్రకారం ఈస్టిండియా కంపెనీది ఇంకా సామంత హోదాయే. పాదుషాకు సాలుసరి కప్పం కట్టి తీరాల్సిందే. దాన్నీ హేస్టింగ్స్ ఎగ్గొట్టాలనుకున్నాడు. ఎలాగా అని వెతికితే అతడికో సాకు దొరికింది. అంతదాకా అలహాబాద్‌లో సుజాఉద్దౌలా రక్షణలో తలదాచుకున్న షా ఆలం పాదుషా ఇంగ్లీషు వాళ్లేదో తనను ఉద్ధరిస్తారని ఆశపడి, ఎంతకీ లాభం లేకపోవటంతో మళ్లీ మరాఠాలకు చేరువై, వారి సాయంతో ఢిల్లీ తిరిగి వెళ్లాడు. తన రాజధానికి తాను తిరిగిపోతే అతడిని ఎవరూ తప్పుబట్టలేరు. దివాన్గిరీకి ప్రతిఫలంగా చెల్లిస్తామని ప్రమాణం చేసిన కప్పాన్ని చక్రవర్తి ఎక్కడున్నా కంపెనీవారు కట్టి తీరాల్సిందే. అతడి మకాం ఎక్కడ, అతడి సహాయకులు ఎవరు అన్నదానితో విదేశీ వర్తకులకు పనిలేదు. అయినా హేస్టింగ్స్ అడ్డం తిరిగి మాకు చెప్పకుండా అలహాబాద్ వదిలి, మరాఠాలతో చేయి కలిపాడు కాబట్టి పాదుషాకు కప్పం కట్టేది లేదన్నాడు. అంతేకాదు. క్లయివ్ కుదుర్చుకున్న ఒప్పందం ప్రకారం సొంత ఖర్చుల నిమిత్తం పాదుషాకు చెందాల్సిన అలహాబాద్, కోరా పరగణాలను కూడా అతడి నుంచి లాగేసి అయోధ్య వజీరుకు కట్టబెట్టాడు.



ఏ రకంగా చూసినా ఇది దుర్మార్గం. ప్రసిద్ధ ఆంగ్ల చరిత్రకారుడు జేమ్స్ మిల్ అన్నట్టు.

Generosity, had it any place in such arrangements, pleaded with almost unexampled strength in behalf of the forlorn Emperor... Justice too.. spoke on the same side... But these considerations were a feeble balance against the calls of want, and the heavy attraction of gold.

**[*The Historyof British India,* James Mill *Vol. III. p. 397*]**

(అలాంటి ఏర్పాట్లలో ఔదార్యానికి స్థానమనేది ఉంటే దీనావస్థలోని చక్రవర్తి తరపునే కనపరచాలి... న్యాయం కూడా అతడి పక్షానే ఉంది... కాని స్వార్థం, కనకం మీద వ్యామోహాల ముందు ఈ పరిగణనలకు విలువ లేకపోయింది.)

తాము ఎడమకాలు మోపటానికి పూర్వం ఉన్న దేశీయ పరిపాలనను నామరూపాలు లేకుండా చేసి, ఏకంగా చక్రవర్తి కప్పానికే ఎగనామం పెట్టాక తన సొంతానికీ కంపెనీకీ డబ్బులు ఎలా దండుకోవాలా అని ఆలోచిస్తే వారన్ హేస్టింగ్స్ కన్ను రోహిల్‌ఖండ్ మీద పడింది.

అయోధ్య రాజ్యాన్ని ఆనుకుని, కరమనసా నదికి అద్దరిని, నలువైపులా పర్వతపంక్తుల సహజ రక్షణలో సుభిక్షంగా ఉండేది రోహిల్లా ప్రాంతం. ఒకరి జోలికి పోకుండా, ఒకరి సొత్తును ఆశించకుండా రోహిల్లాలు తమ మానాన తాము కష్టపడి బతికేవారు. దేవుడి దయవల్ల పంటలు బాగా పండి అన్నోదకాలకు కొదవ లేకుండా సిరిసంపదలతో వారు సుఖంగా ఉన్నారు. 'వారి పద్ధతి చాలా మంచిది. వారివల్ల ఎవరికీ హానిలేదు. పరాయివారు తమ మీదికి దండెత్తితేనే సహజమైన దేశాభిమానంతో వారు ఏకమవుతారు' అని 1768లో ఇంగ్లీషు గవర్నరు వరల్సెట్స్ కూడా కంపెనీ వారికి నివేదించాడు. ఆ కాలంలో ఇతర రాజ్యాలు కొన్నిటివలె దురాక్రమణలకు, దుష్ట తలంపులకు పోకుండా ఒకరు రెచ్చగొట్టినా రెచ్చిపోకుండా రోహిల్లాలు అయోధ్య వజీరుతో స్నేహంగా ఉన్నారు. వారికీ వీరికీ మధ్య మైత్రీ ఒప్పందాన్ని ఇంగ్లీషువారే కుదిర్చారు. మీ ప్రాణానికి మా ప్రాణం అడ్డు అని మాట కూడా ఇచ్చారు. ఆ స్నేహ ధర్మంతోనే... 1773లో మరాఠాలు ఎన్ని ఆశలు పెట్టి, ఎంతగా కోరినా వజీరుకు వ్యతిరేకంగా వారితో చేతులు కలిపేందుకు రోహిల్లాలు సమ్మతించలేదు. వారి ప్రాంతం మరాఠా రాజ్యానికీ అవధ్‌కూ మధ్యలో ఉంది. అటు మీదుగా వెళ్లేందుకు తమకు దారి ఇమ్మని ఎంతగా అడిగినా ఒప్పుకోకపోవటంతో రోహిల్లాల మీద మరాఠాలు కత్తిగట్టారు. వారి రాజ్యం మీద మరాఠాల దండు విరుచుకుపడి నానా బీభత్సం చేస్తుంటే పొరుగు వజీరు కానీ, ఇంగ్లీషు పెద్దమనుషులు గాని రవంత సాయం చేసిన పాపాన పోలేదు. వానాకాలం దగ్గరపడ్డాక, కొన్ని ఇతర కారణాలవల్ల మరాఠా సేనలు వెనక్కి మరలాక మాత్రం నెత్తురోడుతున్న రోహిల్లా ఖండ్‌ను కబళించేందుకు మళ్లీ ఈ 'మిత్రులే' పాపిష్టి పథకాన్ని వేశారు.

మరాఠా దాడులనే మహాసముద్రాన్ని అడ్డుకునే చెలియలికట్టలా అంతదాకా రోహిల్‌ఖండ్ తనకు ఉపయోగపడిన మేలు మరిచి దాన్ని దిగమింగాలన్న దుర్బుద్ధి అయోధ్య వజీరుకు పుట్టింది. నలభై లక్షల రూపాయలు తమకిచ్చి ఖర్చులను పెట్టుకుంటే కావలసినంత సైన్యాన్ని

అతడికి అరువిచ్చి, రోహిల్లాలను నాశనం చేయటానికి వారన్ హేస్టింగ్స్ ఒప్పుకున్నాడు. 1773 సెప్టెంబర్‌లోనే వారణాసిలో ఈ సంధి కుదిరింది. కాని– ఇందులో రొహిల్లా జాతిని నిశ్శేషంగా నిర్మూలించడానికి సంబంధించిన షరతును మాత్రం హేస్టింగ్స్ చాలా రోజులు గోప్యంగా ఉంచాడు. ఈలోపు లేనిపోని నేరాలు మోపి, గిల్లి కజ్జాలు పెట్టుకుని 1774 ఏప్రిల్ 17న ఇంగ్లీషు సేనలు రోహిల్ ఖండ్‌లో అడుగుపెట్టాయి. రొహిల్లాలు పళ్ళ బిగువున పోరాడారు. ధైర్యసాహసాలు ఎంత ఉన్నా శత్రువుల సంఖ్యాధిక్యం ముందు తాళలేక ఓడిపోయి వారు శరణాగతులయ్యారు. ఎలాంటి షరతులకైనా ఒప్పుకుంటామని, తమను దయతలచి విడిచిపెడితే చాలునని వారు ఎంత దీనంగా వేడుకున్నా ప్రయోజనం లేకపోయింది. ఈ సమయంలో వారిని వదిలివేస్తే ఎప్పటికైనా కసి తీర్చుకోక మానరని వజీరుకు భయం పట్టింది. రోహిల్లాలను వారి దేశం నుంచి ఇళ్లూ వాకిళ్ల నుంచి పూర్తిగా తరిమేసి తీరాల్సిందేనని అతడు పట్టుబట్టాడు. అలా కొంపాగోడూ విడిచిపోయేకంటే అక్కడే పోరాడుతూ చచ్చిపోవటం మేలని రోహిల్లాలు నిశ్చయించుకున్నారు.

అప్పుడు జరిగింది మహాభయానకమైన జాతి హత్యాకాండ. బాబుల్‌నల్లా పర్వత పార్శ్వాల్లో చావుకు తెగించి బారులు తీరిన రొహిల్లా సేనలు కొన ప్రాణం దాకా పోరాడాయి. రెండు వేల సైనికులు నేలకొరిగిన మీదట నిస్సహాయులైన జనాన్ని చిన్నాపెద్దా ఆడామగా తేడా లేకుండా శత్రువులు నిలువునా నరికేశారు. పచ్చటి పొలాలు, జనావాస ప్రాంతాలు నెత్తుటితో తడిసి, వీధుల్లో పీనుగులు పోగుపడి, ఇళ్లు పాడుపడి, విందుల కోసం రాబందులు బారులు తీరాక పుణ్యకార్యం పూర్తయింది. శ్మశాన రాజ్యం వజీరుకు దక్కింది. కంపెనీ ఖజానాకు నిధుల ఆకలి తీరింది. హేస్టింగ్స్ దొర గల్లాపెట్టె గల గల లాడింది. 'అవసరమైతే రోహిల్లాలను సమూలంగా దుంపనాశనం' చేయాలన్న రహస్య ఒడంబడిక యథావిధిగా నెరవేరింది. దొరల మాట నిలిచింది. ఎవరికీ ఏ హానీ చేయకుండా స్వేచ్ఛగా పచ్చగా బతుకుతున్న జాతిని, నిష్కారణంగా నిశ్శేషంగా నిర్మూలించిన మహాపాపం కంపెనీ దొరల నీతుల సాక్షిగా మహా నాగరీకంగా జరిగిపోయింది.

విదేశీ చరిత్రకారులు, వారి అనుయాయులైన దేశవాళీ మేధావులు తిమ్మిని బమ్మి చేయాలని ఎంత తంటాలు పడ్డా రొహిల్లాల విషయంలో ఇంగ్లీషు వారు ఒడిగట్టింది నిష్కృతి లేని మహాపచారం. ఇంగ్లీషు సామ్రాజ్యవాదాన్ని కడు సమర్థంగా ఎండగట్టిన టోరెన్స్ వివరించినట్టు..

> We had not the slightest pretence of quarrel with the Rohillas... But Money was needed to meet exorbiant salaries and charges, and the Governor General made up his mind to pay the usury of blood. He accepted the money from dude and hired the company's troops to the Vizier, to sieze and expropriate Rohilcund. The liberties and lives of a friendly race were the price of the subsidy... Hastings pocketed £ 20,000 as a private present for signing the treaty, and the public treasury was replenished to the extent of £ 400,000.
>
> [*"Empire in Asia"*, **W.M. Torrens**, *p. 92*]



(రోహిలాలతో కలహించటానికి మనకు (ఆంగ్లేయులకు) ఈషణ్మాత్రమైనా కారణం లేదు. కాని కుంపిణీ వారి జీతబత్తేలకు, మితి లేని ఖర్చులకూ ఎంత డబ్బయినా చాలలేదు. దాంతో గవర్నర్ జనరల్ పొదుగుకోసి నెత్తురు తాగాలని నిశ్చయించుకున్నాడు. రోహిల్‌ఖండ్‌ను గుంజుకుని కబళించటానికి డబ్బు పుచ్చుకుని కంపెనీ సేనలను వజీరుకు అద్దెకిచ్చాడు. మనతో స్నేహంగా ఉన్న జాతి స్వాతంత్ర్యాన్ని, నిండు ప్రాణాలను ఇందుకోసం బలిపెట్టాడు... ఒప్పందం కుదుర్చుకున్నందుకు హేస్టింగ్స్ 20 వేల పౌండ్ల బహుమానాన్ని జేబులో వేసుకున్నాడు. కంపెనీ బొక్కసంలోకి నాలుగు లక్షల పౌండ్లు వచ్చిపడ్డాయి).

నెత్తుటి కూడు ఆరగించి జేబులు నింపుకోవటంతో వారన్ హేస్టింగ్స్ కథ సుఖాంతం కాలేదు. అతడి కష్టాలు అప్పుడే మొదలయ్యాయి.

# తెల్లోళ్ల న్యాయం

**వారన్ హేస్టింగ్స్‌కు నవ్వాలో ఏడవాలో అర్థంకాలేదు.**

**రోహిల్లా జాతిని దుంపనాశనం చేసి, 'కంపెనీ'కి నాలుగు లక్షల పౌండ్లు (తన జేబులోకి ఇరవైవేల పౌండ్లు) తెలివిగా రాబట్టిన చాకచక్యానికి బహుమానంగానా అన్నట్టు అతడికి గొప్ప ప్రమోషన్ అయితే వచ్చింది. అంతదాకా బెంగాల్‌కు మాత్రమే గవర్నర్‌గా ఉన్నవాడు కాస్తా 1773 రెగ్యులేటింగ్ చట్టం పుణ్యమా అని ఇండియాలో మిగతా రెండు ప్రెసిడెన్సీ (బొంబాయి, మద్రాసు)లకూ అధికారి అయ్యాడు. గవర్నర్ జనరల్ హోదా అయితే దాబుగానే ఉంది. కాని అందులోనే ఒక మెలిక ఉంది.**

కుర్చీ పెద్దదైనా అందులో అతడు నిరంకుశంగా పెత్తనం చెలాయించటానికి వీలులేదు. అతడి నెత్తిన ఒక కౌన్సిల్ ఉంటుంది. ఆ సుప్రీం కౌన్సిల్లో అతడుగాక నలుగురు సభ్యులు. వారిలో ఒకడు 'కంపెనీ' మనిషి కాగా ముగ్గురు బ్రిటిష్ ప్రభుత్వం చేత నియమితులైనవారు. వారు గవర్నర్ జనరల్‌కు తాబేదారులు కాదు. ఆ ముగ్గురిలో ఒకడు యథార్థవాది ఫిలిప్ ఫ్రాన్సిస్. అతడి పేరు చెబితేనే హేస్టింగ్స్‌కు హడలు!

మహావేత్తలైన మన చరిత్రకారుల దృష్టిలో వారన్ హేస్టింగ్స్ గొప్ప రాజనీతిజ్ఞుడు; దూరదృష్టి, కార్యదీక్షత కలిగిన పాలనా దురంధరుడు. అతనెంత యోగ్యుడో సీమ నుంచి దిగబడిన మెంబర్లు అంత అయోగ్యులు!?. మొదటినుంచీ హేస్టింగ్స్ మీద ద్వేషం కలిగి, చెప్పుడు మాటలువిని, తమ తాహతును అతిగా ఊహించుకుని అతడికి వారు (ముఖ్యంగా ఫ్రాన్సిస్) అడుగడుగునా అడ్డుతగలగా పాపం ఆ పెద్ద మనిషి ఓపికగా భరించి, ఒడుపుగా వ్యవహరించి, తన మంచితనంతో కౌన్సిల్‌పై పట్టు సంపాదించి, కార్యం సాధించాడని ఇంగ్లీష్ బళ్లో చదివిన మన మేధావుల నమ్మిక. బ్రిటిష్ హయాంలో భారత చరిత్ర గురించి మనవారు మనకు నూరిపోసిన అనేక ఇతర విషయాలలాగే ఇది కూడా శుద్ధ అబద్ధం. హేస్టింగ్స్‌తో ఫ్రాన్సిస్‌కు వ్యక్తిగత విరోధం ఏమీ లేదు. అతడు నీతికి, న్యాయానికి విలువ ఇచ్చే పెద్ద మనిషి. ఇండియాలో కంపెనీవారు చేస్తున్న ఆగడాలను, అరాచకాలను కర్జాకర్జిగా విని, యథేచ్ఛగా సాగుతున్న ఘరానా దొంగల దోపిడీని అరికట్టి తీరాలన్న కృతనిశ్చయంతో వచ్చినవాడాయన. ఇండియాలో పుట్టకపోయినా, భారతీయులకు చుట్టం కాక పోయినా ఇక్కడ జరుగుతున్న దారుణ దురన్యాయాలకు మనిషిలా స్పందించి, కౌన్సిల్‌లో తోటి మెంబర్లయిన జనరల్ క్లావరింగ్, మాన్సన్‌లను కూడగట్టి అవినీతి భాగోతాలను ఎండగట్టి, హేస్టింగ్స్‌ను అభిశంసన బోనులోకి నెట్టి దేశాన్ని మరింత నాశనం కాకుండా కాపాడినవాడు ఫ్రాన్సిస్.

కొత్త కౌన్సిల్ కొలువు తీరేసరికే దొరల దోపిడీల గురించి కంపెనీ వర్గాల్లో గోలగా ఉంది. ఏమి జరుగుతోందో దేశస్థులకూ తెలిసినా, అందరికీ ఒళ్లు మండుతున్నా ఎవరికి మొరపెట్టుకోవాలో తెలియక లోలోన ఉడికిపోతున్నారు. కొత్తగా సుప్రీం కౌన్సిల్ వచ్చిందని, అందులో మెంబర్లు స్వతంత్రంగా వ్యవహరించి పెద్ద దొరనైనా భరతం పట్టగలరని తెలిసే సరికి ఎక్కడెక్కడివారూ తెగువ తెచ్చుకున్నారు. తెల్లవారూ, నల్లవారూ ధైర్యంగా కౌన్సిల్ ముందుకొచ్చి గవర్నర్ జనరల్ అవినీతి, అక్రమాలపై అనేక ఫిర్యాదులు చేశారు. హేస్టింగ్స్ ఉపకారాలు చేస్తానని జమీందార్లనుంచీ, ఇతర ప్రముఖులనించీ బహుమానాల రూపంలో ఎంతెంత గుంజాడో, ఉద్యోగంలో ప్రమోషన్లకూ, కోరినచోట పోస్టింగులకూ కంపెనీ ఉద్యోగుల నుంచి ఎన్నెన్ని లంచాలు పట్టాడో, ఇంకా ఏఏరకాల అధికార దుర్వినియోగాలకు పాల్పడ్డాడో అన్నీ బయటపడ్డాయి. ఈ అభియోగాలను ఒకటొకటిగా సుప్రీం కౌన్సిల్ విచారిస్తూంటే వాటిని ఆలకించటమే తనకు పరువుతక్కువ అయినట్టుగా భావించి, వాటికి జవాబు చెప్పటం తన స్థాయిని కించపర్చుకోవటమేనని ప్రకటించి హేస్టింగ్స్ గైర్హాజరు అయ్యాడు. అయినా మిగతా మెంబర్లు లక్ష్యపెట్టకుండా అతడు లేకుండానే విచారణ కొనసాగించారు. సాక్ష్యాలు, రుజువులు అన్నీ పరీక్షించి అభియోగాలన్నీ పరిశీలించాక ఏకగ్రీవంగా ఆమోదించిన తీర్మానంలో సుప్రీం కౌన్సిల్ చెప్పిందేమిటంటే –

> There is no species of peculation from which the Governor General has thought it reasonable to abstain
>
> [*Empire in Asia*, **W.M. Torrens,** *p. 93*]

(గవర్నరు జనరలు ఈ దుర్ణయం చేశాడు, ఆ దుర్ణయం చేయలేదు అని చెప్పటానికి వీలు లేదు. ఫలానా పని చేయదగనిదన్న ఆలోచనే ఆయనకు లేదు).

అభియోగాలు విచారించి, అక్రమాలను ధ్రువపరచ్చుకున్నాక అయోధ్య వజీరుతో హేస్టింగ్స్ కుదుర్చుకున్న బేరాన్ని సుప్రీం కౌన్సిల్ తోసిపుచ్చింది. రోహిల్ ఖండ్‌నుంచి ఆంగ్లసేనను వెనక్కి పిలిపించింది. వారణాసి ఒప్పందాన్ని ధ్రువీకరించేందుకు నిరాకరించింది. కానీ వారన్ హేస్టింగ్స్ బెంబేలు పడలేదు. కౌన్సిల్ సభ్యులు అతడి అవినీతి భాగోతాలను రచ్చకీడ్చాక సీమలో గగ్గోలు పుట్టింది. పార్లమెంటులో చర్చ జరిగింది. అతణ్ని అభిశంసించడానికి రంగం సిద్ధమైంది.

అయినా హేస్టింగ్స్ హడలిపోలేదు. తన యజమానుల సంగతి అతడికి బాగా తెలుసు. వారు పలికే నీతి సూత్రాలు, విధాన ప్రకటనల్లో ఉత్తర్వుల్లో చెప్పే సుద్దులను సీరియస్‌గా తీసుకుని ఫ్రాన్సిస్‌లాంటి వెర్రివాళ్లు ఎన్ని గంతులేసినా చివరికి పైదొరలు తన కొమ్మే కాస్తారని అతడు ఎరుగును. ఆ ధైర్యం తోటే అడ్డగోలు లావాదేవీల్లో తాను పిక్కిన సొమ్ములోంచి

రెండు లక్షల పౌండ్లను తన లంచాల పురాణం సవిస్తరంగా బయటపెట్టాక కలకత్తా ట్రెజరీకి చప్పుడుకాకుండా జమ కట్టాడు. అతడు లంచగొండి, కన్నపుదొంగ అనడానికి ఆ ఒక్క రుజువే చాలు. అయినా – అంత సొమ్ము నీకెక్కడిది; ఇన్నాళ్లూ జేబులో వేసుకుని పార్లమెంటరీ అభిశంసన తప్పదనగా ఇప్పుడు జమకట్టడంలో అర్థమేమిటని కంపెనీ డైరెక్టర్లు నిగ్గదీసిన పాపాన పోలేదు.

వారేదో సత్యసంధులు. అవకతవకలు సహించని వారు అన్న భ్రమలో ఇక్కడ ఫ్రాన్సిస్, అతడి అనుచరులు హేస్టింగ్స్ దుమ్ముదులిపే పనిని కొనసాగించారు. సుప్రీం గవర్నమెంటు కత్తి ఎత్తింది; హేస్టింగ్స్ పని అయిపోయింది అనుకుని ఎక్కడెక్కడివారూ సాక్ష్యం చెప్పడానికి ముందుకొచ్చారు.

వారిలో మొదట చెప్పవలసినవాడు నందకుమార్. మహమ్మద్ రజాఖాన్ కేసులో తనను కరివేపాకులా వాడుకుని అవతల పారేసి, నాయిబ్ పదవిని అన్న ప్రకారం ఇవ్వకుండా మొండిచెయ్యి చూపింది మొదలుకుని అతడు హేస్టింగ్స్‌పై భగభగలాడుతున్నాడు. నవాబు దర్బారులో చాలాకాలం నుంచి ఉండి గుట్టుమట్లన్నీ క్షుణ్నంగా తెలుసుకున్నవాడు కాబట్టి హేస్టింగ్స్ తప్పులన్నీ ఏకరువు పెడుతూ కౌన్సిల్‌కు పిటిషన్‌ను పెట్టాడు. హేస్టింగ్స్‌కు స్వయంగా లంచాలిచ్చినవారు కూడా సాక్ష్యమిచ్చి అనేక ఆధారాలు చూపించారు. అన్నీ విన్నాక నందకుమార్ అభియోగం "sheds a clear light upon the Governor General's conduct and the means he had taken of making the large fortune he was said to posess- upwards of forty lacs of rupees - which he must have amassed in the course of three years" (గవర్నర్ జనరల్ నడతపైనా, మూడేళ్లలో నలభైలక్షల పై చిలుకు సంపద మూటగట్టడానికి అతడు అనుసరించిన పద్ధతులమీదా స్పష్టమైన వెలుగు ప్రసరించింది) అని 1775 ఏప్రిల్ 11న సుప్రీం కౌన్సిల్ మినిట్స్‌లో అధికారికంగా పేర్కొన్నారు.

దీంతో వారన్ హేస్టింగ్స్ పరువుపోయింది. కలకత్తాలో కౌన్సిల్‌వారు కదిలించిన కందిరీగల తుట్టె ప్రభావం సీమ దాకా పాకి, అక్కడ తనపై కత్తులు నూరుతున్న పార్లమెంటరీ పెద్దల చేతిలో నందకుమార్ పిటిషను పడితే పని ఖాళీ అని అతడు గ్రహించాడు. దీన్ని అడ్డుకునేందుకు ఏమి చేయాలా, పక్కలో బల్లెంలాంటి నందకుమార్ నోరు శాశ్వతంగా ఎలా నొక్కేయాలా అని ఆలోచిస్తే హేస్టింగ్స్ బుద్ధికి దివ్యమైన ఉపాయం తట్టింది.

ఇంగ్లీషు చట్టాలు ఇండియాలోని ఇంగ్లీషు జనాభాకూ, ఇంగ్లండు పరిపాలనలోని ప్రాంతాలకూ సక్రమంగా వర్తించేట్టు చూడటానికి 1773 రెగ్యులేటింగ్ చట్టం కింద సుప్రీం కోర్టు ఒకటి కలకత్తాలో వెలిసింది. దాని ప్రధాన న్యాయమూర్తి ఎవరో కాదు. వారన్ హేస్టింగ్స్‌కు చిరకాల మిత్రుడు, సహాధ్యాయి అయిన సర్ ఎలిజీ ఇంపే! ఇంకేం? నందకుమార్ ఆరేళ్లకింద ఏదో పత్రాన్ని ఫోర్జరీ చేశాడని ఎవరో అనామకుడి చేత ఆ కోర్టులో కేసు పెట్టించటం, నిమిషాలమీద కోర్టు వారంటు పుట్టించి నందకుమార్‌ని ఖైదులో వేయించడం ఆఘమేఘాల మీద జరిగిపోయింది.

ఇది దారుణం. సడి చేయకుండా కాన్సర్‌లా వ్యాపిస్తూ మెల్లిగా భారతదేశంలో ఒక ప్రాంతం తరువాత ఒకదాన్ని స్వాహా చేస్తున్న విదేశీ వర్తకుల మూకకు ఇండియా మీద రాజ్యాంగపరమైన అధికారం ఏమీ లేదు. ఈ దేశంలోని తెల్లతోలువారికి తెల్లచట్టాలను



వర్తింపజేయదలచుకుంటే అది వారి అంతరంగిక వ్యవహారం. కానీ– ఈ దేశంలోని పౌరుడిని తన దేశపు చట్టంకింద విచారించి, శిక్షించే అధికారం విదేశీయులకు ఎంత మాత్రం లేదు. పైగా నేరం జరిగిందటున్నది ఆరేళ్లకింద. అప్పటికి కోర్టు పుట్టలేదు. అది ఉటంకిస్తున్న చట్టమూ పుట్టలేదు. ఆ చట్టమూ, ఆ కోర్టూ పుట్టటానికి పూర్వం ఎప్పుడో జరిగిన అపరాధానికి వేరే దేశంలో వేరే దేశపు పౌరుడిపై కేసు పెట్టి ఖైదులో వేయటం అన్యాయం, అక్రమం అని బాధితుడి బంధువులు సుప్రీం కౌన్సిల్‌కు మొరపెట్టుకున్నారు. కౌన్సిల్‌లోని ముగ్గురు సభ్యులూ వారు చెప్పేది న్యాయమని అంగీకరించి, ఖైదీని వెంటనే విడిచి పెట్టాలని సుప్రీం కోర్టుకు ఉత్తర్వు చేశారు.

ఏం లాభం? ఆ ఆదేశాలను మన్నించే వారే లేకపోయారు. సుప్రీం కౌన్సిల్ ఆజ్ఞాపించినా సరే ఖైదీని వదలవద్దని వారన్ హేస్టింగ్స్ సిపాయిలను ఆదేశించాడు. తెల్లవాడు పెట్టిన సుప్రీం కౌన్సిల్ అధికారాన్ని కౌన్సిల్ సభ్యుడైన గవర్నర్ జనరలే తూష్ణీకరించినా తెల్లప్రభువులు కిమ్మనలేదు. ఈ ధిక్కారాన్ని ఫిలిఫ్ ఫ్రాన్సిస్ బృందం బ్రిటిష్ ప్రభుత్వానికి విన్నవించి, గవర్నర్ జనరల్‌పై అభియోగంలో కీలక సాక్షిని హతమార్చేందుకు జరుగుతున్న దురాగతాన్ని అడ్డుకోమని మొత్తుకుంది.

అది అరణ్యరోదనే అయింది. సుప్రీం కౌన్సిల్ సభ్యులు వద్దువద్దన్నా లెక్కచేయ్యకుండా నందకుమార్‌ను వేల జనం నిశ్చేష్టులై చూస్తుండగా ఉరితీశారు. ఇండియాలో బ్రిటిష్ రాజ్యస్థాపనకు ఫోర్జరీతో పునాది వేసిన క్లయివ్‌నేమో నెత్తి నెక్కించుకుని ఘన సన్మానాలు చేశారు. తమదారికి అడ్డొచ్చిన నల్లవాడినేమో ఫోర్జరీ నేరం బనాయించి చంపారు. అదీ దొరల న్యాయం.

నందకుమార్‌నైతే అడ్డగోలుగా చంపించాడు గానీ, స్వదేశంలో తన దుర్నీతిపై వ్యతిరేకత వెల్లువెత్తకుండా హేస్టింగ్స్ ఆపలేకపోయాడు. అతడు వరుసగా చేసిన తప్పుడు పనులపై సుప్రీం కౌన్సిల్ సభ్యుల ఫిర్యాదులు చూసి బ్రిటిష్ ప్రధాని లార్డ్ నార్త్ మండిపడ్డాడు. వెంటనే వారన్ హేస్టింగ్స్‌ను వెనక్కి పిలిపించాలనుకున్నాడు. అయితే చట్టప్రకారం ఈస్టిండియా కంపెనీ అడగకుండా గవర్నర్ జనరల్‌ను ప్రభుత్వం రికాల్ చేయడానికి వీలులేదు. ఆ కంపెనీ యజమాన్యమేమో ప్రధానమంత్రే పట్టుబట్టినా హేస్టింగ్స్ రీకాల్‌కు సిఫార్సు చేయలేదు. దానిపై ప్రధాని భగ్గుమని ఏకంగా కంపెనీ భరతమే పట్టడానికి పార్లమెంట్‌ను ప్రత్యేకంగా సమావేశపరచాలనుకున్నాడు. దాంతో కంపెనీ దొరలకు దిమ్మతిరిగి అంతకుముందే తెప్పించి ఉంచిన హేస్టింగ్స్ రాజీనామా పత్రాన్ని ప్రభుత్వానికి పంపారు. గవర్నమెంటు వెంటనే దాన్ని ఆమోదించి కొత్త గవర్నర్ జనరల్‌గా వేలర్‌ను నియమించింది. ఆయనవచ్చి చార్జీతీసుకునేంత వరకూ ఆ బాధ్యత నిర్వహించమని కౌన్సిల్ మెంబరైన జనరల్ క్లావరింగ్‌ను కోరారు.

అక్కడితో వారన్ హేస్టింగ్స్ పని అయిపోయిందని అనుకుంటున్నారా? పొరపాటు. రాజుకన్నా మొండివాడు బలవంతుడు. సీమలో తన తోక కోసి సున్నం పెడుతున్న సమయంలోనే ఇక్కడ ఇండియాలో సుప్రీం కౌన్సిల్ మెంబరు మాన్సన్ మరణించాడు. దాంతో బలాబలాలు మారిపోయి కాస్టింగ్ ఓటుతో హేస్టింగ్స్ పట్టుచిక్కించుకున్నాడు. చడామడా పాత కౌన్సిల్ నిర్ణయాలన్నీ కొట్టి పారేసి నిరంకుశంగా చెలరేగసాగాడు.

హేస్టింగ్స్ రాజీనామా చేశాడని కదా బ్రిటిష్ ప్రభుత్వం వేరొకరిని నియమించింది?

వారన్ హేస్టింగ్స్ తాను అసలు రాజీనామాయే చేయలేదు. ఆ కాగితం లండన్‌కు తాను పంపలేదు; ఎలా వెళ్లిందో తెలియదు అని బుకాయించాడు. రాజీనామాయే లేదు; కనుక ఖాళీయే ఏర్పడలేదు; దానిని పూరించే ప్రశ్నే ఉత్పన్నం కాదు అని వితండవాదానికి దిగాడు. ఆ వ్యవహారం సుప్రీం కోర్టుకు వెళ్లింది. సదరు కోర్టులో ఉన్నవాళ్లంతా హేస్టింగ్స్ నేస్తులే. కాబట్టి అతడు చెప్పిందే రైటని తల ఊపారు. ఇక చేసేది లేక సీమనుంచి కొత్తగా దిగబడ్డ వేలర్ గవర్నర్ జనరల్ అయ్యే యోగం లేక కౌన్సిల్‌లో మామూలు సభ్యుడిగా సెటిలైపోయాడు. హేస్టింగ్స్ దురాగతాలపై అవిశ్రాంత పోరాటం చేసి భారతీయులకు న్యాయం చేయాలని శాయశక్తులా ప్రయత్నించిన ఫిలిఫ్ ఫ్రాన్సిస్ ఏకాకి అయిపోయి, బద్ధ విరోధితో విధి లేక రాజీపడ్డాడు.

వ్యతిరేకుల నోళ్లు నొక్కి సుప్రీం కౌన్సిల్‌ను తన చెప్పుచేతల్లోకి తెచ్చుకోవటంతో హేస్టింగ్స్ మళ్లీ పులి అయ్యాడు. గడ్డుకాలంలో తనను కాదని తన విరోధులవైపు మొగ్గిన వారినల్లా పగపట్టి వేటాడాడు. ఆ క్రమంలో అతడి బారినపడ్డ వారిలో వారణాసి జమిందారు చైత్‌సింగ్ ఒకడు.

వారణాసి మొదట అయోధ్య వజీరుకింద ఉండేది. 1776 ఒప్పందం ప్రకారం వజీరు దాన్ని కంపెనీకి కట్టబెట్టాడు. రాజా బలవంత్‌సింగ్ హయాంలో వారణాసి సిరిసంపదలతో పచ్చని పంటలతో కళకళలాడుతూ వైభవంగా ఉండేది. ఎక్కడెక్కడినుంచో తరలి వచ్చే భక్తులు కాశీ విశ్వనాథుడికి సమర్పించే కానుకల రాసులతో సుసంపన్నంగా ఉన్న ఆ రాజ్యాన్ని చూసి చాలా మందికి కళ్లుకుట్టేది. బలవంత్‌సింగ్ మరణానంతరం అతడి కుమారుడు చైత్‌సింగ్ రాజయ్యాడు. అతడూ ఇంగ్లీషువారితో స్నేహంగా ఉంటూ, కట్టాల్సిన కప్పాన్ని సక్రమంగా కడుతూ, ప్రజల బాగోగులు కనిపెడుతూ మంచిపేరు తెచ్చుకున్నాడు. ఖర్మం చాలక అతడు కాస్తా హేస్టింగ్స్‌కు కంటగింపు అయ్యాడు.

ఆ సమయంలో ఫ్రాన్సుకూ ఇంగ్లండుకూ యుద్ధం జరిగింది. సాలుకు ఐదు లక్షల రూపాయల ఖర్చుతో మూడు బెటాలియన్లను తమకు సమకూర్చాలని హేస్టింగ్స్ అడిగాడు. చైత్‌సింగ్ సరేనన్నాడు. రెండేళ్లయిందో లేదో ఇంకో ఐదు లక్షలు పెట్టి ఆశ్విక దళాన్ని తయారు చేసి ఇవ్వాలని కంపెనీ వారు ఆర్డరు వేశారు. జమీందారు అది తనవల్ల కాదన్నాడు. హేస్టింగ్స్‌కు సందు దొరికింది. మామాటే కాదంటావా అని నిప్పులు చెరుగుతూ వారణాసి మీదికి దండు వెడలాడు. అది తెలిసి చైత్‌సింగ్ బెంబేలెత్తి ఎదురువెళ్లి బక్సార్‌లో గవర్నర్ జనరల్‌ను దర్శించి, తన తలపాగా తీసి అతడి పాదాలవద్ద ఉంచి, శాంతించమని వేడుకున్నాడు.

కాని- అవతలివాడు వారన్ హేస్టింగ్స్. అతడిది పాము పగ. శాంతివాక్కులు విన్నట్టేవిన్నాడు. వారణాసి చేరాక మళ్లీ బుసకొట్టి జమిందారును బంధించి తెమ్మని రాజభవనానికి సిపాయిలను పంపాడు. ఈ అఘాయిత్యం చూసి ఊరుకోలేక జనం తిరగబడి వచ్చిన వారిని నరికేశారు. హేస్టింగ్స్ అగ్గిమీద గుగ్గిలంలా భగ్గుమని ఈసారి పెద్ద సైన్యాన్ని పంపాడు. చైత్‌సింగ్ చేసేదిలేక కట్టుబట్టలతో రాత్రికి రాత్రి కోటవదిలి పారిపోయాడు. దారుణ దురవస్థలపాలై దేశాంతరంలో దయనీయంగా మరణించాడు. అతడి స్థానంలో ఓ కుర్రవాడిని గద్దెనెక్కించి, కట్టాల్సిన కప్పాన్ని విపరీతంగా పెంచేసి అన్ని వర్గాల ప్రజలను పిశాచంలా పీడించి పచ్చటి వారణాసిని హేస్టింగ్స్ నిప్పచ్చరం చేశాడు. ఐదు లక్షల జనంతో



కళకళలాడిన కాశీ జనాభా 1822 కల్లా రెండులక్షలకు పడిపోయింది. పంటలూ పరిశ్రమలూ పాడై దాని ఆర్థిక వ్యవస్థ వెన్నువిరిగింది.

మునుముందు మొత్తం భారతదేశానికి పట్టనున్న దుర్గతికి అది సాంపిల్ మాత్రమే.

చైత్‌సింగ్‌ను వెంటాడినట్టే అయోధ్యలో ముసలి బూబులనూ వారన్ హేస్టింగ్స్ అమానుషంగా వేధించాడు. వజీరు అసఫుద్దౌలా ఉప్పదించటంతో స్వయానా అతడి అమ్మనూ, అమ్మమ్మనూ చెరలో వేసి నగానట్రా ఎక్కడ దాచింది చెప్పేదాకా అన్నం పెట్టకుండా మాడ్చి కోట్లరూపాయల సొత్తు నిలువునా దోచుకున్నాడు.

ఇలాంటి దుర్మార్గాలను ఎన్ని చేస్తేనేమి? వారన్ హేస్టింగ్స్‌ను దొరల దర్బారు కడుపులో పెట్టుకుని కాపాడింది. ఎడ్మండ్ బర్క్, షెరిడన్ లాంటి చాదస్తపు ప్రజాసామ్యవాదులు పట్టువదలకుండా అనేక సంవత్సరాలు గట్టిగా పోరాడి కామన్స్ సభ చేతైతే హేస్టింగ్స్ దోషి అని అభిశంసింపజేయగలిగారు. ఏం లాభం? కామన్లు ఒకటి తలిస్తే దొరలు వేరొకటి తలిచారు. నీతి, న్యాయం కంటే సామ్రాజ్యవాద స్వార్థ ప్రయోజనాలది పై చేయి అయ్యింది. 'దొరల సభ' (హౌస్ ఆఫ్ లార్డ్స్)లో అభిశంసన జయప్రదంగా ఎగిరిపోయింది. శుభం!

# హైదరాలీ

హిందూదేశాన్ని ఆక్రమించిన విదేశీయుల వరసలో ముస్లింల తరవాతి వారు ఆంగ్లేయులు. దీన్నిబట్టి ముస్లింలతో పోరాడి తెల్లవాళ్లు దేశాన్ని గెలుచుకున్నారని అనుకుంటే పొరపాటు. ఆరు శతాబ్దాల ఇస్లామిక్ ఆధిపత్యం అనంతరం మోసాలు, దగాలు చేసి దుర్మార్గంగా, దౌర్జన్యంగా దేశాన్ని దశలవారీగా కబళించే క్రమంలో మహమ్మదీయులతో పోరాడాల్సిన అవసరం ఇంగ్లీషు వారికి పెద్దగా పట్టలేదు. వారి యుద్ధాలన్నీ ముఖ్యంగా మహారాష్ట్రులు, జాట్లు, సిక్కులు, గూర్ఖాలు వగైరా హిందువులతోనే జరిగాయి. మొత్తం మీద చూస్తే ఆ కాలంలో నవాబులు, సుల్తాన్లు విదేశీ దురాక్రమణపై చెయ్యి ఎత్తడం కంటే దురాక్రమణదారులతో చేతులు కలపడమే ఎక్కువగా కనిపిస్తుంది. అయితే ఈ సాధారణ రీతికి మినహాయింపుగా చెప్పదగిన మహమ్మదీయ పాలకులూ కొందరున్నారు. వారిలో ముఖ్యంగా పేర్కొనవలసిన వారిలో హైదరాలీ ఒకడు.

హైదర్‌కూ ఇంగ్లీషు వారికీ మధ్య అనేక యుద్ధాలు జరిగాయి. వాటిలో ఏ ఒక్కదానిలోనూ తెల్లవాళ్లు గెలవలేదు. మహమ్మదీయులు ఆరు శతాబ్దాలు దేశంలో పెత్తనం చలాయించినా హిందూ రాజ్యమైన మైసూరును మాత్రం వారిలో ఏ ఒక్కరూ వశపరచుకోలేకపోయారు. మహామహా అక్బర్లు, ఔరంగజేబులవల్లే కాని పనిని హైదర్ అవలీలగా సాధించాడు. శక్తి సామర్థ్యాలకంటే ఎక్కువగా అదృష్టం అతడికి కలిసి వచ్చింది.

హైదరాలీకి రాజ్యం జన్మతః సంక్రమించింది కాదు. అతడు రాచబిడ్డ కాడు. చదువుకున్నవాడు కాదు. మామూలు కుటుంబంలో పుట్టి సామాన్య సిపాయిగా జీవితం మొదలెట్టి క్రమేణా సేనాపతి అయి కడకు రాజ్యాధిపత్యమే గుంజుకోగలిగాడు. తూర్పు, పశ్చిమ కనుమల కూడలిలోని, మైసూరు రాజ్యం వొడియార్ వంశ పాలనలో మూడు శతాబ్దాలు దివ్యంగా వెలిగి 18వ శతాబ్ది ప్రథమ పాదానికి క్షీణదశకు చేరింది. పాలెగాళ్లు, 'నాయకు'లు చెలరేగి అందిన కాడికి వొల్లుకుని స్వతంత్ర సంస్థానాలు స్థాపించారు. మహారాజు చిక్క కృష్ణరాజు అసమర్థుడై మంత్రుల చేతిలో కీలుబొమ్మ అయ్యాడు. దేవరాజు, నంజరాజులనే సోదరులు సైన్యాన్ని, పరిపాలనను గుప్పిట్లో పెట్టుకుని చక్రం తిప్పుతున్నారు. వారి సేనలో హైదర్ మామూలు సిపాయి. తిరుచునాపల్లి యుద్ధంలో అతడి పరాక్రమానికి సంతోషించి నంజరాజు అతడిని 1755లో దిండిగల్లు ఫౌజ్‌దారుగా నియమించాడు.

హైదర్ నిరక్షరకుక్షి. రాతకోతల వ్యవహారాలు చేసేందుకు అతడికి మనిషి కావలసి వచ్చాడు. ఖండేరావు అనే మరాఠా బ్రాహ్మణుడిని దివానుగా పెట్టుకున్నాడు. అతడు అసాధ్యుడు. పెద్ద పెద్ద వాళ్లతో మంచి పరిచయాలున్న వాడు. అతడికి మైసూరు రాజమాత తెలుసు. పేరుకు రాజయినా పెత్తనానికి నోచుకోని తన కుమారుడిని నంజరాజు చెరనుంచి తప్పించడానికి సమర్థుడి కోసం అప్పుడు ఆమె వెతుకుతున్నది. హైదరాలీ అందుకు తగిన మనిషని ఆమెకు తోచింది. ఖండేరావు ద్వారా కథ నడిపింది. 1759 మార్చిలో కుట్ర ఫలించింది.

హైదర్ మెరపులా కదిలి శ్రీరంగపట్నం కోటను ఆక్రమించి నంజరాజును గెంటేశాడు. రాజు చాలా ఆనందించి ఇక తన మాటకు ఎదురుండదని ఆశపడ్డాడు. కాని కథ అడ్డం తిరిగింది. నంజరాజు పోయినా రాజుకు పరాధీనపు బతుకు తప్పలేదు. పాత పెత్తందారును తరిమివేసి అతడి స్థానంలో కొత్త పెత్తందారు వచ్చి కూచున్నాడు.

పని పూర్తికాగానే తన దారిన తిరిగి పోకుండా హైదరాలీ సర్వాధికారిగా తిష్ఠవేయటం రాజుకూ, రాజమాతకూ నచ్చలేదు. మిగతా గొడవలు ఎలా ఉన్నా మనుపటి కంటకులు కనీసం హిందువులు. వారిని వదిలించుకోబోయి హిందువులను కాఫిర్లుగా చూసే మహమ్మదీయుడి చేతిలో రాజ్యాన్ని పెట్టామేమిటా అని రాచవారు తల పట్టుకున్నారు. మళ్లీ ఖండేరావును తమవైపు తిప్పుకుని కొత్త తంత్రం పన్నారు.

అవి పీష్వా బాలాజీరావు దక్షిణాన కన్నడ దేశానికి ప్రాబల్యం విస్తరించాలని బహుధా ప్రయత్నిస్తున్న రోజులు. బలవంతంగా అధికారం లాక్కున్న ముసల్మాను బారి నుంచి మైసూరు రాజ కుటుంబాన్ని రక్షించటానికి ఖండేరావు మరాఠాలను ఒప్పించాడు. మరాఠా సేనలు మైసూరుకు వెళ్లాయి. వాటి మెరపు దాడికి తట్టుకోలేక హైదరాలీ కుటుంబాన్ని కూడా విడిచి కట్టుబట్టలతో పారిపోయాడు. పెత్తనం ఖండేరావు చేతికి వచ్చింది. హైదరాలీ పని అయిపోయిందనే అందరూ అనుకున్నారు.

సరిగా ఆ సమయంలోనే మూడవ పానిపట్టు యుద్ధంలో అహ్మద్‌షా అబ్దాలీ చేతిలో మరాఠాలకు ఘోర పరాజయం సంభవించింది. మహాయోధులు దాదాపు అందరూ నేలకొరిగి, ఒక తరానికి తరమే తుడిచిపెట్టుకుపోయింది. దాంతో ఎక్కడెక్కడి సేనలనూ ఉన్న పళాన రాజధానికి తిరిగి రమ్మన్నారు. మరాఠాలు అర్ధంతరంగా వెనుదిరగడంతో హైదర్‌కి దశ తిరిగింది. బంధుమిత్రుల సాయంతో అతడు తెప్పరిల్లాడు. ముఖ్యులైన దండ నాయకులంతా తనతో చేతులు కలిపినట్టుగా దొంగ ఉత్తరాలు బనాయించి వాటిని ఖండేరావు చేతిలో పడేలా చేశాడు. అది నిజమే అనుకుని బెంబేలెత్తి ఖండేరావు యుద్ధరంగం వీడి శ్రీరంగపట్నానికి పరారయ్యాడు. ఆ గందరగోళంలో అతడి సేనలను జయించి హైదర్ రాజధానిపై దండెత్తాడు. చేసేది లేక రాజు చేతులెత్తాడు. అలా 1761లో హైదర్ మళ్లీ మైసూరును వశపరచుకున్నాడు.

మరి ఖండేరావు ఏమయ్యాడు? హైదర్ మళ్లీ అతణ్ని తనకు ఒప్పగించమన్నాడు.

ఎం.వి.ఆర్.శాస్త్రి

రాచవారు ఒప్పుకోలేదు. అప్పజెపితే అతడు ఖండేరావును ఖండాలుగా నరికేస్తాడని వారు భయపడ్డారు. అతడికి హాని చెయ్యను; నా పెంపుడు చిలుకలా చూసుకుంటాను అని హైదర్ వారికి మాట ఇచ్చాడు. స్వాధీన పరిచాక అచ్చం చిలుకలాగే అతడిని చూసుకున్నాడు! ఇనుప పంజరంలో బంధించి, చిలకకి పెట్టే తిండే పెట్టి, జీవితాంతం సతాయించాడు!

రాజ్యాన్ని జయించినా హైదర్ తనను రాజుగా ప్రకటించుకోలేదు. కీలుబొమ్మ రాజరికాన్ని మునుపటిలాగే కొనసాగించి, మనోవర్తి మాత్రం ఇచ్చి రాజును మూల కూచోబెట్టి సర్వాధికారాలు తాను చలాయించాడు. హైదర్‌ది కుశాగ్ర బుద్ధి. చదువు సంధ్యలు లేకపోయినా తెలివితేటలు అమోఘం. పిట్టల పోరును పిల్లి తీర్చినట్టుగా తన కాలంలో ఇంగ్లీషువారు బెంగాలులోనూ, ఇతరత్రా సంస్థానాల గొడవల్లోనూ తలదూర్చి, తెలివిగా పావులు కదిపి అందరినెత్తినా చెయిపెట్టి ఎలా బాగుపడుతున్నదీ హైదర్ జాగ్రత్తగా గమనించాడు. సమయం చిక్కినప్పుడు అవే ఎత్తులు తానూ వేశాడు. ప్రాబల్యం విస్తరించుకోవాలని ప్రయత్నిస్తున్న కాలంలో బంగారం లాంటి బేదనూరు సంస్థానం నడిచి వచ్చి అతడి నోట్లో పడింది.

బేదనూరు సంస్థానాన్నేలిన బసవప్ప నాయకుడు మరణించాక అతడి రాణి వీరమ్మాజి బాలుడైన దత్తపుత్రుడిని ప్రియుడి సాయంతో చంపించి రాజ్యం చేజిక్కించుకున్నదని జనం చెప్పుకుంటారు. తానే ఆ బాలుడినని, హత్యాయత్నం తప్పించుకుని పరారై ఇన్నాళ్లూ రహస్యంగా తల దాచుకున్నానంటూ ఎనిమిదేళ్ల తరవాత ఒక కుర్రాడు హైదరాలీని ఆశ్రయించాడు. తనకు సాయపడి తన రాజ్యం తనకు ఇప్పించాలని ప్రార్థించాడు. హైదర్ సరే అన్నాడు. అసలైన వారసుడి రాజ్యాధికారాన్ని నిలబెట్టటానికంటూ బేదనూరు మీదికి దండెత్తాడు.

వీరనారి వీరమ్మాజి పురుష వేషంలో స్వయంగా సేనలను నడిపించి సంవత్సరం పాటు భీకర యుద్ధం చేసింది. చివరికి ఓడిపోయి హైదర్ చేతిలో బందీ అయింది. హైదర్ విజయగర్వంతో నగరంలో అడుగుపెట్టి కోటలోని సంపదనంతా దోచుకున్నాడు. పన్నెండు కోట్ల రూపాయలకు పైగా సొత్తు చేతికి చిక్కటంతో హైదర్‌కు డబ్బు కరవు తీరింది. అనుకున్న ప్రకారం తనకు పట్టం కట్టి అతడు తన దారిన పోతాడని రాజకుమారుడు ఆశగా ఎదురు చూశాడు. హైదరాలీ అతడికి మొండి చేయి చూపాడు. వాడు అసలు వారసుడు కాదు - నకిలీ రాజకుమారుడు అని చల్లగా ప్రకటించి ఖైదులో వేసి సంపన్న సంస్థానాన్ని తన రాజ్యంలో కలిపేసుకున్నాడు. తన గుర్తుగా బేదనూరు పేరును హైదర్ నగర్‌గా మార్చాడు!

ఇలా మూడేళ్లపాటు సక్రమంగానో, అక్రమంగానో... యుద్ధాలు చేసో, వ్యూహాలు పన్నో హైదరాలీ చిన్నచితకా సంస్థానాలను వశపరచుకుని తన ఆధిపత్యాన్ని ఉత్తరాన తుంగభద్ర దాకా, పశ్చిమాన ఆరేబియా సముద్రం దాకా, తూర్పున నైజాం రాజ్యందాకా విస్తరించగలిగాడు. అంతవరకూ వింధ్యకు దక్షిణాన రాజకీయం మహారాష్ట్రులు, యూరోపియన్లు, నైజాంలనే మూడు స్కంధావారాల చుట్టూ తిరిగింది. 18వ శతాబ్ది ద్వితీయార్థంలో హైదరాలీ చొచ్చుకురావటంతో రసవత్తరమైన నాలుగు స్తంభాలాట మొదలైంది.

ఇందులోనూ అతి ప్రధానశక్తి మరాఠాలది. వారి ప్రాబల్యాన్ని నిలువరించేందుకు మిగతా పక్షాల నడుమ రకరకాల సమీకరణలు జరిగాయి. అనంతర కాలంలో ఇంగ్లీషు వారిపై కత్తి కట్టి కడదాకా భీషణ సంగ్రామం సాగించినప్పటికీ తొలి దశలో హైదరాలీకి తెల్లవారి



మీద చాలా భ్రమలుండేవి. వారితో రాజీలు పడి, నైజాంనూ కలుపుకొని మరాఠాలపై అతడు చాలా యుద్ధాలు చేశాడు. ఎలాగైనా మహారాష్ట్రులను పరాభవించాలని హైదరాలీకి మహా కోరికగా ఉండేది.

మహారాష్ట్రులకూ ఆదినుంచీ అతడంటే మంట. దానికి చాలా కారణాలున్నాయి. తమకు సామంతరాజ్యంగా ఉండి, 'చౌథ్' కప్పం కడుతూ తమ రక్షణలో ఉన్న మైసూరులో మహమ్మదీయుడొకడు అధికారాన్ని దౌర్జన్యంగా లాగేసుకోవటం మరాఠాలకు సహజంగానే కంటగింపయింది. ఖండేరావుకు మద్దతుగా వెళ్లి పానిపట్టు యుద్ధం మూలంగా హుటాహుటిన వెనక్కి రావలసి వచ్చిన సందర్భంలో హైదర్ నుంచి తాము రాబట్టిన బారామహల్ పరగణాను తాము వెనుదిరగగానే అతడు తిరిగి లాగేసుకున్నాడు. పైగా పానిపట్టు ఘోరకలితో నవనాడులూ కుంగిన అస్తవ్యస్త స్థితిలో మరాఠాల బలహీనతను అలుసుగా తీసుకుని హైదర్ చెలరేగి అనేక మరాఠా ప్రాంతాలను కబ్జా చేశాడు.

ఇక ఉపేక్షించి లాభం లేదని పీష్వా మాధవరావు అతడిపై దండయాత్రకు దిగాడు. 1764 మొదలుకుని 1779 దాకా హైదర్‌కూ మరాఠాలకూ మధ్య అనేక యుద్ధాలు జరిగాయి. 1764లో రాతిహళ్లి యుద్ధం నుంచి 1771లో శ్రీరంగపట్నం సమీపాన సంగ్రామం దాకా మాధవరావు పీష్వా చేతిలో హైదర్ ప్రతిసారీ చావుదెబ్బలే తిన్నాడు. చావు తప్పి కన్ను లొట్టపోయిన స్థితిలో రఘునాథరావును బుట్టలో వేసుకుని తేలికపాటి షరతులతో సంధి కుదుర్చుకుని బయటపడటం, మళ్లీ సందు చిక్కినప్పుడల్లా మరాఠా ప్రాంతాలను దురాక్రమణ చేయటం, మళ్లీ యుద్ధంలో మట్టి కరవటం అతడికి పరిపాటి అయింది. హైదర్ అదృష్టం బాగుండి పీష్వా మాధవరావు అకాల మృత్యువు పాలయ్యాడు. అనంతరం పుణె దర్బారులో అంతఃకలహాలు, పీష్వా నారాయణ రావు హత్య, తరువాత కొంతకాలం దాకా రఘునాథరావు ప్రభ వెలగటం హైదర్‌కు బాగా లాభించాయి. దర్బారు గొడవలు, అంతర్గత సమస్యలలో మరాఠాలు తలమునకలు కావడాన్ని ఆసరా చేసుకుని, విజృంభించి, గతంలో మాధవరావు వశపరచుకున్న ప్రాంతాలన్నిటినీ తిరిగి స్వాధీనం చేసుకోవటమేగాక అదనంగా బళ్లారి, కడప, గుత్తి, కర్నూలులను కూడా అతడు ఆక్రమించాడు.

పుణెలో పరిస్థితులు నెమ్మదిగా కుదుటపడ్డాక నానా ఫడ్నవిస్ తలచుకుంటే హైదర్ దురాక్రమణను తిప్పికొట్టి ఆ ప్రాంతాలను తిరిగి జయించగలిగేవాడే. అయితే రఘునాథరావును శిఖండిలా అడ్డుపెట్టుకుని ఇంగ్లీషువారు భారీఎత్తున సాగిస్తున్న కుటిల పన్నాగాలను సమర్థంగా ఎదుర్కోవాలంటే దేశీయ శక్తులను కూడగట్టడం అవసరమన్న దూరదృష్టితో దురాక్రమణలను ఉపేక్షించి, నానా అతడికి స్నేహ హస్తం చాచాడు. సామంతరాజ్యంగా మైసూరు తనకు కట్టాల్సిన కప్పాన్ని బాగా తగ్గించి... హైదర్ ఆక్రమించిన ప్రాంతాలను అతడికే వదిలేసే షరతుమీద చిరకాల వైరం తరవాత హైదర్‌కూ నానాకూ 1780లో సంధి కుదిరింది. విదేశీ దురాక్రమణదారులపై చరిత్రాత్మకమైన ఆ జాతీయ పోరాటం ఎలా సాగిందీ, హైదర్ చిచ్చర పిడుగులా తెల్లవారిని ఎలా ముప్పుతిప్పలు పెట్టిందీ ఇంతకు ముందు అధ్యాయంలో చూశాం.

హైదరాలీ ఇంగ్లీషువారి భరతం పట్టటం అదే మొదలు కాదు. మరాఠా జవనాశ్వాల ధాటికైతే నిలవలేకపోయినా, 'కంపెనీ' ఫిరంగులకు ఎదురొడ్డి అతడు వీరోచిత దిగ్విజయాలు చాలానే సాధించాడు. నానా ఫడ్నవిస్ వలె హైదర్ రాజనీతిజ్ఞుడు కాదు. మరాఠాలకున్నంతగా

దేశభక్తి, జాతీయభావం అతడికి ఉన్న దాఖలాలు కనపడవు. మరాఠాలనే తన ముఖ్య విరోధులుగా తలిచి, వారిని జయించటానికి ఇంగ్లీషువారి సహాయం పొంది, వారితో మంచిగా ఉండాలని అతడు చాలాకాలం ప్రయత్నించాడు. 1767లో వారు తనపై అకారణంగా కత్తిఎత్తి, బారామహల్ పరగణాపై దుర్మార్గంగా దాడిచేసినా, మిత్రభేద కుతంత్రాలతో నిజాంనూ, ఆర్కాట్ నవాబునూ తననుంచి వేరుపరచి, తనను ఏకాకిని చేసినా... తాను సంధికి సిద్ధమైనప్పటికీ ఒప్పుకోక తనను పగబట్టినట్టు వెంటాడినా హైదర్ రెచ్చిపోలేదు. మద్రాసు పొలిమేరదాకా దూసుకువెళ్లి తలచుకుంటే చెన్నపట్నాన్ని జయించి, ఇంగ్లీషువారిని కాలరాచివేయగలిగిన స్థితిలో కూడా ఆంగ్లేయుల పట్ల ఔదార్యం చూపి 1769 ఏప్రిల్‌లో కంపెనీ వారితో తనకు పెద్దగా ఫాయిదాలేని సంధి కుదుర్చుకున్నాడు. ఏం లాభం? తెల్లవారు అక్కర తీరగానే తమ సహజశైలిలో మైసూరు వీరుడిని మోసం చేశారు. మూడేళ్ల తరువాత మరాఠాలతోయుద్ధం వచ్చినప్పుడు ఇంగ్లీషువారి సైనిక సహాయం మీద హైదర్ పెద్ద ఆశలు పెట్టుకోగా డబ్బు లేదన్న సాకుతో దొరలు నిలువునా ముంచారు.

కుక్కతోక కంటే కంపెనీవారి బుద్ధి ఎక్కువ వంకర. ఆ సంగతి అనుభవపూర్వకంగా అర్థమయ్యాక హైదరాలీ అగ్గిపిడుగే అయ్యాడు. ఇక అతడు తెల్లవారిపై ఎత్తిన కత్తి దించలేదు. ఎక్కడా రాజీపడలేదు. 1780లో నానా చేసిన ప్రతిపాదనలకు అతడు మనస్ఫూర్తిగా అంగీకరించాడు. తనవంతు కర్తవ్యాన్ని అద్భుతంగా నిర్వర్తించి మద్రాసు ప్రెసిడెన్సీని ముట్టడించి, ఊరూవాడా తగులబెట్టి ప్రచండ ప్రతాపంతో శత్రుసంహారం చేసి ఇంగ్లీషువారికి ముచ్చెమటలు పోయించాడు. అతడు నమ్ముకున్న ఫ్రెంచివారు సమయానికి కదిలి అన్నప్రకారం నౌకాదళాన్ని మద్రాసు తీరానికి పంపివుంటే హైదరాలీ ఆంగ్లేయులను తరిమికొట్టి మద్రాసు కోటపై జండా ఎగురవేసేవాడే.

కానీ - పరాసులు మాటతప్పారు. విధి కూడా వక్రించింది. ఆంగ్లేయులపై హోరాహోరీగా పోరాడుతున్న సమయంలో యుద్ధం అత్యంత కీలకఘట్టంలో ఉండగా, హైదరాలీ జబ్బుపడి 1782 డిసెంబరు 7న 70 ఏళ్ల వయసులో ఆకస్మికంగా కన్నుమూశాడు.

హైదరాలీ చావు జాతీయ ఐక్యపోరాటానికి కూడా చావుదెబ్బ అయింది. 'కంపెనీ' ప్రలోభాలకు లొంగి నిజాం మధ్యలో జారుకున్నా... బేరార్ పాలకుడు, మాధవరావు సింధియాలు నమ్మక ద్రోహానికి పాల్పడ్డా... ఇంకా ఎన్ని ఎదురుదెబ్బలు తగిలినా నానా ఫడ్నవిస్ బేజారవలేదు. హైదరాలీ ఒక్కడు బాసటగా ఉంటేచాలు, తాము విదేశీయుల పీచమణచగలమని అతడు ధీమాగా ఉన్నాడు. హైదర్ అకాల మరణంతో ఆ ఆశా పోయింది. హైదర్ కుమారుడు టిప్పు తండ్రి పోరాటాన్ని కొనసాగిస్తాడన్న నమ్మకం లేక, ఇంకోదారి తోచక అప్పటికి ఏళ్లుగా పెండింగ్‌లో ఉంచిన సాల్బే సంధిని నానా ధ్రువీకరించాడు.

ఆ విధంగా ఉమ్మడి జాతీయ పోరాటం అభాసుగా ముగిసింది. తెల్లవారికి గండం గడిచింది.



# టిప్పుసుల్తాన్ మతోన్మాదా?

**టిప్పుసుల్తాన్.**

**ఆ పేరు చెబితే అందరికీ హడలు.**

**ఇంగ్లీషువారికి మరీనూ. ఆ కాలంలో సీమ దొరసానులు ఏడ్చే పిల్లలను సముదాయించటానికి 'టిప్పు వచ్చి పట్టుకుపోతాడు' అని భయపెట్టేవారట.**

**పసి పిల్లలకే కాదు. కొమ్ములు తిరిగిన విదేశవాళీ చరిత్ర పండితుల దృష్టిలో కూడా టిప్పు అనేవాడు బూచాడే! మతోన్మాదం పొరలు కమ్మిన నీచ, నికృష్ట, నరరూప రాక్షసుడే.**

So many instances have been given of the atrocities which Tipu committed in the name of religion... In this respect he rivalled Mahmud of Ghazni, Nadir Shah and Alauddin- all of whom were famous for the number of infidels slaughtered by their orders.

**[*Haidar Ali and Tipu Sultan* - Lewin Bowring. *p.226*]**

మతం పేరిట టిప్పుసుల్తాన్ చేసిన 'అత్యాచారాలకు ఎన్నయినా ఉదాహరణ లివ్వవచ్చు... ఈ విషయంలో అతడు కాఫిర్లను ఊచకోత కోయించి ఘనతకెక్కిన గజనీ మహ్మద్, నాదిర్‌షా, అల్లా ఉద్దీన్‌లకు సమఉజ్జీ.

- అంటాడు ప్రసిద్ధ ఆంగ్ల చరిత్రకారుడు **లెవిన్ బౌరింగ్.** గజనీ మహ్మద్, నాదిర్షాలు ఎలాంటివారో... దేవాలయాలను కూల్చి హిందువులను వేల సంఖ్యలో నిష్కారణంగా హతమార్చి, మతోన్మాదంతో ఎన్నెన్ని అఘాయిత్యాలను సాగించారో మనకు తెలుసు. హిందూ మతాన్ని ద్వేషించి, వెంటపడి, వేటాడి మెడపై కత్తి పెట్టి లక్షల మందిని బలవంతంగా మతం మార్పించి, ఒప్పుకోని వారిని నరికి పోగులు పెట్టించిన ఆలయ విధ్వంసకుడు అల్లాఉద్దీన్ ఘనతనూ చరిత్రలో చదివాం. మరి టిప్పుసుల్తాన్ కూడా ఈ కోవలోని వాడేనా?

నిజమే. గజనీ మహ్మద్ లాగే, అల్లాఉద్దీన్ ఖిల్జీలాగే టిప్పు కూడా వేల మందిని చంపించాడు. వేల మందిని అమానుషంగా వేధించి, దారుణ అత్యాచారాలకు గురి చేసి, బలవంతంగా మతం మార్పించాడు. కెనరా ప్రాంతంలో ఏకంగా యాభైవేల మంది క్రైస్తవులను, అలాగే మలబార్‌లో వేల సంఖ్యలో నాయర్లను, కూర్గులను అతడు ఎన్నెన్ని యాతనలు పెట్టిందీ చరిత్ర గ్రంథాలు తిరుగులేని రుజువులతో ఘోషిస్తాయి. "కూర్గ్ ప్రజల మీద దాడిచేసి అందిన వారినల్లా కత్తికి ఎరచేయండి. మొత్తం అందరినీ బందీలుగా పట్టుకోండి. స్త్రీలు, పిల్లలు సహా అందరినీ ముసల్మాన్లుగా మార్చండి" అని కూర్గ్‌లో సేనానికి పంపిన ఆదేశాన్ని బట్టే అతడి హయాంలో మతాంతరీకరణల స్థాయి విస్పష్టమవుతుంది. దేవుడి దయతో దైవ సహాయంతో అవిశ్వాసులందరినీ ఈ నేలమీద నుంచి నిర్మూలించేందుకు తాను కృతనిశ్చయమైనట్టు మొగల్ పాదుషాకు పంపిన సందేశమైనా... కాఫిర్ల భూమిని వదిలేసి... ముసల్మాన్ల కోసం తాను స్థాపించిన పవిత్ర రాజ్యంలోకి వచ్చి పవిత్రంగా జీవించమని దేశం ఇతర ప్రాంతాల మహమ్మదీయులకు పలికిన స్వాగతమైనా టిప్పులోని మతావేశాన్నే సూచిస్తాయి.

అయితే... ఇలాంటి అనేక దృష్టాంతాలను బట్టి టిప్పు పరమ కిరాతకుడైన పరమత ద్వేషి అని నిర్ధారణ చేయగలమా? స్వతహాగా అతడు మతోన్మాది అయితే దూరాన కెనరా జిల్లాలో, మలబార్‌లో, కూర్గ్‌లో తన ఆధిపత్యాన్ని అంగీకరించకుండా తిరుగబడ్డ జనంపై సాగించిన దారుణ దురాగతాలను సొంత రాజ్యంలో హిందువుల మీదా అదే స్థాయిలో జరిపించి ఉండాలి కదా? గజనీ మహ్మద్, అల్లా ఉద్దీన్, ఔరంగజేబువలె హైందవ దేవాలయాలను ధ్వంసంచేసి, విగ్రహారాధకులను తక్కువ రకం పౌరుల్లా చూసి, రకరకాలుగా వేధించి ఉండాలి కదా? ప్రాణభయంతోటో ప్రలోభాలవల్లో మైసూరు హిందువులు పెద్ద సంఖ్యలో మతం మారి ఉండాలి కదా? మత కంటకుడు పెట్టే తిప్పలకు తాళలేక మిన్నులదిరేలా జనం హాహాకారాలు చేసి ఉండాలి కదా?

ఇంగ్లీషు చరిత్రకారులు అడిగితే – ఔను అవన్నీ జరిగాయనే అంటారు. ***The Cambridge History of India*** ను రాసిన హట్టన్ దొర అభిప్రాయం ప్రకారం టిప్పు కిరాతకుడు. తన తండ్రి బలవంతంగా అధికారం గుంజుకున్న రాజ్యంలోని హిందువులను క్రూరంగా పీడించిన మహమ్మదీయ మతోన్మాది. ***Historical Sketches of Southern India*** గ్రంథాన్ని రచించిన కర్నల్ విల్క్స్ దృష్టిలో టిప్పు మధ్యయుగంనాటి మత మౌఢ్యాన్ని భయానకంగా అనుసరించి... హిందువుల్లో ఎంతటి గొప్పనూ గుర్తించకుండా, ముస్లింల్లో ఎంతటి తప్పునూ శిక్షించకుండా దారుణ పక్షపాతం చూపి తన రాజ్యంలో ప్రతి హిందువుకూ తానంటే జుగుప్స కలిగించిన పాపాత్ముడు.

అవునా? నిజంగానే ఉపర ఔరంగజేబులా టిప్పు మైసూరు హిందువులను కాల్చుకు తిన్నాడా?

టిప్పు సుల్తాన్ అవలక్షణాలు ఎంచాలంటే కావలసినన్ని. అతడు అహంకారి. తనను తాను సర్వజ్ఞుడినని భ్రమించి ప్రపంచంలో ప్రతి విషయం మీదా అంతిమ తీర్పు ప్రకటించగలననుకునే అవివేకి. ఖర్చు దగ్గర పరమ లోభి. స్త్రీలను మనుషుల్లా చూడని కుసంస్కారి. తరతరాలుగా అనుసరిస్తున్న మాతృస్వామ్య వ్యవస్థను, వైవాహిక సంబంధాలను తనకు నచ్చని కారణంగా మార్చుకుని తీరాలని మలబార్ నాయర్ల జాతిని నానాక్షోభపెట్టి



వేల ప్రాణాలు తీసిన క్రూరుడు.

ఇలాంటి దోషాలు ఎన్ని ఉన్నా, టిప్పుసుల్తానుకు అనేక శాస్త్రాల మీద, సంక్లిష్ట ప్రపంచ వ్యవహారాల మీద గల పరిజ్ఞానాన్ని చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. పాలనా రీతుల్లో అతడు అనుసరించిన ఆధునిక పద్ధతులు సమకాలిక ప్రభుత్వాలకంటే చాలా మెరుగు. ఆ కాలపు పోకడకు తగ్గట్టు శత్రు వర్గాలనుకున్న వాటి మీద ఎంత క్రౌర్యం చూపినా మతం విషయంలో, ముఖ్యంగా హిందువుల విషయంలో టిప్పు క్రూరుడు కాదు. కెనరాలో క్రైస్తవుల మీదా, మలబార్‌లో నాయర్లమీదా అతడు రాక్షసంగా విరుచుకుపడింది తనకు ఎదురు తిరిగారన్న రాజకీయ కక్ష కారణంతోనే తప్ప మతద్వేషంతో కాదు. నాయర్లపై అతడి దురాగ్రహంలోనూ వారి బహుభర్తృత్వ ఆచారంపైనా, మహిళలు అనాచ్ఛాదితంగా తిరగడంపైనా వ్యతిరేకతే ఎక్కువగా కనిపిస్తుంది. మొత్తంగా హిందూమతంమీద విద్వేషంతో కత్తి ఎత్తి, పరిపాలనలో, ముస్లింల పట్ల పక్షపాతం చూపి, హిందువులను దుర్విచక్షణకు గురిచేసి, అన్ని విధాలుగా అణగదొక్కి, బలవంతపు మత మార్పిడులను సాగించాడన్న నేరాలను అతడికి ఆపాదించటం అన్యాయం.

ఔరంగజేబు, అల్లావుద్దీన్ల పాలనలోవలె టిప్పు రాజ్యంలో మహమ్మదీయేతరులపై జిజియా పన్ను ఏదీ లేదు. భూమి శిస్తు, వృత్తి వ్యాపారాలపై పన్నులు, శాసనాలు పౌరులందరికీ సమానమే. పరిపాలనలో ముస్లింల ఎక్కువా లేదు; హిందువుల తక్కువా లేదు. పెళ్లిళ్లు, ఆస్తి హక్కులు వగైరా సివిల్ వ్యవహారాల్లో ముస్లింలు షరియత్ ప్రకారమూ, హిందువులు తమ ధర్మ శాస్త్ర, సంప్రదాయాల ప్రకారమూ నడుచుకోవలసి ఉండేది. ఇందుకు సంబంధించి నిర్ణయాలు చేయటానికి ప్రతి పరగణాకూ ఒక కాజీ, ఒక పండితుడు ఉండేవారు. శ్రీరంగపట్నంలోని హైకోర్టులో అపీళ్లు చూసేందుకు ఇద్దరు జడ్జిలు ఉండేవారు. ఒకరు హిందువు, రెండో వ్యక్తి మహమ్మదీయుడు. హిందువుల్లో మతపరమైన, ఆచారాలకు, సంబంధించిన వివాదాలను హిందూ న్యాయమూర్తే విచారించేవాడు.

విదేశీ చరిత్రకారులు ఆరోపించినట్టు టిప్పు సుల్తాన్‌కు బంధుప్రీతి, మత పక్షపాతం ఉన్నట్టయితే అతడి దర్బారు నిండా అతడి బంధుమిత్రులైన మహమ్మదీయులే ఉండేవారు. కీలక స్థానాల్లోకి హిందువులను రానిచ్చేవారు కాదు. వాస్తవానికి టిప్పు హయాంలో ముఖ్య పదవుల్లో గణనీయసంఖ్యలో హిందువులు ఉండేవారు. సుల్తాను పనుపున కీలకమైన రాయబారాలు, దౌత్యాలు చక్కబెట్టింది అప్పాజీరావు, శ్రీనివాసరావులు. మొగల్ దర్బారులో టిప్పు వకీళ్లు మూల్‌చంద్, సుజన్ రాయ్‌లు, సైనిక కమాండర్లలో ప్రముఖులైన హరిసింగ్, రామారావు, బికాజీ సిందియా, శివాజీలు హిందువులే. ఫైనాన్సు, రెవిన్యూ, ట్రెజరీ విభాగాల్లో ముఖ్య స్థానాలూ హిందువులవే. వీరందరికీ మించి టిప్పుకు కుడిభుజం అనదగ్గ పూర్ణయ్య పదహారణాల హిందువు. ఆర్థిక వ్యవహారాలు చక్కబెట్టిన కృష్ణారావు కూడా హిందువే. పరిపాలన ప్రధానంగా వీరిద్దరి చేతుల మీదే నడిచేది. పొరుగున ఉన్న నైజాంలో ముఖ్యవజీరు ఎప్పుడూ హిందువే. కాగా మహమ్మదీయుడైన టిప్పు రాజ్యంలో పాలన చక్రాన్ని పూర్ణయ్య తిప్పటం చిన్న విషయం కాదు.

నిజానికి ఈ పూర్ణయ్య, కృష్ణారావులే కీలక ఘట్టాల్లో రాజ్యాన్ని కాపాడారు. ముఖ్యంగా హైదరాలీ మరణించిన సమయంలో. అనేక తరాలనుంచీ ఒకే వంశం ఏలుబడిలో ఉన్న రాజ్యాల్లోనే అధికార వారసత్వం విషయంలో గొడవలు రావటం కద్దు. అందునా ముస్లిం

రాజ్యాల్లో సుల్తాను మరణించాడంటే చాలు తదుపరి అధికారం ఎవరన్నదానిపై అనిశ్చితి, గందరగోళం తలెత్తి కుటుంబ కలహాలకు, రక్తపాతాలకు దారితీయటం పరిపాటి. సుస్థిరమనుకున్న మహా మొగలు దర్బారులోనే, నైజాం అన్నదమ్ముల మధ్యే అంతర్యుద్ధాలు, తిరుగుబాట్లు తప్పనప్పుడు కేవలం కొద్ది సంవత్సరాల కింద సింహాసనాన్ని బలవంతంగా ఆక్రమించిన హైదరాలీ మరణిస్తే పరిస్థితి ఎలా ఉంటుందో ఊహించవచ్చు. మరణించిన వాడికే గద్దెమీద హక్కులేనప్పుడు, అతడు పోయాక అతడి కుమారుడి వారసత్వ హక్కును మాత్రం ఎవరైనా ఎందుకు గుర్తించాలి? అదీగాక - పరిపాలించినది హైదరాలీయే అయినా అధికారికంగా అతడు పాలకుడు కాదు. నామకఃప్రభువు అయిన మైసూరు రాజు వేరే ఉన్నాడు. అతణ్ని కీలుబొమ్మను చేసి గుప్పిట్లో పెట్టుకుని ఇరవై ఏళ్లకు పైగా హైదరాలీ చక్రం తిప్పాడు. మహారాష్ట్రలో సతారా రాజు పేరిట పీష్వాలు రాజ్యం చేసినట్టు మైసూరులో రాజు ప్రతినిధిగా హైదర్ పెత్తనం చేశాడు. మైసూరు దసరా ఉత్సవాల్లో అతడు పక్కన ఒదిగి నిలబడి రాజుకు ఇవ్వాల్సిన గౌరవం ఇచ్చేవాడు. తమనుంచి అధికారం లాక్కున్నవాడు మరణించాక రాచవారు అతడి వారసుడికి కూడా లోబడి ఉండాల్సి పని లేదు. జనాభాలో నూటికి 90 మంది హిందువులే కాబట్టి తమ చిరకాల ప్రభువులు అధికారపు పగ్గాలను తిరిగి చేతుల్లోకి తీసుకుంటామంటే ప్రజలు వద్దనరు.

అందునా–హైదర్ మరణించింది మామూలు సమయంలో కాదు. భీకర యుద్ధం నడి మధ్యలో. అతడు తలపడిందేమో ఉచ్చనీచాలెరుగని ఇంగ్లీషు మాయావులతో. యుద్ధంలో రాజు మరణవార్త తెలియగానే సేనలు కకావికలమై పారిపోవటం రివాజు. తమకు సింహస్వప్నమైన హైదర్ కన్నుమూశాడని తెలిస్తే అంతదాకా అతడి చేతిలో చావు దెబ్బలు తింటున్న తెల్లవారికి పట్టపగ్గాలుండవు. తాము ఆరితేరిన టక్కుటమార విద్యలన్నీ ప్రయోగించి అంతకుముందు అనేక సంస్థానాలవలె మైసూరునూ ఎగరేసుకుపోవాలని వారు ప్రయత్నించక మానరు. ఇవన్నీ ఒక ఎత్తు అయితే ఉత్తరాధికారి అయిన హైదర్ కుమారుడు సమయానికి అందుబాటులో లేకపోవటం ఇంకో ఎత్తు. కెనరా, మలబార్‌లను ఆకస్మికంగా ఆక్రమించిన ఇంగ్లీషువారిని తరిమివేయటానికి తండ్రి ఆజ్ఞపై టిప్పు కేరళ వెళ్లాడు. అతడు తిరిగి వచ్చేలోగా ఏమైనా కావచ్చు.

ఇదీ అప్పటి పరిస్థితి. అప్పుడూ పూర్ణయ్యే ప్రధానమంత్రి. ఆయన, కృష్ణారావు తలచుకుంటే రాజ కుటుంబంతో మాట్లాడుకునో, తిరుగుబాటు చేసో హైదర్ వంశాధికారాన్ని తుదముట్టించగలిగేవారే. కాని జరిగిందేమిటి ?

హైదరాలీ జబ్బుపడి 1782 డిసెంబర్ 7 రాత్రి చిత్తూరు దగ్గర నరసింగరాయునిపేట శిబిరంలో నిద్రలో మరణించగానే అతడి పక్కనే ఉన్న మంత్రులు మెరుపులా కదిలారు. వెంటనే తిరిగి రమ్మని మలబార్‌లోని టిప్పుకు కబురుపెట్టారు. అతడు తిరిగి వచ్చేదాకా సుల్తాను మరణవార్తను అతి రహస్యంగా దాచిపెట్టారు. శవాన్ని చెడిపోకుండా రసాయనాలు పూసి పెద్ద పెట్టెలో భద్రపరచి, చూసేవారికి ఏదో ఖజానాను మోసుకుపోతున్నారన్న భ్రమ కలిగించి, శ్రీరంగపట్నానికి తరలించారు. హైదర్ బతికి ఉన్నట్టే తెరలు వేసిన ఖాళీ పల్లకిని యుద్ధరంగంలో సైన్యం వెంట తిప్పి, మామూలు పరిపాలనను యథాప్రకారం కొనసాగించారు. హైదర్ మరణించిన నాలుగురోజులకు టిప్పుకు కబురు అందింది. అక్కడ ప్రత్యామ్నాయ ఏర్పాట్లన్నీ చేసి అతడు తిరిగి రావటానికి ఇంకో మూడు వారాలు పట్టింది.



అంత కాలమూ బయటికి వార్త పొక్కకుండా, కుట్రలు తలెత్తకుండా కాపాడి టిప్పుచేతికి అధికారం అప్పగించినవారు హిందువులు.

దానికి తగ్గట్టు టిప్పుకూడా వారి పట్ల కృతఘ్నత చూపలేదు. తండ్రికంటే ముస్లిం మతాభిమానం ఎక్కువ ఉన్నవాడైనా దానిని హిందువుల పట్ల ద్వేషంగా వికటించనివ్వకుండా తన హద్దుల్లో తానున్నాడు. విగ్రహారాధన ఇస్లాం విశ్వాసానికి విరుద్ధమైనా హిందూ దేవాలయాలను వర్థిల్లనిచ్చాడే తప్ప గజనీ మహమ్మదులా, ఔరంగజేబులా దారుణ విధ్వంసాలకు పాల్పడలేదు.

ఇందుకు నిదర్శనాలకోసం ఎక్కడిదాకో వెళ్లనక్కర్లేదు. శ్రీరంగపట్నం కోట లోపలే సుప్రసిద్ధ రంగనాథస్వామి కోవెల ఉంది. ఆ సమీపంలోనే శ్రీనరసింహ, శ్రీగంగాధీశ్వర ఆలయాలుండేవి. రోజూ వేల మంది ఆ గుళ్లకు వెళ్ళి పూజాదికాలు చేస్తుండేవారు. తన రాజమహలుకు కొన్ని వందల గజాల దూరంలోనే నిత్యం గుడిగంటలు మోగుతూ, విగ్రహమూర్తులకు అర్చన మంత్రాలతో పరిసరాలు మారుమోగుతున్నా అభ్యంతరం చెప్పని సుల్తానును పరమత ద్వేషి అని ఎలా అనగలం?

విగ్రహారాధనను కేవలం సహించడమే కాదు, టిప్పుసుల్తాన్ హిందూ దేవళాలకు స్వయంగా కానుకలు కూడా సమర్పించుకున్నాడు. పూర్వం మైసూరు రాజులు పెట్టిన ఒరవడిని అతడు నిరభ్యంతరంగా కొనసాగించాడు. నారాయణస్వామి గుడికి పన్నెండు ఏనుగులను, ఆభరణాలను, బంగారు, వెండి పాత్రలను అతడు బహూకరించాడు. నంజన్‌గూడులోని శ్రీ కంఠేశ్వరాలయానికి, శ్రీరంగపట్నం రంగనాథస్వామికి "టిప్పుసుల్తాన్ పాదస" బహూకరించిన నగలు, పాత్రలు ఇప్పటికీ ఉన్నాయట. నంజన్‌గూడులో "పాదుషా లింగం" అతడి ఆదేశాలపైనే ప్రతిష్ఠించారంటారు. గుళ్లను పడగొట్టకపోవటమేకాక - నమ్ముతారో లేదో- టిప్పుసుల్తాన్ స్వయంగా ఒక గుడిని కట్టించాడు. 1790లో కర్నాటకపై దండెత్తినప్పుడు కాంజీవరంలో ఒక దేవాలయ నిర్మాణానికి అతడు పదివేల నాణేలు విరాళం ఇచ్చాడు. అక్కడ రథోత్సవంలో స్వయంగా పాల్గొని, బాణాసంచాకైన ఖర్చును తానే భరించాడు.

ఔరంగజేబు హయాంలో ఆలయాలు పడగొట్టటానికి ప్రత్యేకంగా ఒక డిపార్టుమెంటు ఉండగా టిప్పుసుల్తాన్ హయాంలో ఆలయాల అజమాయిషీకి ప్రత్యేకంగా ఒక శాఖ ఉండేది. గుళ్లకు, మఠాలకు చెందిన ఆస్తుల మంచి చెడ్డలు అది చూసేది.

'ది టైగర్స్ ఆఫ్ మైసూర్' గ్రంథంలో ప్రాక్సీ ఫెర్నాండెజ్ రాసిన ఈ మాటలే చాలు టిప్పుసుల్తాన్ పరమత ద్వేషి ఔనో కాదో చెప్పటానికి :

> ...Tipu himself sanctioned land grants to temples and Brahmins. The Swami of Pushpagiri Math was given the inam of Thongapalli and Gollapalli Village... When Thomas Munro was appointed the Collector of Bara Mahal... the pujaris of Rayakottai temple produced before him a sanad issued by Tipu Sultan granting them a regular cash allowance. An interesting sanad was the order passed by Tipu restoring the discontinued puja of the Anjaneyaswar temple at Pullivendula in Cuddapah

district... In a most fascinating Sanad found in the Parakalla Math, Tipu Sultan arbitrated in a temple dispute...

[*The Tigers of Mysore*, **Praxy Fernandes**, *p. 213*]

(ఆలయాలకు ప్రత్యేకంగా ఒక డిపార్టుమెంటును పెట్టి ఉన్న ఆస్తులు కాపాడటంతో బాటు టిప్పు స్వయంగా ఆలయాలకు, బ్రాహ్మణులకు మాన్యాలు ఇచ్చేవాడు. పుష్పగిరి మఠం స్వామికి తొంగపల్లి, గొల్లపల్లి గ్రామాల ఇనాం అతడిచ్చిందే... థామస్‌మన్రో బారామహల్ కలెక్టరుగా ఉన్నప్పుడు రాయకోట ఆలయం పూజారులు తమకు రెగ్యులర్‌గా నగదు భృతిని మంజూరు చేస్తూ గతంలో టిప్పుసుల్తాన్ జారీచేసిన సనదును చూపించారు... కడప జిల్లా పులివెందులలోని ఆంజనేయస్వామి కోవెలలో ఆపేసిన పూజను కొనసాగించవలసిందన్నది టిప్పు ఇచ్చిన ఇంకో ఆసక్తికరమైన సనదు... అన్నింటికంటే విశేషమైనది పరకాల మఠంలో వడగళై, తంగళై తెగల మధ్య వివాదాన్ని పరిష్కరిస్తూ అతడు జారీచేసిన ఉత్తర్వు.)



# మరాఠాల పులిస్వారీ

***"You are the Jagadguru,' wrote Tipu in 1793. "You are always performing penance in order that the whole world may prosper, and the people may be happy. Please pray God for the increase of our prosperity. In whatever country holy personages like yourself may reside that country will flourish with good showers and crops". Strange world for an allegedly "fanatic" Muslim to address to a Hindu religious dignitary!***

[*The Tigers of Mysore*, **Proxy Fernandes**, *p. 212*]

'మీరు జగద్గురువులు. అఖిల ప్రపంచం వర్ధిల్లాలనీ ప్రజలంతా సంతోషంగా ఉండాలనే మీరెప్పుడూ జపతపాలు చేస్తుంటారు. మేము ఇంకా బాగా వృద్ధిలోకి రావాలని దయచేసి దేవుడిని ప్రార్థించండి. తమవంటి మహానుభావులు ఎక్కడ నివసిస్తారో ఆ దేశం సుభిక్షంగా సస్యశ్యామలంగా విలసిల్లుతుంది' అని 1793లో శృంగేరి జగద్గురువుకు టిప్పు రాశాడు. ముస్లిం మతోన్మాది అని ముద్రపడినవాడు ఒక హిందూ మతాచార్యుడిని ఇలా సంబోధించటం వింతకాదూ?' – అన్నాడు 'ది టైగర్స్ ఆఫ్ మైసూర్' గ్రంథంలో ప్రాక్సీ ఫెర్నాండెజ్.

శృంగేరిలో ఉన్నది ఆదిశంకరులు స్థాపించిన దక్షిణామ్నాయ పీఠం. దక్షిణ భారతదేశంలోని హైందవ పీఠాల్లో అగ్రగణ్యమైనది. అది సరిగ్గా టిప్పుసుల్తాన్ రాజ్యంలో ఉన్నది. అతడికే కనుక గజనీ, ఔరంగజేబుల అంశ ఉన్నట్టయితే సోమనాథుడికీ, కాశీ విశ్వనాథుడికీ పట్టినగతే శృంగేరి శారదమ్మవారికీ ప్రాప్తించి ఉండాల్సింది. ధర్మ ప్రచారంలో, మత సంబంధ వ్యవహారాల్లో తురక ప్రభువు నుంచి శంకర పీఠానికి వేధింపులు, ఆరళ్లు అడుగడుగునా ఎదురై ఉండాల్సింది.

కాని– ఆశ్చర్యం! అన్ని మతాలను సమానంగా గౌరవిస్తామని చెప్పుకునే ఈ కాలపు

సోకాల్డ్ సెక్యులర్ ప్రభుత్వాల కంటే టిప్పుసుల్తాన్ హయాంలోనే శృంగేరి పీఠం ఎక్కువ గౌరవానికి నోచుకుంది! ఎక్కువ ప్రోత్సాహానికి పాత్రమైంది.

ఉదాహరణకు- ధర్మభ్రష్టులైన హిందువులపై విచారణ చేయటానికి శృంగేరి జగద్గురువులకు కావలసిన సహాయం అందించమని టిప్పుసుల్తాన్ 1794లో సయ్యద్ మహమ్మద్ అనే సర్దారుకు ఉత్తర్వు చేశాడు. (ఈ సందర్భంలోనే ఇంకో సంగతి. ముస్లిం మత పక్షపాతానికి పేరుపడ్డ నైజాం నవాబులు కూడా- ఈ విషయంలో మన కాలపు సెక్యులర్ ప్రభువులకంటే నయమే. అన్ని వర్ణాల హిందువులు తమ మతాచారాలను, ఇతర విధులను సక్రమంగా నిర్వర్తిస్తున్నదీ లేనిది నిర్ణయించే అధికారం శృంగేరి మఠాధిపతికి ఉన్నదని, ధర్మ సంబంధ విషయాల్లో శృంగేరి శంకరాచార్యుల ఆజ్ఞను తన రాజ్యంలో ఎవరూ ధిక్కరించరాదని 1843లో నైజాం నవాబు ఉత్తర్వు చేశాడు. వారసులు లేకుండా మరణించిన శిష్యుల ఆస్తిపాస్తులు శృంగేరి పీఠానికి చెందాలని అంతకు పూర్వపు నవాబు ఫర్మానా).

ఇంకా చిత్రమేమిటంటే- హిందువులకు పరమ పవిత్రమైన శంకరపీఠం మీద హిందువులయిన మరాఠాలు దాడి చేసి ఔరంగజేబు తరహాలో విధ్వంసం సాగిస్తే, మహమ్మదీయుడైన టిప్పుసుల్తాన్ నష్టపరిహారం చెల్లించి, ఆలయాన్నీ మఠాన్నీ తన ఖర్చుతో మరమ్మత్తులు చేయించి పునరుద్ధరించాడు. 1791లో జరిగింది ఈ నమ్మలేని విచిత్రం. మూడవ మైసూరు యుద్ధ సందర్భంలో మహారాష్ట్ర సర్దారు రఘునాథరావు పట్వర్ధన్ మైసూరు రాజ్యభాగమైన షిమోగా మీదికి దండెత్తి, పనిలోపనిగా ఆ సమీపంలో ఉన్న శృంగేరి మఠంపైనా దాడిచేశాడు. మఠాన్ని కొల్లగొట్టి, పలువురు బ్రాహ్మణులను చంపి, శారదాలయంలో నగానట్రా దోచుకుని, అమ్మవారి పవిత్ర మూర్తిని సైతం పెకలించి మరాఠా దండు నానా ఆగం చేసింది. వారి పీడకు తాళలేక జగద్గురువు సచ్చిదానంద భారతి మహాస్వామి మఠం విడిచిపోయి వేరే ఊళ్లో తలదాచుకుని టిప్పుసుల్తాన్‌కు సందేశం పంపారు. విషయం తెలిసి టిప్పు చాలా బాధపడ్డాడు. అంతటి పవిత్ర స్థలం మీద అలాంటి ఆకృత్యానికి ఒడిగట్టిన వాళ్లు పాప ఫలితం అనుభవించి తీరతారని స్వామి జాబుకు జవాబులో అతడన్నాడు. వెంటనే మఠానికి కావలసిన డబ్బు ఇచ్చి, పునర్నిర్మాణానికి అవసరపడే వస్తువులందించి, ఆలయ పునరుద్ధరణ, సంప్రోక్షణాదులకు సాయపడవలసిందిగా బేదనూరులోని తన అధికారిని సుల్తాన్ ఆదేశించాడు. విగ్రహ పునఃప్రతిష్ఠ జరిగాక మఠంవారు కృతజ్ఞతాపూర్వకంగా పంపిన శాలువను, ప్రసాదాన్ని అందుకున్నాడు. తిరిగి అమ్మవారికి వస్త్రాలు, కానుకలు పంపాడు. మైసూరు స్టేటు ఆర్కియాలజీ డైరెక్టరుగా ఉన్న దివాన్ బహదూర్ నరసింహాచార్‌కి 1913లో శృంగేరి మఠంలో లభ్యమైన చరిత్రాత్మక లేఖల్లో 1791-93 మధ్య సుల్తాన్‌కు, మఠానికి నడిచిన ఉత్తర ప్రత్యుత్తరాలు బయటపడి, ఈ సంగతులు లోకానికి వెల్లడయ్యాయి. ఆ సందర్భంలో శృంగేరి మహాస్వామికి రాసిందే ఈ వ్యాసం మొదట్లో ఉటంకించిన లేఖ.

ఇదంతా వింటే ఎవరికైనా ఒక సందేహం వస్తుంది. హిందూ మత పీఠాల పట్ల, హిందువుల విశ్వాసాలు, మతాచారాల పట్ల ముస్లిం ప్రభువుల్లో చాలా చాలా అరుదైన ఇంతటి సౌమ్యతను కనపరచిన టిప్పుసుల్తాన్ మీద మరాఠాలు ఎందుకు కత్తిగట్టారు? ముస్లిం నిజాంతోనూ, క్రైస్తవ 'కంపెనీ'తోనూ చేతులు కలిపి, పగబట్టి వేటాడి, టిప్పును





వారు ఎందుకు సర్వనాశనం చేశారు?

వీరసావర్కర్‌ను అడిగితే ఇలా చెబుతారు:

టిప్పుసుల్తాన్ పరమత ద్వేషానికి పూనుకుని, కాఫిర్లందరినీ ముస్లింలుగా మార్చి తీరతానని నిండుకొలువులో ప్రకటించాడు. హిందువులందరికీ ఇస్లాం దీక్ష ఇవ్వాలని, అందుకు ఇష్టపడని హిందువులను చంపి, వారి స్త్రీలను ముస్లింలకు ఉంపుడు గత్తెలుగా, దాసీలుగా పంచిపెట్టమని తన అధికారులను ఆదేశించాడు. మత భ్రష్టీకరణ అత్యాచారాలకు అతడి రాజ్యంలో ఉన్న మొత్తం హిందువుల్లో హాహాకారాలు చెలరేగాయి. టిప్పు స్వయంగా మలబారు మీద దండెత్తి లక్ష మంది హిందువులను ఇస్లాం మతంలోకి మార్చాడు. కర్ణాటక మీద, మహారాష్ట్ర మీద కూడా అతడు దండెత్తాడు. ధార్వాడుకు దిగువన తిరువాన్కూరు వరకు గల ప్రాంతంలో లక్షలాది హిందూ స్త్రీ పురుషులను టిప్పు సైనికులు, గూండాలు, మౌల్వీలు అత్యంత క్రూరంగా మత భ్రష్టుల్ని చేశారు. అప్పుడు హిందువులు చేసిన ఆర్తనాదాలు విని హిందూ ధర్మరక్షణకు కంకణం కట్టుకున్న మహారాష్ట్రుల రాజధాని పూనాలో క్రోధాగ్ని జ్వాలలు లేచి మైసూరు మహిషాసుర సంహారానికి పూనుకోవాలని నిర్ణయం జరిగింది.

భారత ఇతిహాసంలోని ఆరు స్వర్ణపత్రాలను ఉల్లేఖిస్తూ సావర్కర్ రాసిన గ్రంథంలోని ఐదో స్వర్ణపత్రంలో పేర్కొన్న వివరాలివి. ఇది చదివితే భ్రష్టాచారాల బారినుంచి హిందూ మతాన్ని రక్షించాలన్న ధర్మదీక్షతోనే మరాఠాలు టిప్పుపై ధర్మయుద్ధం సాగించారన్న అభిప్రాయం కలుగుతుంది. సావర్కర్ గొప్పవాడే. ఆయన దేశభక్తి, ధర్మనిరతి, మేధాశక్తి కూడా గొప్పవే. ఆయన ఇతర గ్రంథాలలాగే 'స్వర్ణ పత్రాల' గ్రంథం కూడా దేశభక్తులకు, ధర్మవీరులకు అవశ్యపఠనీయమే. అందులో తెలుసుకోవలసిన చారిత్రక సత్యాలు ఎన్నో ఉన్నమాటా నిజమే. కానీ- టిప్పుసుల్తాన్‌పై మరాఠాలు చేసిన దుర్మార్గపు దాడిని పవిత్ర మతయుద్ధంగా చిత్రించటం మాత్రం ముమ్మాటికీ తప్పు.

అదే నిజమైతే- ముస్లిం మతోన్మాదుల బారినుంచి ఆపన్న హిందూ ప్రజానీకాన్ని రక్షించటానికి టిప్పుపై మరాఠాలు తలపెట్టిన యుద్ధానికి నైజాంకు చెందిన మరో ముస్లిం సేనను సాయంగా వెంటేసుకు పోయేవారు కాదు. భ్రష్టాచారాల నుంచి హిందూ మతాన్ని కాపాడలన్నదే నిజంగా మరాఠాల ధ్యేయమైతే అదే హిందూ మతానికి చెందిన శృంగేరి శంకర మఠంలో ఏ హిందువూ కలనైనా ఊహించకూడని దారుణ భ్రష్టాచారాలకు తామే పాల్పడే వారు కాదు. వాస్తవానికి మైసూరు రాజ్యంలో హిందువులకూ, వారి ఆలయాలకూ మత సంస్థలకు టిప్పు వల్ల పెను ముప్పు ఏమీ లేదని, మరాఠాలు చేతులు కలిపిన నిజాం రాజ్యంలో కంటే మైసూరు హిందువుల పరిస్థితి చాలా మెరుగని- ఇంతకు ముందు ఇచ్చిన వివరాలను బట్టే ఎవరికైనా అర్థమవుతుంది. టిప్పు ముఖ్యంగా హింసించింది, దారుణ దురాగతాలు సాగించింది అతడు శత్రు ప్రాంతాలుగా పరిగణించిన కెనరా, మలబార్, కూర్గ్ ప్రాంతాల ప్రజలపైన. వారిపై కూడా అతడికి ఉన్నది కేవలం మత ద్వేషమని చెప్పలేము. అదే నిజమైతే- తమ మత సంబంధ విధులను నిర్లక్ష్యం చేస్తున్న మైసూరు క్రిస్టియన్లను దారిలో పెట్టటానికి కేథలిక్ ప్రీస్టులను పంపించమని గోవాలోని ఆర్చిబిషప్‌కు టిప్పు లేఖ రాసేవాడు కాదు. కెనరా క్రిస్టియన్లను వేటాడి, బలవంతంగా సున్తీలు చేయించి, స్వస్థలాలనుంచి పెకలించి ప్రవాసంలో చిత్రహింసలకు గురిచేసి అర లక్ష మందికి పైగా

మరణానికి టిప్పు కారకుడవటం క్షమించరాని మహాపరాధమే. అయితే ఎక్కడో క్రైస్తవులపై జరిగిన అత్యాచారాలకు పుణెలోని మరాఠా హిందువులు కత్తులు దూసి ధర్మయుద్ధం ప్రకటించారనడం హాస్యాస్పదం.

ఇక మలబార్ నాయర్లు హిందువులే. వారు బహుభర్తృత్వం ఆచారాన్ని మానాలని, ఒళ్లు కనబడేలా స్త్రీలు తిరగకూడదని క్రూరంగా నిర్బంధించి, మాట విననందుకు అమానుషంగా హింసించి, బలవంతంగా మతం మార్పించి, అందుకు ఒప్పుకోని వారిని ప్రాణాలు తీసి టిప్పు చేసింది ఘోరమే. కానీ అలాంటి ఘోరాలకు అతడొక్కడే కాదు. ఆ కాలంలో మహమ్మదీయ ప్రభువులెందరో తమ రాజ్యాల్లో పాల్పడ్డారు. వారిలో ఎవరి మీదా మరాఠాలు మతయుద్ధం ప్రకటించలేదు. అన్నట్టు- టిప్పు తండ్రి హైదరాలీ కూడా అదే మలబార్‌లో అదే నాయర్ల తిరుగుబాటును అణచే సందర్భంలో (1766లో) ఊళ్లపై పడి, ఇళ్లు, ఆస్తులు తగలబెట్టి, పంటలు ధ్వంసం చేసి వేలకు వేల మందిని మహాక్రూరంగా చెట్లకు ఉరితీశాడని- ***Karnama-i-Haideri*** లో అతడి ఆస్థాన చరిత్రకారుడే వర్ణించాడు. దానిని హిందూ మతంపై దాడిగా మరాఠాలు పరిగణించలేదు. పైగా అంత క్రూరంగా వేల హిందువుల ప్రాణాలు తీసిన హైదర్‌తోనే జాతీయ ప్రయోజనాల దృష్ట్యా ఇంగ్లీషువారి భరతం పట్టటం కోసం నానాఫడ్నవిస్ సంధి చేసుకుని, గతాన్ని విస్మరించి చేయి కలిపాడు. దానివల్ల దేశానికి చాలా మేలు జరిగింది.

ప్రశ్నేమిటంటే- విశాల జాతిహితం కోసం హైదర్ తప్పులు క్షమించి, అతడు ఆక్రమించిన తమ ప్రాంతాలపై హక్కును కూడా వదిలేసుకుని, అతడితో కలిసి విదేశీ శత్రువుపై ఐక్య కూటమి కట్టిన మరాఠాలు అతడి కుమారుడిని మాత్రం బద్ధవైరిగా ప్రకటించి ఎందుకు కక్షకట్టారు? 1780లో తెల్లవారిపై ప్రారంభించిన జాతీయ ఐక్యపోరాటం అప్పటికి అయిపోలేదు. హైదర్ మరణించినా, మరాఠాలు విధిలేక ఆంగ్లేయులతో సాల్బే సంధిపై కుదుర్చుకున్నా విదేశీ రాహువు బెడద దేశానికి తొలగలేదు. కుంపిణీ కుతంత్రాలు, కుటిలత్వాలు ఆగలేదు. దక్షిణాదిన ఇంగ్లీషు వారికి సింహస్వప్నంగా ఉన్న మైసూరుతో సఖ్యత జాతీయ శక్తుల ఐక్యతకు చాలా అవసరం. అది తెలిసి కూడా- హైదర్‌తో కుదుర్చుకున్న అవగాహనను అతడి కుమారుడితో మరాఠాలు ఎందుకు కొనసాగించలేదు? అతడిని కలుపుకొని వెళ్లాలని ఎందుకు ప్రయత్నించలేదు? దేశం ఏమైపోయినా సరే, విదేశీయులు బాగుపడి జాతిని కబళించినా సరే- టిప్పును వధించి, అతడి రాజ్యాన్ని నాశనం చేయటం అతి ముఖ్యమని మరాఠాలు ఎందుకు తలిచారు? 1780కూ 1782కూ మధ్య రెండేళ్లలో వారి వైఖరి అంతగా కరకుబారటానికి భౌతిక పరిస్థితుల్లో వచ్చిన మార్పేమిటి?

ఇంకో సంగతి. టిప్పు సుల్తాన్‌లోకి ఒక వేళ ఔరంగజేబు ఆత్మ ఆవేశించి కాఫిర్లపై ఘోరఘాతుకాలను సాగించమని పురికొల్పినా వాటన్నిటినీ సాగించటానికి టిప్పుసుల్తానుకు వ్యవధి లేదు. 1783 జనవరిలో యుద్ధం మధ్యలో తండ్రి ఆకస్మిక మృతితో గద్దెనెక్కింది మొదలుకుని 1799 మేలో శ్రీరంగపట్నం ముట్టడిలో మరణించేదాకా అతడి సమయమంతా ఇంగ్లీషువారి దెబ్బలను కాచుకోవటంతోటే, ఎదురు దెబ్బలు తీయటం తోటే, కోల్పోయిన భూభాగాలను తిరిగి వశపరచుకుని సరిహద్దులను పటిష్ఠ పరచుకునే యత్నాలతోటే, సైనిక వ్యూహాత్మకంగా కీలకమైన కొత్త ప్రాంతాలకు తన ప్రాబల్యాన్ని విస్తరించటానికి భీకర యుద్ధాలు చేయటంతోటే సరిపోయింది. దేశంలోని ప్రతి ప్రాంతీయ, రాజకీయశక్తీ అస్తిత్వం



కోసం పెనుగులాడుతూ శత్రువుల సవాళ్లతో నిరంతరం సతమతమవుతున్న అనిశ్చిత, సంక్షుభిత పరిస్థితుల్లో తీరికూర్చుని మతాంతరీకరణలను ఉద్యమంగా సాగించే తీరిక ఎంతటి మతోన్మాదికీ ఉండదు.

అయితే- దీని అర్థం టిప్పు సుల్తాన్ తప్పులు అసలే చేయలేదని కాదు. మరాఠాలు అకారణంగానే అతడిపై శత్రుత్వం బూనారనీ కాదు. టిప్పువల్ల తప్పులు చాలానే జరిగాయి. ఉదాహరణకు- హైదరాలీ ఆక్రమించిన కృష్ణ - తుంగభద్ర నదుల మధ్య ప్రాంతాలను అతడే అట్టేపెట్టుకోవటానికి 1789 సంధిలో మరాఠాలు అంగీకరించారు. ఆ రకంగా నర్గుండ్ సంస్థానం మైసూరుకు వశమైంది. అది చెల్లించాల్సిన కప్పాన్ని టిప్పు గద్దెనెక్కగానే విపరీతంగా పెంచేశాడు. నర్గుండ్ దేశాయి (జాగిర్దారు)గా ఉన్న భావే అది తనకు శక్తికి మించినదని మొరపెట్టుకున్నా, నానా ఫడ్నవిస్ కలగజేసుకుని వారించినా వినకుండా 1785 మార్చిలో టిప్పు నర్గుండ్‌ను ముట్టడించాడు. దేశాయికి అండగా నానా సేనను పంపాడు. మరాఠాల ధాటికి తాళలేక టిప్పు చేతులెత్తి నయవంచనకు పాల్పడ్డాడు. సంధి చేసుకున్నట్టే చేసుకుని, పరిహారం షరతులకు సమ్మతించినట్టే నటించి మరాఠా సేనలు కృష్ణదాటి వెళ్లగానే మళ్లీ నర్గుండ్ మీద పడ్డాడు. మర్యాదగా లొంగిపోతే ఏమీ చేయనని దేశాయికి మాట ఇచ్చి తీరా అతడు సకుటుంబంగా కోట బయటికి వచ్చాక అతడి కూతురిని చెరబట్టి మిగతా వారిని దారుణ అవమానాల పాలు చేసి ఖైదులో వేశాడు. నర్గుందును నాశనం చేశాక అక్కడికి సమీపంలో ఉన్న కిత్తూరు మీద పడి అక్కడా ఇలాగే దారుణ దురంతాలు సాగించాడు. స్త్రీలను చెరచి, పురుషులకు బలవంతంగా సున్తీలు చేయించి అతడు పెట్టిన బాధలకు తట్టుకోలేక, బలవంతపు మతం మార్పిడి ఇష్టంలేక కృష్ణ, తుంగభద్రల నడుమ రెండు వేల మంది హిందువులు ఆత్మహత్య చేసుకున్నారు.

ఇది తెలిసి మరాఠాలకు ఒళ్లు మండటం సహజమే. తమకు చేసిన మోసానికి, హిందువులపై చేసిన ఘోరాలకు టిప్పుపై ప్రతీకారం తీర్చుకోవాలనుకోవటం సమంజసమే. వారు ప్రతీకారం బాగానే చేశారు కూడా. టిప్పుపై కోపగించిన నిజాం అలీని కూడగట్టి ఉమ్మడిగా దండెత్తి, భీషణ యుద్ధంలో తెగించి, 1787 ఏప్రిల్‌లో టిప్పు సుల్తాన్‌ను తమ కాళ్ల దగ్గరికి తెప్పించుకున్నారు. నర్గుందు, కిత్తూరు, బాదమిలను మరాఠాలకు స్వాధీన పరచి, ముప్పై లక్షల నగదును టిప్పు అక్కడికక్కడే పరిహారంగా చెల్లించాడు. ఇంకో 15 లక్షలు తరువాత చెల్లిస్తానంటే మరాఠాలు సరేనన్నారు.

ఆ తరువాత టిప్పు మళ్లీ మరాఠాల జోలికి పోలేదు. అనంతర కాలంలో అతడి దూకుడు చాలా తగ్గింది. ఇతర మతాల పట్ల మునుపటికంటే సౌమ్యత చూపి, ఒకేసారి అందరినీ విరోధులు చేసుకోవటం తనకే అనర్థమని గ్రహించి, దృష్టినంతా ప్రధాన శత్రువైన ఇంగ్లీషు కంపెనీ మీదే కేంద్రీకరించాడు. ఇండియాను మెల్లిమెల్లిగా మింగబూనిన ఆంగ్లేయుల గొంతులో వెలక్కాయలా అడ్డుపడి, తెల్లవారి పీడను నిశ్శేషంగా నిర్మూలించటానికి విశ్వప్రయత్నం చేశాడు. శత్రువుకు శత్రువు మిత్రుడన్న రాజనీతిలో ఆంగ్లేయులకు విరోధి అయిన ఫ్రాన్సు చక్రవర్తికి, టర్కీ సుల్తానుకు రాయబారం పంపి సైనిక సహాయం కోరాడు. తెల్లవారితో అంతిమ యుద్ధానికి వ్యూహాత్మకంగా కీలకం కాబట్టే తిరువాన్కూరుపై దాడి చేశాడు. కంపెనీ కుటిలాత్ములకు వ్యతిరేకంగా తనతో చేయి కలపమని మరాఠాలనూ పలుమార్లు అడిగాడు.

కారుమబ్బులా కమ్ముకొస్తున్న ఇంగ్లీషు దురాక్రమణ బెడదను ఎదుర్కోవటానికి టిప్పుసుల్తాన్ దృఢదీక్షతో ముందుకురుకుతూంటే మరాఠా వీరులు ఏమి చేశారు? కొన్నేళ్ల కింద తాము చొరవ తీసుకుని, హైదర్‌నూ నిజాంనూ ఇతరులనూ కలుపుకొని ఆంగ్లేయులపై మొదలెట్టిన ఐక్యపోరాటాన్ని తాము అర్ధాంతరంగా ఆపేసి తెల్లవారితో సిగ్గుచేటు సంధి కుదుర్చుకున్నప్పటికీ, హైదర్ కుమారుడు మాత్రం రాజీలేకుండా పోరాటం కొనసాగిస్తున్నందుకు సంతోషించారా? అనేక సంవత్సరాలుగా తమను నానా చికాకులు పెట్టి, తమ రాజ్యంలో కుట్రలు కూహకాలు చేసి, విద్రోహులను చేరదీసి, అన్ని విధాల తమను కుంగదీసి మింగజూస్తున్న తెల్లవారి పీడ వదిలించుకునేందుకు ఇదే అదనని గుర్తించి, కనీసం తమ దీర్ఘకాలిక స్వప్రయోజనాల దృష్టితోనైనా టిప్పుకు బాసటగా నిలిచారా? ఆ పని చేయకపోతే మానె... మైసూరు, 'కంపెనీ' పోరులో ఎవరు ఏమేరకు బలహీనపడినా తమకే లాభమన్న సంగతైనా గుర్తించి, ఎటూ మొగ్గకుండా కనీసం తటస్థంగానైనా ఉన్నారా?

లేదు! టిప్పుకు వ్యతిరేకంగా పోయిపోయి ఇంగ్లీషు వారితోనే మరాఠాలు కుమ్మక్కు అయ్యారు. దొంగలు దొంగలు ఊళ్లు పంచుకున్న రీతిలో మరాఠాలు, నిజాం, ఇంగ్లీషు వారు కలిసి, టిప్పును ఓడించి అతడి రాజ్యాన్ని తమలో తాము పంచుకోవటం కోసం 1799 జూన్ 1న పూనాలో కంపెనీ ప్రతినిధి చార్లెస్ మాలెట్‌తో సిగ్గు చేటు ఒప్పందం చేసుకున్నారు. తద్వారా చాలా తెలివిగా టిప్పు బెడదను నిర్మూలిస్తున్నామని మరాఠాలు భ్రమపడ్డారు. మూర్ఖంగా పులి స్వారీచేసి, చివరికి ఇంగ్లీషు పులి నోట్లో పడ్డారు.



# రుచిమరిగిన పులి

మనిషి నెత్తురు రుచి తెలియనంతవరకూ పులి మనిషి జోలికి పోదు. ఏ కారణంవల్లో ఒకసారి రుచి చూశాక మనిషే పులికి ప్రియమైన భోజనం.

మహోఘనత వహించిన ఇంగ్లీషు పులికి మొదట్లో ఇండియా రుచి తెలియదు. దేశ దిమ్మరులు కొంతమంది కలిసి ఓ కంపెనీ పెట్టి, తూర్పుకు పోయి వ్యాపారం చేసుకుంటాము ప్రభూ అంటే సరే అని బ్రిటిష్ ప్రభువులు అనుమతించారు. ఆ దూరాభారం వ్యాపారం వల్ల తమ ఖజానాకు కాస్తోకూస్తో గిట్టుబాటు కావటమే గొప్ప అని మొదట్లో అనుకున్నారు. వ్యాపారానికని పోయినవారు అక్కడి ప్రభువులతో తిన్నగా ఉండక రాజకీయాల్లో తలదూర్చి, తాహతుకు మించిన కూహకాలు నడుపుతున్నట్టు చూచాయగా తెలిశాక కోపడ్డారు. కంపెనీ వ్యవహారాలు చక్కబెట్టే గవర్నర్లు ఎవరికి వారే సర్వాధికారులై తప్పుడు పనులు చేస్తున్నారని ఫిర్యాదులొస్తే వారి మీద గవర్నరు జనరలును పెట్టి, అతడూ తల ఎగరేయకుండా అతడి నెత్తిన ఓ సుప్రీం కౌన్సిలును పెట్టారు.

ఆ ప్రకారం తొలి గవర్నరు జనరల్ అయిన వారన్ హేస్టింగ్స్ అనే బతకనేర్చినవాడు దశాబ్ది కాలంలో ఏఏ రాజ్యాలను ఎలా కొల్లగొట్టిందీ, ఎంత మూటకట్టిందీ అతడి తోటివారే బయట వేశాక బ్రిటిష్ మారాజుల్లకు తల తిరిగింది. బ్రిటిష్ పార్లమెంటులో దీర్ఘకాలం నడిచిన వారన్ హేస్టింగ్స్ అభిశంసన సందర్భంగా ఇండియా సంపద ఎటువంటిదో, దానిని ఎన్నెన్ని విధాలా కంపెనీ ఉద్యోగులు దోచుకుంటున్నారో అర్థమయ్యాక బ్రిటిష్ ప్రభువర్గానికి నోరూరింది. ఇంగ్లీషు పులి ఇండియా రుచి మరిగింది. దాంతో భారతదేశ చరిత్రలో చీకటి అధ్యాయం మొదలైంది.

అదీ– ఇంగ్లీషు దొరల శైలిలో నాజూకుగా! బహు నాగరీకంగా!! నీతికి సెలవిచ్చి అత్యంత క్రూరంగా!!

హేస్టింగ్స్ అండ్ కంపెనీ చిల్లర చిలక్కొట్లను ఆలకించి ఆలకించి సదరు లాభసాటి

బిజినెసును హోల్‌సేల్‌గా తామే చేపట్టి ఏకంగా ఇండియానే కొట్టెయ్యాలన్న ఆలోచన వచ్చాక ప్రభువులు జాగ్రత్తగా పావులు కదిపారు. పిట్టు ప్రభుత్వం 1784 ఆగస్టులో ఇండియాకోసం ప్రత్యేకంగా ఒక చట్టం తెచ్చింది. దాని ప్రకారం గవర్నర్ జనరల్‌గా ఎవరిని నియమించేది ఇకపై ఈస్టిండియా కంపెనీ కాక నేరుగా ప్రభుత్వమే నిర్ణయిస్తుందన్నారు. పేరుకు బోర్డ్ ఆఫ్ కంట్రోల్ ఒక దాన్ని పెట్టినా 'కాగల కార్యం' సాధించటానికి సర్వాధికారాలూ తాము ఏరికోరి ఎంపికచేసే గవర్నరు జనరలుకు ఉండేలా జాగ్రత్తపడ్డారు. 'సత్యమునే పలకవలెను. ధర్మమార్గంలోనే నడవవలెను. భారతీయ రాజకీయ వ్యవహారాలలో కలగజేసుకొనరాదు. మనకు దక్కిన రాజ్యం చాలు' అని పార్లమెంటు చేత సుద్దులైతే గొప్పగా పలికించారు. తాము చేయదలచుకున్నదేమో గుట్టుచప్పుడు కాకుండా కానిచ్చారు.

పీటల మీద కూచుని కథ నడిపించటానికి సమర్థుడు కావాలి కదా? పెళ్లికొడుకు ఎదురుగానే ఉన్నాడు. అవి అమెరికా వలస రాజ్యం బ్రిటిష్ సార్వభౌమత్వంపై భీకరంగా పోరాడి స్వాతంత్ర్యం ప్రకటించుకున్న తొలినాళ్లు. ఇంగ్లండు పనుపున లార్డ్ కారన్‌వాలిస్ హోరాహోరీగా యుద్ధం సాగించినా పరాజయం తప్పక, విలువైన రాజ్యం చేజారిపోయిందని ఇంగ్లీషు వారందరూ కుమిలిపోతున్న రోజులు. అంతకంటే విలువైన రాజ్యాన్ని కొత్తగా జయించి, ఆ దిగ్విజయంతో ఇటీవలి పరాభవాన్ని మరచిపోయేట్టు చేయటానికి కారన్‌వాలిస్ కంటే యోగ్యుడెవరు - అనుకున్నారు సీమదొరలు.

కారన్‌వాలిస్‌కూ అంతకంటే కావలసింది ఏముంది? అమెరికా యుద్ధంలో శృంగభంగంతో స్వదేశంలో అతడి ప్రతిష్ఠ దెబ్బతిన్నది. బంగారం లాంటి వలసను రక్షించలేక వాషింగ్టన్ చేతిలో పెట్టి తిరిగొచ్చాడన్న ఘోర వైఫల్యపు నగుబాటు నుంచి తేరుకోవటానికి కొత్త వలసలను జయించుకొచ్చే సావకాశం చిక్కటం అతడికీ మంచిదే అయింది. స్వామి కార్యమూ, స్వకార్యమూ ఒక్కటే అయిన ఉత్సాహంతో లార్డ్ కారన్ వాలిస్ కొత్త చట్టం కింద తొట్టతొలి గవర్నర్ జనరల్‌గా, నేరుగా బ్రిటిష్ సమ్రాట్టు ప్రతినిధిగా 1786 సెప్టెంబరులో కలకత్తాలో అడుగుపెట్టాడు.

మన చరిత్రకారులు చాలా మంది దృష్టిలో ఇండియాను ఏలిన గవర్నర్ జనరళ్లలో ఉత్తములు, సత్పురుషులు అనదగ్గ వారిలో కారన్‌వాలిస్ అగ్రగణ్యుడు. తప్పనిసరయి యుద్ధాలు చేశాడే గానీ స్వతహాగా ఆయన గొప్ప శాంతి కాముకుడని వారి నమ్మకం. అలాంటి భ్రమల్లో పడకుండా కారన్ వాలిస్ నిర్వాకాన్ని నిశితంగా గమనిస్తే కలిగే అభిప్రాయం వేరు. ఇంకేమైనా కావచ్చు కాని ఆయన పెద్దమనిషి మాత్రం కాదు.

అధికార ప్రాబల్యం ఎవరిదైనా న్యాయప్రకారం చెప్పాలంటే ఆ కాలానికి మొగల్ పాదుషాయే భారతదేశానికి సార్వభౌముడు. అతడికి వొంగి సలాములు చేసే... కట్టాల్సిన మొత్తాల్ని పువ్వుల్లోపెట్టి క్రమ ప్రకారం సమర్పించుకుంటామని సత్య ప్రమాణాలు చేసే... బెంగాల్, బీహార్, ఒరిస్సాల దివాన్గిరీని తెల్లదొరలు దొరకబుచ్చుకున్నారు... మొదట్లో కప్పం సరిగానే కట్టేవారు. వారన్ హేస్టింగ్స్ వచ్చాక మొగల్ పాదుషా మరాఠాల శరణుజొచ్చాడన్న మిష మీద కప్పాన్ని ఎగవేశాడు. పాదుషా ఢిల్లీలో తన రక్షణలో ఉన్నాడు. కనుక అతడికి కట్టాల్సిన కప్పాన్ని తనకు చెల్లించాలని సింధియా అడిగితే కారన్‌వాలిస్ దొర మొత్తానికే సున్నచుట్టి మొగల్ పాదుషాకు తాము దమ్మిడీ ఇచ్చేది లేదన్నాడు. అలాగే- తనను రక్షించే నెపం మీద వారన్ హేస్టింగ్స్ తనపై రుద్ది పోయిన ఇంగ్లీషు సేన తనకు అక్కర్లేదని, దాని



మేత ఖర్చును తాను భరించలేనని అయోధ్య నవాబు ఎంత మొత్తుకున్నా కారన్‌వాలిస్ కనికరించలేదు. నీకు అక్కర్లేకపోయినా మా సైన్యాన్ని మేపుతూ దాని పడగనీడలో బతకాల్సిందేనని తెగేసి చెప్పాడు. అదే విధంగా నిజాం నవాబు మెడమీద కత్తిపెట్టి, గుంటూరు సర్కారును దౌర్జన్యంగా లాగేసుకున్నాడు. ఇక తాను తలపెట్టిన దేశాక్రమణ మహత్కార్యానికి అవరోధం ఎవరా అని తేరిపార చూస్తే అతడికి టిప్పు సుల్తాన్ కనిపించాడు.

అప్పటికి టిప్పు పేరు చెబితే ఇంగ్లీషు వారికి హడలు. తెల్లవారిపై తండ్రి ప్రకటించిన యుద్ధాన్ని తండ్రి మరణానంతరం టిప్పు కొనసాగించి, సైనిక పరాక్రమంతో వారిని మన్ను కరిపించి, 1784లో మంగళూరు కదనరంగాన తనతో కాళ్లబేరానికి వచ్చేట్టు చేశాడు. అంతటి వీరుడిని తాను మెడలు వంచగలిగితే అమెరికాలో చుట్టుకున్న అప్రతిష్ఠ తొలిగి తన ప్రతాపం ప్రపంచమంతా మారు మోగుతుందని కారన్‌వాలిస్ భావించాడు. శత్రువునైతే సరిగానే ఎంచుకున్నాడు. కాని అతడిని జయించటానికి అనుసరించిన మార్గం ఏ రకంగా చూసినా నీతి బాహ్యమైనది.

అంతదాకా నయవంచనలు, ఫోర్జరీలు, మోసాలవల్లే తెల్లవారు భారతదేశాన్ని కొద్దికొద్దిగా నొల్లుకుంటూ వచ్చారు. బాహాటంగా ఎదుటపడి వీరోచితంగా పోరాడి వారు యుద్ధంలో రాజ్యాన్ని గెలిచిన సందర్భం ఒక్కటీ లేదు. క్లయివ్, హేస్టింగ్స్ స్వశక్తితో అంగుళం నేలను కూడా గెలవలేదు. ప్రసిద్ధికెక్కిన ప్లాసీ యుద్ధంలో మీర్జాఫర్ నమ్మకద్రోహం పుణ్యమా అని అనూహ్యంగా విజయం సిద్ధించిన సమయానికి "మహావీరుడు" క్లయివ్ గుడారంలో నిద్రపోతున్నాడు! ఈ రీతికి భిన్నంగా యుద్ధంలో ప్రత్యక్షంగా గెలిచి, సైనిక ప్రతాపంతో ఒక రాజ్యాన్ని తెల్లవారు జయించడం మొట్టమొదటిగా కారన్‌వాలిస్ హయాంలోనే జరిగింది. ఇందుకు ఆయన అభినందనీయుడే. ఎటొచ్చీ అతడు పోరాడిన తీరే చాలా దుర్మార్గమైనది.

కారన్‌వాలిస్ రంగప్రవేశానికి రెండు సంవత్సరాల ముందు దేవుడి మీద ప్రమాణం చేసి మంగళూరులో కుదుర్చుకున్న సంధి ప్రకారం ఇంగ్లీషు వారు టిప్పును తమ మిత్రుడిగా గుర్తించారు. ఇకపై అతడితో వైషమ్యాన్ని మానతామనీ, ఇకపై దాడులకు దిగమనీ, అతడికి వ్యతిరేకంగా ఎటువంటి పనీ చేయమనీ, అతడికి అవసరమైనప్పుడు సైనిక సాయం చేస్తామనీ మాట ఇచ్చారు. ఒకసారి సంధి చేసుకున్నాక దాని షరతులకు కట్టుబడటం భారతీయుల పద్ధతి. మాటకు కట్టుబడ్డంత వరకూ, అనవసరంగా రెచ్చగొట్టనంత వరకూ మనవారు సాధారణంగా ఎవరి మీదా కత్తిఎత్తరు. దొరల నైజం ఇందుకు పూర్తిగా విరుద్ధం. నీతులు చెబుతూ గోతులు తీయటమే వారికి తెలిసిన రాజకీయం. టిప్పుతో మిత్రత్వానికి తాము కట్టుబడ్డ మంగళూరు సంధి అమల్లో ఉండగానే... దానిని టిప్పు ఉల్లంఘించాడనటానికి ఏ రుజువూ లేకుండానే... పైకి అతడితో స్నేహవచనాలు సాగిస్తూనే... కారన్‌వాలిస్ అతడితో అకారణ వైరం బూనాడు. టిప్పుతో మిత్రత్వ ఒప్పందం అమల్లో ఉండగానే, "We went to form an alliance with the Marathas against Tipu, our common enemy" (మన ఉమ్మడి శత్రువైన టిప్పుకు వ్యతిరేకంగా మరాఠాలతో కూటమి కట్టాలనుకుంటున్నాము) అని నాగపూరులోని తన ఏజంటు ఫోస్టరుకు గవర్నర్ జనరల్ జాబు రాశాడు. టిప్పు మహాక్రూరుడని, ప్రజలను అమానుషంగా హింసించి, ఊచకోతలు కోసే పాపాత్ముడని, మొత్తం మానవ సమాజానికే శత్రువనీ కారన్‌వాలిస్ పథకం ప్రకారం దుష్ప్రచారానికి దిగాడు. తన ఆక్రమణలోని ప్రాంతాలపై టిప్పుకున్న సార్వభౌమాధికారాన్ని గుర్తించిన

1784 సంధిని తుంగలో తొక్కి అతడి ఆధిపత్యాన్ని కత్తిరించే కుత్సితానికి పాల్పడ్డాడు.

భారతీయ ప్రభువుల గొడవల్లో తల దూర్చవద్దని, ఒకరికి అనుకూలంగానో, ఒకరికి వ్యతిరేకంగానో సైనిక కూటములు కట్టొద్దని బ్రిటిష్ పార్లమెంటు, చట్టపరంగా చేసిన కట్టడిని యథేచ్ఛగా అతిక్రమించి టిప్పూకు వ్యతిరేకంగా కారన్‌వాలిస్ మరాఠాలను దువ్వాడు. నిజాంను బుట్టలో వేసుకున్నాడు. టిప్పూ ఆక్రమించిన తన ప్రాంతాలను తిరిగి వశం చేసుకోవడానికి– కంపెనీ తనకు అరువిచ్చిన సేనలను ఉపయోగించుకోవాలని నిజాం ఉవ్విళ్ళూరగా... సంధి రీత్యా టిప్పూ తమకు మిత్రుడన్న సంగతినీ... మిత్రుడిపై ఇంకొకరి యుద్ధానికి సహకరించడం నిషిద్ధమన్న నీతినీ విస్మరించి నిజాంతో లోపాయికారీగా 'వల్లె' అన్నాడు. టిప్పూకు అది సహజంగానే ఒళ్ళుమండించింది. తన మాటలవల్ల, చేష్టలవల్ల అతడిలో అంతకంతకూ ప్రబలిన అనుమానాలను కారన్‌వాలిస్ బుద్ధి పూర్వకంగా వృద్ధి చేశాడు. మరాఠాలను, నిజాంను కూడగట్టిన తరువాత టిప్పూ సుల్తానుపై వట్టి పుణ్యానికి భీకర యుద్ధం ప్రకటించాడు.

దీనికి సాకు తిరువాన్కూరుపై టిప్పూ దాడి. దాడి జరిగింది తిరువాన్కూరు రాజు మీదే తప్ప ఇంగ్లీషువారిపై కాదు. ఆ రాజు తమకు నేస్తుడు కనక అతడిపై కత్తి ఎత్తడమంటే తమపై ఎత్తడమేనని కారన్‌వాలిస్ వాదన. నేస్తుల విషయంలో అంతటి ఆరాటం తెల్లవారికి ఎన్నడూ లేదు. తమ కొత్త నేస్తులైన మరాఠాల మీద, నిజాం మీద అదే టిప్పూ దండెత్తినప్పుడు మిత్రులకు సాయంగా సైన్యాన్ని పంపాలన్న మంచి బుద్ధి దొరగారికి పుట్టలేదు. తమకు లాభం ఉండదనుకుంటే టిప్పూ బారిన పడ్డ తిరువాన్కూరును కూడా దాని ఖర్మానికి దాన్ని వదిలేసేవారే. మరాఠాలు, నిజాం కుడి ఎడమల బాసటగా ఉంటామనటంతో టిప్పూను అణచటానికి అదే సమయమనిపించి, తిరువాన్కూరును ఒక మిషగా వాడుకున్నారు.

టిప్పూకు చెందిన భూభాగాన్ని అక్రమంగా డచ్చివారి నుంచి సంపాదించి తీరం పొడవునా కందకం తవ్వి "రక్షణ శ్రేణులు" నెలకొల్పటంవల్ల, తనపై తిరగబడిన వారికి ఆశ్రయం ఇవ్వడం వల్ల తిరువాన్కూరుపై టిప్పూ ఆగ్రహించడం సమంజసమే. ఆ సంగతి 'కంపెనీ' అధికారులే ఒప్పుకున్నారు. తిరువాన్కూరు రాజే తొలి దురాక్రమణ చేశాడని, అతడిని శిక్షించబూనినప్పటికీ ఇంగ్లీషు వారితో శత్రుత్వం టిప్పూ ఉద్దేశం కానేకాదని, సామరస్యంగా అన్నీ సర్దుబాటు చేసుకోవటానికి అతడు సిద్ధమేనని సాక్షాత్తూ మద్రాసు ప్రెసిడెన్సీ గవర్నరే కారన్‌వాలిస్‌కు చెప్పాడు. గవర్నరు వద్దని వారించినా కారన్ వాలిస్ వినలేదు. టిప్పూకు కనీసం సమాధానం చెప్పుకునే అవకాశమైనా ఇవ్వలేదు... అతడు యుద్ధానికి సిద్ధంగా లేని సమయం చూసి కారన్‌వాలిస్ పిడుగులా పడ్డాడు. టిప్పూ బెంబేలు పడకుండా పౌరుషంతో ప్రతాపం చూపి, జనరల్ మెడోస్‌ను ఓడించటంతో మద్రాసు ప్రభుత్వాన్ని పక్కకునెట్టి నేరుగా కారన్‌వాలిసే సేనా నాయకత్వం స్వీకరించాడు. టిప్పూ ఎన్ని రాయబారాలు పంపినా లక్ష్యపెట్టకుండా దూతలను అవమానించి, పంపిన కానుకలను తిప్పి కొట్టి, సామరస్య సాధనకు అన్ని దారులూ దుర్మార్గంగా మూసి మరాఠాల అండ చూసుకుని కయ్యానికి కాలుదువ్వాడు. ***The History of British India*** గ్రంథంలో జేమ్స్‌మిల్ చెప్పినట్టు.

"The English in India at that time had been worked up into a mixture of fury and rage against Tipu, more resembling the passion of savages against their enemy... than the feelings



with which a civilised nation regards the worst of its foes".

[***The History of British India,*** *Vol.V., p.278*]

*(ఆ సమయంలో ఇండియాలోని ఇంగ్లీషు వారు టిప్పూపై ప్రదర్శించిన మహాక్రోధం ఆటవిక కిరాతకులు శత్రువుపై చూపే క్రూరత్వాన్ని పోలిందే తప్ప ఒక నాగరిక జాతి తన విరోధుల పట్ల వ్యవహరించాల్సినతీరుకు తగ్గట్టుగా లేదు).*

1790 నుంచి 1792 వరకు సాగిన మూడవ మైసూరు యుద్ధంలో చివరికి గెలిచిన ఇంగ్లీషు సేనలకు నాయకత్వం వహించింది కారన్‌వాలిస్ అయినా గెలుపుకు ముఖ్యకారకులు మాత్రం మరాఠాలు. సయోధ్యకు అన్ని యత్నాలూ విఫలమయ్యాక మొండికి పడిన టిప్పూ చూపిన ప్రతాపానికి ఒక దశలో తెల్ల సేనలు గజగజ వణికాయి. శ్రీరంగపట్నం కోటపై మొదటి ముట్టడి విఫలమై. పశువుల మరణంతో ఫిరంగులను లాగే దిక్కులేక... కుంభవృష్టిలో, ఆకలి బాధతో సైనికుల ప్రాణాలు కడబట్టగా చేసేదిలేక తోకముడిచి బెంగళూరుకు మరలిపోతున్న కారన్‌వాలిస్‌ను సమయానికి మరాఠా దండు అండగా వచ్చి ఉండకపోతే కథ మరోలా ఉండేది. ఆ తరువాతైనా ముప్పేట దాడితో శ్రీరంగం కోటను ముట్టడించి కారన్‌వాలిస్ దిగ్విజయం సాధించింది ప్రతాపంతో కంటే నీచత్వంవల్లే అనటం సబబు. హైదరాలీ, టిప్పూ సుల్తాన్‌లు కోట రక్షణకు యూరోపియన్ల మీద ఆధారపడటమే చివరికి వినాశ హేతువైంది. కిరాయి సైనికులను నమ్మి శ్రీరంగపట్నం కోటలో కీలక రక్షణ బాధ్యతలను టిప్పూ అప్పగిస్తే వారిలో చాలామంది– ముఖ్యంగా ఫ్రెంచివారు– ఆంగ్లేయుల ప్రలోభాలకు లోబడి, సరైన అదనులో స్వామి ద్రోహానికి పాల్పడి శత్రువులతో చేతులు కలిపారు.

మూడు వైపులనుంచి చుట్టుముట్టిన 1792 సెప్టెంబర్లో విరోధుల ధాటికి తట్టుకోలేక టిప్పుసుల్తాన్ చేతులెత్తాడు. కారన్ వాలిస్‌దే అంతిమ నిర్ణయమైతే అప్పుడే అతడిని చంపేసి, అతడి రాజ్యాన్ని కంపెనీ కమతంలో కలిపేసుకునేవాడే. అదృష్టవశాత్తూ నానాఫడ్నవిస్ అందుకు అడ్డుపడ్డాడు. టిప్పూ మీద ఎంత కోపం ఉన్నా, అతడిని ఏకంగా రంగం నుంచే నిర్మూలించి ఆ రాజ్యాన్ని తెల్లవారి పరం చేయటానికి నానాకు మనస్కరించలేదు. అతడు పట్టుబట్టటం వల్ల టిప్పూ ప్రాణాలైతే దక్కాయి. కాని అవమానకరమైన సంధికి ప్రతిఫలంగా అతడు చెల్లించింది చాలా పెద్ద మూల్యం. తన రాజ్యంలో సగభాగాన్ని అతడు విజేతలకు అప్పగించవలసి వచ్చింది. ఆపైన మూడు కోట్ల రూపాయల పరిహారం చెల్లింపు! దానికి పూచీగా అతడి కుమారులిద్దరిని బందీలుగా తెల్లవారి వెంట పంపాలి. కడుపు భగ్గున మండినా పౌరుషాన్ని తనలోనే అణచుకుని టిప్పుసుల్తాన్ అన్ని షరతులకూ సమ్మతించాడు. అతడి నుంచి లాక్కున్న రాజ్యాన్ని ఇంగ్లీషువారు, మరాఠాలు, నిజాం నవాబు సమానంగా పంచేసుకున్నారు.

చిత్రమేమిటంటే – యుద్ధాన్ని మొదలెట్టింది తిరువాన్కూరు రాజును ఆదుకునే నెపంతో, యుద్ధం గెలిచాక సంధి షరతుల్లో మాత్రం తిరువాన్కూరు ఊసేలేదు. ఊళ్ళు, డబ్బులు పంచుకునే తొందరలో ఆ వెర్రిరాజు సంగతే మూడు మిత్ర పక్షాలకూ గుర్తురాలేదు.

# కుట్ర కూల్చిన కోట

***LIBERTY! EQUALITY!***
***To : The Most Maginificient Sultan,***
***Out greatest Friend, Tipu Sultan***

***You have already been informed of my arrival on the borders of the Red Sea with an innumerable and invincible army full of the desire of relieving you from the iron yoke of England... ...I would even wish you could send some intelligent person to Suez or Cairo possessing your confidence, with whom I might confer.***

**BONAPARTE**

మహా ఘనత వహించిన మిత్ర శ్రేష్ఠులు టిప్పుసుల్తాను గారికి-

ఇంగ్లండు ఉక్కు పట్టునుంచి మీకు ఊరట కలిగించే ఉద్దేశంతో మేము ఎర్ర సముద్ర తీరానికి అజేయమైన అసంఖ్యాక సైన్యంతో చేరుకున్న సంగతి మీకు ఈ వరకే తెలియపరిచాము... మీకు నమ్మకస్తుడైన బుద్ధిశాలినెవరినైనా సూయజ్‌కో, కైరోకో పంపిస్తే నేను అన్ని విషయాలు చర్చించగలను.

బోనపార్టి

ఫ్రెంచి మహావీరుడు నెపోలియన్ బోనపార్టి 1798 పూర్వార్ధంలో టిప్పుసుల్తానుకు రాసిన లేఖ ఇది. ఆ సంవత్సరం జనవరిలో మారిషస్‌లోని ఫ్రెంచి గవర్నరు జనరల్ మాలార్టిక్ ద్వారా అందిన టిప్పు సైనిక సంధి ప్రతిపాదనలకు ఇది నెపోలియన్ ఇచ్చిన జవాబు. అప్పటికి ఆరేళ్ల కింద మూడో మైసూరు యుద్ధంలో మరాఠాల పుణ్యమా అని కారన్‌వాలిస్ గెలిచి అవమానకరమైన ఒప్పందాన్ని టిప్పుసుల్తాన్ నెత్తిన రుద్ది నవనాడులు కుంగదీసినా టిప్పు గుండె చెదిరి బేజారవలేదు. యుద్ధం వల్ల అతడికి డెబ్భై కోటలు పోయాయి. యాభైవేల సైనికులు మరణించారు. లేదా తీవ్ర గాయాలతో మూలనపడ్డారు. మూడున్నర కోట్ల నగదు పరిహారం కట్టాల్సి వచ్చింది. సగం రాజ్యం వదులు కోవలసి వచ్చింది. ఆ రకంగా అతడి కోరలు పీకి కోలుకోలేని దెబ్బ కొట్టామనే తొల్లదొరలు అనుకున్నారు.

కాని టిప్పుసుల్తాన్ పరాభవాన్ని అంత తేలిగ్గా మరచి పరిస్థితులతో రాజీపడే రకం కాదు. పళ్లబిగువున మెల్లిగా కాలూ చెయ్యీ కూడదీసుకుని అగర్వ శత్రువులైన ఇంగ్లీషువారికి వ్యతిరేకంగా జాతీయ, అంతర్జాతీయ కూటములు కట్టటానికి టిప్పు శాయశక్తులా ప్రయత్నించాడు. అటు మరాఠా దర్బారుతోనూ, ఇటు నిజాంతోనూ దౌత్యం నెరిపి, 'కంపెనీ' ధృతరాష్ట్ర కౌగిలి నుంచి తప్పించి వారిని తనకు అనుకూలంగా తిప్పుకోవటానికి తెలివిగా ఎత్తులు వేశాడు. బ్రిటిష్ వారిని కూలదోసి భారతదేశం నుంచి గెంటివేయటానికి సైనిక సహాయం కోరుతూ మస్కట్ ఇమాం దగ్గరికీ, పర్షియా షా చెంతకూ దౌత్య బృందాలను పంపాడు. ఆంగ్లేయులను తరిమి మొగల్ పాదుషాను పునఃప్రతిష్ఠించడానికి హిందుస్తాన్‌పైకి దండెత్తి రావలసిందిగా ఆఫ్గానిస్తాన్ రాజు జమాన్‌షాకు టిప్పు రాయబారం పంపాడు.

ఇవన్నీ ఒక ఎత్తయితే ఫ్రాన్సుతో సైనిక కూటమికి టిప్పు సుల్తాన్ ప్రయత్నాలు ఇంకో ఎత్తు. టిప్పుకు ఫ్రెంచివారు నికరంగా చేసిన ఉపకారం ఏమీ లేకపోయినా అతడి దౌత్య ప్రతిపాదనలను స్వాగతించి నైతిక మద్దతు బాగా ఇచ్చారు. సరిగా అదే కాలంలో ఫ్రాన్సులో విప్లవం వచ్చింది. రాజరికం కూలి 16వ లూయీ, అతడి రాణి మేరీ గిలిటిన్‌కు బలి అయ్యారు. రక్తపుటేరుల నడుమ ప్రజాస్వామ్య శిశువు జన్మించింది. అంత వరకూ ఎక్కడా కనీవినీ ఎరుగని ఆ అరాజక వ్యవస్థను ఎలా అర్థం చేసుకోవాలో అంతుబట్టక ప్రపంచ దేశాల్లో చాలా మంది ప్రభువులు నిర్ఘాంతపోయిన స్థితిలో టిప్పుసుల్తాన్ నూతన మార్పుల పట్ల అరుదైన అవగాహనను కనపరిచాడు. ఫ్రాన్సుతో సంధికి అతడు పావులు కదుపుతున్న కాలంలోనే ఫ్రెంచి విప్లవ కల్లోలం నుంచి మహావీరుడు నెపోలియన్ ప్రపంచ రణరంగ స్థలిపైకి దూసుకువచ్చాడు. ఫ్రెంచి రిపబ్లికన్ సైన్యంతో ఇటలీలో దిగ్విజయం సాధించి, హాప్స్‌బర్గ్ సామ్రాజ్యాన్ని కుప్పకూల్చి, తూర్పు జైత్రయాత్ర చేసి, వీలైతే ఇండియానూ జయించే ఉద్దేశంతో అతడు ఈజిప్టులో అడుగుపెట్టాడు. కైరో-I హెడ్ క్వార్టర్సులో ఉండగా అందుకున్న టిప్పు ప్రతిపాదనలకు నెపోలియన్ ఇచ్చిన పై జవాబును బట్టి ఇంగ్లండు, ఫ్రాన్సుల నడుమ ఆధిపత్య సంగ్రామానికి భారతదేశం ప్రధాన కదనరంగం కానుండినదని స్పష్టం.

అంతా సవ్యంగా జరిగితే చరిత్ర గతి ఎలా ఉండేదో, కానీ 1798 అక్టోబరు పోరులో నైలు నదిలో నెపోలియన్ నౌకాదళం నాశనమవటంతో ప్రాచ్య జైత్రయాత్ర ఆశలుడిగాయి. ఇంగ్లండుపై యుద్ధాన్ని ప్రకటించిన ఫ్రాన్సు సైనిక సహాయంతో తన దేశానికి బ్రిటిష్ పీడ విరగడ చేయాలనుకున్న టిప్పు వ్యూహం భగ్నమైంది. కాని- అతడు ఫ్రెంచి సహాయాన్ని అపేక్షించడమే - అతడిని నాశనం చేయటానికి చక్కని సాకుగా కొత్త గవర్నర్ జనరల్ లార్డ్ మార్నింగ్‌టన్ (వెల్లస్లీ)కి పనికి వచ్చింది.

రిచార్డ్ వెల్లస్లీ బ్రిటిష్ రాజ ప్రతినిధిగా ఇండియాలో అడుగుపెట్టేసరికే టిప్పుసుల్తాన్‌ను ఎలాగైనా అణచివేయాలని కృతనిశ్చయంతో ఉన్నాడు. భారతదేశాన్ని కబళించి తమ సామ్రాజ్యంలో కలిపేసుకోవాలని బ్రిటిష్ ప్రభువులు ఆ సమయంలో ఉవ్విళ్లూరుతున్నారు. అప్పటికే చాపకింద నీరులా వ్యాపించి, బెంగాల్ ఉత్తర సర్కార్లు, మద్రాసు, మలబారు, బొంబాయిలను కుట్రలూ కుహకాల కూటనీతితో తెల్లవారు ఆక్రమించగలిగారు. అయోధ్య, ఆర్కాట్ నవాబులు, తిరువాన్కూరు, కూర్గురాజాలు వారి గుప్పిట్లో ఉన్నారు. ఉత్తరాదిన ఢిల్లీలో కళ్లు పీకేయబడ్డ మొగల్ చక్రవర్తి సింధియా అధీనంలో నామమాత్రావశిష్టంగా ఉన్నాడు. రాజపుత్రుల రాజకీయ ప్రాభవం అంతరించింది. పంజాబులో సిక్కులు బలం

పుంజుకుంటున్నా అసంఘటితమై ఉన్నారు.

ఆ కాలానికి దేశంలో సర్వ సత్తాక స్వతంత్ర ప్రభువులని చెప్పగలిగిన వారు ముగ్గురు మాత్రమే. పీష్వా, నిజాం, టిప్పుసుల్తాన్. మరాఠాల్లో చిట్టచివరి కార్యదక్షుడు, రాజనీతిజ్ఞుడు అయిన నానా ఫడ్నవిస్ అధ్యాయం ముగిసి, సిందియా-హోల్కర్ వంశాల చిరకాల వైరం ముదిరి, అంతఃకలహాలు హెచ్చి మరాఠా రాజ్యం కళాకాంతులు పోయి నిస్తేజంగా ఉంది. మరాఠా శని రఘునాథరావు సుపుత్రుడు, అన్ని విధాల అయోగ్యుడు, అధముడు అయిన రెండో బాజీరావు పూనా గద్దెమీద కూర్చుని ఉన్నాడు. ఇక నిజాం రాజ్యం నానా కంగాళీగా ఉంది. 1795లో మరాఠాలు కొట్టిన చావుదెబ్బతో నిజాంకు నవ నాడులు కుంగాయి. ఏతావతా భారతదేశం మొత్తం మీద బ్రిటిష్ రాజ్య తంత్రానికి సవాలు వస్తేగిస్తే టిప్పుసుల్తాను నుంచే రావాలి. కిందటి యుద్ధంలోనే అతడిని కారన్ వాలిస్ గుటుక్కుమనిపిద్దామన్నాడు. కాని మరాఠాలు పడనివ్వలేదు. కుంగదీసే సంధి షరతులకు తట్టుకుని, తీవ్ర ప్రతికూల పరిస్థితులకు ఎదురొడ్డి కాలూ చెయ్యీ కూడదీసుకొవటానికి టిప్పు తంటాలు పడుతున్నాడు. ఆ నిస్సహాయ పరిస్థితిలో అతడి నుంచి ఇంగ్లీషు వారికి ఎటువంటి ప్రమాదం లేదు. నెల్సన్ చేతిలో నెపోలియన్ పరాభవం తరవాత ఫ్రాన్సు నుంచి సైనిక సాయం అందే ఆశ అతడికి పోయింది. ఇరుగు పొరుగు రాజ్యాలను కూడగట్టుకునే అవకాశమూ లేదు. అయినాసరే ఉపేక్షించడానికి వీలులేదని, బలహీనంగా ఉండగానే అతడిని కాలరాచి వేయటం మంచిదని వెల్లస్లీ అనుకున్నాడు.

దానికీ ఒక మిషకావాలి కదా? ఫ్రెంచి వారి సాయం కోసం టిప్పు చేసిన విఫల యత్నం అందుకు వాటంగా పనికొచ్చింది. న్యాయప్రకారం టిప్పుసుల్తాన్ సార్వభౌమాధికారం గల స్వతంత్ర పాలకుడు. అంతర్జాతీయంగా ఏ దేశంతోనైనా ఎటువంటి సంబంధాలనైనా పెట్టుకునే అధికారం అతడికి ఉంది. ఫ్రాన్సు నుంచి సహాయం కోరడానికి అతడికి ఇంగ్లీషు వర్తకుల కంపెనీ ఆజ్ఞ, అనుమతి అక్కర్లేదు. ఇంగ్లీషు వారికి వ్యతిరేకంగా అతడు వేరే దేశం సహాయం పొందాలని విఫలయత్నం చేసినంత మాత్రానే అతడిని శత్రువుగా పరిగణించి తెల్లవారు ఏకపక్షంగా యుద్ధానికి దిగటం అక్రమం. తమతో కుదుర్చుకున్న సంధి షరతులకు టిప్పు కట్టుబడి ఉన్నంతవరకూ, అతడివల్ల తమ భద్రతకు ముప్పు వాటిల్లిందనడానికి సహేతుక దృష్టాంతమేదీ లేనంతవరకూ, కేవలం అతడి ఉద్దేశాన్నే అపరాధంగా భావించి, సంధి ఒప్పందాన్ని తుంగలో తొక్కి కయ్యానికి కాలుదువ్వటం అనుచితం.

టిప్పు పక్షాన ఇంగ్లీషువారితో పోరాడేందుకు ఇష్టం ఉన్నవారు ముందుకు రావచ్చంటూ మారిషస్ పౌరులకు ఫ్రెంచి గవర్నరు మాలార్టిక్ 1798 జనవరిలో వెలువరించిన ప్రకటనను తన అధర్మ యుద్ధానికి సాకుగా వెల్లస్లీ చూపెట్టాడు. సదరు ప్రకటనకు స్పందించి శ్రీరంగపట్నానికి చేరుకున్న కిరాయి ఫ్రెంచి సైనికుల సంఖ్య రెండువందల లోపేనన్న వాస్తవాన్ని మాత్రం మరుగుపరచాడు. టిప్పు సుల్తాన్‌వల్ల మనకు ఏ విధమైన సమస్యా లేదు; మనం కావాలని కవ్విస్తే తప్ప అతడినుంచి ఎటువంటి ప్రతిఘటనకూ ఆస్కారం లేదు. అని మద్రాసు ప్రెసిడెన్సీలోని తన అధికారులే చెప్పిన సంగతినీ వెల్లస్లీ పెడచెవిన పెట్టాడు. టిప్పుతో మంచిగా ఉన్నట్టే నటిస్తూ అతడి స్నేహ ప్రతిపాదనలకు స్నేహ పూర్వకంగానే జవాబులిస్తూ అతడి వెనుక గోతులు తవ్వాడు. మరాఠాలను, నిజాంను తనకు అనువుగా సెట్ చేసే పని అయి, సైనిక సన్నాహాలన్నీ పూర్తయ్యాక ముసుగుతీసి



అవతల పారేసి ఫ్రెంచి వ్యవహారం సాకుతో టిప్పుపై రాక్షసంగా విరుచుకుపడ్డాడు.

ఆ సమయాన టిప్పు ముందున్న ప్రత్యామ్నాయాలు రెండే; నిజాం లాగా మిగతా దేశీయ ప్రభువులు పలువురిలాగా ఇంగ్లీషువారి సాలెగూట్లో ఇచ్ఛికంగా ఇరుక్కుని, తన ఖర్చుతో వారు సమకూర్చే సైనిక రక్షణ మీద ఆధారపడి నామమాత్ర అధికారంతో వాస్తవానికి ఘరానా బందీ స్థాయికి తనను తాను దిగజార్చుకోవటం; లేదా అన్నిటికీ తెగించి యుద్ధానికి సిద్ధపడటం. టిప్పుసుల్తాన్ వీటిలో గౌరవప్రదమైన రెండో దారిని ఎంచుకున్నాడు. శక్తి చాలదని, పరిస్థితులు అనుకూలంగా లేవని, గెలిచే ఆశలేదని తెలిసినా ఇంగ్లీషువారు దౌర్జన్యంగా రుద్దిన యుద్ధానికి వెరవక వీరుడిలా పోరాడి, యుద్ధంలోనే వీర మరణం పొందాడు.

1799 మేలో శ్రీరంగపట్నాన్ని రెండువైపులాల నుంచి ముట్టడించిన 31 వేల ఇంగ్లీషు సైన్యం సంఖ్యాపరంగా చాలా పెద్దదే, అయినా కేవలం మూడు రోజుల్లో వారు సునాయాసంగా కోటను పట్టుకుని టిప్పును చంపగలిగింది సైనిక పరాక్రమంతోనా? కాదు. ద్రోహుల అండతో. శ్రీరంగపట్నంలో ఉన్నది ఆషామాషీ కోటకాదు. అది శత్రుదుర్భేద్యమని అందరూ అనుకునేవారు. బాహాబాహీ తలపడి ఇంగ్లీషు వారిని తరిమికొట్టటం టిప్పుకు శక్తికి మించిన పనే. కాని-వారి దాడి నుంచి ఆత్మరక్షణ చేసుకోవటానికి కావలసిన సైనిక బలం అతడికి ఉంది. సుమారు 22వేల సైనికులు సర్వసన్నద్ధంగా నిరంతరం సంరక్షించే కోట- తిండికి మొగం వాచి తంతే కూలిపోయే స్థితికి చేరిన బ్రిటిష్ బలగాలకు రెండు గంటల్లో అవలీలగా వశమైందంటే విద్రోహతంత్రమే దానికి ప్రధాన కారణం. టిప్పు సుల్తానుకు ముఖ్య సర్దారులయిన మీర్‌సాదిక్, నాదిమ్, కమరుద్దీన్‌ఖాన్‌లు బ్రిటిష్ వారికి అమ్ముడుపోయి స్వామి ద్రోహానికి పాల్పడ్డారు. కోట గోడ బద్దలు కొట్టి ఇంగ్లీషు సైనికులు లోపలికి చొరబడిన సంగతి దుర్గరక్షకులు సుల్తానుకు తెలియపరచనే లేదు. విషయం అతడికి తెలిసేసరికే పరిస్థితి చేయిదాటిపోయింది. ***History of Tippu Sultan***లో **Mohibul Hassan Khan** అన్నట్టు *the fall of Seringapatnam was facilitated by a conspiracy organised by some of the chief officers of the Mysore Government in concert with the English.* (శ్రీరంగపట్నం పతనం మైసూరు ప్రభుత్వంలోని ముఖ్యాధికారులు కొందరు ఇంగ్లీషువారితో చేరి కుట్ర చేయడంవల్లే సుకరమైంది).

ఎంతగా పోరాడినా ప్రయోజనం లేదని అర్థమయ్యాక సొరంగ మార్గం గుండా తప్పించుకోవాలని టిప్పు ప్రయత్నించగా అందుకు వీల్లేకుండా సొరంగ ద్వారాన్ని మీర్‌సాదిక్ మూసి వేయించాడు. సుల్తాను స్వయంగా ఆజ్ఞాపించినా దుర్గ పాలకుడు మీర్ నాదిమ్ లక్ష్యపెట్టలేదు. కోటను కాపాడవలసిన వారే అసలైన అదనులో శత్రువుతో కుమ్మక్కవటంతో సుల్తానే మామూలు సిపాయిలా శత్రువులతో హోరాహోరీగా పోరాడాడు. తుపాకీ దాడిలో, అతడి గుర్రం చచ్చింది. ఛాతీలో తుపాకి గుండు తగిలి తీవ్రంగా గాయపడ్డ సుల్తానును సేవకులు పల్లకిలో వేసుకొని శవాల గుట్టల మధ్యనుంచి దారిచేసుకుని పోతూంటే ఇంగ్లీషు సిపాయి ఒకడు అడ్డుకుని వజ్రాలు పొదిగిన అతడి కత్తి ఒరను లాక్కోబోయాడు. అవమానాన్ని సహించని టిప్పు అతడిపై కత్తి దూయగా తెల్లవాడు కణతలకు గురిపెట్టి టిప్పును కాల్చేశాడు. అతడే సుల్తాను అన్న సంగతి ఆ సమయంలో ఎవరికీ తెలియదు.

టిప్పును చంపాక చాలారోజులపాటు శ్రీరంగపట్నంలో ఇంగ్లీషు సేనలు తెగబడి

సాగించిన దోపిడీలు, ఇళ్లమీద పడి విలువైన వస్తువులనల్లా కొల్లగొట్టిన వైనాలు, నిస్సహాయ స్త్రీలపై జరిపిన అత్యాచారాలు- తెల్లవారు టిప్పుకు ఆపాదించిన క్రూరత్వంకంటే పదింతలు క్రూరమైనవి. ఖజానాను దోచి, అమూల్యాభరణాలను, వజ్ర సింహాసనాలను ముక్కలు చేసి దొరికినకాడికి దండుకోవటంలో పెద్దదొరలే పోటీలుపడ్డారు. లూటీల పుణ్యకార్యాన్ని జయప్రదంగా పూర్తి చేశాక టిప్పు రాజ్యాన్ని ఇంగ్లీషువారు ముక్కలు చేశారు. తమకు యుద్ధంలో తోడ్పడ్డ నిజాం కళ్లనీళ్లు తుడవటానికి అతడి మొగాన ఒక చెక్క వేశారు. పెద్ద చెక్కలు తాము కాజేసి కార్వాను నుంచి మంగుళూరు దాకా కెనరా పరగణాలను, దక్షిణాన కోయంబత్తూరు, ధర్మపురం ప్రాంతాలను రాజధాని శ్రీరంగపట్నాన్ని సంగ్రహించారు. యుద్ధానికి ముందు టిప్పును మభ్యపెట్టటానికి బహు ఉదారంగా అతడికి తిరిగి అప్పగించిన వైనాడ్ ప్రాంతాన్ని నిస్సిగ్గుగా మళ్లీ కొట్టేసి తమ పెద్ద మనిషి తరహా ఎటువంటిదో చాటుకున్నారు. విశాల ప్రాంతాలను తమ రాజ్యంలో కలిపేసుకోవడమేగాక తూర్పు, పశ్చిమ తీరాలు రెండూ తెల్లవారి గుప్పిట్లో చిక్కాయి. దక్షిణ భారతంలో శ్రీరంగపట్నం సహా అతి ముఖ్యమైన దుర్గాలన్నీ వారి కైవసమయ్యాయి. అయితే టిప్పు రాజ్యాన్ని మొత్తంగా తామే కాజేశారన్న వ్యతిరేక భావన దేశంలో ప్రబలకుండా ఉండటం కోసం తాము సారం పీల్చింది పోగా మిగిలిన పిప్పిని మైసూరు గ్రామం కేంద్ర స్థానంగా ప్రత్యేక సంస్థానం కింద ఏర్పరచారు. అది కూడా స్వతంత్రంగా బతికే రాత లేకుండా తమ 'రక్షణ'లోనే ఉండాలన్నారు.

దొంగలు దొంగలు ఊళ్లు పంచుకోగా మిగిలిన నామమాత్ర రాజ్యపు గద్దె మీద ఎవరిని కూచోబెట్టాలి? పూర్ణయ్యలాంటి పెద్దలు టిప్పు కుమారుడే అందుకు అర్హుడని వాదించారు. వెల్లస్లీ మాత్రం చాలాకాలంగా తమకు సహాయకారిగా ఉన్న పూర్వపు హిందూ రాజకుటుంబానికి చెందిన మూడవ కృష్ణరాజ వొడియార్ అనే పదేళ్ల బాలుడికి ఏరికోరి పట్టం గట్టాడు. ఇందులోనూ ఇంగ్లీషువారి తెలివి కొట్టొచ్చినట్టు కనపడుతుంది. హైదరాలీ కూలదోసిన హిందూ రాజ కుటుంబానికి తిరిగి రాజ్యాధికారం అప్పగించటం ద్వారా చారిత్రక అన్యాయాన్ని సరిదిద్ది తెల్లవారు హిందువులకు మహోపకారమేదో చేసినట్టు పలువురు ఇంగ్లీషు పండితులైతే తెగ పొగిడారు. నిజానికి- హైదరాలీ రంగంలోకి రావటానికి నలభయ్యేళ్ల పూర్వమే మైసూరు మహారాజును హిందువులైన అతడి మంత్రులు దేవరాజు, నంజరాజులే కీలుబొమ్మను చేసి మూల కూచోబెట్టారు. టిప్పును చంపాక తెల్లదొరలకు ఆ రాజ కుటుంబం గుర్తు కొచ్చింది న్యాయం మీద గౌరవంతో కాదు.

ఇందులోని మర్మమేమిటో ఆ కాలపు వెల్లస్లీ ఉత్తర ప్రత్యుత్తరాలను చూస్తే అర్థమవుతుంది. టిప్పు కొడుకును కనుక గద్దెనెక్కిస్తే తనకు రాజ్యమిచ్చారన్న కృతజ్ఞత కంటే - తన తండ్రిని చంపి, తమ రాజ్యంలో సింహభాగం కాజేశారన్న క్రోధమే తెల్లవారిపై కనపరచగలడు. పూర్వ వైభవాన్ని తిరిగి పొందడానికి మిగతా దేశీయ ప్రభువులను అతడు కూడగట్టే ప్రమాదమూ ఉంది. అదే హిందూ రాజకుమారుడైతే? 70 ఏళ్లుగా అధికారం పోయి దిక్కు మొక్కు లేకుండా పడి ఉన్న తమ కుటుంబాన్ని తిరిగి ఉద్ధరించారని ఇంగ్లీషువారికి ఆజన్మాంతం కృతజ్ఞుడై ఉంటాడు. అదీ కిటుకు.

సాలుకు 21 లక్షలు ఇంగ్లీషువారికి మైసూరు రాజు కప్పంకట్టేలా, అందుకు ప్రతిగా బ్రిటిష్ సేనలు అతడి రాజ్యరక్షణ బాధ్యత వహించేలా, కీలక వ్యవహారాలన్నింటిలో సార్వభౌమాధికారం వాస్తవానికి ఇంగ్లీషువారి పరమయ్యేలా చేయవలసిన బిగింపులన్నీ



చేసి 1799 జులై 8న రాజుకూ కంపెనీకి మధ్య ఒడంబడిక కుదిరింది. దాంతో తెల్లవారు ఆక్రమించగా మిగిలిన చెక్క కూడా వారి పంటికింద పోకచెక్కలా పడి వుండే కట్టుదిట్టం పూర్తయింది. దక్షిణ భారతం నుంచి తెల్లవారిని తరిమికొట్టాలన్న తండ్రీ, కొడుకుల వీర పోరాటం అలా విషాదాంతమైంది. పక్కలో బల్లెంలా ఉన్న మైసూరు కంచుకోట కుప్పకూలిపోవడంతో ఇండియాలో ఇంగ్లీషువారి దురాక్రమణకు ఏకైక ప్రతిబంధకం కూడా తొలగిపోయింది. ఇక మిగిలినవన్నీ గుజ్జనగూళ్లే.

# భలే సాలెగూడు

**వెల్లస్లీ గొప్పమనిషి! ఇది సక్రమం; అది అక్రమం అన్న చింత ఆయనకు ఉండదు. ముందు అక్రమాన్ని చేసి ఆనక దాన్ని సక్రమంగా చూపెట్టుకోవటం ఎలాగో ఆయనకు తెలుసు. దొరగారు చిన్నతనంలోనే ఒక ఫ్రెంచి పడుచును ఉంచుకున్నారు. ఆమెకి పిల్లలు పుట్టారు. అక్రమ సంతానాన్ని కన్న తరువాత ఆమెనే లేటుగా పెళ్లి చేసుకుని అక్రమ సంబంధాన్ని సక్రమ దాంపత్యంగా మార్చేసుకున్నాడు. ఆ తెలివితేటలనే రాజనీతిలోనూ చూపించి గవర్నర్ జనరల్‌గా యుక్తాయుక్తాల, ఉచ్చనీచాల జంజాటం పెట్టుకోకుండా భారతదేశ పటంలో విశాల ప్రాంతాలను బ్రిటిష్ బావుటా కిందికి లాగేశాడు.**

ఇంతకీ వెల్లస్లీ ఇంగ్లీషువాడు కాదు. అతడు పుట్టింది ఐర్లండులో. అప్పట్లో ఐర్లండుకు వేరే పార్లమెంటు ఉండేది. అందులో కొంతకాలం వెల్లస్లీ మెంబరు. తరువాత ఇంగ్లండుకు వలస పోయాడు. ఐర్లండు వారికి కష్టకాలంలో ఎన్నోసార్లు సహాయం చేసింది ఫ్రెంచి వారు. వెల్లస్లీకే గనుక స్వదేశాభిమానం ఉంటే ఉపకారులైన ఫ్రెంచివారి పట్ల కృతజ్ఞతా భావం చూపాలి... కానీ ఆయన ఇంగ్లీషు నీళ్లు ఒంటబట్టగానే ఫ్రెంచి వారిపై తగని కక్ష పెంచుకున్నాడు.

దానికీ ఒక కారణం లేకపోలేదు. అతడి ఫ్రెంచి ఉంపుడుగత్తె పెళ్లాంగా ప్రమోషన్ ఇచ్చినా అతడిని లెక్కచేసేదికాదు. ఇండియాకు పోదాం రమ్మని ఎంత బతిమిలాడినా ఆమె ఒప్పుకోలేదు. ఆ గొడవ దగ్గరే ఇద్దరికీ తెగతెంపులయ్యాయి. అప్పటినుంచీ మొత్తం ఫ్రెంచి జాతిమీదే మహాద్వేషం పెంచుకున్నాడు. ఎక్కడెక్కడి ఫ్రెంచి వారినీ ఏరివేసి శాయశక్తులా వేటాడటం ఒక ప్రధాన లక్ష్యంగా ఇండియా ఆక్రమణకు వెల్లస్లీ బృహత్ వ్యూహాన్ని పన్నాడు.

తన 37వ ఏట గవర్నర్ జనరల్‌గా నియమితుడయ్యే నాటికి భారతదేశం ఆనుపానులు వెల్లస్లీకి బాగా తెలుసు. పైగా ఇండియాకి పంపించేముందు ప్రధానమంత్రి పిట్టు వారంరోజుల పాటు వెల్లస్లీని తన దగ్గర ఉంచుకుని భారతదేశంలో బ్రిటిష్ సామ్రాజ్యాన్ని ఏమి చేసయినా విస్తరించాలని నూరిపోశాడు. అన్నీ ఆకళింపు చేసుకున్నాక వెల్లస్లీ జాగ్రత్తగా పథకం వేశాడు. అతడు దేనికీ తొందరపడే రకం కాదు. 1797 నవంబరులో ఇంగ్లండులో బయలుదేరి అతడు సరాసరి ఇండియాకు రాలేదు. మధ్యలో దక్షిణాఫ్రికా కేప్ ఆఫ్ గుడ్ హోప్ అగ్రంలో రెండునెలలు మకాం చేసి, భారత ప్రజల స్వాతంత్ర్యాన్ని అపహరించే ఎత్తులన్నిటికీ తీరుబడిగా సానపెట్టాడు. అక్కడ స్థానిక బ్రిటిష్ గవర్నరుకు అతిథిగా "హాయిగా" ఉన్న రెణ్నెల్లలోనే ఆ గవర్నరు భార్య లేడీ అన్నే బెర్నార్డుతో ప్రశస్తమైన ప్రేమకలాపం నడిపాడు. రెండేళ్ల తరువాత టిప్పును వధించిన ఘనకార్యానికి మెచ్చి బ్రిటిష్ ప్రభుత్వం తనకు 'మార్క్విస్' బిరుదాన్నిచ్చిన సందర్భంలో... తాను చేసిన సేవకు ఆ గౌరవం చాలా తక్కువ అని మటమటలాడుతూ - ఈ ప్రియురాలికే 1800 అక్టోబరులో వెల్లస్లీ ఇలా జాబురాశాడు.

"On what honours you compliment me I know not... I have received none- I expect none... But do not suppose me to be so weak as to meditate hasty resignations, or passionate returns to Europe... No. I will shame their injustice... I will heap kingdoms upon kingdoms, victory upon victory, revenue upon revenue; I will accumulate glory and wealth and power... and then I will show my masters what dust in the balance their tardy gratitude is..."

**[*Rise of the Christian Power in India* - B.D. Basu, *p. 306*]**

(నాకు ఏమి గొప్ప గౌరవం వచ్చిందని నన్ను అభినందిస్తున్నావు?... నాకేమీ రాలేదు. వస్తాయని అనుకోను... అంతమాత్రాన తొందరపడి రాజీనామా చేస్తాననో, యూరపునకు తిరిగి పోతాననో నువ్వు అనుకోకు. నాకు చేసిన అన్యాయానికి వారికే సిగ్గొచ్చేట్టు చేస్తా... రాజ్యం తరవాత రాజ్యాన్ని సాధించిపెడతా. విజయం తరవాత విజయాన్ని, రెవిన్యూ మీద రెవిన్యూను తీసుకొచ్చి వారిమీద కుప్పపోస్తా. కీర్తిని, సంపదను, అధికారాన్ని పోగుపడేసి వాటిముందు నా పట్ల చూపిన కృతజ్ఞత ధూళి రవ్వంత చెయ్యదన్న సంగతి నా యజమానులకే చూపిస్తా.)

వెల్లస్లీ మనఃస్థితిని దీన్నిబట్టి అర్థం చేసుకోవచ్చు. అతడు ఎడమకాలు మోపే నాటికి భారతదేశం ప్రశాంతంగా ఉంది. ఇంగ్లీషు వారికి ఎవరితోనూ యుద్ధాలు లేవు. ఎవరికీ వారితో తీవ్ర శత్రుత్వం లేదు. ఇండియాలో కొత్తగా ప్రాంతాలను జయించి, ప్రాబల్యాన్ని ఇంకా విస్తరించుకోవాలన్న ఉద్దేశం తమకు ఎంతమాత్రమూ లేదని 1784 ఇండియా యాక్టులో చెప్పుకున్నదానిమీద బ్రిటిష్ ప్రభువులకే కనుక చిత్తశుద్ధి ఉంటే నూతన విజయాల గురించి ఆలోచించవలసిన అగత్యమే ఆనాడు లేదు. ఒకరి జోలికి పోయే ఉద్దేశమే లేకుంటే దేశీయ రాజుల బలాబలాలను కనిపెట్టి ఉండాల్సిన అవసరం తెల్లవారికి లేదు. కాని- వారి బలాబలాల్ని కనిపెట్టి, ఎలాగైనా బలహీన పరచాలన్నదే ఇండియా పంపేముందు పిట్టు ప్రధాని వెల్లస్లీ చెవిలో ఊదిన మొదటి మాట. ఈ అప్రకటిత లక్ష్యాన్ని సాధించి, విజయం తరవాత విజయాన్ని సాధించి పారేయటానికి దక్షిణాఫ్రికా విడిదిలో వెల్లస్లీ ప్రణాళిక వేశాడు. ఆ సమయంలో అక్కడ ఇద్దరి పరిచయం అతడికి బాగా లభించింది. ఇద్దరూ ఇదివరలో చాలా కాలం ఇండియాలో పనిచేసినవారే. అక్కడి సంగతి సందర్భాలు, దర్బార్ల

గుట్టుమట్లు బాగా తెలిసినవారే.

కొత్త మిత్రుల్లో ఒకడు డేవిడ్ బెయిర్డు. టిప్పుసుల్తానుకు ఖైదీగా చిక్కి అతడి చేతిలో అవమానాలపాలయినందున, ప్రతీకారంకోసం అతడు దహించుకుపోతున్నాడు. రెండో వాడు మేజర్ కర్క్ పాట్రిక్. గతంలో మాధవరావు సింధియా దర్బారులో రెసిడెంటుగా పనిచేసి నానాఫడ్నవిస్‌కూ సింధియాకూ పడకుండా చేసి మహారాష్ట్ర రాజ్యనాశనానికి బీజాలు నాటిన పెద్దమనిషి. తరువాత హైదరాబాద్‌కు రెసిడెంటుగా వెళ్లి, నైజాం రాజ్య ఆంతరంగిక వ్యవహారాల్లో కలగజేసుకుని తంపులుపెట్టి నానా అల్లర్లు లేవదీసిన ఘనుడు. వారన్‌హేస్టింగ్స్, కారన్ వాలిస్‌ల 'బడి'లో చదువుకున్న గుంటనక్క అతడు. అన్నట్టు-దేశీయ రాజ్యాలన్నిటినీ బ్రిటిష్ బుట్టలో వేసుకోవటానికి వెల్లస్లీ అమలు జరిపిన సబ్సిడియరీ అలయెన్సు స్కీము (సైనిక సహకార పథకం) కర్క్‌పాట్రిక్ బుర్రలో పుట్టిందే. ఆ కాలాన దేశీయ రాజ్యాల్లో ముఖ్యమైన మైసూరు, పుణె, హైదరాబాద్‌లలో ఇంగ్లీషువారిపై కత్తిగట్టి యుద్ధం చేయ సాహసించింది మొదటి రెండే. కారన్‌వాలిస్ చేతిలో టిప్పుసుల్తాను అర్ధరాజ్యం కోల్పోయి ఆర్థికంగా చితికినా అతడివల్ల ఎప్పటికైనా తమకు ప్రమాదమేనని వెల్లస్లీకి తెలుసు. మహారాష్ట్రులు వెనుక వారన్ హేస్టింగ్స్ కాలంలో ఉన్నంత దుర్నిరీక్ష్యంగా ఏమీలేరు. పూనాలో మాస్టిను, సింధియా కొలువులో కర్క్‌పాట్రిక్కు దివ్యంగా పనిచేసి, మహారాష్ట్రలో అంతఃకలహాల్ని విపరీతంగా పెంచివేశారు. అయినా మరాఠాల శక్తి ఉడిగిందనటానికి వీలులేదు. ఈమధ్యే కుర్డ్లా యుద్ధంలో నిజాంను వారు చిత్తుగా ఓడించారు. కాబట్టి మహారాష్ట్ర పుట్టలో ఎలాంటి పాములున్నాయోనన్న భయం ఇంగ్లీషువారికి ఇంకా ఉంది. టిప్పును వేటు వేసేంతవరకూ మహారాష్ట్రుల జోలికి పోవటం వెల్లస్లీకి ఇష్టంలేదు.

ఇక మిగిలింది నైజాం. ఆ రాజ్యమంటే తెల్లవారికి మొదటి నుంచీ లోకువే. వంగి వంగి సలాములే తప్ప వారితో పోరాడే ధైర్యాన్ని నైజాం ఎన్నడూ చూపిన పాపాన పోలేదు. యుద్ధరంగంలో గాని, రాజనీతి కౌశలంలో గాని నైజాం రాజ్యానికి దాని జన్మలో ఎప్పుడూ పేరు ప్రఖ్యాతులు లేవు. పైగా తెల్లవారు ఇండియాలో క్రమంగా పైకి ఎక్కటానికి నైజాం ప్రభువులు నిచ్చెనమెట్లుగా పనికొచ్చారు. మొగల్ పాదుషా ప్రతినిధిగా దక్కను సుబేదారుగా వచ్చి, సమయం చూసి స్వామి ద్రోహానికి పాల్పడి స్వాతంత్ర్యం ప్రకటించుకుని హైదరాబాద్ రాజధానిగా సొంత దుకాణం పెట్టిన నిజాం ఉల్ ముల్క్ ఈ రాజ్యానికి స్థాపకుడు. అతడు చనిపోయాక చెలరేగిన వారసత్వ తగాదాలు భారత రాజకీయ వ్యవహారాల్లో ఇంగ్లీషు వారు, ఫ్రెంచివారు తల దూర్చటానికి తొలి అవకాశమిచ్చాయి. నానాఫడ్నవిస్, హైదరాలీల ప్రోద్బలంతో నైజాం ఒక దశలో ఆంగ్లేయుల వ్యతిరేక కూటమిలో చేరినా, గుంటూరు సర్కారును తిరిగి తన మొగాన పడవేయగానే అతడు మళ్లీ తెల్లవారికి తోకాడించాడు. మూడో మైసూరు యుద్ధ సందర్భాన కారన్‌వాలిస్ కోరినంత మాత్రానే నిజాం మారుమాట్లాడక ఉత్తర సర్కారులన్నీ ఇంగ్లీషువారి చేతికి పళ్లెంలో పెట్టి అప్పగించాడు. యుద్ధంలో కోరిన సహాయమల్లా చేశాడు.

సరే! తమకు ఎక్కువ మేలు నైజాం చేశాడు కనుక మొదటి కీడు అతడికే చేయాలని వెల్లస్లీ దొర సంకల్పించాడు! ఉన్న రాజులందరిలోకీ అతడే దుర్బలుడు కాబట్టి దురాక్రమణను అతడితోనే మొదలుపెట్టాలని, మహారాష్ట్రుల చేతిలో దెబ్బతిని ఉన్న స్థితిలోనే నైజాంను పూర్తిగా తమ గుప్పిట్లో ఇరికించుకోవాలని అతడు కుటిల వ్యూహం పన్నాడు. దానికి



ముద్దుపేరే "సైనిక సహకార పథకం".

ఈ పథకం ఒక పయోముఖ విషకుంభం. దేశీయ రాజుల స్వాతంత్ర్యాన్ని కుంగదీసి వారిని, వారి రాజ్యాలను క్రమంగా ఇంగ్లీషువారి కాలి కిందికి పడలాక్కోవటమే దీని ముఖ్యోద్దేశం. పైకి చూడటానికి తీపిగా ఏపుగా ఉంటుంది. చూపులకు భ్రమసి ఎవరైనా అక్కున చేర్చుకున్నారో విషకన్యలా కాటేస్తుంది. గతంలో వారన్ హేస్టింగ్సు అయోధ్య నవాబు మీద ప్రయోగాత్మకంగా అమలు జరిపిన సేనల అద్దె పథకానికే వెల్లస్లీ నగిషీలు దిద్ది ఇండియాను కబళించేందుకు ప్రధాన సాధనంగా మలిచాడు. దీనికీ ఒక చారిత్రక అవసరం తగులడింది!

ఏమిటంటే- ఇకపై దేశీయ రాజ్యాలను జయించరాదని కదా ఇండియా యాక్టులో పార్లమెంటు కట్టడి చేసింది? జయించకుండానేమో సీమప్రభువుల సామ్రాజ్య కాంక్ష ఊరుకోనివ్వదాయె. దౌర్జన్యంగా రాజ్యాలను లాగేసుకుంటేనేమో పార్లమెంటులో మాట వస్తుందాయె. మరి చట్టాన్ని చాపచుట్టి స్వదేశంలో జనం కళ్లలో ఎలా మన్నుకొట్టాలా అని ఆలోచిస్తే వెల్లస్లీకి ఇదిగో ఈ ఉపాయం తోచింది. దీని ప్రకారం పర రాజ్యాలపై దండయాత్రలేవీ పైకి కనిపించవు. రాజు రాజు పళంగానే గద్దెమీద ఉంటాడు. రాజలాంఛనాలన్నీ మామూలుగానే నడుస్తాయి. కాని నిజమైన అధికారమంతా రాజు చేతిలో నుంచి పోయి పక్కన కూర్చున్న రెసిడెంటు చేతిలో పడుతుంది. తన రక్షణ కోసమని చెప్పి కొన్ని వేల ఇంగ్లీషు సైన్యాన్ని జీతబత్తేలిచ్చి రాజు తన దగ్గర పెట్టుకుంటాడు. రాజ్యరక్షణ భారం యావత్తూ తెల్లవారే మోస్తారు కనుక అప్పటిదాకా రాజు కొలువులో ఉన్న సొంత సేనలు, విదేశీరక్షణ దళాలు రద్దవుతాయి. బ్రిటిష్ సేనల నిరంతర పహారాలో వాస్తవానికి రాజు బ్రిటిష్ వారికి బందీ అవుతాడు. పరిపాలనలో అతడి మాట చెల్లదు. సమస్త నిర్ణయాలు, సకల అధికారాలు కంపెనీ రెసిడెంటే చెలాయిస్తాడు. పేరుకు 'రక్షణ'! జరిపేది 'భక్షణ'! అదో చిత్రమైన సాలెగూడు. ఒకసారి అందులో చిక్కాక మళ్లీ బయటికి రావటం కల్ల! తరవాత మెల్లిగా వీలు చూసుకుని రాజ్యాన్ని కంపెనీ తనలో కలిపేసుకుంటుంది. రాజ్యం దానికదే స్వచ్ఛందంగా ఆత్మహత్య చేసుకుని బ్రిటిష్ సామ్రాజ్య సాయుజ్యం పొందింది కనుక అది దురాక్రమణ కిందికి రాదని సీమవాసులను ఒడుపుగా బురిడీ కొట్టిస్తారు.

అదీ పద్ధతి. విదేశీ సేనను జీతబత్తేలిచ్చి తనచుట్టూ పెట్టుకుని వాటి చేత రాజు తననే ఖైదు చేయించుకునే భలే స్కీముకు వెల్లస్లీ మొదటగా నిజాంను బలిచేయదలిచాడు. ఆ కాలంలో దేశంలో అన్ని రాజ్యాలలాగే నైజాం కొలువులోనూ విదేశీ సేనలు ముఖ్యంగా ఫ్రెంచి దళాలు విరివిగా ఉండేవి. సాంప్రదాయక రీతిలో కత్తి డాలు పట్టి తాము ఎంత శౌర్యం చూపినా యూరోపియన్ సైనిక తంత్రం ముందు నిలవలేకపోవటాన్ని గమనించి మహారాష్ట్రలో సదాశివరావు భావు కాలంనుంచీ విదేశీ కిరాయి సేనలను నియమించుకుని, యూరోపియన్ తరహాలో యుద్ధాలు చేయటం మన దేశంలో హెచ్చయింది. మైసూరులో హైదరాలీని చూసి నైజాం కూడా ఫ్రెంచి కిరాయి సైన్యాన్ని భారీగా ఏర్పాటు చేసుకున్నాడు. దానివల్ల నిజానికి ఇంగ్లీషు వారికి ముంచుకొచ్చిన ముప్పేమీ లేదు. టిప్పుపై మూడో మైసూరు యుద్ధంలో నిజాంకు చెందిన ఫ్రెంచి సేనలు కూటమి నాయకులైన ఇంగ్లీషు వారికి కోరినట్టల్లా సహాయ పడ్డాయి. కూటమి ఇంకా అమల్లోనే ఉంది కనుక అదే టిప్పు సుల్తాను మీద మళ్లీ యుద్ధానికి పోదలిస్తే ఇవే ఫ్రెంచి సేనలు వెనుకటిలా తమకు

ఉపయోగపడవన్న అనుమానం ఆంగ్లేయులకు కలగటానికి లేశమైనా ఆస్కారం లేదు.

అయితే వెల్లస్లీకి కావలసింది కారణం కాదు, మిష. టిప్పుసుల్తాను మనపై యుద్ధానికి ఆయత్తమవుతున్నాడని అకారణంగా ఆరోపించి, ఆ యుద్ధంలో ఫ్రెంచి వారు మనకు హాని చేస్తారని నిర్హేతుకంగా ఊహించి... కాబట్టి, నైజాం కొలువులోని ఫ్రెంచి సైనికులందరినీ పీకేయించి వారికి బదులుగా రక్షణ బాధ్యతను మనకు గుత్తకు ఇచ్చేలా చూడమని హైదరాబాదు రెసిడెంటుకు వెల్లస్లీ దొర రహస్యంగా ఆనతిచ్చాడు.

ఆ సమయంలో రెసిడెంటుగా ఉన్నది ఎవరో కాదు. దక్షిణాఫ్రికాగ్రంలో వెల్లస్లీకి తారసపడ్డ మేజర్ విలియమ్స్ కర్క్ పాట్రిక్‌కు స్వయానా తమ్ముడు. పేరు కెప్టెన్ జేమ్స్ అకిలెస్ కర్క్ పాట్రిక్. అప్పటికే అతడు నైజాం దర్బారులో కలుపుగోలుగా తిరిగేస్తూ కిటుకులు, లోగుట్లు రాబడుతూ, దర్బారు ప్రముఖులతో కుటిల రాజకీయాలు నడపటంలో అపారమైన తెలివితేటలు కనపరుస్తున్నాడు. మహమ్మదీయ సర్దార్లు ఇతడికి 'హష్మత్‌జంగ్' అని ముద్దుపేరు పెట్టారు. మహమ్మదీయ ఆచార వ్యవహారాలను ఒంట బట్టించుకోవటమే గాక ఒక ఘరానా కుటుంబానికి చెందిన ఖైరున్నీసా అనే కన్యతో ప్రేమలో పడి, ఆమెకోసం మతం మారి, ముస్లిం సంప్రదాయబద్ధంగా నిఖా కూడా చేసుకున్నాడు. ఖైరున్నీసాతో ప్రణయంలో కిర్క్ పాట్రిక్ ధీరుడూ, రసికుడే అయి ఉండవచ్చు కాని రాజ్య వ్యవహారాల్లో మాత్రం అతడు పెద్దమనిషి కాడు. అతడు లంచగొండి అనీ, అనేక నీతి మాలిన పనులు చేశాడనీ నైజాం కొలువులోని బ్రిటిష్ తాబేదారులే అనేక ఫిర్యాదులు చేశారు. అప్పటి నైజాం దర్బారు మొత్తం అసమర్థులతో, అవినీతి పరులతో నిండి నానాగత్తరగా ఉండేది. వారిలో పట్టాల్సిన వారిని పట్టాల్సిన రీతిలో పట్టి కంపెనీకి కాగల కార్యాలను రెసిడెంటు తన దుర్బుద్ధి కుశలతతో నెరవేర్చేవాడు.

వెల్లస్లీ దౌత్య పరిభాషలో పొంకంగా చెప్పినట్టు నిజాంకు సాయపడి అతడి రాజ్యదక్షతను బ్రహ్మాండంగా పెంచి, అతడి అధికారాన్ని నిలబెట్టడమే తెల్లవారి ఆశయమైతే ఆ సంగతి మొట్టమొదట చెప్పాల్సింది నిజాంకు కదా? కాని వెల్లస్లీ చివరి నిమిషం దాకా తన పన్నాగాన్ని నిజాంకు తెలియనివ్వకుండా దాచిపుచ్చాడు. నిజాం మంత్రి అజీముల్ ఒమ్రాను లోబరచుకుని కొత్త ఏర్పాటుకు రహస్యంగా ఒప్పించాలనీ, అతడు సై అన్నదే తడవుగా మద్రాసు ప్రెసిడెన్సీ నుంచి సైన్యాన్ని హుటాహుటిన హైదరాబాదుకు పిలిపించాలనీ రెసిడెంటు కర్క్ పాట్రిక్‌కు 1798 జూలై 8న రాసిన 'రహస్య' లేఖలో వెల్లస్లీ పురమాయించాడు. ("Should Azim-ul-Omra consent, in the name of the Nizam, to the proposed conditions, you will then require the march of the troops from St.George"). నిజాంకే కాక మద్రాసు ప్రెసిడెన్సీకి గవర్నరు, మద్రాసు సైన్యానికి కమాండర్ ఇన్ ఛీఫ్ అయిన జనరల్ హారిస్‌కు కూడా తాను చేయదలచిందేమిటో వెల్లస్లీ చెప్పలేదు. ఇండియాలో బ్రిటిష్ ప్రయోజనాలను కాపాడటానికి అత్యవసరమైన పని నిమిత్తం మద్రాసు సైన్యాన్ని గుంటూరు వద్దకు తరలించి రడీగా ఉంచమని, తన మీద భరోసా ఉంచి ఆ సంగతి రహస్యంగా ఉంచమనీ హారిస్‌ను అతడు కోరాడు.

సీక్రెట్ ఆపరేషను అంతా అనుకున్నట్టు జరిగింది. నిజాం మంత్రి రెసిడెంటు బుట్టలో పడ్డాడు. ఫ్రెంచి కిరాయి దళాలను దఫాల వారీగా తొలగించాడు. సంకేతం అందగానే గుంటూరు నుంచి ఇంగ్లీషు సేనలు శరవేగంగా కదిలాయి. అవి హైదరాబాద్ దరిదాపులకు



చేరే సమయానికి నిజామును బలవంతపెట్టి మరో దారిలేకుండా చక్రబంధంలో ఇరికించి, 1798 సెప్టెంబరు 1న దుర్మార్గపు ఒప్పందం మీద సంతకం చేయించారు. నిర్బంధ ఒడంబడిక మొదట్లోనే ఇలా చెప్పుకున్నారు :

"Whereas His Highness Nizam-ul-Mulk Asoph Jah Bahadur has from the greatness of existing friendship, expressed a desire for an increase of the detachment of the Honourable Company's troops at present serving His Highness..." (ఘనత వహించిన నిజాం ఉల్ ముల్క్ ఆసఫ్ జా బహద్దూరు వారు తమకును, మాననీయ కంపెనీ వారికిని గల స్నేహాధిక్యంతో ఇప్పుడు తమ కొలువులో ఉన్న కంపెనీ వారి సేనలకు అదనంగా మరో కొన్ని సేనలు కావాలని తమ కోరికను తెలియపరచారు కాబట్టి...)

ఇదే పెద్ద అబద్ధం. కంపెనీ సేనలు కావాలని నిజాం ఎన్నడూ దేబిరించలేదు. వెల్లస్లీయే బలవంతంగా సేనల్ని తీసుకొచ్చి అతడి గొంతు మీదకూచుని మోసంతో దౌర్జన్యంతో సంతకం చేయించాడు.

ఆ సంతకమే నిజాం పాలనాధికారానికి డెత్ వారంటు అయింది.

# మిత్రుడికి బెబ్బే!

**ఆ**ర్కాట్ నవాబు మహా ఆనందపడ్డాడు. పక్కలో బల్లెంలాంటి టిప్పుసుల్తాను పీడ విరగడయింది. అతడిని చంపి ఇంగ్లీషు మిత్రులు మొత్తం మైసూరు రాజ్యాన్ని జయించారు. ఇంతకంటే తనకు కావలసింది ఏముంది? మైసూరు పొరుగుపోరు తప్పటంతో ఇక కర్నాటక రాజ్యాన్ని తాను నిశ్చింతంగా ఏలుకోవచ్చు. ఇంగ్లీషు వాళ్లు చిరకాల ఆప్తమిత్రులు కనక వారితో తనకు గొడవే లేదు; రాదు. గతంలో టిప్పు తండ్రి హైదరాలీ దగ్గరినుంచి అక్రమంగా లాగేసుకున్న కరూరు, సేలం వగైరా ప్రాంతాల్ని కూడా ఇప్పుడు బ్రిటిష్ వారితో మాట్లాడుకుని తిరిగి రాబట్టుకోవచ్చు. తాను నోరు తెరిచి అడిగితే వారు కాదనరు. ఔను మరి! ఇన్నేళ్లలో తన తండ్రి, తాను వారికి ఎన్నివిధాల సహాయపడ్డారు? ఆఖరికి మొన్నటి యుద్ధంలో టిప్పుమీద వారు గెలవటానికి కూడా తాను సాలుకు తొమ్మిది లక్షల వరహాలిచ్చి పోషిస్తున్న ఇంగ్లీషు సేన ఒక ప్రధాన కారణమే కదా? ఆ ఉపకారం వారెలా మరచిపోతారు?

ఆర్కాట్ నవాబు ఉమ్ దత్ ఉల్ ఉమ్రా భరోసాకు ఇంకో కారణం కూడా ఉంది. అతడి లెవెలు చాలా పెద్దది. సాధారణంగా దేశీయ ప్రభువులు ఎవరైనా కంపెనీ రెసిడెంట్లతోనో, దౌత్య అధికారులతోనో, గవర్నరుతోనో, మహా అయితే గవర్నర్ జనరలుతోనో మాట్లాడగలరు. కర్నాటక నవాబు అలా కాదు. అతడికి బ్రిటిష్ పాలక వర్గంలో పెద్దవాళ్లు చాలా మందే తెలుసు. రాజకుటుంబం అతడికి బాగా పరిచయం. వేల్సు యువ రాజయితే అతడికి తరచు ఉత్తరాలు రాస్తుంటాడు. అసలైన సీమ మారాజులే తనకు నేస్తులు కాబట్టి, ఆఫ్టరాల్ 'కంపెనీ అధికారులయిన గవర్నర్ జనరలు లాంటివారు తనతో ఒళ్లు దగ్గరపెట్టుకుని బుద్ధిగా ఉంటారని నవాబుకు గొప్ప నమ్మకం!

కాని- ఎదుటివాడు వెల్లస్లీ! గుడిని, గుడిలో లింగాన్ని అవలీలగా మింగెయ్యగలడు. పాప భీతి అతడికి లేదు. ఏదో ఒక దారిలో బ్రిటిష్ సామ్రాజ్య విస్తరణే అతడికి కావలసింది. టిప్పు అడ్డు తొలగగానే మిత్రధర్మాన్ని పాటించి కర్నాటక నవాబుకు ఇవ్వాల్సిన వాటా ఇచ్చి సఖ్యంగా ప్రశాంతంగా మెలగాలని అతడు అనుకోలేదు. ఎలాగూ మైసూరు హస్తగతమైంది కనుక, దాని పొరుగు నవాబును కూడా కాలికింద నలిపివేస్తే మొత్తం కర్నాటక సీమను కైవసం చేసుకోవచ్చు కదా అని వెల్లస్లీ తలిచాడు. ఆ దశలో జాగు సేయక పావులు కదిపాడు.

కంపెనీ నౌకరు అయిన గవర్నరు జనరలు ఒకవేళ తనకు అపకారం తలపెట్టినా కంపెనీ యజమానులైన బ్రిటిష్ ప్రభువులు తనను తప్పక ఆదుకుంటారని వెర్రి నవాబు ధీమా! మహా నాగరికులైన సీమ దొరల అసలు రంగు అతడికి తెలియదు.

నిజానికి టిప్పు నేలకొరగటానికి కొన్ని వారాల ముందే ఆర్కాటు నవాబుకూ పుటంపెట్టే పని మొదలైంది. "కర్నాటకలో ద్వంద్వ ప్రభుత్వం ఏమీ బాగాలేదు. దీన్ని తీసేసి కీలకాధికారాలు మనమే తీసుకుంటే బావుంటుంది. ఆర్కాటు నవాబుతో కుదుర్చుకున్న ఒప్పందాలవల్ల ఇప్పుడు మనం ఏమీ చేయలేము. అయినా మీరో కన్నువేసి ఉంచండి. ఏ మాత్రం అవకాశం దొరికినా కార్యం సాధించడానికి పొంచి ఉండండి' అని బ్రిటిష్ మంత్రివర్యులు రైటానరబుల్ డండాస్ గారు 1799 ఆగస్టు 5న వెల్లస్లీకి జాబు పంపాడు. దానికి వెల్లస్లీ "ఔనౌను. పరిస్థితి ఏమీ బాగాలేదు. తనకు తండ్రి లాంటి బ్రిటిష్ చక్రవర్తినే తప్ప కంపెనీ అధికారులను తాను లక్ష్యపెట్టేది లేదని నవాబు మిడిసిపడుతున్నాడు. మన మహారాజుగారు, యువరాజుగారు తరచూ ఉత్తరాలు రాస్తుండటం ఇతడికి మరీ అలుసు అయింది. ఈ సంగతి ప్రభువులకు తెలియపరిచి ఇతడిని దూరం పెట్టించండి. తరవాత సంగతి నేను చూసుకుంటాను" అని ప్రశస్తమైన ప్రత్యుత్తరమిచ్చాడు. ఈ నవాబు బతికుండగా వ్యవహారాలేవీ చక్కబడవు. ఇతడు చచ్చాక మనమే కావలసినట్టు ఏర్పాట్లు చేసుకోవచ్చు అంటూ- ఆ ఏర్పాట్లు ఏమిటో వెల్లస్లీ అదే జవాబులో ఇలా సెలవిచ్చాడు.

"No effectual remedy can ever be applied... without obtaining from the Nabob powers atleast as extensive as those vested in the Company by the late treaty of Tanjore. At the death of the present Nabob, such a treaty might easily be obtained from his successsor... Numerous legitimate descendants of Wallajah are in existence. The whole question of the succession will therefore be completely open to the decision of the Company... the most advisable settlement would be, to place Omdut-ul-Omra's suposed son on the Musnad... ..."

[*Rise of the Christian Power in India* - **B.D. Basu,** *p. 346*]

(ఈ మధ్య తంజావూరు ఒప్పందంలో చేసినట్టు విస్తృతమైన అధికారాలన్నీ మనం నవాబు నుంచి లాగేసుకుంటే తప్ప వ్యవహారం చక్కబడదు. ఇప్పుడున్న నవాబు మరణించాక అతడి వారసుడి నుంచి ఇటువంటి ఒప్పందాన్ని మనం రాబట్టుకోవచ్చు. నవాబుకు వారసులమనేవారు చాలా మంది ఉన్నారు కనుక నవాబు చావగానే వారసత్వపు తగాదాలు వస్తాయి. అప్పుడు మన పనివాటంగా ఉంటుంది. వారసుడెవరో తేల్చడం కంపెనీ నిర్ణయం మీదే ఆధారపడుతుంది. ఉమ్ దత్ ఉల్ ఉమ్రాకు కొడుకని చెప్పుకుంటున్న కుర్రవాడిని గద్దెమీద కూచోబెట్టి,

మనకు కావలసిన కాగితం అతడిచేత రాయించి పుచ్చుకుంటే బాగుంటుందని నా సలహా).

'ఇదయినా- నవాబు అనేవాడు ఒకణ్ని మనం పేరుకు కొనసాగించాలని అనుకుంటేనే! నవాబే అక్కర్లేదు. అంతా మనమే కాజేద్దామని అనుకుంటే మరీ మంచిది. సర్వాధికారాలు మనమే స్వీకరించి, నవాబు వంశం వారికి ఇంత మనోవర్తి పారవేస్తే చాలదా? ఇది కూడా మీరు కొంచెం ఆలోచించి చూడండి' అని వెల్లస్లీ ఇదే లేఖలో ఉచిత సలహా ఇచ్చాడు. కాని- అలా నవాబుగిరీని మొత్తం కూల్చి అంతా తామే కాజేస్తే జనం తమ మొగాన ఉమ్ముతారని బ్రిటిష్ ప్రభువులు భయపడ్డారు. కీలుబొమ్మని కూచోబెట్టి తాము కథ నడిపించటమే అప్పుడున్న పరిస్థితుల్లో మేలని నిర్ణయమైంది. టిప్పుసుల్తాన్ తరవాత వంతుగా నవాబును వేటువేయాలని అనుకున్నది మొదలు అందుకు రంగం జాగ్రత్తగా సిద్ధమైంది.

ప్రవాహం దిగువన నీళ్లు తాగుతున్న మేక ఎగువనున్న నీటిని మురికి చేసిందని నెపంవేసి నోట కరచిన తోడేలు లాగే ఆర్కాట్ నవాబునూ తిప్పలు పెట్టడానికి వెల్లస్లీ తీరికూర్చుని సాకులు వెదికాడు. తమకు కట్టాల్సిన కప్పాలను నవాబు సక్రమంగా కడుతున్నప్పటికీ నాగాలు పెడుతున్నారని, బకాయిలు పెరిగాయని నింద వేశాడు. కర్నాటక రాజ్యం ప్రశాంతంగా ఉండి పరిపాలన సాఫీగా సాగుతున్నా, అంతా అల్లకల్లోలంగా ఉందనీ, అవినీతి, అక్రమాలు పెరిగి జనం బతుకు దుర్భరమైందనీ అభాండం వేశాడు. బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా టిప్పుసుల్తానుతో కుమ్మక్కయి నవాబు ద్వారా అతడి తండ్రి కుట్ర చేశాడని అబద్ధాల అల్లికకు ముక్తాయింపుగా – వెల్లస్లీ తప్పుడు అభియోగం బనాయించాడు. దీనికి సాక్ష్యాలు శ్రీరంగపట్నం కోట రికార్డుల్లో తమకు పట్టుబడ్డాయని బుకాయించాడు.

మేజర్ ఇవాన్స్ బెల్ ***The Empire of India*** గ్రంథంలో నిరూపించినట్టు ఇది తలా తోక లేని వెర్రిమొర్రి ఆరోపణ. ప్రస్తుత నవాబుకు తండ్రి అయిన మహమ్మదాలీ అర్ధ శతాబ్దంపాటు ఇంగ్లీషు వారితో కలిసిమెలసి ఉన్నాడు. ముప్పై ఏళ్లపాటు హైదరాలీ, టిప్పులతో బద్ధవైరం పెట్టుకుని, వారి చేతిలో చాలా అవమానాలు, బాధలు పడ్డాడు. అలాంటివాడు తన చిరకాల మిత్రులైన ఇంగ్లీషు వారి అదృష్టం పండి, మైసూరు ప్రభ ఆరిపోయిన స్థితిలో... యుద్ధంలో ఓడి, ఇంగ్లీషు వారికి అర్ధ రాజ్యాన్ని సమర్పించుకుని, ఇద్దరు కొడుకులను తాకట్టుపెట్టి, అన్ని విధాల చితికిన టిప్పుసుల్తానుతో కుమ్మక్కయి తెల్లవారిపై కుట్రకు పాల్పడ్డాడన్న అభియోగం వింటే ఎవరైనా నవ్వుతారు.

పోనీ- మరణించిన నవాబు ఇప్పటి నవాబు ద్వారా నిజంగానే అటువంటి భయానక మిత్ర ద్రోహానికి పాల్పడ్డాడని మాటవరసకు అనుకున్నా, ఇంగ్లీషు వారికి ఆ సంగతి తెలియగానే సాక్ష్యాలను చూపించి నవాబును నిలదీసి ఉండాల్సింది కదా? కాని- నవాబు బతికి ఉన్నంతకాలమూ కంపెనీ వారు ఆ ప్రస్తావనే తేలేదు. అలాంటి అభియోగమే చేయలేదు. తాము సృష్టించింది తప్పుడు సాక్ష్యమని వారికి తెలుసు. అందుకే – గోతికాడ నక్కల్లా కాచుకు కూర్చుని, నవాబు మరణించే దాకా రెండేళ్ల పాటు ఆగి ఆ వెంటనే అతడి వారసుడి మీద తోడేళ్లలా పడ్డారు. మదరాసులోని చీపాక్‌లో నవాబు రాజప్రాసాదాన్ని చుట్టుముట్టి, అవసాన దశలోని నవాబుతోనూ, అతడి మరణానంతరం అతడి వారసుడితోనూ వ్యవహరించిన వైనాన్ని... ఏడేళ్ల తరువాత బ్రిటిష్ పార్లమెంటులో అభిశంసన తీర్మానం



ప్రవేశపెడుతూ సర్ థామస్ టర్టన్ (1808 మే 17న) ఇలా వివరించాడు :

"1801 జూలై నవాబు ఉమ్ దత్ ఉల్ ఉమ్రా చనిపోనున్న సమయంలో అల్లర్లు జరక్కుండా చూసే మిషతో కర్నల్ నీల్ నవాబు కాపురమున్న చీపాక్ మందిరం వైపు సైన్యంతో పోయాడు. అతణ్ని చూడగానే మరణశయ్య మీది నవాబు త్రుళ్లిపడి... అంతఃపురంలోకి సేనలను పంపి ప్రజల ముందు తనను నగుబాటు చేయవద్దని ప్రార్థించాడు. కర్నల్ నీల్ పోనీ లెమ్మని దయతలచి రాజమందిరాన్ని మాత్రం వదలి చుట్టూ సేనల్ని కాపలా పెట్టాడు! పది రోజుల తరువాత నవాబు మరణించాడు.

"On the same day on which the old Monarch died, the Prince, his heir, was dragged from his apartment, and called upon to answer to certain interrogatories, on a charge of treachery preferred against his father. He was told that his father and grandfather had carried on a treacherous correspondence with Hyder Ali and Tipoo Sultan, and that he, though innocent, was to be deprived of his dominions... unless he complied with certain requisitions..."

**[*Rise of the Christian Power in India*, B.D.Basu, *p.348*]**

ముసలి ప్రభువు చనిపోయిన రోజునే, రాజమందిరంలో వేరే గదిలో ఉన్న రాజకుమారుడు అలీ హుస్సేన్‌ను ఇంగ్లీషు వారు బయటికి ఈడ్చుకుని వచ్చి "ఇదిగో చూడు. నీ తండ్రి, తాత మాకు వ్యతిరేకంగా హైదర్, టిప్పుసుల్తాన్‌తో చేరి ద్రోహపూరితమైన కుట్ర పన్నారు. ఈ సంగతి నీకేమీ తెలియక పోయినా దాని ఫలితాన్ని నువ్వు అనుభవించక తప్పదు. నీవిప్పుడు మా మాట ప్రకారం నడుచుకున్నావా నీకే రాజ్యం దక్కుతుంది. లేకపోతే నిన్ను తీసి పారవేసి ఇంకొకణ్ని తక్తు మీద కూర్చుండబెడతాము. నిన్ను మా శత్రువుగా భావించుతాము. ఏమంటావు?" అని దబాయించిరి... ఆఖరుకు అతనిని తీసిపారవేసి రాజ్యమును ఇంకొకనికిచ్చినట్టు గవర్నరు జనరలు నుండి వచ్చిన హుకుమును అతనికి చూపించిరి... ఇతనిని తీసివేసినను ఇతని తరువాత వారసునకు రాజ్యమివ్వలేదు. ఎవరు తమకు అనుకూలమైన కాగితము వ్రాసి ఇస్తారా అని వెదకి చిట్టచివరికి రెండుమూడు తరముల దూరముందున్న అజీమ్ ఉల్ దౌలా అను వానితో కంపెనీ వారు బేరము కుదుర్చుకొనిరి. ఇతడా సమయమున ఎక్కడనో చెరసాలలో ఖైదీగ నుండెను. ఇతనిని బయటికి తీసుకువచ్చినప్పుడు – "ఎందుకు చెప్పుమా నన్ను పిలుచుచున్నారు – కొంపదీసి నన్ను చంపడానికి కాదుగదా" అని హడలిపోయెను. కంపెనీ వారు కోరుకున్న షరతులన్నిటికి యితడు ఒప్పుకొనెను. అందుచేత వారతనిని *1801 జులై 28న తక్తుపై నెక్కించిరి*".

(బ్రిటిష్ మహాయుగము – అను. మానికొండ సత్యనారాయణశాస్త్రి – ప్రథమ సంపుటం పే. *475*).

అదీ తెల్లవారి రాజనీతి! "నువ్వు కాకపోతే నీ తండ్రో తాతో అపరాధం చేశారు లెమ్మని

నిందమోపారు. భయపెట్టారు. చెప్పినట్టు వినకపోతే నీ వారసత్వం గల్లంతవుతుందని బెదిరించారు". నా తండ్రి గద్దెపై జన్మతః నాకు సంక్రమించిన అధికారాన్ని కాదనటానికి మీరెవరు?" అని ఎదురు తిరిగిన రాకుమారుడి నెత్తిన గుద్దవేసి, ఇతర వారసులనూ వదిలి, వేరెవడితోనో బేరం కుదుర్చుకుని అడ్డగోలుగా సింహాసనం అప్పగించారు. కనీసం ఆ తరవాతయినా అసలైన వారసుడిని క్షేమంగా బతకనిచ్చారా?

లేదు. పూర్వపు నవాబు కొడుకు అలీ హుస్సేనును, అతని తల్లిని వారి పూర్వార్జిత ఆస్తి అయిన చీపాకు మందిరంలోనే ఖైదుచేసి ఉంచారు. అదే మందిరంలో కొత్త నవాబు అజింగారూ కాపురమున్నారు. "ఇది చాలా అన్యాయం. మా ప్రాణాలకు ప్రమాదం. ఇతగాడు మమ్మల్ని చంపిస్తాడేమో. ఇక్కణ్నించి వేరేచోటికి మార్చండి" అని తల్లీ కొడుకులు ఎంత మొత్తుకున్నా కంపెనీ దొరలు వినలేదు. చివరికి అనుకున్నట్టే అయింది. అలీ హుస్సేను రాకుమారుడు కొద్దిరోజులకే మరణించాడు. విషప్రయోగమే దానికి కారణమన్నది బహిరంగ రహస్యం.

బ్రిటిష్ ప్రభువులకు చిరకాలంగా మిత్రుడు, విశ్వాసపాత్రుడు అయిన ఆర్కాట్ నవాబు అంతటివాడిని అక్కర తీరగానే తీసి అవతల పారేసి, ఆంతరంగిక వారసత్వ వ్యవహారాల్లో అక్రమంగా కలగజేసుకుని, గద్దెపై కీలుబొమ్మను కూచోబెట్టి మొత్తం రాజ్యాన్ని కాజేసిన తీరుపై ఇంగ్లండులోనే తీవ్ర నిరసన వ్యక్తమైంది. అసలు వారసుడి అధికారాన్ని మీరెలా తోసి పుచ్చగలిగారన్న విమర్శలకు వెల్లస్లీ వర్గం చిత్రమైన ప్రతివాదం వినిపించింది. అదేమిటంటే - పూర్వపు ప్రభువు ఇచ్చిన హామీలకు లాగే అతడు చేసిన తప్పులకు కూడా వారసుడు బాధ్యత వహించాలట! నవాబు ద్రోహానికి పాల్పడ్డాడు కనుక అతడి కుమారుడు రాజ్యాధికారానికి హక్కు కోల్పోయాడట!

ఇది అర్థంలేని కుతర్కం. నవాబు బతికి ఉన్నంతకాలమూ అతడిపై కనీసం నేరారోపణే చేయకుండా,... అతడు మరణించాక అతడి కుమారుడిని ఆ నేరానికి బాధ్యుడిని చేయటం అమానుషమని షెరిడాన్ లాంటి మహా మేధావులు దుయ్యబట్టారు. శామ్యూల్ రోమిల్లీ, విండ్ హామ్‌లాంటివారు ఇండియాలో ఈస్టిండియా కంపెనీ వ్యవహారం దొంగల దోపిడిగా తయారైందని పార్లమెంటులో ఆక్షేపించి, సర్ థామస్ టర్టన్ తెచ్చిన అభిశంసన తీర్మానాన్ని గట్టిగా బలపరిచారు.

కాని ఏం లాభం? బ్రిటిష్ పార్లమెంటులో ఆసీనులైన మాన్యులు తమ జాతి గౌరవానికి కళంకం తెస్తున్న దుర్మార్గాలను ఆపటానికి కించిత్తయినా ప్రయత్నించలేదు. తమకు రాజ్యం వస్తుందనే సంబరపడ్డారు గానీ దానికి అనుసరించిన తప్పుడు పనులు ఎంత నికృష్టమైనవన్నది వారు పట్టించుకోలేదు. కంపెనీ అధికారులు కట్టుతప్పకుండా, చట్టాన్ని న్యాయాన్ని అతిక్రమించకుండా చూడవలసిన ప్రభువులే పక్షపాతంతో వ్యవహరించి... రాజ్యం వచ్చి పడేప్పుడు నీతుల గోల ఏల అని తలపోశారు.

భారతదేశంలో పడ్డ దొంగలకు, దొంగల నాయకులకు అంతకంటే ఏమికావాలి?



# అయోధ్యకాండ

**'బయట చలి విపరీతంగా ఉంది. మీ గుడారంలో కొంచెం తల దాచుకోనిస్తారా, ప్లీజ్' అని ప్రాధేయపడింది ఒంటె. 'తల మాత్రమే కదా? సరే, దాచుకో' అన్నాడు జాలిగుండె మనిషి. ముందు తల. తరవాత మెడ. అనక కొంచెం ఒళ్లు. మెల్లిగా కాళ్లు. కాసేపటికి మొత్తం జొరబడి గుడారాన్ని ఒంటె ఆక్రమించింది. నాకే ఇరుకుగా ఉంది; నువ్వెందుకూ ఇక్కడ - అని మనిషిని తరిమేసింది.**

ఇది పాత కథే. ప్రపంచ ప్రజలకు అనేక శతాబ్దాలుగా తెలిసిందే. అయితే, మిగతా జాతుల వాళ్లు వినేసి ఊరుకున్నారు. ఇంగ్లీషువారు మాత్రం ఒంటె కథను వొంటబట్టించుకుని ఒక మహా సామ్రాజ్యాన్ని నిర్మించారు. పిట్టంత ఇంగ్లండు చెట్టంత ఇండియాను ఇట్టే దురాక్రమణ చేసింది ఒంటె చూపిన దారిలోనే.

మేము పరదేశులం. ప్రభువులు దయతలిచి అనుమతిస్తే కాస్త వర్తకం చేసుకుని బతుకుతాం అని మొదట అతి వినయంగా దీనంగా ప్రార్థించారు. మన వెర్రి మారాజులు జాలి తలిచి 'వర్తకమేకదా? సరే చూసుకోండి' అన్నారు. తొలుత భారత ప్రభువుల దయాదాక్షిణ్యాల మీద, వారిచ్చే రక్షణమీద ఆధారపడి తెల్లవారు వ్యాపారం మొదలెట్టారు. క్రమేణా ప్రభువుల మధ్య తంపులు పెట్టి... వారి బలహీనతలను, భయాలను తెలివిగా ఉపయోగించుకుని, మోసాలు చేసి కొంచెం బలపడి, ప్రభువులకే సైనిక సహాయం చేసే స్థితికి చేరారు. మీ పట్ల భయభక్తులతో సర్వదా మీ సేవ కోసం సిద్ధంగా ఉన్న మా సైన్యం ఉండగా సొంత సైన్యం బాదరబందీ మీకేల? మీ రక్షణ బాధ్యత మాకు ఒప్పగించండి. ఎంత కావాలంటే అంత సైన్యాన్ని మానుంచి తీసుకోండి. ఖర్చుల నిమిత్తం ఏదో కాస్త మా మొగాన పడవేస్తే మా పాట్లు మేము పడి మిమ్మల్ని కంటికి రెప్పలా కాపాడతాం. ఈ గొడవలు మాకు వదిలేసి మీరు హాయిగా ఉండండి- అని సవినయంగా ప్రార్థించి ఎక్కడికక్కడ ప్రభువులతో సంధి చేసుకున్నారు. తరవాత తెలివిమీరి - మీ రక్షణకు ఎంత సైన్యం అవసరమో మేమే నిర్ణయిస్తాం; అదనపు బలగాలకు ఖర్చు ఎంతఅవుతుందో మేమే చెబుతాం.

తమరు దయచేసి ఆయా మొత్తాలను చచ్చినట్టు కట్టండి; అంతంత మొత్తాలను కట్టలేమంటారా? రాజ్యాన్ని మాకు వదిలేసి మీరు నెత్తిన చెంగువేసుకుని బయటికి దయచేయండి. లేదా మేము చెప్పినట్టు విని మా కాళ్లదగ్గర పడి ఉండండి... అని ముందు నుయ్యి- వెనుక గొయ్యిలా పసందైన ప్రత్యామ్నాయాలను సూచించారు. అలా ఒక్కొక్క రాజ్యాన్నీ లాగేసుకుని దేశీయ రాజులను వెళ్లగొట్టి మొత్తం దేశానికి తామే రాజులయ్యారు!

ఏకులా వచ్చి మేకులా మారిన ఇంగ్లీషువారి చేతిలో దగా పడి రాజ్యాధికారానికి మేకులు గొట్టించుకున్న పిచ్చి మారాజుల్లో అయోధ్య నవాబు ఒకడు.

ఎదురు నిలిచిన టిప్పుసుల్తాన్ రాజ్యాన్ని కబళించిన తరవాత వెల్లస్లీ ప్రభువు "దయార్ద్ర దృష్టి" తెల్లవారికి మొదటినుంచీ అండ నిలిచిన పరమ మిత్ర రాజ్యాల మీద పడింది. ఆయనకు ముందు ఉన్న గవర్నర్ జనరలులు దగాచేసి దేశీయ సంస్థానాలను తమ గుప్పిట్లోకి తెచ్చుకుని కీలుబొమ్మ పాలకుల ద్వారా కథ నడిపించారు. ఈ ఉత్సవ విగ్రహాలు మాత్రం ఎందుకు; మెల్లిగా వీటిని అవతల పారేసి మనమే ప్రభువులం అయితే పోదా అనుకున్నాడు వెల్లస్లీ. క్లయివ్ తీసిన పునాదుల మీద, వారన్ హేస్టింగ్స్ లేపిన స్తంభాలపైన ప్రాచ్య సామ్రాజ్య మహాసౌధాన్ని నిర్మించి చరిత్రలో తన పేరు సువర్ణాక్షరాలతో రాయించుకోవాలన్న ఆబలో వెల్లస్లీ యుక్తాయుక్తాల జంజాటాన్ని లుంగచుట్టి బరితెగించాడు. రాజ్యాల పేర్లు వేరైనా అతడు అనుసరించిన పద్ధతి ఒక్కటే. స్థానిక రాజకీయ చిక్కులను, వారసత్వం తగాదాలను తెలివిగా వాడుకోవటం; బ్రిటిష్‌వారి మాట వినేవాడితో బేరం కుదుర్చుకోవటం; ఉపకారం చేసినట్టే చేసి, వీలైన కాడికి రాజ్యాన్నీ, పాలనాధికారాలను పూర్తిగా నొక్కేసి, పాలకుడిని పెన్షనరు స్థాయికి దిగజార్చి మూల కూచోబెట్టటం! భారతదేశంలో తమకు మొట్టమొదటి గిడ్డంగిని ఏర్పరచుకోనిచ్చిన సూరత్‌నూ, ఆది నుంచీ తమతో ప్రగాఢ మైత్రి నెరపిన తంజావూరునూ ఇదే రీతిలో నోట కరిచిన మీదట వెల్లస్లీ ప్రభువు తీక్షణ దృష్టి అయోధ్యపై ప్రసరించింది.

మళ్లీ వన్స్‌మోర్! పూర్వపు గవర్నర్ జనరల్ సర్ జాన్‌షోర్ గారు అయోధ్యలో వజీరాలీ అనే నవాబును గద్దెదించి సాదత్ ఆలీ అనే వాణ్ని సింహాసనం ఎక్కించాడు. తీసేసిన నవాబును కాశీలో ఉంచారు. చెరసాలలో ఉండే అతడు బయటి వారితో కుట్ర చేస్తున్నట్టు అనుమానం రావటంతో అక్కణ్నుంచి కలకత్తాకు అతణ్ని మార్చదలిచారు. ఆ సంగతి ముందే పసిగట్టి వజీరాలీ తిరుగుబాటు చేసి, జైలు అధికారిని చంపి పారిపోయి, కొంత బలగాన్ని సమకూర్చుకుని అల్లర్లకు దిగాడు. ఈ గందరగోళాన్ని అణచటానికి కొంచెం సైనిక సాయం చేయమని నవాబు తెల్లవారిని అడిగాడు. అప్పుడు గవర్నర్ జనరల్ వెల్లస్లీ. సరిగ్గా అలాంటి అవకాశం కోసమే అతడూ కాచుకుని ఉన్నాడు. చాన్సురాగానే చకచకా కదిలాడు.

నవాబు అడిగిందేమో - కాస్త మీ సేనల్ని పంపి తిరుగుబాటును అణచమని. ఆ పని చేయటానికి అప్పటికే నవాబు మేపుతున్న ఇంగ్లీషు సైన్యమే చాలు. కాని వెల్లస్లీ ఈ సాకుతో భారీగా బలగాన్ని దించి రాజ్యాన్ని కాజేయాలనుకున్నాడు. పరిపాలనను చక్కదిద్దే నెపంతో అతడు మొత్తం పవర్లన్నీ నవాబు నుంచి లాగేయబూనాడు. "సంస్కరణ" పేరుతో రాజ్య అపహరణ ఎంత దుర్మార్గంగా జరిగిందో కర్నల్ బెయిర్డ్ అనే బ్రిటిష్ ఆఫీసరు **Dacoitee**



**in Excelsis** అనే గ్రంథంలో పూసగుచ్చినట్టు వివరించాడు. సారాంశం ఇది :

మాకు కట్టాల్సిన కప్పం మీరు సరిగా చెల్లించటంలేదు. బకాయిలు పెరిగాయి. పరిపాలన కూడా ఏమీ బాగాలేదు. ఈ పరిస్థితిని సరిచేయటానికి నేను మంచి ఏర్పాటొకటి ఆలోచించాను అని వెల్లస్లీ దొర అందమైన భాషలో నాజూకైన శైలిలో నవాబుపై శుభలేఖలు సంధించాడు. ఆ ఏర్పాటు ఏమిటట? నవాబు సైన్యాన్ని దాదాపుగా తీసి పారేయటం; నవాబుగిరి దర్జాకు, రెవిన్యూ వసూలుకు కావలసినంత బలగం మాత్రం ఉంచి, మిగతా సైన్యం తీసేసి, దాని స్థానంలో కంపెనీకి చెందిన అదనపు సైన్యాన్ని చేర్చటం; ఆ ఖర్చంతా నవాబే భరించటం!

ఆ అడ్డగోలు ఏర్పాటు వినగానే నవాబు గాభరా పడి, "ఇంతకంటే నేను రాజ్యం వదిలేసుకుపోవటం మేలు" అని నిష్ఠూరమాడాడు. అతడి నోటివెంట వచ్చిన ఆ మాటనే వెల్లస్లీ గట్టిగా పట్టుకున్నాడు. నవాబు రాజ్యం వదిలిపోయి; సివిల్, మిలిటరీ అధికారాలు యావత్తూ కంపెనీవారే చలాయించేలా ఒక విడ్డూరపు కరారునామా తయారుచేశాడు. దాన్ని చూసి నవాబు నిర్ఘాంతపోయి ససేమిరా సంతకం పెట్టనన్నాడు. దానిపై రాయబారాలు నడుస్తూనే ఉన్నాయి. నవాబు చెప్పేదానికి కంపెనీ అధికారులు ఊకొడుతూనే ఉన్నారు. ఇంకో పక్క నుంచి ఇంగ్లీషు సేనలు రాజ్యంలోకి చొచ్చుకువస్తూనే ఉన్నాయి.

ఇదేమి జబర్దస్తీ అని నవాబు మొత్తుకున్నాడు. దానికి కంపెనీవారు ఏమని బదులిచ్చారంటే- వెనుకటి 1798 ఒడంబడిక ప్రకారం అయోధ్య రాజ్యాన్ని రక్షించాల్సిన భారం కంపెనీ వారి నెత్తిమీద ఉన్నదట! కాబట్టి నవాబుకు ఇష్టం ఉన్నా లేకున్నా సరే ఎన్ని బ్రిటిష్ సేనలనయినా తీసుకొచ్చి రాజ్యంలో దింపే అధికారం కంపెనీకి ఉన్నదని అనుకోవాలట. ఈ ప్రకారం తమ చిత్తానుసారం తీసుకొచ్చి దింపే సైన్యం జీతబత్తేలకయ్యే ఖర్చంతా నవాబే ఇచ్చుకోవాలట. అంటే అవసరాన్ని నిర్ణయించేది కంపెనీ; డబ్బు ఇచ్చుకోవలసిందేమో నవాబు! ఇలా తంబకు తంబగా బ్రిటిష్ సైనిక దళాలు వచ్చిపడుతూంటే బెంబేలెత్తి నవాబు సాదత్ అలీ లక్నో రెసిడెంటు ద్వారా 1800 జనవరి 11న గవర్నర్ జనరల్‌కు పెద్దమహజరు ఇలా పంపుకున్నాడు.

"ఘనత వహించిన కంపెనీ వారికి నేను సంపూర్ణముగ శరణాగతుడను... తమరీ ప్రకారముగ చేయుటవల్ల తమ కీర్తికి కళంకము కలుగును. కంపెనీవారికి నాయందు నమ్మకము లేక నన్నీరీతిగ పదభ్రష్టుని జేసి తమ సైన్యము తీసికొని వచ్చి దేశములో పెట్టినారని ప్రజలనుకుందురు. ఈ ప్రకారము జరిగినట్లయితే ఇక దేశంలో నా అధికారమే అంతరించి పోతుంది. నా యాజ్ఞలను కడజాతివాడు కూడా లెక్కచేయడు. మీకు కప్పము చెల్లించటానికి నేనెంత తంటాలుపడినా వృథయవుతుంది... పట్టాభిషేక కాలమందు నేను కంపెనీ వారితో చేసుకున్న ఒడంబడికను ఒక వెంట్రుకవాసి కూడా తప్పి నడచుకొనను... ఎట్టి అవసరము లేకున్నను మీరు సేనలను హెచ్చుచేసి ఆ ఖర్చును నన్ను పెట్టకొనుమనుట చాలా అన్యాయము. ఇది మన ఒడంబడికకు విరుద్ధము... కాబట్టి తామీ సంగతుల నన్నింటిని దయచేసి పూర్తిగ విచారించి, నా రాజ్యముపైన నాకు సంపూర్ణాధికారము పూర్వపు వలెనే నిలిచి యుండునట్టు చేయగోరెదను... నేనును అన్ని విషయములలో

మీతో సంప్రదించుచునే మీ యాజ్ఞలకు యెల్లప్పుడు బద్ధుడనగుచునే నడుచుకొనుచుందును".

(బ్రిటిష్ మహాయుగము అను. మానికొండ సత్యనారాయణశాస్త్రి ప్రథమ సంపుటం. పే. 455-57).

ఇంత వినయంగా ప్రాధేయపడుతూ నవాబు రాసుకున్న జాబుకు తల బిరుసు వెల్లస్లీ ఎంత పొగరుబోతు జవాబు ఇచ్చాడో చూడండి. జవాబును సరాసరి నవాబుకు పంపకుండా స్థానిక రెసిడెంటుకు తన సెక్రటరీ చేత అతడు ఇలా రాయించాడు:

"నబాబు మీ ద్వారా పంపించిన ఉత్తరము సరియైన మతలబులో లేదు. దానిని తామందుకొనుట తగదని ఘనత వహించిన వెల్లస్లీ ప్రభువుగారు తలంచుచున్నారు. కాబట్టి సదరు ఉత్తరమును మీరు తిరిగి నబాబుకు పంపించి వేయండి... ఈ మతలబుగ జవాబిచ్చుట... అతని లేకితనము తెలియబరుచుటేగాక ఇండియాలో బ్రిటిష్ అధికారులలో అగ్రేసరుడగు గవర్నరు జనరలు యెడ నబాబు విధిగ చూపవలసిన మర్యాదకు చాలా లోపము... ఇప్పుడు వాపసు చేయుచున్న యీ ఉత్తరములో ప్రకారమే నవాబు తిరిగి జవాబివ్వదలచిన యెడల... నిరాధారమగు యీ నిందకు యెట్లు జవాబు చెప్పవలెనో ఘనత వహించిన గవర్నర్ జనరల్ ప్రభువుగారికి తెలియుననీ మీరు నవాబుకు గట్టిగ చెప్పండి".

(అదే గ్రంథం పే. 475-58).

ఈ ఉత్తర ప్రత్యుత్తరాల గురించి ఆంగ్ల చరిత్రకారుడు **జేమ్స్ మిల్** వ్యాఖ్యానం ఇది:

ఒడంబడిక చేసుకున్న రెండు పార్టీలలో ఒక పార్టీ షరతులన్నిటినీ తు.చ. తప్పక పాటించాడు. రెండో పార్టీవారు ఒడంబడికను అడ్డగోలుగా భగ్నం చేశారు. అప్పుడు మొదటి పార్టీ ఏమిచేశాడు? "అయ్యా, మన ఒడంబడికకు, మీ ప్రవర్తనకు తేడా కనపడుతోంది" అని ఎంతో వినయ విధేయతలతో విన్నవించుకున్నాడు. అతడు మనవి చేసుకున్న ధోరణి అతడి బానిస బుద్ధిని తెలుపుతుందే తప్ప ఎదుటి వారి యెడ అమర్యాద ఎంతమాత్రం లేదు. అయినా అవతలి పక్షం వారేమంటున్నారు? అతడి ధోరణి తమ గౌరవాన్ని కించపరచిందని నింద వేశారు. ఎదుటివాణ్ని వేటువేయటానికి లోగడ ఎలాంటి తప్పు కనిపించపోయినా, ఇప్పుడీ అవినయ ధోరణే మహాపరాధంగా కల్పించి కత్తి ఎత్తుతారు. నష్టపోయిన పార్టీ అదేమనకుండా నోరు మూసుకుంటే "ఎదుటి పార్టీయే ఒప్పుకున్నాడు. ఇందులో తప్పేముంది" అంటారు. అతడు పల్లెత్తుమాట అంటే "ఇదిగో నువ్వు మా న్యాయబుద్ధిని నిందించి అల్లరి పెడుతున్నావు. నీబోటి అధముడితో మాటలేమిటి? పోపో" అని కసిరి తడాఖా చూపిస్తారు.

ఇంగ్లీషువారి కత్తికి రెండువైపులా పదును! మొట్టమొదట నవాబు వద్దన్న కొద్దీ సేనలమీద సేనలు తీసుకొచ్చి అతడి నెత్తిన రుద్దారు. ఖర్చుపై ఖర్చును అతడిమీద మోపారు. ఆ సొమ్ము ఇచ్చుకోలేను మొర్రో అని గోల పెడితే, ఆ గోలనే ఒక సాకుగా తీసుకుని "సొమ్ము లేకపోతే రాజ్యం ఇచ్చి వెయ్యి" అని బలాత్కరించారు. ఉన్నంత వరకూ డబ్బు గుంజి, అది అయిపోయాక రాజ్యం లాక్కున్నారు. మనోవర్తి పుచ్చుకుని రాజ్యం వదులుకొని పోనైనా పో; లేదా ఇప్పుడు నీ రాజ్యంలోకి వచ్చిన రెండు దళాల ఖర్చుకింద నీ రాజ్యంలో సగ



భాగం కంపెనీకి ధారాదత్తమైనా చెయ్యి" అని వెల్లస్లీ నవాబు మెడమీద కత్తి పెట్టాడు. "కోరిన పరగణాలను అప్పగించటానికి నవాబు ఒప్పుకోకపోతే ఆ ప్రాంతాలను బలవంతంగా ఆక్రమించండి. దీనిపై మళ్లీ నా ఉత్తర్వులకు ఎదురు చూడకుండా పని జరిపించండి" అని స్థానిక రెసిడెంటుకు బందిపోటు పని పురమాయించాడు. అలా నానా ఏడుపు ఏడిపించి, 1801 నవంబరు 4న నవాబు చేత అర్ధరాజ్యాన్ని తమకు రాయించుకున్నారు. మిగతా రాజ్యం మీద నీకే అధికారం ఉంటుంది. లెమ్మని ఉదారంగా వరమైతే ఇచ్చారు. ఆచరణలో దానికీ నామం పెట్టి మిగతా సగంపై వచ్చే రెవిన్యూనూ దిగమింగి, ఆ భాగాన్ని క్రమంగా కబ్జాచేసి నవాబును తమ దయపై ఆధారపడ్డ పెన్షనరు స్థాయికి దిగజార్చారు.

పట్టపగలు దారిదోపిడీలాంటి అయోధ్య రాజ్యాపహరణ దురంతం మెల్లిగా బ్రిటిష్ ప్రజల చెవిన పడింది. ఇండియా పట్ల ఆదినుంచీ అపార అభిమానం చూపి, లోగడ వారన్ హేస్టింగ్స్‌ను పార్లమెంటు బోనులో తూర్పారపట్టిన సర్ ఫిలిప్ ఫ్రాన్సిస్ అప్పటికి బతికే ఉన్నాడు. అయోధ్యలో ఉండి వెల్లస్లీ దుండగాలను కళ్లారా చూసిన పాల్ అనే పెద్దమనిషి, ఫ్రాన్సిస్ కలిసి వెల్లస్లీ ఇంగ్లండుకు తిరిగి వచ్చాక అతడి భరతం పట్టటానికి పార్లమెంటులో శాయశక్తులా కృషిచేశారు. తనకు వెల్లస్లీపై వ్యక్తిగత కక్ష ఏమీలేదని, భారత ప్రజల సౌఖ్యానికి శ్రేయస్సుకేగాక జన్మభూమి ఇంగ్లండు కీర్తికి కూడా వెల్లస్లీ శత్రువు అని రుజువు పరచటానికే న్యాయబుద్ధితో తానీ అభియోగం మోపుతున్నానని పాల్ 1806 జనవరిలో బ్రిటిష్ పార్లమెంటులో తేటతెల్లం చేశాడు. 'వారన్ హేస్టింగ్సు లాగే వెల్లస్లీ కూడా మహా అపరాధి, రాజ్యద్రోహి. అయితే హేస్టింగ్సుకూ ఇతడికీ ఒక్క తేడా ఉంది. ఏ దోషమైతే హేస్టింగ్సులో అస్పష్టంగా వుందో వెల్లస్లీ విషయంలో స్పష్టంగా కనిపిస్తున్నది. వెనుక వారన్ హేస్టింగ్సుపై చార్జిలు పెట్టబడ్డ సమయంలో వెల్లస్లీ పార్లమెంటు మెంబరుగా ఉన్నాడు. కనుక ఇలాంటి చార్జీల లోతుపాతులు, దేశంలోని శాసనాలు తనకు తెలియవని గాని, పొరబడ్డానని గాని సాకు చెప్పే వీలే లేదు' అని విశదీకరించి పాల్ నిర్దిష్ట నేరారోపణకు ఉపక్రమించాడు.

*"In defiance and contempt of the laws... (Wellesley) did conceive and execute an intention to encroach upon the power and rights of the said Nabob Vizier, to interfere in the internal affairs of his government, to undermine and destroy his authority over his household affairs, his troops, and his subjects, and under pretence the most false, to exert from him, the Nabob Vizier, his hereditary dominions, so solemnly guaranteed to him by the company in the treaty of 1798..."* (చట్టాలను తృణీకార భావంతో ఉల్లంఘించి నవాబు అధికారాన్ని, హక్కులను అతిక్రమించి, అతడి ప్రభుత్వ ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం చేసుకుని, గృహకృత్యాల్లోనూ, సేనల పైనా, ప్రజలలోనూ అతడి అధికారాన్ని నాశనపరచి, అబద్ధపు మిషలతో సదరు నవాబు నుంచి అతడి ఆనువంశిక రాజ్యాన్ని ఊడబెరికి... 1798 ఒడంబడికలో కంపెనీవారు ప్రమాణ పూర్వకంగా అతడికి ఇచ్చిన హామీని వెల్లస్లీ ఘోరంగా భంగపరిచాడు) అని పార్లమెంటులో ఎలుగెత్తాడు.

అయోధ్య వజీరు విషయంలో వెల్లస్లీ చర్య అక్రమమైన క్రిమినల్ నేరం అన్న అభియోగాన్ని పార్లమెంటు పరిగణనలోకి తీసుకుంది. దానిపై చర్చ ఒక కొలిక్కి వచ్చి ఓటింగు జరిగే లోపే పార్లమెంటు ఆయువు తీరింది. కొత్త పార్లమెంటులో ఫ్రాన్సిసూ లేదు; పాలూ లేదు.

వెల్లస్లీ పక్షపాతులు, స్వయానా అతడి సోదరులిద్దరు కొత్త సభలో ప్రవేశించి, అభియోగాన్ని నీరుగార్చటానికి శక్తివంచన లేకుండా పాటుపడ్డారు. రెండేళ్ల విలంబనం తరవాత మొక్కుబడిగా పునఃప్రారంభమైన విచారణలో సర్ థామస్ టర్టన్ లాంటి వారు ఎంత పట్టుదలగా పోరాడినా ప్రయోజనం లేకపోయింది. ఏ గడ్డికరుస్తేనేం? ఎన్ని తప్పులు చేస్తేనేం? కొత్త రాజ్యాలను జయించి పెట్టినవాడే మొనగాడు అన్న బ్రిటిష్ పాలకవర్గ అవకాశవాదమే చివరికి నెగ్గింది. వెల్లస్లీ చేసిన దురంతాలను ఖండించటానికి బదులు అతడి ఘనకార్యాలను ఆమోదించి అభినందిస్తూ ప్రజాస్వామ్యానికి పుట్టినిల్లు, పార్లమెంటుల కన్నతల్లి అయిన బ్రిటిషు పార్లమెంటు అత్యద్భుతమైన తీర్మానం చేసింది.

వెల్లస్లీ అభిశంసన తతంగం కాస్తా అతడి అభినందన తీర్మానంగా రూపుదాల్చి తెల్లవారి ద్వంద్వ నీతికి నిలువెత్తు నిదర్శనంగా చరిత్రలో నిలిచిపోయింది.



# మరాఠాలకు చేటు

"టిప్పు సుల్తాన్ ఖతమయ్యాడు. బ్రిటిష్ పవరు పెరిగింది. తూర్పు భారతదేశం ఇప్పటికే వారిదయింది. తరువాత వేటు పూనా మీద పడుతుంది. చెడ్డరోజులు దాపురించాయి."

మరణించడానికి కొన్ని నెలల ముందు నానా ఫడ్నవిస్ – పీష్వా బాజీరావుకు దూరదృష్టితో చేసిన హెచ్చరిక ఇది. పీష్వాకు నమ్మబుద్ధికాలేదు. నానా మరీ అనుమానపు మనిషి; తనది కుట్ర మనస్తత్వం కాబట్టి ప్రతిచోటా కుట్రనే చూస్తుంటాడు – అనుకుని తేలికగా తీసిపారేశాడు. కాని నానా అన్నదే అక్షరాలా నిజమైంది.

ఒక్క బాజీరావు పీష్వాయే కాదు.. ఇంగ్లీషు వారి నుంచి తమకు పెనుముప్పు రానున్నదంటే ఆ కాలంలో మరాఠా మహారథులు చాలామంది నమ్మలేకపోయారు. బ్రిటిష్ వారు మనకు మిత్రులే తప్ప శత్రువులు కారుకదా? ఒకరిపై ఒకరు దండెత్తరాదని ఒకరి శత్రువులను రెండో వారికి కూడా శత్రువులుగా పరిగణిస్తూ ఒకరికొకరు సహాయం చేసుకుంటూ సఖ్యంగా ఉండాలని – వారికీ మనకూ దేవుడి మీద ప్రమాణం చేసుకుని కుదుర్చుకున్న ఒప్పందాలు ఉన్నాయి కదా? వెనకటి మైసూరు యుద్ధంలోనూ వారికి సహాయంగా వెళ్లి టిప్పును ఓడించటానికి మనమే కారకులయ్యాము కదా? ఈ మధ్య యుద్ధానికి మన సైనిక సహాయాన్ని వద్దనా – టిప్పును చంపి వశపరచుకున్న రాజ్యంలో మైత్రీ ఒప్పందం ప్రకారం మనకూ వాటా ఇస్తామంటున్నారు కదా? అటువంటి బ్రిటిష్ మిత్రులు మన మీద ఎందుకు కత్తి ఎత్తుతారు? ఒకవేళ వారలాంటి పిచ్చిపని చేసినా మనము తగిన శాస్తి చెయ్యలేమా? మహా ఘనత వహించిన నిజాంనే ఖార్డా యుద్ధంలో నేలకరిపించి మన సత్తా ఏమిటో లోకానికి చాటాము కదా? నిజాంకూ తమకూ సైనిక సహకార ఒప్పందం ఉండి కూడా మనము నిజాంపై దాడి చేస్తూంటే అడ్డుకోవటానికి ఇంగ్లీషు వారికి దమ్ములేకపోయాయి కదా? అలాంటివారు మనమీదే కయ్యానికి ఎలా సాహసిస్తారు? మహామహా టిప్పూ, నిజాంలనే గడగడలాడించిన మనకు ఈ విదేశీయులు

ఓ లెక్కా?... అని మీసాలు మెలివేశారు మహారాష్ట్ర పెద్దలు.

కాని, నానా అన్నట్టే జరిగింది. కుట్ర చేసి విద్రోహ తంత్రంతో టిప్పును వేటు వేసి మూడేళ్లు తిరక్కుండా ఇంగ్లీషు మాయావులు మరాఠా సామ్రాజ్యాన్ని, మహారాష్ట్రుల స్వాతంత్ర్యాన్ని అక్రమంగా బలిగొన్నారు. ఇండియాలో ఆంగ్ల రాజ్యస్థాపన క్రమంలో తెల్లవారు మూటకట్టుకున్న కళంకాలన్నిటిలోకీ మహారాష్ట్రుల విషయంలో వారు అనుసరించిన దుర్మార్గం చెడ్డది. బొంబాయి సివిల్ సర్వీసులోని బ్రిటిష్ పెద్దమనిషి ఒకరు అనంతరకాలంలో వ్యాఖ్యానించినట్టు "However fairly told, there is much for the English to be ashamed of in this period." *(ఎంత నిష్పక్షపాతంగా చెప్పినా ఇందులో ఇంగ్లీషువారు సిగ్గుపడవలసింది చాలా ఉంది.)*

ఈ సిగ్గుచేటు నిర్వాకాన్ని సమర్థించడానికి బ్రిటిష్ మేధావులు నానా తంటాలు పడ్డారు. తప్పంతా మహారాష్ట్రులదే అయినట్టు అపవాదాలు సృష్టించిన చరిత్రకారులందరూ అసలు విలన్ అయిన వెల్లస్లీ, అతడి తమ్ములు తెగబడి చెప్పిన అబద్ధాలను అక్షర సత్యాలుగా జిదల దాల్చారే తప్ప మహారాష్ట్రులను బ్రిటిష్‌వారు ఎలా మోసగించిందీ పరికించిన పాపాన పోలేదు. నిజానికి ఆ మోసం మూడో మనిషికి తెలియని అతి రహస్యమేమీ కాదు. గవర్నర్ జనరల్ వెల్లస్లీ, అనంతర కాలంలో డ్యూక్ ఆఫ్ వెల్లింగ్టన్ అయిన అతడి తమ్ముడు ఆర్థర్ వెల్లస్లీలు ఆ కాలంలో జరిపిన ఉత్తరప్రత్యుత్తరాలను జాగ్రత్తగా గమనిస్తే అసలు రంగు బయటపడుతుంది. ఇంగ్లీషువారితో మైత్రిని, శాంతిని ఏ విధంగానూ భగ్నపరచకుండా మహారాష్ట్రులు ఎంత సంయమనం చూపినా తెల్లవారే తీరికూర్చుని, వలలు పన్ని, గోతులు తీసి, దగాలు చేసి మరాఠా రాజ్యాన్ని నోట కరిచారన్న కఠోర వాస్తవం కళ్లకు కడుతుంది.

***Oxford History of India*** మూడో భాగంలో విఖ్యాత చరిత్రకారుడు **విన్సెంట్ స్మిత్** చెప్పిన ప్రకారం ఆంగ్లేయులకూ మహారాష్ట్రులకూ వ్యవహారం చెడటానికి కారణాలివి:

నిజాం పూర్తిగా ఇంగ్లీషు వారిపై ఆధారపడి, 1798, 1800 ఒప్పందాల మేరకు నైజాం రాజ్యం ఆంగ్లేయులకు స్వాధీనమయ్యాక... టిప్పు వినాశనంతో మైసూరు రాజ్యం కూడా దొరల పరమయ్యాక మరాఠాలతో రాజకీయ సంబంధాల స్వరూపం పూర్తిగా మారిపోయింది. నేరుగా బ్రిటిష్ పరిపాలనలోని ప్రాంతాలను వలెనే నైజాం, మైసూరు రాజ్యాలనూ సంరక్షించవలసిన బాధ్యత ఆంగ్లేయులపై పడింది. ఆయా రాజ్యాలకూ మరాఠాలకూ మధ్య ఉన్న రాజకీయ సంబంధాలకు 'కంపెనీ' ఉత్తరాధికారి అయింది. మైసూరు, హైదరాబాద్‌లు తమకు చెల్లించాల్సిన 'చౌథ్' కప్పం బకాయిలు చెల్లించాలని మరాఠాలు చాలాకాలంగా గద్దిస్తున్నారు. ఆ రాజ్యాలు తమ చేతుల్లోకి రావటంతో ఆ డిమాండ్లకు ఇంగ్లీషు వారు సమాధానం చెప్పవలసి వచ్చింది. మహారాష్ట్రులవి అడ్డగోలు కోర్కెలు. వారికి చౌథూ గీథూ కట్టాల్సిన అవసరం ఇంగ్లీషు వారికి లేదు. ఆ సంగతి మరాఠాలకు ఎంత చెప్పినా అర్థం కాలేదు. వారిదంతా బందిపోట్ల పోకడ. ఎక్కడో ఒకచోట దోపిడీ చేస్తే తప్ప వారు సైన్యాన్ని మేపలేరు. చెల్లింపుల కోసం వారు పేట్రేగటంతో మరాఠా వ్యవహారాల్లో జోక్యం చేసుకోకుండా ఉండటం ఆంగ్లేయులకు ఆచరణ సాధ్యం కాకపోయింది. ఆ సమయంలో గవర్నర్ జనరల్ ముందున్నవి రెండే దారులు. మరాఠాలతో పాత ఒప్పందాన్ని పట్టుకు వేలాడి, వారి దాష్టీకానికి తల వంచి, ఏమి చేసినా సహించి పడి ఉండటం. లేదా – మరాఠాలను దారికి తెచ్చి, శాంతి సుస్థిరతలను నెలకొల్పటానికి అవసరమైన చర్యలు



తీసుకోవటం. ఈస్టిండియా కంపెనీ డైరెక్టర్లయితే ఇందులో మొదటి ప్రత్యామ్నాయం మంచిదనుకున్నారు. దాన్ని అనుసరిస్తే విశాల ప్రాంతాలను అరాచకానికి, దైన్యానికి గురిచేయటమే అవుతుంది. వెల్లస్లీ ప్రభువు అటువంటి పరువు తక్కువ పనిచేసే పిరికివాడు కాడు. కాబట్టి మరాఠాలను ప్రశాంతంగా బతికే పొరుగు వారిలా మార్చటానికి అవసరమైన చర్యలను ఆయన తలపెట్టవలసి వచ్చింది... అని విన్సెంట్ స్మిత్ ఉవాచ.

సుప్రసిద్ధ చరిత్రకారులు, అందులోనూ పాశ్చాత్యులు అయిన వారు రాసిన ఇటువంటి రాతలను చదివితే వెల్లస్లీ ప్రభువు ధీరోదాత్తుడుగానూ మరాఠాలేమో నీతీరీతీ లేకుండా డబ్బులు గుంజే బందిపోట్లుగానూ విషయం తెలియని వారికి పొడగట్టటం సహజమే. విదేశీయులే గాక దేశవాళీ మేధావులు, చరిత్రకారులు కూడా మహారాష్ట్రులకు మొత్తం మీద అన్యాయం చేశారు. బాజీరావు పీష్వా అసమర్థత, అప్రయోజకత్వాల వల్ల, దౌలత్‌రావు సింధియా ధూర్తత్వంవల్ల, నానా ఫడ్నవిస్ కుట్ర మనస్తత్వంవల్ల, సింధియా, హోల్కర్ల వైషమ్యాలవల్ల, మరాఠా రాజ్యం అస్తవ్యస్తమైందనీ... బాజీరావు, దౌలత్‌రావుల దుర్మార్గాల మూలంగా మరాఠా సర్దార్లకు, జాగీర్దార్లకు మనసు విరిగి వారికంటే ఇంగ్లీషువారే నయమనుకునే పరిస్థితి వచ్చిందనీ... పాలక ముఠా అవినీతి, అత్యాచారాల కారణంగా న్యాయానికి నిలవ నీడలేక, ఫిర్యాదులు వినే నాథుడు లేక ప్రజలు అష్టకష్టాలు పడి, కడకు విదేశీయులను స్వాగతించారనీ మన చరిత్ర పండితులు చాలామంది ఏకరువు పెట్టారు. ఆఖరికి మహారాష్ట్ర చరిత్రకారుల్లో అగ్రగణ్యుడు, మాన్యుడు అయిన జి.ఎస్.సర్దేశాయి కూడా మరాఠా రాజ్య పతనానికి బాజీరావు, సింధియాల పాపాలు మొదలుకుని సైన్సు, టెక్నాలజీల పట్ల అశ్రద్ధ, ఆర్గనైజేషన్ లోపాల వరకూ ఎన్నో కారణాలనయితే చక్కగా వివరించారు. కాని ఇంగ్లీషువారు దగా, దౌర్జన్యాలతో మరాఠా రాజ్యాన్ని కబళించిన వైనాన్ని మాత్రం చూసీ చూడనట్టు వదిలేశారు.

18వ శతాబ్దం ముగిసే నాటికి మహారాష్ట్ర రాజకీయాలు నానా గత్తరగా ఉన్నమాట నిజం. రాజ్యానికి అరిష్టం అయిన రఘునాథరావు మరణించిన తరువాత కూడా తన సుపుత్రుడి ద్వారా మహారాష్ట్రులకు శాంతి లేకుండా చేశాడు. నాసిక్ సమీపాన రఘునాథరావు మరణించాక అతడి భార్య ఆనందిబాయి కుమారులను తీసుకుని ఆనందవల్లికి మకాం మార్చింది. కొంతకాలానికి ఆమె కూడా చనిపోయింది. అప్పటికి బాజీరావు నూనూగు మీసాల ప్రాయంలో ఉన్నాడు. తండ్రి కోల్పోయిన అధికారాన్ని ఎలాగైనా రాబట్టాలని అదనుకోసం వేచి ఉన్నాడు. మరాఠా సర్దార్లు, సైనికులు యావన్మందీ నిజాం మీదికి యుద్ధానికి పోనున్న తరుణంలో అలాంటి వాడిని స్వేచ్ఛగా వదిలి వెళితే తిరిగొచ్చేసరికి ఏమి కొంప ముంచుతాడన్న భయంతో నానా ఫడ్నవిస్ బాజీరావును, అతడి తమ్ముడు చిమ్మాజీ అప్పానూ, దత్తు సోదరుడు అమృతరావునూ 1795లో చెరలో వేశాడు. ఖార్దా యుద్ధంలో నిజాంను గెలిచి వచ్చాక కూడా ఎందుకైనా మంచిదని వారిని శివనేరు ఖైదులోనే ఉంచాడు.

అప్పటికి పీష్వా మాధవరావుకు 21 ఏళ్లు. బాజీరావుకు 19 ఏళ్లు. పసితనంలోనే గద్దె నెక్కినా మాధవరావు బాల్యం, కౌమారం అంతా నానాఫడ్నవిస్ ఒద్దికలో ఒదిగి ఉండటంతోనే సరిపోయింది. ఈడు వచ్చాకయినా స్వతంత్రించి నీ అధికారాన్ని నీవు చలాయించకూడదా అని భార్యలు, సేవకులు అతడిని ప్రేరేపించారు. అతనూ అందుకు ప్రయత్నించాడు. ఒకటి రెండు సందర్భాల్లో నానాను లెక్క చేయక నిర్ణయాలు చేశాడు కూడా. కాని

అవలించకుండానే పేగులు లెక్కబెట్టగలిగి, ఎక్కడ ఏమి జరుగుతోందీ వెయ్యి కళ్లతో కనిపెట్టే నానా అతడి ఎత్తులను సాగనివ్వలేదు. చిరకాలంగా తనకూ, రాజ్యానికీ రక్షకుడైన నానాను ఎదిరించేందుకు పీష్వాకూ ధైర్యం చాలలేదు.

అదే సమయంలో శివనేరు ఖైదు నుంచి బాజీరావు పావులు కదిపాడు. చెరసాల అధికారులను లోబరుచుకుని మాధవరావుకు సందేశాలు పంపించసాగాడు. 'చెరలో ఉండి నేనూ.. రాజమందిరంలో ఉండి నీవూ ఒకలాగే ఉన్నాము. వాస్తవానికి ఇద్దరమూ ఖైదీలమే' అంటూ సానుభూతి ఒలికించి పీష్వాను రెచ్చగొట్టాడు. క్రమేణా ఇద్దరి మధ్య అనుబంధం పెరిగింది. ఉత్తర ప్రత్యుత్తరాలు జోరయ్యాయి. నీ అధికారం ఉపయోగించి నాకు బంధవిముక్తి చేయించకూడదా అని వరసకు పినతండ్రి అయిన బాజీరావు మోహమాట పెట్టాడు. ఔను. ఎందుకు వదిలెయ్యకూడదు- అని నానాను పీష్వా అడిగాడు. బాజీరావు తండ్రి ఎటువంటివాడో, రాజ్యానికి ఎంత అపకారం చేశాడో నానా గుర్తుచేశాడు. 'అయితే ఏమిటి? తండ్రి చేసిన తప్పుకు కొడుకును ఎందుకు శిక్షించాలి? బాజీరావును వదిలిపెట్టండి' అన్నాడు పీష్వా. నానా వినలేదు. వయసు వచ్చినా మాధవరావును పసివాడిలాగే చూసి, పీష్వాకూ తనకూ ఉన్న అంతస్థుల తారతమ్యాన్ని మరిచి, కొంచెం కటువుగానే మాధవరావు నోరు నొక్కాడు. విడిచిపెట్టకపోగా బాజీరావు పై నిర్బంధాన్ని మరింత కఠినం చేశాడు. ఇది పీష్వాకు సహజంగానే తీవ్ర మనస్తాపం కలిగించింది. కాని ఏమి చేయాలో తోచలేదు.

మహారాష్ట్ర రాజకీయాల్లో నానా ఫడ్నవిస్‌కు కొన్ని విషయాల్లోనైనా సమఉజ్జీ అనదగ్గవాడు ఒకే ఒకడు; మాధవరావు (మహాద్‌జీ) సింధియా. మరాఠా స్వరాజ్యాన్ని శివాజీ స్థాపించింది 1653 ప్రాంతాల్లో అనుకుంటే 1713 వరకూ 60 ఏళ్లు ఛత్రపతులైన శివాజీ, అతడి వారసుల ఏలుబడి సాగింది. తరువాత ఛత్రపతి ఛాయాగ్రహంలా మారి 1713లో పీష్వాల శకం మొదలై 60 ఏళ్లు ఉజ్వలంగా వెలిగింది. మొదటి నలుగురు పీష్వాల దీక్షాదక్షతల వల్ల మరాఠా ప్రభ మహారాష్ట్ర ఎల్లలు దాటి దేశంలో విశాల ప్రాంతాలకు విస్తరించింది.

ప్రతిపచ్చంద్ర రేఖేవ వర్ధిష్ణుర్విశ్వవందితా
శాహసూనోః శివ స్యైషా ముద్రా భద్రాయ రాజతే

'శాహాజీ కుమారుడైన ఈ శివాజీ యొక్క రాజముద్రిక శుక్లపక్ష చంద్రునిలా దిన దిన ప్రవర్ధమానమవుతూ విశ్వమంతటా వందనలాందుకుంటూ విరాజిల్లును గాక' అని ఛత్రపతి శివాజీ రాజముద్రలో ఆకాంక్షించినట్లుగా మరాఠా మహాసామ్రాజ్యం క్రమేణా బలోపేతమై మధ్యందిన మార్తాండునిలా దుర్నిరీక్ష్యంగా వెలిగి 1773లో మాధవరావు పీష్వా అకాల మరణంతో చరమ దశకు చేరింది. రఘునాథరావు కుట్రలూ, కూహకాలు చేసి, పీష్వా నారాయణరావును దారుణ హత్య కావించి, ఇంగ్లీషు వారితోనూ బయటి విరోధులతోనూ చేతులు కలిపి జాతికి ద్రోహం చేసి లెక్కలేనన్ని సమస్యలు తెచ్చి పెట్టినప్పటికీ మరాఠా జ్యోతి ఆరిపోకుండా ఆ తరబాత కూడా 30 ఏళ్లు ప్రకాశించగలిగిందంటే ఆ ఘనత ముఖ్యంగా ఇద్దరికి చెందుతుంది. ఒకరు అపర చాణక్యుడిలా చక్రం తిప్పి తెలివి తేటలతో, రాజకీయ ప్రజ్ఞతో రాజ్య వ్యవహారాలు నడిపించిన నానా ఫడ్నవిస్. రెండవవాడు భుజబలంతో, సైనిక పరాక్రమంతో రాజ్యాలను జయించి ఉత్తరాదిన జైత్రయాత్ర సాగించిన మాధవరావు (మహాద్‌జీ) సింధియా.

చిత్‌పవన శాఖ బ్రాహ్మణుడైన నానాకు, బ్రాహ్మణేతరుడైన మరాఠా సింధియాకూ



మధ్య ఆదినుంచీ అనేక స్పర్థలు ఉండేవి. ఒకరినొకరు నమ్మకుండా, ఒకరిని దెబ్బతీయటానికి ఒకరు విశ్వప్రయత్నాలు చేసినా, ఎవరి పరిధిలో వారు రాజ్యక్షేమానికి తాము ఉచితమనుకున్న రీతిలో నిజాయితీగా పాటుపడటం విశేషం. వారు ఉచితమని తలచినవి తరువాత తరాల వారికి అనుచితంగా కనపడటం వేరే విషయం.

ఉదాహరణకు మొదటి మరాఠా యుద్ధకాలంలో మాధవరావు సింధియా నిర్వహించిన భూమిక బహుధా అనుమానాస్పదమైంది. పీష్వా ఆదేశాలను అతిక్రమించి, తెల్లవారితో లాలూచీ అయి, అతడు రఘునాథరావు కొమ్ము కాశాడనటానికి అనేక ఆధారాలున్నాయి. వారన్ హేస్టింగ్స్‌కు ముచ్చెమటలు పోయించి దురాక్రమణను తిప్పికొట్టి యుద్ధరంగంలో మరాఠాలు దిగ్విజయం సాధించినా అనంతరం ఆంగ్లేయులకే వాటమైన రీతిలో సాల్బే సంధి కుదిరింది. విదేశీయులపై పోరాటం అర్ధాంతరంగా ఆగిపోయి, దీర్ఘకాలంలో దేశానికి తీరని హాని చేసింది. ఆ దిక్కుమాలిన సంధి ముఖ్యంగా సింధియా పూనిక వల్లే పొసగింది. ఈ తప్పిదానికి సింధియాను చరిత్ర బోనులో దోషిగా నిలబెట్టవలసిందే.

అయితే అదే సంధివల్ల మరాఠాలకు కొంత ప్రయోజనం కూడా జరిగింది. 1782 మే 17న సంతకాలయిన సాల్బే ఒడంబడిక వల్ల ఈస్టిండియా కంపెనీకీ మరాఠాలకూ మధ్య ఇరవయ్యేళ్లపాటు శాంతి నెలకొంది. తన స్వతంత్ర ప్రతిపత్తిని ఆ ఒప్పందం దాదాపుగా ధ్రువీకరించడంతో సింధియా రెట్టించిన ఉత్సాహంతో దశాబ్దంపాటు పరాక్రమించి ఉత్తర భారతాన మరాఠా కత్తికి ఎదురులేకుండా చేశాడు. పాత గెరిల్లా పద్ధతులను వదిలి, డిబోయిన్ అనే ఫ్రెంచి సేనాని ఆధ్వర్యాన యూరోపియన్ తరహా సైన్యాన్ని సమకూర్చుకుని ఢిల్లీని పట్టుకున్నాడు. షా అలం పాదుషాను గుప్పిట్లో పెట్టుకుని మొగల్ సామ్రాజ్య రక్షకుడిగా లాంఛనప్రాయ అధికారం పొందాడు. జైపూర్, జోధ్‌పూర్, మేవాడ్ రాజ్యాలను జయించి రాజస్థానాన్ని పాదాక్రాంతం చేసుకుని ఉజ్జయిని రాజధానిగా రాజ్యమేలాడు. ఉత్తరాదిన బ్రిటిష్ ప్రాబల్యం విస్తరించకుండా శాయశక్తులా నిరోధించాడు.

ఇలా కొన్నేళ్లు గడిచాక సింధియాకూ నానాఫడ్నవిస్‌కూ మధ్య కలతలు పెరిగాయి. తనను కూల్చడానికి నానా కుతంత్రాలు పన్నుతున్నాడన్న అనుమానం బలపడటంతో – పాదుషావారంపిన అధికార నియామక పత్రాలను పీష్వాకు సమర్పించే నెపంతో 1792 జూన్‌లో సింధియా పూనాకు తిరిగి వచ్చాడు. మాధవరావు పీష్వాను ఆకట్టుకుని, నానా ఎత్తులకు పైఎత్తులు వేసి, ప్రత్యర్థులకి దేవిడీమన్నా చేయటానికి ప్రయత్నాలు బాగానే మొదలెట్టాడు. కాని అవి కొలిక్కిరాకముందే 1794లో తన 61వ ఏట మాధవరావు సింధియా ఆకస్మికంగా జబ్బుపడి మరణించాడు.

ప్రధాన ప్రత్యర్థి అయిన సింధియా రంగంనుంచి నిష్క్రమించడంతో మరాఠా రాజకీయాల్లో తిరుగులేకుండా పోయిన నానాను ఎదిరించటం యువ పీష్వాకు కొండను ఢీకొనటంలాగే తోచింది. నానా పెత్తనాన్ని నిరోధించలేని నిస్సహాయ స్థితివల్ల చిత్త క్షోభతోనో... కొందరు ఆరోపించినట్టు బాజీరావు చేయించిన చేతబడివల్లో... ముదిరిన క్షయ రోగంవల్లో తెలియదు గాని సవాయి మాధవరావు పీష్వా తీవ్రంగా జబ్బుపడ్డాడు. జ్వర తీవ్రతలో తరచు మైకం కమ్ముతున్న స్థితిలోనే దసరా ఉత్సవాల్లో పాల్గొన్నాడు. తరువాత రెండురోజులకే ప్రమాదవశాత్తు (గ్రాంట్ డఫ్ అది ఆత్మహత్య అన్నాడు. కాని కాదు.) బాల్కనీ నుంచి జారిపడి, మూడురోజులు నరకయాతన పడి 1795 అక్టోబరు 25న మాధవరావు 21 ఏళ్ల

పిన్న వయసులో కన్నుమూశాడు. అతడికి పుత్ర సంతానం లేకపోవటంతో తదుపరి పీష్వా ఎవరన్న ప్రశ్న తలెత్తింది. తన తరవాత పీష్వాగా బాజీరావు కావాలని మరణించే ముందు మాధవరావు చెప్పాడు. అయినా రఘునాథరావు, ఆనందిబాయిల వంశాంకురాన్ని నెత్తినెక్కించుకుంటే ప్రమాదమన్న భయంతో నానా అందుకు అంగీకరించలేదు. కాని అదే చివరికి తప్పలేదు.



# మాయల మరాఠీలు

ఎత్తులూ పై ఎత్తులూ - రాజీలూ లాలూచీల రాజకీయ టక్కుటమారాలకు అలవాటుపడిపోయిన ఈ కాలం వారికి కూడా అచ్చెరువు కలిగించే పవర్ పాలిటిక్స్ ఇవి! రాజ్యమేలే పీష్వాకు *21* ఏళ్లకే నూరేళ్లూ నిండాయి. ఆయనకి పుత్ర సంతానం లేదు. ఉత్తరాధికారి ఎవరన్నది ప్రశ్న. వంశపారంపర్య అధికారం కాబట్టి తదుపరి పీష్వా ఆ వంశం వాడే అయి ఉండాలి. దగ్గరి దాయాదులు లేకపోలేదు. కాని మరాఠా శనిగారయిన రఘునాథరావుగారి పెద్దబ్బాయి బాజీరావుకు చూస్తూ చూస్తూ అధికారం ఒప్పగించటం నానాఫడ్నవిస్‌కి ఇష్టంలేదు. బయటి వాడెవడికో కిరీటం కట్టబెడితే జనం మెచ్చరు. మరాఠీ పెద్ద సర్దార్ల మధ్యే పుట్టెడు తగవులు, గొడవలు ఉన్న స్థితిలో అందరినీ జాగ్రత్తగా కలుపుకొనిపోతే తప్ప ఏ పనీ సాఫీగా కాదు.

మరి ఏమీ చేయాలా అని బుద్ధి కుశలతనంతా ఉపయోగించి ఆలోచిస్తే నానాఫడ్నవిస్‌కి మెరుపులాంటి ఆలోచన వచ్చింది. మరణించిన పీష్వాకు ఇంకా ఈడేరని ఇల్లాలు యశోదాబాయి ఉంది. ఆమెచేత ఎవరైనా కుర్రాడిని దత్త స్వీకారం చేయించి పీష్వాగా ప్రకటిస్తే పోదా? ఇదీ ఐడియా. వెంటనే నానా పావులు కదిపాడు. దౌలత్‌రావు సింధియా (మరణించిన మాధవరావు సింధియాకి కుమారుడు లేనందువల్ల దగ్గరి బంధువైన ఇతడు సింధియా రాజ్యానికి వారసుడయ్యాడు), రఘూజీ భోంస్లే వగైరాలను పిలిపించి ఇందుకు ఒప్పించాడు.

దత్త స్వీకారానికి అంగీకార పత్రం మీద అందరి సంతకాలు కూడా అయ్యాక ఖైదులోని బాజీరావుకు ఉప్పందింది. అటునుంచి అతడూ కథ నడిపాడు. తనమీద మొదటినుంచీ పక్షపాతం ఉన్న సింధియా మంత్రి బాలోబా తాత్యా పాగ్నిస్‌ను పట్టుకున్నాడు. అతడిని ప్రయోగించి, దౌలత్‌రావు సింధియాను ప్రలోభపెట్టి తనవైపు తిప్పుకున్నాడు. దత్తతకు సరేనన్న ఒప్పందం మీద సంతకం తడి అరకుండానే బాజీరావును పీష్వా చేయాలన్న

రహస్య ఒప్పందాన్ని నానాకి తెలియకుండా సింధియా కుదుర్చుకున్నాడు. దాని ప్రకారం సింధియా సైన్యంతో వెళ్లి శివనేరు చెరనుంచి బాజీరావును విడిపించాలి.

ఆ సంగతి చారచక్షువైన నానాకు వెంటనే తెలిసిపోయింది. సింధియా సైనిక శక్తి ముందు తాను నిలవలేనని అతడికి తెలుసు. సింధియావెళ్లి బాజీరావును విడిపించి కిరీటం పెడితే తాను ఏమీ చేయలేడు. కాబట్టి ఆ పనేదో తానే చేస్తే మంచిదనుకున్నాడు. వెంటనే పరశురామ్ పట్వర్థన్‌ను సేనలతో శరవేగాన సింధియాకంటే ముందే శివనేరుకు ఉరికించాడు. మావైపు తిరిగితే నిన్నే పీష్వా చేస్తామని బేరం పెట్టించాడు. బాజీరావును బుట్టలో వేశాడు.

ఇది ధర్మంకాదు; సింధియాకిచ్చిన మాట తప్పవద్దు అని – తమ్ముడు అమృతరావు వారించాడు. బాజీరావు వినలేదు. సింధియాతో ఒప్పందాన్ని నిస్సంకోచంగా తుంగలో తొక్కాడు. ఇందులో మోసం ఏమీ లేదుకదా, మాట తప్పరుకదా అని పలుమార్లు అడిగి.. పవిత్ర గోదావరి తీరాన పార్వతమ్మవారి గుడిలో పట్వర్థన్ చేత గోవు తోక పట్టుకుని ప్రమాణం చేయించాక సంతృప్తి చెంది నానావైపు ఫిరాయించాడు. అన్నేళ్లపాటు తనను చెరలో పెట్టిన నానాతోటే చేతులు కలిపాడు. బాజీరావును పీష్వా చేసేట్టు, ప్రధానమంత్రిగా అతడు నానాను కొనసాగించేట్టు, జరిగిందంతా మరచి ఇద్దరూ కలిసి పనిచేసేట్టు అంగీకారం కుదిరింది.

ఇది తెలిసి సింధియా మంత్రి బాలోబా మండిపడ్డాడు. సింధియా దయవల్ల బాజీరావు పీష్వా అయితే సింధియాతో చెప్పించి తాను నానా స్థానంలో మంత్రి కావచ్చునని అతడు ఆశపడ్డాడు. అది కాస్తా భగ్నమైంది. దాంతో అతడు సింధియాకి కబురు పంపాడు. సింధియా వెంటనే పెద్ద సేనతో పుణె పైకి దండెత్తి వచ్చాడు. అతడిని తాను ఎదుర్కొనగలనని పట్వర్థన్ భరోసా అయితే ఇచ్చాడు.కాని ఫ్రెంచి వీరుడు డిబోయిన్ తర్ఫీదు ఇచ్చిన సింధియా బెటాలియన్ల సత్తా నానా ఎరుగును. నేరుగా ఘర్షణ పడితే మొదటికి మోసం వచ్చి, సింధియా మరాఠా సర్వాధికారి కాగలడని భయపడి నానా పుణె వదిలి పురందర్ పోయి తలదాచుకున్నాడు. బాజీరావును మాట్లాడదాం రమ్మని పిలిచి రాగానే సింధియా నిర్బంధించాడు. బాజీరావు బదులు అతడి తమ్ముడు చిమ్నాజీని గద్దెనెక్కించాలని సింధియా వర్గం నిశ్చయించింది. విధి లేక నానా కూడా ఇందుకు సమ్మతించాడు.

మరి రఘునాథరావు పెద్దకొడుకు ఉండగా అతడిని వదిలేసి చిన్న కొడుకుకు ఎందుకు అధికారం కట్టబెట్టారని లోకులు ఆక్షేపిస్తారు కదా? పాదరసంలాంటి సింధియా మంత్రి బుర్ర దీనికీ ఒక ఉపాయం కనిపెట్టింది. బయటి వాడిని తెచ్చి దత్త స్వీకారం చేయిద్దామని మునుపు నానా అన్నాడు కదా? ఆ దత్తత ఏదో ఈ చిమ్నాజీనే చేయిస్తే సరిపోతుంది కదా – అన్నాడతడు.

దత్తు చేసుకోబడే చిమ్నాజీకి దత్తు చేసుకునే యశోదాబాయి కోడలి వరస. పైగా ఆమె కంటే అతడు వయసులో పెద్ద. అయితేనేమి? వరసకన్నా వయసుకన్నా రాజకీయ స్వార్థాలు మిన్న అనుకుని అంతా కలిసి దత్త స్వీకారం చేయించి చిమ్నాజీని పీష్వాగా ప్రకటించారు. సతారాలోని నామమాత్ర ఛత్రపతి రెండవ సాహునుంచి దుస్తులు వగైరా అధికార లాంఛనాలను నానాయే తెప్పించి పుణెకి పంపించాడు. ఇంత గ్రంథం నడవటానికి ఏకంగా ఏడు నెలలు పట్టింది 1795 అక్టోబరు 25న మాధవరావు పీష్వా మరణించగా 1796 మే 26న గానీ చిమ్నాజీ ఉత్తరాధికారి కాలేదు. పోనీ ఆ తరవాతయినా వ్యవహారం



సాఫీగా నడిచిందా?

పేరుకు చిమ్నాజీ పీష్వా అయినా పెత్తనం చేసింది బాలోబా పాగ్నిస్. అతడికి నానా అంటే సరిపడదు. ఎలాగైనా నానాను పట్టుకుని ఖైదుచేయాలని చాలా ప్రయత్నాలు చేశాడు. కాని నానా అతడిని మించినవాడు. దొరక్కుండా తప్పించుకుని రాయ్‌గఢ్ కోటలో గట్టి సైనిక రక్షణ మధ్య కూర్చున్నాడు. అతడి భూములు, ఇళ్లు, ఆస్తులు జప్తు చేశారు. ఎంత గాలించినా అపార సంపదను అతడు ఎక్కడ దాచిందీ సర్కారువారు కనిపెట్టలేకపోయారు.

సింధియా బాధితులైన నానాకూ బాజీరావుకూ ఒకే రకం కష్టాలవల్ల మళ్లీ సఖ్యత కుదిరింది. తుకోజీ హోల్కర్ అప్పటికే నానా కొమ్ముగాస్తున్నాడు. బాలోబాకు తెలియకుండా తంత్రం నడిపి మెల్లిగా సింధియానూ నానా తనకు అనుకూలంగా తిప్పుకున్నాడు. ఈ విషయంలో సఖారాం ఘట్గే అనేవాడు బాగా ఉపయోగపడ్డాడు. అతడిది ఘరానా వంశం. అతడికో కూతురుంది. ఆమె చక్కని చుక్క. ఆ పిల్లనిచ్చి పెళ్లిచేస్తానని దౌలత్‌రావు సింధియాకు సఖారాం ఆశచూపాడు. అప్పటికి దౌలత్‌రావూ 20 ఏళ్లవాడే. పెళ్లి ఎరకు ఠక్కున చిక్కాడు. ఈలోపు రఘుజీభోస్లేనూ, జంజీరాసిద్దీనీ, కొల్హాపూర్ ప్రభువునూ, మిగతా ముఖ్యులనూ నానా కలుపుకున్నాడు. పీష్వాకూ, మంత్రికీ తెలియకుండా చకచకా రాజకీయం నడిచింది. తమ తరఫున చక్రం తిప్పుతున్న మంత్రి బాలోబాను సింధియాయే చెంతకు పిలిపించి బంధించాడు. వరస కుదరనందున చిమ్నాజీ దత్తత చెల్లదని పెద్దలు సమయానుకూలంగా ప్రకటించారు. బాజీరావును చెరనుంచి విడిపించారు. మళ్లీ సతారా నుంచి దుస్తులు, లాంఛనాలు యథావిధిగా వచ్చాయి. ఆర్నెల్లకే పాలకుడు మారి 1796 డిసెంబరు 4న బాజీరావు పీష్వా అయ్యాడు. నానా ఫడ్నవిస్ అతడి ప్రధానమంత్రిగా మళ్లీ పగ్గాలు అందుకున్నాడు.

బాజీరావుకు దశ తిరగడంతో మరాఠా మహాసామ్రాజ్య పతనంలో చివరి అంకానికి తెర లేచింది. బాజీరావు తెలివిగలవాడే. రాజకీయ చతురుడే. కాని అతడి తెలివితేటలు రాజ్యానికీ, ప్రజలకూ పనికొచ్చేవికావు. శత్రువులు పొంచి ఉండి, అన్నివైపులా సవాళ్లు చుట్టుముట్టిన సంక్షుభిత స్థితిలో సంక్లిష్ట సమస్యలను అర్థం చేసుకుని సుడిగుండాలను ఒడుపుగా తప్పించుకుని అధికార నావను తీరం చేర్చగలిగిన శక్తియుక్తులు అతడికి లేవు. సరిగా ఉపయోగించుకుని ఉంటే నానా అతడికి చేదోడు వాదోడుగా నిలిచి కష్టకాలంలో అక్కరకు వచ్చేవాడే. కాని – అధికారం కోసం అపద్ధర్మంగా నానాకు దగ్గర అయినా, అదికాస్తా అందగానే బాజీరావు నానాకు బెబ్బే అన్నాడు. చుట్టూ పనికిమాలిన సలహాదారులను పెట్టుకుని, చెప్పుడు మాటలు విని, నానామీద కత్తిగట్టాడు. తక్షణ సమస్యలను సమర్థంగా ఎదుర్కోవడం కంటే గతంలో తనకు నానాచేసిన అపకారానికి ప్రతీకారం తీర్చుకోవటం మీదే ఎక్కువ శ్రద్ధచూపాడు. నానా అధికారం ఊడగొట్టి, అతడి రహస్య సంపదను కొల్లగొట్టాలని విశ్వప్రయత్నాలు చేశాడు. ఈ విషయంలో సింధియా అతడికి తందానతాన అన్నాడు. బాజీరావు గద్దెనెక్కిన కొద్దినెలల్లోనే పరిస్థితి ఎంత విషమించిందంటే పీష్వా మంత్రి బహిరంగంగా ఒకరినొకరు కలిసేందుకే భయపడేవారు. ఎదుటివారు ఎక్కడ దాడిచేస్తారోనని ఎవరికివారు అనుక్షణం సాయుధ బలగాల భారీ కాపలాలో కాలం గడిపేవారు. పెద్ద తలకాయల్లోనే పరస్పర విశ్వాసం కొరవడటంతో పరిపాలన సహజంగానే అధ్వాన్నమైంది. జి.ఎస్.సర్దేశాయ్ అన్నట్టు –

"Baji Rao didnot feel the least concern for the cares of the state and occupied himself with prayers, worships, religious rites in public and gross sensual enjoyments in private. Nana remained sulking and a pathetic onlooker unable to exercise any effective control over the administration, which had come to a stop."

*(బాజీరావు రాజ్య వ్యవహారాల్లో కనీస జాగ్రత్తలు కూడా తీసుకోలేదు. పబ్లిగ్గానేమో వ్రతాలూ, పూజలు, పునస్కారాలు తెరిపిలేకుండా సాగించేవాడు. చాటుగానేమో రాసక్రీడల తుచ్ఛ భోగాల్లో మునిగి తేలేవాడు. ఒళ్లుమండినా ఏమీచేయలేక ప్రభుత్వాన్ని సమర్థంగా అదుపుచేయలేక నానా నిస్సహాయంగా చూస్తుండిపోయాడు. పరిపాలన మొత్తం స్తంభించిపోయింది)*

తాను సింహాసనం ఎక్కడానికి పూర్వం మరాఠా రాజ్యంలో పొడసూపిన పెడ పోకడలను, బలహీనతలను సరిచేసే సమర్థత బాజీరావుకు బొత్తిగా లేదు. పైగా కుట్ర మనస్తత్వంతో పగ, ప్రతీకారాల అల్ప బుద్ధితో, విశృంఖల స్వైర విహారాలతో రాజ్యపతనాన్ని మరింత త్వరితం చేశాడు. పిన్నవయసులోనే పెద్ద అధికారం చిక్కటంతో ఒళ్లు తెలియకుండా మిడిసిపడిన దౌలత్‌రావు సింధియా ఇతడికి తోడయ్యాడు. సింధియాలకూ నానాఫడ్నవిస్‌కూ అదినుంచీ మాత్సర్యం ఉన్నది కనుక నానాను దెబ్బతీయటంలో దౌలత్‌రావు శాయశక్తులా బాజీరావుకు సహకరించాడు. వీరి దెబ్బను కాచుకోవటానికి నానా తుకోజీ హోల్కర్ మీద ఆధారపడగా కర్మం చాలక అతడు కాస్తా కన్నుమూశాడు.

తుకోజీకి నలుగురు కొడుకులు. వారిలో ఇద్దరు అక్రమ సంతానం. తండ్రి పోయాక అధికార వారసత్వంకోసం కొడుకులు తగవులాడుకుంటూంటే అదే అదనుగా దౌలత్‌రావు సింధియా ఆ గొడవలో తలదూర్చాడు. పెద్ద కొడుకు కాశీరావు కొమ్ముగాసి, రెండో కొడుకు మల్హర్‌రావును చంపి... మిగతా ఇద్దరు దాసీపుత్రులు యశ్వంతరావు, విఠోజీలను వెంటాడి రాజ్యం నుంచి వెళ్లగొట్టాడు. వారిలో విఠోజీ అన్నవాడిని తరవాత పట్టుకుని ఏనుగు కాళ్లకు కట్టి తొక్కించి చంపేశాడు. కుడి భుజం లాంటి తుకోజీ హోల్కర్ చనిపోయి, అతడి రాజ్యం సింధియా పెత్తనంలోకి పోవటంతో రెక్కలు విరిగినట్టయిన నానా మీద ఆ తరువాత సింధియా తన ప్రతాపం చూపాడు. బాజీరావు, అతడు కూడబలుక్కుని నానాను మాయమాటలతో ఎక్కడికో పిలిపించి ఆఘాటున బంధించారు.

దాంతో - ప్రతీకారం తీరింది; తల నెప్పిపోయింది అనుకున్నాడు బాజీరావు. కాని - అసలు తలనెప్పులు అప్పుడే మొదలయ్యాయి. నానా భయం పోవటంతో సింధియాకూ, అతడి మామ సఖారాంకూ, పట్టపగ్గాలు లేకుండా పోయాయి. నానాను నిర్బంధిస్తే రెండు కోట్ల రూపాయలిస్తానని సింధియాకు పీష్వా ఆశ చూపాడు. ఆ పని చేశాను కదా ఇస్తానన్న సొమ్ము ఇమ్మంటూ సింధియా అతడి గొంతుమీద కూచున్నాడు. ఖజానా అసలే ఖాళీ అయిన స్థితిలో అంత డబ్బు తనవల్ల కాదని పీష్వా చేతులెత్తాడు. చాలా నెలలుగా జీతాలందక గోలపెడుతున్న సైనికులను శాంతపరచడానికి వేరే దారి తోచక సింధియా దుర్మార్గానికి దిగాడు. పీష్వా తనకు బాకీపడ్డ మొత్తాన్ని పుణె ప్రజల గోళ్లూడకొట్టి వసూలు చేయమని తన మామకు చెప్పాడు. అతడు అక్షరాలా అంత పనీచేసి, పిశాచంలా ప్రజల వెంటపడి, దాచిన సొమ్ము బయటకి తీయించడానికి నాదిర్షా తరహా అఘాయిత్యా లకు పాల్పడ్డాడు.

పుణెలో జనం హాహాకారాలు చేస్తున్న సమయంలోనే ఇంకో వంక నలుగురు విధవలు అంతర్యుద్ధం లేవదీసి మరాఠా ప్రభుత్వాన్ని ఏళ్ల పర్యంతం ముప్పుతిప్పలు పెట్టారు. వారు మరణించిన మాధవరావు సింధియా భార్యలు. వారికి భరణం ఇచ్చి, బాగా చూసుకుంటానని వారసత్వం అందుకున్న సమయంలో దౌలత్‌రావు హామీ ఇచ్చాడు. సొంత సేనలకే జీతాలివ్వలేక జనాన్ని పీడించుకు తింటున్న స్థితిలో చేతగాకో, ఇష్టంలేకో వారి భరణాన్ని ఎగవేశాడు. అది చాలదన్నట్టు దౌలత్‌రావు మామశ్రీ ఈ వితంతువుల నివాసాల మీద పడి కొరడాతో కొట్టి బయటికీడ్చి ఖైదు చేయబోయాడు. అతడి బారినుంచి ఎలాగో తప్పించుకుని వితంతువులు పీష్వా తమ్ముడు అమృతరావు శరణుజొచ్చారు. అయినా సింధియా మామ వెనక్కి తగ్గకుండా ఏకంగా అమృతరావు శిబిరంమీదే నానా ఆగంచేశాడు. తన తమ్ముడని కూడా చూడకుండా సింధియా వర్గం ఇలా బరితెగించటం సహించరాని ధిక్కారమని పీష్వా అనుకున్నాడు. పీష్వాను ఎదుర్కొనే రాజకీయ తంత్రంలో భాగంగా సింధియా - నానాఫడ్నవిస్‌కు బంధవిముక్తి చేశాడు. కొన్నాళ్లకు పీష్వాకూ వారికీ సంధి కుదిరింది. పది నెలలకు పైగా నిర్బంధం తరవాత 1798 అక్టోబరు 15న నానాకు మళ్లీ పెత్తనం చేతికొచ్చింది. మేరలేని దుర్మార్గాలతో తనకు చెడ్డపేరు తెచ్చిన మామగారిని సింధియా ఆలస్యంగానైనా వదిలించుకుని ఖైదులో పడేశాడు.

ఈ గొడవ ఇలా సమసిపోయి పుణెలో పరిస్థితిలు కొంచెం కుదుటపడ్డాయని సంతోషించడానికి వీల్లేకుండా అదే సమయంలో ఇంకో సంక్షోభం సెగలు కక్కుతూ మరాఠా సర్దార్లకు చెమటలు పట్టిస్తున్నది. అదేమిటంటే - సతారాలో సాహూరాజు తిరగబడ్డాడు. నానాను వేటువేయటంలో తనకు సహకరిస్తే పూర్వపు సాహురాజు కుండినట్టి అధికారాలను నీకు దాఖలు పరుస్తానని బాజీరావు అతడికి బాసచేసి ఉన్నాడు. ఆ సంగతి ఏమయిందని తరవాత గుర్తుచేస్తే పీష్వా పట్టించుకోలేదు. దాంతో ఛత్రపతి సాహు మండిపడ్డాడు. అప్పటికే అతడి సోదరుడు ఛత్రసింగ్ పీష్వా మీద రవరవలాడుతున్నాడు. శివాజీ వారసులం, ఈ పీష్వాల దయాధర్మంపై ఆధారపడి సతారాలో పరాధీనపు బతుకు బతకాల్సిన ఖర్మ మనకేమిటి; తెగించి పోరాడి మన అధికారాన్ని మళ్లీ పొందుదాం - అని చాలాకాలంగా అతడు అన్నగారికి నూరిపోశాడు. సాహూ సరేనన్నాడు. సోదరులు కలిసి సైన్యాన్ని కూడగట్టి తమపై నిఘాకు పీష్వా నిలిపిన బలగాలను తరిమిగొట్టారు. కొల్లాపూర్‌లోని తిరుగుబాటును అణచడానికి పూనానుంచి పెద్ద సైన్యాన్ని పంపినా లాభం లేకపోయింది. వారి దాయాది, పోటీ ఛత్రపతి అయిన మూడవ శివాజీ వారితో చేతులు కలిపాడు. ఇక గత్యంతరం లేక పరశురామ్ భావుపట్వర్థన్‌ను (బాజీరావును పీష్వాచేసే కుట్రలో భాగంగా అతడిని చెరలో పెట్టారు) నిర్బంధం నుంచి విడిపించి ఛత్రపతుల పైకి బాజీరావు ప్రయోగించాడు. అతడు గొప్ప పరాక్రమంతో సతారా రాజును ఓడించాడు. కాని కొల్హాపూర్ సైన్యంతో జరిగిన యుద్ధంలో మరణించాడు. మరాఠా రాజ్యానికి అది పెద్ద దెబ్బ. తరవాత పీష్వా, సింధియాలు నానాఅవస్థలు పడి ఎక్కడెక్కడి సేనలనూ సమీకరించి యుద్ధం సాగించాక గానీ కొల్హాపూర్ ఛత్రపతి 1799 డిసెంబరులో చేతులెత్తెయ్యలేదు.

ఇదీ - 18వ శతాబ్దం చివరలో వెల్లస్లీ ప్రభువు వక్రదృష్టి పడేనాటికి మరాఠా రాజ్య రాజకీయ పరిస్థితి. మాధవరావు పీష్వా అకాల మరణం తరవాత ఆ శతాబ్దం చివరి

నాలుగైదేళ్లలో నడచిన ఘటనల తీరుతెన్నులు పరిశీలిస్తే ఒక సంగతి స్పష్టం. అంతః కలహాలు, అంతర్యుద్ధాలు ఎన్ని తలెత్తినా మరాఠా సామ్రాజ్యం వాటన్నిటినీ తట్టుకుని పదిలంగానే ఉంది. వ్యక్తుల స్వార్థాలు, ద్వేషాలు, నీచ మనస్తత్వాలు ఎన్ని వెర్రితలలు వేసినప్పటికీ అవసరమైనప్పుడు విభేదాలను మరిచి, విరోధాలను పక్కనపెట్టి కలసిపోగల సంస్కారం మరాఠా ముఖ్యుల్లో మిగిలే ఉంది. చెరలో పెట్టిన వారినే వదిలిపెట్టటం, తమను ఖైదు చేశారన్న కక్ష లేకుండా వారు సైతం విశాల హృదయంతో తక్షణ సమస్యల పరిష్కారానికి మనస్ఫూర్తిగా సహకరించటం గమనిస్తే మరాఠా రాజ్యం కలహాల మయమై ముక్కలు చింపిన విస్తరిలా చిందర వందర అవుతున్నదన్న అభిప్రాయం ఏకోశానా కలగదు. ఈ నాలుగైదేళ్లలో మరాఠా పెద్దతలకాయలెన్నో వరసగా మృత్యువాత పడ్డా విజ్ఞత, కార్యదక్షత ఉన్న సమర్థులు కొందరు ఇంకా మిగిలే ఉన్నారు ***The Main Curents of Maratha History***లో జి.ఎస్.సర్దేశాయ్ అన్నట్టు - బాజీరావు, దౌలత్‌రావులు ఎన్ని తప్పుడు పనులు చేసినా... అదనుకోసం ఇంగ్లీషు గోమాయువులు కాచుకు కూర్చుని కుతంత్రాలు, కుత్సితాలు పన్ని ఉండకపోతే మరాఠా రాజ్యం మునుపు అనేక ఘట్టాల్లోవలె ఒడిదుడుకుల నుంచి మెల్లిగా గట్టెక్కేది.



# పీష్వాకు పొగ

***"You may be assured that it was a matter of real satisfaction to me that the affairs of this Government at the Court of Poona should be in the hands of a person of your talents and experience in a moment the most critical to our interests... I have the fullest confidence in your zeal for promoting the success of a plan which is founded on principles of justice and of all parties to be effected by its execution..."***

[*Rise of the Christian Power in India* - **B.D. Basu,** *p. 364*]

మన ప్రయోజనాలకు అత్యంత కీలకమైన ఈ తరుణంలో మన పూనా వ్యవహారాలు మీవంటి ప్రజ్ఞావంతుల చేతుల్లో ఉన్నందుకు నాకు పరమానందంగా ఉంది... అన్ని పార్టీలకీ న్యాయం జరిగే రీతిన ధర్మబద్ధంగా రూపొందించిన పథకాన్ని జయప్రదంగా అమలు చేయటానికి మీ తహతహ గురించి నాకు సంపూర్ణ విశ్వాసం ఉంది.

ఇండియాకి కొత్త గవర్నర్ జనరల్‌గా వచ్చిన లార్డ్ మార్నింగ్‌టన్ అనే వెల్లస్లీ దొర పుణెలోని తమ రెసిడెంటు కర్నల్ పామర్‌కు 1798 జులై 8న రాసిన తొలి రహస్య లేఖలోని తొలి పలుకులివి. విన్నవారెవరైనా - అన్ని పక్షాలకీ సమాన న్యాయం జరిగేలా న్యాయసూత్రాలకు లోబడి పథక రచన చేసిన ఆ దొరగారు ఎంతటి ధర్మప్రభువో!; అంతటివాడి పూర్తి విశ్వాసం చూరగొన్న రెసిడెంటుదొర ఇంకెంత గొప్పవాడో; ఇద్దరూ కలిసి కలహాల కాపురంగా ఉన్న మహారాష్ట్రకు పవిత్ర పథకంతో ఎంత గొప్ప న్యాయం చేస్తారోనని ఊహిస్తారు. దొరవారల మధ్య నడిచిన ఇలాంటి ఉత్తరప్రత్యుత్తరాలకు మోసపోయే... తెల్లవారు చాలా పెద్ద మనుషులు; న్యాయం తప్పనివారు; న్యాయం చేయడం కోసమే దిక్కుమాలిన దేశాన్ని వశపరచుకున్నవారు అని మన మేధావులు చరిత్ర పుస్తకాల నిండా రాసిపడేశారు.

నిజానికి దొరల భాష వేరు. వారి మాటల అంతరార్థం వేరు. వారిదంతా వక్రనీతి.

జైనంటే కాదని. కాదంటే జైనని, అందరికీ న్యాయం చేద్దాం అంటే అందరికీ పక్కా అన్యాయమే చేసి మనం మాత్రమే బాగుపడదాం అని కవి హృదయం!

వెల్లస్లీ అడుగు పెట్టే నాటికి భారత రాజకీయ పటంలో అత్యధిక భాగం ఇంకా మరాఠాల ప్రాబల్యంలోనే ఉంది. దక్షిణాన తుంగభద్ర నుంచి ఉత్తరాన సట్లెజ్ వరకూ పంజాబ్, సింధ్‌లదాకా వారి సామ్రాజ్యం విస్తరించింది. వారికి ఢిల్లీ పాదుషా గులాం. బుందేల్‌ఖండ్, రాజస్థానం, గంగ, యమున తీర ప్రాంతాలపై వారిదే పట్టు. గంగకు దిగువన ఇంగ్లీషు వారి ప్రాంతాలకు, కలకత్తా, ముంబాయి, మద్రాసు ప్రెసిడెన్సీలకు చుట్టూతా ఉన్నది మరాఠా రాజ్యమే. దక్షిణాదిన వారిదైన మద్రాసు ప్రెసిడెన్సీకీ, వారు నోటకరిచిన నైజాంకూ, కొత్తగా కబళించిన మైసూరుకూ మధ్య నిరాఘాట విహారానికి వీల్లేకుండా కంట్లో నలుసులా ఎక్కడికక్కడ మరాఠాలు అడ్డు!

తొలుదొలుత బెంగాలులో ఎడమకాలు మోపిన నాటినుంచీ మరాఠాలన్నా, త్వరితగతిన విస్తరించిన వారి సామ్రాజ్యమన్నా తెల్లవారికి మహా ఈర్ష్య. వారి బలాన్ని పలుకుబడిని ఎలాగైనా తగ్గించాలన్న ఆబ ఆదినుంచీ ఉన్నా అందుకు కావలసిన సైనికవనరులు, రాజకీయ అనుకూలతలు వారన్ హేస్టింగ్స్ నాటికిగానీ ఆంగ్లేయులకు సమకూడలేదు. సర్వశక్తులూ ఒడ్డినా హేస్టింగ్స్ దుస్సాహసం ఫలించక మొదటి మహారాష్ట్ర యుద్ధంలో ఘోరపరాభవం జరిగి మహారాష్ట్రులతో సంధి చేసుకోవలిసి వచ్చింది. బరోడా గేక్వాడ్‌ను తమవైపు లాక్కున్నా, భోంస్లేలను ఎరలువేసి ఆకట్టుకోగలిగినా బ్రిటిష్ రాజ్య విస్తరణ తంత్రం ఆ తరువాత పెద్దగా ఫలించింది లేదు. ఈలోపు పీష్వా ప్రభుత్వం మరింత బలపడింది. మాధవరావు సింధియా ఉత్తరాదిన విజృంభించి విశాల ప్రాంతాలను జయించాడు. తేరిపార చూడలేనంత తీక్షణంగా మరాఠా ప్రభ వెలిగిపోయినందువల్లే చేసేది లేక జాన్‌షోర్, కారన్‌వాలిస్‌లు మహారాష్ట్రుల జోలికి పోకుండా జాగ్రత్తపడ్డారు. టిప్పుసుల్తాను మీద యుద్ధానికి పోయేప్పుడు కూడా కారన్‌వాలిస్ మరాఠాల సహాయం దేబిరించి, వారి అండతోనే గెలిచాడు. ఆ తరువాత దక్షిణాదిన ఇంకో బలీయశక్తి అయిన నైజాంనూ మరాఠాలు ఒంటిచేత్తో నేలకరిపించారు.

దీంతో ఇంగ్లీషు వారికి మరీ కన్ను కుట్టింది. ఇండియాలో తమకు ప్రధాన శత్రువు మహారాష్ట్ర కూటమేనని, తమకు ప్రమాదం ఎప్పటికైనా వారినుంచే రాగలదని వారికి అసలే భయం. అందుకే కారన్‌వాలిస్ టిప్పూపైకి దండెత్తినందుకు బ్రిటిష్ రాజకీయ ప్రముఖులు పలువురు తీవ్ర ఆక్షేపణ తెలిపారు. ఇండియాలో మన ప్రయోజనాలకు మరాఠాల నుంచి కదా అసలు ప్రమాదం? వారిని ఎదుర్కోవడానికి సమతూకంలా ఉపయోగపడే మైసూరు ప్రభువు మీద మనమే కత్తి ఎత్తడమేమిటి? అని కామన్స్ సభలో కొంత మంది సభ్యులు కోప్పడ్డారు. సమయం చిక్కితే మరాఠాలను దెబ్బతీసి మొత్తం దేశాన్ని స్వాహా చేయాలని సీమ దొరలు కాచుకు కూచున్నారు.

తెల్లవారికి ఎంత కుత్సితం ఉన్నా మరాఠాలకు వారిపట్ల శత్రుభావం లేదు. వారితో తమకున్న స్నేహాన్ని, శాంతియుత సంబంధాలను భగ్నపరచాలన్న ఆలోచనే వారికి లేదు. ఆంగ్లేయులకు ఆగ్రహం కలిగించే పని వారు ఏదీ చేయలేదు. తాము బతుకుతూ ఇతరులను బతకనివ్వాలనే వారు కోరుకున్నా వారిని ప్రశాంతంగా బతకనిచ్చే ఉద్దేశం ఆంగ్ల ప్రభువులకు ఎంతమాత్రం లేదు.

వెల్లస్లీ అడుగిడే నాటికి పీష్వా గద్దెపై బాజీరావు కూచుని ఉన్నాడు. దౌలత్‌రావు సింధియా



అతడికి వెన్నుదన్నుగా ఉన్నాడు. నానా ఫడ్నవీసు నిర్బంధంలో ఉన్నాడు. యూరోపియన్లు చెదపురుగుల్లా మహారాష్ట్రలో చేరి సర్దార్లను, జాగీర్దార్లను ఎగదోసి ఎక్కడికక్కడ అల్లర్లు, సంక్షోభాలు కల్పిస్తూ ఉన్నారు. లోగడ మాధవరావు సింధియా దర్బారులో రెసిడెంటుగా ఉన్న పామర్ ఈ మధ్య పూనా బదిలీ అయ్యాడు. గతంలో తమ పంచనచేరిన తండ్రి రఘునాథరావు తమకు ఎన్నో ఆశలు పెట్టాడు కాబట్టి ఇప్పుడు పీష్వా అయిన కుమారుడు బాజీరావు తమకే తవ్వి తలకెత్తుతాడని ఆంగ్లేయులు ఆశపడ్డారు. కాని బాజీరావు ఇంతవరకూ వారికేమీ చేపలేదు.

ఈ పరిస్థితుల్లో వెల్లస్లీ వచ్చీరాగానే మరాఠాలమీద ప్రత్యేక దృష్టి పెట్టాడు. తమకు శత్రువులనుకున్న వారితో యుద్ధంచేయటం, పరాక్రమంతో గెలవటం యూరోపియన్ల పద్ధతికాదు. చుట్టూ సాలెగూడు పన్ని అదనుకోసం వేచి ఉండి మధ్యపెట్టో మోసగించో గుటుక్కుమనిపించటమే వారిశైలి. సాలెగూడుకు ఇంగ్లీషు వారు పెట్టిన ముద్దుపేరు 'సైనిక సహకారం'! ఏదో ఒక విధంగా వారి సేనలను అవతలివారికి అంటగడితేగానీ తరువాయి స్వాహాకార్యం ముందుకుసాగదు.

కాని మరాఠాలకు ఇంగ్లీషు సేనలను అంటగట్టటం చాలా కష్టం. ఎందుకంటే మరాఠాలే సైనికశక్తిపై ఆధారపడి బతికే వారు. వారే ఇతర రాజ్యాలను జయించగలరు. కాబట్టి తమ రక్షణకోసం వేరేవారి సైన్యాన్ని అపేక్షించాల్సిన అగత్యం వారికి లేదు. కావాలంటే వారే ఇతరులకు సైనిక సహాయం చేస్తారు. పైగావారికీ 'కంపెనీ'కీ కారన్‌వాలిస్ హయాంలో కుదిరిన మైత్రీ ఒప్పందం ఇంకా అమల్లో ఉంది. దాని ప్రకారం లోగడ కారన్‌వాలిస్‌కు చేసినట్టే ఇప్పుడు టిప్పూపై తాజా యుద్ధంలోనూ కంపెనీకి కావాలంటే సైనిక సహాయం చేయడానికి పుణె ప్రభుత్వం సిద్ధంగా ఉంది.

ఎటొచ్చీ - ఆ సహాయాన్ని తీసుకునేందుకు వెల్లస్లీయే సిద్ధంగా లేదు. స్వయంగా యుద్ధంచేసి టిప్పూను గెలవగల సత్తా కంపెనీకి లేదన్న సంగతి అతడికి తెలుసు. బయటి నుంచి సహాయం చాలా అవసరమే. అలాగని మరాఠాల సహాయాన్ని కనుక తీసుకుంటే - యుద్ధంలో గెలుచుకునే రాజ్యంలో వారికీ వాటా ఇవ్వవలసి వస్తుంది. దానివల్ల మరాఠా ప్రాబల్యం ఇంకా విస్తరించి 'కంపెనీ'కి మరింత ప్రమాదకారి అవుతుంది. ఆ భయంతోటే వెల్లస్లీ మరాఠాల మద్దతు అవసరం ఉన్నా స్వీకరించలేదు.

మరి - తాము ఎలాగూ వద్దన్నారు కనుక తమ విరోధి అడిగితే మరాఠాలు మద్దతు ఇవ్వవచ్చుకదా? అగ్నికి ఆజ్యం తోడైనట్టు టిప్పూ, పీష్వా ఏకమైతే కంపెనీకి కొంప కొల్లేరే కదా? ఈ పాటికే టిప్పుసుల్తాన్ పూనా దర్బారుకు వకీళ్లను పంపి సైనిక సాయం అర్థిస్తున్నట్టు వార్తలొస్తున్నాయి. వారిని చేరదీయటం 'కంపెనీ' మిత్రులకు ఇష్టం లేదని తెలిశాక పూనా నుంచి ఆ వకీళ్లను వెళ్లగొట్టిన మాట నిజమే. కాని - లోపాయకారీగా ఏమి జరుగుతుందో ఎవరు చెప్పగలరు? ఇంగ్లీషు వారిలాగే మరాఠాలూ వక్రంగా నడిస్తే ఇంగ్లీషు వారికి ప్రమాదం కదా?

ఇలా ఆలోచించిన వెల్లస్లీ దీనికి ఒక ప్లాను వేశాడు. మరాఠాలను మాయలో పడెయ్యటం కోసం ఓ మాయ కబురు పంపాడు. మీరు సైన్యాన్ని పంపుతామన్నారు; చాలా సంతోషం; కాని మిమ్మల్ని శ్రమ పెట్టటం మాకు ఇష్టం లేదు. ప్రస్తుతానికి మీ సహాయం అవసరం లేదు. కాని మీరు మాకు మిత్రులు. కాబట్టి సైన్యాన్ని పంపకున్నాసరే యుద్ధం గెలిచాక

శత్రురాజ్యంలో మీ వాటాను మీకు పువ్వుల్లోపెట్టి అప్పగిస్తాము - అని దాని సారాంశం.

ఈ రీతిన మరాఠాల ముందరి కాళ్లకు బంధం వేశాక ఒక చెంప టిప్పుతో యుద్ధానికి సర్వసన్నాహాలు చేస్తూనే ఇంకోవంక పీష్వాను నయవంచనతో ఉచ్చులో ఇరికించటానికి వెల్లస్లీ పథకం పన్నాడు. 'సైనిక సహకారం' పేరిట నిజాంను వంటింటి కుందేలుగా నిర్వీర్యం చేసినట్టు పీష్వానూ బుట్టలో వేయటానికి దారులు వెదికాడు. ఇందులో భాగంగానే నానాఫడ్నవిస్‌ను నిర్బంధం నుంచి తప్పిస్తామంటే మనవైపు తిరుగుతాడేమో కనుక్కోమని ఈ వ్యాసం మొదట్లో ప్రస్తావించిన 'న్యాయాలమారి' రహస్య లేఖలో రెసిడెంటు పామర్‌ను వెల్లస్లీ పురమాయించాడు.

అయితే - పామర్‌కు ఆ లేఖ అందేలోపే పూనాలో పరిస్థితులు మారి, సింధియాతో సఖ్యత కుదిరి నానా బంధవిముక్తుడయ్యాడు. అందరికీ న్యాయం జరగాలన్న ధర్మబుద్ధి తెల్లవారికి నిజంగా ఉంటే తమ ప్రమేయం లేకున్నా నానా అంతటి యోగ్యుడికి చెర వదిలినందుకు సంతోషించవలసింది. కాని తమ షరతులకు లోబడే అగత్యం లేకుండా తనంతట తానే బయట పడినందుకు దొరలు నొసలు ముడిచి నానానూ అనుమాన దృక్కులతో చూడసాగారు.

ఎవరికి చెప్పాల్సిన మాట వారికి చెప్పి, ఎవరికి తీయాల్సిన గొయ్యి వారి వెనక తీసి, పుణెలో రెసిడెంటు మహాశయుడు పథకం ప్రకారం ఇటు రంగం సిద్ధం చేస్తూండగా అటు మైసూరులో అధర్మ యుద్ధంచేసి తెల్లవారు టిప్పూను వధించారు. ఏమాటకామాటే చెప్పుకోవాలి. యుద్ధం జయించాక వెల్లస్లీ దొరగారు వెనకటి మాట ప్రకారం మరాఠాల వాటాను వారి కోసం అట్టేపెట్టకపోలేదు. అయితే ఒక మెలిక! గతంలో బేషరతుగా ఇస్తామని చెప్పిన వాటాకు ఇప్పుడు వాటమైన షరతులు జోడించారు. అవి ఏమిటంటే - మరాఠాలు బ్రిటిష్‌వారి సైనిక సహకారం పెద్దమ్మను అక్కర్లేకున్నా నెత్తినెత్తుకోవాలట. మొత్తం మైసూరు రాజ్యంపై ఆదినుంచీ తమకుగల చౌథ్ వసూలు హక్కును వదిలేసుకోవాలట. ఇకపై నిజాంతోగాని, మరెవరితోగాని తమకు ఎటువంటి పేచీ వచ్చినా కంపెనీవారే మధ్యవర్తిత్వం చేయాలని అంగీకరించాలట. వారు ఎలా చెబితే అలా నడుచుకోవాలట.

ఒక్క మాటలో చెప్పాలంటే మైసూరు రాజ్యంలో అప్పనంగా వచ్చేవాటా కోసం మరాఠాలు తమ స్వాతంత్ర్యాన్ని, సార్వభౌమాధికారాన్ని వదిలేసుకుని ఆంగ్లేయులకు తొత్తులు కావాలి. ఆత్మగౌరవం గల ఏ ప్రభుత్వమూ అంగీకరించజాలని తెంపరి బేరమిది. కాబట్టి బాజీరావు నానా సలహా మేరకు సహజంగానే దీన్ని తిరస్కరించి మీరూ వద్దు; మీ వాటా వద్దు పొమ్మన్నాడు.

దాంతో వెల్లస్లీకి ఒక సంగతి అర్థమైంది. పీష్వా తనకు తానుగా మెడకు ఉరితాడు తగిలించుకోడు: గత్యంతరం లేని పరిస్థితి కల్పించి అతణ్ణి అన్నివైపుల నుంచీ నొక్కేస్తే తప్ప 'కంపెనీ' కార్యం నెరవేరదు. పుణె రెసిడెంటుకు పంపిన లేఖలో గవర్నరు జనరల్ ఈ మాటే స్పష్టంగా అన్నాడు.

"The inference to be deduced from these considerations was, that until irresistibly compelled by the exigency of his affairs to have recourse to the assistance of the Company, Baji Rao would never be induced to enter into any engagements which in his apprehension, would afford to the British Government the means of acquiring an ascendency, which it was our interest to establish in the Mahratta empire."

**[*Empire in Asia*, W.M. Torrens, *p-185*]**

(వీటన్నిటిని బట్టి ఏమనుకోవాలంటే తన వ్యవహారాలు విషమించి, కంపెనీ సహాయాన్ని అపేక్షించక తప్పని సంకటస్థితిలో ఇరుక్కుంటేగానీ బాజీరావు మన ప్రయోజనాలకు కావలసినట్టు మరాఠా సామ్రాజ్యంలో మన ప్రాబల్యం పెంచుకోవటానికి ఒప్పుకోడు)

బేరంవల్ల పొందలేనిదాన్ని మోసం ద్వారా సాధించడానికి తెల్లదొరలు మరింత ఆయుత్తమయ్యారు. వెల్లస్లీ దర్శకత్వంలో కపట నాటకానికి తెరలేచింది. మరాఠా రాష్ట్ర కూటమిలో ఆదినుంచీ సింధియాకూ హోల్కర్‌కూ పడదు. తుకోజీ హోల్కర్ మరణించి, అతడి వారసులు సింధియా రక్షణలోకి చేరాక ఆ చిరకాల వైరం కాస్త సద్దుమణిగింది. అలాగే నానా ఫడ్నవిస్‌కూ, సింధియాలకూ లోలోన ఉన్న విరోధం కూడా దౌలత్‌రావు సింధియా పెత్తనానికి వచ్చాక ఇటీవలి కాస్త నెమ్మదించింది. అటు సింధియా సైనికశక్తి ఇటు నానా మంత్రాంగం అండగా ఉన్నంతకాలమూ బాజీరావును పట్టుకోవటం కష్టం. వారిలో వారికి తంపులుపెట్టి మహారాష్ట్ర కూటమిలో ముసలం పుట్టించి, బలహీనుడైన పీష్వాను విడిగా లాగేస్తేగాని కుంపిణీయుల పంట పండదు. కాబట్టి చల్లగా ఉన్న రాజ్యంలో చిచ్చు పెట్టే పనికి వెల్లస్లీ పూనా రెసిడెంటు పామర్‌ను తగిలించాడు. అతడేమో పీష్వా చెవిని ఇల్లు కట్టుకుని దౌలత్‌రావు సింధియాపై కొండేలు చెప్పసాగాడు. నువ్వు సింధియా వలలో పడిపోయావు. అతడు నిన్ను పిండి బొమ్మనుచేసి ఆడిస్తున్నాడు. నీవతనికి ఖైదీవయ్యావు. బానిసవయ్యావు. నీకిదేమి ఖర్మం అని నిత్యం నూరిపోసి అసలే అనుమానపు మనిషి అయిన బాజీరావుకు కంటికి కునుకు లేకుండా చేశాడు. అదే సమయంలో వెల్లస్లీ దొరగారు బాజీరావు పీష్వా సింధియా చేతిలో బందీలా ఉన్నాడని నాలుక ఖుజాన వేసుకుని గగ్గోలు పెట్టాడు.

ఈ మాట పచ్చి అబద్ధం. సింధియా మీద బాజీరావు ఎక్కువగా ఆధారపడుతున్న సంగతి యధార్థమే. అయితే అది బలాత్కారంవల్ల కాదు. తనను పీష్వా గద్దె నెక్కించడానికి సింధియా ఎంతో సాయపడ్డాడన్న కృతజ్ఞతా భావంతో. ఇంటా బయటా ముసిరిన శత్రువుల బారినుంచి రాజ్యాన్ని అతడే రక్షించగలడన్న నమ్మకంతో. అంతే తప్ప పీష్వాను సింధియా నిర్బంధించిందీ లేదు; అవమానించిందీ లేదు. తనను సింధియా చెరపట్టినట్టు పీష్వా ఎప్పుడూ ఎవరితో చెప్పుకోలేదు. అతడి బారినుంచి తనను కాపాడమని కంపెనీ వారిని ఎన్నడూ కోరలేదు. పీష్వాకు అటువంటి గతి పట్టినట్టు పూనాలోని బ్రిటిష్ రెసిడెంటు కూడా వెల్లస్లీ కనుగీటడానికి పూర్వం పైవారికి ఎప్పుడూ రిపోర్టు చేయలేదు. పోనీ - అకస్మాత్తుగా ఇప్పుడే ఈ దారుణ దుర్వార్త దొరలకు తెలిసిందనుకున్నా... తెలిశాక దానికి తగిన ప్రతిక్రియ చేయటానికి వారు ఆయాసపడిందీ లేదు. అమల్లో ఉన్న సంధి ప్రకారం పీష్వా కంపెనీ వారికి మిత్రుడే. అతడికి ఆపదవస్తే వారు ఆదుకొనవలసినవారే. గతంలో తమకు మిత్రుడైన తిరువాన్కూరు రాజాకేసి కీగంట చూశాడన్న నెపంతోనే మిత్రధర్మం పేరిట టిప్పు సుల్తాన్ మీదికి కత్తి ఎత్తి కంపెనీవారు నానా ఆగం చేశారు కదా? మిత్రుడైన

పీష్వానూ అలాగే సింధియా బారినుంచి ఉద్ధరించి ఉండవచ్చు కదా?

వచ్చు. కాని దొరలు ఆ పనిచేయలేదు. ఎందుకంటే తాము వేసినది వట్టి అభాండమని వారికి తెలుసు. అందుకే పీష్వా చెవులు మాత్రం కొరికి, తగవులు పెట్టి తమాషా చూశారు. వారి చెప్పుడు మాటలు వినివిని - తనకు చుట్టూ ఉన్న వారంతా తన కీడు కోరేవారేనని, వారి బారినుంచి ఇంగ్లీషువారు మాత్రమే తనను కాపాడగలిగినవారనీ, వారు పెద్ద మనసుతో ఆఫర్ చేసిన ప్రకారం వారి సైన్యాన్ని తనకు రక్షణ కవచంగా పెట్టుకుంటే తప్ప తనకు భద్రత ఉండదనీ ఒక బలహీనక్షణంలో బాజీరావు కూడా తలపోశాడు.

దాంతో సీమ శకునుల పని తేలికైంది.



# పడగనీడలో పీష్వా

అక్కడికీ వెల్లస్లీ దొరగారు సింధియాకి వారితో వీరితో చిలక్కి చెప్పినట్టు చెప్పించారు. నువ్వు పూనాలో తిష్ఠవేసినంతకాలమూ మా పనులేవీ అయేట్టు లేవు. పీష్వా పిలక మా చేతికి దొరక్కుండా అతణ్ని గట్టిగా పట్టుకొని కూచున్నావు. పైగా సైన్యాన్ని తీసుకుని ఎప్పుడు నైజాం మీద పడతావో, ఎక్కడ మా వెంట పడతావో అని భయంగా ఉంది. నువ్వు కొంచెం పూనా వదిలిపోతే పీష్వా సంగతి మేము చూసుకుంటాం. ఒకరి తరువాత ఒకరుగా మీ అందరి నోటా మన్నుకొట్టి మీ సామ్రాజ్యాన్ని నెమ్మదిగా కాజేస్తాం... అన్న అసలు అంతర్యాన్ని అందమైన భాషలో నగిషీలు చెక్కి వినిపించారు.

సింధియా ఆలకించాడా? లేదు. దాంతో ఇలా లాభం లేదని తలచి, సింధియాను ఎలాగైనా పూనా నుంచి లేపేందుకు వెల్లస్లీ ప్రభువులవారు ఎత్తుమీద ఎత్తువేశారు.

మొదటి ఎత్తు 'పుకారు'! అఫ్ఘన్ రాజు అహ్మద్‌షా అబ్దాలీ పూర్వం పానిపట్టు యుద్ధంలో మహారాష్ట్రులను ఘోరంగా ఓడించాడు కదా? ఆ పేరు చెబితే మరాఠాలు హడలిపోతారని దొరవార్లు అనుకున్నారు. అబ్దాలీ మనవడు జుమాన్‌ఖాన్ ఇండియాపైకి దండెత్తి రానున్నాడని తమ ఏజెంట్ల చేత పుకార్లు పుట్టించారు. (ఇది వట్టి పుకారేనని గ్రాంట్ డఫ్, జేమ్స్ మిల్ వంటి ప్రఖ్యాత చరిత్రకారులు ధ్రువీకరించారు.) ఈ వదంతులకు బెదిరి ఉత్తరాదిన తన రాజ్యాన్ని రక్షించుకోవటానికి సింధియా పూనా విడిచి గ్వాలియరుకు పరుగెడతాడని దొరలు ఆశించారు. కాని సింధియా జంకలేదు. ఇప్పట్లో జుమాన్‌షా నుంచి అలాంటి ప్రమాదం లేదని అతడికి తెలుసు.

పుకారు పాచిక పారకపోవటంతో వెల్లస్లీ అటునుంచి పొగబెట్టే రెండో ఎత్తుకు ఉపక్రమించాడు. సింధియా రాజ్యంలో అంతఃకలహాలు తెచ్చి కల్లోలం రెచ్చగొట్టడానికి స్పెషల్ డ్యూటీ మీద కాలిన్స్ అనే వాణ్ని గ్వాలియరుకు రెసిడెంటుగా పంపించారు. పైకి చెప్పిందేమిటంటే - జుమాన్‌షా చేయబోయే దండయాత్రను ఉమ్మడిగా ఎదుర్కోవడానికి

సింధియాతో సంప్రదించి, స్నేహపూర్వకంగా తగిన ఏర్పాట్లు చేయడానికని! అదే అసలు ఉద్దేశమైతే దౌలత్‌రావు పూనాలో ఉంటే కాలిన్సు అతడి దగ్గరికి కదా పోవలసింది? అతడు లేని సమయంలో గ్వాలియరులో ఎందుకు చొరబడాలి? గ్వాలియరుకు పంపేముందు అక్కడ చేయాల్సిన పనులను కాలిన్సుకు వెల్లస్లీ నూరిపోశాడు. అంతకుముందు అనేక దేశీయ దర్బార్లలో జరిగినట్టే... విభేద తంత్రాన్ని ప్రయోగించి, సింధియా కొలువులోని వారికి లంచాలు పెట్టి, సింధియాపై చాడీలు చెప్పి ద్వేషం కలిగించి, రాజ్యంలో ఎక్కడికక్కడ తిరుగుబాట్లు ప్రేరేపించడానికి కాలిన్సు శక్తివంచన లేకుండా కృషిచేశాడు.

అయినా సింధియా బెంబేలెత్తలేదు. పుణె నుంచి కదలలేదు. అప్పుడు వెల్లస్లీ ఇంకో ఎత్తువేశాడు. కోల్‌బ్రూక్ అనే అధికారిని (అనంతర కాలంలో ప్రఖ్యాతుడైన సంస్కృత విద్వాంసుడు ఈయనే) నాగపూర్ దర్బారుకు పంపించి బేరార్ రాజాతో మంతనాలాడించాడు. సింధియాతో యుద్ధం వస్తే ఆంగ్లేయులకు సహాయం చేసేట్టు రహస్య ఒప్పందం కుదుర్చుకున్నాడు. అక్కడితో ఆగక సింధియా దెబ్బకు పారిపోయివచ్చి నాగపూర్‌లో తల దాచుకుంటున్న దాసీపుత్రుడు యశ్వంతరావు హోల్కర్‌ను దువ్వి, మందీమార్బలాన్ని డబ్బూ దస్కాన్ని సమకూర్చి సింధియా రాజ్యం మీదికి ఉసిగొలిపాడు. చచ్చిన పాములా పడివున్న హోల్కర్‌కు దాంతో వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్టయింది. చిచ్చర పిడుగులా సింధియా రాజ్యం మీద పడి, కొన్ని ప్రాంతాలను ఆక్రమించి, జనాన్ని దోచుకుని అతడు చెలరేగసాగాడు. ఇక ఉపేక్షిస్తే లాభం లేదని దౌలత్‌రావు సింధియా దిగ్గున కదిలి తగు మాత్రం సేనను పుణెలో నిలిపి 1800 నవంబరులో తన రాజధానికి మరలిపోయాడు.

అలా వెల్లస్లీ తంత్రం ఫలించింది. పుణె నుంచి సింధియాను జయప్రదంగా బయటకి పంపాక అటు సింధియానూ, ఇటు పీష్వానూ చిక్కుల్లో పెట్టి ఉచ్చులోకి నెట్టటానికి కుతంత్రాలు సాగాయి. సింధియా పూనానుంచి కదిలేంతవరకూనేమో – అతడు ఉత్తరాదికి తిరిగిపోవటం దేశ రక్షణకు చాలా అవసరమని, అతడితోకలిసి జుమాన్‌షా దాడి బెడదను ఉమ్మడిగా ఎదుర్కోవాలని తాము ఆరాటపడుతున్నామనీ వెల్లస్లీ చెబుతూ వచ్చాడు. అతడు వెనక్కిపోయాకేమో నానా దురుద్దేశాలు ఆపాదించి, తమకు వ్యతిరేకంగా కుట్ర చేస్తున్నాడని అభాండాలు వేసి సింధియా మీద కత్తికట్టాడు. సింధియా గ్వాలియర్ వెళ్లటానికి పూర్వమే వెల్లస్లీ కలకత్తాలోని కమాండర్ ఇన్ చీఫ్ సర్ అలూరెడ్ క్లార్క్‌ను పెద్ద సేనతో తరలించి సింధియా సరిహద్దుల్లో నిలిపాడు.

ఎందుకు? నేరుగా యుద్ధాన్ని ప్రకటించి సింధియాతో అమీతుమీ తేల్చుకోవటానికా? కాదు. అది పరాక్రమం మీద ఆధారపడేవారు అనుసరించే పద్ధతి. యూరోపియన్ వర్తక శ్రేష్ఠులు ఆ కోవకు చెందరు. వారిదంతా వంకర తరహా. సింధియా మీద ఒత్తిడి పెంచటానికి, భయాన్ని రేకెత్తించటానికి సైన్యాన్నయితే ఎదుట నిలిపారు. ఎందుకొచ్చారని సింధియా నిలదీస్తే మాత్రం అబద్ధాలు చెప్పి తప్పించుకోమన్నారు. సాక్షాత్తూ గవర్నర్ జనరలే ఈ వింత ఆదేశాన్ని తన సైన్యాధిపతికి ఇలా ఉపదేశించాడు.

"The reassembling of the army may possibly alarm scindhiah and an explanation may be demanded of the motives of such a step. You will ascribe it to the escape of Vizier Ali from Benares, to the probability of his attempting to join



Zemaun Shah, and to the consequences which that event might produce."

("మనమీ సేనలను ఇలా మోహరించటం చూసి సింధియా అనుమానపడవచ్చు. ఇలా ఎందుకు చేశారని మనల్ని అడుగుతాడేమో. అడిగితే - బెనారసు నుంచి వజీరాలీ తప్పించుకుపోయాడనీ, జుమాన్‌షాతో అతడు చేరితే ప్రమాదం కాబట్టి దాన్ని నివారించటానికే సేనల్ని సమీకరించుకున్నామనీ - జవాబు చెప్పు.")

ఇలా దొంగబద్ధాలు చెప్పడం ఒకటే కాదు. ఆంగ్ల సైన్యాధిపతికి ఘనత వహించిన గవర్నర్ జనరలుగారు ఇంకో డ్యూటీ కూడా చేశారు. అదీ వారి మాటల్లోనే చదవండి.

"...You will use every endeavour to excite the Rajpoots and other tributaries against Scindhiah, and to induce the Rajahs of Jynagur and Jodhpur to enter zealously into the war; you will at the same time take proper steps for supporting and encouraging the exertions of the partizans of the Byes and Lukwaji Dada, together with all persons in the family or service of scindhiah, who may be disaffected to his Government."

[*Rise of the Christian Power in India*, **B.D. Basu**, *p.379*]

(రాజపుత్రులను, ఇతర సామంతరాజులను సింధియాపైకి ఉసిగొపటానికి నీ శాయశక్తులా ప్రయత్నించాలి. జునాగఢ్, జోధ్‌పూర్ రాజులను కూడా ఈ యుద్ధంలోకి లాగేట్టు చూడు. సింధియాతో పోరాడుతున్న మహాద్‌జీ సింధియా వితంతువులను, అతడిపై తిరగబడిన సర్దారు లక్వాజీదాదాను, సింధియాకు వ్యతిరేకులుగా ఉన్న అతని కుటుంబంలోని వారిని, కొలువులోని వారిని అందరిని బలపరిచి ప్రోత్సహించటానికి ఇదే సమయంలో తగిన ప్రయత్నాలన్నీ చేయాలి.)

ఇదన్నమాట సంగతి! 'కంపెనీ' దొరలు కాలపెట్టిన చోటల్లా, వారి కన్నుపడిన చోటల్లా అకస్మాత్తుగా తిరుగుబాట్లు లేచి, కక్షలు ముదిరి, అంతఃకలహాలు రెచ్చి, రాజ్యాలకు రాజ్యాలు క్రమపద్ధతిన అల్లకల్లోలాల పాలై చివరికి అన్నీ 'కంపెనీ' నోట్లో పడటం వెనక ఇంత పకడ్బందీ పథకం ఉన్నదన్నమాట. దేశీయ ప్రభువుల అవివేకంవల్ల, అసమర్థతవల్ల, ఆత్మహత్యా సదృశమైన రాజకీయ దుర్విధానాలవల్ల, సంకుచిత స్వార్థంకోసం విశాల జాతి హితాన్ని బలిపెట్టే మూర్ఖత్వంవల్ల దేశం తెల్లవారికి అయాచితంగా దైవికంగా వశమైందని భ్రమించే భారతీయ మేధావులకు వెల్లస్లీ విడమర్చి వెల్లడించిన మాయ మర్మం అవలోకించాకయినా అసలు గుట్టు అర్థం కావాలి. ఈ కుతంత్రాలు, కుత్సితాలు క్లయివ్, వారన్‌హేస్టింగ్స్‌ల కాలంనుంచీ 'కంపెనీ' దొరవార్లందరూ రివాజుగా అనుసరించినవే. అంత దాకా వాచ్యంగా, కడు గోప్యంగా జరిగిన పాడు పనులను కాగితం మీద అక్షర బద్ధం చేసినందుకు వెల్లస్లీకి చరిత్ర రుణపడి ఉండాలి.

పథకం ప్రకారం ఇలా తెల్లవారు సాగించిన కుట్రలూ కూహకాల మూలంగా సర్వత్రా భగ్గుమన్న తిరుగుబాట్లను, వెన్నుపోట్లను, విరోధుల స్వైర విహారాలను తట్టుకోవటంలో సింధియా మధ్యభారతంలో తలమునకలవుతూ హోల్కర్ సవాలును అతికష్టంమీద

అదుపులోనికి తెస్తున్న సమయంలో ఇటు పూనాలో పీష్వాకు పుటంపెట్టే పుణ్యకార్యం ముమ్మరమైంది. బాజీరావు కంపెనీవారి మాయలోపడి, వారి దుర్బోధలకు చెవి ఒగ్గి, వారే తనకు రక్షకులని వెర్రిగొర్రెలా విశ్వసించినా దొరలు మాత్రం అతడికి చెప్పాల్సిన ఇచ్చకాలు అతడికి చెబుతూనే చాటున అతడిపై కత్తులు నూరి, చక్రబంధంలో నొక్కేసే కుటిల వ్యూహాన్ని చాలాకాలంగా అమలు జరుపుతూ వచ్చారు.

కుశాగ్రబుద్ధి అయిన నానా ఫడ్నవీసుకు వారి దుర్మార్గాలు తెలియకపోలేదు. కాని - పూర్వపు అధికార ప్రాభవం తనకు లోపించడంవల్లనేమి, ఇరవై ఏళ్ల కింద తాను ఆంగ్లేయులపై ఐక్య సంఘటన కట్టిన నాటి అనుకూల పరిస్థితులు ఇప్పుడు మృగ్యమవడం వల్లనేమి, తనను నమ్మక, నిర్ణయాధికారాలనివ్వక పీష్వా బాజీరావు తన చేతులు కట్టేసిన కారణంగానేమి అపరచాణక్యుడయిన నానా కూడా అవసాన దశలో నిర్వీర్యుడయ్యాడు. బాహాటంగా పీష్వాపై వల్లమాలిన ప్రేమ కురిపిస్తూనే... పీష్వాకు దురుద్దేశాలేవో ఉన్నాయనీ, తమపై దాడికి ప్రయత్నిస్తూ, ద్రోహానికి పాల్పడుతున్నాడనీ వెల్లస్లీ అతడికి తెలియకుండా దుష్ప్రచారం మొదలెట్టాడు. టిప్పూ రాజ్యంలో ఇంగ్లీషువారు అడుగిడినదే తడవుగా దానిని అనుకుని ఉన్న మరాఠా ప్రాంతాలలో స్థానిక జాగీర్దార్లను ఎగదోసి పీష్వాపై తిరుగుబాట్లు చేయించారు.

దొరల పుణ్యమా అని హఠాత్తుగా పుట్టుకొచ్చిన ఈ సవాళ్లను ఎదుర్కొని అతికష్టం మీద తిరుగుబాట్లను కాస్త అణచగలిగాడో లేదో 1800 ఫిబ్రవరి 13న నానాఫడ్నవిస్ కన్నుమూశాడు. ఆయన మరణంతో మరాఠాలు తమ పూర్వ వైభవాన్ని పొందే ఆశ అడుగంటింది. రెసిడెంటు పామర్ అన్నట్టు నానాతోటే మరాఠా ప్రభుత్వం నుంచి వివేకం, సంయమం వెళ్ళిపోయాయి. ("With him departed all the wisdom and moderation of the Maratha Government.") నానా నిష్క్రమణతో ఇంగ్లీషువారు ఆడింది ఆట అయింది. మరాఠా రాజ్యాపహరణ కుటిల నాటకంలో చివరి అంకానికి తెర లేచింది.

బాజీరావు గద్దెనెక్కిందే దౌలత్‌రావు సింధియా ప్రాపకం వల్ల. కాబట్టి ప్రతి ముఖ్య విషయంలోనూ అతడు తనను సంప్రదించాలని సింధియా కోరుకున్నాడు. ప్రతిదీ అతడికి చెప్పి చేయటం తనకు పరువుతక్కువని బాజీరావు భావించాడు. తాను సర్వస్వతంత్రుడినని, ఎవరినీ లక్ష్యపెట్టనవసరం లేదని నిరూపించుకుంటున్నానని ఊహించుకుని అతడు నేరుగా పోయి ఇంగ్లీషువారి ఊబిలో పడ్డాడు. టిప్పు మరణానంతరం మైసూరు రాజ్యాన్ని విదేశీయుల బారి నుంచి కాపాడటానికి దూండియా వాగ్ అనే దేశభక్తుడు కొంత బలగాన్ని గెరిల్లా తరహాలో పోరాటం సాగిస్తున్న కాలమది. గవర్నరు జనరల్ వెల్లస్లీకి స్వంత తమ్ముడైన సర్ ఆర్థర్ వెల్లస్లీ నాయకత్వాన పెద్ద ఇంగ్లీషు సేన అతడి వెంటపడింది. దాని నుంచి తప్పించుకోవటానికి వాగ్ మరాఠా ప్రాంతాల్లోకి పారిపోయాడు. ఈ సంగతి పీష్వాకు విన్నవించి, తమరు కనుక దయతో అనుమతిస్తే మేము కొంచెం సేనను పంపించి ఆ దుండగుడిని పట్టుకుంటాం అని దొరలు మహా వినియంగా ప్రార్థించారు. ఓస్! దానికేముంది? అలాగే చేసుకుపోండి అని బాజీరావు దూరం ఆలోచించకుండా, సింధియాకు చెప్పాపెట్టకుండా అనుమతిని దయచేశాడు. అదే అతడి నెత్తికి చేతులు తెచ్చింది.

తాము బందిపోటుగా ముద్ర వేసిన దేశభక్తుడిని పట్టుకునే నెపంతో ఇంగ్లీషు సేనలు మరాఠా రాజ్యంలోకి ప్రవేశించాయి. తమకు కావలసినవాణ్ని పట్టుకున్నాయి. అంతటితో



వెనుదిరగక అక్కడే తిష్ఠవేశాయి. అంతకుమునుపు ఇంగ్లీషు సైన్యాన్ని నైజాంకు చప్పుడు కాకుండా తరలించి, నిజాం మెడమీద కత్తిపెట్టి సైనిక సాలెగూటిలోకి లాగేసిన తంత్రాన్నే పీష్వా మీదా ప్రయోగించటానికి వెల్లస్లీ ఆయత్తమయ్యాడు. "మనం వెంటనే కలగజేసుకోవలసినటువంటి సంక్షోభం మహారాష్ట్రలో రాబోతున్నదని మన రెసిడెంటు పామర్ చెబుతున్నాడు. బహుశా పీష్వాయే మన సైనిక సహాయాన్ని అర్థించవచ్చు. లేదా అతడు పూనా వదిలి పారిపోవచ్చు. లేక సింధియా తెగబడి పీష్వాను నిర్బంధించనూ వచ్చు. ఇందులో ఏది జరిగినా పీష్వా న్యాయబద్ధ అధికారాన్ని నిలబెట్టే పేరిట, ఆయన తరఫున మనం సైనిక జోక్యం చేసుకోవలసి ఉంటుంది. అందుకని సేనలతో వెనక్కి రాకుండా ఉన్నచోటే ఉండి, రంగంలోకి దూకడానికి సిద్ధంగా ఉండమని ఆర్థర్ వెల్లస్లీకి చెప్పండి అని 1800 ఆగస్టు 23న మద్రాసు గవర్నర్ లార్డ్ క్లయివ్‌కు వెల్లస్లీ జాబు రాశాడు.

అతడు ఊహించినట్టే పీష్వాకూ సింధియాకూ వ్యవహారం చెడింది. తనకు తెలియకుండా విదేశీ సేనలను రాజ్యంలోకి అనుమతించి చేజేతులా వినాశాన్ని కొనితెచ్చినందుకు పీష్వా మీద సింధియా మండిపడ్డాడు. ఇలాగే వదిలేస్తే ఇంకేమి పిచ్చిపనులు చేస్తాడోనని తలిచి పీష్వా చుట్టూ తన సిపాయిలతో గట్టి కాపలా పెట్టించాడు. పరిస్థితి త్వరితగతిన చెయి దాటిపోతున్న విషమ స్థితిలో సింధియా అంతకంటే తీవ్ర చర్యలే చేపట్టవలసింది. బాజీరావును ఖైదు చేయడానికీ, ఆఖరికి చంపడానికీ అయినా వెనకాకుండా ఉండవలసింది. కాని మూడు దశాబ్దాల కింద రఘోభా విషయంలో నానాఫడ్నవిస్ చూపిన కనికరాన్నే రఘోబా కుమారుడి విషయంలో దౌలత్‌రావూ కనపరిచి అరకొర ఆంక్షలతో ఊరుకున్నాడు. సింధియా తన చుట్టూ కాపలాపెట్టి తన స్వేచ్ఛను కుదించడంతో బాజీరావు ఇక తనను రక్షించగలిగింది ఇంగ్లీషు వారేనని దృఢ నిశ్చయానికి వచ్చాడు. రెసిడెంటు పామర్‌ను పిలిచి మంతనాలు మొదలెట్టాడు. ఇంతకుముందు నుంచీ మీరు అంటున్నట్టే ఆరు బెటాలియన్ల సైన్యాన్ని నాకు సహాయంగా తీసుకుంటాను; సాలుకు పాతిక లక్షల రాబడి వచ్చే ఉత్తరాది పరగణాలను రాసిస్తాను. అయితే ఒక షరతు. మీ సైన్యం ఇక్కడ శాశ్వతంగా తిష్ఠవేయటానికి వీల్లేదు. మీ దగ్గరే అట్టేపెట్టుకుని నేను కోరినప్పుడల్లా పంపిస్తూ ఉండాలి - అని పీష్వా బేరం పెట్టాడు.

కాని - ఆవలివారు ఆంగ్లేయులు. వారికి రాజ్యలాభం లేకుండా కేవలం కిరాయి తీసుకుని సైన్యంతో షటిల్ సర్వీసు చేయించమంటే వారెందుకు ఒప్పుకుంటారు? సర్వనాశనం ముంచుకొస్తున్నదంటే తప్ప పీష్వా శషభిషలు మాని ఇంగ్లీషు భల్లూకాన్ని కౌగిలించుకోవటానికి బేషరతుగా ఇష్టపడేట్టు లేదని రెసిడెంటు పామర్ గ్రహించాడు. పూనా నుంచి గవర్నర్ జనరల్‌కు పంపిన చివరి లేఖలో ఆ మాటే అతడు స్పష్టంగా అన్నాడు. ("I apprehend that nothing short of imminent and certain destruction will induce the Peishwa to make concessions...")

సరే! అట్లే అగుగాక అన్నాడు వెల్లస్లీ. అతడు సైగ చేయగానే యశ్వంతరావు హోల్కర్ సింధియాతో పోరును ఆపి, తన సోదరుడి దారుణ హత్యకు ప్రతీకారం తీర్చుకునే మిషపై పీష్వా రాజ్యంమీద పడ్డాడు. పీష్వా న్యాయబద్ధ అధికారాన్ని నిలబెట్టటమే తమ పవిత్ర కర్తవ్యమని చెబుతూ వచ్చిన దొరలు ఏకంగా మరాఠా రాజధానిపైనే దాడి జరుగుతున్నా చిటికెన వేలును కదిలించలేదు. పైగా దురాక్రమణకు వచ్చిన హోల్కర్ సేనలతో తలపడాల్సిన

అవసరం రాకుండా జాగ్రత్త పడమని పూనా రెసిడెంటుకు ఆదేశాలిచ్చారు. తమకు మిత్రుడైన తిరువాన్కూరు రాజును కన్నెత్తి చూడటమే మహాపరాధంగా ఎంచి గతంలో టిప్పుసుల్తానుపై విరుచుకుపడిన దొరలు, తమకు అలాంటి మిత్రుడే అయిన పీష్వా రాజధానిపైనే దండయాత్ర జరుగుతున్నా మెదలకపోగా దురాక్రమణదారులతోనే చేతులు కలిపారు.

ఆ సమయాన పుణె మరీ దిక్కూమొక్కూ లేకుండా ఏమీ లేదు. రాజధాని రక్షణకు సింధియా నిలిపివెళ్లిన 10 వేల అశ్వదళం, 5 బెటాలియన్లు సర్వసన్నద్ధంగా ఉన్నాయి. ఇవిగాక పీష్వా చేతిలోనూ కొంతసైన్యం ఉంది. ఈ మొత్తం బలగాలతో పోల్చితే హోల్కర్ బలం తక్కువ. గట్టిగా పోరాడితే పీష్వా పక్షానికే విజయం దక్కేది. కాని యథాప్రకారం ఇంగ్లీషు కుతంత్రం పనిచేసింది. శత్రు దుర్భేద్యమైన శ్రీరంగపట్నం కోటను దుర్గరక్షకులను లోబరుచుకోవటం ద్వారా పట్టుకుని టిప్పూసుల్తానుపై ఆంగ్లేయులు అధర్మ విజయం సాధించినట్టే... సింధియా సేనలోని కెప్టెన్ ఫిలోస్ అనే యూరోపియన్ ఆఫీసరు విద్రోహం వల్ల 1802 అక్టోబరు 25న పూనా యుద్ధంలో అనూహ్యంగా హోల్కర్ గెలిచాడు.

ఓడిపోయిన పీష్వా రాజధాని విడిచి పారిపోయి బేసెన్‌లో ఇంగ్లీషువారి శరణుజొచ్చాడు. సంవత్సరం కింద తాను వీల్లేదన్న షరతులకు నోరుమూసుకుని అంగీకారం తెలిపి, తన అధికారాన్ని, మరాఠాల స్వాతంత్ర్యాన్ని విదేశీయులకు కుదువపెడుతూ 1802 డిసెంబర్ 31న దిక్కుమాలిన ఒప్పందం కుదుర్చుకుని, తనను తాను బ్రిటిష్ తాబేదారు స్థితికి దిగజార్చుకున్నాడు. పీష్వా నామమాత్రపు అధికారం 1818 దాకా కొనసాగకపోలేదు. కాని 1802లో బేసెన్ ఒప్పందంతోటే మరాఠా ప్రాభవం కొడిగట్టింది. భారతదేశ పరాధీనతకు అదే నాంది.



# సూర్యచంద్రులు సాక్షిగా...

మీ మిత్రులు మాకూ మిత్రులే; మీ శత్రువులు మాకూ శత్రువులే; మీ హక్కుల మీద, మీ ప్రాంతాల మీద దాడి జరిగితే అది మా హక్కుల మీద, మా రాజ్యం మీద జరిగిన దాడిగానే భావిస్తాం. మీ జోలికొచ్చిన వారి భరతం పడతాం. మిమ్మల్ని కంటికి రెప్పలా కాపాడతాం. సూర్యుడూ చంద్రుడూ ఆకాశంలో ఉన్నంతవరకూ మన స్నేహం నిలిచి ఉండును గాక... అని భీషణ ప్రతిజ్ఞ చేసి పీష్వా బాజీరావుతో బేసెన్ ఒప్పందం కుదుర్చుకున్నారు ఇంగ్లీషువారు. పీష్వాకు సింధియా మిత్రుడు; హోల్కర్ శత్రువు. సింధియా తనకు అండగా ఉన్నప్పటికీ హోల్కర్ దురాక్రమణను ఎదుర్కొనలేకపోయినందువల్లే బాజీరావు రాజధాని విడిచి, రాజ్యం వదిలి పరారై తెల్లవారి శరణు జొచ్చాడు. సూర్యచంద్రుల మీద ఒట్టుపెట్టి చేసుకున్న ఒప్పందం ప్రకారం ఇంగ్లీషు మిత్రులు హోల్కర్ వెంటపడాలి. సింధియానేమో అక్కున చేర్చుకోవాలి.

కాని – జరిగింది దీనికి రివర్సు. తమ నేస్తుడిని రాజ్యం నుంచి వెళ్లగొట్టిన హోల్కర్‌నేమో కంపెనీ ధర్మాత్ములు ఉపేక్షించారు. ఆఖరులో తమ మిత్రుడికి బాసటగా ఉన్న సింధియా పైనేమో నిప్పులు కక్కి కత్తులు దూశారు. అదీ ఇంగ్లీషు రాజనీతి.

మాకుచెప్పకుండా మరే ప్రభువుతోనూ మీరు చర్చలు జరపకూడదు. మా అనుమతి లేకుండా ఎవరి జోలికీ వెళ్లకూడదు. మిగతా మరాఠా రాజ్యాలతోగాని, వేరే వారితో గాని గొడవలొస్తే మేమే మధ్యవర్తిత్వం చేస్తాం. మేము ఎలా చెబితే అలా మీరు నడుచుకోవాలి – అని మరాఠా మహాసామ్రాజ్య అధినేత పీష్వాను కట్టడి చేసి, చేతులూ కాళ్లూ కట్టేసిన మాయదారి ఒప్పందం కుదుర్చుకోవటంతో తెల్లవారి కళ్లు చల్లబడలేదు. పీష్వా స్వేచ్ఛను హరించి, తమకు తొత్తును చేసుకుని, పుణె గద్దెపై తిరిగి కూచోబెట్టటంతో... రక్షణ నెపంతో పీష్వా చుట్టూ తమ సేనలని కాపలా పెట్టటంతో తమ పని అయిపోయిందని కంపెనీ అధికారులు అనుకోలేదు. మరాఠాల స్వాతంత్ర్యాన్ని జయప్రదంగా అంతమొందించిన

తరవాత కూడా మరాఠాలను వారి బతుకు వారిని వెల్లస్లీ బతకనివ్వదలచలేదు. అద్దె సేనల వలలోకి  ఒకరిని లాగితే మిగతా వారూ చచ్చినట్టు చేతికి చిక్కుతారని గవర్నర్ జనరల్ కొంతకాలంగా ఆంతరంగికులకు చెబుతూ వచ్చాడు. పెద్దతలకాయ అయిన పీష్వా తమ గాలానికి చిక్కాక మరాఠా కూటమిలోని మిగతా ప్రభువులనూ ఒకరి తరవాత ఒకరిని ఏరివేసి, భారత దేశంలో బ్రిటిష్ సామ్రాజ్యాన్ని సుస్థిరం కావించటానికి వెల్లస్లీ కంకణం కట్టుకున్నాడు. మరాఠా ముఖ్యులను కవ్వించి, యుద్ధానికి రెచ్చగొట్టటానికి చాలా ఎత్తులు వేశాడు. ఎన్ని విధాల గిల్లినా వారు రెచ్చిపోకపోయేసరికి తీరి కూర్చుని, తానే యుద్ధాన్ని ప్రకటించి, దారుణ దురాక్రమణకు ఒడిగట్టాడు.

వేల సంవత్సరాల హిందూ దేశచరిత్రలో కొన్ని వందల యుద్ధాలు జరిగాయి. సబబులు, మంచిచెడ్డలు ఎలా ఉన్నప్పటికీ ఒక వైరి పక్షానికి రెండో పక్షం మీద యుద్ధం చేయాల్సినంతటి తీవ్ర ఆగ్రహం కలగటానికి సాధారణంగా బలమైన కారణాలు ఉంటాయి. ఏ కారణమూ లేకుండా, అవతలి వారి నుంచి ఎటువంటి తప్పుగానీ ముప్పుగానీ లేకుండానే అడ్డగోలుగా జరిగిన ఆధునిక యుద్ధాల్లో మొదట చెప్పుకోవలసింది వెల్లస్లీ పుణ్యమైన రెండో మరాఠా సంగ్రామాన్ని.

భారీ సైన్యాన్ని తోడిచ్చి పంపి 1803 మే 13న పుణె తక్తుపై బాజీరావును తిరిగి కూర్చోబెట్టాక ఇంగ్లీషు 'రక్షకులు' యుద్ధమంటూ చేస్తే మొదటగా యశ్వంతరావు హోల్కర్‌తోనే అని అందరూ ఊహించారు. కంపెనీకి కొత్త నేస్తమైన పీష్వాను కష్టాల పాలు చేయటమే గాక కంపెనీ రక్షణలోని పాత మిత్రుడు నిజాంను కూడా హోల్కర్ చాలా తిప్పలు పెట్టాడు. నైజాం రాజ్యం మీదపడి ఔరంగాబాద్ నగరాన్ని దోచుకుని చాలా ఆగం చేశాడు. అయినా - మిత్రుల రక్షణకు ఆచంద్రతారార్కం పాటు పడతామని ప్రతిన బూనిన కంపెనీ దొరలు చిటికెన వేలును కదిలించలేదు. ఎందుకంటే - అతడికీ వారికీ మధ్య అప్పటికే లోపాయికారీ లాలూచీ ఉంది. "I am anxious to cultivate the good understanding which has subsisted between the Honourable Company's Government and You" (మాననీయ కంపెనీ సర్కారుకూ మీకూ ఉన్న సదవగాహనను పెంపొందించాలని నేను ఆరాటపడుతున్నాను) అని 1803 జులై 16న అంటే - పీష్వా తిరిగి వచ్చిన రెణ్నెల్లకే హోల్కర్‌కు జనరల్ ఆర్థర్ వెల్లస్లీ (పెద్ద వెల్లస్లీకి తమ్ముడు) రాసిన లేఖనుబట్టే అసలు మర్మం అర్థమవుతుంది.

హోల్కర్‌తో 'సదవగాహన' అంతకుముందే పొసగినందున అతడు ఎలాగూ 'కంపెనీ'కి వంటింటి కుందేలే. అతడి సంగతి తీరిగ్గా చూసుకోవచ్చు. ముందు తేల్చాల్సింది మిగతా మరాఠా ముఖ్యుల కథ అనుకున్నాడు వెల్లస్లీ. తలచిందే తడవుగా చకచకా ఎత్తులు వేశాడు. మొట్టమొదటగా 'మీ పీష్వా మాతో సంధి కుదుర్చుకున్నాడు. మీరూ అదే దారికి వస్తారా? మాతో శత్రుత్వం కొని తెచ్చుకుంటారా?' అని సింధియా, బేరార్ రాజా, తదితరులకు శ్రీముఖం పంపించాడు.

అప్పటికే మరాఠా సర్దార్లు లోలోన రగిలిపోతున్నారు. ఛత్రపతి శివాజీ స్థాపించిన స్వరాజ్యం విదేశీయులకు పాదాక్రాంతమైంది. ఒకప్పుడు యావద్భారతంలో తిరుగులేని పెత్తనం చలాయించి మొగల్ పాదుషానూ, రాజపుత్ర మహారాణాలను సైతం శాసించగలిగిన మరాఠా సామ్రాజ్యానికి అధిపతి అయిన పీష్వా తన స్వాతంత్ర్యాన్నే కోల్పోయి, అధికార



స్వార్థంకోసం స్వేచ్ఛను, నిర్ణయాధికారాన్ని వదులుకుని తెల్లవారి ఉచ్చులో ఇరుక్కున్నాడు. వారి అనుమతి లేకుండా కనీసం తన సామంతులతో కూడా వ్యవహారం నెరపలేని నిస్సహాయ స్థితిలో చిక్కుకున్నాడు. అది మరాఠా యోధులకు హృదయ శల్యమైంది. తమకు చెప్పాపెట్టకుండా సిగ్గుచేటు సంకటంలోకి పీష్వా తామందరినీ నెట్టటం వారిని అమితంగా బాధించింది. పీష్వా తరువాత స్వాతంత్ర్యాపహరణలో ఎవరి వంతు వస్తుందన్న ప్రశ్న అందరి మనసులనూ తొలిచెయ్యసాగింది. అంతా కలిసి ఏదో ఒకటి చెయ్యకపోతే, ముంచుకొస్తున్న ముప్పును తట్టుకోవటం కష్టమన్న అభిప్రాయం అందరికీ కలిగింది. ముందుగా దౌలత్‌రావు సింధియా, నాగపూర్ ప్రభువు రఘోజీ భోంస్లే కలిసి మాట్లాడుకుని ఆ తరవాత పీష్వాతోనూ అన్ని విషయాలు చర్చించి భవిష్యత్ ప్రణాళికను నిర్ణయించుకోవాలనుకున్నారు.

వారికి అంత సావకాశం ఇవ్వటం వెల్లస్లీకి ఇష్టంలేకపోయింది. బేసెన్ సంధికి వల్లె అంటారో లేదో ఉన్నపళాన తేల్చాలని రెసిడెంటు కాలిన్స్ చేత అతడు సింధియాను ఒత్తిడి చేయించాడు. ఇష్టమో కాదో చెప్పాలంటే ముందు ఆ సంధిలో ఏముందో, దాని షరతులు ఏమిటో సింధియాకు తెలియాలికదా? కాని అప్పటిదాకా ఆ వివరాలేవీ సింధియాకు అధికారికంగా ఎవరూ తెలియపరచనే లేదు.

మరాఠా కూటమిలో సింధియా అతి ముఖ్యుడు. పీష్వా కూడా ఇంత దాకా అతడి సైనిక అండపైనే ఆధారపడి ఉన్నాడు. సంధి ఏది పొసగాలన్నా అతడి ఇచ్ఛిక సహకారం తప్పనిసరి. ఆ ఒక్క కారణంతోనైనా పీష్వాతో ఒప్పందం చేసుకునేముందు కంపెనీ దొరలు సింధియాను సంప్రదించి ఉండవలసింది. అదీగాక - బాజీరావు పీష్వా కాగలిగింది ప్రధానంగా సింధియా చలవ వల్లే. ఆ కృతజ్ఞతతోనైనా కీలక సంధిని చేసుకునే ముందు పీష్వా తనకు మాట మాత్రంచెప్పి ఉండాల్సిందని సింధియా భావించటం సబబే. పైగా ఇంగ్లీషు వారికీ సింధియా చాలా కావలసినవాడే. రెండు దశాబ్దాల కింద వారన్ హేస్టింగ్స్ హయాంలో మరాఠాల చేతిలో చావుదెబ్బతిన్న ఇంగ్లీషు వారు నెత్తిన గుడ్డ వేసుకుని లబోదిబో మనవలసిన స్థితిలో మాధవరావు సింధియా, ముధోజీ భోంస్లేలు ఆదుకొని ఇంచుమించు బ్రిటిష్ ఏజెంట్లుగా పనిచేసి వాటమైన సాల్బే సంధిని కుదిర్చిపెట్టారు. నాటినుంచీ మరాఠా బ్రిటిష్ సంబంధాలను నియంత్రించిన ఆ ఒప్పందం స్థానంలో కొత్తదాన్ని ఖరారు చేసుకునే ముందు కంపెనీ వారికి ఇంగితజ్ఞానం ఏ కాస్త ఉన్నా తమకు ఉపకారులైన సింధియా, భోంస్లేలను సంప్రదించి ఉండాల్సింది. వెల్లస్లీ ఆ పని చేయకపోగా దురుసుతనం చూపి సంధికి సై అంటావా లేదా అని సింధియా గొంతు మీద కూచున్నాడు. పైగా మరాఠాల నుంచి ఏ రకమైన కవ్వింపూ లేకుండానే అన్ని మరాఠా రాజ్యాల పొలిమేరల్లో బ్రిటిష్ సేనలను నిలబెట్టి కయ్యానికి కాలుదువ్వాడు.

ఇది సహించరాని దురహంకారమే. అయినా సింధియా తొందరపడలేదు. పీష్వా మీద, కంపెనీ వారి మీద కోపగించటానికి తనకు బలమైన హేతువే ఉన్నా అతడు నిగ్రహం కోల్పోలేదు. అప్పటికే తన రాజ్యంలో అంతఃకలహాలను రేకెత్తించి, తిరుగుబాట్లు ప్రోత్సహించి దొరలు సృష్టించిన చీకాకులతో వేగలేక సతమతమవుతున్న స్థితిలో కొత్తరకం ఒత్తిళ్ల ఉచ్చులో పడకుండా ఆచి తూచి అడుగు వేయాలని అతడు అనుకున్నాడు.

ఈలోపు బాజీరావుకూ తాను కౌగిలించుకున్నది ఇంగ్లీషు విషకన్యనన్న సంగతి నెమ్మదిగా

అర్థమైంది. హోల్కర్ పట్టునుంచి తప్పించుకోబోయి తెల్లవారి జారిన పడటంతో తన పరిస్థితి దుంగను తీసి దూలాన్ని తలకెత్తుకున్నట్టు, పెనం మీది నుంచి పొయ్యిలో పడినట్టు అయిందని పీష్వా అనుభవ పూర్వకంగా గ్రహించాడు. దొరలు తెలివిగా తన మెడకు తగిలించిన బంధం నుంచి బయట పడాలంటే తన మిత్రుడు సింధియా సహాయం అత్యావశ్యకమని అతడికి అర్థమైంది. అందుకే ఒకసారి వచ్చి తనను కలవాలని బేసిన్ నుంచి పుణెకు బయలుదేరడానికి ముందే సింధియాకు పీష్వా కబురు పంపాడు. అలాగే నాగపూర్‌లోని బేరార్ రాజానూ పిలిచాడు. ఆ ఆహ్వానాన్ని పురస్కరించుకునే సింధియా, భోంస్లేలు పూనాకు బయలుదేరారు. మధ్యలో బుర్హాన్‌పూర్ దగ్గర మజిలీ చేసి ఉభయులూ మాట్లాడుకుని అటునుంచి పుణెకు వెళ్లదలిచారు.

ఇదిగో – ఈ పని మీద దక్కనుకు మరలి, మార్గమధ్యాన బుర్హాన్‌పూర్ వద్ద భోంస్లే కోసం వేచి ఉన్న సమయంలో వెల్లస్లీ రెసిడెంటు కాలిన్స్‌ను ప్రయోగించి సింధియా మెడ మీద కత్తి పెట్టాడు. అతడిని పుణె రావద్దని పీష్వా చేత చెప్పించాలని మొదట దొరలు చాలా ప్రయత్నాలు చేశారు. ఆ ఎత్తులేవీ పారకపోవటంతో అడ్డం తిరిగి సింధియా తమ మీదికి దండెత్తి వస్తున్న రీతిలో గగ్గోలు పెట్టి వెనక్కి పోతావా లేదా అని వెంట పడ్డారు. మాకు మీ మీద ఎటువంటి శత్రుభావమూ లేదు; మీతో విరోధం తెచ్చుకునే ఉద్దేశం ఏ కోశానా లేదు; మా గొడవలు మేము మాట్లాడుకుంటాం; మా పీష్వా దగ్గరికిపోయి ఆలోచించుకుంటాం – మాలో మాకు మునుపటినుంచీ ఉన్న ఒడంబడికలను మీరు మన్నించినంత వరకూ పీష్వాతో మీ కొత్త ఒప్పందానికి మేము అడ్డురాము అని సింధియా ఎంత మొత్తుకున్నా వినలేదు.

ఇక యుద్ధ భేరీ మోగించడమే తరువాయి అనుకున్న సమయంలో గవర్నర్ జనరల్ వెల్లస్లీకి ఒకచిక్కు వచ్చి పడింది. రణోత్సాహంతో ఇక్కడ అతడు ఉరకలు వేస్తుండగా అటు సీమ నుంచి ప్రతికూల సందేశాలు రాసాగాయి. అంతకు ముందునుంచే ఇండియాలో వెల్లస్లీ వ్యవహారం ఈస్టిండియా కంపెనీ యజమానులకు పెద్ద తలనెప్పి అయింది. మెల్లిగా ప్రాబల్యం సంపాదించి ఇండియా వ్యాపారం మీద కోట్ల లాభాలకు పడగలెత్తాలన్నదే ఆది నుంచి కంపెనీ వారి ఆలోచన. బ్రిటిష్ ప్రభుత్వాన్ని నడిపే కొంతమంది పెద్దలవలె సామ్రాజ్య కాంక్ష వీరికి లేదు. చాపకింద నీరులా రాజ్యాలను సంగ్రహించటంవల్ల వ్యాపారం వృద్ధి చెంది లాభాలు పెరుగుతాయని వారు ఆశించగా... వెల్లస్లీ హయాంలో ఇండియాలో వారికి పెరిగినవల్లా ఖర్చులే. 1799లో టిప్పు సుల్తాన్‌ను గెలిచి సంపన్న మైసూరు రాజ్యాన్ని వశపరచుకోవటం గొప్ప అన్న ఆనందం మూణ్నాళ్లు నిలవలేదు. ఆ యుద్ధానికి పెట్టిన ఖర్చులపై వెల్లస్లీ పంపిన బిల్లులను చూస్తే కంపెనీ వారికి తల తిరిగింది. ఇదేమి రొంపిరా బాబూ అని వారు లబలబలాడుతూండగానే వెల్లస్లీ దొర పీష్వాను బేసెన్ బుట్టలో వేసి గండర గండలైన మరాఠా యోధులతో తగవును కొని తెచ్చుకున్నాడు. ఇది ఎక్కడికి దారితీస్తుందో, ఇంకేమి కొంప ముంచుతుందో, మరాఠాలంతా ఏకమైతే తమ గతి ఏమవుతుందోనని కంపెనీవారు హడలిపోయారు. "మరాఠాలతో కయ్యం వద్దంటే వినకుండా ఇప్పుడీ ఒప్పందాన్ని మీరు నెత్తికి తగిలించుకున్నారు. దీనిపై మరాఠా రాజ్యాల్లో చాలా గోలగా ఉన్నట్టు వింటున్నాం. ముఖ్యంగా మన సేనలు పీష్వా దగ్గరే తిష్ఠ వేయాలన్న షరతు; మన ఆజ్ఞ లేనిదే మరాఠాలు ఏ సంధీ చేసుకోరాదన్న క్లాజు వారికి దుస్సహంగా



ఉన్నట్టుంది. మనకు గొడవలొద్దు. అవసరమైతే ఆ రెండు క్లాజులను ఎత్తివేసి అయినా మరాఠాలను ప్రసన్నం చేసుకోండి" అని 1803 మార్చి 6న కంపెనీ సీక్రెట్ కమిటీవారు లండన్ నుంచి వెల్లస్లీకి వర్తమానం పంపారు.

గవర్నర్ జనరలు అనేవాడు ఈస్టిండియా కంపెనీ నౌకరు. పైవారే అలా ఆదేశించినప్పుడు నోరు మూసుకుని అమలుచేసి తీరవలసిందే. కాని వెల్లస్లీ చాలా ముదురు. కంపెనీ యజమానులు ఏమన్నా బ్రిటిష్ ప్రభువులు తన కొమ్ముగాస్తారని అతడికి తెలుసు. ఆ ధైర్యంతోనే నాటకాలాడి తన యజమానులనే బురిడీ కొట్టించాడు. "It is not my intention to attempt to compel the Peishwa to adhere to the faith of his engagements, at the hazard of involving the Company in a war with the combined Mahratta States" (పీష్వాను సంధి షరతులకు కట్టుబడాలని నిర్బంధించి, మరాఠా రాజ్యాలు మనపైకి సమైక్యంగా యుద్ధానికి వచ్చే ప్రమాదాన్ని కొని తెచ్చుకోవటం నా ఉద్దేశం ఎంత మాత్రం కాదు) అని డైరెక్టర్లను మభ్యపెడుతూనే తన దుర్మార్గాన్ని తాను సాగిస్తూ పోయాడు. సింధియాకు మనపై దండెత్తే ఉద్దేశం ఎంతమాత్రం లేదు. అతడు యుద్ధ సన్నాహాలేవీ చేయడంలేదు. అందునా వచ్చేది వానాకాలం. నదులన్నీ పొంగి దారులు మూసుకుపోయే సమయంలో ఏ మరాఠా రాజ్యమూ యుద్ధానికి సాహసించదు. యుద్ధం ఆలోచనే సింధియాకు ఉంటే సరిహద్దుల్లో మన సైన్యం మోహరించిన స్థితిలో తన రాజ్యాన్ని విడిచిపెట్టి దక్కనుకు బయలుదేరేవాడు కాదు అని ఇంగ్లీషు సైన్యాధికారులే చెబుతున్నా ఆ వాస్తవాలను కప్పిపుచ్చి, కవ్వింపులన్నీ తానే చేసి, నిష్కారణంగా సింధియాకు దురుద్దేశాలను, పోగరుబోతు తనాన్ని ఆపాదించి వెల్లస్లీ అడ్డం తిరిగాడు. రక్తపుటేరులు పారించటానికి సైనిక సన్నాహాలు ముమ్మరం చేశాడు.

ఇక యుద్ధ ప్రకటనే మిగిలింది. అనుకుంటుండగా వెల్లస్లీకి పెద్ద సమస్య వచ్చింది. ఈసారీ కంపెనీ డైరెక్టర్లే వారించి ఉంటే నిస్సంకోచంగా పెడచెవిన పెట్టేవాడే. కాని – ఈమారు ఆదేశం వచ్చింది సాక్షాత్తూ – ఇండియా వ్యవహారాలను చూసే బ్రిటిష్ మంత్రి లార్డ్ కాసల్‌రే నుంచి! 1803 జులై 6న వెల్లస్లీ చేతికందిన మంత్రి జాబు సారాంశం ఏమిటంటే – ఇండియాలో మన రాజ్యం బాగా పాతుకుని బలిష్ఠంగా ఉన్నది కాబట్టి, ఎటునుంచీ దాడి ప్రమాదం లేదు కాబట్టి మీరు ఇకపై యుద్ధాలు మాని, శాంతి మార్గంలో సాగి, కంపెనీకి అప్పుల భారం తగ్గించవలసింది – అని.

వెల్లస్లీకి కంగారుపుట్టింది. మహారాష్ట్రులతో పెద్ద యుద్ధం తలపెట్టుకుని డబ్బును మంచినీళ్లలా ఖర్చుపెట్టడానికి సంచీ మూతులు విప్పదీసుకుని కూర్చుంటే – ఇదేమి కర్మం? సొమ్ము ఖర్చుపెట్టవద్దని పైవారు హుకుం పంపారే? ఇప్పుడేమి చెయ్యాలి? లగ్నం పెట్టుకుని కూర్చున్న యుద్ధాన్ని చేయాలా? మానాలా? ఈ విషయమై ఆలోచన చెప్పటానికి తనకు తోడుబోయిన ఆంతరంగిక సహచరుల్ని గవర్నర్ జనరల్ పోగుచేశాడు. వారిలో ముఖ్యుడు సర్‌జార్జి బార్లో. వెల్లస్లీగారు కుర్చీ ఎప్పుడు ఖాళీ చేస్తే అప్పుడు ఈయన అందులో కూచోవాలని ముందే నిశ్చయమైంది. ఆయన వెల్లస్లీకంటే ఏడాకులు ఎక్కువ చదివినవాడు. ఆయన ఏమన్నాడంటే – ఇంత హడావుడి చేసి, ఇన్ని ప్రగల్భాలు పలికి ఇప్పుడు మనం యుద్ధం మానుకుంటే పిరికిపందలమని అందరూ నవ్వరా? దేశంలో మరొకడు మనల్ని ఖాతరు చేస్తాడా? మరాఠాలు మన వెంటపడి తరమకుండా ఉంటారా! పీష్వాను కీలుబొమ్మను చేసి

ఎప్పుడైతే పీష్వా గద్దెపై కూచోపెట్టామో ఆ క్షణంలోనే మిగతా దేశీయ రాజ్యాలన్నీ మన కాలికిందికి వచ్చేశాయి. మన మద్దతులేనట్టి, మన సంపూర్ణాధికారాన్ని లోబడనట్టి ఏ రాజ్యాన్నీ మనం ఇండియాలో ఉండనివ్వకూడదు. మన సైన్యాలు పోతరించి, అవతలి బలగాలు చిందర వందరగా ఉన్న ఈ సమయంలోనే మనం వేటువేయాలి. ఈ అవకాశం మళ్లీ రాదు - అని! మిగతా దొరలు ఇందుకు భళీ అన్నారు.

దాంతో వెల్లస్లీకి హుషారు వచ్చింది. రణోన్మాదులంతా కూడబలుక్కుని కనుసైగ చేయగానే కాలిన్స్ రెచ్చిపోయాడు. తాము పంతం పట్టిన ప్రకారం బేసెన్ సంధిని కళ్ళు మూసుకుని ధ్రువీకరించలేదు కనుక; తాము పొమ్మనగానే తుండూ తుపాకీ తీసుకుని వెనక్కి మరలలేదు కనక నీ సంగతి తేలుస్తామని బెదిరించి సింధియా దర్బారు నుంచి రెసిడెంటు లేచి వచ్చాడు. 1809 ఆగస్టు 6న గవర్నర్ జనరల్ యుద్ధం ప్రకటించాడు.

మారణహోమం మొదలైంది.



# కుట్ర మీద కుట్ర

**1781** నాటి మొదటి మరాఠా యుద్ధంలో ఇంగ్లీషువారు మహారాష్ట్రుల చేతిలో చిత్తుగా ఓడిపోయారు. ఇరవై రెండేళ్ల తరవాత జరిగిన రెండో మరాఠా యుద్ధంలో అదే ఇంగ్లీషువారి చేతిలో మహారాష్ట్రులు చిత్తుచిత్తుగా ఓడిపోయారు. కారణమేమిటి? రెండు దశాబ్దాలలో ఆంగ్లేయుల సైనిక పాటవం అద్భుతంగా పెరిగి మరాఠాల సైనికశక్తి సన్నగిల్లిందా? తొలి యుద్ధంలో పరాజితుడైన జనరల్ గొడ్డార్డ్ కంటే మలి యుద్ధం గెలిచిన జనరల్ ఆర్థర్ వెల్లస్లీ, సేనాపతి లార్డ్ లేక్‌ల పరాక్రమం గొప్పదా? నెహ్రూలాంటి జాతీయ నాయకులూ, వారికి పరమప్రమాణమైన విదేశీ చరిత్రకారులూ నమ్మినట్టు - తెల్లవారి అధునాతన శాస్త్ర, సాంకేతిక ఆధిక్యానికి, అత్యాధునిక రణ నైపుణ్యానికి బావిలో కప్పల్లాంటి భారతీయుల పురాతన పద్ధతులు సమ ఉజ్జీకాలేకపోయినందువల్లే భారతదేశం విదేశీయుల వశమైందా?

కాదు. రెండు దశాబ్దాల కిందటి వరకూ శత్రువులు తేరిపారచూడలేనంత దుర్నిరీక్ష్యంగా ప్రకాశించి, విదేశీయులను అవలీలగా జయించిన మరాఠాలు 1803లో అదే విదేశీయులను గెలవలేక కూలబడటానికి పాశ్చాత్య మేధావులు, వారి భారతీయ మద్దతుదారులు చెప్పే వేవీ అసలు కారణాలు కావు. సంఖ్యాపరంగా గాని, ఆయుధ పాటవంలోగాని, సైనిక పరాక్రమంలో గాని మరాఠా బలగాల ముందు ఇంగ్లీషు సేనలు ఎందుకూ కొరగావు. జనరల్ వెల్లస్లీ అనంతర కాలంలో నెపోలియన్‌తో తలపడి విశ్వవిఖ్యాతుడైనా రెండో మరాఠా యుద్ధంలో అతడు పన్నిన వ్యూహం, సేనలను నడిపిన తీరు సాదా సీదావే తప్ప గొప్పగా చెప్పుకోదగ్గవి కావని విదేశీ యుద్ధ నిపుణులే అంగీకరించారు. ఇంగ్లీషువారి దగ్గర ఉన్నవాటికంటే దిట్టంగా... ఫ్రెంచివారు తర్ఫీదు ఇచ్చి తీర్చిదిద్దిన విదేశీ తరహా బెటాలియన్లు మరాఠాల దగ్గరా ఉన్నాయి. వాటి పేరు చెబితేనే బ్రిటిషు వారికి హడలు. ఇలాంటి హంగులెన్నో ఉండి కూడా తమకున్న దానిలో పదోవంతు బలం లేని ఆంగ్లేయుల ముందు

మరాఠాలు బలాదూరు అయ్యారంటే ముఖ్య హేతువు ఒక్కటే:

నానా ఫడ్నవిస్ లేడు!

ఘన విజయం సాధించిన 1781 యుద్ధకాలంలో మరాఠా మంత్రాంగాన్ని నానా నడిపిస్తున్నాడు. ఘోర పరాజయం ప్రాప్తించిన రెండో యుద్ధం నాటికి అతడు అస్తమించాడు. నానాయే బతికి ఉంటే కత్తి దూసో, తుపాకీ పట్టో రణరంగాన వీరవిహారం చేసి దిగ్విజయం సాధించి పెట్టేవాడని కాదు. నానా శూరుడు కాదు. జన్మలో అతడు ఏ యుద్ధం చాయలకూ పోయి ఎరుగడు.

మరి అలాంటివాడు లేకపోయినందువల్ల మరాఠాలు నష్టపోయిందేమిటంటారా? నానా ఫడ్నవిస్ వీరుడైతే కాదుగాని మంత్రాంగంలో అపరచాణక్యుడు. అతడికి వెయ్యికళ్ళు. అతడి గూఢచారి వ్యవస్థ ఎంత గొప్పదంటే – పుణెలో కూచునే దేశమంతటా ఏ రాజ్యంలో ఏమి జరుగుతున్నదీ, ఎవరు ఏమి చేస్తున్నదీ, ఏమి చేయబోతున్నదీ అందరికంటే ముందే ఎప్పటికప్పుడు అతడు తెలుసుకోగలిగేవాడు. విరోధుల కదలికలను, కుట్రలను ముందే పసిగట్టి, గట్టి ప్రతి చర్యలతో రాజ్యాన్ని రక్షించుకునేవాడు.

అతడు లేకపోతే మాత్రమేమి? రాజ్యాన్ని రక్షించేందుకు భారీ సైనిక బలగాలు, దుర్భేద్యమైన దుర్గాలు, కొల్లలుగా ఆయుధాలు ఉన్నాయి కదా? ఉన్నాయి. కాని ప్రయోజనమేమిటి? దేశంలో మరెవరికీ లేనంత భారీగా సైనిక బలగాలు ఉన్నా, ఆ బలగాలను నడిపించేవారినే తెల్లవారు తెలివిగా లోబరుచుకున్నారు. కంచుకోటలు ఎన్నో ఉన్నా వాటిని కాపాడవలసిన వారినే శత్రువులు ప్రలోభాలతో తమవైపు తిప్పుకున్నారు. మేరికల్లాంటి సర్దార్లు ఎందరో ఉన్నా వారిలో వారికే విరోధులు తంపులు పెట్టి, ఒకరితో ఒకరిని కలవకుండా విడదీసి, ఆఖరికి అందరి నెత్తినా చెయ్యి పెట్టారు. ఇంగ్లీషు వారు తమకు మిత్రులనీ... మైత్రీ ఒప్పందం కుదుర్చుకున్నారు కనుక వారు తమకు హాని చేయరనీ అమాయకంగా నమ్మి మరాఠా ప్రముఖులు ఆదమరచి ఉండగా, వారితో శుష్కప్రియాలు పలుకుతూనే 'కంపెనీ' రాయుళ్లు వారిని నిర్వీర్యం చేసేందుకు చడీచప్పుడు కాకుండా పాతాళ హోమం సాగించారు. ఫోర్జరీలు చేసి బనాయింపు పత్రాలతో ముఖ్యుల మధ్య పేచీలు తెచ్చి... లంచాలు పెట్టి సేనా నాయకులను, దుర్గ సంరక్షకులను బుట్టలో వేసి... లేనిపోని ఆశలు చూపి బయటి రాజ్యాల వారిని తటస్థం చేసి, మరాఠాలకు ఎటునుంచీ సాయం అందకుండా బిగదీసి... ఎవరికి చెప్పాల్సిన మాయమాటలు వారికి చెప్పి అందరినీ మభ్యపెట్టి.... బహు జాగ్రత్తగా రంగం సిద్ధపరిచాక అదను చూసి పంజా విసిరారు. నలువైపుల నుంచి భీషణ సంగ్రామం మొదలెట్టి మరాఠాలను ఉక్కిరిబిక్కిరి చేశారు. నానాయే బతికి ఉంటే ఈ ఆటలు సాగేవి కావు. ఇంగ్లీషు వారి కుట్రలూ కూహకాలు ఏవీ చారచక్షువైన నానా కంటిని కప్పగలిగేవి కావు. మరాఠా సామ్రాజ్యాన్ని వెల్లస్లీ నాశనం చేయడానికి ముందే వెల్లస్లీ ఎత్తులను, అతడి ఆస్థానంలోని తన వేగుల ద్వారా పసిగట్టి నానా పైఎత్తులు వేసి ఉండేవాడు. అతడి అనంతరం అంతటి రాజనీతిజ్ఞుడు ఎవరూ మరాఠాల్లో లేకపోవటంతో తెల్లవారి పంట పండింది.

అర్ధశతాబ్దం కింది ప్లాసీ యుద్ధంలో మీర్జాఫరును లోబరుచుకుని సిరాజుద్దౌలా సైన్యాలను తమవైపు తిప్పుకుని, ఒళ్లు అలవకుండా గెలిచినట్టే... నాలుగేళ్ల కింద శ్రీరంగపట్నం దుర్గ రక్షకులచేత స్వామిద్రోహం చేయించి టిప్పుసుల్తానును వేటు వేసినట్టే... మరాఠా మలి



యుద్ధంలోనూ ఇంగ్లీషువారు నీచపు పన్నాగాలతో, వెన్నుపోట్ల విద్రోహాలతో, సిగ్గుచేటు విజయం సంపాదించారు. దీనికి రుజువులకోసం ఎక్కడి దాకానో పోనక్కరలేదు. ఆకాలంలో 'కంపెనీ' దొరల మధ్య నడిచిన ఉత్తర ప్రత్యుత్తరాలే చాలు.

మరాఠా రాష్ట్ర కూటమికి పీష్వా అధిపతి. సింధియా, హోల్కర్, గైక్వాడ్, బేరార్‌లు దానికి నాలుగు స్తంభాలు. మరాఠా శక్తిని మట్టుపెట్టే వ్యూహంలో భాగంగా పీష్వాను దొరలు అప్పటికే కుక్కను చేసి ఆడిస్తున్నారు. బరోడాలో గైక్వాడ్ రాజ్యాన్ని అంతకుమునుపే తమకు తొత్తును చేసుకున్నారు. పీష్వా కాళ్లకింద మంట పెట్టటం కోసం హోల్కర్‌తో లోపాయకారీగా లాలూచీ అయి పుణె మీదికి దండెత్తించారు. పీష్వా బాజీరావు తమతో కాళ్లబేరానికి వచ్చాక కీలుబొమ్మను చేసి అతడిని పుణె గద్దెపై కూర్చుండబెట్టాక హోల్కర్ మళ్లీ పోయి సింధియా, బేరార్ రాజులతో ఎక్కడ చేతులు కలుపుతాడో... ముగ్గురు కలిసి తమ కొంప ఎక్కడ ముంచుతారోనని తెల్లవారికి భయం పట్టుకుంది. అలాంటి ప్రమాదం రాకుండా హోల్కర్‌ను విడతీయటంకోసం ఆర్థర్ వెల్లస్లీ 1803 జులై 16న యశ్వంతరావుకు ఇలా తేనె లొలికే జాబు రాశాడు.

"మీ వద్ద నుండి జాబును బడయు భాగ్యము నాకు కలిగి చాలా కాలమైనది. కంపెనీ వారికి, మీకు మధ్యగల సఖ్యమును పెంపొందించుకొనవలెనని నేను ఆరాట పడుతున్నాను. మా కంపెనీ వారికి, పీష్వా బాజీరావు గారికి ఇటీవల జరిగిన బేసెన్ సంధి పత్రపు నకలు దీని వెంట పంపుచున్నాను. దీనివల్ల ఇండియా యొక్క శాంతి భద్రతలకు స్థిరత్వమేర్పడినదని మీకే తెలియగలదు...కాబట్టి ఇతరులేమి చేసినను చేయుదురు గాక. మీరు మట్టుకు మీ శ్రేయమునకు అనుకూలముగనే ప్రవర్తించుచు, కంపెనీ వారితోడి సఖ్యమును కొనసాగించుచునే యుందురని నాకు గట్టి నమ్మకము గలదు. ఈ ఉత్తరమును మీకు అందజేస్తున్న వ్యక్తి నాకు అంతరంగికుడు. నా మనసులో ఉన్న దానిని అతడు మీకు సమస్తము విప్పిజెప్పగలడు."

(బ్రిటిష్ మహాయుగము అను. మానికొండ సత్యనారాయణశాస్త్రి ప్రథమ సంపుటం పే 375)

ఇలా సమ్మోహనాస్త్రం వేసి, దూత ద్వారా ఇచ్చకాలు పలికించి, సింధియాను ఒగ్గేస్తే నీకెంతో లాభం చేస్తామని రకరకాల ఆశలు పెట్టి హోల్కర్ చేతులు కట్టేశారు. తియ్యని వాగ్దానాలతో తామెంత లాలించినా మరాఠా సంఘీభావం ప్రకోపించి హోల్కర్ ఎక్కడ తోక జాడిస్తాడోననీ ఇంగ్లీషు మాయావులు శంకించారు. ఒకవేళ అతడలాంటి "అఘాయిత్యం" చేసినా తమకు ఇబ్బందీ లేకుండా ఉండాలంటే ఏమి చేయాలి? బనాయింపుల్లో రామప్పంతులు ముత్తాతలైన కంపెనీవారు ఈ బెడద నివారించటంకోసం అర్జంటుగా ఫోర్జరీకి ఒడిగట్టారు. హోల్కర్‌ను కలుపుకొని ఇంగ్లీషు వారిపై దండెత్తుదామనీ, వారి పీడ వదిలాక హోల్కర్ భరతం పడదామనీ పీష్వా బాజీరావుకు దౌలత్‌రావు సింధియా రాసినట్టుగా ఒక ఉత్తరం పుట్టించి దాన్ని హోల్కర్‌కు చేరవేశారు. అది చూసి హోల్కర్ అగ్గిరాముడయ్యాడు. అయినా ఆంగ్లేయుల అనుమానపు కళ్లు చల్లబడలేదు. హోల్కర్ ఎన్నటికీ తమకు ప్రమాదకారి కాకుండా హోల్కర్‌కు కుడిభుజమైన వాడినే లాగి పడేస్తే పోతుంది కదా – అనుకున్నారు. ఈ "ముందు చూపు"తో హోల్కర్‌కు సేనా నాయకుడైన అమీర్‌ఖాన్‌తో కంపెనీ వారు రహస్య బేరాలు చేశారు. స్వామి ద్రోహంచేసి అతడు తన చేతిలోని 25 వేల సేనతో చీలి

వచ్చేట్టు; అతడిని కంపెనీ తొత్తు అయిన నైజాం తన కొలువులో చేర్చుకునేట్టు; ఆ సేనకయ్యే ఖర్చులో సగం కంపెనీవారు భరించేట్టు అంగీకారం కుదిరింది. దీనివల్ల హోల్కర్ బలం క్షీణించే మాట ఎలా ఉన్నా అమీర్‌ఖాన్ మీద అతడికి నమ్మకమైనా పోయి డీలాపడతాడు కదా అని దొరలు ఆశించినట్టు 1803 మే 3న హైదరాబాద్ రెసిడెంటుకు జనరల్ వెల్లస్లీ రాసిన లేఖ చెబుతుంది.

"I have received several letters from Colonel Stevenson upon the subject of the negotiation between the officers of the Government of His Highness the Nizam and Meer Khan, to take that Chief into His Highness' Service... Whatever may be Meer Khan's numbers, His Highness should take them into pay... the very circumstance of the purchase of the service of a Chief... of such repute and much in the confidence of Jeswunt Rao Holkar, will certainly shake the general confidence of his army..."

[*Rise of the Christian Power in India,* **B.D.Basu,** ***P.441***]

(అమీర్‌ఖాన్‌ను నైజాం నవాబు కొలువులోకి తీసుకునే విషయమై నిజాంగారి అధికారులకూ అతడికీ మధ్య నడుస్తున్న మంతనాల గురించి కర్నల్ స్టీవెన్సన్ నాకు అనేక లేఖలు రాశాడు. అమీర్‌ఖాన్ వెంట వచ్చే సేనల సంఖ్య ఎంతైనా, అందరినీ నైజాం ప్రభువు తీసుకోవటం మంచిది... యశ్వంతరావు హోల్కర్‌కు చాలా విశ్వాసపాత్రుడైన అంత పెద్ద సేనా నాయకుడి సేనలను కొనుగోలు చేశామంటేనే హోల్కర్ సైన్యానికి స్థైర్యం చెదిరిపోతుంది.)

ఒక చెంప హోల్కర్ కాళ్లు లాగటానికి ఇలా ఎత్తులు వేస్తూనే పైకి మెరమెచ్చులతో హోల్కర్‌కు భ్రమలు కొలిపి, తటస్థుడిని చేసి మరాఠా శక్తికి మూలస్తంభమైన సింధియా మీద, అతడికి బాసటగా ఉన్న బేరార్ భోంస్లే మీద కంపెనీవారు వాటం చూసి యుద్ధం ప్రకటించారు.

సింధియా పీచమణచే క్రమంలో మొదటి దాడి అహ్మద్‌నగర్‌పై జరిగింది. అది మరాఠాలకు కంచుకోట. దానిని జయించటం బ్రహ్మతరం కాదని అందరూ అనుకునేవారు. బురుజులు, ప్రాకారాలు ఎంత దుర్భేద్యమైనా వాటిని రక్షించేది మనిషే కదా? దుర్గరక్షణకు సింధియా నియమించింది యూరోపియన్ అధికారిని. అతడిని 'కంపెనీ' వారు ముందే కొనేశారు. ఇంగ్లీషు సేనలు రాగానే అతడు చేతులెత్తేశాడు. దుర్భేద్యమనుకున్న కోట పెద్దగా కష్టపడవలసిన అవసరం లేకుండా విదేశీయులకు కైవసమైంది. జనం తమపై ఎక్కడ తిరగబడతారోనని, బాజీరావు పీష్వాగారి పురమాయింపుపైనే, ఆయన ప్రతినిధులుగానే తాము కోటను స్వాధీనపరచుకుంటున్నట్టు మొదట చాటింపు వేశారు. గెలుచుకున్న దానిలో వాటా ఇవ్వటం దగ్గరికి వచ్చేసరికి పీష్వా నోట దుమ్ము కొట్టి అంతా మాదే పొమ్మన్నారు.

తొలి మరాఠా యుద్ధానంతరం మధ్యవర్తిత్వం వెలిగించి 'కంపెనీ' వారితో మాధవరావు సింధియా సరాగాలాడిన సమయంలో వారన్‌హేస్టింగ్స్ దుర్బోధ చేసి సింధియా సైన్యంలో యూరోపియన్ ఆఫీసర్లను చొప్పించాడు. వారు కనుక నీ దగ్గర ఉంటే నీ సేన పాశ్చాత్య



ఫాయాలో దివ్యంగా వెలిగిపోతుందని నమ్మించాడు. విదేశీ యుద్ధ పద్ధతుల మీద సింధియాకు మోజు ఉంటే సైనిక పాఠశాల పెట్టి విదేశీయుల చేత తన సైనికులకు తర్ఫీదు ఇప్పించి, అన్ని కీలక స్థానాల్లో తన వారినే నియమించి ఉండాల్సింది. మాధవరావు ఆ పని చేయకుండా కిరాయికి వచ్చిన విదేశీయులకే పెత్తనం అప్పగించాడు. అదే ఇప్పుడు దౌలత్‌రావు కొంప ముంచింది. సింధియా సైన్యంలోని యూరోపియన్లు తమలో చేరితే అక్కడ వారికి ఇస్తున్న జీతం, హోదా తామూ ఇస్తామని యుద్ధపు అదనులో కంపెనీ వారు ప్రకటించారు. దాంతో చాలామంది ఇంగ్లీషువారు 'దేశభక్తి'తో సింధియాను వదిలిపోయారు. పోక మిగిలిన యూరోపియన్లు కంపెనీ వారితో కుమ్మక్కయి యుద్ధ రంగంలో ద్రోహం చేసి యజమానిని నట్టేటముంచారు.

రెండో మరాఠా యుద్ధంలో చరిత్రాత్మకమైన అస్సాయి కదనరంగాన జనరల్ వెల్లస్లీ చెప్పిన లెక్కల ప్రకారమే ఆయన వైపున 8000 సైనికులు, 17 ఫిరంగులు ఉండగా సింధియా పక్షాన 50 వేల సేన, 128 ఫిరంగుల ఉన్నాయట. అయినా గెలిచింది ఇంగ్లీషువారే! చేతిలో ఫిరంగులు ఉన్నా వాటిని ప్రయోగించి శత్రువులను వేటాడాలన్న ధ్యాస కిరాయి యూరోపియన్లకు లేకపోయింది. ప్రాణ నష్టం భారీగా జరిగినా సింధియా వైపున ఒక్క యూరోపియను కూడా చావలేదు. దీన్నిబట్టే విద్రోహం ఏ స్థాయిలో జరిగిందో ఊహించవచ్చు.

విశ్వాస ఘాతకానికి కేవలం తెల్లవారినే నిందించి ప్రయోజనం లేదు. ద్రోహం చేయటంలో నల్లతోలు వారూ తక్కువ తినలేదు. ఉదాహరణకు బేగం సమ్రూ అనే జాగీర్దారిణి సింధియా పక్షాన ఉన్నట్టు నటించి 'కంపెనీ'తో కుమ్మక్కు అయింది. అస్సాయి యుద్ధంలో ఆమెకు చెందిన నాలుగు బెటాలియన్లు పాల్గొన్నాయి. చోద్యం చూశాయే తప్ప ఒక్క తూటా కూడా అవి పేల్చలేదు.

"Begum Sumroo has long evinced a desire to be taken under the protection of the English... Four of her batallions are now with Sindhia... but if a rupture actually takes place, means might be contrived to enable those batallions to join General Wellesley" (బేగం సమ్రూ మన రక్షణ పొందాలని చాలాకాలంగా కోరుకుంటున్నది. ఆమె బెటాలియన్లు నాలుగు సింధియా దగ్గరి ఉన్నాయి. యుద్ధం వస్తే వాటిని జనరల్ వెల్లస్లీ పక్షాన చేరేట్టు చేయవచ్చు) అని 1803 జూలై 13న లార్డ్‌లేక్ గవర్నర్ జనరల్ చెవిని వేసిన దానిబట్టి ఇందులో మతలబు అర్థమవుతుంది.

దక్కనులో జరిగిన ద్రోహమే కీలకమైన ఉత్తరాదినా జరిగి సింధియా సామ్రాజ్యం పేకమేడలా కూలిపోయింది. గంగ, యమున నదుల మధ్య సింధియా ఏరికోరి నిలిపిన సేనాపతి ఫ్రెంచివాడు. పేరు పెర్రాన్. అతగాడూ ఇంగ్లీషు వారితో ముందే మాట్లాడుకున్నాడు. తన ఆస్తులు, ఇంగ్లీషు వారిచ్చిన లంచాలు ఇంగ్లీషు బ్యాంకుల్లో నెమ్మదిగా జమచేసుకున్నాడు. మన ప్రతాపానికి ఎదురులేదు; ఇంగ్లీషు వారిని ఇట్టే కాలరాచేస్తాం అని సింధియాకి చివరి నిమిషం దాకా భరోసా ఇచ్చి, తన చేతిలోని రెండు బెటాలియన్లను సమయానికి అందుబాటులో ఉండకుండా ఆగ్రా పంపేశాడు. లార్డ్‌లేక్ సేన అలీగఢ్ కోటను చుట్టుముట్టగానే ముందు ఒప్పందం ప్రకారం పళ్లెంలో పెట్టి కోటను అప్పగించి, పరారై ఇంగ్లీషు వారి శరణుజొచ్చాడు. (వృత్తి ధర్మానికి ద్రోహం చేసిన కారణంగా అతడి ముఖం

చూడటానికి నెపోలియన్ నిరాకరించాడు.)

*India under Wellesley* గ్రంథంలో **P.E. Roberts** అన్నట్టు "The conduct of this traitor assured the English the supremacy of Hindustan" (ఈ ద్రోహి చేసిన పనివల్లే ఇంగ్లీషువారికి హిందుస్తాన్‌పై ఆధిపత్యం దక్కింది). ఢిల్లీలో కమాండరుగా ఉన్న ఇంకో పరాసువాడు బౌర్ క్విన్ కూడా పెర్రాన్ చూపిన మార్గంలో నడిచి ఇంగ్లీషు సేనల అలికిడి వినగానే పరుగునపోయి లొంగిపోయాడు. అటు అలీగఢ్‌లోనూ ఇటు ఢిల్లీలోనూ, ఆనక ఆగ్రాలోనూ సింధియా పక్షాన భారతీయ సైనికులు వీరోచితంగా పోరాడారు. వారి అద్భుత శౌర్యాన్ని బ్రిటిష్ సేనానులే తెగ మెచ్చుకున్నారు. కాని ఏమి లాభం? కిరాయి విదేశీయుల ద్రోహంవల్ల అప్పటికే పరిస్థితి చేయిదాటిపోయింది. భారతీయుల పరాక్రమమంతా వ్యర్థమైంది.

పెర్రాన్ చేసిన మోసం తెలియగానే సింధియా దక్కను నుంచి 14 బెటాలియన్లను హుటాహుటిన ఉత్తరాదికి తరలించాడు. కాని వాటి లోనూ పెద్ద తలకాయలు యూరోపియన్లే. షరా మామూలుగా వారూ పెర్రాన్ దారే పట్టారు. ఢిల్లీ, ఆగ్రాల పతనం తరువాత సింధియాకు మిగిలిన కొద్దిపాటి బలం కూడా లాశ్వాదీ పోరులో తుడిచి పెట్టుకుపోయింది. గుజరాత్, బుందేల్‌ఖండ్, ఒరిస్సాలలోనూ ఇంచుమించుగా అలాగే జరగటంతో శక్తులుడిగిన దౌలత్‌రావు సింధియా 1803 డిసెంబరు 30న యుద్ధం మాని ఇంగ్లీషు వారితో సంధి కుదుర్చుకున్నాడు. గంగ, యమునల మధ్య ఉన్న తన రాజ్యం మొత్తాన్నీ రాజస్థాన్‌లపై పెత్తానాన్నీ, నిజాం మీద మొగల్ చక్రవర్తి మీద హక్కులనూ అతడు 'కంపెనీ'కి వదిలేసుకున్నాడు. 1804 ఫిబ్రవరి 27న బుర్హాన్‌పూర్ సంధిలో పీష్వాలాగే, నిజాంలాగే తానూ తెల్లవారికి తాబేదారు అయిపోయాడు. ఊహించని పరాజయాలతో రఘూజీ భోంస్లే కూడా సింధియా కంటే కొన్ని వారాల ముందే తలకాయ జేబులో పెట్టుకుని ఇంగ్లీషు వారికి లొంగిపోయాడు.

నూరేళ్లు వెలిగిన మరాఠా దీపం అలా కొడిగట్టింది.



# విభజించి ఓడించు

విభజించి పాలించటమే కాదు. విభజించి ఓడించటమూ తెల్లవారికి వెన్నతో పెట్టిన విద్య. ప్లాసీ అధర్మయుద్ధంలో గెలిచి అర్ధశతాబ్దం గడిచాక... కుతంత్రాలతో కుత్సితాలతో విశాల ప్రాంతాలను, అనేక రాష్ట్రాలను క్రమేణా వశపరచుకున్న తరవాత కూడా ఇంగ్లీషువారి సైనిక శక్తి భారతీయుల వెరశి సైనిక వనరుల ముందు ఎందుకూ కొరగాదు. ముఖ్యంగా మరాఠా సమాఖ్య భాగస్వాములందరూ కనీసం 19వ శతాబ్ది మొదట్లో ప్రాప్తకాలజ్ఞతతో ఏకమైవున్నా ఉమ్మడి విదేశీ బెడదను అవలీలగా ఎదుర్కోగలిగేవారే. దురదృష్టవశాత్తూ వారందరూ తెల్లవాడి మాయలో పడ్డారు. హోల్కర్‌ను ప్రయోగించి, పీష్వాను కీలుబొమ్మగా మార్చాక ఆ ఇద్దరినీ వేరుపరిచి ఇంగ్లీషువారు సింధియా, భోంస్లేలను మాయాయుద్ధంలో ఓడించారు. వారి అడ్డు తొలిగాక కపట మైత్రి చాలించి హోల్కర్ పని పట్టారు. చివరికి పీష్వాను ఎడమ కాలితో తన్నేసి మొత్తం సామ్రాజ్యానికి తామే సార్వభౌములం పొమ్మన్నారు.

ఇంగ్లీషు వారితో విడివిడి యుద్ధాల్లో మరాఠా యోధులు గొప్ప పరాక్రమమే చూపారు. కాని ఒకరు పోరాడుతున్నప్పుడు మిగతావారు చెయి కలపకుండా మిన్నకుండటంతో ఆ ఒక్కరినీ విదేశీయులు విధంచెడ్డా గెలవగలిగారు. మంట తమ కాళ్లకిందికి వచ్చాక మిగతా వారు ఒకరొకరే నిర్లిప్తత వీడి పోరాడినా, ఎటునుంచీ సహాయం అందకపోవడంతో ఒంటరి పోరులో ఓటమి అనివార్యమైంది. అనైక్యత తెచ్చిన అనర్థం అవగతమయ్యేసరికే పరిస్థితి చెయిదాటిపోయింది.

తెల్లవాళ్లు, సింధియా సుందోపసుందుల్లా కలహించుకుంటూంటే తాను తమాషా చూసి, పరిస్థితినిబట్టి ఎటు మొగ్గాలో, ఏమి చేయాలో నిర్ణయించుకోవాలని యశ్వంతరావు హోల్కర్

తలిచాడు. కంపెనీ దొరలు అతడికి అంత సావకాశం ఇవ్వలేదు. దేశంలో తిరుగులేనిదనుకున్న సింధియా సైనిక శక్తిని ఎక్కడికక్కడ విద్రోహ తంత్రాలతో తూట్లు పొడిచి సింధియాను కాళ్లబేరానికి అతివేగంగా రప్పించుకున్న వెనువెంటనే హోల్కర్‌పై వక్ర దృష్టి సారించారు. అంతదాకా యశ్వంతరావును తమకు ఆప్తమిత్రుడని ప్రకటించి, ఇచ్చకాలు పలుకుతూ వచ్చిన గవర్నర్ జనరల్ వెల్లస్లీకి సదరు యశ్వంతరావు తన సోదరుడు కాశీరావును తోసివేసి గద్దెనాక్రమించిన వైనం హఠాత్తుగా గుర్తుకొచ్చింది. దగాపడ్డ కాశీరావు న్యాయబద్ధ అధికారాన్ని నిలబెట్టే మిషతో యశ్వంతరావును వేటాడటానికి వెల్లస్లీ కత్తులు నూరసాగాడు. యశ్వంతరావు ఫలానా ఫలానా తప్పుడు పనులుచేసి రెచ్చగొట్టటంవల్లే బ్రిటిష్‌వారు ఆగ్రహించారనీ, అతడు బుద్ధిగా ఉంటే ఏ గొడవా ఉండేది కాదనీ మన చరిత్రకారులు చాలామంది నమ్మకంగా చెబుతారు. నిజానికి వారన్న ధిక్కారాలకు అతడు పాల్పడటానికి చాలా నెలల ముందే దొరలు అతడిని హిట్‌లిస్టులో చేర్చారు. "unless we make war upon Holkar... we shall not succeed in driving the Marhattas entirely from these countries, although Scindhia should cede his rights" (సింధియా తన హక్కులను మనకు వదిలేసుకున్నప్పటికీ ఈ ప్రాంతాల నుంచి మరాఠాలను పూర్తిగా గెంటివేయటం హోల్కర్‌తో యుద్ధం చేస్తే గానీ సాధ్యపడదు) అని 1803 సెప్టెంబరు 12నే జనరల్ వెల్లస్లీ తన అన్నగారికి జాబురాశాడు.

సింధియా విషయంలో చేసినట్టే హోల్కర్‌నూ దొరలు మాయమాటలతో మభ్యపెట్టి, చుట్టూతా సేనలను మోహరించాక, మైత్రి ముసుగు లాగేసి షరామామూలు కుతంత్రాలతో పడగొట్టేవారే. మామూలుగా అయితే హోల్కర్ వారి బుట్టలో పడేవాడేమో. కాని, సింధియా అనుభవం చూశాక అతడు జాగ్రత్తపడ్డాడు. సింధియా వలె చివరి క్షణం దాకా ఏమరి వుండకుండా, రానున్న ప్రమాదం గ్రహించి, బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా పెద్దఎత్తున ఐక్య సంఘటన కట్టదలిచాడు. ధర్మానికి, జాతికి దాపురించిన ముప్పును ఎదుర్కోవడానికి కలిసి రావలసిందిగా జైపూర్, జోధ్‌పూర్, ఉదయపూర్ రాణాలకూ, రంజిత్‌సింగ్ లాంటి సిక్కు నాయకులకూ రాయబారాలు పంపాడు. సింధియా సేనలోని యూరోపియన్ దళవాయిల చేత కుట్ర చేయించి సింధియాను దెబ్బతీసిన కుత్సితాన్నే హోల్కర్ మీదా ప్రయోగించాలని కంపెనీ దొరలు తంటాలు పడ్డారు. ఆ ప్రమాదాన్ని యశ్వంతరావు ముందే గుర్తించి తన సైన్యంలో కంపెనీ పంచమాంగదళంగా పనిచేస్తున్న ముగ్గురు ఇంగ్లీషు అధికారులను (ఆ కాలంలో అందరూ అనుసరించిన సైనిక ధర్మ ప్రకారం) చంపేశాడు. ఇంగ్లీషువారు తనతో రాజీ కోరుతున్నా మని అన్నప్పుడు - వారితో సైనిక ఒప్పందానికి సంసిద్ధత తెలుపుతూనే - పూర్వం నుంచీ తన కుటుంబానికి కొన్ని రాజ్యాలపై ఉన్న 'చౌథ్' హక్కును గుర్తించాలనీ, తమనుంచి గుంజుకున్న ప్రాంతాలను తిరిగి తనకు అప్పగించాలని నిష్కర్షగా పట్టుబడ్డాడు. అది కుదరదు పొమ్మని బ్రిటిష్ సేనాపతి లేక్ తూష్ణీకరిస్తే "నాతో పెట్టుకుంటే అనేక వందల క్రోసుల దూరంలో వున్న ప్రాంతాలను కూడా వదలకుండా వెంటపడి మీ రాజ్యాలు కొల్లగొడతా. మీ ఊళ్లు తగలబెడతా. సముద్రపు అలల్లా నా సేనలు విరుచుకుపడి లక్షల మందిని ముప్పతిప్పలు పెడతాయి జాగ్రత్త" అని చరిత్రాత్మకమైన హెచ్చరిక చేశాడు.

వట్టి వీరాలాపాలే కాదు. నిజంగానే అంతపనీ చేశాడు కూడా.

యశ్వంతరావుహోల్కార్‌కు నికరమైన రాజ్యం, న్యాయబద్ధ అధికారం లేకపోయినా



అతడి చేతిలో మిడతల దండులాంటి సేనలు ఉన్నాయి. సింధియా, భోంస్లేలు కంపెనీవారికి లొంగిపోయి సైనిక బలగాలను కత్తిరించేసుకోవటంతో పనిలేకుండాపోయిన సైనికులు పెద్ద సంఖ్యలో హోల్కర్ శ్రేణుల్లో చేరారు. ఎనభైవేలకు పైగా అశ్వబలంతో, లెక్కలేనంత కాల్బలంతో, వందలాది ఫిరంగులతో యశ్వంతరావు చెలరేగి బ్రిటిష్ మహాసేనానులకు ముచ్చెమటలు పట్టించాడు. హోల్కర్ తమ ముందు, చిట్టెలుక అనీ, అతడితో పోరు పాలెగాళ్లతో యుద్ధం లాంటిదేననీ, ఒక పట్టుపడితే చాలు అతడిని ఇట్టే - మహా అయితే పక్షం రోజుల్లో - గుటుక్కుమనిపించేస్తామని మిడిసిపడ్డ దొరల అంచనాలు తల్లకిందులయ్యాయి. 1804 జూన్ 5న తీరికూర్చుని వారు ప్రకటించిన యుద్ధం అనేక పక్షాలు, అనేక మాసాలు గడిచి ఆఖరికి కాలండరే మారినా ఇంకా భీకరంగా సాగుతూనే ఉంది. "I never was so plagued as I am with this devil" (ఈ పిశాచం బారిన పడ్డట్టుగా నేను జన్మలో ఎన్నడూ అవస్థ పడలేదు) అని ఘనత వహించిన బ్రిటిష్ కమాండర్-ఇన్-చీఫ్ లార్డ్ లేక్ దొరే జైపూర్‌లో మొత్తుకున్నాడు.

చరిత్రకెక్కిన కర్నల్ మాన్సన్ పరాభవం సరేసరి. ముకుంద్రా కనుమ గుండా రాజస్థాన్‌లో చొరబడి హోల్కర్ పీచమణచడానికి ఐదు బ్రిగేడ్ల భారీ బలగంతో ఈ దొర ఆర్భాటంగా కదిలాడు. రెండు నెలలు యుద్ధంచేసినా హోల్కర్‌ను గెలవలేక, కాళ్లు ఒణికి తోక ముడిచి పలాయనమై మొత్తం ఐదు బ్రిగేడ్లనూ నష్టపోయి, భారీ ఫిరంగులను దారిలోనే వదిలేసి చావు తప్పి కన్ను లొట్టపోయిన స్థితిలో ఆగ్రాకు మరలి వచ్చాడు.

అది ఇండియాలో బ్రిటిష్ సైన్యానికి జరిగిన అతి పెద్ద శృంగభంగం. అజేయమనుకున్న బ్రిటిష్ సైనిక బలానికి పట్టిన ఆ దుర్గతికి పాశ్చాత్య ప్రపంచం యావత్తూ నివ్వెరపోయింది. "I tremble at the political consequences of that event" (ఆ దుర్ఘటన వల్ల రాగల రాజకీయ పర్యవసనాలను తలచుకుంటే నాకు వొణుకు పుడుతున్నది) అని జనరల్ వెల్లస్లీ అంతటివాడే లబలబలాడాడు. ఈ సిగ్గుచేటు పరాభవం తెచ్చిన నగుబాటు నుంచి బయటపడి హోల్కర్‌ను ఎలాగైనా పీచమణచడానికి కమాండర్ ఇన్ చీఫ్ లేక్‌ను సకల శక్తులూ ఒడ్డి స్వయంగా రంగంలోకి దిగమన్నారు.

లేక్ గొప్పవాడే. అద్భుత విజయాలను సాధించగలవాడే. కాని వాటిని సాధించాలంటే శత్రుపక్షంలో కమాండర్లు తన మాట వినే వారైతే భేషుగ్గా ఉంటుందని ఆయన ఊహ. ఆ దొర ఆరితేరిన సైనిక కూహకాలకు ఆస్కారం లేకుండా తన సేనలో ద్రోహం అనుమానం తోచిన యూరోపియన్ అధికారులను హోల్కర్ ముందే చంపాడు. దాంతో అతడిని ఎట్టకేలకు ఓడించటానికి లేక్ దొర చాలా కష్టపడవలసి వచ్చింది. ఢిల్లీ, డీగ్ సంగ్రామాల్లో లేక్‌దే పైచేయి అయింది. ఫరూఖాబాద్‌లో నేరుగా హోల్కర్‌నే అతడు ఓడించాడు. ఈ పరాజయాలతో డీలాపడ్డ హోల్కర్ భరత్‌పూర్ ప్రభువైన జాట్ రాజా రంజిత్‌సింగ్ సహాయం అర్థించాడు.

ఆ రాజా మొదట బాగానే తోడ్పడ్డాడు. ఇంగ్లీషు వారితో అంతకు ముందు తనకున్న అవగాహనను జాతీయ ప్రయోజనాల కోసం పక్కనపెట్టి హోల్కర్‌కి అండగా నిలబడ్డాడు. దుర్భేద్యమైన భరత్‌పూర్ కోటను లోపలి నుంచి రంజిత్‌సింగ్ కాపాడుతూండగా వెలుపల హోల్కర్ బ్రిటిష్ సేనలతో తలపడి వీరవిహారం చేశాడు. జి.ఎస్.సర్దేశాయ్ చెప్పినట్టు

"Here now began a furious and heroic struggle which has earned an imperishable epic fame in the annals of India... The place was invested on 7th

January 1805. The siege was given up on 10th April. During these three months a series of determined attacks to carry the place by storm proved of no avail and entailed enormous losses"

[*New History of Marathas*, **G.S.Sardesai**, *Vol.III, p.428*]

(భారతదేశ చరిత్రలో వీరగాథగా వినుతికెక్కిన భీకర యుద్ధం మొదలైంది. 1805 జనవరి 7న ఆరంభమైన ముట్టడి ఏప్రిల్ 10న ముగిసింది. ఈ మూడు నెలల్లో కోటపై విరుచుకుపడటానికి పట్టుదలతో జరిగిన ప్రయత్నాలన్నీ నిష్ఫలమై అపారమైన నష్టాలు వాటిల్లాయి.)

ఈ నష్టాలకు గుండె చెదిరే... వాటి పర్యవసానంగా తనకు రాగల చెడ్డపేరుకు భయపడే గవర్నర్ జనరల్ వెల్లస్లీ "I feel too strong a desire for the early termination of War, even on any terms" (ఎలాంటి షరతులకు అంగీకరించైనా సరే యుద్ధాన్ని త్వరగా ముగించాలని నేను తహతహ లాడుతున్నాను) అని 1805 మార్చి 9న లేక్‌కు లేఖ రాశాడు. గెలవలేని యుద్ధాన్ని ఎలాగైనా చాలించి గౌరవప్రదంగా బయటపడేందుకు దారి ఏమిటా అని ఆలోచిస్తే దొరల బుద్ధికి అద్భుతమైన ఉపాయం స్ఫురించింది. శౌర్యంవల్ల కాని పని దౌత్యంవల్ల నెరవేరింది. రాజా రంజిత్‌సింగ్ వారి వలలో పడ్డాడు. బ్రిటిష్‌వారి శత్రువులతో సంబంధాలు కోసేసుకోవడానికి సమ్మతించి, కంపెనీతో సంధి చేసుకున్నాడు. అతడి అండ పోయాక కూడా తొమ్మిది నెలలపాటు హోల్కర్ పళ్లబిగువున పోరాటం కొనసాగించాడు. సాయపడమని సింధియానూ, సిక్కు సర్కారు రంజిత్‌సింగ్‌నూ, రాజస్థాన్ ప్రముఖులనూ, ఇంకో ఎంతో మందినీ అర్థించాడు. ఒక్కరూ ఆదుకోలేదు. గత్యంతరం లేక 1805 డిసెంబరు 24న (అంటే దొరలు యుద్ధం ప్రకటించి ఏణ్నర్థం గడిచాక) యశ్వంతరావు హోల్కర్ తెల్లవారితో సంధి చేసుకున్నాడు.

కంపెనీతో సైనిక సంధి అనే సాలెగూట్లో చిక్కాక హోల్కర్ గురించి మాట్లాడు కోవలసింది ఏమీలేదు. పరాభవాన్ని భరించలేక అనంతర కాలంలో అతడికి పిచ్చి పట్టింది. ఉన్మాదంలోనే 1811లో తన 35వ ఏట కన్నుమూశాడు. ఎంత భీకరంగా పోరాడినా ఇంగ్లీషువారినైతే గెలవలేకపోయాడు. కాని ఓడిపోయే ఒక రకంగా వారిని యశ్వంతరావు సాధించాడు. అతడిని జయించడానికి ఏణ్నర్థంపాటు వెల్లస్లీ సాగించిన యుద్ధానికి అయిన విపరీతపు ఖర్చునూ, భారీ ప్రాణనష్టాలనూ చూసి సీమ ప్రభువులకు తల తిరిగింది. ముఖ్యంగా భరత్‌పూర్ కోట ముట్టడి మూడువేలకు పైగా ప్రాణాలను బలిగొన్న తీరు, బ్రిటిష్ మహాసైన్యాన్ని ధైర్యంగా ఎదిరించి భారతీయులు కనపరిచిన అద్భుత శౌర్యం బ్రిటిష్‌వారి హృదయాలను కదిలించాయి. వద్దన్నా వినకుండా వెల్లస్లీ సాగిస్తున్న మారణ హోమానికి అందరికీ రోత పుట్టింది. ఎదురుచూసిన లాభాలు రాకపోగా యుద్ధాల పుణ్యమా అని కంపెనీ పీకల లోతున అప్పుల్లో కూరుకుపోవటంతో వాటాదారులు గగ్గోలు పెట్టారు. అమెరికా వలసను కోల్పోయిన నష్టాన్ని ఇండియా ఆక్రమణ ద్వారా భర్తీ చేసుకోవాలని ఉబలాటపడి మొదట్లో వెల్లస్లీకి వత్తాసు ఇచ్చిన ప్రధాని పిట్ కూడా వ్యవహారం చాలా దూరం పోయిందని గ్రహించి, బ్రిటిష్ ప్రజాభిప్రాయానికి తలవంచి వెల్లస్లీని వెనక్కి పిలిపించాడు.



యశ్వంతరావు హోల్కర్‌తో అవ లక్షణాలు ఎన్నో ఉన్నాయి. ఒక దశలో బ్రిటిష్ వారికి పావులా ఉపయోగపడి మరాఠాల మెడకు బ్రిటిష్ సైనిక సహాయం గుదిబండను తగిలించిన పాపంలో అతడికీ వాటా ఉంది. తప్పులు ఎన్నిచేసినా ఒకందుకు మాత్రం అతడికి దేశం రుణపడి ఉండాలి. అతడే కనక అగ్గిపిడుగులా విజృంభించి ఉండకపోతే సింధియా, బేరార్ రాజాలను కాల రాచివేసిన తరవాత వెల్లస్లీ దూకుడుకు పట్టపగ్గాలుండేవి కావు. భరత్‌పూర్ కోటను ఇంగ్లీషువారు ప్రతాపంతో పట్టుకొనగలిగి ఉంటే వెల్లస్లీ బహుకాలం ఇండియాలోనే ఉండి యావత్తు దేశీయ సంస్థానాలపైకి పోయి అన్నిటినీ ఒక్క పెట్టున మింగేసేవాడే. మేము ఇండియానంతా కత్తితోనే జయించామని చెప్పి సీమ ప్రభువులు పేట్రేగేవారే. అమెరికా లాంటి వలస దేశాల్లో చేసినట్టే ఇండియాలో ప్రజలను కూడా కేవలం మృగాలుగా ఎంచి తెల్లవారు బహుశా వేటాడి ఉండేవారే.

మరాఠా సమాఖ్యను వెల్లస్లీ బద్దలుకొట్టిన కాలానికి ఇండియాలో ఏమి జరుగుతోందో, భారతీయులు ఎలాంటి వారో ఇంగ్లీషు ప్రజలకు తెలియదు. వారి గురించి ఇక్కడి వారికీ తెలియదు. ఇరు దేశాల ప్రజల మధ్యా సంపర్కం, సంబంధం ఏమంత లేని స్థితిలో వెల్లస్లీ లాంటివారు విజయగర్వంతో ఎలాంటి అఘాయిత్యాలు చేసినా చెల్లేదే. అమెరికాలో రెడ్ ఇండియన్లకు పట్టిన గతే ఇండియాలో ఇండియన్లకు కూడా పట్టకుండా అడ్డుకుని, బ్రిటిష్ అబోతుల దూకుడును నిలువరించిన వాడు యశ్వంతరావు హోల్కర్. అర్ధశతాబ్దం గడిచాక భారతదేశం మీద ఇంగ్లండు సార్వభౌమాధికారం చేజిక్కించుకోకపోలేదు. కాని డల్‌హౌసీ నాటికి పరిస్థితులు వేరు. ఇంగ్లండు, ఇండియాల మధ్య సంబంధాలు వేరు. భారత ప్రముఖుల చైతన్య స్థాయి వేరు.

రాజ్యకాంక్షతో వెల్లస్లీ తెరపిలేకుండా సాగించిన అనర్థకపు యుద్ధాల సెగ సీమదాకా సోకి గగ్గోలు పుట్టాక బ్రిటిష్ ప్రభువులు రివర్సు గేరు వేశారు. దేశీయ ప్రభువులతో కయ్యాలుమాని, ఎవరి మానాన వారిని కనీసం కొంతకాలం బతకనివ్వాలని నిశ్చయించారు. ఊహించని ప్రతికూలస్థితిలో ఆపద్ధర్మంగా మార్చిన విధానాన్ని ఇండియాలో అమలు జరిపి తమకు మాట దక్కించగల సమర్థుడెవరా అని ఆలోచిస్తే వారికి మళ్లీ కారన్‌వాలిసే కనపడ్డాడు. దశాబ్దంకింద అతడు దేశాధినేతగా ఉన్నప్పటి పరిస్థితినే ఇండియాలో తిరిగి నెలకొల్పే బాధ్యతను అప్పగించి అర్జంటుగా ఓడెక్కించారు. అప్పటికే కారన్‌వాలిస్ ఆరోగ్యం మునగానాం తేలానాంగా ఉంది. అయినా పెద్దవాళ్ల మాట తీసెయ్యలేక సరేనన్నాడు. 1805 జులై 30న ఇండియాలో కాలుబెట్టిననాడే పదవీ బాధ్యత స్వీకరించి పని సీరియస్‌గానే మొదలెట్టాడుగాని రెణ్నెల్లు తిరిగాయో లేదో కారన్‌వాలిస్‌కు భూమిమీద నూకలు చెల్లాయి. అతడికి ఉత్తరాధికారి అయిన సర్‌జార్జి బార్లో, తదుపరి గవర్నర్ జనరల్ లార్డ్ మింటోలు కారన్‌వాలిస్ రూపకల్పన చేసిన రాజకీయ విధానాన్నే అనుసరించి, దేశీయ పాలకులతో గొడవలు పెట్టుకోకుండా గుర్రాన్ని కట్టేశారు.

కంపెనీ కర్రపెత్తనం, అత్తరికం కాస్త నెమ్మదించటం వల్ల ముఖ్యంగా లాభపడ్డవాడు పీష్వా బాజీరావు. అంత సుఖం అతడు జన్మలో ఎరుగడు. నానా ఫడ్నవిస్ ఏమి కొంపముంచుతాడోనన్న భయంగాని, సింధియా, హోల్కర్‌లు ఎప్పుడు పెట్రేగి ఏ సమస్య తెచ్చిపెడతారోనన్న బెంగగాని లేకుండా అతడు పూజలూ పునస్కారాలూ, విందులూ విలాసాల్లో ఖుషీగా గడిపాడు. రెండో మరాఠా యుద్ధం తరువాత కొన్నేళ్లు పరిస్థితి

ప్రశాంతంగానే ఉంది. అధికార పరిధి కుంచించుకు పోతేనేమి, మరాఠా సమాఖ్యలో భాగస్వాములైన రాజ్యాలమీద అదుపు పోతేనేమి... రావలసిన రాబడి సవ్యంగా ముట్టుతూ ఖజానా సమృద్ధిగా ఉన్నంతవరకూ ఫరవాలేదని, కాలం అలా వెళ్లిపోతే చాలునని బాజీరావు తృప్తిపడ్డాడు.

కాని ఆ తృప్తి చిరకాలం మిగలలేదు. మధ్యలో వచ్చిన మంచిబుద్ధి సీమ దొరలకు ఎంతోసేపు నిలవలేదు. మార్క్వ్యాస్ హేస్టింగ్స్ గవర్నర్ జనరల్ అయ్యాక, శకునికి చదువు చెప్పగల ఎల్ఫిన్‌స్టోన్ రెసిడెంటుగా పూనాలో కాలుబెట్టాక పీష్వాకు కష్టాలు మొదలయ్యాయి. మరాఠా సామ్రాజ్య మహావృక్షాన్ని సమూలంగా పెకిలించివేసే ఆఖరి ఘట్టానికి తెరలేచింది.



# అస్తమయ దృశ్యం

**"మహారాజ ప్రాసాదంలో సుఖభోగాలనుభవించిన శ్రీమంత్ పీష్వా ఇప్పుడు అడవుల పాలయ్యాడు. మండుటెండలో ముళ్ల పొదలూ కోసురాళ్ల నడుమ దారి కానక వెదుకులాడుతున్నాడు. గుర్రానికి తిండీతిప్పలూ తానే చూసుకుంటున్నాడు. హంసతూలికా తల్పాల మీద శయనించిన వాడు కటిక నేలమీద తలగుడ్డ పరచుకుని పడుకుంటున్నాడు. చెక్క పాత్రలో అన్నం! ఓ రోజు సూర్యాస్తమయానికి తింటే ఇంకో రోజు అర్ధరాత్రి దాటాక! నమ్మిన సేవకులు ఒకరొకరే జారుకున్నారు. ఏనుగులు, గుర్రాలు, ఒంటెలు, సంపదలు అన్నీ పోయాయి. కనిపించిన వారితో 'ఇదే చివరి కలయిక. దయ ఉంచండి. బతికుంటే మళ్లీ కలుద్దాం' అంటూ కళ్లనీళ్లు తుడుచుకుంటూ సాగిపోతున్నాడు! అహో! బాజీరావుకు ఎంతటి దురవస్థ వచ్చింది! బాలాజీ విశ్వనాథ్ వంశానికి ఎలాంటి గతి పట్టింది!!"**

***New History of Marathas*** గ్రంథంలో జి.ఎస్.సర్దేశాయ్ ఉటంకించిన మరాఠీ జానపద గేయానికి తెలుగు తాత్పర్యమిది. అతిశయోక్తి ఏమీ లేదు. ఇందులో వర్ణించినవన్నీ రాజ్యంపోయి తెల్లవారికి ఎదురు తిరిగిన దశలో బాజీరావు పీష్వా అక్షరాలా అనుభవించిన అగచాట్లే.

బాజీరావును ఎవరూ జాలితలవాల్సిన పనిలేదు. ఈ కష్టాలన్నీ అతడు కోరి కొని తెచ్చుకున్నవే. మరాఠా స్వాతంత్ర్యాన్ని ఈస్టిండియా కంపెనీకి కుదువబెట్టి, దిక్కుమాలిన స్వార్థంకోసం విదేశీ వర్తకుల మూకను ఆశ్రయించి అతడు చేసిన పాపమే శాపమై అతడిని వెంటాడింది. నిజమే. కాని ఎంత అబద్ధపు బతుకు బతికినా, తన జాతి ప్రయోజనాల విషయంలో ఎంత అలసత్వం చూపినా ఇంగ్లీషువారి మీద మాత్రం బాజీరావు ఎనలేని విశ్వాసం చూపాడు. రోజూ కొలిచే దేవుడికంటే ఎక్కువగా బ్రిటిషు వారినే అతడు కడదాకా నమ్ముకున్నాడు. దేశంలో ఇంకెవరూ చేయనంతటి మేలును తెల్లవారికి అతడు చేశాడు. సైనికంగా ఎదురులేని మరాఠా శక్తిని అతడు పళ్లెంలో పెట్టి అప్పగించి ఉండకపోతే భారత

ఉపఖండం ఇంగ్లీషు వారికి అంత తేలిగ్గా వశమయ్యేది కాదు. అంతటి ఉపకారం అతడు చేసినప్పుడు... కోల్పోయిన గద్దెను తనకు తిరిగి సంపాదించిపెట్టారన్న కృతజ్ఞతను మనసారా అతడు చూపినప్పుడు కనీస మానవత్వమనేది ఉంటే అవతలివారు కూడా అతడిపట్ల అంతే అభిమానం కనపరచాలి. మరి ఇంగ్లీషువారు ఏమి చేశారు? కుక్కలా తమ పట్ల విశ్వాసం చూపిన పీష్వాను కుక్కలాగే చూశారు! తమకు సామ్రాజ్యం సంపాదించిపెట్టిన వాడినే అక్కర తీరాక కరివేపాకులా అవతల పారేసి రాజ్యం లాక్కుని వెళ్లగొట్టారు. అంతకుముందూ తరవాతా తమను నమ్ముకున్న వారెందరినో చేసినట్టే బాజీరావునూ నట్టేట ముంచారు.

బాజీరావును వదిలించుకోదలిచాక కంపెనీ వారికి అతడిలో అన్నీ తప్పులే కనిపించాయి. అతడు అసమర్థుడు, అయోగ్యుడు, వ్యసనలోలుడు, విశ్వాస ఘాతకుడు, ప్రజాకంటకుడు అంటూ దొరలు నానా నిందలు మోపారు. బాజీరావు ఒప్పులకుప్ప కాకపోయినా మరీ వారు చిత్రించినంత నీచుడేమీ కాదు. అందుకు దొరల రాతలే రుజువు. ఉదాహరణకు అప్పట్లో బొంబాయి ప్రధాన న్యాయమూర్తిగా ఉన్న సర్ జేమ్స్ మాకింటోష్ ప్రపంచంలో తాను ముగ్గురు గొప్ప ప్రభువులను చూశానంటూ మూడవ జార్జి, నెపోలియన్‌తో బాటు బాజీరావు పేరూ చెప్పాడు. పీష్వా దర్బారులో దీర్ఘకాలం రెసిడెంటుగా ఉండి బాజీరావు నడవడిని వెయ్యి కళ్లతో కనిపెట్టివున్న కర్నల్ బారీ క్లోజ్ సైతం బాజీరావు తమకు చిత్తశుద్ధితో కృతజ్ఞుడై, తమతో స్నేహాన్ని మనసారా కోరుకున్నాడని చెప్పాడు. శ్వేత జాతి దురహంకారం నరనరానా జీర్ణించుకుని బాజీరావుపై విషంగక్కి అడ్డమైన అభియోగాలు మోపిన నాటి దక్కన్ సేనాధిపతి ఆర్థర్ వెల్లస్లీ "I certainly had a bad opinion of the Peishwa... I have no positive proof that he has been treacherous, but I have a strong suspicion of it" (పీష్వా మీద నాకు కచ్చితంగా చెడ్డ అభిప్రాయమే ఉంది... అతడు ద్రోహం చేస్తున్నాడనడానికి నా దగ్గర నికార్సయిన రుజువు ఏదీ లేదు. కాని నాకు బలమైన అనుమానం) అని రాసిన రాతనుబట్టే బాజీరావుపై దొరల నిందా ప్రచారం ఎంత నిరాధారమైనదో అర్థమవుతుంది. వెల్లస్లీ బళ్లో చదువుకుని కుతంత్రాల్లో గ్రంథసాంగుడైన సర్ జాన్ మాల్కోమ్ అంత తేలిగ్గా మోసపోయే ఘటం కాదు. అలాంటివాడు కూడా బాజీరావు బ్రిటిష్ వారితో ఘర్షణ పెట్టుకోకుండా వారి నీడలో చల్లగా బతకాలనే కోరుకుంటున్నట్టు గొడవలు ముదిరి చాలాదూరం వెల్లిన దశలోనే తనపై అధికారుల చెవిన వేశాడు. అయితే మాల్కోంలాంటి వారందరినీ బాజీరావు మహాతెలివిగా బురిడీ కొట్టించాడని ఏ రుజువు చూపకుండా దొరలు మోపిన నిందనే తిరుగులేని సత్యవాక్కుగా మన చరిత్రకారులు ఔదల దాల్చారు.

ఒక దశలో బాజీరావు బ్రిటిష్ వారికి ఎదురు తిరిగి, వారిపై పోరాటానికి సాటి ప్రభువులను కూడగట్టి, పెద్దఎత్తున సేనలు సమీకరించిన మాట యథార్థమే. పుణెలోని బ్రిటిష్ రెసిడెన్సీని తగలపెట్టి బాహాటంగా దాడికి దిగిన సంగతీ నిజమే. అది చిరకాలంగా పట్టిన ఓరిమి యావత్తూ నశించాక! తనను అదుకున్నారన్న కృతజ్ఞతతో తాను ఎంతగా ఒదిగి ఉన్నా కంపెనీవారు తన వెంట పడి తనను అణగదొక్కేందుకే కృతనిశ్చయులయ్యారని గ్రహించాక! తన దర్బారులోని ముఖ్యులను లంచాలతో లోబరుచుకుని, విద్రోహానికి పురికొల్పి, తన చుట్టూ నిఘా పెట్టి, తనకు విశ్వాస పాత్రులైన వారిపై కుట్రచేసి తరిమేసి, చివరికి తన రాజ్యమే గుంజుకోవటానికి నమ్మిన మిత్రులు ఆయత్తమయ్యారని అవగతమయ్యాక! రకరకాల కవ్వింపుల, వేధింపుల చేదు అనుభవాలతో తల బొప్పి కట్టాక! సామరస్య పరిష్కారానికి దారులన్నీ మూసుకుపొయ్యాక.

1811లో పూనా రెసిడెంటుగా ఎల్ఫిన్‌స్టోన్ కాలిడినది మొదలుకొని శాయశక్తులా సమస్యలు సృష్టించి, అనవసరపు ఉద్రిక్తతను రెచ్చగొట్టటానికి ఏ అవకాశాన్నీ వదలకుండా ఏడేళ్లు కష్టపడి మొత్తానికి పీష్వాను శంకరగిరి మాన్యాలు పట్టించాడు. కదిలితే తప్పు మెదిలితే తప్పు అన్నట్టుగా ఈ క్రమంలో బాజీరావు మీద చిన్నాపెద్దా అభియోగాలు అనేకం మోపారు. అన్నిటిలోకీ ముఖ్యమైనదేమిటంటే – గైక్వాడ్ సంస్థానం ప్రతినిధిగా పీష్వాతో లావాదేవీ లెక్కలు తేల్చుకునేందుకు బరోడా నుంచి వచ్చిన గంగాధరశాస్త్రి అనే వాడిని పీష్వా కుడి భుజమైన త్రయంబక్‌జీ డెంగ్లే పండరిపూర్‌లో క్రూరంగా చంపించాడని! కంపెనీవారు అభయం ఇచ్చి పూనాకు పంపించిన రాయబారిని హత్య కావించడమే క్షమించరాని నేరం కాగా అంతటి మహాపరాధానికి పాల్పడిన డెంగ్లేను పట్టుకుని తమకు అప్పగించమని ఎన్ని విధాల అడిగినా పీష్వా ఖాతరు చెయ్యలేదన్నది ఇంకో అభియోగం.

గైక్వాడ్ సంస్థానంతో బాజీరావుకు గొడవలున్నమాట నిజం. బరోడా నుంచి ఏరికోరి దొరలు పంపించిన గంగాధరశాస్త్రి అంటే అతడికి పడని సంగతి వాస్తవం. అతడు వద్దని ఎంత మొత్తుకున్నా తన మాటకు విలువ ఇవ్వకుండా అతడినే తెచ్చి దొరలు తనపై రుద్దారన్న కడుపుమంట బాజీరావుకు ఉంది. పైగా సదరు శాస్త్రి కంపెనీ వారికి తొత్తు. బరోడాలో గైక్వాడ్ల ఉప్పుతింటూ వారిపైనే కంపెనీ తరఫున గూఢచర్యం నెరిపిన ఘనుడతడు. పూనాకు వచ్చాక తన పని ఏదో తాను చూసుకుపోకుండా ఏడాదికి పైగా తిష్టవేసి పీష్వా కాళ్ల కింద కుట్రల మంటలు పెట్టాలని చాలా ప్రయత్నాలు చేశాడు. ఆ పరిస్థితుల్లో పీష్వా నిజంగానే అతడి తల తీయించి ఉన్నా ఎవరూ తప్పుబట్టాల్సిన పనిలేదు. పీష్వా తలచుకుంటే పూనాలోనే అతడిని చంపించగలిగేవాడు. కాని అక్కడ అతడున్న పదహారు నెలలూ ఊరుకుని, మూటముల్లె సర్దుకుని వెనుదిరిగి పోనుండగా పండరిపురం పవిత్ర క్షేత్రానికి అతడిని మాయమాటలతో రప్పించి విఠోభా దర్శనం చేసుకుని తిరిగి వస్తుండగా ఆలయం ముందే నరికి వేయించే ఘాతుకానికి బాజీరావు పాల్పడ్డాడంటే నమ్మశక్యంకాదు. మిగతా లోపాలు ఎన్ని ఉన్నా బాజీరావుకు దైవభక్తి హెచ్చు. తన దాయాది నారాయణరావును తన తల్లిదండ్రులు చంపించిన పాపమే వెంటాడుతున్నదని నమ్మి, దానికి ప్రాయశ్చిత్తం చేసుకునేందుకు పండరిపురంలో అనేక శాంతులూ, క్రతువులూ చేయించిన బాజీరావు మరెక్కడా చోటు దొరకనట్టు మళ్లీ అదే పుణ్యక్షేత్రంలో మనిషిని చంపే మహాపాపానికి ఒడిగట్టాడంటే నమ్మడం కష్టం. బాజీరావుకూ, త్రయంబక్‌జీకి ఆ హత్యలో ప్రమేయం ఉందనడానికి ఎల్ఫిన్‌స్టోన్ వద్ద వీసమెత్తు రుజువులేదు. అయినా – త్రయంబక్‌జీని తక్షణం పట్టుకుని మాకు అప్పగిస్తావా లేదా అని పీష్వా గొంతు మీద కూచున్నాడు.

ఒకవేళ అభియోగం నిజమే అయినా చచ్చినవాడు, చంపినవాడు తన అధికారానికి లోబడవలసిన తన రాజ్య పౌరులే కనుక న్యాయప్రకారం ఆ నేరాన్ని పీష్వాయే విచారించి తగిన నిర్ణయం చేయాలి. ఈ న్యాయ సూక్ష్మాలేవీ తెల్లవారికి పట్టలేదు. తమకు పరిస్థితులు అనుకూలించేంతవరకూ పీష్వాతో మైత్రి నటించి, అతడి అధికారాలన్నిటికీ అంగీకరించినట్టే భ్రమగొలిపి వీలు చూసుకుని జూలు విదిల్చారు. వారి పోరు భరించలేక డెంగ్లేని బాజీరావు నిర్బంధిస్తే 'నీ మీద నమ్మకంలేదు. నీ దగ్గరుంటే తప్పించుకుపోతాడు. కాబట్టి అతణ్ని

తక్షణం మాకు అప్పగించు' అన హేస్టింగ్స్ దొర హుకుం వేశాడు. వల్లె అని డెంగ్లేని వారికి అప్పగిస్తే భారీ కాపలా మధ్య ఠానా కోటలో నిర్బంధించినా సంవత్సరం తరవాత దొరల కళ్లుగప్పి అతడు తప్పించుకుపోయాడు. తమ చేతగానితనానికి కూడా పీష్వానే నిందించి 'నువ్వే అతణ్ని తప్పించావు. ఎక్కడున్నాడో నువ్వే వెదికి పట్టి మాకు అప్పగించు' అని రెసిడెంటు ఎల్ఫిన్‌స్టోన్ బాజీరావును వేధించాడు. డెంగ్లేను పట్టి తెచ్చేంతవరకూ నీ నాలుగు కోటలనూ, వాటిలోని నీ పరివారాన్నీ తాకట్టుకింద మాకు స్వాధీనపరచమని పట్టుబట్టాడు. ఈ అడ్డగోలు డిమాండుకు పీష్వా సమ్మతించకపోయేసరికి బ్రిటిష్ సేనలతో పూనాను చుట్టుముట్టి, నాలుగు కోటలనూ బలవంతంగా లాక్కున్నాడు. నెల దాటిందో లేదో మళ్లీ వచ్చి 'నీ పద్ధతేమీ బాగోలేదు. మా గవర్నర్ జనరల్‌గారు నీతో పాత ఒప్పందం అవతల పారేసి కొత్తది రాయించుకు రమ్మన్నారు. ఇదిగో ముసాయిదా, సంతకం పెట్టు' అని సతాయించాడు. ఆ ఒప్పందం ఎందుకంటే పీష్వాకు మిగిలిన పవర్లను కూడా లాగేసి గుండుకొట్టి సున్నం బొట్లు పెట్టడానికి! మిగతా మరాఠా సంస్థానాలన్నిటిమీదా పీష్వా హక్కులు వదిలేసుకోవాలనీ, మహారాష్ట్ర వెలుపలి రాజ్యమంతటినీ బ్రిటిష్ వారికి దఖలు పరచాలనీ, బయటి రాజ్యం దేనితోనూ పీష్వా సంబంధాలు పెట్టుకోకూడదనీ, ఏ రాజ్యం రాయబారినీ తన దర్బారులో ఉంచుకోకూడదనీ నూతన పత్రరాజం సారాంశం. ఈ అవమానకరమైన షరతులకు లోబడటం బాజీరావుకు ఇష్టంలేదు. అయినా తల వంచక తప్పలేదు.

1817 జూన్ 13న 'పూనా ఒప్పందం' మీద విధిలేక సంతకం చేసినప్పటినుంచీ దొరల మీద భ్రమలు తొలిగి బాజీరావు వైఖరి మారింది. ఆ సమయంలోనే కంపెనీవారు పిండారీల మీద భీకర యుద్ధం ప్రకటించారు. పిండారీలు దోపిడిగాళ్లన్నది నిజమేకాని ఇంగ్లీషు వారు చిత్రించినట్టు సంఘ విద్రోహ శక్తులేమీ కాదు. శివాజీ, సంతాజీ ఘోర్పడేల కాలం నుంచీ వారు మరాఠా సైనిక వ్యవస్థలో జనాంతిక భాగం. రెగ్యులర్ సైన్యం వెనకే పిండారీల దండు ఉండేది. శత్రువును సైన్యం ఓడించాక ఈ దండు శత్రు శిబిరం మీద పడి అందిన కాడికి దోచుకుని శత్రువును కోలుకోలేని దెబ్బతీసేది. జీతం గీతం లేకుండా దోపిడీలు చేసుకుని బతికినప్పటికీ పిండారీలు కట్టుబాటును మన్నిస్తూ తమ హద్దుల్లో తాము ఉండేవారు. బ్రిటిష్ మాయావుల బారిన పడి సింధియా, హోల్కర్‌ల బలం ఉడిగిపోయాక, కంపెనీతో సైనిక సంధికి లోబడి మరాఠా సామంతులు ఎవరికి వారు సైన్యాలను రద్దు పరచుకున్నాక పనిలేకుండా పోయిన వేలాది సైనికులు పోయి పిండారీల్లో కలిశారు. పీష్వాలకు పెత్తనం పోయి, అడిగేవారు లేకపోవటంతో వెనుకటి కట్టడులను ధిక్కరించి పిండారీలు యథేచ్ఛగా ఊళ్ల మీద పడి దోచుకోసాగారు. దానివల్ల శాంతి భద్రతల సమస్య ఉత్పన్నమైనమాట నిజమే. అయినా పిండారీల మీద దొరలు తుపాకులెత్తింది మాత్రం ప్రజాభద్రత మీద ఆరాటంతో కాదు.

The Pindari war was only a grand British plan for extinguishing all vestiges of the Maratha Power and establishing unquestioned British Supremacy throughout India.

[*New History of the Marathas,* **G.S. Sardesai,** *Vol.III. p.483*]



(మరాఠా శక్తికి సంబంధించి మిగిలిన లవలేశాలను కూడా రూపుమాపి, ఇండియా అంతటా తిరుగులేని బ్రిటిష్ సర్వంసహాధిపత్యాన్ని నెలకొల్పటానికి ఆంగ్లేయులు పన్నిన బృహత్పథకంలో భాగమే పిండారీ యుద్ధం)

నిగూఢ రాజకీయ లబ్ధిని ఆశించి సాగించిన పిండారీ యుద్ధంలో తమతో చేయి కలపమని ఇంగ్లీషువారు పీష్వాను ఒకందుకు కోరితే ఆ అవకాశాన్ని పీష్వా ఇంకొకందుకు ఉపయోగించుకున్నాడు. తాను ఊరకున్నా తెల్లవారు తనను వదిలిపెట్టేట్టు లేరు కనక తానే వారి పని పట్టటం మంచిదని తలిచి, పిండారీ యుద్ధానికి సన్నాహాల పేరిట భారీగా సేనలను సమీకరించుకున్నాడు. త్రయంబక్ డెంగ్లేను ఎగదోసి, హోల్కర్ సేనాని అమీర్‌ఖాన్‌ను, సతారా ఛత్రపతిని... పట్వర్ధన్, రాస్తె, పాన్సే తదితర మరాఠా జాగీర్దార్లనూ, లాహోర్ రంజిత్‌సింగ్‌నూ, నేపాల్ ప్రముఖులనూ కూడగట్టి, బర్మారాజు దగ్గరికి రాయబారాలంపి, బాజీరావు పెద్దఎత్తునే ప్రతిఘటనకు ప్రయత్నించాడు. దేశీయ శక్తులు, సరిగా కలిసిరాకపోవడం వల్లనేమి, పీష్వా దర్బారులో చెదపురుగుల్లా ప్రబలిన ద్రోహుల ద్వారా పీష్వా గుట్టుమట్లు బ్రిటిష్ వారికి ముందే తెలిసిపోవడంవల్లనేమి, బాజీరావుకు వ్యవహార దక్షత, సైనిక అనుభవం లేకపోవడంవల్లనేమి - ఆఖరి దశలో జరిగిన ఈ జాతీయ ప్రతిఘటన యత్నం కూడా నిష్ఫలమైంది. బాజీరావు తల ఎగరేసి పూనాలోని బ్రిటిష్ రెసిడెన్సీ మీదనైతే దాడిచేసి నిప్పంటించగలిగాడు. కాని ఆ తరువాత రెండు వైపుల నుంచీ కాలమేఘంలా కమ్ముకు వచ్చిన బ్రిటిష్ సేనలను ఎదుర్కొనలేక, పోరాటాన్ని మధ్యలోనే ఆపేసి, రాజధాని వదిలి పారిపోయాడు.

ఇక- తెల్లవారు ఆగుతారా? "పీష్వాగా పరిపాలనకు బాజీరావు పనికిరాడు. అతడి అధికారాలన్నీ మేము లాగేసుకుంటున్నాం! అతడికి మారుగా సతారాలోని ఛత్రపతికి సముచిత గౌరవ ప్రతిపత్తి కల్పిస్తాం. ఇంతవరకూ బాజీరావు సేనలో ఉన్నవారందరూ అతడిని తక్షణం వదిలిపెట్టి మాకు రిపోర్టు చేయకపోయారో - అంతు చూస్తాం. ఖబడ్దార్" అని చరిత్ర ప్రసిద్ధికెక్కిన చాటింపు వేసి పీష్వా కచేరిపై బ్రిటిష్ జండా ఎగరేశారు. ఆ దెబ్బతో బాజీరావు మద్దతుదారులు చాలామందికి కాళ్లు చల్లబడి అతణ్ని ఒగ్గేశారు. వెంటపడి పీష్వాను పట్టుకోవటానికి ఇంగ్లీషు ఆశ్వికదళం బయలుదేరింది. దానికి చిక్కకుండా పరుగు పెడుతూ, అడవుల్లో చెట్లు పుట్టల నడుమ బేలగా తిరుగుతున్నప్పుడు బాజీరావు పడిన కష్టాలనే ఈ వ్యాసం మొదట్లో పేర్కొన్న జానపద గేయంలో ప్రస్తావించింది.

పిండారీల పేరు పెట్టి మరాఠా శక్తిని నిర్మూలించటానికి ఇంగ్లీషు వారు సాగించిన మూడో మరాఠా యుద్ధంలో చిత్తుగా ఓడి, ఎటు పరుగెడితే అటు కంపెనీ దళాలు తరుముకు రాగా దిక్కుతోచక, తల దాచుకునే తెరువు దొరకక, అన్ని ప్రయత్నాలు విఫలమైన మీదట బాజీరావు ఇండోర్ సమీపంలో మాల్కోమ్‌కు లొంగిపోయాడు. 'నీ రాజ్యం నీకిచ్చే ప్రశ్న లేదు. నీ రాజ్యంలో నిన్ను ఉండనిచ్చేదీ లేదు. మాకు షరతులు పెట్టే స్థితిలో నువ్వు లేవు. అంతా మీ దయ అని చెప్పి కంపెనీ వారి శరణు వేడు. ఏడాదికి ఎనిమిది లక్షల రూపాయల భరణమైతే నీ మొగాన పడవేస్తాం. ఉన్నపళాన బయలుదేరి ఉత్తరాదిన కాశీకో, మరో చోటికో పోయి బతుకు. నువ్వు తిన్నగా అక్కడికి చేరాక నీ కుటుంబాన్ని అక్కడికి పోనిస్తాం. ఇరవై నాలుగు గంటల్లో ఈ షరతులకు ఒప్పుకోకపోతే నీ అంతు చూస్తాం' అన్నాడు

మాల్కోం. తలకాయ తీసి జేబులో దాచుకుని బాజీరావు 'ఇక మీ దయ' అన్నాడు.

1818 జూన్ 3న పెట్టమన్నచోట సంతకం పెట్టిన వెంటనే బాజీరావు 600 మంది అశ్వికులు, 200 మంది సిపాయిలు వెంట రాగా నర్మద దాటిపోయి చివరికి కాన్పూర్ సమీపంలోని బిత్తూరు వద్ద స్థిరపడ్డాడు. రాజ్యం పోయినా మిత్రుడు మాల్కోం పుణ్యమా అని భరణం బాగానే ముట్టింది. రాజకీయాలు వదిలేసి, పూజలూ వ్రతాలూ చేసుకుంటూ అక్కడే మూడు దశాబ్దాలకు పైగా గడిపి, 1851 జనవరిలో బాజీరావు నిరర్థక జన్మను చాలించాడు. ఛత్రపతి, పీష్వాల వంశాల్లో ఉత్తములందరికీ చిన్న వయసులోనే మృత్యువు తరుముకు రాగా అధముడైన బాజీరావు మాత్రం అందరి ఆయుస్సూ పోసుకుని 76 ఏళ్లు జీవించటం విధి వైచిత్రి.

పీష్వాను గెంటేసి సతారాలో ఛత్రపతి జండాను కంపెనీ కుటిలాత్ములు ఎగుర వేయించినంత మాత్రాన మళ్లీ ఛత్రపతులకు దశ తిరిగిందేమీ లేదు. పీష్వాను గెంటినందుకు జనం కోపగించకుండా కంటి తుడుపుగా సతారాలో నామమాత్రపు గద్దెపై ఛత్రపతి ప్రతాప్‌సింగ్‌ను కొంతకాలం ఊరేగించారు. కంపెనీవారిపై కుట్ర చేస్తున్నాడని నిందవేసి అతడిని కాశీకి గెంటేసి, అతడి సోదరుడు షాజీకి పట్టంగట్టారు. అతడు నిస్సంతుగా మరణించడంతో 1848 ఏప్రిల్‌లో సతారా సంస్థానాన్ని కూడా ఇంగ్లీషు పులుసులో కలిపేసుకున్నారు.

అలా ముగిసింది మరాఠాల కథ.



# ఏమిటి గొప్ప?

ఎప్పుడో ఎక్కడో ఒక వీరుడు లేస్తాడు. పాలకుడిపై తిరగబడో, పోరాడో రాజ్యాన్ని జయిస్తాడు. లేదా సాహసుల మూకను కూడగట్టి బలహీన రాజ్యం పైబడి అందిన మేరకు ఆక్రమిస్తాడు. ఎలాగైతేనేమి ఉన్న ప్రభుత్వం పోయి కొత్తది మొదలవుతుంది. స్థాపకుడు, అతడి వారసులు బుద్ధినో, బుద్ధిహీనతనో యథాశక్తిగా ప్రదర్శించాక మూల పురుషుడి పుణ్యాన్నిబట్టి, లేక వారసుల పాప ఫలాన్నిబట్టి కొన్నేళ్లకో, కొన్ని తరాలకో రాజ్యం బలహీనపడి పరాధీనమవుతుంది. కత్తుల దారిన వచ్చిన వారు కత్తుల బారినే పడతారు. వ్యక్తిగత స్వార్థంకోసమో, రాజ్యకాంక్షతోనో అధికారం గుంజుకున్న వారికి కడకు ఏ గతి పట్టినా, ఏ రాజ్యం ఎలాపోయినా ప్రజలకు పెద్దగా పట్టదు.

వేల సంవత్సరాల చరిత్రలో భారతదేశాన ఎన్నో రాజ్యాల్లో లెక్కలేనన్ని ప్రభుత్వాలు పుట్టిగిట్టాయి. ఒకప్పుడు ఉజ్వలంగా వెలిగిన సామ్రాజ్యాలు సైతం కాలక్రమంలో తలిచే దిక్కులేకుండా మట్టికొట్టుకుపోయాయి. ఇంత దాకా మనం చర్చించిన మరాఠాల కథా ఈ కోవలోనిదేనా? లేక చరిత్రకెక్కిన మిగతా సామ్రాజ్యాలకంటే భిన్నంగా పరిగణించి, కలకాలం గుర్తుంచుకోదగిన విశేషాంశాలేవైనా మరాఠా అనుభవంలో ఉన్నాయా?

అప్పట్లో మరాఠాల పేరు చెబితే దేశంలో చాలామందికి అభిమానం కంటే కంపరమే ఎక్కువగా కలిగేది. మెరపులా కదిలే గుర్రాల మీద వచ్చి, ఊళ్ల మీద పడి, జనాన్ని పీడించి అందిన కాడికి దోచుకునే దుండగుల దండే కళ్లముందు మెదిలేది, మరాఠాలు దోపిడీలు చేసిన మాట నిజమే. యుద్ధానికయ్యే ఖర్చును యుద్ధం నుంచే రాబట్టాలన్న విధానంతో, జయించిన శత్రు ప్రాంతాలను కొల్లగొట్టే పద్ధతిని శివాజీయే ప్రవేశపెట్టాడు. అయితే విచ్చలవిడి దుర్మార్గాలను అనుమతించక అందులోనూ ఒక కట్టుబాటును, క్రమపద్ధతిని పాటింపజేశాడు. శివాజీ కాలపు నియమ నిబద్ధత అనంతర కాలంలో సన్నగిల్లిన సంగతి యథార్థం. ముఖ్యంగా పీష్వాల హయాంలో అదేమి శాపమోగాని ఎన్ని రాజ్యాలు జయించినా,

ఎంత సంపద కొల్లగొట్టినా ఖజానా ఎప్పుడూ ఖాళీయే. అప్పుల బాధలు పెరిగి, సైన్యానికి అనేక నెలలు జీతాలు బకాయిపడి, అన్య ప్రాంతాలనుంచి చౌథ్‌లూ గట్రా సక్రమంగా వసూలుకాక సతమతమై సింధియా, హోల్కర్ తదితరులు తమకు ప్రాబల్యంగల ప్రాంతాల్లో సంపన్నులను దోచుకుని, జనాన్ని పీడించిన సందర్భాలు అనేకం ఉన్నాయి. యుద్ధాల సమయంలో దారిలోని జనావాసాలపై (రెండో మైసూరు యుద్ధకాలంలో శృంగేరి మఠంపై జరిపిన విధంగా) ఆగడాలు సరేసరి. దాంతో మరాఠాల దండు వస్తున్నదంటేనే బయటి ప్రాంతాల వారు హడలిపోయేవారు. ఈ వైనాలు విని, ఇంగ్లీషు చరిత్రకారుల రాతలు చదివి మరాఠాలంటే దొంగలు, బందిపోట్లు అన్న అభిప్రాయం ఏర్పరచుకున్న వారు దేశంలో చాలామందే ఉన్నారు. మరాఠా దండ్లు అప్పుడప్పుడూ దోపిడీలు చేసిన మాటా, కొండొకచో అవి హద్దుమీరి అఘాయిత్యాలు జరిగిన సంగతీ నిజమే. కాని అలాగని మరాఠాలందరినీ బందిపోట్లుగా దుస్సాహసికులుగా ముద్ర వేయటానికి వీలులేదు. దోపిడి దొంగలు, దుస్సాహసికులు మహా సామ్రాజ్యాన్ని నిర్మించలేరు. ఒకవేళ నిర్మించినా మఖలో పుట్టి పుబ్బలో మాడుతాయే తప్ప కొండల్లాంటి శత్రువులను ఢీకొని, వరస దాడులకు తట్టుకుని అనేక తరాల పర్యంతం అవి నిశ్చలంగా నిలబడలేవు.

ఔరంగజేబు మరణానంతరం మొగల్ సామ్రాజ్యం బీటలు వారాక తల ఎగరేసి స్వాతంత్ర్యం ప్రకటించుకున్న బెంగాల్, కర్నాటక, అయోధ్య, దక్కన్ తదితర మొగల్ సుబేదార్ల లాంటి వారు కాదు మరాఠాలు, మధ్యాహ్నపు సూర్యుడిలా మొగలాయీ ప్రభ వెలిగిపోయిన సమయంలోనే ఔరంగజేబు అంతటి వాడితో తలపడి, రెండు తరాలపాటు భీకరంగా పోరాడి, విషమ పరీక్షలకు తట్టుకుని నిలబడిన ఘనకీర్తి వారిది. సైనిక సాహసాలు చేసి రాజ్యాలు స్థాపించిన వారు ఎందరో ఉన్నా మరాఠాల వలె జనశక్తి వెన్నుదన్నుగా నిలిచిన వారు దేశ చరిత్రలో అరుదు.

ఉత్తరాదిన జయపాల్ మొదలుకుని సంగరాణా వరకూ ఎందరో వీరులు ఎన్నో తరాల్లో ఎంత గట్టిగా పోరాడినా ముస్లిం దురాక్రమణల వెల్లువను నిరోధించలేకపోయారు. పౌరుషానికి పరాక్రమానికి ప్రతిరూపమనుకున్న రాజపుత్ర యోధులే ఒక దశలో అలసిపోయి, పరిస్థితితో రాజీపడి, ముస్లిం పాలకులకు కన్యాదానాలు చేసి, మొగల్ దర్బారులో తాబేదారులయ్యారు. హిందువుల పవిత్ర పుణ్యక్షేత్రాలు ధ్వంసమయ్యాయి. పురాతన దేవాలయాలు నేల మట్టమయ్యాయి. దేశీయ కళలు, విద్యలు నాశనమయ్యాయి. హిందువుల మనుగడకు, మతాచారాలకు తీవ్ర విఘాతం కలిగింది. ప్రతి జంధ్యపు పోగు మీద మూడున్నర రూపాయల జిజియా పన్ను పడింది. మెడ మీద కత్తి పెట్టి నోట్లో గోమాంసం కుక్కి, వేలూ లక్షల సంఖ్యలో హిందువులను బలవంతంగా ఇస్లాం మతంలోకి మార్చటం విచ్చలవిడిగా సాగింది. ఉత్తర భారతాన ముఖ్యమైన ఏ నగరానికి, ప్రసిద్ధమైన ఏ క్షేత్రానికి వెళ్లి చూసినా హిందూ దేవాలయాలకు, హిందూ శిల్పకళలకు, హిందూ ప్రాసాదాలకు, హిందూ తాళపత్ర గ్రంథాలకు, హైందవ శాస్త్రాలకు వాటిల్లిన భయానక విధ్వంసం తేటతెల్లమవుతుంది. విశేషమేమిటంటే ఉత్తరాదిన నిరాఘాటంగా సాగిన ఇస్లామిక్ దాడికి వింధ్యకు దక్షిణాన అడ్డుకట్ట పడింది. అల్లావుద్దీన్ ఖిల్జీ, మాలిక్ కాఫుర్‌ల దండయాత్రలు తాత్కాలిక ప్రభావం మాత్రమే చూపాయి. మహమ్మద్ బిన్ తుగ్లక్ ఎన్ని బుసలుకొట్టినా దక్షిణ దేశం వశం కాలేదు. విదేశీ దురాక్రమణదారుల మూలంగా భారతీయ ధర్మానికి, సంస్కృతికి, హిందూ మతానికి పట్టిన





దారుణ దుర్గతికి మిగతా దేశవాసుల వలెనే దాక్షిణాత్యులకు గుండెలు మండాయి. ధర్మానికి కలిగిన గ్లానిని పరిహరించి పూర్వవైభవం పునరుద్ధరించాలన్న తపన శివాజీ పుట్టుకకు కొన్ని వందల సంవత్సరాల ముందునుంచే జాతి జనుల్లో వ్యక్తావ్యక్తంగా రేకెత్తింది.

సహ్యాద్రి అడవుల్లో ఉన్నట్టుండి భగ్గుమనే కార్చిచ్చులా దేశంలో మరాఠా శక్తి యాదృచ్ఛిక పరిస్థితుల్లో శివాజీ రూపంలో ఆకస్మాత్తుగా ప్రజ్వరిల్లిందని గ్రాంట్ డఫ్ లాంటి ఆంగ్ల చరిత్రకారులు అభివర్ణించారు. అయితే ఆ అద్భుత ప్రజ్వలన వెనుక ఎందరో సాధుసంతులు, తత్వవేత్తలు, కవులు, ప్రవక్తలు, సంస్కరణలు అనేకానేక తరాలుగా సామాజిక అసమానతలపై, అగ్రవర్ణాల వారి దురహంకారాలపై తిరగబడి భక్తి మార్గంలో అన్ని వర్గాల వారినీ సమీకరించి అలవరచిన ఉత్తమ సంస్కారం ఉంది. సుప్రసిద్ధ మేధావి మహాదేవ్ గోవింద రణడే అన్నట్టు-

> The foundation was laid broad and deep in the hearts of the whole people... It was the upheavel of the whole population, strongly bound together by the common affinities of language, race, religion and literature... It was a national movement in which all classes cooperated... It had deeper hold on the vast masses of the rural population. Cowherds and shepherds, brahmans and non-brahmans, even musalmans felt its influence and acknowledged its power.
>
> [*Rise of the Maratha Power*, **M.G.Ranade**, *P.3*)

(ప్రజలందరి హృదయాల్లో గాఢంగా విస్తృతంగా దీనికి పునాది పడింది... భాష, మతం, సారస్వతపరంగా ఉమ్మడి వారసత్వపు అనుబంధం పెనవేసుకున్న మొత్తం జనాభాలో పుట్టిన ఆకస్మిక అలజడి అది. అన్ని తరగతుల వారూ సహకరించిన ఈ జాతీయోద్యమం గ్రామీణ ప్రజానీకంపై గట్టి పట్టు చూపింది. గొడ్లు కాసుకునేవారు, గొర్రెల కాపరులు, బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు, ఆఖరికి ముసల్మాన్లు కూడా దీని ప్రభావానికి లోనై దీని శక్తిని గుర్తించారు.)

మరాఠా స్వరాజ్యాన్ని స్థాపించింది, కాలక్రమంలో మహాసామ్రాజ్యంగా దాన్ని విస్తరించింది కులీన ప్రభు వర్గాల నాయకత్వంలోనే అయినా ఈ బృహత్ యత్నాల్లో అన్ని సామాజిక వర్గాల వారూ ఐచ్ఛికంగా సహకరించారు. మరాఠా సేనలు శత్రు రాజ్యాల గుండెల్లో గుర్రాలను పరుగెత్తించినా ఆ సైన్యంలో ఉన్నది ఎక్కువగా మామూలు జానపదులే. మట్టి పిసుక్కుని బతికే సామాన్య జీవులతోనే శివాజీ గొప్ప పోరాట శక్తిని నిర్మించాడు. ఏడాదిలో ఆరు నెలలు జాతీయ సైన్యంలో చేరి దండయాత్రలలో పాల్గొని, వానాకాలం వస్తున్నదనగా వెనక్కి వచ్చి స్వగ్రామాల్లో పొలాలు సాగుచేసుకోవటం మరాఠా ప్రజలకు రివాజు. దూర దేశాల్లో జాగీర్లు పొందిన దండ నాయకులు కూడా ఆ గౌరవం కంటే స్వస్థలాల్లో దేశ్‌ముఖ్‌లుగా, పాటిళ్లుగా తమకున్న హోదాకు ఎక్కువ విలువ ఇచ్చేవారు. ప్రజాబలం అండ దండిగా ఉన్నది కాబట్టే - ఏ ఒక వ్యక్తి ప్రయోజకత్వంవల్లో పైకి వచ్చి, అతడు కనుమరుగైన మూణ్నాళ్లకే అంతరించిన అనేక రాజ్యాలవలె కాకుండా ఏకంగా పది తరాలపాటు మరాఠా రాష్ట్ర కూటమి నాయకత్వలోపం రాకుండా అఖండంగా వెలుగొందింది. రాజ్యం కోసం తగవులు, జాతి వైరాలు, వారసత్వ పోరాటాలు అనేక

పర్యాయాలు తలెత్తాయి. అయినా సింహాసనం కోసం కన్నతండ్రిని ఖైదుచేసి, సొంత అన్నలను నరికివేసిన మొగలాయీ తరహా ఘాతుకాలు మరాఠాలు ఎరుగరు.

పశ్చిమ మహారాష్ట్రలో మొదలై, మధ్య దక్కను, కర్నాటకల దాకా విస్తరించి దక్షిణాన తంజావూరు నుంచి ఉత్తరాన ఢిల్లీ దాకా ఆధిపత్యం సంపాదించి, యాభై ఏళ్లపాటు ఢిల్లీ పాదుషాలనే కీలుబొమ్మలుగా ఆడించగలిగిన మరాఠాల ప్రాభవానికి ఎదురు నిలవ గలిగిన శక్తి అప్పట్లో దేశంలో ఏదీ లేదు. అంతటి మహా సామ్రాజ్యం వేరొకరి చేతుల్లో ఉంటే నిరంకుశంగా చెలరేగి కన్నుమిన్ను కానకుండా నియంతలుగా విర్రవీగేవారే. నియంతృత్వ స్థాపనకు అన్ని అవకాశాలూ ఉన్నా అటువైపు ఆలోచించకుండా ఆధునిక ఫెడరల్ వ్యవస్థ తరహాలో రాష్ట్ర కూటమిని నెలకొల్పి, అందులోని ప్రతి భాగస్వామికీ తన పరిధిలో సంపూర్ణ స్వయం ప్రతిపత్తినిచ్చి స్థూలమైన మార్గనిర్దేశనానికి, ముఖ్య వ్యవహారాల నియంత్రణకు మాత్రమే పీష్వాలు పరిమితమవటం ఆషామాషీ విషయం కాదు. ఉత్తరాదిన వారు సాగించిన కార్యకలాపాల్లో మిగతా జాతులనూ, ఇతర రాజ్యాలనూ అణగదొక్కి, తమ సామ్రాజ్యాన్ని స్థిరపరచుకోవాలన్న కాంక్షకంటే మహమ్మదీయుల కబ్జానుంచి కాశీ, ప్రయాగ, మధుర, హరిద్వార్, కురుక్షేత్ర వంటి పవిత్ర హిందూ క్షేత్రాలను విడిపించాలన్న ఆరాటమే ఎక్కువగా కనిపిస్తుంది. పుణ్య క్షేత్రాలను హిందువులకు తిరిగి అప్పగిస్తూ, గోవధను సర్వత్రా నిషేధిస్తూ ఢిల్లీ పాదుషా నుంచి ఫర్మానాలు పొందాలని మహాద్‌జీ సింధియాకు నానాఫడ్నవిస్ అనేక లేఖలు రాశాడు. తలచుకుంటే తామే ఢిల్లీ సింహాసనం మీద కూచుని కోరుకున్న ఫర్మానాలను స్వయంగా జారీచేయగలిగి కూడా కేవలం పాదుషా ప్రతినిధి హోదాలో తృప్తి పడి... అధికారమే చెల్లని చక్రవర్తి ఇచ్చిన నియామక పత్రాలను పుణెకి తీసుకొచ్చి ఊరేగించుకున్న మరాఠాలను చూస్తే ఈ కాలంలో మనకు నవ్వొస్తుంది. ఔరంగజేబు తరహా ప్రయోజకత్వంకంటే మరాఠాల అమాయకత్వమే ఒక రకంగా మంచిది.

మహారాష్ట్రకు వెలుపల తమకు ప్రాబల్యం చిక్కిన రాజ్యాల్లో స్థిరమైన పరిపాలన చేసి ప్రజల సమస్యలు పట్టించుకోవటంకన్నా 'చౌథ్' వసూళ్లకోసం స్థానిక ప్రభువులనూ, ప్రజలనూ పీడించటం మీదే మరాఠా సర్దార్లు ఎక్కువ శ్రద్ధ చూపారన్న ఆక్షేపణ లేకపోలేదు. అది పూర్తిగా సత్యదూరమనలేము. అయితే బాధ్యతారహితంగా వ్యవహరించి ప్రజల ఉసురుపోసుకున్న వారు కొందరున్నట్టే ధర్మనిరతితో రాజ్యమేలి ప్రజల్ని కన్నబిడ్డల్లా చూసుకున్న పాలకులూ మరాఠాల్లో ఉన్నారు.

ఉదాహరణకు జగమెరిగిన మహాసాధ్వి అహల్యాబాయి హోల్కర్.

ఇండోర్ రాజధానిగా రాజ్యమేలిన మరాఠా సర్దారు మల్‌హర్‌రావు హోల్కర్‌కు కుమారుడయిన ఖండేరావు భార్య అహల్య. ఆమె 29వ ఏట (1754) సూరజ్‌మల్ జాట్‌పై యుద్ధంలో భర్త మరణించాడు. ఆచారం ప్రకారం సహగమనానికి అన్ని ఏర్పాట్లు చేసుకున్నాక ముసలి మామగారు దీనంగా ప్రాధేయపడ్డ మీదట ఆ ప్రయత్నాన్ని విరమించుకుని, 9 ఏళ్ల మైనర్ కుమారుడికి పట్టంగట్టి అతడి పనుపున అహల్యాబాయి రాజ్యభారం మోసింది. ఆ కొడుకు వ్యసన లోలుడై కొద్దికాలానికి కన్ను మూశాడు. అదే సమయంలో అహల్య మామగారు పోయాడు. ఇక అహల్యకు మిగిలింది ఏకైక కుమార్తె. ఆమె కుమారుడిని రాజ్యానికి వారసుణ్ని చేద్దామనుకుంటే ఆ మనవడు చిన్న వయసులో చనిపోయాడు. ఆ దుఃఖం భరించలేక అల్లుడు గుండె పగిలి మరణించాడు. అతడితో కుమార్తె సహగమనం



చేసింది. ఇలా నా అనుకున్న వాళ్లందరూ తన కళ్లముందే దాటిపోగా ఏకాకి అయి కూడా గుండె రాయి చేసుకుని అహల్య రాజ్యాన్ని చక్కగా పాలించి చరితార్థురాలైంది. దైవభక్తి, ఆధ్యాత్మిక చింతన నిశ్చలంగా ఉన్నాయి కాబట్టి దుఃఖాలకు ఓర్చుకుని, రాజ్యాన్ని శివార్పణం చేసి దేవుడి ప్రతినిధిగా, ధర్మకర్తగా 1795లో 70వ ఏట కన్ను మూసేంతవరకూ మూడు దశాబ్దాలపైగా పరిపాలన సాగించింది. దేశమంతటా పవిత్ర హిందూ దేవాలయాలకు జీర్ణోద్ధరణ చేయించి, కేదారనాథ్, ద్వారక, పూరి, రామేశ్వరం తదితర పుణ్యక్షేత్రాల్లో ఎన్నో ధర్మశాలలు, అన్న సత్రాలు, స్నానఘట్టాలు కట్టించింది. దక్షిణాదిన ప్రసిద్ధ దేవాలయాలకు నిత్యాభిషేకం కోసం పవిత్ర గంగాజలాన్ని సరఫరా చేయించింది. ఎన్నో కొత్త దేవాలయాలని కళాత్మకంగా కట్టించి, సనాతన ధర్మాన్ని, ఆర్ష సంస్కృతిని పునరుజ్జీవింప జేయటంతోబాటు దైనందిన రాజకీయ వ్యవహారాల్లోనూ అహల్యాబాయి ఏమరుపాటు చూపేది కాదు. రోజూ కచ్చేరీలో కూచుని, ఫిర్యాదులను ఆలకించి, ఆపన్నులను ఆమె ఆదుకునేది. పశుపక్ష్యాదుల మీదా దయ చూపేది. రాజకీయ తిరుగుబాట్లు, భిల్లుల విద్రోహాల వంటివి సకాలంలో సమర్థంగా ఎదుర్కొని కొద్దిపాటి సైన్యంతోనే రాజ్యరక్షణ కావించేది. ఆమె ప్రతినిధిగా తుకోజీ హోల్కర్ (అహల్యతో అతడికి బంధుత్వం ఏమీ లేదు) సైనిక వ్యవహారాలు చూస్తూ, యుద్ధాలు చేస్తూ రాజ్యాన్ని కాపుకాయగా పౌర పరిపాలనను దేవుడి సేవలా అహల్యాబాయి నిభాయించేది. ఆమె సమర్థపాలనలో హోల్కర్ రాజ్యం మున్నెన్నడూ లేనంతటి అభివృద్ధి సాధించి సిరిసంపదలతో తులతూగింది.

***Empire in Asia*** గ్రంథంలో ఆంగ్లేయ మేధావి టారెన్స్ మాటల్లో చెప్పాలంటే-

> Perhaps the most striking proof that is anywhere recorded of the triumph of a pure and noble nature over the corrupting influences of irresponsible power, is that of Ahalya, who for thirty peaceful years reigned,... respected by surrounding Princes, and an object of adoration among the people blessed by her rule... Her foreign policy was as successful as that of Catherine of Russia, but her pillow was not drenched with a husband's blood. In personal courage she was not inferior to Elizabeth of England, but she did not slay her capitve competitor in a prison. The circumstances of her elevation resembled those which raised Margaret of Denmark to the throne; but she neither trampled on the rich not oppressed the poor, nor caused the breath of suspicion to assail her virtue.
>
> [***Empire in Asia*, W.M. Torrens**, *pp. 79-80*]

(విచ్చలవిడి అధికారపు దుష్ప్రభావాలకు లోనవకుండా స్వచ్ఛమైన, ఉదాత్తమైన మానవ స్వభావం సాధించిన ఘన విజయానికి అద్భుత దృష్టాంతంగా అహల్యాబాయిని పేర్కొనాలి. ముప్పయేళ్లు ప్రశాంతంగా రాజ్యమేలి ఇరుగు పొరుగు ప్రభువుల మన్నన చూరగొని, తన చల్లని పాలనకు నోచుకున్న ప్రజలకు ఆరాధ్యురాలైన ఉత్తమురాలామె. విజయవంతమైన విదేశాంగ విధానంలో ఆమె

రష్యాలో కాథరిన్‌కు దీటు రాగలదు. కాని కాథరిన్‌లా ఆమె తలగడ భర్త నెత్తురుతో తడిసిపోలేదు. వ్యక్తిగత ధైర్యంలో అహల్య ఇంగ్లండ్ ఎలిజిబెత్‌కు తీసిపోదు. కాని ఆమెవలె ఈమె చెరలోని ప్రత్యర్థిని చంపలేదు. సింహాసనమెక్కిన పరిస్థితుల్లో డెన్మార్క్ మార్గరెట్‌కూ అహల్యకూ పోలిక ఉంది. కాని ఆమెలా ఈమె పేదలను అణచలేదు. ఆమెవలె శీలం మీద అనుమానాల నీడా ఈమెపై పడలేదు.)

శివాజీ మొదలుకుని రెండో బాజీరావు వరకూ మరాఠా పాలకులందరికీ ఇతర గుణావగుణాలు ఎలా ఉన్నా దైవభక్తి, ధర్మాసక్తి పుష్కలంగా ఉన్నాయి. స్వమతం పట్ల ఎంత అభిమానం చూపినా పరమతాల పట్ల వారికి ద్వేషం లేదు; నిరాదరణా లేదు. ఛత్రపతుల, పీష్వాల ప్రభుత్వాల్లో మహమ్మదీయులను ముఖ్య పదవుల్లోకి తీసుకోరాదన్న నిషేధం ఎప్పుడూ లేదు. మరాఠా సైన్యాధికారుల్లో ముస్లింలు చాలామందే ఉండే వారు. పరాయి మతస్థులు ఎలాంటి దుర్విచక్షణకూ, ఎటువంటి ఆంక్షలకూ లోనవలేదు. ఈద్‌ఉల్ ఫితర్ పండుగను పీష్వా ప్రభుత్వం అధికారికంగా గుర్తించింది. ముస్లిం సంస్థలకు విరాళాలకోసం 'ఖైరత్‌ఖర్చ్' పేర బడ్జెటులో ప్రత్యేక కేటాయింపు ఉండేది. పూనాలోని దర్గాలను పీష్వాలు తరచుగా దర్శించినట్టే గ్వాలియర్‌లో మొహరం ఊరేగింపులో సింధియా తప్పక పాల్గొనేవాడు. బరోడా పాలకుడు గైక్వాడ్ ఈద్ ప్రార్థనకు తప్పకుండా హాజరయ్యేవాడు. యశ్వంతరావు హోల్కర్ ఉజ్జయినిలో ఫకీర్లకు సంతర్పణలు చేసేవాడు.

మరి ఇన్ని మంచి లక్షణాలు ఉండి, ఇంత ఘనకీర్తి కలిగి ఎన్నో అటుపోట్లను తట్టుకుని నూరేళ్లకు పైగా దుర్నిరీక్ష్యంగా వెలిగిన మరాఠాల సామ్రాజ్యం దేశం కాని దేశం నుంచి వచ్చిన వర్తకుల మూక ముందు బలాదూరై గుజ్జనగూడులా కుప్పకూలింది. ఎందుచేత? ఏ స్వయంకృతాపరాధాల వల్ల?



# ఎందుకు పతనం?

ఏకులా వచ్చారు. మేకులా మారారు. వేషాలు వేశారు. మోసాలు చేశారు. కుట్రలు పన్నారు. నిజమే. వర్తకం నెపంతో వచ్చిన ఇంగ్లీషు వారు తమకు ఆశ్రయమిచ్చిన వారికే ద్రోహం చేసి, నమ్మినవారిని నట్టేట ముంచి అడ్డదారిలోనే ఇండియాను అప్పనంగా ఆక్రమించారు. సందేహం లేదు. అయితే తమ కళ్లముందే అంతులేని కుటిల వ్యూహాలూ కుహకాలూ సాగుతూంటే... ఒక రాజ్యం తరవాత ఒక రాజ్యం స్వాతంత్ర్యం కోల్పోతూ చాపకింద నీరులా విదేశీయుల ప్రాబల్యం వ్యాపించి, తమ కాళ్లకింది నేలే క్రమేణా కదిలిపోతూంటే మనదేశపు మారాజులు ఏమి చేస్తున్నారు? ఎందుకు నిదరోయారు?

అపారమైన వనరులతో, అంతులేని సిరిసంపదలతో విలసిల్లి శౌర్య పరాక్రమాలకు పెట్టింది పేరయిన సువిశాల భరత ఖండాన్ని వేల మైళ్ల దూరంలోని బుల్లిదేశం అవలీలగా వశపరచుకోవటం ప్రపంచ చరిత్రలోనే ఒక అద్భుతం. గొప్ప చరిత్ర, గొప్ప సంస్కృతి కలిగి, ఒకప్పుడు విద్యలకు విజ్ఞానానికి నెలవై సుదూర దేశాలకు మహా సామ్రాజ్యాలను విస్తరించగలిగిన భరత జాతి, తనతో పోల్చితే మేరువు ముందు రేణువులాంటి ఒక చిన్న పాశ్చాత్య శక్తికి దాసోహమని, శతాబ్దానికి పైగా బానిస శృంఖలాల్లో ఎందుకు చిక్కుకుంది?

మెకాలే చదువుల 'చేతబడి'కి లోనై ఆత్మన్యూనతా భావం పెంచుకున్న భారతీయ గిరీశాల మాటలకు మనం విలువ ఇవ్వనక్కర్లేదు. నాగరికతలో, విజ్ఞానంలో, సైనిక శక్తిలో, ఆయుధ పాటవంలో, పరాక్రమంలో, బుద్ధిలో, బలంలో ఆంగ్లేయులు అన్ని విధాల అధికులు కాబట్టే... భారతదేశం మత మౌఢ్యానికి ఆటపట్టయి, దుర్మార్గపు బ్రాహ్మణాధిక్యానికి లోనై, విద్యాగంధం లేక, అజ్ఞానాంధకారంలో అలమటిస్తున్నది కాబట్టే ఇండియా అలవోకగా దొరల కైవసమైందనీ... అదృష్టం బాగుండి అలా జరగడంవల్లే ఆధునిక విద్యకు, శాస్త్రీయ విజ్ఞానానికి, నవ నాగరికతకు నోచుకుని భారతదేశం బాగుపడిందనీ మెకాలే మనవలు చిలకల్లా వల్లించేది బానిస భావజాలమనడంలో అనుమానం లేదు. ఈస్టిండియా కంపెనీ

దేశాన్ని కబళించిన కొత్తలో మద్రాసు ప్రెసిడెన్సీ గవర్నరుగా ఉన్న సర్‌థామస్ మన్రో దేశీయ విద్యల స్థితిగతులను తెలుసుకోవటానికి తన పాలనలోని దక్షిణాది గ్రామాలన్నిటా జరిపించిన విస్తృత సర్వేలో... ఆ కాలపు బ్రిటిష్ విద్యావిధానం కంటే నాటి భారతీయ విద్యావ్యవస్థ అన్ని విధాల మెరుగ్గా ఉన్నట్టు తేలిన వైనాన్ని గతంలో 'భారతీయ విద్య' వ్యాస పరంపరలో ('**మన చదువులు**'గా తరవాత గ్రంథస్థమైంది) వివరంగా పరిశీలించాం. కనుక విద్యాపరంగా తెల్లవారి ఎక్కువా లేదు. భారతీయులు తక్కువా కాదు. ఎంతసేపూ మోసాలు చేసి వాయిదాల పద్ధతిలో రాజ్యాలు కొట్టేయటమే తప్ప నేరుగా ఎదుటపడి భారతీయులతో 'కంపెనీ'వారు చేసిన యుద్ధాలే బహుకొద్ది. అందులోనూ అదృష్టం కలిసొచ్చి తాము గెలిచామే గానీ సంఖ్యాపరంగా వనరులపరంగా చూస్తే అవతలి వారే తమ కంటే అధికులని ఆయా యుద్ధాల్లో పాల్గొన్న ఆంగ్ల సేనానులే అంగీకరించిన సందర్భాలు అనేకం ఉన్నాయి. కాబట్టి ఇంగ్లీషు వారి సైనికశక్తి, పరాక్రమాల గురించి పెద్దగా చెప్పుకోవలసిన పనిలేదు.

మరి ఇన్ని ఆధిక్యతలు, ఇన్ని తెలివితేటలు, ఇంతటి శక్తి సామర్థ్యాలు ఉండి కూడా ముంచుకొస్తున్న ముప్పును గ్రహించలేక భారతీయ ప్రభువులు కళ్లు తెరచుకునే విదేశీయుల బొందలో ఎందుకు పడ్డారు? సకాలంలో మేల్కొని, ప్రాప్తకాలజ్ఞతతో తగిన ప్రతిచర్యలు తీసుకుని, సర్వానర్థాన్ని ఎందుకు నివారించలేకపోయారు?

కారణాలు అనేకం. ముఖ్యంగా బహు నాయకత్వం. పరాక్రమవంతులకు కొదవలేదు. ప్రతివాడూ మహావీరుడే. కాని ఏ వీరుడూ ఇంకొకడి నాయకత్వానికి కట్టుబడడు. గజనీ మహమ్మద్ దండెత్తివచ్చినప్పుడు పంజాబులో జయపాల్‌కు అండగానూ, మహమ్మద్ ఘోరీని ఎదుర్కోవడానికి పృథ్వీరాజ్‌కు బాసటగానూ, బాబరు దాడిని నిరోధించటానికి సంగరాణాకు మద్దతుగానూ అనేక రాజ్యాల రాజపుత్ర ప్రభువులు, ఇతర వీరులు పెద్ద సంఖ్యలో భారీ సేనలతో తరలి వెళ్లినా ప్రయోజనం ఎందుకు లేకపోయింది? ఎవరి సేనలతో వారు ఎవరి పద్ధతిలో వారు ప్రతాపం చూపించటమే తప్ప అంతా కలిసి ఒకరి నాయకత్వం కింద ఏకోన్ముఖ యుద్ధవ్యూహంతో క్రమశిక్షణాయుతంగా పోరాడనందువల్లే కదా? శతాబ్దాలు మారినా, ఎన్ని చేదు అనుభవాలు ఎదురైనా గత చరిత్ర నుంచి గుణపాఠం నేర్చుకునే అలవాటు మనకు లేదు. సింగిల్ కమాండ్ కింద బలగాలన్నిటినీ సమీకరించి, సమగ్ర వ్యూహంతో, సరైన సమన్వయంతో అంతా కలిసి పోరాడ లేకపోయినందువల్లే రెండవ, మూడవ మరాఠా యుద్ధాల్లోనూ మనవారు గెలవగలిగి విదేశీయుల చేతిలో ఘోర పరాజయాల పాలయ్యారు. ఈసంగతి వారితో పోరాడి గెలిచిన బ్రిటిష్ ప్రముఖులే అంగీకరించారు. ఉదాహరణకు చివరి మరాఠా యుద్ధం మొదలుకాకముందు 1817 ఆగస్టు 12న గవర్నర్ జనరల్‌కి రాసిన లేఖలో భారతీయుల బలహీనతల గురించి సర్ థామస్ మన్రో ఏమన్నాడో చూడండి:

"When I consider the weakness of the native states and charecter of their chiefs, I see little chance of a protracted resistance from them... It is not that they want resources, that they have not men and horses, but that there is no one amongst them possessed of those superior talents which are necessary to direct them to advantage. There is so little system of subordination in native Government..."



*(ఈ దేశపు రాజ్యాల బలహీనతలను, వాటి పాలకుల గుణాలను పరిశీలిస్తే వారి నుంచి దీర్ఘకాలం ప్రతిఘటన ఎదురవుతుందని నేను అనుకోను. వారికి వనరులు లేకకాదు. సైనికులూ, గుర్రాలూ లేకనూ కాదు. ఉన్న వనరులను ప్రయోజనకరంగా సమీకరించటానికి కావలసిన ఉత్తమ ప్రతిభ ఉన్నవారు వారి నడుమ ఒక్కరూ లేకపోవడమే దీనికి కారణం. దేశీయ ప్రభుత్వాల్లో నిర్దిష్ట వ్యవస్థ, క్రమశిక్షణ చాలా తక్కువ)*

దీన్నే ఎల్ఫిన్‌స్టోన్ ఇంకా స్పష్టంగా చెప్పాడు:

"If there was any other more intrepid man occupying the peshwa's position at the time, it is not difficult to conceive how the British would have fared. The Marathas had at their command ample means of waging a successful war-armies, money, arms, ammunition. Every thing was ready. They only lacked a leader."

[***Life of Elphinstone*, Colebrooke**, *Vol. I, p.372*]

*(ధైర్యసాహసాలు గల సమర్థుడెవరైనా ఆ సమయాన పీష్వాగా ఉండి ఉంటే బ్రిటిష్ వారి పని ఏమయ్యేదో ఊహించటం కష్టంకాదు. మరాఠాల చెంత జయప్రదమైన యుద్ధానికి అవసరమైన వనరులన్నీ - సేనలు, డబ్బు, ఆయుధాలు, మందుగుండు సామగ్రి సమృద్ధిగా ఉన్నాయి. కావలసిన ప్రతిదీ సిద్ధంగా ఉంది. లేనిదల్లా సరైన నాయకుడే.)*

సింధియా వీరుడే. హోల్కర్ శూరుడే. ఇద్దరికీ ఆంగ్లేయులు శత్రువులే. అయినా శత్రువుతో సింధియా పోరాడేటప్పుడు హోల్కర్ సాయంగా వెళ్లడు. హోల్కర్ విరోధి బారిన పడ్డప్పుడు అరిచి మొత్తుకున్నా సింధియా చిటికెన వేలు కదిలించడు. ఈ ఇద్దరికీ పై ఎత్తున ఉన్న పీష్వాకు. ఎవరితో కలవాచ్చో, ఎవరితో కలవకూడదో తెలియదు. తెలిసి వచ్చాక అతడు ఆర్తనాదాలు చేసినా మిగతా సర్దార్లు అలకించి ఆదుకోరు.

ఇది మరాఠా చెట్టు చెడి కుక్కమూతి పిందెలు వేసిన పిదపకాలపు సంగతి. అంతకు ముందు మరాఠాల ప్రభ ఉజ్వలంగా వెలిగిపోయిన కాలంలోనూ దేశానికి దివ్యమైన నాయకత్వం అమరిందని చెప్పలేము. ఇంగ్లీషువారు ఒక రాజ్యం తరవాత ఒక రాజ్యాన్నే లోపాయకారీగా లోబరుచుకుంటూ మెత్తని కత్తిలా దూసుకుపోతున్నా, ఆశ్రయమిచ్చిన పాదుషాకి ఎదురు తిరిగి పదే పదే తల ఎగురవేస్తున్నా జాతి హితానికి వారి వల్ల రాగల ముప్పును గ్రహించి విదేశీయుల పీడను దేశానికి విరగడ చేయడానికి జాతీయ దృష్టితోరాజీలేని పోరుకు నడుము కట్టినవాడంటూ దేశం మొత్తం మీద ఒక్కడూ లేడు. పైగా ప్రతివాడూ ఏదో ఒక సందర్భంలో ఇతరేతర లబ్ధిని ఆశించి అదే విదేశీయులతో చేతులు కలిపినవారే. పశ్చిమ తీరంలో తిరుగులేని నౌకాబలంతో ఇంగ్లీషువారికి సింహస్వప్నంగా ఉన్న ఆంగ్రియా తనకు ఎదురు తిరిగేసరికి బాలాజీరావు పీష్వా ఇంగ్లీషువారి సాయం తీసుకుని అతడిని అణచివేసిన సంగతి తెలిసిందే. తెల్లవారు తమ వికృత రూపాన్ని బాహాటంగా బయటపెట్టి

కోరలు సాచిన తరవాత, జాతికి పెనుప్రమాదాన్ని గుర్తించి తానే చొరవ తీసుకుని జాతీయ ఐక్య సంఘటన కట్టిన తరవాత కూడా మరాఠా కౌటిల్యుడు నానా ఫడ్నవిస్ ఇంగ్లీషు వారిపై ఎత్తిన కత్తిని దించి మొదటి మరాఠా యుద్ధం చాలించి నిరర్థక సంధికి సమ్మతించాడు. అనంతరకాలంలో మాధవరావు (మహద్‌జీ) సింధియాను, టిప్పు సుల్తాన్‌ను సాధించటానికి ఇదే నానా కంపెనీ దొరలతో సరాగాలాడాడు.

శివాజీ నెలకొల్పిన తొలి వ్యవస్థలో ప్రతిభకే తప్ప పుట్టుకకు ప్రాముఖ్యం లేదు. పీష్వా మొదలుకుని మామూలు సిపాయి వరకూ అందరూ ఖజానా నుంచి నెలనెలా వేతనాలు తీసుకోవలసిందే సేవకు ప్రతిఫలంగా జాగీరు కట్టబెట్టే పాత పద్ధతిని శివాజీ రద్దుచేయగా... ఛత్రపతుల పాలన పోయి పీష్వాల హయాం వచ్చాక - కారణాలు ఏమైతేనేమి అనర్థకపు పాత పద్ధతినే పునరుద్ధరించారు. తండ్రి ఎంత శూరుడు, ఎంతటి స్వామిభక్తి గలవాడు అయినా అతడి కుమారుడు. మనవలు కూడా అంతే శౌర్యాన్ని అంతే స్వామిభక్తితత్పరతను చూపుతారనుకోవటం అత్యాశ. వంశపారంపర్య జాగిర్దారీ పద్ధతి దుష్ఫలితం పీష్వాలు కడు సమర్థులైనంత కాలమూ పెద్దగా కనపడలేదు. మొదటి మాధవరావు మరణంతో పీష్వాల వైభవం అంతరించాక పెదధోరణులు ప్రబలి లుకలుకలు బాగా బయటపడ్డాయి. చివరిదశలో ఇంగ్లీషు వారితో తుదిపోరు దగ్గరికి వచ్చేసరికి దక్షిణాది జాగిర్దారులే పీష్వాకు పెద్ద సవాలుగా తయారయ్యారు.

రాష్ట్రకూట వ్యవస్థలో హోల్కర్లు, సింధియాలు తదితర మరాఠా సర్దార్లకు వారివారికి ప్రాబల్యం కలిగిన ప్రాంతాలలో 'చౌథ్', 'సర్దేశ్‌ముఖి'ల వసూళ్లకు మరాఠా ప్రభువు అధికారం ఇచ్చినప్పటికీ వారు ఆయా ప్రాంతాలకు పెత్తందారులే తప్ప ప్రభువులు కాదు. మామూలు పరిపాలన నడపటానికి మొగలాయీ సుబేదారులో, గవర్నర్లో, స్థానిక స్వతంత్ర ప్రభువులో ఉంటారు. వారు వారి పద్ధతిలోనే పరిపాలన సాగిస్తారు. మొగల్ రాష్ట్రాల్లో స్థానిక పరిపాలనను పాదుషా ప్రతినిధికి వదిలేసి, 'చౌథ్'ను మాత్రం తాము వసూలు చేసి, అందుకు ప్రతిగా బయటి దాడుల నుంచి తాము రక్షణ కల్పించడమే దృష్టిలో గొప్ప ఏర్పాటు! పర్యవసానంగా - వసూళ్ల హక్కును బట్టి మరాఠాలది పైచేయి అయినా ఆయా ప్రాంతాల ప్రజాజీవనంపై, పాలనా విధానాలపై మరాఠాల ముద్ర ఉండేది కాదు. పైగా ఆ 'చౌథ్' 'సర్దేశ్‌ముఖి'లు కూడా స్థానిక పాలకులు ఇష్టపూర్తిగా ఇచ్చేవి కాదు. మరాఠాలు దండెత్తి వచ్చి, మెడ మీద కత్తి పెట్టినప్పుడు 'సరే' అనటం, ఆ దండు కాస్తా వెనక్కి పోయాక చెల్లింపులను బిగదీయడం, లేక సక్రమంగా చెల్లించక మొరాయించటం పరిపాటి. మళ్ళీ మరాఠా దండు వచ్చి గోళ్లూడకొట్టి వసూలు చేసేంతవరకూ ఎగవేత అలాగే సాగేది. దీనివల్ల పైనుంచి వసూళ్లు చేసే వారికీ, లోపల నుంచి వీలైనంతగా ప్రతిఘటించే వారికి మధ్య ఉద్రిక్తత, ఘర్షణ నిరంతరం ఉండేవి. విశాల రాజ్యాలు మరాఠాల ప్రాబల్యం కిందికి వచ్చినా వాటిపై వారికి స్థిరమైన పట్టు లేకపోవడానికి ఇదే కారణం.

ఒక శివాజీ స్థాపించిన స్వరాజ్యాన్ని ఒక బాజీరావు దుంపనాశనం చేయటం దురదృష్టకరమే. ఇంగ్లీషు నక్కలు, తోడేళ్లు దెబ్బతీయటానికి పొంచి ఉన్న చివరి అంకంలో బాజీరావు, దౌలత్‌రావు సింధియా, యశ్వంతరావు హోల్కర్‌లు వరసగా చేసిన తప్పులు, దుర్మార్గాలు స్వరాజ్య సూర్యాస్తమయాన్ని త్వరితం చేశాయనటంలో సందేహంలేదు. కాని ఈ చారిత్రక విపరిణామానికి ఈ ముగ్గురు వ్యక్తులను మాత్రమే ముద్దాయిలను చేసి



లాభంలేదు. మరాఠాల ప్రతాపం మధ్యందిన మార్తాండునిలా మండిపోయిన కాలంలోనే పతనానికి బీజాలు పడ్డాయి. ఎప్పుడు చేయవలసిన పనిని అప్పుడు చేయకపోవటం వినాశానికి మూలం.

బ్రిటిష్‌శక్తికి నౌకాబలం వెన్నెముక. సముద్రంమీద ఆధిపత్యంతో దేశాధిపత్యం హస్తగతం చేసుకోదలిచిన విదేశీయులను సకాలంలో సమర్థంగా ఎదుర్కోవాలంటే జాతీయ శక్తులకూ నౌకాబలం తప్పనిసరి. ఈ అతి ముఖ్య విషయాన్ని మనవారు ఉపేక్షించారు. మొదటి బాజీరావు, అతని తమ్ముడు చిమ్మాజీ భీషణ సంగ్రామంలో పోర్చుగీసువారిని ఓడించి బాసెన్ రేవుపట్నాన్ని జయించటం మరాఠా వీరగాథలో ఒక ఉజ్వలఘట్టం. అప్పటికే దేశంలో డచ్చి, ఫ్రెంచి, బ్రిటిషువారి హడావుడి బాగా ఉంది. పీష్వాకు వశమైన బాసెన్‌లో నౌకానిర్మాణానికి కర్మాగారాలు, తుపాకుల తయారీకి సదుపాయాలు, రేవులు సమృద్ధంగా ఉన్నాయి. శాస్త్రీయ పద్ధతిలో ఆయుధాల నిర్మాణానికి నైపుణ్యంగల విదేశీ ప్రవీణులు అక్కడ అందుబాటులో ఉన్నారు. ఆ సైనిక హంగులు ఎప్పటికైనా తమకు అవసరమవుతాయన్న ముందు చూపుతో బాసెన్‌లో ఆయా కార్యకలాపాలను భారతీయుల అజమాయిషీ కింద విదేశీ నిపుణులచేత పూర్వంవలె కొనసాగించి ఉంటే చరిత్రగతి మరోవిధంగా ఉండేది.

శివాజీ కాలపు గెరిల్లా పోరాటాలను మరాఠాలు ఎప్పుడో మానేశారు. కొండకోనల్లో తూనీగల్లా దూసుకుపోయే గుర్రాలు సమకూర్చిన బలం మీదా ఆధారపడటం క్రమేణా తగ్గించారు. నిజాంతో తలపడ్డ సమయంలో అతడికి అండగా బుస్సీ నడిపిన సైనిక రెజిమెంట్ల పనితనాన్ని చూశాక యూరోపియన్ పద్ధతిమీద సదాశివరావు భావులాంటి వారికి మోజు పెరిగింది. ఫ్రెంచి, తదితర యూరోపియన్ జాతీయులను కిరాయికి తీసుకుని, విదేశీ తరహా రెజిమెంట్లను, శతఘ్నిదళాన్ని సమకూర్చుకుని మరాఠాలు ఘన విజయాలే సాధించారు. కాని, ఆయా సైనిక దళాల కోసమూ, తుపాకుల కోసమూ, వాటి మందుగుళ్ల నిమిత్తమూ విదేశీయులమీద ఆధారపడకుండా సొంత వనరులను అమర్చుకోవటం అత్యవసరమన్న అతి ముఖ్య అంశాన్ని వారు విస్మరించారు. తమకు అవసరమైన ఫిరంగులు, వాటిని పేల్చటానికి కావలసిన సాధన సామగ్రి నిమిత్తం పాశ్చాత్య దేశాలను అర్థించి సకాలంలో సరఫరాలందక యుద్ధరంగంలో దెబ్బతిన్న సందర్భాలు అనేకం ఉన్నాయి. అయినా వాటిని స్వదేశంలో సొంతంగా తామే నిర్మించుకోవటానికి తగినచర్యలు తీసుకోవాలన్న ఆలోచన మన ప్రభువులకు రాలేదు.

ఒక జాతి స్వాతంత్ర్యాన్ని రక్షించుకోవటానికి విదేశీ కిరాయి సేనమీద ఆధారపడటం ఆత్మహత్యా సదృశం. మరాఠాలు చేసింది అదే. సింధియా నమ్ముకున్న ఫ్రెంచి దళవాయిలే సరైన అదనులో అతడికి ద్రోహం చేసి శత్రువులతో చేరిపోయారు. కిరాయి యూరోపియన్లను నమ్ముకుని రక్షణభారం యావత్తూ వారి మీద వదిలేయకుండా యూరోపియన్ల చేత తమ వారికి సైనికశిక్షణ, ఆయుధాల తర్ఫీదు ఇప్పించి ప్రతి సైనిక విభాగానికి తమకు నమ్మకస్తులైన స్వదేశీయులనే నియమించి ఉంటే చాలా యుద్ధాల పర్యవసానాలు మరొకలా ఉండేవి.

ఇలాంటి కారణాలు ఇంకా అనేకం ఉన్నాయి. అన్నీ ఇక్కడ ఏకరువు పెట్టనవసరంలేదు. అలగ్జాండరు మొదలుకుని ఘోరీ, బాబర్ల వరకూ ప్రాచీన మధ్యయుగాల్లో విదేశీయులు విరుచుకుపడ్డప్పుడు దేశ రక్షణ పట్ల, బయటి శత్రువును సమర్థంగా ఎదుర్కోవటం పట్ల ఎంత అలసత్వాన్ని చూపామో... ఆధునికకాలంలో విదేశీ వర్తక మాయావుల బారిన

పడకుండా దేశాన్ని రక్షించుకునే విషయంలోనూ మనం అంతే అశ్రద్ధను కనపరచామన్నదే గమనించాల్సిందల్లా. ప్రపంచాన్నే జయించగల శక్తి సామర్థ్యాలు, ప్లేటోలను, సోల్మన్‌లను మేకియవెల్లిలను సైతం బలాదూరు చేయగలిగిన తెలివితేటలు, విశ్వమానవాళికి దారిదీపం చూపించగల ఆర్షధర్మ ఘన వారసత్వం ఉండి కూడా ఐకమత్యం, ఏకాగ్రత, లక్ష్యాన్ని సాధించాలన్న నిశ్చల దీక్ష నిరంతర తపన లేని కారణంగా సుదీర్ఘ చారిత్రక ప్రస్థానంలో ఎన్ని విధాల ఎంత నష్టపోయామన్నదే ప్రతి భారతీయుడూ గుర్తించాల్సిందల్లా.

* * *

ఇంగ్లీషువారు అడుగుపెట్టి, దేశాన్ని ఉద్ధరించడానికి ముందు ఇక్కడ నెలకొని ఉన్నది అరాజకమనీ... మన గతమంతా సిగ్గుపడవలసిన మత మౌఢ్యపు చీకటి కూపమనీ, విదేశీయులు జ్ఞానభిక్షను ప్రసాదించకముందు జాతీయ భావం, జాతీయ నాయకత్వం మనకు లేనే లేవని మెకాలే వారసులు చరిత్ర గ్రంథాల్లో , పాఠ్యపుస్తకాల్లో నూరిపోసింది అబద్ధమని నిరూపించేందుకే ఈ వ్యాసపరంపర. అప్పట్లో ప్రధాన జాతీయ శక్తి అయిన మరాఠాలు నేలకూలటంతో విదేశీయుల ఆక్రమణకు ఆఖరి అడ్డంకి తొలగింది. అర్భకపు రాజ్యాలను, నామమాత్రపు పెత్తనాలను రకరకాల మిషలతో నోటకరిచి బ్రిటిష్ సామ్రాజ్యంలో కలిపేసుకోవటమే ఇక మిగిలింది.

అది వేరే కథ.

